శ్రీమతే రామానుజాయ నమః



నమ్మాళ్వార్లు అనుగ్రహించిన

# తిరువిరుత్తమ్

కాంచీ మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్య
స్వామివారి దివ్యార్థ దీపికకు ఆంధ్రానువాదం - భావదీపికతో

పండితరత్న
ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్య స్వామివారు

సమర్పణము

ఉ.వే. శ్రీమాన్ టి.పి. వేంకటరమణస్వామివారు,
వారి ధర్మపత్ని శ్రీమతి సీతమ్మగారు

**2016**

**తిరువిరుత్తమ్ - నమ్మాళ్వార్లు**

**- పండితరత్న, డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**

ప్రథమ ముద్రణము - మార్చి 2016

వేదిక - శ్రీవేంకటేశ్వరస్వామి కోవెల,
శ్రీరంగరామానుజ జీయర్‌స్వామివారి ఆశ్రమం
కాకినాడ

ఆవిష్కరణము - 15-3-2016

ప్రతులు - 300

వెల - అమూల్యము



ముఖచిత్రం - నమ్మాళ్వార్,
కాంచీ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారు

**ఈ గ్రంథం శ్రీమాన్ టి.పి.వి. రమణగారిచే వారి జనక తల్లిదండ్రుల, దత్తత చేసుకొన్న తల్లిదండ్రుల, సోదరుల, అత్తమామల దివ్యస్మృత్యర్థం భక్తిశ్రద్ధలతో ముద్రింపబడినది.**

ప్రతులకు : **శ్రీమాన్ టి.పి.వి. రమణగారు**
94, పి.యస్.ఆర్. కాలని
విజయనగరం-535 002
ఫోన్ : (08922) 223179

డి.టి.పి. : శ్రీమతి ఏ.యస్. జయలక్ష్మి, భవానినగర్, తిరుపతి.
యస్.చంద్రశేఖర్, తిరుపతి.

ప్రింటింగ్ : సి.ఎన్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి.

# విషయసూచిక

**ఉ.వే. శ్రీమాన్ తిరుమల పెద్దింటి వేంకటరమణ స్వామివారు**
"రాఘవనిలయం"
94-పి. యస్. ఆర్. కాలని
విజయనగరం - 535002
ఫోన్ : (08922) 223179

# పరిచయం
# కృతజ్ఞతాపూర్వక అభివందనములు

విజయనగరం జిల్లా (ప్రస్తుతం విశాఖపట్నం) పద్మనాభం గ్రామంలో వేంచేసి యున్న కుంతీమాధవస్వామి, అనంత పద్మనాభస్వామి సన్నిధులలో చిరకాలం కైంకర్యం చేసుకున్న పరమపదవాసులు ఉ.వే.ప్ర. **శ్రీమాన్ కందాళ శ్రీనివాస అప్పలాచార్యులు, శ్రీమతి కోమలవల్లి** దంపతుల సంతానములో **"వేంకట తిరుమలాచార్యులు"** అనే నేను కనిష్ఠుడను. పరమపదవాసులు ఉ.వే.ప్ర. **శ్రీమాన్ శఠకోపాచార్యులు, వేంకటాచార్యులు** గార్లు నాకు జ్యేష్ఠులు. బరంపురం (గంజాం జిల్లా)లో వేంచేసి యున్న తిరువేంగడముడైయాన్ సన్నిధిలో స్థానాచార్యులుగా నుండే మా పినతండ్రి, పినతల్లి అయిన పరమపద వాసులు ఉ.వే. ప్ర. **శ్రీమాన్ తిరుమల పెద్దింటి రాఘవాచార్యులు, శ్రీమతి తిరువేంగళతాయారు** దంపతుల కోరికమేరకు, వారి వంశాభివృద్ధిని కాంక్షిస్తూ, మా జనకులు నన్ను వారికి దత్తతకిచ్చేరు. దత్తత స్వీకారము, పునః నామకరణము, ఉపనయనాదులు వరుసగా అచ్చటి పెరుమాళ్ల సన్నిధిలోనే జరిగాయి. తదారభ్య **"వేంకటరమణ"**గా మారిన నాకు బరంపురంలోనే మా నాయన (పినతండ్రి) గారే శ్రీరామాయణ, భారత, భాగవతాది గ్రంథ పరిచయములతో బాటు మన సంప్రదాయ పరమైన స్తోత్ర పఠనము, నాలాయిర దివ్యప్రబంధాను సంధానము, ఆవశ్యక వేదపారాయణము లను కటాక్షించారు. అప్పట్లోనే లౌకిక పరమైన ప్రాథమిక మొదలు ఉన్నత పాఠశాల, కళాశాలలో విద్యాభ్యాసములు పూర్తి, వెన్వెంటనే పరమపదవాసులు ఉ.వే.ప్ర. **శ్రీమాన్ కల్వపూడి శరణ్యాచార్యులు. శ్రీమతి సీతమ్మ** దంపతుల ప్రథమసుపుత్రిక చి॥ సౌ. సీతమ్మతో వివాహము, తదుపరి స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియాలో ఉద్యోగ

ప్రవేశము కూడా అచ్చటనే జరిగాయి. ఆరోజులలో అదృష్టవశాత్తు ఉన్నత పాఠశాల, కళాశాలలో మాకు సంస్కృతంకూడా ప్రధాన పాఠ్యభాగంగా ఉండేది.

మా నాయనగారు బరంపురంలో తిరువేంగడముడైయాన్ సన్నిధిలో సుమారు నలుబది సంవత్సరములు స్థానాచార్యులుగా పెరుమాళ్ల కైంకర్యం చేసారు. ఆ రోజులలోనే ఆ దేవాలయ ఆనువంశికుల ధర్మకర్తల సౌజన్యంతో అనేక పురాణ, సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వర్తించేవారు. అచ్చట నున్న మన వైష్ణవ కుటుంబాలలోని చాలామంది స్త్రీ,పురుషులకు భగవద్విషయ కాలక్షేపాలు కటాక్షించారు. మందసా రాజగురువులు పరమపదవాసులు ఉ.వే.ప్ర. శ్రీమాన్ **రామానుజాచార్యులవారికి** మానాయనగారి మీద ప్రత్యేక ప్రేమాను భావాలుండేవి. తరచుగా పరమపదవాసులు ఉ.వే.ప్ర.శ్రీమాన్ శ్రీశ్రీశ్రీ త్రిదణ్డి శ్రీమన్నారాయణ **పెద్దజీయర్‌స్వామివారు, ఉ.వే.ప్ర.శ్రీమాన్ తెలికిచర్ల కందాళ గోపాలాచార్యులుగారు, ఉ.వే.ప్ర.శ్రీమాన్ ప్రతివాది భయంకరం అణ్ణంగరా చార్యులుగారు, ఉ.వే.ప్ర.శ్రీమాన్ తిరుమల పెద్దింటి సంపత్కుమార వేంకటా చార్యులయ్యంగార్లవారువంటి** పెద్దలు బరంపురం వేంచేసి మా గృహంలోనే బస చేసేవారు. నాయనగారు వారితో ముఖ్యంగా శ్రీభాష్య భగవద్విషయ వ్యాఖ్యాన పరవిషయ చర్చలకు ప్రాధాన్యత నిచ్చారు. మా నాయనగారి శాంత స్వభావానికి, సౌశీల్యానికి, విషయ పరిజ్ఞానానికి పైన పేర్కొన్న పెద్దలు చాలా ముగ్ధులయ్యేవారు. **"శేషో వా, సైన్యనాథో వా"** అంటూ చర్చలు ప్రారంభించే వారు. నాకు జన్మనిచ్చిన తల్లిదండ్రులకంటే మిన్నగా నన్ను దత్తత తీసుకున్న తల్లిదండ్రులు ప్రేమించి, తీర్చిదిద్ది సంఘం గుర్తించే విధంగా ప్రవర్తింపజేసేరు. అట్టివారి విషయంలో వారి నిత్యస్మరణతో బాటు వారి పాదపద్మములకు సర్వదా అంజలి ఘటించుటయే నా కర్తవ్యమని నా దృఢవిశ్వాసము. మా నాయన గారి అనారోగ్యకారణంగా కొన్ని సంవత్సరములు దాసుడు పెరుమాళ్ల కైంకర్యమును (స్థానాచార్యత్వమును) చేసుకున్నాడు. నా అభివృద్ధికై నా జనకసోదరులిరువురు, మా మామగారు కూడా సర్వతోముఖముగా చేయూత నిచ్చేవారు. వారందరికీ నా కృతజ్ఞతాపూర్వక దాసోహ సహస్రములు.

మన సంప్రదాయంలో నాలాయిర దివ్యప్రబంధము చాలా ప్రధానమన్న విషయం మనకందరికీ తెలిసినదే. అయితే, ఆ ప్రబంధము ద్రావిడభాషలో

నున్నందుననూ, మన పూర్వాచార్యులు తమిళభాషలోనే వ్యాఖ్యానములు కటాక్షించుటవలననూ, తెలుగువారమైన మనతరంలో చాలా మందికి ఆ భాషలో ప్రావీణ్యం మాటకైనా ప్రవేశ మాత్రమైనా లేకపోవుట వలననూ దానిలో స్వారస్యం, దాని ఔన్నత్యం, వైశిష్ట్యం మొదలైనవి తెలుసుకోలేక పోతున్నాము. సంప్రదాయ పరులైన మన తాత తండ్రులు కఠిన నియమబద్ధకాలక్షేపాదుల ద్వారా చేసిన కృషికూడా వారాశించిన ఫలితములివ్వలేదు. ఈమధ్య కాలంలోని తరమువారమైన మనలో చాలామందికి ఈ సంప్రదాయ ప్రబంధ స్వారస్యం తెలుసుకోవాలని, నేర్చుకోవాలని కుతూహలము ప్రబలముగా ఉన్నది. అది వారి ప్రవర్తనల ద్వారా, లౌకిక ఉద్యోగాలకు ప్రతి భంగము లేకుండానుండు మార్గాన్వేషణ ప్రస్ఫుటముగా కనిపిస్తోంది. ఆ కారణంగానే ఔత్సాహికుల ఆసక్తిని స్ఫూర్తిగా తీసుకొని మితభాషి, నిరాడంబరి, విద్వన్మణి, బహుభాషా పరిజ్ఞాని అయిన ఉ.వే. ప్ర. శ్రీమాన్ ఈ.ఏ. **శింగరాచార్యులు (తిరుపతి)** గారు ఎన్నో సంస్కృత గ్రంథాలకు తెలుగు భాషలో అనువాదాలను వెలువరించేరు. ద్రావిడభాషలోని చాలా భాగాలకు కూడా మూలవాఖ్యానాల ననుసరిస్తూ అందరికీ అందుబాటులో ఉండే విధంగా తెలుగులో పుస్తకములను అందించేరు. వారి సంతతకృషి అనుపమానము. దాసుని ప్రార్థనమేరకు శ్రీమాన్ శింగరాచార్యులు గారు శ్రీనమ్మాళ్వార్లు సాయించిన **"తిరువిరుత్తము"** అనే ప్రబంధ భాగమునకు ప్రస్తుతము **కాంచీ మహావిద్వాన్ ప్రభ. అణ్ణంగరా చార్యస్వామివారి దివ్యార్థదీపికా** ద్రావిడ వ్యాఖ్యకు ఆంధ్రాను వాదమును కటాక్షించేరు. వారికి నాయందుండే ప్రేమాభిమానములకు సదా కృతజ్ఞుడను. ఈ కోశమును మా పితృమాతృవర్గముల జ్ఞాపికగ మన శ్రీవైష్ణవ భాగవతోత్తములకు కానుకగా సమర్పించే సదవకాశమును కలిగించి ప్రోత్సహించిన నా శ్రీమతి చి॥ సౌ॥ సీతమ్మ, కుమారుడు చి॥ శ్రీనివాసరాఘవ చక్రవర్తి, కోడలు చి॥ సౌ॥ చంద్రికలకు ఆశీఃపూర్వక మంగళాశాసనములు.

భాగవతమంగళాశాసనాభిలాషి

**వేంకటరమణ (బుచ్చిబాబు)**

న్యాయవేదాంత విద్వాన్, ఉభయవేదాంత భాస్కర
**ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారు**
భారద్వాజభవనం, కోవెలవీథి,
నరసాపురం.



# అభినందనం

పుణ్ణియమార్ పల్పిఱవి పూణ్డి యన్దేన్ అన్దత్తు
నణ్ణి యుణర్వెన్నై నయన్దడైయుమ్ - ఎణ్ణియుయిర్
ఎల్లామ్ వాశుదేవనేదాన్ ఎన ఉణర్న్ద
నల్లాన్ మిక వరియన్ నాట్టు

ఈ పాశురం వాదికేసరి అழகియమణవాళచ్చీయర్ అనే పూర్వాచార్యులు అనుగ్రహించిన భగవద్గీతైవెణ్బా ప్రబంధంలోనిది. ఈ పాశురం, భగవద్గీతలోని **"బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే, వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః"** (పలు జన్మలకు పిమ్మట మానవుడు జ్ఞానాన్ని కలవాడై, నన్ను శరణుపొందుతున్నాడు. వాసుదేవుడే సమస్తమని భావించే ఆ మహాత్ముడు చాలా దుర్లభుడు) అనే శ్లోకానికి అనువాదం. నమ్మాழ்వార్ల తిరువాయ్మొழிలో **"ఉణ్ణుమ్ శోఱు పరుకు నీర్ తిణ్ణుమ్ వెற்றிలైయు మెల్లామ్ కణ్ణన్"** (భుజించే అన్నం తాగే నీరు, అనుభవించే తాంబూలం - అన్నీ కృష్ణుడే) అని పల్కినందున భగవద్గీతలోని పైసూక్తికి లక్ష్యభూతులు నమ్మాழ்వార్లే - అని మన పూర్వాచార్యులందఱి అభిప్రాయం.

ఈ విధంగా శ్రీమన్నారాయణుడే ధారకపోషకభోగ్యాలుగా భావించిన ప్రపన్నజనకూటస్థులైన ఆழ்వార్లు అనుగ్రహించిన ప్రబంధాలు- తిరువిరుత్తం తిరువాశిరియమ్, పెరియతిరువన్దాది, తిరువాయ్మొழி - అనే నాల్గు. ఇవి చతుర్వేదసారాలని, తిరువిరుత్తం, ఋగ్వేదసారమని, తిరువాశిరియమ్ యజుర్వేదసారమని, పెరియతిరువన్దాది అథర్వణవేదసారమని, తిరువాయ్మొழி సామవేదసారమని పూర్వాచార్యుల అభిసంధి.

ఈ నాల్గు ప్రబంధాలలోని ప్రమేయాల అనుక్రమాన్ని గూర్చి నమ్పిళ్ళై ఈడుముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యకు ముందు అనుగ్రహించిన మున్దామ్ శ్రియః

పతి అనే అవతారికలో తెలియజేస్తూ, ఆళ్వార్ల భక్తిదశకు భరతాళ్వాన్ భక్తిదశతో గల సారూప్యాన్ని వివరించారు. శ్రీరామునకు కైంకర్యాన్ని చేయాలని ఆశపడిన భరతునకు కైకేయి **"రాజన్"** అనే సంబోధించినపుడు కల్గిన అవస్థవంటిది- తిరువిరుత్త ప్రబంధంలో ఆళ్వార్లు అనుభవించిన అవస్థ. చిత్రకూటంలో ఉండే శ్రీరాముడున్నాడని విని, "నా ఒక్కని కన్నీటినే సహించలేని శ్రీరాముడు, ఇంత మంది కన్నీటిని సహించగలడా! తప్పక అయోధ్యకు తిరిగివస్తాడని ఆశపడి పోయినప్పటి భరతుని స్థితివంటిది- తిరువాశిరియ ప్రబంధంలోని ఆళ్వార్ల స్థితి. నందిగ్రామంలో శ్రీరాముని రాక కోసం ఆశతో ఎదురుచూస్తూ ఉండే భరతుని స్థితివంటిది - పెరియతిరువన్దాదిలోని ఆళ్వార్ల స్థితి. ఇక, శ్రీరాముడు అయోధ్యకు తిరిగి వచ్చి, పట్టాభిషేకం చేసికొన్న తరువాత అతనికి తగిన కైంకర్యాన్ని చేసి ఆనందించిన భరతుని అనుభవంవంటిది - తిరువాయ్మొళి ప్రబంధంలో ఆళ్వార్లు పొందిన అనుభవం. ఈవిధంగా ఆళ్వార్ల నాల్గు ప్రబంధాలలోని అనుభవం- భరతుని నాల్గు దశలలోని అనుభవం వంటిదని నమ్పిళ్ళై అభిప్రాయం.

ఆచార్యహృదయకారులు అళకియమణవాళప్పెరుమాళ్ నాయనార్ **"ఇయఱ్ఱా మూన్ఱుమ్ వేదత్రయమ్ పోలే, పణ్ణార్పాడల్ పణ్బుడై యుశైకొళ్వేదమ్ పోలే"** అనే చూర్ణికలో నమ్మాళ్వార్ల ప్రబంధాలు నాల్గింటికి గల చతుర్వేదసామ్యాన్ని తెలిపి, **"ఋక్కు సామత్తాలే సరసమాయ్, స్తోభత్తాలే పరమ్బుమాపోలే, శొల్లార్ తొడైయల్ ఇశైకూట్ట అమర్శువై ఆయిరమాయిత్తు"** అనే చూర్ణికలో శతగాథాత్మకమైన తిరువిరుత్త ప్రబంధమే సహస్రగాథాత్మకమైన తిరువాయ్మొళి ప్రబంధంగా విస్తరించిదని అన్నారు. ఈ క్రమంలో తిరువిరుత్తంలోని ఒక్కొక్క పాశురం తిరువాయ్మొళిలోని ఒక్కొక్కదశకంగా విస్తరించిందని తెలుస్తున్నది. ఈ ప్రథమ- చరమప్రబంధసంగతి వివరం ఆచార్యోపదేశ గమ్యం. **"సహస్రపరమా దేవీ శతమూలా శతాంకురా, సర్వగ్ం హరతు మే పాపం దుర్వా దుస్స్వప్ననాశినీ"** అనే శ్రుతివాక్యంలోని **"శతమూలా"**శబ్దం ద్వారా శతగాథారూపమైన తిరువిరుత్త ప్రబంధం సూచితమని, **"శతాంకురా"** అనే శబ్దంద్వారా అష్టోత్తరశతగాథాత్మకమైన ఇరామానుశ నూత్తన్దాది ప్రబంధం సూచితమని, **"సహస్రపరమా దేవీ"** అనేప్రయోగం ద్వారా సహస్రగాథాత్మకమైన తిరువాయ్మొళిప్రబంధం సూచితమని కాంచీ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారిసూక్తి. ఈ శ్రుతిద్వారా కూడా

తిరువిరుత్త- తిరువాయ్‌మొ\u0c33ి ప్రబంధాలమధ్యగల వివరణ- వివరణి భావాన్ని గమనించవచ్చు. తిరువాయ్‌మొఴి ప్రబంధానికి అకుంరస్థానీయం ఇరామానుశ నూఱ్ఱన్దాది ప్రబంధం- అనే సూక్తిలోని తాత్పర్యమేమంటే- భగవద్భక్తికి (అనంతరస్థితి) అంకురస్థానీయం భాగవతాచార్యభక్తి కనుక, ఇరామాను నూఱ్ఱన్దాదిలోని ప్రమేయం భాగవతాచార్యభక్తియే కనుక, భగవద్భక్తి పరమైన తిరువాయ్‌మొఴి ప్రబంధానికి భాగవతాచార్యభక్తి ప్రధానమైన ఇరామానుశ నూఱ్ఱన్దాది దానికి అంకురస్థానీయం.

ఇక, తిరువిరుత్తంలోని నూఱుపాశురాలలో ఒక్కొక్క పాశురం తిరువాయ్ మొఴిలోని ఒక్కొక్క దశకంగా విస్తరించందని, "ఋక్కు సామంగా విస్తరించినట్లే" ఇత్యాది ఆచార్యహృదయకారుల సూక్తిని అనుసరించి తిరువిరుత్త పాశురాలకు, ఆయా పాశురాలకు సంబంధించిన తిరువాయ్‌మొఴి దశకాలకు మధ్య ఉండే ప్రమేయసామ్యాన్ని సూక్ష్మదృష్టితో గమనించివచ్చు. దిఙ్మాత్రంగా రెండు మూడు ఉదాహరణలను మాత్రం విన్నపిస్తాను.

తిరువిరుత్తంలోని **"పొయ్‌న్నిన్ఱ ఞానముమ్"** అనే మొదటి పాశురం తిరువాయ్‌మొఴిలోని **"ఒఴివిల్ కాలమ్"** (3-3) అనే తిరువాయ్‌మొఴి దశకంగా విస్తరించిందని పెద్దల సమన్వయం. ఈ తిరువిరుత్త పాశురంలో ఆழ்వార్లు అర్థ పంచక నిరూపణాన్ని చేశారని వ్యాఖ్యానిస్తూ పెరియవాచ్చాన్‌పిళ్ళై తమ వ్యాఖ్యలో **"శెయ్యుమ్ విణ్ణప్పమే"** అనే సూక్తి ప్రాప్యమైన పురుషార్థాన్ని సూచిస్తుందని అన్నారు. అదే కదా కైంకర్యం. తిరువాయ్‌మొఴిలో ఆழ்వార్లు కైంకర్యప్రార్థనను **"ఒఴివిల్ కాలమ్"** అనే దశకంలో చేశారని పూర్వాచార్య సమన్వయం. అంతేకాక **"అడియేన్"** అని అంటూ ఆழ்వార్లు దాస్యాన్ని తమకు నిరూపకంగా తిరువిరుత్తంలో పల్కినట్లే, తిరువాయ్‌మొఴి దశకంలోకూడా **"అడిమై శెయ్యవేణ్డుమ్"** అని దాస్యప్రార్థనను చేశారు. అందువల్ల తిరువిరుత్తంలోని మొదటి పాశురం తిరువాయ్‌మొఴిలో **"ఒఴివిల్‌కాలమ్"** దశకార్థంగా పరిణమించిందని చెప్పవచ్చు. తిరువిరుత్తంలోని 28వ పాశురంలో **"తిరువరఙ్గా! అరుళాయ్"** అని అంటూ శ్రీరంగనాథుని సంబోధిస్తూ అనుగ్రహించమనే ప్రార్థనను పరాంకుశ నాయకి చేసింది. **"ఉళ్‌వాయ్ అలకాల్ పుళ్‌నన్దుళామే పొరునీర్"** అని అంటూ అందులో కావేరీనది జలపౌష్కల్యం ప్రస్తావింపబడింది. ఈ పాశురభావం తిరువాయ్‌మొఴిలోని **"కఙ్గులుమ్ పకలుమ్"**

(7-2) అనే దశకంగా విస్తరించిందని సంప్రదాయ సమన్వయం. ఈ దశకంలో పరాంకుశనాయకి తల్లి శ్రీరంగనాథుని సంబోధిస్తూ **"తిరువరఙ్గత్తాయ్! ఇవళ్ తిఱత్తు ఎన్ శెయ్‌కిన్ఱాయే!"** అని నిలదీసి ప్రశ్నించి రక్షించమని అర్థించింది. ఇందులో **"శెఙ్గయల్ పాయనీర్"** అని కావేరి జలసమృద్ధి ప్రస్తావింపబడింది. ఈవిధంగా ఈ రెండిటి మధ్యగల అర్థసామ్యం స్పష్టంగా గోచరిస్తుంది. ఇక, ఇంకొక్క అర్థసామ్యాన్ని మాత్రం ప్రస్తావిస్తాను. తిరువిరుత్తంలోని **"తనినెఞ్జమ్"** అనే 4వ పాశురం తిరువాయ్‌మొழ్రిలోని **"ఓడుమ్ పుళ్ళేఱి" (1-8)** అనే దశకంగా విస్తరించిందని సంప్రదాయం. ఈ పాశురంలో భగవానుని వాహనమైన గరుడుని ప్రస్తావన **"అవర్‌పుళ్ళే"** అని, **"తణ్ణమ్ తుழ్రాయ్"** అని తులసి ప్రస్తావన చేయబడ్డాయి. అదేరీతిలో, ఇవి తిరువాయ్‌మొழ్రి దశకంలో **"ఓడుమ్ పుళ్ళేఱి"** అని, **"శూడుమ్ తణ్‌తుழ్రాయ్"** అని ప్రారంభంలోనే చేయబడింది. ఈవిధంగా ఈ రెండిటి ప్రమేయాలలోని వివరణ- వివరణి భావం స్పష్టం. విస్తరభీతివల్ల ఇంతటితో ఈ ప్రసంగాన్ని విరమిస్తాను.

**"వేదమ్ తమిழ్రశెయ్‌ద మాఱన్"** అని మధురకవుల సూక్తి. నమ్మాழ్వార్ల ప్రబంధాలలోని పలు సూక్తులు వేదవాక్యాల అర్థాన్ని అనుసంధిస్తున్నవి అనే విషయాన్ని ప్రబంధాలలోని సూక్తులను వ్యాఖ్యానించే పూర్వాచార్యులు సప్రమాణంగా నిరూపించారు. ఈ అంశాన్ని తిరువిరుత్త వ్యాఖ్యానంలో ప్రచురంగా గమనించవచ్చు. ప్రారంభపాశురంలోని **"ఎన్నిన్ఱ యోనియుమాయ్ ప్పిఱన్దాయ్"** అనే పాశురసూక్తి. **"అజాయమానో బహుధా విజాయతే"** అనే శ్రుతివాక్యాన్ని, **"కழ్రిపెరుమ్ దెయ్‌వమ్"** అనే 20వ పాశురంలోని సూక్తి. **"పతిం విశ్వస్య", "పతిం పతీనామ్", "అవిజ్ఞాతం విజానతామ్, విజ్ఞాత మవిజానతామ్"** అనే శ్రుతివాక్యాలను, **"విణ్ణాట్టవర్ మాదువరామ్"** అనే ప్రయోగం **"యత్రర్షయః ప్రథమజా యే పురాణాః", "యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః"** ఇత్యాది శ్రుతివాక్యాలను, **"వణ్డుకళో! నమ్మిన్ నీర్‌ప్పూ నిలప్పూ మరత్తిలొణ్‌పూ"** అనే 55వ పాశురసూక్తి **"అంభస్య పారే భువనస్య మధ్యే నాకస్య పృష్ఠే"** ఇత్యాది శ్రుతిని, **"అழ్రలర్ తామరైక్కణ్ణన్"** అనే ప్రయోగం **"యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ"** అనే ఛాందోగ్యసూక్తిని, **"నీలముణ్డ మిన్నన్న మేని"** అనే 29వ పాశురప్రయోగం **"నీలతోయదమధ్యస్థా"** ఇత్యాది శ్రుతిని, **"ఞాలమ్ తత్తుమ్ పాదన్"** అనేసూక్తి **"పద్భ్యాం భూమిః"** అనే పురుషసూక్త సూక్తిని తలపిస్తున్నవి. 82వ పాశురంలో తైత్తిరీయారణ్యకంలోని మందేహ

వృత్తాంతం ప్రస్తుతం. ఇటువంటి శ్రుతిసామ్యాలు చాలా ఉన్నాయి. ఉపబృంహణ సూక్తి సామ్యాలు కూడా చాలా చోట్ల వ్యాఖ్యాతలచే వివరింపబడ్డాయి. విస్తృతభయం చేత ప్రస్తావించలేదు.

నమ్మాళ్వార్ల ప్రబంధచతుష్టయం రహస్యత్రయార్థప్రతిపాదకమనే సమన్వయాన్ని కూడా ఆచార్యహృదయమనే గ్రంథంలో నాయనార్ ఒక చూర్ణికలో ప్రస్తావించారు. ఈ సమన్వయాన్ని బట్టి, అష్టాక్షరిలోని ప్రణవ, నమశ్శబ్దాల అర్థాన్ని తిరువిరుత్త ప్రబంధం, **"నారాయణాయ"** అనే తృతీయపదం యొక్క అర్థాన్ని తిరువాశిరియ ప్రబంధం, చరమశ్లోకార్థాన్ని పెరియతిరువన్దాది ద్వయార్థాన్ని చివరిది అయిన తిరువాయ్‌మొ*ళ్ళి* ప్రబంధం వివరిస్తున్నవని ఏర్పడుతున్నవి. తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, పెరియతిరువన్దాది, తిరువాయ్‌మొ*ళ్ళి* - అనేది నమ్మా*ళ్ళ్*వార్ల ప్రబంధావతరణ క్రమం. నాయనార్ చూపిన సమన్వయాన్నిబట్టి తిరుమంత్రం, చరమశ్లోకం ద్వయమనేది కూడా రహస్యక్రమం ఏర్పడుతున్నది. ఇటువంటి క్రమాన్ని వాదికేసరిజీయర్, పిళ్ళైలోకాచార్యులవారు, నాయనార్ వంటి పూర్వా చార్యులు అనుసరించారు. ఈ క్రమంలోని సామంజస్యాన్ని గూర్చి ముముక్షుప్పడి అనే రహస్యగ్రంథాన్ని వ్యాఖ్యానిస్తూ శ్రీవరవరమునులు వివరించారు కూడా.

ఇక, ప్రకృతవిషయాన్ని గమనిస్తే, తిరువిరుత్తప్రబంధంలో ఏవిధంగా ప్రణవ, నమశ్శబ్దాల అర్థం ప్రతిపాదింపబడినదనేది గమనించవలసి ఉన్నది. దీనిని గూర్చి శ్రీవరవరమునులు ఆచార్యహృదయవ్యాఖ్యానంలో (60వ చూర్ణికను వ్యాఖ్యానిస్తూ) చేసిన వివరణం స్మరణీయం. ప్రణవంలోని అకారం **"అవ-రక్షణే"** అనే ధాతువుద్వారా భగవానుని రక్షకత్వాన్ని తెలుపుతున్నది. ఈ అర్థం తిరువిరుత్తంలో **"ఉయిరళిప్పాన్"** (1) అని తెలుపబడింది. ప్రణవంలోని అకారం పైవచ్చి లోపించిన చతుర్థిద్వారా, ఉకారం ద్వారా ఆత్మయొక్క భగవదనన్యార్హ శేషత్వం తెలుపబడింది. ఈ ఆత్మ ప్రకృతికంటే విలక్షణమైనదని, జ్ఞానానంద లక్షణమని ప్రణవంలోని తృతీయాక్షరమైన మకారంద్వారా తెలుపబడింది. ఈ అర్థాలు **"అడియేన్"** (1) అనే తిరువిరుత్త ప్రయోగంద్వారా సూచింపబడ్డాయి. ప్రణవంలోని అకారంపై వచ్చి లోపించిన చతుర్థీ విభక్తి సంప్రదాన చతుర్థి కనుక, దీనిద్వారా **"బ్రహ్మణే త్వామహస ఓమిత్యాత్మానం యుంజీత"** అనే వేదోక్తమైన ఆత్మసమర్పణం తెలుపబడింది. ఇది **"అడియేనడియావి యదైక్కలమ్"** (85) అనే తిరువిరుత్త ప్రయోగంద్వారా

వ్యక్తమైనది. ప్రణవం ద్వారా సిద్ధమైన భగవదనన్యార్హశేషత్వం తదీయశేషత్వపర్యంతం అనే అర్థం నమస్సుద్వారా అర్థాత్ సూచింపబడింది. ఇది "తిరుమాల్ తిరుప్పేర్ వల్లార్ అడిక్కణ్ణి శూడియ మాఱన్" (100) అనే సూక్తి ద్వారా వ్యక్తమైనది. ఇక, నమశ్శబ్దంలోని షష్ఠీవిభక్త్యంతమైన మకారం ద్వారా అహంకార మమకార రూపాలైన, ఆత్మ, కాని, దేహంలో ఆత్మబుద్ధిరూపమైన అవిద్య తెలుపబడగా, ఇది తిరువిరుత్తమ్‌లో "పొయ్‌న్నిన్ఱ ఞానముమ్, పొల్లా ఒழுక్కుమ్ అழుక్కుడమ్బుమ్" (1) అని ఆరంభంలో, "యాతానుమోరాక్కైయిల్ పుక్కు, అఙ్గాప్పుణ్డుమాప్ప విழ్న్దుమ్" (95) అని చివరలో తెలుపబడింది. ఆ అవిద్య కారణంగా సంభవించే అకృత్య కరణాదులు, వాటివల్ల కలిగే దేవమనుష్యాదిరూప ప్రకృతి సంబంధం. "వన్‌శేర్‌ఱ్ఱళ్ళల్ పొయ్‌న్నిలత్తు అழுన్దార్" అని తిరువిరుత్తంలో తెలుపబడింది. ఈవిధంగా సర్వరక్షకుడైన సర్వేశ్వరునకు అనన్యార్హశేషమై, జ్ఞానానంద లక్షణమై, తదీయపర్యంతశేషమై ఉండే ఆత్మస్వరూపాన్ని, సంసారం కలుగడానికి హేతువులైన అవిద్య మొదలైనవాని నివృత్తిని ఈ తిరువిరుత్తప్రబంధం స్పష్టంగా ప్రతిపాదిస్తున్నందున వీటిని తెలిపే తిరుమంత్రంలోని ప్రథమ, ద్వితీయపదాల అర్థాన్ని ఈ ప్రబంధం అనుసంధిస్తున్నది - అని అనడంలో లోటు లేదు.

తిరువిరుత్తంలోని పలు పాశురసూక్తుల భావాలను పూర్వాచార్యులు తమ స్తోత్రాలలో అనుసంధించారు. భగవద్రామానుజులు శరణాగతిగద్యలో "కిరీట, మకుట, చూడావతంస" అని భగవానుడు శిరస్సుకు అలంకరింపబడే ఆభరణాలను మూడు రీతులలో పల్కడానికి "పొరళన్ద పేరరశే! ఎమ్ విశుమ్బరశే", "ఎమ్మైనీత్తు వఞ్జిత్త ఓరరశే" అనే తిరువిరుత్తసూక్తులు మూలం. "అழలర్ తామరైక్కణ్ణన్" అనే సూక్తి కప్యాసశ్రుతికి శ్రీరామానుజులు "గంభీరాంభః సముద్భూత" ఇత్యాదిగా చేసిన వివరణకు మూలం. "కుழల్కోవలర్ మడప్పావై మణ్మకళుమ్ తిరువుమ్ నిழల్‌పోల్‌వనర్" అనే సూక్తి భావాన్ని భట్టర్ "ఛాయా మివాభ్యుదయనీ మవనీం చ తస్యాః" ఇత్యాదిగా "పులక్కుణ్డల పుణ్డరీకత్త పోర్‌కెణ్డై" అనే 57వ పాశురంలోని సూక్తిని "మిథో బద్ధస్పర్ధస్ఫురిత శఫరద్వంద్వలలితౌ" అనే శ్లోకంలో "నీలత్తడవరై మేల్" అనేసూక్తిని "కృపయా పరయా కరిష్యమాణే సకలాంగం కిల సర్వతోక్షినేత్రే" అనే శ్లోకంలో, "శ్రీరంగేశయ శరణం మమాసి" అనే శ్లోకంలో "వన్‌కాఱ్ఱ్ఱైయ" అనే పాశురభావాన్ని భట్టర్ అనుసంధించారు. ఇవి కేవలం దిఙ్మాత్రోదా హరణాలు.

నమ్మాళ్వార్ల ప్రబంధాలు నాల్గు చతుర్వేదస్థానీయాలని, తిరుమంగై ఆళ్వార్ల ప్రబంధాలు ఆఱు వేదాంతస్థానీయాలని ప్రసిద్ధి. ఈ అంగాంగి భావాన్ని ఈ ఇద్దటి ప్రబంధాలలో ప్రత్యేకించి, తిరువిరుత్తంలో కూడా గమనించవచ్చు. భగవానుడు సాక్షాత్కరించిన అనంతరం పొందిన ఫలాన్ని తెలియలేక నమ్మాళ్వార్లు **"పొయ్న్నిన్ఱ ఞానముమ్.... ఇన్నిన్ఱనీర్మై"** ఇత్యాదిగా పూర్వవృత్తాన్ని అనుసంధించి నట్లే, కలియన్‌కూడా పెరియతిరుమొழி ఆరంభంలో భగవద్విషయా కారాన్ని పొందిన తరువాతకూడా అంతకు ముందు తాము పొందిన విశ్లేషాన్ని తలచి **"వాడినేన్"** అని అన్నారు. భగవదనుభవిరోధి అయిన ఈ లీలావిభూతిలోనే ఉంటూ భగవదనుభవమే జీవనయాత్రగా సాగించేవారిని **"విణ్ణులారిలుమ్ శీరియర్"** అని నమ్మాళ్వార్లు తిరువిరుత్తంలో (79) అని అన్నారు. తిరుమంగైమన్నన్‌కూడా ఈ భావాన్ని తిరునెడున్దాణ్డకమ్‌లో **"పెరున్దవత్తర్"** (20) అనే ప్రయోగంద్వారా తెలిపారు ఇటువంటి సూక్ష్మమైన అంశాలు వ్యాఖ్యానగమ్యాలు. ఆచార్యసన్నిధిలో గ్రాహ్యాలు. **"ముత్తినై మణియై మాణిక్కవిత్తై"** అనే పెరియతిరుమొழி (10-1-8) సూక్తి **"మణియే ముత్తమే ఎన్దన్ మాణిక్కమే"** (94) అనే తిరువిరుత్తసూక్తిని, **"పుళ్ళూరుమ్ కళ్వా"** అనే తిరునెడున్దాణ్డక సూక్తి (23) **"పుళ్ళూరుమ్ కళ్వర్"** అనే తిరువిరుత్త (22) సూక్తిని, "వేదనై వెణ్‌పురి నూలనై" అనే (79) తిరువిరుత్త సూక్తిని **"వేదముదల్వన్ విళఙ్గుమ్ వెణ్‌పురి నూలన్"** (పెరియతిరు-8-4-2) శాబ్దికంగా తలపిస్తాయి. ఇటువంటి శబ్దతః సామ్యాలను కూడా ఈ ఇద్దటి ప్రబంధాల మధ్య గమనించవచ్చు.

శైలిలో, విషయంలో, తదితర అంశాలలో అత్యంత ప్రౌఢ ప్రబంధంగా పేరు పొందిన తిరువిరుత్తానికి నమ్పిళ్ళై, పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానాలు, అழகియమణవాళచ్చీయర్ స్వాపదేశ ఉరై, పెరియపరకాల జీయర్‌వ్యాఖ్యానం ఉన్నాయి. పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానానికి మూడు అరుంబదాలున్నాయి. పెరియవాచ్చాన్ పిళ్ళై వాఖ్యానంగాని, దాని అరుంబదాలుగాని తెలుగులిపిలో ముద్రింపబడినట్లు కన్పించలేదు. అందువల్ల ఇవి తప్పక తెలుగులిపిలో ప్రకటించ వలసి ఉన్నది. ఈప్రయత్నం ఆళ్వార్ల కటాక్షంవల్ల, పెద్దల మంగళాశాసనబలంవల్ల త్వరలో నెరవేరగలదని ఆశిద్దాం. గత శతాబ్దిలో ఉ.వే.శ్రీమాన్ వై.ము. (వైత్తమానిది

ముడుమ్బై) శఠకోప రామానుజాచార్యస్వామివారి ద్రావిడవ్యాఖ్యానం, కాంచీ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారి దివ్యార్థ దీపికా వ్యాఖ్యానం, శ్రీమాన్ ఉత్తమూర్ వీరరాఘవాచార్యస్వామి వారి ప్రబంధరక్షా ద్రావిడవ్యాఖ్య మొదలైనవి వెలువడ్డాయి. కాని, ఆంధ్రభాషలో విశదమైన వ్యాఖ్యానం ఇంతవరకు వెలువడలేదు.

ఆలోటు తీరాలనే ఉదారాశయంతో విజయనగరం వాస్తవ్యులు ఉ.వే. శ్రీమాన్ టి.పి.వి రమణస్వామివారు కాంచీ మహావిద్వాన్ శ్రీఅణ్ణంగరాచార్య స్వామివారి దివ్యార్థదీపికను ఆంధ్రీకరింపజేసి ప్రచురించడం చాలా అభినందనీయం. ఆంధ్రదేశంలోని ప్రపన్నపాఠకలోకం వారికి చాలా ఋణపడి ఉన్నది. ఈ స్వామి వారిని నేను మనసారా అభినందిస్తున్నాను. సర్వాంగసుందరమైన దివ్యార్థ దీపికను ఆంధ్రీకరించిన చి.శ్రీమాన్ శింగరాచార్యులకు మంగళాశాసనాలను చేస్తున్నాను. ఈ సద్గ్రంథాన్ని ప్రపన్నపాఠకులు సద్వినియోగం చేసికోవాలని కోరుతూ, స్వస్తి.

ఇట్లు, నివేదించు

నరసాపురం                                    భాగవతవిధేయుడు

21-2-16                                    **ఈ. రంగాచార్యులు**



ఉభయవేదాన్తవాచస్పతి, పండితరత్న,
ద్రావిడవేదాన్తవిశిష్టపండిత,
**ఉ.వే. శ్రీమాన్ కె. వేంకటాచార్యస్వామివారు**
4-1-22/1, కోవెలవీధి, నరసాపురం-534 275



## తిరువిరుత్తమ్ - వైశిష్ట్యమ్

భక్తిప్రభావభవదద్భుతభావబన్ధ సన్ధుక్షితప్రణయసారరసౌఘపూర్ణః ।
వేదార్థరత్ననిధిః అచ్యుతదివ్యధామా జీయాత్ పరాంకుశపయోధి రసీమభూమా॥

శ్రియఃపతియొక్క నిర్హేతుకకృపాకటాక్షలబ్ధదివ్యజ్ఞానసంపన్నులైన ఆళ్వార్లలో స్వామి నమ్మాళ్వార్ ప్రధానులు. ఋక్యజుఃసామాథర్వణ వేదాల సారంగా వీరనుగ్రహించిన తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, పెరియతిరువన్దాది, తిరువాయ్‌మొళి ప్రబన్ధాలు అంగిప్రబన్ధాలుగా ప్రసిద్ధి నొందినవి. పైవానిలో ఋగ్వేదసారంగా అవతరించిన తిరువిరుత్తమ్ ఒక విశిష్టమైన దివ్యప్రబన్ధం. "విరుత్తమ్" అనే దానికి ఒక విధమైన ద్రావిడఛందస్సు- సందేశం - సంఘటన - జన్మపరంపరాచక్రం అనే అర్థాలున్నట్లు విజ్ఞులు వక్కాణిస్తారు. జన్మజరామరణాది దుఃఖాలతో సతతమయ్యే జీవి వానినుండి విడివడి శాశ్వతానన్దాన్ని వాంఛించుట సహజం కదా! "జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్" అని గీతా చార్యుడు జన్మము - చివర మృత్యువు మధ్యలో ఆదివ్యాధులు, ముసలితనం- వీనిలోని దోషాల్ని తలంచి తగిన రీతిలో వానిని తొలగించుకొనవలెనని, అదియే జ్ఞానానికి ఫలమని తెలిపియున్నాడు. ("అనుదర్శనమ్" - అనుటలో ఈ భావాలు, తత్పరిహార ప్రయత్నము సూచితమైనది.) ఈ సంసారబంధవిమోచనానికి "సంసార బన్ధస్థితిమోక్షహేతుః" అయిన స్వామిని ఆశ్రయించాలి.

స్వామి నమ్మాళ్వార్ల ఈ దివ్యప్రబన్ధంలో మొదటి పాశురమైన "పొయ్‌నిన్ఱ ఞానముమ్" అను దానిలో దేహాత్మాభిమానం, దీని కారణంగా సంభవించు దుష్కర్మ, దాని ఫలితంగా సిద్ధించే రక్తమాంసములతో కూడిన మురికి శరీరం- అనే వీనిని దాసునికే గాక, దాసుని సంబన్ధసంబన్ధులకు కూడా లేకుండా జేయుమని

శ్రియఃపతి పాదారవిన్దముల సన్నిధిలో ప్రార్థించినారు. చివర పాశురంలో - ఈ దివ్యప్రబన్ధములలోని పాశురముల సారాన్ని గ్రహించినవారికి సంసారజంజాటం అంటదని ఫలశ్రుతిని అనుగ్రహించారు. ఆళ్వార్లు భక్తితో స్వామికి చేసిన ఈ విన్నపం **"భక్తిః శృంగారవృత్త్యా పరిణమతి మునేః"** అనే రీతిలో తోళ్ళి (చెలి), తాయ్ (తల్లి), మగళ్ (నాయకి) అవస్థలను పొంది శతపాశురాత్మకమైన అనర్ఘదివ్య ప్రబన్ధంగా అవతరించింది.

భట్టహర్షుని నైషధమహాకావ్యం మురారి, అనర్ఘరాఘవ నాటకం, పరాశర భట్టారకుల శ్రీరంగరాజస్తవం వలె (వివరణంకొరకు ఉదాహరణములు) ఈ దివ్యప్రబన్ధం ప్రౌఢగంభీరకవితాచమత్కృతికి ఆటపట్టు. ఇందలి ప్రతిపాశురమే గాక ప్రతిపదంకూడా రసస్యంది. పరివృత్తిని సహింపనిది. అంతరారార్థాల పుట్ట. వాచ్యలక్ష్యవ్యంగ్యపద్ధతులతో ఇవి ఇమిడియుండును. ఇందలి రచన నారికేళపాకంలో నుండి సామాన్యులకు అందుబాటులో నుండుట కష్టం. అయినా భగవానునకు నారికేళమే గదా ప్రియమైనది. ఇక ఉత్తమకావ్యదృష్టిలో జూచిన ఈ దివ్యప్రబన్ధం ఒక శ్రవ్యనాటకం. ఇందలి పాత్రలన్నియును విశుద్ధ భగవత్ కామప్రవిష్టములు. ఆళ్వార్లు ఇందు చెలిగా, తల్లిగా, నాయకిగా, భాగవతోత్తములుగా సాక్షాత్కరించి భగవదనుభవాన్ని విలక్షణమైన రీతిలో చేస్తారు. మరియొక విశేషం- ఇందలి అలంకారచమత్కృతి.

1. "వియోగదుఃఖంతో కన్నీరుగార్చు ఆళ్వార్ల నేత్రాలను -తటాకంలో త్రుళ్ళింతలాడు బేడిసచేపలతో పోల్చు ఉపమానం-2పా

2. తెల్లని చంద్రుడనే పశువు (ఆవు) వెన్నెల యనెడి పాలను ఆకాశమనే పాత్రలో కుమ్మరించుచున్నవి- అనే రూపకం - 73 పా.

3. **"నీలక్కఱునాయిఱు"** - అని స్వామిని నల్లని సూర్యునివలె భావించిన అభూతోపమ.

4. కళ్ళుగల ఆవులు మేసి వచ్చి అంబారావములును చేయ, మేతకు వెళ్లలేని గుడ్డియావు వాని అఱుపులను విని ఆనందించి తానుకూడ అఱచినట్లు- అనే దృష్టాంతం- 94 పా. మొ॥నవి ముచ్చట గొలుపక మానవు.

ఇంకొక ముఖ్యవిషయం

"తద్భక్తై ర్వా సమాగమః (వా- ఏవ)" భగవద్భక్తులతో కలసియుండుటయే జీవితానికి ప్రధానఫలం - అనేదానిని ఇందు ఆళ్వార్లు అన్వయవ్యతిరేక పద్ధతులలో అనుభవించియున్నారు. అది ఇది. **"అన్బర్ కూడిలుమ్ నీఙ్గిలుమ్ యామ్ మెలిదుమ్" - 16 పా.** భాగవతోత్తములతో కలసియున్నను ఎడబాసినను మేము బాధపడుచున్నాము- అనుట భాగవతులతో కలసియున్న కల్పం గడియ కాలంవలె, వారిని విశ్లేషించిన సమయం కల్పంవలె ఆళ్వార్లకు బాధాకరం అగుచున్నవట. **"అవిదిత గతయామా రాత్రిరేవ వ్యరంసీత్"**- రాత్రి అంతయును యామాలు కూడ తెలియనట్లు గడచిపోయినది- (భవభూతి మహాకవి.) **"అహోభిః హిమాగమేపి అతిప్రసీదే తపర్తుపూర్తావపి మేదసాంభరాః, విభావరీభిః బిభరాంబభూవిరే" (భట్టహర్షుడు)** - అనగా, శీతకాలంలో పగళ్ళు పెరిగాయి. వేసవికాలంలో రాత్రిళ్ళు పెరిగాయి. కాముకులకు కలిగే భావనలు ఇవి. కాని, భగవత్ సంశ్లేశవిశ్లేషాలలో గల సుఖదుఃఖాలను - తత్రాపి - తద్భక్తుల సంశ్లేషవిశ్లేషాలలో కల్గునట్టి భావాల్ని మనోహరంగా అనుభవించు తీరు ఆళ్వార్లకే సొంతం. చివరగా **"ఋచః సామరసః"** అన్నట్లు ఇందలి ఒక్కొక్క పాశురం- **"అమర్శువై ఆయిరమ్"** అనే రీతిలో సామవేద సారమైన తిరువాయ్మొళ్ళిలోని దశకాలుగా పరిణమించి ఆనందావహములగు చున్నవి- అనుట నాయనార్ (ఆచార్యహృదయకారుల) సరసనిర్వాహం.

ఇంతటి వైభవం గల తిరువిరుత్తదివ్యప్రబంధములోని విశేషాల్ని నంబిళ్ళై గారి ఈడు వ్యాఖ్యానం, పూర్వాచార్యులు కృపజేసిన **"స్వాపదేశ ఉరై"** మొ॥నవి వివరించుచున్నవి. ఒక్కొక్క పాశురంలోని విశేషాలు అమృతోపమానములు. వ్యాఖ్యలలో పలు ఐతిహ్యాలుకూడ కూర్చబడినవి.

ఇంతటి వైభవంగల దివ్యప్రబన్ధ విశేషాల్ని వివరించుట **"నిర్మాణే యది మార్మికోఽసి"** అనే రీతిలో వ్యాఖ్యారచనకు తగిన ప్రజ్ఞాపాటవాలు, సూక్ష్మపరిశీలన దృష్టి, రచనానైపుణ్యం, మీదు మిక్కిలి కవితామర్మములు తెలియుట మొ॥ పుష్కల సామగ్రి కలవారికే సాధ్యం. **"పండితరత్న"** ఇత్యాది బిరుదాంచితులైన డా॥ ఉ.వే. శ్రీమాన్ శింగరాచార్యస్వామివారు పైన పేర్కొనిన సామర్థ్యం గలవారు. గ్రంథము

లోని విశేషాల్ని పాఠకులకు అందించాలి - అనే భావనతో శ్రీమాన్ స్వామివారు ఈ దివ్యప్రబంధపాశురాలకు ప్రతిపదార్థ తాత్పర్యాల్ని, విశేషాల్ని నాతివిస్తర సంగ్రహరూపంలో కూర్చియున్నారు. ముందుగా వివరణాత్మకమైన అవతారికను గూర్చియున్నారు. పూర్వాచార్య వ్యాఖ్యావిశేషాలు ఇందు సర్వత్ర గోచరించును. ఆస్తికలోకమంతయు వీరి కృషిఫలితాన్ని అనుభవించవలెనని ప్రార్థన.

ఈ గ్రంథముద్రణమునకు తమ పవిత్రద్రవ్యమును సమర్పించి సహకరించిన వారు ఉ.వే.శ్రీమాన్ **తిరుమల పెద్దింటి వేంకటరమణ స్వామివారు (వేంకటతిరుమలాచార్యులుగారు). "గోపాలో యాదవం వంశమ్"** అనే రీతిలో వీరు సంప్రదాయ నిష్ఠాగరిష్ఠమైన జన్మనిచ్చిన వంశానికి, దత్తత (స్వీకారం) అనుగ్రహించిన వంశానికి ప్రదీపకులై, సంప్రదాయ సేవలో జీవితాన్ని గడిపే ధన్యతములు. వీరు తమ తల్లిదండ్రుల జ్ఞాపకార్థం ఈ గ్రంథమును ప్రకాశింపజేయుట ముదావహం.

అస్మదారాధ్యదైవమైన స్వామి ఎంబెరుమానార్లు వీరికి, వీరి కుటుంబానికి సర్వశ్రేయస్సులను, సర్వాంగీణమైన కుశలాన్ని ప్రసాదింప వలసినదిగా శ్రీస్వామివారి సన్నిధిలో ప్రార్థించుచున్నాను.

**సంతు శ్రేయాంసి భూయాంసి**

ఇట్లు

నరసాపురం భాగవత వశంవదుడు

21-2-16 **కే. వేంకటాచార్యదాసుడు**

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి, పండితరత్న
**ఉ.వే.శ్రీమాన్ డా॥ ఎస్.వి. రంగరామానుజాచార్య స్వామివారు**
డైరెక్టర్, జీవా, శ్రీరామనగర్
హైదరాబాద్



# ఆళ్వారుల దివ్యశృంగారానుభవం

వాస్తవానికి రసశబ్దంచేత చెప్పబడేవాడు పరమాత్మ. **"రసో వై సః" "రసహ్యే వాయం లబ్ధ్వానందీ భవతి"** అన్న శృతివచనాన్నిబట్టి పరమాత్మయే రసస్వరూపుడు. రసాస్వాదనంవల్ల కలిగే ఆనందం నిజంగా భగవద్విషయ రసానుభవంవల్లనే కలుగుతుంది. శృంగారం అనేది ఇరువురు స్త్రీ పురుషులమధ్యగల ప్రేమానుబంధాన్ని పురస్కరించుకుని ఏర్పడే అనుభవం. రసానుభవం అలౌకికం అని అలంకార శాస్త్రకారులన్నప్పటికీ, ఆలంకారిక సిద్ధాన్తంగా దాన్ని స్వీకరించినప్పటికీ, పరమార్థ దృష్టితో చూచినపుడు ఆలంకారికులు నిరూపించిన రసానుభవ ప్రక్రియ అంతా లౌకికమే. లోకంలోని వ్యక్తులను ఆలంబనంగా చేసుకుని, నిరూపింపబడిందే ఆలంకారికుల రస ప్రక్రియ. వీరి దృష్టి కేవలం లౌకికమవ్వడంచేత లౌకికానుభవానికి మాత్రమే తావియ్యగలిగినదవ్వడంచేత యదార్థమైన అలౌకిక నిత్యరసానుభవాన్ని గురించి వీరి విచారణలు సాగలేదు. ఆలంకారికులు నిరూపించిన రసానుభవం విషయపరిచ్ఛిన్నం, కాలపరిచ్ఛిన్నం. వీతరాగులైనవారికి ఈలౌకికరసం అనుభావ్యం కాదు కనుక, ఆలంకారికులు నిరూపించిన రసానుభవాన్ని సార్వజనీనం, సార్వకాలికం అనలేము. లోకంలో ఆయా కవులు రచించిన కావ్యనాటకాది సారస్వతాన్ని పర్యాలోచన చేసేవారికి మాత్రమే ఆయా సమయాల్లో, అంటే, కావ్యనాటకాల్లో వర్ణింపబడిన సన్నివేశాలను అనుచింతనం చేసినపుడు మాత్రమే ఈ రసానుభవం కలుగుతుంది. ఇది నిత్యంగా నిలబడేది కాదు. కనుక, వాస్తవంగా అలౌకికం అని అనలేము.

ఆయా కాలాలలో పురాణేతిహాసాల్లోనూ, లోకంలోనూ ఉండిన వ్యక్తులను వారిలోని మనోభావాలను ఆశ్రయించి, నిరూపింపబడిన ఈ శృంగారాది రసప్రక్రియకంటే పరమవిలక్షణమైనది, భగవద్విషయక రసానుభవ ప్రక్రియ. మిగతా రసాల సంగతి అలా ఉంచి, ముఖ్యంగా శృంగారాన్ని గురించి మాట్లాడినపుడు,

లౌకికకామం లోకసిద్ధమైన రసానుభవానికి నిమిత్తంకాగా, దివ్యకామం, అంటే, భగవద్విషయక కామం అలౌకిక శృంగారక రసానుభవానికి నిమిత్తం అవుతుంది. వాస్తవానికి కామం దివ్యమైనపుడే పురుషార్థంతప్ప, లౌకికమైనప్పుడు అది పురుషార్థం కాదు. భాగవతాదుల్లో గోపికాదులయందు కృష్ణాద్యాలంబనంగా నిరూపింపబడిన దివ్యకామం పరమపురుషార్థమై రసానుభవ దృష్ట్యా దివ్యరసానుభవం అవుతున్నది. కనుక వాస్తవానికి ఇదే అలౌకిక రసానుభవం. అంటే, లోకాతీతం అన్నమాట. ఇది సర్వులకు అనుభవసిద్ధం కాదు.

శ్రీవైష్ణవ సంప్రదాయంలో ప్రసిద్ధి చెందిన ఆళ్వార్లు ఈదివ్య రసానుభవాన్ని, విశేషించి, దివ్యశృంగార రసానుభవాన్ని తాము పొందటమేకాక, తాము ఆవిష్కరించిన సారస్వతం ద్వారా, లోకానికి కూడా అనుభవ సిద్ధం చేశారు. నమ్మాళ్వార్లు, తిరుమంగై ఆళ్వార్లు, గోదాదేవి మొదలైనవారి ప్రబంధాల్లో ఈ దివ్యశృంగారానుభవం గోచరం అవుతుంది. శృంగార రస నిరూపణ ప్రక్రియలో నిరూపింపబడే రససామగ్రి, అంటే, విభావ – అనుభావ– సంచారిభావాదికం, భగవద్విషయకమైనప్పుడు దివ్యశృంగారం అనుభవగోచరమవుతున్నది. భగవంతుడు ఆలంబనం కాగా, ఆయన చేసిన దివ్య చేష్టలు, లీలలు, వేష భాషాదులు, ఆయన దివ్యచరితం ఇవన్నీ ఉద్దీపకాలవుతాయి. ఈరసానికి ఆశ్రయమైనవారు భగవద్భక్తులు. వీరికి కలిగే భగవత్ దివ్యచేష్టాద్యనుభవ మూలంగా వీరికి కలిగే అశ్రుపాతాదులు, వీరి ప్రలాపాలు, ఆవిష్కరించే వివిధావస్థలు, చేష్టలు ఇవన్నీ అనుభావాలుగా ఏర్పడతాయి.

వీరి మనస్సుల్లో ఉద్బుద్ధమయ్యే భగవద్విషయక చింత, మోహం, స్మృతి, ధృతి, గ్లాని, శంకాది ముప్పైమూడు మనోభావాలు యథాసంభవంగా సంచారి భావాలుగా అనుభవగోచరమవుతాయి. ఆళ్వారులు నాయికా భావాన్ని పొంది, ఆవిష్కరించిన వారి ప్రబందాల్లోని సన్నివేశాలన్నీ, దివ్యకామం మూలమైన దివ్యశృంగార రసానుభవానికి అద్భుత నిదర్శనాలు. ఆళ్వార్లు నాయికాభావంతో పాటు నాయికామాతృ, నాయికాసఖీ భావాదులను పొందికూడా నాయికాత్వదశలో అనుభవించిన భగవద్విరహాది ప్రక్రియను ఆవిష్కరించి, ఈదివ్యకామాన్ని, లేదా, తన్మూలమైన దివ్య శృంగారాన్ని అనుభవగోచరం చేశారు.

ప్రపన్న జనకూటస్థులైన నమ్మాళ్వార్లు భగవత్ప్రసాదంవల్ల, అప్రయత్నలబ్ధమైన జ్ఞానవైరాగ్య భక్తులు కలిగి, వేదేతిహాసపురాణాదుల్లా కాక సర్వాధికారమైన

ద్రావిడభాషాబద్ధ దివ్యప్రబంధాలద్వారా సకలవేదవేదాంతరహస్యార్థాలను ఆవిష్కరిస్తూనే దివ్య శృంగారరసానుభవాన్ని కూడా లోకానికి అనుగ్రహించారు. నిరతిశయ వైలక్షణ్యం కల ఈఆళ్వార్లు ఋగాది నాల్గువేదాల్లా నాలుగు ప్రబంధాలను అనుగ్రహించారు.

తిరువిరుత్తం, తిరువాశిరియం, పెరియతిరువందాది, తిరువాయ్మొళి అనే నాలుగు ప్రబంధాల్లో ఋగ్వేద సారముగా చెప్పబడే తిరువిరుత్తం ఆళ్వార్ల దివ్యశృంగారానుభవాన్ని లెస్సగా ఆవిష్కరిస్తున్నది. ఆంతరంగా ఈ ప్రబంధంలో అజ్ఞానమూలమైన కర్మ, తన్మూలంగా ఏర్పడిన దేహాదికం, తన్మూలమైన సంసార సంబంధం – అనే వీటి నివృత్తినే (అంటే, తొలగిపోవడాన్నే) పరమోద్దేశ్యంగా ప్రకాశింపజేస్తూనే, భగవద్దివ్యకామానుభవం పట్ల ఉన్న ప్రావణ్యాతిశయంవల్ల ఏర్పడిన అనుభవ అభినివేశము, అనుభవం లభింపనందువల్ల కలిగిన ఆర్తి, అది అతిశయించిన విధానము, భగవదనుభవాన్ని స్మరింపజేసే ఆయా పదార్థాలు ఆర్తిని అతిశయింపజేసిన విధానము, ఆళ్వార్లకు కలిగిన ఆత్యతిశయాన్ని చూచి సహింపలేక వారికాశ్వాసం కలిగింపజేయాలని తల్లి, సఖీజనులు మొదలైనవారి ప్రవృత్తులు, వీరిని ఆశ్వాసింపచేయడానికి వారు చేసిన ప్రయత్నాలు, ఆర్తి అతిశయించి భగవత్ సంశ్లేషానికి ఆలస్యమై, దానివల్ల ఏర్పడిన మానసిక శైథిల్యం ఏర్పడిన విధానము, ఇలాంటి విషయాలన్నింటినీ ఈప్రబంధం చాలా అద్భుతంగా ఆవిష్కరించింది.

ఇక్కడ అధ్యాత్మరూపమైన అర్థాలను ప్రకాశింపజేయడానికి ఉద్దేశించిన ఈప్రబంధంలో నాయికా నాయక సంగమరూపమైన కామరాగ ప్రకారాన్ని వర్ణించడంలో ఔచిత్యం ఏమిటి? అని ప్రశ్నించి దీనికి వ్యాఖ్యాతలు సమాధానం చెప్పారు. కామం అనేది ఇతర లౌకిక విషయాలలో ఏర్పడితే అది అనర్థావహమై త్యజింపదగింది అవుతుంది. **"కామాత్ గోప్యః"** అని చెప్పబడినట్లు కృష్ణునిపట్ల గోపికలకు కలిగిన కామం దివ్యకామమై ఆత్మోజ్జీవకమైనట్లు పరమ పురుషార్థంగా భగవద్విషయక దివ్యకామాన్ని పరిగ్రహించి దాన్నే ఆత్మోజ్జీవకంగా ఆవిష్కరించారు, ఆళ్వార్లు. కనుక ఇందులో అనౌచిత్యం ఎంతమాత్రం లేదు.

అంతేకాదు **"స్త్రీ ప్రాయం ఇతరత్సర్వం"** అన్నట్లుగా పరమపురుషుడు ఒక్కడే పురుషుడై మిగిలిన జీవకోటి అంతా స్త్రీ స్వభావం కలదే అయినప్పుడు, సాంప్రదాయికంగా పెద్దలు నిరూపించిన అనన్యార్హశేషత్వము, అనన్యభోగ్యత్వము,

అనన్య నిర్వాహ్యత్వము తత్సంశ్లేషైక సుఖిత్వము, తద్విశ్లేషైక దుఃఖిత్వము – అనే ఐదు స్త్రీత్వలక్షణాలు ప్రతిజీవునియందు సహజంగానే ఉంటాయి కనుక, తమకు స్త్రీత్వలక్షణం స్వరూపసిద్ధమై, తమయందు ఆళ్వారులు నాయికాభావాన్ని అధ్యారోపణం చేసికొని భగవత్ సంశ్లేష సుఖ – భగవద్విశ్లేష దుఃఖాలను నాయికవలె ఆవిష్కరించడంలో అనౌచిత్యం ఎంతమాత్రమూ లేదని వ్యాఖ్యాతలు నిర్వహించారు. స్వామి అజగియ మణవాళజీయర్ తమ స్వాపదేశ వురైలో దీన్ని సమర్థిస్తూ రెండు శ్లోకాలు ప్రమాణంగా ఉట్టంకించారు.

**"స ఏవ వసుదేవోసౌ సాక్షాత్ పురుష ఉచ్యతే ।**
**స్త్రీప్రాయమితరత్సర్వం జగద్బ్రహ్మ పురస్సరమ్ ॥**
**స్వామిత్వాత్మత్వశేషిత్వ పుంస్త్వాద్యాః స్వామినోగుణాః ।**
**స్వే భ్యోదాసత్వదేహత్వ శేషత్వ స్త్రీత్వదాయినః ॥**

స్వామియైన పరమాత్మయందు ఆత్మత్వం, శేషిత్వం, పుస్త్వం మొదలైన గుణాలు ఉన్నాయి. ఈగుణాలే జీవులకు దాసత్వాన్ని, దేహత్వాన్ని, శేషత్వాన్ని, స్రీత్వాన్ని అనుగ్రహిస్తున్నాయి. కనుక స్వామికి చెందిన గుణాలను అనుసంధానం చేసేటప్పుడు **"స్వం"** అయిన తనకు స్వామి సంబంధాన్నిబట్టి ఏర్పడిన స్వభావాలు, అంటే, స్త్రీత్వాదులు సహజంగానే తోస్తాయికదా! అలాగే స్వామియందుగల పురుషోత్తమత్వాన్ని అనుసంధించినప్పుడు ఇతర జీవకోటికి తమయందున్న స్త్రీత్వాన్ని అనుసంధించడం తప్పనిసరి అవుతుంది.

కనుక ఆళ్వారులు స్వామి గుణాలను అనుసంధించి, తమయందు స్వారసికంగా సిద్ధించిన స్త్రీత్వాన్ని భావించి నాయికగా సంశ్లేషమూలమైన సుఖాన్ని, విశ్లేషమూలమైన దుఃఖాన్ని అనుభవించడం, ఆ దుఃఖాన్ని వివిధ దశలలో ఆవిష్కరించడం, ఇలా ఆవిష్కరిస్తున్న నాయికను చూచి నాయికకు చెందిన తల్లి, తోటి సఖురాండ్రు ఆమెను ఆశ్వాసించడానికి వివిధ ప్రయత్నాలు చేయడం నాయిక వివిధ దూతలను పంపడం ఇవన్నీ లౌకిక శృంగార ప్రక్రియలో ఉన్నట్లే, అలౌకిక భగవద్విషయక దివ్యకామంలోనూ తన్మూల దివ్యశృంగారానుభవంలోనూ తప్పక ఉంటాయి.

కనుకనే, ఆళ్వారులు నాయికాభావనలో నాయకుని విరహాన్ని భరించలేక నాయకుడు చేస్తున్న విలంబానికి తట్టుకోలేక మడలెక్కడం అనే ఒక ప్రక్రియ ఉదయనాదుల విషయంలో వాసవదత్తాదులు చేసినట్లుగా భగవద్విషయకంగా కూడా

తాము మదలెక్కుతున్నట్లు ఆళ్వార్లు తమ దివ్యప్రబంధాల్లో ఆవిష్కరించారు. అంటే, లౌకిక ప్రక్రియలో నాయికా నాయకుల మధ్య ఉండే వివిధ వ్యవహారాలు, లౌకిక కామం కాగా, ఇవన్నీ భగవద్విషయకామంలో దివ్యకామాంగంగా వర్ణించడం కూడా మనం విశేషంగా గమనించవచ్చు. నాయికా భావాన్ని అనుభవించిన ఆళ్వార్లందరూ తమ దివ్యప్రబంధాలు అన్నింటిలోనూ ఇలాంటి సందర్భంలో ఈదశలన్నింటినీ వర్ణించారు.

తిరువాయ్‌మొళిలోనూ, తిరుమంగై ఆళ్వార్ల పెరియ తిరుమొళి లోనూ, గోదాదేవి అనుగ్రహించిన నాచ్చియార్ తిరుమొళిలోనూ ఈ అవస్థలు, భావాలు మనకు గోచరిస్తాయి. అయితే తమయందు నాయికాత్వాన్ని అధ్యారోపణంచేసుకొన్న ఇతర ఆళ్వారులకు, సహజ స్త్రీత్వ ధర్మంకల గోదాదేవికి అనుభవ ఆవిష్కరణాల్లో కొంత తేడా ఉండవచ్చు కానీ, వాస్తవానికి అలాంటి భేదంకూడా మనకు గోచరించదు. ఇలాంటి వర్ణనం అంతా మధుర శృంగార రసంగా వైష్ణవాలంకారికులచే తరువాతి కాలంలో నిరూపింపబడింది.

ఇక్కడ వ్యాఖ్యాతల అద్భుత సమన్వయం అసలు రసానుభవ ప్రక్రియను ఆశ్రయించడంలో ఆలంకారికులు ఏ ప్రయోజనాన్ని ఆశించారో, అదే ప్రయోజనాన్ని ఇక్కడ కూడా చెప్పుకొనవలసి ఉంటుందని నిరూపించారు. సుకుమారమతులై, విషయాసక్తి కలిగి, సదుపదేశంపట్ల విముఖులైన భోగపరాయణులగు రాజకుమారాదు లను సదుపదేశ ఉన్ముఖులను కావించడానికి, రసప్రధాన నాట్యాదిప్రక్రియ ఆశ్రయింపబడింది. భరతాదులచేత. మహాకవులు దీన్నే సదుపదేశ సాధనంగా స్వీకరించారు.

**స్వాదు కావ్యరసోన్మిశ్రం శాస్త్రమప్యుపభుంజతే ।**
**ప్రథమాలీఢమధవః పిబన్తి కటు భైషజమ్ ॥**

హృద్యమైన కావ్యరసంతో మిశ్రితమైన సదుపదేశాత్మక శాస్త్రార్థాన్ని సుకుమారమతులు అనాయాసంగా స్వీకరిస్తారు. మొదటిగా తియ్యని తేనెను ఆస్వాదించినవారు, కటుకమైన ఔషధాన్నికూడా స్వీకరిస్తారుకదా! అంటే కటుకౌషధ పానానికి ప్రవృత్తిని కలిగించేలా, తేనె త్రాగించినట్లు వేదాంతసిద్ధమైన భగవద్విషయక తాత్త్వికానుభవంపట్ల ఉన్ముఖత కలిగేలా నాయికా నాయక భావాది ముఖంగా, కామానుభవాన్ని వర్ణించి, దివ్యకామ మూలమైన శృంగార రస నిరూపణ మాధ్యమంలో పరమపురుషార్థలాభాన్నే

కలిగించడానికి ఆళ్వార్లు ఉద్యమించారని వ్యాఖ్యాతలు అద్భుతంగా ఆళ్వార్ల హృదయాన్ని ఆవిష్కరించారు.

వాస్తవానికి భక్తి పరాకాష్ఠాదశయే ఈ దివ్యకామదశ. నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళి లోని వివిధ భక్తి దశలను వర్ణించే క్రమంలో ఆచార్య హృదయకారులైన వాదికేసరి **అళిగియ మణవాళప్పెరుమాళ్ నాయనార్లు** ఒక సూత్రాన్ని ఈక్రింది విధంగా అనుగ్రహించారు.

**మలర్‌మిశై ఎళుగిర జ్ఞానత్తై కాతల్, అన్బు, వేట్కై, అవా వెన్నుం సంగకామ అనురాగ స్నేహోద్యవస్థానామ్ నామజ్గల్‌డే, పరమభక్తి దశైయాక్కుగై"**

వికసించి పైపైని వృద్ధి పొందునట్టి జ్ఞానాన్ని క్రమంగా **కాతల్, అన్బు, వేట్కై, అవా** అనబడే **సంగము, కామము, అనురాగము, స్నేహము** మొదలైన అవస్థానామాలు కలిగిన పరమభక్తి దశకు కొనిపోవడం". ఆళ్వార్లు తమ ప్రబంధాల్లో ఈ పదాలను, అంటే, **కాతల్, అన్బు** మొదలైన పదాలను విశేషంగా ప్రయోగించారు. వీటికే క్రమంగా **కాతల్** అనేది సంగమని, **అన్బు** అనేది కామమని, **వేట్కై** అనేది అనురాగమని, **అవా** అనేది స్నేహమని వివరించడం జరిగింది.

ఏదైనా ఒక విషయాన్ని సాక్షాత్కరించేటప్పుడు మొట్టమొదటగా స్నేహం అంకురించే దశ సంగం అంటారు. లౌకికంగా చూచినపుడు, భగవద్గీతలో స్వామి ఇలా అన్నాడు. **"ధ్యాయతో విషయాన్ పుంసః సంగ స్తేషూపజాయతే"** విషయ ధ్యానంవల్ల మొట్టమొదటగా మనస్సు విషయంతో ఏర్పడే సంపర్కమే సంగము అంటారు. ఈసంగం మూలంగానే ఆవిషయంపట్ల ప్రీతి లేదా ఇచ్ఛ కలుగుతుంది. దీనినే **సంగాత్ సంజాయతే కామః** అని అన్నాడు స్వామి. ఈ కామంఅనేది ఉత్కటమైన విషయానుభవేచ్ఛ. అంటే, విషయాన్ని అనుభవిస్తేనే తప్ప కుదుటపడలేని మానసిక స్థితి. ఈదశలో దీనికి ప్రతిబంధం ఏదైనా కలిగితే కామ ప్రతిరోధం కలిగి, అది క్రోధానికి, బుద్ధినాశ పురస్సరంగా ఆత్మ వినాశనానికి, కారణమౌతుందంటాడు స్వామి శ్రీగీతలో. ఇది లౌకిక వస్తువుల విషయంలో ఇలా జరుగుతుంది. కానీ, భగవద్విష యంలో కలిగే ఈకామం తరువాత దశయైన అనురాగస్థితిని పొందుతుంది.

కామమూలంగా అనుభవింపబడే వస్తువుపట్ల ఎడతెగకుండా ఉండే ప్రేమభావన అనురాగం. అటుతరువాత స్నేహం మొదలైన అవస్థలు వస్తాయి. అంటే, భగవద్రూప విషయానుభవం లేనిదే దాన్ని విడచి ఉండజాలని విధంగా ప్రీతి వృద్ధిపొందడం

అన్నమాట. ఈదశలన్నింటినీ కలిపి భగవద్విషయకంగా దీన్ని పరభక్తిదశ అన్నారు. అంటే భగవంతుని స్వరూప రూప గుణ వైభవాలను విని మనస్సు పరమాత్మ స్వరూపంపట్ల లగ్నమైతే, అది సంగం. దాన్ని పొందాలని ఉత్కటమైన ఇచ్ఛ కలిగితే అది కామం, భగవత్స్వరూపాన్ని అనుభవిస్తేనే తప్ప నిలచి ఉండలేని అతిశయితప్రీతి కలిగితే అది అనురాగం, ఆ అనూరాగ దశలో ఒక్కక్షణంకూడా విడిచి ఉండలేక నిరంతరం దానియందే పరిపూర్ణ ప్రీతిని ఉంచితే అది స్నేహం. ఇలాంటి దశలు భగవంతుని పట్లగల పరమభక్తిదశలో ఉంటాయని **అజగియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ల** సూత్రం వివరిస్తున్నది. దీనిని **విశదవాక్ శిఖామణియైన స్వామి మణవాళ మహామునులు** తమ వ్యాఖ్యానంలో విస్పష్టంగా వివరించారు. ఆవివరణంలోని ఈక్రిందివాక్యాన్ని గమనించుదాం. ఇవి ఉత్తరోత్తరావస్థలు, అంటే, ఒకదాని తరువాత ఒకటి కలిగేవి అన్నమాట.

**ఆక, ఇత్తాల్ శొల్లిత్తాయ్త్తు, మయర్వఱ మతినలంమరులుగైయావతు - అజ్ఞానభి దైయాకశాస్త్రసిద్ధమాన అనుదయాది చతుర్విధ సంకోచావస్థైయు మత్తు వికసితమాయ్, కొళున్దువిట్టు విషయోన్ముఖమాయ్ క్కిళరుకిఱ జ్ఞానత్తై, స్నేహప్రథమాఙ్కురమానసఙ్గమ్ ముతలానతు ఉత్తరోత్తర విపాకరూపావస్థైకళుక్కు అనురూపమాన కాతలిత్యాదినామఙ్గళై భజిత్తు, ప్రేమసీమాభూమియాన పరమభక్తి దశాపన్న మామ్పడి పణ్ణుకై, యెన్గతాయ్త్తు.**

దీని ఫలితార్థమేమంటే - ప్రమాదములేని జ్ఞానానందమును కృపజేయుట యనగా, అజ్ఞానమును పోగొట్టునదిగా శాస్త్రసిద్ధమైనట్టియు, అనుదయాది చతుర్విధసంకోచములును లేనిదై విషయోన్ముఖమైనదియై వృద్ధిపొందునట్టి జ్ఞానమును, స్నేహముయొక్క ప్రథమాంకురమగు సంగమము మొదలగు ఉత్తరోత్తర విపాకరూపావస్థలకు అనురూపములగు **"కాతల్"** ఇత్యాది నామములను పొందినదై, ప్రేమముయొక్క సీమయగు పరమభక్తియొక్కస్థితిని పొందునట్లు చేయుటయని చెప్పబడినది. (శ్రీమాన్ కందాళై శేషాచార్యులవారి అనువాదము 1927).

ఆళ్వార్ల దివ్యప్రబంధంలో ఈ అవస్థలు కొంత ముందు వెనుకలుగా వర్ణింపబడ్డాయి. ముఖ్యంగా తిరువిరుత్త ప్రబంధంలో ఆళ్వార్లు తమ స్త్రీత్వభావాన్ని ఆవిష్కరించిన క్రమంలో నాయికగా పలికే మాటల్లోనూ, సఖివచనాల్లోనూ పెంపుడుతల్లి, కన్నతల్లి పలికే మాటల్లోనూ, నాయికి తాను బాధపడుతూ, లేదా, ఆనందిస్తూ పలికే పాశురాల్లోనూ, సఖి, పెంపుడు తల్లి, విచారిస్తూ పలికే పాశురాల్లోనూ, నాయికా నాయకుల పరస్పర సంభాషణల్లోనూ, ఆయా వస్తువులను చూచి

నాయిక అనుభవించే బాధలోనూ, ధనార్జనాది వ్యాజంగా నాయకుడు దూరదేశానికి వెళ్లినపుడు తోటి సఖులందరితో కలిసి నాయిక పడుతున్న విశ్లేషాన్ని వర్ణించిన క్రమంలోనూ, చీకటి, వర్షాకాలం మొదలైన వాటినిచూచి నాయిక తన అసహనాన్ని ప్రకటించిన దశలోనూ నాయక విరహంతో రాత్రిసమయాన్ని గడపలేక పలికిన పలుకుల్లోనూ, సముద్రఘోషను విని తాళలేక హంసలను నిందిస్తూ నాయకి పలికిన పలుకుల్లోనూ ఇలా దివ్యకామానికి సంబంధించిన అవస్థలను ఆవిష్కరించే సన్నివేశాలను మనం గమనింపవచ్చు.

అలంకారశాస్త్రంలో **"చక్షుస్సంగో మనఃప్రీతిః సంకల్ప శ్చాథ జాగరః"** ఇత్యాదిగా ఇవే విషయాలు లౌకిక దృష్టితో నిరూపింపబడ్డాయి. వీటిని భగవద్విషయకంగా అన్వయించినపుడు అది దివ్యకామం అవుతుంది. వైష్ణవ అలంకారశాస్త్ర గ్రంథాలలో, ముఖ్యంగా, గౌడీయ సంప్రదాయంలో వెలసిన భక్తిరసామృతసింధువు, ఉజ్జ్వల నీలమణి మొదలైన గ్రంథాలలో నిరూపింపబడిన భక్తిరస విభాగప్రక్రియ ఆళ్వార్ల శ్రీసూక్తులలో అన్వయిస్తుంది. భగవంతునితో ఏర్పరచుకునే వివిధ సంబంధాలనుబట్టి భక్తిరసం ఐదు రకాలుగా నిరూపింపబడింది.

**1. శాంతభక్తిరసం 2. ప్రీతభక్తిరసం 3. ప్రేయోభక్తిరసం 4. వత్సలభక్తిరసం 5. మధురభక్తిరసం.**

**ఆత్మోచితైః విభావాద్యైః పుష్టిం నీతా సతాం హృది ।**
**మధురాఖ్యో భవేద్భక్తిరసోऽసౌ మధురా రతిః ॥**

శ్రీకృష్ణవిషయక కాంతరతిద్వారా స్పృశింపబడిన చిత్తవృత్తులు గల భక్తజనుల హృదయాల్లో మధురరతి అనే స్థాయిభావం (ఇది కృష్ణవిషయక ప్రేమ) విభావాది సామగ్రిచే పుష్టిచెంది మధురరసం అవుతుంది. ఈమధుర రసానికి శ్రీకృష్ణుడు, వ్రజగోపికలైన ప్రియురాండ్రు ఆలంబనాలుగా చెప్పబడ్డారు. అసమానమైన సౌందర్య లీలా వైదగ్ధ్యసంపదలకు ఆశ్రయరూపుడైన శ్రీకృష్ణుడు ఆలంబనంగా గోపికల హృదయాల్లో ఆవిర్భవించిన మధురరతి మధురరసమై సహృదయ భక్తజనులకు అనుభవ గోచరం అవుతుంది. ఈ ఐదుకాక కృష్ణాలంబనాలైన ఏడురకాల గౌణభక్తిరసాలుకూడా వర్ణింపబడ్డాయి. **హాస్యభక్తిరసం, అద్భుత భక్తిరసం, వీర భక్తిరసం, కరుణ భక్తిరసం, రౌద్ర భక్తిరసం, భయానక భక్తిరసం, భీభత్స భక్తిరసం** ఇలా గౌణభక్తిరసాలు నిరూపింపబడ్డాయి. ఆళ్వారుల శ్రీసూక్తులలో వీటన్నింటినీ మనం దర్శించవచ్చు.

శ్రీవైష్ణవసంప్రదాయ గ్రంథాలలో ఎక్కడా భక్తిని రసంగా నిరూపించిన ప్రక్రియ కనిపించదు. కానీ, వాస్తవానికి వ్రజాంగనలకు, గోపకులకు, యశోదా నందగోపులకు, కంసాదులకు ఇలా కృష్ణసంబంధం కలిగిన పలువురు వ్యక్తులకు కలిగిన మనోభావాలను ఆలంబనంగా చేసికొని వాటికి కలిగిన రససామగ్రి పరిపుష్టినిబట్టి రసాలుగా భాగవతాదుల్లోని శ్లోకాల్లో నిరూపింపబడి ఉన్నట్లు వైష్ణవ అలంకార శాస్త్రకారులు సోదాహరణంగా నిరూపించారు. ఆళ్వారుల శ్రీసూక్తులలో కూడా ఈప్రక్రియను అన్వయించి నిరూపించవచ్చు. ఇది ఒక ప్రత్యేకమైన విషయం. ఈవిషయంలో విశేషమైన విచారణ, నిరూపణ చేయవలసి ఉంది. ఆళ్వారుల ప్రబంధాలలో మధుర భక్తిరస ప్రక్రియ గోచరించినా, దాన్ని సలక్షణంగా నిరూపించడం ఇంతవరకూ జరగలేదు.

తిరువిరుత్తంలో విశేషించి మధురభక్తి నిరూపణ ప్రక్రియకు కావలసిన విభావ, అనుభావ, సాత్త్విక, సంచారి భావాలకు ఎన్నో ఉదాహరణలు లభిస్తాయి. ఇలాగే ఆళ్వార్ల దివ్యప్రబంధాల్లో ఎక్కడెక్కడ నాయికా భావన నిరూపింపబడిందో, ఆయా స్థలాల్లో మధురభక్తిరసరూపమైన, దివ్యకామమూలమైన దివ్యశృంగారాన్ని మనం అనుభవించ వచ్చు. సంగకాలపు ద్రావిడసారస్వతలో, ఈప్రణయ నిరూపణ ప్రక్రియ విశేషంగా సాగినట్లు ఆనాటి సారస్వతం నిరూపిస్తుందని ద్రవిడవాఙ్మయ చరిత్రకారులు చెప్పారు. శైవసంప్రదాయానికి చెందిన సంగకాలపు సారస్వతంలోకూడా ఇలాంటి మధురభక్తి ప్రక్రియ ఉందని చరిత్రకారుల నిరూపణం. అలాంటి విచారణ చేయడానికి వీలుగా తిరువిరుత్తప్రబంధంలోని విశేషాలను తెలుగుభాషలో విశదమనోజ్ఞంగా అందిస్తున్న **పండితరత్న శ్రీమాన్ సింగరాచార్యస్వామివారి** బహూముఖీనకృషి సర్వధా ప్రశంసనీయం.

ఈప్రబంధాన్ని లోకానికందించే ప్రయత్నం చేస్తున్న **శ్రీమాన్ తిరుమల పెద్దింటి వేంకటరమణ**గారి కుటుంబం సర్వధా ధన్యమని కృతజ్ఞతా పురస్సరంగా సంభావిస్తున్నాను. ఈనాలుగు మాటలు రాయమని కోరిన శ్రీమాన్ సింగరాచార్య స్వామివారికి సర్వధా కృతజ్ఞతలు ఆవిష్కరిస్తున్నాను.

**ఇట్లు**

**భగవత్ భాగవత విధేయుడు**

**సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు**

భాగవతామృతవర్షి, మధురవాక్శిఖామణి,
శ్రీసింహాద్రిగోదాస్తోత్ర రత్నధ్వని
**ఉ.వే. సాతులూరి గోపాలకృష్ణమాచార్యస్వామివారు**
హవల్దార్ (రిటైర్డ్) సింహాచల దేవస్థానము
"సామ్యకుటి" 15-7,ప్రహ్లాదపురం,(విశాఖ)-530027



శ్రీమతే రామానుజాయ నమః

## ఆనంద ప్రకటనము

సంసారి చేతనుల నుజ్జీవింప తలంచిన భగవానుని దివ్యానుగ్రహఫలమే ఈ లోకమున ఆళ్వార్ల ఆవిర్భావము. విశేషించి సర్వులు అర్థపఞ్చకమును కరతలామలకముగ తెలుసుకొనుటకు వీలుగా ఆవిర్భవించినవే ఆళ్వార్ల దివ్యప్రబంధములు. అందునా మిగిలిన ఆళ్వార్లనందరినీ అవయవ భూతులుగా కల్గిన శ్రీనమ్మాళ్వార్ అనుగ్రహించిన నాల్గు ప్రబంధములు నాల్గు వేదసదృశము లుగ పూర్వాచార్యులచే కీర్తింపబడినవి. అందు ఋగ్వేద సమముగ తిరువిరుత్తమ్, యజుర్వేద సమముగ తిరువాశిరియమ్,సామవేద సమముగ తిరువాయ్మొళి, అధర్వవేద సమముగ పెరియతిరువన్దాది అవతరించినవని పెద్దల నుడి.

ఈ ప్రబంధములు ఆళ్వార్లచే ఒక ప్రబంధమును రచించవలెనను ప్రణాళికతో రచింపబడినవి కావు. భగవానుడు తన దివ్యానుభవమును ప్రత్యక్ష దర్శన సమానాకారముగ ఆళ్వార్లకు మానసికముగ గోచరింపజేయగా, అట్లు భగవానుని సమగ్ర స్వరూపమును అనుభవించుట వలన కలిన ఆనందము లోపల ఇముడక వాగ్రూపముగ బయటకు జాలువారగా రూపుదిద్దుకొనినవే ఈ ప్రబంధములు. కనుకనే ఈ ప్రబంధములలోని పూర్వోత్తర సంగతిని **"అసఙ్గతిరేవ సఙ్గతిః"** అని ఎంబార్ అనుగ్రహించుట సంభవించినది.

ఇంతకు మూలము భగవానుని దివ్యసంకల్పమే కావున ఈ ప్రబంధము లకు శాస్త్రలక్షణాదులన్నియు సరిపోవుట సంభవించినది. బ్రహ్మ సంకల్పముతో వాల్మీకి నోట జాలువారిన శ్రీరామాయణము ఆదికావ్యము కాగా, పరమాత్మ దివ్య సంకల్పముతో ప్రభవించిన ఈ ప్రబంధములు సర్వలక్షణ సమన్వితము లగుటలో ఆశ్చర్యమేమున్నది. విశేషించి తిరువిరుత్తమ్ తొలుదొల్తగా నమ్మాళ్వార్ అనుగ్రహించిన ఋగ్వేద సమమైన ప్రబంధము. ఋగ్వేద మంత్రములెట్లు సామ

వేదముగ గానరూపముతో అమరినవో ఈ తిరువిరుత్త ప్రబంధము కూడ తిరువాయ్మొழி అను సామవేద సదృశమగు ప్రబంధముచే విస్తరింపబడినదనుట పెద్దల అభిప్రాయము.

తిరువిరుత్తమ్‌లోని **"పొయ్‌నిన్ఱ"** అను మొదటి పాశురము తిరువాయ్ మొழிలోని **"ఒழிవిల్ కాలమెల్లామ్"** అను తిరువాయ్మొழிగ, **"శెழுనీర్‌త్తడత్తు"** అని ఆరంభమగు రెండవ పాశురము - **"కోవైవాయాళ్ పొరుట్టు"** (4వ పత్తు, 3వ పా॥) అను తిరువాయ్మొழிగ, **"కుழுత్కోవలర్"** అని ఆరంభమగు మూడవ పాశురము **"వెళ్ళైచ్చురి శఙ్గొడు"** (ప-7, తి-3) అను తిరువాయ్మొழிగ, ఇట్లే, తిరువాయ్మొழி ప్రబంధంలో దశకములన్నియు తిరువిరుత్తమ్‌లోని పాశురములకు విస్తృతరూపములే అనియును పెద్దల అనుభవము. చిక్కని ప్రౌఢమైన ఈ తిరువిరుత్త ప్రబంధము సామాన్యులకు బోధపడుట దుర్లభమని యెంచియే అనేక మంది పూర్వాచార్యులు వ్యాఖ్యానములను వెలయించినారు.

ఆ తమిళవ్యాఖ్యానములుకూడ దుర్గ్రహములే యగుటచేత, ఆ వ్యాఖ్యానముల నన్నిటినీ తడవి రసఘనములగు మణిప్రవాళ వ్యాఖ్యానము ననుగ్రహించిన వారు కీర్తిమూర్తియగు **"మహామహోపాధ్యాయ" శ్రీ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారు.** ఆ తమిళ వ్యాఖ్యానము ఆంధ్రీకరించి తెలుగువారికి అందించుట ద్వారా మహోపకారమును చేసిన **"వ్యాఖ్యాన వాచస్పతి" ఉ.వే.ప్ర. శ్రీమాన్ ఈయుణ్ణి శింగరాచార్యస్వామివారు.** పూర్వాచార్యుల అనేక తమిళ గ్రంథములను తెలుగుభాషలోనికి అనువదించి, అందించుటను ఒక ఉద్యమముగ భావించి, నిరంతర కృషి సల్పుతున్న శ్రీస్వామివారికి ఆంధ్రదేశ మెంతయు ఋణపడియున్నది. కేవలము ఆవ్యాఖ్యానముల ఆంధ్రానువాదమే కాక ఆవశ్యకము లగు విషయముల నన్నిటినీ చేర్చి అందించు స్వామివారి కృషి అనన్యసామాన్య మైనది. ఈనాటికీ తమిళ గ్రంథముల కాలక్షేప వ్యవస్థ కనుమరుగై పోవుచున్నది. ఇట్టి సమయములో స్వామివారి గ్రంథములు జిజ్ఞాసువుల పిపాసను తీర్చుటలో కరదీపికలగుచున్నవి. కాగలవు అనుట నిశ్చప్రచము. ఈ అవకాశము నొసంగిన శ్రీమాన్ స్వామివారికి కృతజ్ఞతాభి వందనములతో....

శ్రీవైష్ణవదాసః

**సా॥ గోపాలకృష్ణమాచార్య**

# హార్దనివేదన



**"శేమమ్ కురుకైయో! శెయ్య తిరుప్పాఱ్కడలో?**
**నామమ్ పరాఙ్కుశనో? నారణనో! - తామమ్**
**తుళవో! వకుళమో? తోళిరణ్డో! నాన్గో!**
**ఉళవో పెరుమానుక్కు"**

(భగవానునకు నివాసం కురుకాపురియా? అందమైన క్షీరాబ్ధియా? పేరు పరాంకుశులనియా? లేక నారాయణుడనియా? ధరించే మాలిక తులసియా? వకుళమాలికయా? భుజాలు రెండా ? లేక, నాలుగా?)

ఇప్పటికి సుమారు అయిదారు సంవత్సరాలకు పూర్వం ఒక పర్యాయం విశాఖపట్టణంలోని శ్రీరామానుజపీఠంలో నేను **విజయనగరవాస్తవ్యులు, సహృదయ శిరోమణులు, ఉ.వే. శ్రీమాన్ తిరుమల పెద్దింటి వేంకటరమణ స్వామి** వారిని సేవించడం తటస్థించింది. అపుడు వారితో మాట్లాడే సమయంలో శ్రీమాన్ వేంకట రమణస్వామివారు "మీరు ఏదయినా ఒక ఆళ్వార్ల దివ్యప్రబంధానికి వ్యాఖ్యానాన్ని సిద్ధం చేయండి. దానిని నేను మా పెద్దల దివ్యస్మృతిగా ప్రకాశింపజేస్తాను, దాని ముద్రణకు తగిన ద్రవ్యాన్ని సమర్పిస్తాను" అని దాసుని ఆదేశించారు. అపుడు నేను "మీరే మీకభిమతమైన ప్రబంధాన్ని సూచించండి" అని అన్నాను. శ్రీమాన్ వేంకటరమణస్వామివారు వెంటనే "అయితే, నమ్మాళ్వార్ల తిరువిరుత్తానికి తెలుగులో వివరణాన్ని ప్రచురిద్దాం. దానికోసం ప్రయత్నించండి" అని అన్నారు. నేను కూడా మఱి ఏమీ ఆలోచించకుండా సరేనని అన్నాను.

ఆవిధంగా శ్రీమాన్ వేంకటరమణస్వామివారికి మాట ఇచ్చిన తరువాత ఆలోచిస్తే నాకు నిజంగా చాలా జంకు కల్గింది. నమ్మాళ్వార్ల ప్రబంధాలన్నిటిలో తిరువిరుత్తం చాలా ప్రౌఢప్రబంధంగా ప్రసిద్ధి చెందింది. మిగిలిన ప్రబంధాలవలె ఈ ప్రబంధం కాలక్షేపపరంపరలో ప్రచురంగా లేదుకూడా. నేను శ్రీస్వామివారికి ఇచ్చిన మాటను పూర్తి చేయగలనా! తొందరపడ్డానా! నా శక్తి సరిపోతుందా? అనే సందేహం కూడా ఒక దశలో కల్గింది. కాని, పెద్దలకిచ్చిన మాటను నెరవేర్చకపోవడం అపచారమే కాగలదని, యథాశక్తి వాచికకైంకర్యాన్ని భగవద్భాగవతాచార్యవిషయంగా చేసికొనే సదవకాశం కల్గిందని తలచి ధైర్యం చేసి వివరణాన్ని విన్నపించే ప్రయత్నం చేశాను. కాంచీమహావిద్వాన్ అణ్ణంగరాచార్యస్వామివారి దివ్యార్థదీపికవంటి

వ్యాఖ్యానాలు కూడా మార్గదర్శనం చేయగలవనే ధైర్యంకూడా కల్గింది. నిజానికి ప్రస్తుతం నేను విన్నపించిన తిరువిరుత్త ప్రబంధవివరణం శ్రీకాంచీస్వామివారి దివ్యార్థదీపికకు ఆంధ్రానువాదమే. అయితే, అందులో లేని **ఐతిహ్యాలు, వార్తలు మాత్రం ప్రస్తుతవివరణలో కూర్చబడ్డాయి.** దాసుని ఆంధ్రవివరణంలోని గుణ దోషాలను సహృదయపాఠకులు నిర్ణయించగలరు. నాకీ గొప్ప అవకాశాన్ని ఉదారమైన హృదయంతో కలుగచేసిన **శ్రీమాన్ వేంకటరమణస్వామివారి సన్నిధిలో** హార్దంగా కార్తజ్ఞ్యాన్ని ముందుగా నివేదించు కొంటూ, వారి ఆజ్ఞను పరిపాలించడంలో జరిగిన జాప్యానికి క్షమించమని వేడుతున్నాను.

నమ్మాళ్వార్ల ప్రబంధాలకు వేదాంతపరంగానే కాకుండా, ద్రావిడ సాహిత్యంలో కూడా అద్వితీయమైన స్థానం ఉన్నది. నమ్మాళ్వార్లు అనుగ్రహించిన **"కణ్ణన్ కళలిణై"** అనే దశకాన్ని స్వీకరించి, సంఘపలకం మిగిలిన సంఘకవులను తిరస్కరించినపుడు వారందఱు ఆళ్వార్ల ప్రబంధవైలక్షణ్యాన్ని గుర్తించి - **"ఈ యాడువదో కరుడక్కెదితే ఇరవిక్కెదిర్ మిన్మిని యాడువదో.. పెరుమాన్ వకుళాబరణన్ అరుళ్కూర్న్దు ఓవాదురైయాయిమా మఱైయిన్ ఒరు శొల్ పొఱుమో ఉలకిఱ్కవియే"** (గరుడుని ఎదురుగా ఈగ ఆడగలదా? సూర్యునికి ఎదురుగా మిణుగురు పూలు ప్రకాశించగలదా? వకుళాభరణులైన నమ్మాళ్వార్లు దయతో అనుగ్రహించిన, వేదంవంటి వేయి పాశురాలలో ఒక్క పాశురంతో అయినా లోకంలోని కవుల పాశురం సాటివస్తుందా?) ఇత్యాదిగా స్తుతించారు.

నమ్మాళ్వార్ల మహిమను, వారి దివ్యప్రబంధ వైలక్షణ్యాన్ని గూర్చి వినోదమంజరి - అనే గ్రంథంలో ప్రస్తావించబడిన అపూర్వ వృత్తాంతం ఒకటి ప్రస్తావనీయం. తిరువళ్ళువర్ **"కుఱళ్"** అనే గ్రంథాన్ని రచించినపుడు ఆయన, ఔవైయార్, ఇడైక్కాడర్ అనే ముగ్గురు కలవడం జరిగింది. తిరువళ్ళువర్‌ను చూచి మిగిలిన ఇద్దఱు "మీరు రచించిన గ్రంథం ఎటువంటి స్వభావాన్ని (వైలక్షణ్యాన్ని) కల్గినది?'' అని ప్రశ్నించారు. అపుడు వళ్ళువర్ "అగస్త్యునిచే ప్రసిద్ధిని పొందింప బడిన **ఇయల్, ఇశై, నాటకమ్** - మూడు ప్రకారాలతో కూడుకొన్న తమిళం, నాచే రచింపబడిన కుఱళ్ - అనే ఈరెండు ఉడైయనజ్గై కుమారులైన శఠకోపులు అనుగ్రహించిన తిరువాయ్‌మొళికి పుత్రస్థానమైన వళినూల్- (మార్గదర్శకగ్రంథం) అనే అర్థం వచ్చే **"కుఱుమునివన్ ముత్తమిళుం మెన్‌కుఱళుం నజ్గై శిఱుమునివన్**

**వాయ్‌మొ*ழ*ియిన్ శేయ్"** అనే పాశురాన్ని పలికారు. దీనిని విని ఔవైయార్ "అర్థపంచకాన్ని, చతుర్విధ పురుషార్థాలను త్రివర్గాలలో అంతర్భవింపజేసి, ప్రవర్తింప జేయబడిన, యథార్థమైన, ఏవిధమైన వేదాలకు అయినా సమ్మతమైన గొప్ప అర్థం - చల్లని తామ్రపర్ణీనదీతీరంలో ఉండే తిరుక్కురుకూర్‌లోని కారిముదలి యార్‌కు పుత్రులై అవతరించిన నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొ*ழ*ి అనే ద్రావిడమని కొందఱు అంటారు. నేను మాత్రం, వారి మాటను కాదని, ఈ కుఱళ్, ఈ లోకానికి తండ్రి అయిన శ్రీమన్నారాయణునిచే బ్రహ్మకు ఉపదేశింప బడిన సంస్కృతవేదమనే అంటాను- అనే అర్థాన్ని వ్యక్తం చేసే- **"ఐమ్బొరుళు నాఱ్పొరుళు ముప్పొరుళిల్ పెయ్‌దమైత్త శెమ్బొరుళై యెమ్మఱైక్కుమ్ శేట్పొరుళై త్తణ్ కురుకూర్ చ్చేయ్‌మొ*ழ*ి యదెన్బర్ శిలర్ ఇయానివ్వులకిన్ తాయ్‌మొ*ழ*ియదెన్బేన్ తకైన్దు"** అనే పాశురాన్ని పలికారు. ఇడైక్కాడర్ అపుడు ద్రావిడవేదమైన **"శేయ్‌మొ*ழ*ి"**ని, గీర్వాణవేదమైన తాయ్‌మొ*ழ*ిని పరిశీలించి పల్కినపుడు, రెండూ ఒకటే తిరువాయ్‌మొ*ழ*ిని అందఱు ఏ సందేహం లేకుండా వేదమనే అంటారు. తిరువాయ్‌మొ*ழ*ివలె గొప్ప గ్రంథాలు అనేకం ఉన్నాయి- అని కొందఱు దుర్వాదం చేసినా, నేను వారిని తిరస్కరించి, అవి, ఈ కుఱళ్, ఆ తిరువాయ్‌మొ*ழ*ి గ్రంథాలకు ఛాయారూపాలు- అనే అంటాను" అనే అర్థం స్ఫురించేటట్లు -

> **"శేయ్ మొ*ழ*ియో తాయ్‌మొ*ழ*ియో శెప్పిలిరణ్డుమెన్ఱ**
> **వ్వాయ్‌మొ*ழ*ియై యారు మఱైయెన్ప- వాయ్‌మొ*ழ*ిపోల్**
> **ఆయ్ మొ*ழ*ికళ్ శాల వుళమెనిను మమ్మొ*ழ*ియిన్**
> **శాయ్‌మొ*ழ*ి యెన్బేన్ యాన్ తకైన్దు"'** - అనే పాశురాన్ని చెప్పారు.

**"మాఱన్ పణిత్త తమి*ழ*్‌మఱై"** అని కీర్తింపబడినట్లుగా నమ్మాళ్వార్ల ప్రబంధాలు నాల్గు చతుర్వేదరూపాలు. **"వేదైశ్చ సర్వైరహ మేవ వేద్యః"** అనే గీతాచార్యసూక్తి ద్వారా తెలిసే "సర్వవేదప్రతిపాద్యుడు శ్రీమన్నారాయణుడే" అనే తత్త్వమే ఆళ్వార్ల ప్రబంధాలలోకూడా ప్రతిపాదింపబడినది. ఈ పరమగుహ్యాలైన వేదతత్త్వాలను ఆళ్వార్లు తమ ప్రబంధాలలో **"గుడజిహ్వికా"** న్యాయంలో లౌకికమైన ఆలంకారిక ప్రక్రియలతో మేళవించి మధురమైన రీతిలో వ్యక్తం చేశారు. అందువల్ల ఆళ్వార్ల ప్రబంధాలలో గోచరించే శృంగారపరమైన ప్రక్రియలన్నీ **"కణ్ణనుక్కే**

ఆమదు కామమ్" అనే రీతిలో భగవత్పరమైన "ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః" అని వేదవిహితమైన ఉత్తమోత్తమకామానికి చెందినవని తెలియాలి.

తిరువిరుత్తప్రబంధంలోని **"తుఱై"** (శృంగార ప్రక్రియ)లను, వానిని వ్యాఖ్యానించే పూర్వాచార్యసూక్తులను గమనించినపుడు కొన్ని విశేషాలు వ్యక్తమవుతాయి. **"వణ్డుకళో వమ్మిన్"** 55వ పాశురం **"నలమ్ పారాట్టుదల్"** అనే కిళవితుఱైలో అంతర్భవిస్తుంది. నాయకుడు, నాయకిపట్ల తనకు కలిగే ప్రేమను వ్యక్తం చేస్తూ, ఆమె గుణప్రకర్షను అన్యాపదేశంగా పొగడుతూ పలికే ప్రక్రియ ఇది. **"పిరిన్దాల్ వరుఅవైయుమ్ ఇవళ్ జీవిత్తిరుక్కైక్కాక, ఇప్పడి యిరుక్కిఱ ఇవన్ అకలాన్- ఎన్ఱ అవళ్ నెఞ్జిలే పడుకైక్కాక నలమ్ పారాట్టు- ఎన్ఱు ఒరు కిళవియాయ్, అవళై క్కొణ్డాడుకిఱాన్. కులే మహతి సంభూతే"- ఎన్ఱు పెరుమాళ్ కొణ్డాడినారిఱే"**- అని నమ్పిళ్ళై ఈప్రక్రియావిశేషాన్ని వివరించారు. ఈ వివరణం ద్వారా కొన్ని అంశాలు వ్యక్తమవుతున్నాయి. నాయకిని విశ్లేషించే (విశ్లేషించిన) నాయకుడు తాను తిరిగి వచ్చేవరకు నాయకి జీవించి ఉండడంకోసం, ఆమెకు తాను తిరిగి వస్తానని నమ్మకం కల్గడం కోసం ఆమె గుణకీర్తనాన్ని చేయడమే ఈ తుఱైస్వరూపం- అనేది ఒక అంశం. దీనిని శ్రీరామాయణంలో గమనించవచ్చు. అరణ్యానికి వెళ్ళే సమయంలో శ్రీరాముడు సీతాదేవి ఆభిజాత్యాదులను కీర్తిస్తూ **"కులే మహతి సంభూతే ధర్మజ్ఞే! ధర్మచారిణి!"** ఇత్యాదిగా పల్కడం ఈప్రక్రియలో అంతర్భవిస్తుంది అనేది ఇంకొక అంశం. ఈ శ్లోకాలకు గోవిందరాజీయ వ్యాఖ్యానకారులు- **"మహతః అప్రియస్య శ్రవణే సీతాయాః కిం భవిష్యతీతి భయాత్ చిత్తదార్ఢ్యార్థం వివిధగుణకీర్తనేన సంబోధయతి"** అని చేసిన వివరణం ఇక్కడ స్మరణీయం.

ఇపుడు ఇంకొక తుఱైస్వరూపాన్ని గమనిద్దాం. 26వ పాశురంలోని ప్రక్రియకు **"నకర్ కాట్టుదల్"** అనిపేరు. దుర్గమమార్గంద్వారా ప్రయాణం చేసేటపుడు నాయకుడు నాయకికి మార్గాయాసం తోచకుండా ఉండడం కోసం తన నగర వైభవాన్ని గూర్చి తెలియజేయడమే ఈ ప్రక్రియాస్వరూపం. ఈ ప్రక్రియను - **"ఏషా సా దృశ్యతేఽయోధ్యా రాజధానీ పితుర్మమ, అయోధ్యాం కురు వైదేహి ప్రణామం పునరాగతా"** (యుద్ధ-126-57) ఇత్యాది శ్రీరామాయణశ్లోకాలలో గమనించవచ్చు.

తిరువిరుత్తంలోని 83వ పాశురంలో పరాంకుశనాయకి క్రౌంచపక్షి విరహస్వనాన్ని విని తాళలేని స్థితి తెలుపబడింది. ఈ పాశురవ్యాఖ్యానంలో నమ్బిళ్ళై ఒక ఐతిహ్యాన్ని ప్రస్తావించారు. ఈ పాశురంలో ప్రస్తావింపబడిన నాయకి స్థితికి సమంగా శ్రీరామాయణంలో ఏదైనా సందర్భం ఉన్నదా? అని నంజీయర్ ప్రశ్నించగా, భట్టర్ ఉత్తరరామాయణంలోని 49వ సర్గలో తెలుపబడిన సీతాదేవి స్థితి ఇటువంటిదేనని బదులిచ్చారనేది ఈ ఐతిహ్యం.

వీటిని అన్నిటినీ గమనించినపుడు ద్రావిడ కావ్యాలలో, సంస్కృత సాహిత్యంలో కన్పించే విప్రలంభశృంగార రసప్రక్రియలకు **(కిళవిత్తుఱై)** మధ్యగల రూపసామ్యం గమనించదగిన అంశం. ఇది పూర్వకాలంలో భారతదేశభావ సమైక్యాన్ని, సమగ్రతను సూచించే చిహ్నాలలో ఒకటి అని గుర్తించాలి ఈప్రక్రియ లన్నీ దివ్యప్రబంధాలలో భగవత్కామరూపమైన పరమపురుషార్థాన్ని వ్యక్తీకరించడం కోసం, వేదాంతరహస్యాలను ధ్వనింపజేయడంకోసం ప్రయోగింప బడ్డాయనేది ఉక్తపూర్వం.

తిరువిరుత్తప్రబంధంలోని శృంగారప్రక్రియలు భగవద్విషయంగా ప్రయోగింప బడ్డాయి. అందువల్ల ఇవి ప్రథమపర్వాత్మకాలు. ఈ ప్రక్రియలను అన్నిటినీ కంబమహాకవి నమ్మాళ్వార్ల విషయంగా ప్రయోగించి శఠకోపర్ అన్దాది అనే మధురకప్రబంధాన్ని వెలయించారు. ఉదాహరణకు (1) **పొరుళ్వయిఱ్పిరివు**- ధనసంపాదనంకోసం నాయకుడు నాయకిని విశ్లేషించడం (తిరువిరుత్తంలో 8వ పాశురం, శఠకోపర్ అన్దాదిలో 42వ పాశురం) **(2) నలమ్ పారాట్టుదల్**- నాయకుడు, నాయకి గుణాలను గాని, నాయకి నాయకుని గుణాలను గాని వర్ణించడం (తిరువిరుత్తంలో 14వ పాశురం, శఠకోపర్ అన్దాదిలో 74వ పాశురం), **(3) వెఱివిలక్కు**- అన్యపురుష సంగప్రయత్న నిషేధం (తిరువిరుత్తంలో 20వ పాశురం, శఠకోపర్ అన్దాదిలో 36వ పాశురం) **(4) నకర్ కాట్టుదల్**- నాయకుడు నాయకితో ప్రయాణం చేస్తూ తన నగరాన్ని గూర్చి తెలుపడం (తిరువిరుత్తంలో 26వ పాశురం, శఠకోపర్ అన్దాదిలో 67వ పాశురం) **(5) తిఙ్గళై ప్పళిత్తల్** - చంద్రోపాలంభనం (తిరువిరుత్తంలో 76వ పాశురం, శఠకోపర్ అన్దాదిలో 98 వ పాశురం) ఈ విధంగా తిరువిరుత్తంలోని ప్రక్రియలు చరమపర్వాత్మకాలు కాగా, శఠకోపర్ అన్దాదిలోని ప్రక్రియలు చరమపర్వాత్మకాలు.

నమ్మాళ్వార్ల ప్రథమ- చరమ ప్రబంధాల మధ్యగల ప్రమేయసంగతికూడా గమనించదగిన ఇంకొక అద్భుతమైన అంశం. తిరువిరుత్త పాశురాల ప్రమేయానికి, తిరువాయ్‌మొళ్రి దశకాల ప్రమేయానికి మధ్యగల వివరణ- వివరణి భావమే ఇది. ఉదాహరణకు- **"వెటివిలక్కు"** అనే అన్యదేవతాసంగనిషేధ ప్రక్రియ తిరువిరుత్తంలో 20వ పాశురంలో కన్పిస్తుంది. ఇది తిరువాయ్‌మొళ్రిలో **"తీర్ప్పారై యామిని" (4-6)** అనే దశకంలో విస్తరించి తెలుపబడింది. తిరువిరుత్తంలోని 96వ పాశురంలో పలు అన్యసిద్ధాంతాలను ఉపదేశించి భగవానుడు వ్యామోహాన్ని కల్గించిన విషయం. **"వణఙ్గుమ్ తుఱైకళ్ పలపల వాక్కి"** ఇత్యాదిగా ప్రస్తుతింప బడగా, ఈవిషయమే **"ఒన్టుమ్ తేవుమ్"** అనే తిరువాయ్‌మొళ్రి దశకంలో (4-10) వివరింపబడింది. ఆ దశకంలోని **"పోఱ్ఱి మఱ్ఱోర్ దెయ్‌వమ్" (6) "విళమ్బుమ్ ఆఱు శమయముమ్" (9)** ఇత్యాది పాశురాలు గమనించదగినవి. తిరువిరుత్తంలోని **"కణ్ణుమ్ శెన్దామరై"** అనే 43వ పాశురంలో **"మదివికళ్పాల్ విణ్ణుమ్ కడన్దు ఉమ్బర్ అప్పాల్‌మిక్కు మఱ్ఱెప్పాల్ మిక్కుమ్ ఎణ్ణుమ్ ఇడత్తదువో ఎమ్బిరానదు ఎళ్రిల్ నిఱమే"** అనే సూక్తిద్వారా నిత్యసూరులకు సైతం భగవానుని జ్ఞానం, ప్రకాశం మొదలైనవి అందనివి- అని తెలుపబడిది. ఈ భావమే తిరువాయ్‌మొళ్రిలోని **"ఉయర్వఱ"** మొదటి దశకంలో విపులీకరింపబడింది. **"ఉయర్వఱ ఉయర్‌నలమ్"** అనే ఆరంభసూక్తి దీనికి ఒక ఉదాహరణం. అందువల్ల ఇచటి తిరువిరుత్త పాశుర, తిరువాయ్‌మొళ్రి దశకాలకు మధ్యగల ప్రమేయ సంగతి స్పష్టం. **"శిదైక్కిన్దదు"** అనే 34వ పాశురంలో పరాంకుశనాయకి ప్రణయకోసం ప్రస్తుతమైనట్లే తిరువాయ్‌మొళ్రిలోని **"మిన్నిడై మడవార్" (6-2)** దశకంలో ప్రణయరోషం ప్రస్తుతమైనందున ఈ రెండిటి మధ్యసామ్యం స్ఫుటం. ఈవిధంగా మిగిలిన పాశురాల దశకాల ప్రమేయ సంగతిని కూడా అభ్యూహించవచ్చు.

నా ప్రార్థనను మన్నించి ఈ గ్రంథాన్ని అవలోకించి మంగళాశాసనాలను అనుగ్రహించిన మాన్యులు, పరమహంసపరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజ జీయర్‌స్వామివారి సన్నిధిలో సవినయంగా, సప్రణిపాతంగా నమస్సుమాంజలులను సమర్పించుకొంటున్నాను. అదేవిధంగా, నాప్రార్థనను కాదనకుండా, గ్రంథాన్ని కటాక్షించి తమ అభిప్రాయ ప్రకటనతో పాటు మంగళాశాసనాలను అందించిన పెద్దలు, పితృపాదులు, న్యాయవేదాంత విద్వాన్, ఉభయవేదాంత భాస్కర, ఉ.వే. శ్రీమాన్ రంగాచార్య స్వామివారి సన్నిధిలో,

పండితరత్న, ఉభయవేదాంతవాచస్పతి ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్య స్వామివారి సన్నిధిలో, శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి ఉ.వే. శ్రీమాన్ డా॥ ఎస్.వి. రంగరామానుజాచార్యస్వామివారి సన్నిధిలో, భాగవతామృతవర్షి, పండితరత్న, ఉ.వే. శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్యస్వామివారి సన్నిధిలో సప్రశ్రయంగా దండం సమర్పించుకొంటున్నాను. శ్రీమాన్ అణ్ణాస్వామివారి దివ్యార్థదీపికా వ్యాఖ్యను ఆంధ్రీకరించి ప్రచురించడానికి ఉదారంగా అంగీకరించిన సహృదయులు ఉ.వే. శ్రీమాన్ పి.బి.రాజహంసమ్ స్వామివారికి, వారి కుటుంబసభ్యులకు నా హార్దమైన కృతజ్ఞతలను సమర్పిస్తున్నాను. ఈ గ్రంథం అందంగా రూపుదిద్దుకొని ముద్రింపబడడంలో సహకరించిన శ్రీచంద్రశేఖర్, శ్రీమతి పి.ఎస్.జయలక్ష్మి గార్లకు, శ్రీహర్షవర్ధన్ గారికి నా కార్తజ్ఞ్యాన్ని వ్యక్తం చేస్తున్నాను. చివరగా, నాకీ భగవద్భాగవతా చార్య కైంకర్యాన్ని చేసుకొనే అమూల్యమైన అవకాశాన్ని కల్గించిన ఉ.వే. శ్రీమాన్ టి.పి.వేంకటరమణ స్వామివారి సన్నిధిలో కృతజ్ఞతావిష్కరణను మళ్ళీ ఒక్కసారి చేసుకొంటున్నాను. ఈ గ్రంథంలో నా అజ్ఞానం వల్ల, ప్రమాదంవల్ల చోటుచేసుకొన్న దోషాలను సహృదయపాఠకులు క్షమిస్తారని నమ్ముతున్నాను.

**తేనఱా మకిழ்త్తొడైయలుమ్ మౌళియుమ్ తిరుక్కిళర్ కుழைక్కాదుమ్**
**కానఱామలర్ త్తిరుముకచ్చోదియుమ్, కయిరవత్తువర్ వాయుమ్**
**మోనమాకియ వడివముమ్ మార్పుమ్ ముత్తిరై త్తిరుక్కైయుమ్**
**ఞానదేశికన్ చరణతామరైయుమ్ ఎన్నయనమ్ విట్టకలావే**

(జ్ఞానదేశికులైన నమ్మాழ்వార్లయొక్క మకరందం స్రవించే వకుళమాలిక, కిరీటం, ప్రకాశించే కుండలాలతో కూడిన కర్ణాలు, ప్రకాశించే ముఖతేజస్సు, ఎర్రకలువవంటి పెదవులు, మోహాన్ని కలిగించే రూపం, వక్షస్సు, జ్ఞానముద్రతో చేయి, శ్రీచరణపద్మాలు నా దృష్టినుండి తొలగిపోవడం లేదు.)

ఇట్లు, నివేదించు

తిరుపతి — భాగవత విధేయుడు

8-3-2016 — **ఈ.ఏ. శింగరాచార్యులు**

శ్రీమతే రామానుజాయ నమః

# తిరువిరుత్త వ్యాఖ్యానమ్

## ( భావదీపిక - ఆంధ్రవివరణంతో )

### అవతారిక

ఈ దివ్యప్రబంధం - "మయర్వఱ మదినలమ్" (భ్రమ ప్రమాది దోష రహితమైన, భక్తిరూపాపన్న జ్ఞానాన్ని) ను పొందిన ఆళ్వార్లలో ముఖ్యులు, ప్రపన్న జనకూటస్థులైన నమ్మాళ్వార్లు అనుగ్రహించిన దివ్యప్రబంధాలలో మొదటిది. తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, పెరియతిరువన్దాది, తిరువాయ్మొళి - అనే నాల్గు ప్రబంధాలు నమ్మాళ్వార్ల దివ్యసూక్తులు. ఈ నాల్గు క్రమంగా నాల్గు వేదాల సారం. నాలాయిర దివ్యప్రబంధంలోని మూడవ వేయి అయిన ఇయఱ్పాలో ఇది అయిదవ ప్రబంధం. ఇది ఋగ్వేదసారం.

ఈ ప్రబంధానికి తిరువిరుత్తమనే తిరునామం ఏ విధంగా కల్గింది? అంటే, ఈ ప్రబంధంలో ఆళ్వార్లు తమ ప్రేమాతిశయం మొదలైన వృత్తాంతా లను భగవానుని సన్నిధిలో విన్నపించారు కనుక, దీనికి ఈ తిరునామం కల్గింది. సంస్కృతభాషలోని వృత్తమనే పదం - "**అవఱ్ఱుళ్, ఏళ్లా ముయిరియ్యు మిరువుమ్**" అనే నన్నూల్ నియమానుసారం విరుత్తమని మారింది. పలు అర్థాలను కల ఈ పదం ఇక్కడ - సంగతి - అనే అర్థాన్ని ఇస్తుంది. ఆళ్వార్లు తమ జ్ఞాన నేత్రానికి లక్ష్యమైన భగవానుని చూచి, "దేవరవారిని అనుభవించ డానికి విరోధియైన దేహసంబంధాన్ని పోగొట్టి అనుగ్రహించాలి" అని సంసారసంబంధ నివృత్తిని అపేక్షించడంద్వారా ఈ అజ్ఞానప్రదమైన భూమిలో ఉండడం తమకు చాలా అసహ్యంగా ఉండే సంగతిని, భగవానుని నిత్యానుభవంలో తమకు గల ప్రేమ అభివృద్ధమైన సంగతిని ఈ ప్రబంధంలో తెలిపారు. "**తిరు**" అనే పదం సంస్కృత భాషలోని "**శ్రీ**" అనే పదంవలె, ద్రావిడంలో గొప్పతనాన్ని కల ఏవస్తువునకు అయినా విశేషణపదమై, వాటికి ముందే "**మహిమ**" అనే అర్థాన్ని ఇస్తుంది. విరుత్తమనే పదం -సంగతి- అనే అర్థాన్ని తెల్పేది అయినా, "**కారియ ఆకుపెయర్**" (కార్యబోధక మైన లక్షకపదం) అయి, ఇక్కడ నమ్మాళ్వార్ల సంగతులను తెలిపే గ్రంథాన్ని నిర్దేశిస్తున్నది.

ఈ ప్రబంధం **"కట్టళై క్కలిత్తుఱై"** అనే ఛందస్సులో కూర్చబడినది. శైవసంప్రదాయంలో **తిరునావుక్కు అరశు నాయనార్ తేవారత్తిరుముఱై, పట్టణత్తు ప్పిళ్ళైయార్ పాడల్ తిరుముఱై**- అనే ప్రబంధాలలో కట్టళై క్కలిత్తుఱైను తిరువిరుత్తమని వ్యవహరించే సంప్రదాయం ఉన్నందున, ఆ విధంగానే, దీనికి కూడా తిరువిరుత్తమనే తిరునామం ఏర్పడినదని కొందఱి అభిప్రాయం. సంస్కృత భాషలో ఛందస్సును తెలిపే వృత్తమనే సామాన్యవాచకం ఇక్కడ విశేషవాచకమై, **"కట్టళైక్కలిత్తుఱై"** అనే ఒక విధమైన వృత్తాన్ని నిర్దేశించి, గ్రంథానికి **"కరువియాకు పెయర్"** (సాధనబోధకమైన లక్షకపదం) అయినది- అనేది ఈ అభిప్రాయంలోని తాత్పర్యం. ***తాழிశై***, **తుఱై, విరుత్తమ్** - అనే పాశుర సముదాయం మూడిటిలో ఒకటి అయిన **"తుఱై"** అనే విభాగంలోకి అంతర్భవించే **కట్టళైక్కలిత్తు ఱై**- అనే గ్రంథాన్ని విరుత్తమని అనడం పొసగు తుందా? అనే సందేహం కల్గడం తగినదే. అయితే, ఇక్కడ విరుత్తమనే పదం ఆ పాశుర సముదాయాన్ని మాత్రం నిర్దేశించడం కాకుండా పాశురసామాన్య వాచకంగా గ్రహింపబడినందున, **కట్టళైక్కలిత్తుఱై**- అనే ఈ ప్రబంధాన్ని విరుత్తమని అనవచ్చు- అనే ఉపపత్తిని చెప్పవచ్చును. కాని, మొదట తెల్పిన అర్థమే సరసం. **"ఇన్నిన్ఱ నీర్మై ఇని యాముఱామై... అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్ మెయ్న్నిన్ఱు కేట్టరుళాయ్"** అని అంటూ తమ సంగతిని (వృత్తాన్ని) తెల్పుతున్నట్లుగానే ప్రారంభమయే స్వారస్యాన్ని గమనించిన మన పూర్వాచార్యులు దీనికి విరుత్తమనే పేరును పెట్టారు.

ఇంతేకాక, ఈ ప్రబంధానికి, ప్రాయికంగా ఆழ்వార్లు తమను నాయకిగా భావించి, తమ వృత్తాన్ని - అంటే - సంగతిని - పల్కుతున్నారు కనుక, తిరువిరుత్త మనే దానికి పరాంకుశ నాయకి యొక్క సంగతిని తెలిపే గ్రంథమనే అర్థాన్ని చెప్పవచ్చు- అని కొందఱు భావిస్తారు.

అన్దాదిక్రమంలో కూర్చబడిన నూఱు పాశురాలను కల్గినదైన ఈ ప్రబంధం లోని మొదటి పాశురం, చివరి పాశురం తప్ప, మిగిలిన తొంభైఎనిమిది పాశురాలలో శృంగార ప్రక్రియా ప్రకారాలుగా అమరి ఉన్నాయి. బయటకు తోచే భావం ఒకటి, అన్యాపదేశార్థం, **ఉళ్ళుఱై ప్పొరుళ్** (అంతరార్థం) అనే స్వాపదేశార్థం ఇంకొకటి - అనే రెండు విధాలైన అర్థాలున్నాయి. శబ్దమాధుర్యం, అర్థౌదార్యం, గంభీరాలైన భావాలు, ధ్వన్యర్థాలు, కల్పనలు, అలంకారాలు మొదలైన వైలక్షణ్యాలతో

నిస్సమాభ్యధికంగా ఈ ప్రబంధం ప్రకాశిస్తున్నది. తనను అభ్యసించేవారికి జన్మదుః ఖాన్ని తీర్చి (**"అన్దమిల్ పేరిన్బమ్"**), అంతులేని మహానందాన్ని కల్గించగల్గినది. భగవానుని శృంగారభావనాక్రమంలో అనుభవించే ప్రకారానికి దారి చూపింది.

శైవసంప్రదాయంలోని మాణిక్కవాచకర్ రచించిన **తిరువిరుత్త ప్రబంధం, తిరుచ్చిఱ్ఱమ్బల** క్కోవైయార్ అనే తిరుక్కోవైయార్ రచించిన తిరువిరుత్త ప్రబంధం ఈ ఛాయలోనే ఉంటాయి.

ఆళ్వార్లను గమనిస్తే, వారు భక్తిరసాన్ని పరిగ్రహించినవారు. అటువంటి వీరి ప్రబంధాలను చూస్తే, అవి జ్ఞానగ్రంథాలు. శృంగారరసాన్నే ప్రధానంగా కల్గిన **"కిళవిత్తుఱై"** ను (ప్రణయఘట్టాలను) తత్త్వగ్రంథాలైన ఆళ్వార్ల ప్రబంధాలలో ప్రస్తావింపబడడం ఎందుకు? అని కొందఱు శంకిస్తారు. ఔషధాన్ని సేవించనివారిని ఆ ఔషధాన్ని బెల్లంతో కలిపి, తినిపించినట్లుగా, అల్పానందాన్ని గూర్చి పల్కడం ద్వారా ఆళ్వార్లు మహానందాన్ని తెలుపు తున్నారు - అని జ్ఞానవృద్ధులైన పెద్దలంటారు. **"భోక్తుం తవ ప్రియతమం భవతీవ గోదే! భక్తిం నిజాం ప్రణయ భావనయా గృణంతః, ఉచ్చావచైః విరహసంగమజై రుదంతైః శృంగారయంతి హృదయం గురవ స్త్వదీయాః"** అని, **"భక్తిః శృంగారవృత్త్యా పరిణమతి"** అని శ్రీమద్వేదాంతదేశికులు అనుగ్రహించిన సూక్తులు ఇక్కడ అనుసంధేయాలు. ఆళ్వార్లకు భక్తిరసమే శృంగారరసంగా పరిణమించిందని ఇచటి భావం.

శృంగారరస ప్రసక్తి స్త్రీ-పురుషుల మధ్యకదా ఏర్పడుతుంది. శేషత్వ పరమావధిలో ఉండే ఆళ్వార్లు పురుషోత్తముని ఉద్దేశించి పలికే ప్రబంధాలలో శృంగారరసం ఏవిధంగా ప్రసక్తమవుతుంది? అని అంటే, వినండి.

భక్తితో భగవానుని పొందడం - అనేది పలు విధాలుగా ఉంటుంది. అతని తిరునామానుసంధానాన్ని చేయడం, దివ్యమంగళవిగ్రహ సౌందర్యాన్ని వర్ణించి అనుభవించడం, ఆ స్వామి ఆదరంతో వేంచేసి ఉండే దివ్యదేశాల సమృద్ధినిగూర్చి పల్కి ఆనందించడం, అక్కడ ఆదరాన్ని కల శ్రీవైష్ణవుల గొప్పతనాన్నిగూర్చి పల్కి ఆనందించడం- అని ఈ విధంగా పలు రీతులలో భగవదనుభవం ఉంటుంది. ఈ రీతులలో పరమవిలక్షణమైన వేఱొక రీతికూడా ఉన్నది. అది- ఆళ్వార్లు తమ స్వభావాన్ని విడచి నాయకీభావాన్ని తమపై ఆరోపించుకొని, వేఱొక

గొంతుకతో పల్కి అనుభవించడం. ఈ ప్రబంధంలో అటువంటి అనుభవం ప్రచురంగా ఉంటుంది. ఈ రీతిలోని శృంగారరసానుభవం ఇక్కడ ప్రసక్తమైనది.

ఈ విధంగా అనుభవించే క్రమంలో- తల్లిగా పలికే పాశురాలు, చెలికత్తెగా పలికే పాశురాలు, నాయకిగా పలికే పాశురాలు - అని మూడు రీతులున్నాయి. అపుడు ఆళ్వార్లకు పరాంకుశులనే పురుషనామం పోయి, **"పరాంకుశనాయకి"** అనే స్త్రీనామం వ్యవహరింపబడుతుంది. తల్లిగా పల్కినట్లు, సఖిగా పల్కినట్లు, నాయకిగా పల్కినట్లు పాశురాలు వ్యక్తమైనా, ఆ పాశురాలను పలికేవారు ఆళ్వార్లు ఒకరు. **"నల్లార్ నవిల్ కురుకూర్ నకరాన్.... మాఱన్ విణ్ణప్పమ్ శెయ్ద శొల్లార్ తొడైయల్ ఇన్నూఱుమ్"** అనే ప్రబంధపరిసమాప్తి గమనించదగినది. ఒక నది పలు కాలువల రూపంలో ప్రవహించేటపుడు, పలు పేర్లు వ్యవహరింపబడినా, వాటికి ప్రధానమైన నామం ఒకటే అయిన రీతిలో, పైన తెల్పిన మూడు అవస్థలలో పాశురాలు వ్యక్తమైనా, అవి ఆళ్వార్ల పాశురాలుగానే పర్యవసిస్తాయి.

ఆళ్వార్లు తమ సహజస్వభావాన్ని విడిచి స్త్రీభావాన్ని ఆరోపించుకొనడం ఎందుకోసం? ఆ విధంగా ఆరోపించుకోవడం తగునా? అని అంటే, ఆళ్వార్లు స్వయంగా దీనిని ఆరోపించుకోవడం లేదు. ఆ దశ వారికి పరవశంగా కల్గింది. పురుషోత్తముడైన భగవానుని పరమపురుషత్వానికి ముందు లోకం అంతా స్త్రీత్వాన్ని కల్గినదై ఉన్నందున, జీవాత్మకు స్వాతంత్ర్యగంధం ఏమాత్రం లేకుండా పారతంత్ర్యమే మూర్తీభవించి ఉన్నందున, ఈ క్రమానికి అనుగుణంగా స్త్రీభావం ఆరోపితం కాదు - అనియే గ్రహించాలి. దండకారణ్యవాసులైన మునులు శ్రీరాముని సౌందర్యంలో అభినివేశాన్ని పొంది, స్త్రీత్వాన్ని కోరి, వేఱొక జన్మలో గోపికలై శ్రీకృష్ణుని పొందారు - అనే ఒక ఐతిహ్యం కూడా ఉన్నది. ఆళ్వార్లు ఆ విధంగా కాకుండా, అపుడే స్త్రీత్వాన్ని పొంది, పురుషోత్తముని అనుభవించాలని ప్రేమించారు.

ఆడ-మగ అనే వ్యవహారాలు అల్పానందం (ఇహలోకానందం) కోసం కదా ఏర్పడ్డాయి. మహానందానుభవంలో ఊనికను (దృష్టిని) కల ఆళ్వార్లు స్త్రీత్వాన్ని పొందినట్లుగా స్తనాదిపదాలను ప్రయోగించి పాశురాలను పలికినట్లుగా సంభవించే ఈ సందర్భం ఏమి? అని అంటే, విషయాంతర కామమని, భగవద్విషయకామ మని- కామం రెండు రీతులగా ఉంటుంది. వేదాంతాలలో విధింపబడిన భక్తియే ఆళ్వార్లకు శృంగార క్రమంలో (రూపంలో) రూపొందింది. అల్పానందానికి

స్తనాదులు సాధనాలైనట్లుగా, భగవద్విషయానుభవానికి పరభక్తి -పర-జ్ఞాన-పరమభక్తులు అత్యంతావశ్యకాలై ఉన్నందున, అవే స్తనాలు మొదలైన పదాలతో దివ్యప్రబంధాలలో నిర్దేశంపబడ్డాయని తెలియాలి.

శృంగారరససంబంధం కొంచెంకూడా లేకుండా కేవలం శుద్ధభక్తి రసంగానే పాశురాలు అనుగ్రహించగల్గినా, శృంగారరసాన్ని మేళవించి పాశురాలను పల్కడానికి కారణం పూర్వమే తెలుపబడింది- (ఆరోగ్యానికి కారణమైన వేపాకు మాత్రలను మింగడానికి ఇష్టపడనివారికి వాటికి బెల్లాన్ని పైన పూసి ఇచ్చి తినిపించినట్లుగా).

ఈ ప్రబంధం అన్దాదిక్రమంలో పాడబడిన ప్రబంధం కనుక **"శొఱ్ఱొడర్ నిలై పొరుట్టొడర్నిలై"** (శాబ్దికమైన అంతాది గ్రథనం, ఆర్థికమైన అంతాది గ్రథనం) అనే రెండు విధాలైనవానిలో, ఇది **"శొఱ్ఱొడర్నిలై"**కి చెందినది. దీనిలోని పాశురాలు, అర్థంలో ఒకదానితో ఇంకొకటి పూర్వోత్తర క్రమంలో పరంపరాసంబంధాన్ని కల్గి ఉండే స్థితి స్ఫురించేటట్లుగా పూర్వా చార్యులు పాశురాలకు అవతారికలను రచించి, వ్యాఖ్యానించినందున ఇది **'పొరుట్టొడర్నిలై"** కూడా **"పొరుళినుమ్, శొల్లినుమ్ ఇరువకై తొడర్నిలై"** (అర్థాన్ని బట్టి, శబ్దాలనుబట్టి పాశురగ్రథనం రెండు విధాలు) అనేదండి అలంకార సూత్రంయొక్క వ్యాఖ్యలో **"ఇరణ్డెన్నాదు వకై ఎన్ఱమి కైయాన్ మూన్ఱావదు పొరుళిలుమ్ శొల్లిలుమ్ తొడర్తలు ముణ్డెన్గ"** (**"ఇరణ్డు"** రెండు అని అనకుండా **"వకై"** అనే పదాన్ని అధికంగా ప్రయోగించినందున, అర్థంలోను, శబ్దంలోను గ్రథనం చేయడమనే మూడవ రీతి కూడా ఉన్నదని భావం) అని వివరింప బడడం గమనించాలి. అందుచేత ఈ ప్రబంధం శాబ్దిక- ఆర్థిక అన్దాది క్రమంలో గ్రథనం చేయబడింది. ఇందులోని ప్రారంభపాశురంలో **"పొయ్న్నిన్ఱ ఞానముమ్ పొల్లావొழுక్కు మழுక్కుడమ్బుమ్, ఇన్నిన్ఱ నీర్మై ఇని యాముఱామై... అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్"** అని ప్రకృతి (సంసార) సంబంధనివృత్తి ప్రార్థించి, చివరలో, నిగమనపాశురంలో కూడా **"మాఱన్ విణ్ణప్పమ్ శెయ్ద శొల్లార్తొడైయల్ ఇన్నూఱుమ్ వల్లార్ అழுన్దార్ పిఱప్పామ్ పొల్లావరువినై మాయవన్ శేఱ్ఱళ్ళల్ పొయ్న్నిలత్తే"** అని ప్రకృతిసబంధ నివృత్తియే ఈ ప్రబంధానుసంధానాన్ని చేసేవారికి ఫలంగా నిర్ణయించినందున, ఈప్రబంధం ముముక్షుత్వాన్ని, ముక్తిని కల్గించడానికి సమర్థమైనది.



శ్రీమతే రామానుజాయ నమః



నమ్మాళ్వార్ అనుగ్రహించిన
ఋగ్వేదసారమైన

# తిరువిరుత్తమ్

**(భావదీపిక - ఆంధ్రవివరణంతో)**

కిడాంబి ఆచ్చాన్ అనుగ్రహించిన

## తనియన్

**కరువిరుత్త క్కుళి నీత్త పిన్ కామక్కడుజ్గుళి వీళ్న్దు,**
**ఒరు విరుత్తమ్ పుక్కుళలుఋవీర్-, ఉయిరిన్ పొరుళ్కట్కు**
**ఒరు విరుత్తమ్ పుకుదామల్ కురుగైయర్కోన్ ఉరైత్త,**
**తిరువిరుత్తత్తోరడి కఱ్ఱిరీర్ తిరునాట్టగత్తే.**

కరు = గర్భవాసమనే, విరుత్తమ్ కుళి = గుండ్రని గోతిలో, నీత్త పిన్ = విడచిన తరువాత, (గర్భంలో నుండి బయటకు వచ్చి జన్మించిన తరువాత), కామమ్ కడు కుళి వీళ్న్దు = అల్పానందానుభవమనే భయంకరమైన గోతిలో పడి, ఒరు విరుత్తమ్ పుక్కు = సాటి లేని (గొప్ప) వార్ధక్యాన్ని పొంది, ఉళలుఋ వీర్ = పరిభ్రమించే జనులారా!, ఉయిరిన్ పొరుళ్కట్కు = (మీ యొక్క) ప్రాణాలను పొందడానికి తగిన ప్రయోజనాలకు, ఒరు విరుత్తమ్ పుకుదామల్ = అంతరాయం కొంచెం కూడా సంభవించిన రీతిలో, కురుకైయర్ కోన్ = తిరుక్కురుకూర్ దివ్యదేశంలో ఉండేవారికి నాయకులైన నమ్మాళ్వార్లు, ఉరైత్త తిరు విరుత్తత్తు = అనుగ్రహించిన తిరువిరుత్తమనే ప్రబంధంలో, ఓర్ అడి కఱ్ఱు= ఒక పాదాన్ని అభ్యసించి, దాని అర్థాన్ని తెలిసి, తిరు నాడు అకత్తే ఇరీర్ = పరమ పదంలో నిత్యావాసం చేస్తూ ఉండండి.

**"మాఱి మాఱి ప్పలపిఱప్పుమ్ పిఱన్దు"** (మాటిమాటికి పలు జన్మలలో జన్మించి) నశించి సంసారసాగరంలో అల్లల్లాడే జనులను చూచి, "ఇక మిమ్ములను ఆ దుఃఖం అనువర్తించకుండా, మీరు మోక్షసామ్రాజ్యాన్ని పొంది నిత్యానుభవాన్ని అనుభవించాలని కోరుకొన్నట్లయితే, నమ్మాళ్వార్లు నోరు తెఱచి పల్కిన తిరువిరుత్తమనే దివ్యప్రబంధంలో ఒక్క పాదాన్ని అయినా అభ్యసించండి, చాలు'' అని కిడాంబి ఆచ్చాన్ అనే ఆచార్యులు ఉపదేశిస్తున్నారు. (కొందఱు ఈ పాశురాన్ని శీరామప్పిళ్ళై అనే వ్యాసభట్టర్ రచించారని, మఱికొందఱు ఆళవన్దార్ రచించారని అంటారు.)

శ్రీవైకుంఠం అన్ని దేశాలకంటే గొప్పది కనుక, **"తిరునాడు"** అని గొప్పగా నిర్దేశింపబడింది. **"ఉయిరిన్ పొరుళ్కట్కు ఒరు విరుత్తమ్ పుకుదామల్ కఱ్ఱు"** అని అన్వయించాలి. **"పుకుతామల్ కురుకైయర్కోన్ ఉరైత్త"** అని కూడా అన్వయించవచ్చు. గర్భజన్మ బాల్యయౌవనజరామరణ నరకాలనే ఏడు అవస్థలు **"కరువిరుత్తుక్కుళి నీఱ్ఱ పిన్ కామక్కడుమ్ కుళి వీళ్న్దు ఒరు విరుత్తమ్ పుక్కు ళలుఱువీర్"** అని అనడంవల్ల సూచింపబడ్డాయి.

"గర్భ"మనే సంస్కృతపదం **"కరు"** అనే వికృతిని పొందింది. **"విరుత్త"**మనే సంస్కృతశబ్దంయొక్క వికృతి ప్రతిపాదంలోను ద్రావిడంలో అక్షరసామ్యాన్ని కల్గినది అయినా, మొదటి పాదంలోను, చివరి పాదంలోను గల **"వృత్త"**మనేది వికృతిని పొందినదని, రెండవ పాదంలో **"వృద్ధ"** మనే పదం వికృతిని పొందినదని, మూడవ పాదంలో **"విరుద్ధ"**మనేది వికృతిని పొందినదని వివేకించి తెలియాలి. మొదటి పాదంలోని వృత్తమనేది వృత్తాకారాన్ని (గుండ్రని రూపాన్ని) తెల్పుతుంది. రెండవ పాదంలోని వృత్తమనేది ముసలితనాన్ని తెల్పుతుంది. మూడవ పాదంలోని విరుత్తమనేది స్వరూపానికి తగనది- అని తెల్పుతుంది, ఇక, మొదటి పాదంలో **"కరు క్కుళి"** (విరుద్ధ)అని గ్రహించి, గర్భమనే తగని గుంట- అని, **"కరు ఇరుత్తు అక్కుళి"** అని గ్రహించి, గర్భంలో ఉండేటట్లు చేయడమనే ఆ గుంట అని, రెండవ పాదంలో **"ఒరు వృత్తమ్ పుక్కు"** అని గ్రహించి, "గర్హించదగిన అసత్య వర్తనంలో ప్రవేశించి'' అని, మూడవ పాదంలో **"ఒరు వృత్తమ్ పుకామల్"** అని గ్రహించి "(చెడ్డ అనే) కార్యం ఏమీ సంభవించని రీతిలో'' అని వివరించడం

పొసగుతుంది. "ఎతుక్కై" (పాశురాలలోని పాదాలలో గాని, గుణాలలో కాని రెండవ అక్షరం సమానంగా రావడం) అనే క్రమాన్ని అనుసరించి **"విరుత్తమ్"** అనే ఒక పదం వేఱు వేఱు అర్థాలలో రావడం **"తిరిపు"** (యమకం) అనబడుతుంది.

**"పుకుదామల్"** అనే పదంలో **"తు"** అనేది శారికై. (రెండు పదాలను కలిపే అన్వయపదం వంటిది.) **"కురుకా"** అనే సంస్కృతపదం **"కురుకై"** అని మాఱింది. **"ఇరీర్"** - ఇది సంబోధన విభక్తిలో బహువచనరూపం. రెండవ పాదంలో **"ఉయిరిన్ పొరుళుక్కు"** అనేది పాఠభేదం.

నమ్పిళ్ళై ఈడువ్యాఖ్యాన ప్రవేశంలో నమ్మాళ్వార్ల వైభవాన్ని తెలిపే కొందఱు పూర్వాచార్యులు పల్కిన వార్తలు ఉట్టంకింపబడ్డాయి.

నమ్మాళ్వార్లు ముక్తులలో ఒకరు- అని కొందఱు అభిప్రాయపడ్డారు. ముక్తప్రాయులని అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అన్నారు. మనలను సంస్కరించడం కోసం భగవానుడు ఆజ్ఞాపించగా నిత్యులలో ఒకరు ఆళ్వార్లుగా జన్మించారని కొందఱన్నారు. వంగిపురత్తు నంబి అనే ఆచార్యులు భగవానుడే ఈలోకంలో నమ్మాళ్వార్లుగా అవతరించారని అన్నారు. ఈ విధంగా పలువురు పలు విధాలుగా ఉత్ప్రేక్షించడానికి కారణం ఆళ్వార్ల నిరతిశయ వైభవమే. వాస్తవానికి, ఆళ్వార్లు సంసారులలో ఒకరు. (నమ్పిళ్ళై ఈడు వ్యాఖ్య ముదల్ శ్రియఃపతిలో ఆచార్యహృదయంలోని 92,93,94వ చూర్ణికలలో ఈ అభిప్రాయమే వ్యక్తీకరింపబడింది) పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానంలో కూడా పైన పేర్కొన్న అభిప్రాయాలు ప్రస్తావింపబడ్డాయి.



శ్రీమతే రామానుజాయ నమః



నమ్మాళ్వార్ అనుగ్రహించిన

ఋగ్వేదసారమైన

# తిరువిరుత్తమ్

(భావదీపిక - ఆంధ్రవివరణంతో)

## ఆళ్వార్లు తాము ఆళ్వార్లమనే భావనతో పాడిన పాశురం

1. పొయ్న్నిన్ఱ ఞానముమ్ పొల్లా వొళుక్కు మళుక్కుడమ్బుమ్,
ఇన్నిన్ఱ నీర్మై యిని యామురామై-, ఉయిరళిప్పాన్
ఎన్నిన్ఱ యోనియుమాయ్ ప్పిఱన్దాయ్! ఇమైయోర్ తలైవా!
మెయ్న్నిన్ఱు కేట్టరుళాయ్, అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమే

ఉయిర్ = ప్రాణులను అన్నిటిని, అళిప్పాన్ = రక్షించడం కోసం, ఎ నిన్ఱ యోనియుమ్ ఆయ్ = పలు రీతులలోని జన్మలను కల్గినవాడవై, పిఱన్దాయ్= అవతరించినవాడా!, ఇమైయోర్ తలైవా = నిత్యసూరులకు ప్రభువైనవాడా!, పొయ్ నిన్ఱ ఞానముమ్ = అయథార్థ స్థితిని పొందిన జ్ఞానం (అయథార్థజ్ఞానం), పొల్లా ఒళుక్కుమ్ = చెడ్డ నడత, అళుక్కు ఉడమ్బుమ్ = మలినంతో కూడిన శరీరం - అనే వీటితో కూడిన, ఇ నిన్ఱ నీర్మై = ఈ విధమైన స్వభావాన్ని (జన్మక్లేశాన్ని), ఇని యామ్ ఉఱామై = ఇకపై మేము పొందకుండా ఉండే రీతిలో, అడియేన్ = నీ దాసుడనైన నేను, శెయ్యుమ్ = చేసే, విణ్ణప్పమ్ = యథార్థమైన విన్నపాన్ని, నిన్ఱు కేట్టరుళాయ్ = నిలచి ఉండి (శ్రద్ధగా) నీవు ఆలకించాలి.

**భావదీపిక :** ఆళ్వార్లు తమ జ్ఞాననేత్రానికి గోచరుడైన భగవంతుని ఉద్దేశించి, "స్వామీ! దాసునకు (నాకు) ఈ సంసారబంధం అనువర్తించకుండా, ఇంతటితో తీరిపోయేటట్లుగా నీవు అనుగ్రహించాలి- అని దాసుడు (నేను) వినయంగా చేసే విజ్ఞాపనను నీవు ఆలకించాలి" అని ఇందులో ప్రార్థిస్తున్నారు.

ఈ పాశురంలోని రెండవ పాదంలోని **"ఇని యామ్ ఉఱామై"** అనే ప్రయోగంలో **"యామ్"** అని బహువచనంగాను, చివరలో **"అడియేన్"** అని ఏకవచనంలోను ప్రయోగించడంలోని అంతరార్థాన్ని గమనించాలి. "ఇపుడు దేవరవారి ముంగిట నిలచి విన్నపించే దాసుడు ఒక్కడే అయినా, నా ఒక్కని అనర్థాన్ని పరిహరించడానికి మాత్రమే నేను విన్నపం చేయడం లేదు. దాసునితో కూడా ఈ అజ్ఞానప్రదమైన సంసారంలో తల్లడిల్లే పలువురు సంసారి జీవుల అనర్థాన్ని కూడా నీవు తీర్చాలి - అని అందఱికి ప్రతినిధిగా నిలచి దాసుడు ఈ విన్నపాన్ని చేస్తున్నాడు'' - అని దీని భావం. **"పరానర్థమ్ నెఞ్జిలే పడుకైయాలే నాట్టుక్కాక త్తామ్ మన్డాడుకిఱార్"** (ఇతరుల అనర్థం తమ మనస్సులో పడినందున లోకం అంతటి కోసం తాము అర్థిస్తున్నారు) అని ఇక్కడ పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానసూక్తి. **"యామ్"** అనే దానిని పూజాయాం బహువచనంగా గ్రహించే అవకాశం ఉన్నా, అది ఆழ్వార్ల స్వభావానికి అనుగుణం కాదు.

ఈ సంసారంలో సంభవించడానికి అవకాశమున్న మూడు విషయాలను మొదటి పాదంలో అనుగ్రహిస్తున్నారు. **"పొయ్ న్నిన్ఱ ఞానమ్"**- అంటే- యథార్థ (తత్త్వ) జ్ఞానానికి విరుద్ధమైన జ్ఞానం. "పుణ్యాపాపాలున్నాయి; పరలోకం ఉన్నది; ఈశ్వరుడు (భగవంతుడు) అనేవాడున్నాడు''- అని తెలిసికోవడం యథార్థజ్ఞానం. ఇవి ఏమీ లేవని విరుద్ధంగా గ్రహించే జ్ఞానం విపరీతజ్ఞానం. ఇదే ఇక్కడ **"పొయ్ నిన్ఱ ఞానమ్"** అని అనబడింది. **"జ్ఞానాత్ మోక్షః, అజ్ఞానాత్ సంసారః"** (జ్ఞానంవల్ల మోక్షం, అజ్ఞానంవల్ల సంసారం కల్గుతాయి) అని వేదాంతులంటారు. **"పొయ్ న్నిన్ఱ"** అనే పదాన్ని **"పొయ్యిలే నిన్ఱ"** (అసత్యంలో నిలకడగా నిలచిన) అని, **"పొయ్యాయ్ నిన్ఱ"** (అసత్యమై నిలచిన) అని వివరించవచ్చు.

**(పొల్లా ఒழుక్కుమ్)- "యానే నీ ఎన్నుడైమైయుమ్ నీయే"** (నేను నీ వాడనే, నా సొత్తు కూడా నీదే) అనే అనుసంధానానికి విరుద్ధంగా అహంకార-మమకారాలను- (నేను, నాది అనే భావాలను) కల్గి, వాటికి తగినట్లు వర్తించే నడత- **"పొల్లా ఒழుక్కు"**. విపరీతజ్ఞానానికి, ఈ **"పొల్లా ఒழుక్కు"** (తగని నడత)కు కారణం- అశుద్ధమైన దేహంయొక్క సంబంధమే కనుక, కార్యాలను (చెడ్డ నడతను) ముందు ప్రస్తావించి, తరువాత కారణాన్ని (దేహ సంబంధాన్ని) ప్రస్తావిస్తున్నారు.

**(ఇన్నిన్ద నీర్మై)** -శ్రీరాముడు దండకారణ్యానికి వేంచేసినపుడు, అక్కడ అసురులచే, రాక్షసులచే బాధింపబడే మహర్షులు అతని వద్దకువచ్చి, **"ఏహి పశ్య శరీరాణి"**- (శ్రీరామ! ఇక్కడకు రా, ఇవిగో, మా శరీరాలను చూడు) "ఇది ఒక దెబ్బ, ఇది ఒక గుద్దు, దీనిని చూడు, దీనిని చూడు'' అని తాము పడిన హింసలను చూపినట్లే, ఇక్కడ ఆళ్వార్లు (**"ఇన్నిన్ద"**- అని అంటూ) తాము సంసారంలో పడిన క్లేశాలను నిర్దేశిస్తూ భగవానునకు చూపిస్తున్నారు. "శ్రీదండకారణ్యంలో ఋషులు శ్రీరామునకు రాక్షసులు తిన్న తమ శరీరాలను చూపించినట్లుగానే, ప్రకృతి బాధించిన తమ ఆత్మను ఆళ్వార్లు చూపిస్తున్నారు'' అని ఆళవందార్ అన్నారట.

**"ఇన్నిన్ద నీర్మై ఇని యాముఱామై"** అనే సూక్తికి -జన్మపరంపర తొలగి మోక్షం పొందేటట్లుగా - అని అర్థం. పునరావృత్తి లేని పరమపదాన్ని పొందిన ఆత్మకు తిరిగి వేఱొక జన్మను ఎత్తడం అనేది లేదు- అనే విషయం **"ఇని ఉఱామై"** అనే ప్రయోగంలో వ్యక్తమవుతుంది. **"ఉఱామై"**- అనే ఈ వ్యతిరేకార్థక కృదంతరూపం **(ఎదిర్మఱై వినైయెచ్చమ్)**. **"అడియేన్ శెయ్యుమ్"** అనే దానిలో గాని, **"కేట్టరుళాయ్"** అనే దానిలోగాని అన్వయిస్తుంది.

మత్స్యకూర్మవరాహాది పలు రూపాలలో భగవానుడు అవతరించినందున **"ఎన్నిన్ద యోనియుమాయ్ ప్పిఱన్దాయ్!"** అని సంబోధించారు. **"ఎన్నిన్ద యోనియిల్ పిఱన్దాయ్"**(ఎన్నెన్ని జాతులలో పుట్టావో) అని కాకుండా, **"ఎన్నిన్ద యోనియుమాయ్ ప్పిఱన్దాయ్"** (ఎన్నెన్ని జాతులుగా పుట్టావో) అని అన్నందున ఆ యా జన్మలను ఎత్తినపుడు కొంచెం కూడా వ్యత్యాసం తోచని రీతిలో ఆ జాతిస్వభావానికి అనుగుణంగానే వర్తించిన రీతి వ్యక్తమవుతుంది. భగవద్గీతలో, శ్రీకృష్ణుడు తాను ఈలోకంలోకి వచ్చి అవతరించడానికి గల కారణాలనుగూర్చి ప్రస్తావించేటపుడు- **పరిత్రాణాయ సాధూనామ్"**- సాధుజనులను రక్షించడం కోసం ఈలోకానికి వచ్చి జన్మిస్తాను'' అని అంటూ శిష్టజనసంరక్షణాన్ని ప్రథమకారణంగా పల్కినందున, **"ఉయిరళిప్పాన్.. పిఱన్దాయ్"** అని అన్నారు. భగవానుని అవతారాలు మన జన్మల వలె కర్మసంబంధంవల్ల కలిగినవి కాకుండా సంకల్పమాత్రంతోనే దుష్టనిగ్రహం- శిష్టపరిపాలనం చేయడంకోసం సంభవించే స్వభావాన్ని కల్గి ఉండడాన్ని- **"ఉయిరళిప్పాన్ ఎన్నిన్ద యోనియుమాయ్ ప్పిఱన్దాయ్"** అని అనడం ద్వారా వ్యక్తం

చేశారు. అతడు జన్మించే జన్మ మన జన్మలను తీర్చడంకోసం కదా ! **"అళిప్పాన్"-** **అళిప్పదఱ్కాకవే** (రక్షించడంకోసమే), వేఱొక ప్రయోజనాన్ని ఆశించి కాదు- అని భావం. (ఇది- **"పాన్‌వికుతి ప్పెఱ్ఱ ఎదిర్‌కాల వినైయెచ్చమ్"- "పాన్"** అనే ప్రత్యయం చేరిన భవిష్యత్కాలిక కృదంతరూపం).

భగవానుని అవతారానికి మూడు ప్రయోజనాలు చెప్పబడ్డాయి. శిష్టులను పరిపాలించడం, దుష్టులను శిక్షించడం, ధర్మాలను సంస్థాపించడం- అనే ఈ మూడిటిలో, మొదట పల్కిన శిష్టపరిపాలనమే ముఖ్యం. పరిపాలనమంటే- అనిష్టాలను తీర్చి, ఇష్టాలను పూర్తిచేయడం కనుక, దుష్టులను శిక్షించడం, ధర్మాలను సంస్థాపించడం- అనే మిగిలిన రెండు ప్రయోజనాలు శిష్టపరిపాలనంలోనే అంతర్భవిస్తాయి. అయితే ఇందుకోసం భగవానుడు నేరుగా వచ్చి ఆవిర్భవించాలా? సంకల్పమాత్రంతోనే అన్నిటిని నిర్వహించగల్గిన శక్తి అతనికి ఉన్నది కదా ! దానితోనే కార్యం నిర్వహించవచ్చు కదా! వ్యర్థంగా ఈ లోకానికి వచ్చి జన్మించడం ఎందుకు? అని అంటే, భక్తుల ఒక ఆశను మాత్రం సంకల్పంతో నెరవేర్చడం వీలు కాదు. (అదిఏది? అంటే), **"కూరారాళ్ వెణ్ శఙ్గేన్ది క్కొడియేన్ పాల్ వారాయ్, ఒరు నాళ్ మణ్ణుమ్ విణ్ణుమ్ మకిళవే"** (పదునైన అంచును కల సుదర్శనాన్ని, తెల్లని శంఖాన్ని ధరించి ఏదో ఒకనాడు ఈ లీలావిభూతి, నిత్యవిభూతి సంతోషించేటట్లు పాపిష్ఠివాడనైన నావద్దకు వేంచేయాలి) అని, **"శాయల్ శామత్తిరుమేని... ఒరునాళ్ కాణవారాయ్"** (కాంతిని కల, నల్లని తిరుమేని- చల్లని, పాచి వంటి పచ్చని వర్ణాన్ని కల ఆకులు తామరపూలను కల గొప్ప తటాకంవలె ఉండేవాడా! ఏదో ఒకనాడు నాకు దర్శనాన్ని అనుగ్రహించు) అని భక్తులు ప్రార్థిస్తే, ఆ ప్రార్థనను సంకల్ప మాత్రంతోనే తీర్చడం వీలు కాదుకదా! నేరుగా వచ్చి, దర్శనాన్ని ఇచ్చి తీరాలి కదా! అందువల్లనే **"ఉయిరళిప్పాన్"** - అని అన్నారు.

భగవానునకు గల సౌలభ్యం, పరత్వం - అనే రెండు స్వభావాలను అనుభవించి పల్కుతున్నారు, మూడవ పాదంలో.

**(ఇమైయోర్ తలైవా!) 'ఇమైయోర్'** - అనే పదం స్వర్గంలో ఉండే ఇంద్రాది దేవతలను, పరమపదంలోని నిత్యముక్తులను నిర్దేశిస్తుంది. కనురెప్పపాటును లేనివారు - అనే కారణంచేత, దేవతలను ఈ పదం తెల్పుతుంది. **"అయర్వఱు**

**మమరర్కళ్ అదిపతియే!"** అని ప్రకృతంలోని తాత్పర్యం. హస్తిగిరిలోని వరదరాజ స్వామికి **"దేవాధిరాజ"** అనే తిరునామమున్నందున, ఆ అర్చామూర్తిని ఉద్దేశించి చరమప్రబంధమైన తిరువాయ్‌మొழி మొదటి పాశురంలో **"అయర్వఱు మమరర్కళ్ అదిపతి"** అని అనుగ్రహించిన రీతిలో, ప్రథమ ప్రబంధమైన ఈ తిరువిరుత్త ప్రబంధంలోని మొదటి పాశురంలో కూడా ఆ స్వామిని మనస్సులో పెట్టుకొని **"ఇమైయోర్‌తలైవా !"** అని సంబోధిస్తున్నారు- అని అభిజ్ఞులైన పెద్దలు వచిస్తారు. పరమపదంలో నిత్యముక్తులను దాసులుగా స్వీకరించాలి- అనే ఆశను వ్యక్తం చేయడం ఇచటి స్వాపదేశార్థం.

**"మెయ్‌న్నిన్ఱ కేట్టరుళాయ్!"** అనే ప్రయోగంలోని **"మెయ్"** అనే పదాన్ని తరువాత గల **"విణ్ణప్పమ్"** అనే పదానికి విశేషణంగా అన్వయించి, **"మెయ్ విణ్ణప్పమ్ నిన్ఱు కేట్టరుళాయ్!"** అని అర్థం చెప్పబడింది. ఈ విధంగా కాకుండా, పాశురంలో ఉండే క్రమంలోనే అన్వయించి అర్థం చెప్పవచ్చు. **"మెయ్‌న్నిన్ఱు"**- నీ దివ్యరూపాన్ని దర్శింపజేసి, యథార్థంగా ముందు నిలచి సాక్షాత్కరించి- అని అర్థం. అటు ఇటు పరుగెత్తి పోవాలని చూడకుండా, నిలకడగా స్థిరంగా నిలచి ఉండి నా విన్నపాన్ని పూర్తిగా వినాలి- అని ఆழ்్వార్లు అంటున్నారు. భగవానుడు తిరువీథిలో వేంచేసేటపుడు వేదపారాయణాన్ని వినడంకోసం నిలువడు. ద్రావిడప్రబంధగానాన్ని వినాలని నిలువడం. ఆழ்్వార్లు ఈవిధంగా **"నిన్ఱు కేట్టరు ళాయ్"** అని ప్రార్థించినందువల్లకదా ఇది- అనేది అழகియమణవాళ చ్చీయర్ స్వాపదేశవ్యాఖ్యలోని రసోక్తి. "దాసుడు చేసే విన్నపాన్ని ఆలకించి, మనోరథాన్ని పూర్తిచేయాలి" - అని అనకుండా, తాము చేసే విన్నపాన్ని చెవి ఒగ్గి వినాలని మాత్రమే ఆழ்్వార్లు వేడారు. తాము చేసే విన్నపం భగవానుని చిత్తంలో పడితే చాలు. కార్యసిద్ధి తనకు తానే కల్గుతుందని భావం. **"కేట్టు అరుళాయ్"**- అని విడదీసి, ఈ విన్నపాన్ని ఆలకించి, తరువాత అనుగ్రహించాలి"- అని అర్థం చెప్పరాదు. విన్నపాన్ని ఆలకించడమనే అనుగ్రహాన్ని చూపాలి- అని భావం. **"వన్దరుళ్", "అముదు శెయ్‌దరుళ్"** అనే ప్రయోగాలవంటిదే ఇదికూడా.

శ్రీమద్వేదాంతదేశికులు తమ రహస్యగ్రంథాలలో ఒకటైన ఉపకార సంగ్రహమనే రహస్యంలోని నిర్ణయాధికారంలో ఈ మొదటి పాశురాన్ని మాత్రం వ్యాఖ్యానించడం గమనార్హం.

ఆళ్వార్లు భగవానుని చూచి **"పాయ్‌న్నిన్ఱ ఞానముమ్ పొల్లా వొழுక్కుమ్ అழுక్కుడమ్బుమ్ ఇన్నిన్ఱ నీర్మై ఇని యామురాామై"** అని ప్రార్థించారు. **"పాయ్ న్నిన్ఱ ఞానముమ్, పొల్లా వొழுక్కుమ్, అழுక్కుడమ్బుమ్"** అని మూడిటిని ప్రస్తావించిన తరువాత మళ్ళీ తిరిగి వాటిని **"ఇన్నిన్ఱ నీర్మై"** అని ప్రత్యక్షనిర్దేశం చేస్తూ పల్కడంలోని ఆంతర్యాన్ని పూర్వాచార్యులిద్దఱు నిర్వహించిన తీరు పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యలో ప్రస్తావింపబడింది.

శరీరంలో గాయపడినవాడు, రక్తపు మఱకలను కల్గిన తన వస్త్రాన్ని చూచి ఏవగింపుతో వాటిని ఇతరులకు చూపించేటట్లుగా, ప్రకృతి సంబంధం వల్ల భగవానుని విశ్లేషించి, క్లేశపడడానికి కారణమైన శరీరాన్ని **"ఇన్నిన్ఱ నీర్మై"** అని ప్రత్యక్షంగా నిర్దేశించి చూపిస్తూ పల్కుతున్నారని అమ్మంగియమ్మాళ్ అనే ఆచార్యులు పలికారు.

దండకారణ్యంలోని మునులు రాక్షసులవల్ల గాయపడిన తమ శరీరాలను చూపిస్తూ **"ఏహి పశ్య శరీరాణి"** అని అంటూ పల్కినట్లుగా, ఆళ్వార్లు ఈ శరీర సంబంధంవల్ల క్లేశపడే తమ ఆత్మను భగవానుకు నిర్దేశించి చూపుతూ పల్కుతున్నారు - అని ఆళవందార్ నిర్వాహం. నమ్బిళ్ళై ఈడువ్యాఖ్యలో కూడా అమ్మంగియమ్మాళ్ నిర్వాహం ప్రస్తావింపడింది. అయితే ఇంకొక నిర్వాహం ఆళవందార్ చేసినదిగా తెలుపబడలేదు. అమ్మాళ్ చేసిన నిర్వాహంలో ప్రత్యక్షనిర్దేశం దేహపరంగా అన్వయింపబడగా, ఆళవందార్ నిర్వాహంలో ఆత్మపరంగా చేయ బడింది.

భగవానుని చూచి నమ్మాళ్వార్లు **"ఉయిరళిప్పాన్ ఎన్నిన్ఱ యోనియుమ్ మాయ్ ప్పిఱన్దాయ్"** అని పల్కిన సూక్తిని వివరిస్తూ భట్టర్ పల్కిన ఒక వార్త నంబిళ్ళై వ్యాఖ్యలో తెలుపబడింది.

ఇంతకుముందు భగవంతుడు పలుమార్లు పలు అవతారాలను ఎత్తినా, అతనికి లోకంలోని అందఱిని ఉజ్జీవింపజేసి పరమపదానికి తీసికొనిపోవడం సాధ్యం కాలేదు. తాను ధరించిన వస్త్రంతో మాత్రమే తిరిగి వెళ్ళాడు. దానిని కూడా లోకులు ఎత్తుకొని పోకపోవడమే గొప్ప విషయం. అయితే ఇపుడు ఆళ్వార్లు అవతరించిన తరువాత సర్వేశ్వరుని ఆశ నెఱవేరబోతున్నది కదా! - అని భట్టర్ పల్కినట్లుగా శ్రీవత్సాంకదాసర్ తెలియజేశారని నంజీయర్ అన్నారు.

**పరాంకుశ నాయకిలోని వైలక్షణ్యాన్ని చూచిన సఖి ఆశ్చర్యంతో పల్కడం**

2. **శెఞ్ఞనీర్ త్తడత్తు క్కయల్ మిళిర్న్దాలొప్ప, శేయరి క్కణ్**
**అఞ్ఞనీర్ తుళుమ్బ అలమరుగిన్టన - వాఞ్ఞియరో**
**ముఞ్ఞనీర్ ముగిల్వణ్ణన్ కణ్ణన్ విణ్ణాట్టవర్ మూదువరామ్**
**తొ ఞ్ఞనీరిణై యడిక్కే, అన్బుశూట్టియ శూఞ్ఞ్కుఞ్ఞత్కే**

శెఞ్ఞ నీర్ = నిండుగా నీటిని కల, ముకిల్ = కాలమేఘంవంటి, వణ్ణన్ = వర్ణాన్ని కలవాడైన, కణ్ణన్ = భగవానుని, మూదువర్ ఆమ్ విణ్ నాట్టవర్ తొ ఞ్ఞ నీర్ ఇణై అడిక్కే = అందఱికంటే పూర్వులైన (సనాతనులైన) పరమపదంలోని నిత్యసూరులు నమస్కరించే స్వభావాన్ని (స్థితిని) కల (భగవానుని) శ్రీచరణద్వయి విషయంలోనే, అన్బు శూట్టియ = తమ భక్తిని కల్గి ఉండే, శూఞ్ఞ్ కుఞ్ఞళ్కు = సాంద్రమైన కేశపాశాన్ని కల ఈ కన్యలకు, శెఞ్ఞ నీర్ తడత్తు = మిక్కిలి పుష్కలంగా నీటిని కల ఒక కొలనులోని, కయల్ = సొఱ చేప, మిళిర్న్దాల్ ఒప్ప = మెఱసినట్లుగా (మిలమిలలాడినట్లుగా), శే అరి కణ్ = ఎఱ్ఱని జీరలను కల్గిన కన్నులు, అఞ్ఞ నీర్ తుళుమ్బ = (నాయకుని విరహాన్ని సహించలేనందున) శోకాశ్రువులు చిందగా, అలమరుకిన్టన = తడబడుతున్నవి, వాఞ్ఞి = వారి ఆ భక్తిదశ ఏనాటికీ నిలచి ఉండాలి, దానికి మంగళం (అరో = ఇది "ఆశై").

**భావదీపిక :** గడచిన పాశురంలో ఆఞ్ఞ్వార్లు **"తామాన తన్మై"** (ఆఞ్ఞ్వార్లుగా పలికే స్థితి)లో పలికారు. వారు, ఆ స్థితి ఇపుడు తొలగిపోయి, ఒక నాయకి అవస్థను పొంది పలికే పాశురం- ఈ రెండవ పాశురం. ఆఞ్ఞ్వార్లు స్త్రీ దశను పొంది పలికే మాటలు- మాతృవచనాలు, నాయకీ వచనాలు, సఖీవచనాలు - అని మూడు రీతులుగా ఉంటాయి. ఈ పాశురం సఖీవచనంగా సాగుతున్నది. నాయకిలోని వైలక్షణ్యాన్ని గమనించిన సఖి ఆశ్చర్యపడుతూ ఇందులో పల్కుతున్నది. నాయకికి కల్గిన వైలక్షణ్యాన్ని చూచిన సఖి ఆనందసంభ్రమాలను పొందిన సందర్భం ఇది.

మొదటి పాశురంలో ఆఞ్ఞ్వార్లు **"ఇమైయోర్ తలైవా!"** అని అంటూ భగవానుని ఉత్తమపురుషత్వాన్ని అనుసంధించినందువల్ల, వెనువెంటనే వారికి అతని దరికి చేరాలనే గాఢమైన కోరిక కల్గి అది విజృంభించింది. ఆ రీతిలో అతని దరి చేరలేనందున ఆఞ్ఞ్వార్లు ఆర్తిని పొంది, తల్లడిల్లారు. ఆ ఆర్త్యతిశయం వల్ల తాము పురుషులమనే విషయాన్ని కూడా మఱచిపోయి, పురుషుడు స్త్రీభావాన్ని పొందే

దశ వారికి కలిగింది. ఆ ఉత్కటదశలో పరాకుంశనాయకీభావంతో ఆళ్వార్లు పల్కుతున్నారు. ఆళ్వార్లు- అనే తిరునామాన్ని కోల్పోయారు. పరాంకుశనాయకి- అనే పేరు వారికి కల్గింది. తమకు కల్గిన భక్తిదశను గూర్చి తమ నోటితో పల్కడం కంటే, అన్యుల స్వరంతో (చెలికత్తె గొంతుకతో) వెలువరించడం అందంగా తోచడం చేత సఖి పలికేటట్లుగా పాశురాన్ని పల్కుతున్నారు.

భగవానుడనే నాయకుని పరాంకుశ నాయకి సంశ్లేషించింది. సంశ్లేషానంతర భావియైన విరహం కల్గడం సహజం కనుక, ఆ రీతిలోనే విశ్లేషాన్ని ఆ పరాంకుశ నాయకి పొందింది. ఆ పరాంకుశనాయకిలోని భగవత్సంశ్లేషకృతమైన రూప వైలక్షణ్యాన్ని గమనించి ఆశ్చర్యపడిన ఆమె సఖి పలికే మాటల రూపంలో ఈ పాశురం వ్యక్తమవుతున్నప్పటికీ, భగవానుని శ్రీచరణాలపట్ల ఆళ్వార్లకు కల్గిన భక్త్యతిశయంవల్ల కల్గిన క్లేశాన్ని చూచి "భగవద్విషయంలో ఈ రీతిలో కూడా ఒక అభినివేశం కల్గడమా!'' అని ఆశ్చర్యపడిన ఆళ్వార్ల స్నేహితుల మాటగా దీనిని (స్వాపదేశంలో) స్వీకరించాలి. ఆళ్వార్ల జ్ఞాననేత్రానికి భగవానుడు ఒక పర్యాయం కన్పించగా, అతని దగ్గరకు వెంటనే చేరగోరిన ఆళ్వార్లను ఆ స్వామి అపుడే చేర్చుకొనకుండా అదృశ్యం అయ్యాడు. అపుడు దానివల్ల ఆళ్వార్లకు కల్గిన దుఃఖమే ఈ విరహాతురత.

పాశురంలో చివరి రెండు పాదాలను ముందు అన్వయించి తరువాత మొదటి రెండు పాదాలను అన్వయించాలి. కంఠంవరకు సముద్రజలాన్ని తాగి, ఆకాశంలో పైకెగసిన కాలమేఘం యొక్క నల్లని వర్ణంవంటి వర్ణాన్ని కల్గినవాడైన భగవానుని నిత్యసూరి సేవ్యమైన పాదారవిందాలలో అతిశయించిన రీతిలో భక్తిని పొందిన ఈ పరాంకుశనాయకికి, నాయకుని (భగవానుని) విశ్లేషించిన దుఃఖంచేత, ఈమె కన్నులు దుఃఖాశ్రువులు చిందించే స్థితిని చూస్తే, గొప్ప సముద్రంవలె ఉండే ఒక తటాకంలో దాని విస్తీర్ణం అంతా ఆక్రమించేటట్లు మిలమిలలాడే ఒక పెద్ద సొఱచేప ఆ తటాకం అంతా బురదబురద అయే రీతిలో కుడి ఎడమలకు పొర్లినట్లుగా ఉన్నదని భావం. నేత్రాలకు సొరచేప, కన్నీటి ప్రవాహానికి గొప్ప నీటిని కల తటాకం ఉపమానాలు.

**"వాళ్ళియరో"**- **"వాళ్ళి+అరో"**- అని విడదీసి **"అరో"** అనే పదాన్ని **"అశైచ్చొల్"**గా గ్రహించాలి. **"వాళ్ళియ"** అనే (వియజ్గోళ్- విధ్యర్థక క్రియా రూపం)

పదంలోని చివరి అచ్చు, హల్లు లోపించి **"వాఴి"** అనే రూపం నిలచింది. లేక, **"వాఴియర్+ఓ"** అని విడదీసి, **'వాఴియర్"** అనే దానిని రకారపొల్లును చివర కల్గిన **"వియఙ్గోళ్"** (ఆశంసను విధిని తెలిపే సమాపకక్రియారూపం)గా గ్రహించి, ఓకారాన్ని **"అశైచ్చొల్''**గా గ్రహించవచ్చు. శోకావస్థను తెలిపే ఈ సందర్భంలో మంగళాశాసనం చేసే అవకాశం, ఆవశ్యకత ఏమి ఉన్నది? అని అంటే, భగవద్విషయంలోని భక్త్యుత్కర్షవల్ల ఆఴ్వార్లకు కల్గిన కన్నీరు మున్నీరుగా ఉండే స్థితి వారి స్నేహితులకు మనోహరమైన దృశ్యంగా ఉంటుంది కనుక, "ఈ అవస్థ పరమభోగ్యంగా ఉన్నది. ఇది మాఱకుండా వీరికి ఏనాటికీ స్థిరంగా నిలచి ఉండాలి'' అని పల్లాండు పాడడం యుక్తం. **"వణ్పొన్ని ప్పేరాఱుపోల్ వరుమ్ కణ్ణనీర్ కొణ్డు అరఙ్గన్ కోయిల్ తిరుముఱ్ఱమ్ శేఱు శెయ్ తొణ్డర్ శేవడి చ్చెఴుమ్ శేఱు ఎన్ శెన్నిక్కణివనే"** (ఉదారమైన కావేరీ నదీప్రవాహం వలె వచ్చే కన్నీటితో శ్రీరంగనాథుని కోవెల ముంగిటిని బురద అయేటట్లు చేసే భగవద్భక్తుల విశదమైన పాదాలలోని రేణువులవల్ల కల్గిన బురదను నా తలకు అలంకరించుకొంటాను) అని, **"కణ్డిడక్కూడుమేల్ అదు కాణుమ్ కణ్పయనావదే"** (భక్త బృందాలను చెమ్మగిల్లిన కళ్ళతో దర్శించగల్గితే, అది కదా కన్నులున్నందుకు ఫలం) అని గల కులశేఖర ప్పెరుమాళ్ పల్కిన శ్రీసూక్తులు గమనార్హాలు. **"వాఴి"**- ఈ విరహక్లేశం తొలగి, ఉజ్జీవించాలి -అని కూడా వివరించవచ్చు.

**'విణ్ణాట్టవర్ మూదువరామ్"**- అనే ప్రయోగం **"మూదువరామ్ విణ్ణాట్టవర్"** అని మార్చి అన్వయించాలి. ఇది **"మొఴిమాఱ్ఱు ప్పొరుళ్ కోళ్"** (పదాలక్రమాన్ని మార్చి అర్థం గ్రహించడం). గడచిన పాశురంలో **"ఇమైయోర్"** అనే పదంవలెనే ఈ పాశురంలో కూడా **"విణ్ణాట్టవర్"** అనేది స్వర్గంలో ఉండే దేవతలను నిర్దేశించ కుండా, అన్ని లోకాలకుపైన ఉండే పరమపదంలో ఉండే వారిని తెల్పుతుంది. **"మూదువరామ్"** - అనే విశేషణం ద్వారా ఈ లోకం నుండి పరమపదం చేరిన ముక్తులుకాక, పరమపదంలోనే నిత్యంగా ఉండే అనంతగరుడవిష్వక్సేనాది నిత్య సూరులు వివక్షింపబడ్డారు.

**"తొఴునీర్"**- అనే పదంలో **"నీర్మై"**- అనే **"పణ్బు"** (స్వభావవాచకం)లోని చివర ఉండే **"మై"** అనేది లోపించింది. **"నీర్మై"** అంటే- స్వభావం. నిత్యసూరులచే కొలువబడడమే స్వభావంగా కల్గిన శ్రీచరణాలు- అని ప్రకృతంలో అర్థం.

"ఇణైయడిక్కే అన్బు వైత్త" అని అనకుండా "అన్బు శూట్టియ" అని అన్నందున ఆ*ళ్వా*ర్ల భక్తి భగవానుని శ్రీచరణాలకు అపూర్వాలంకారమని స్ఫురిస్తుంది. "ఆర్వమెన్నదోర్ పూ" (భక్తి అనే అద్వితీయ పుష్పం)అని పెరియా*ళ్వా*ర్లు (4-5-2) కూడా అన్నారు. "శ్రీమత్పరాంకుశము నీంద్రమనోనివాసాత్ తజ్ఞానురాగరసమజ్జన మంజసాఽఽప్య, అద్యాప్యనారతతదుత్థితరాగయోగం శ్రీరంగరాజచరణాం బుజమ్" (అతి మానుషస్తవమ్) అని కూరేశుల సూక్తిలోని తాత్పర్యం ఇక్కడ గ్రహించాలి. "ఇణై యడిక్కే అన్బు శూట్టియ శూ*ళ్*క*ళ*ఱ్కే" అనే పదప్రయోగ వైఖరిచేత-భగవానుని శ్రీచరణాలు ఆ*ళ్వా*ర్ల శిరస్సుకు అలంకారమనే భావం కూడా స్ఫురిస్తుంది. "కోలమామ్ ఎన్ శెన్నిక్కు ఉన్ కమలమన్న కుఱైక*ళ*లే" (నా శిరస్సుకు నీ పద్మాలవంటి, ధ్వనించేపాదాలు అలంకారం) అని నమ్మా*ళ్వా*ర్లు తిరువాయ్ మొ*ళి*లో పలికారు.

నిత్యసూరులు శిరసా వహించే భగవానుని శ్రీచరణద్వయిని తమ శిరస్సుపై ధరించే ఈ ఆ*ళ్వా*ర్లు భగవానుని విశ్లేషించి బాధపడి, శోకాశ్రువులను చిందించే ఈ సన్నివేశం పరమభోగ్యంగా ఉన్నది- అని వారి భక్తులు వ్యక్తం చేసే భావనా రూపంలో ఆ*ళ్వా*ర్లు తమకు స్వామివిశ్లేషంవల్ల కల్గిన ఆర్త్యతిశయాన్ని ఇందులో ప్రకటించారు.

## నాయకుని విశ్లేషాన్ని సహించలేని నాయకి మనస్సులో వేదనను పొందుతూ పల్కడం

3. కు*ళ*ఱ్కోవలర్ మడప్పావైయుమ్ మణ్ మగళుమ్, తిరువుమ్
ని*ళ*ల్పోల్వనర్ కణ్డు నిఱ్కుఙ్గోల్ మీళుఙ్గోల్ ?-, తణ్ణన్దు*ళా*య్
అ*ళ*ల్ పోలడుమ్ శక్కరత్తణ్ణల్ విణ్ణోర్ తొ*ళ*క్కడవుమ్
త*ళ*ల్పోల్ శినత్త, అప్పుళ్ళిన్పిన్ పోన తని నెఞ్జమే

తణ్ = చల్లని, అమ్ = అందమైన, తు*ళా*య్ = తులసీమాలను కలవాడు, అ*ళ*ల్ పోల్ = (అసురులను, రాక్షసులను) నిప్పువలె, అడుమ్ = దహించే, శక్కరత్తు = శ్రీసుదర్శనాన్ని కలవాడైన, అణ్ణల్ = భగవానుడు, విణ్ణోర్ తొ*ళ* కడవుమ్ = పరమపదవాసులు నమస్కరించేటట్లుగా అధిరోహించి నడిపే, త*ళ*ల్ పోల్ శినత్తు అ పుళ్ళిన్ పిన్ = (శత్రువులపట్ల) అగ్నివంటి తీవ్రమైన కోపాన్ని

కల్గిన ఆ గరుడుని వెంట, పోన = పోయిన, తని నెఞ్జమ్ = నా విలక్షణమైన మనస్సు, కుழల్ కోవలర్ = పిల్లనగ్రోవిని కల్గిన గోపాలకులయొక్క, మడమ్ పావైయుమ్ = గుణవతియైన కన్య నప్పిన్నైప్పిరాట్టి, మణ్ మకళుమ్ = భూదేవి, తిరువుమ్ = లక్ష్మీదేవియు, నిழల్ పోల్వనర్ = (భగవానునకు) నీడవలె ఉండగా, వారిని, కణ్డు= చూచి, నిఋ్కుమ్ కొల్ = అచటనే నిలచిపోయినదా?, మీళుజ్గొల్= లేక, తిరిగి వస్తుందా?

**భావదీపిక :** ఇది, నాయకుని విరహాన్ని సహించలేని నాయకి మనస్సు శిథిలమై, పలికే పాశురం. గత పాశురంలో, తన విలక్షణమైన అవస్థను చూచి ఆశ్చర్యపడి పల్కిన సఖిని చూచి "ఆ స్వామి దగ్గరకు పోయిన నా మనస్సు తిరిగివస్తుందా? లేక, రాకుండా అక్కడనే ఉండి పోతుందా?'' అని నాయకి అంటున్నది.

ఆழ్వార్లకు తన దర్శనాన్ని అనుగ్రహించడంకోసం భగవానుడు గరుడుని అధిరోహించి, వచ్చి దర్శనాన్ని ఇచ్చి తిరిగి వెళ్ళిపోయాడు. "ఈ గరుడుని భాగ్యమే భాగ్యం! భగవానుని దర్శనం మనకు కలలో కూడా దుర్లభం. ఈ గరుడుడు రాత్రి పగలు అనే తేడా లేకుండా సదా ఈ స్వామిని వహిస్తున్నాడే! ఈ పరమ భాగవతుని భాగ్యం విలక్షణమైనది ఆహా!'' అని ఆழ్వార్లు తలచారు. వెంటనే వారి మనస్సు ఆ గరుడుని వెంటనే పోయినది. అతడు ప్రవేశించిన పరమపదం వరకు వారి మనస్సుకూడా వెళ్ళింది. అక్కడ పరమపదంలో, లక్ష్మీదేవి, భూదేవి, నప్పిన్నైప్పిరాట్టి- అనే దివ్యదేవేరులు ముగ్గురు భగవానునకు నీడవలె ఉండే రీతిని చూస్తే, ఆ చేరికలోని అందాన్ని అనుభవించడం విడిచి, నా మనస్సు తిరిగి రావడం అరుదు. ఆ చేరికలోని సొబగును దర్శించి అక్కడే ఉండి పోతుందా? లేక, నాస్వామి దగ్గరకు నేను తిరిగి వెళ్ళిపోతాను అని తిరిగి వస్తుందా?'' అని ఆழ్వార్లు సంశయిస్తున్నారు.

ఆழ్వార్లు, తమను తమ మనస్సు విడిచి వెళ్ళిపోయిందని అనడం అసంభావితం కదా! మనస్సు విడిచి వెళ్ళిపోతే మాట పల్కడం వీలుకాదే! మనస్సులో భావించిన తరువాత కదా మాట వెలువడుతుంది. **"అప్పుళ్ళిన్ పిన్ పోన తనినెఞ్జమ్"-** (ఆ గరుడుని వెంటపోయిన నా విలక్షణమైన మనస్సు) అని ఇపుడు పలికే ఆழ్వార్లు తమ మనస్సును కోల్పోయారని ఏవిధంగా భావించవచ్చు? మనస్సుతో కూడి ఉన్నపుడే కదా ఈ మాటను పలికి ఉండాలి. వస్తుస్థితి ఈ

విధంగా ఉండగా, **"పోన తని నెఞ్జమ్.. కణ్డు నిఱ్కుఙ్గొల్! మీళుఙ్గొల్?"** (పోయిన విలక్షణమైన మనస్సు దర్శించి తిరిగి వస్తుందా? అక్కటే ఉంటుందా?) అని అనడం ఏ విధంగా తగును? అని సంశయించనక్కరలేదు. తమకంటే మనస్సును వేఱుగా చేసి పల్కడం చమత్కారమైన ఒక కవి సమయం. భగవానుని గరుడునిపై సేవించాలని, దివ్యదేవేరులు ముగ్గురి చేరికలో స్వామిని సేవించాలని మనస్సు ఆశను పొందినది. ఈ ఆశ ఈ రీతిలోనే వృద్ధిచెందుతుందా? లేక, ఈ **"ఇరుళ్ తరుమా ఞాలమ్"** (అజ్ఞానప్రదమైన విశాలమైన భూమి) లోని తామసస్వభావం వల్ల ఈ ఆశ మాఱిపోయి, **"ఉణ్డియే ఉడైయే ఉగన్దోడుమ్ ఇమ్మణ్డలమ్"** (తిని, వస్త్రధారణ చేసి, ఆనందంగా తిరిగే ఈ భూమండలం) లో ఉండేవారికి ఉండే లౌకికవాంఛయే మనకు కూడా కల్గుతుందా? దైవాధీనంగా, భగవత్కటాక్షంవల్ల కలిగే మనోరథమే మనకు స్థిరంగా నిలచి ఉండాలి- అనే భావమే ఈ పాశురం వ్యక్తం చేస్తున్నది.

శ్రీరామచంద్రుడు వనవాసంకోసం బయలుదేరిన వెంటనే **"రామం మేఽనుగతా దృష్టి రద్యాపి న నివర్తతే, న త్వా పశ్యామి కౌసల్యే!"** (కౌసల్యా! రాముని అనుసరించిన దృష్టి ఈ నాటికీ తిరిగిరాలేదు. నిన్ను నేను చూడలేకున్నాను) అని అంటూ కౌసల్యను ఉద్దేశించి దశరథచక్రవర్తి అన్నాడు. "నా దృష్టి శ్రీరాముని అనుసరించి పోయింది. అది ఇంకా తిరిగి రాలేదు. దృష్టిని కోల్పోయినందున, ఓ దేవీ! నా దగ్గరలో ఉండే నిన్నుకూడా నేను చూడలేకపోతున్నాను'' అని దశరథుడు అన్నాడు. అందువల్ల, కన్నులు ఆశ్రయాన్ని వీడి శాశ్వతంగా వెళ్ళిపోయిందనే అర్థాన్ని చెప్పగలమా! "శ్రీరాముని తప్ప వేఱు ఏ వస్తువును నేను చూడగోరడం లేదు'' అనేదే ఈ సందర్భంలోని తాత్పర్యం. అదే రీతిలో, ఇక్కడ కూడా. **"కుழల్కోవలర్ మడప్పావైయుమ్ మణ్మకళుమ్ తిరువుమ్"** (పిల్లనగ్రోవిని నిరూపకంగా కల్గిన గోపాలకుల కన్య నీళాదేవి, భూదేవి, లక్ష్మీదేవి) అనే ముగ్గురు దేవేరులతో కలసి వేంచేసి ఉండే సన్నివేశాన్ని, గరుడునిపై వేంచేసి ఉండే సన్నివేశాన్ని మాత్రమే సేవించాలని మనోరథించడమే ప్రకృతతాత్పర్యం.

**"అప్పుళ్ళిన్ పిన్ పోన తని నెఞ్జమ్"** అనే ఈ ప్రయోగాన్ని లోతుగా గమనించి చూస్తే, ఒక గొప్ప అంతరార్థం వ్యక్తమవుతుంది. **"సుపర్ణోఽసి గరుత్మాన్"** అని ఆరంభమవుతున్న వేదవాక్యానుసారంగాను, **"వేదాత్మా విహగేశ్వరః"** (గరుడుడు

వేదస్వరూపి) అనే శ్రీయామునులు సూక్తి రీతిలోను గరుడుడు వేదస్వరూపికనుక, గొప్ప ప్రమాణమైన వేదాన్ని తమ మనస్సు అనుసరిస్తున్నది- అనే అర్థం సూచింపబడింది. **"తఱ్పూల్‌పోల్ శినత్త అప్పుళ్"** అని అంటూ శత్రువులను నశింపజేయగల పరాక్రమం తెలుపబడినందున, ఆ వేదప్రమాణం బాహ్య మతాలను నిరసించగల్గినది- అని తెలుపబడింది. **"శక్కరత్తణ్ణల్ కడవుమ్ పుళ్"** అని అన్నందున ఆ ప్రమాణం సర్వేశ్వరాధీనమని వ్యక్తమవుతున్నది. **"విణ్ణోర్ తొఱ్పూక్కడవుమ్"** అని అన్నందున ఆ ప్రమాణబలంవల్ల దేవతలు (నిత్యసూరులు) అందఱు భగవానునకు దాసులే- అనేది తెలుస్తున్నది.

**"కుఱ్పూఱ్కోవలర్ మడప్పావై"**- నప్పిన్నై ప్పిరాట్టి కుంభుడనే గోపాలకుని కుమార్తె. పిల్లనగ్రోవిధ్వనితో జ్ఞానహీనాలైన పశువులను కూడా వశీకరించుకోగల్గిన గోపాలుర కులంలో పుట్టినందున తన సూక్తి మాధుర్యంతో సర్వజ్ఞుడైన భగవానుని వశీకరించుకోగల్గినది- అనే విశేషార్థాన్ని ఇక్కడ తెలియాలి. **"కుఱ్పూల్"** అనే పదానికి పిల్లనగ్రోవి - అనే అర్థాన్ని గ్రహిస్తే, అది **"కోవలర్"** అనే పదానికి విశేషణం. **"కేశపాశ"**మనే అర్థాన్ని గ్రహిస్తే **"కోవలర్ మడప్పావై"** అనేదానికి విశేషణం. అపుడు గొప్ప కేశపాశాన్ని కల్గిన నీళాదేవి- అని దీని తాత్పర్యం. **"గోపాల"** అనే సంస్కృతశబ్దం **"కోవల"**అని మాఱింది. **"మడప్పావై"**- అంటే స్త్రీలకు ఉండదగిన- **"నాణమ్, మడమ్, అచ్చమ్, పయిర్పు"**- (సిగ్గు, అణకువ, భయం, లావణ్యం) ఇత్యాది గుణాలనన్నిటిని నిండుగా కల్గినదని భావం. తెలిసీ తెలియని స్థితిలో ఉండే కన్య **"మడప్పావై"**- అనబడుతుంది. **"పావై"** - అంటే చిత్తప్రతిమ వలె అందమైనది - అనే అర్థం కనుక, ఇది **"ఉవమై ఆకుపెయర్"** (సాదృశ్యనిబంధనమైన లక్షకపదం) ఈ నప్పిన్నై ప్పిరాట్టి శ్రీకృష్ణావతారంలో భగవానుని చిత్తానికి మిక్కిలి అభీష్టమైనది. కనుక, ఎవరికీ నియంత్రించడానికి సాధ్యం కానివై, ఆసుర స్వభావాన్ని కల్గినవై, మిక్కిలి బలాన్ని కల్గిన ఏడు పొగరుటెద్దులను శ్రీకృష్ణుడు తన బలిమితో అణచి, జయించి వధించి, ఆ విజయాన్నే నప్పిన్నై తండ్రిమాట ప్రకారం కన్యాశుల్కంగా చేసి, ఈమెను వివాహమాడాడు- అనేది నప్పిన్నై వివాహ వృత్తాంతం. ఈమె నీళాదేవియొక్క అంశభూతురాలైనందున ఇక్కడ శ్రీదేవి, భూదేవి, నీళాదేవి- అనే ముగ్గురు తెలుపబడినారు. ఈ దివ్యపత్నులు ముగ్గురు భగవానుని విడువకుండా అనుసరించి ఉన్నందున, ఆ స్వామి ఆనందాన్ని కారణభూతలైనందున, అతనికి పరతంత్రలై ఉన్నందున **"నిఱ్పూల్‌పోల్‌వనర్"** అని

అనబడింది. "భగవానునకు ఛాయాసమానలు"- అనే అర్థాన్ని గ్రహించడమే కాక, వీరు తమలో ఒకరికొకరు (సవతిపోరును కల్గి ఉండకుండా) నీడవలె సమానమైన మనస్సును కలవారై ఉన్నారనే అర్థాన్ని కూడాఇక్కడ చెప్పవచ్చు. శ్రీపరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవంలో **"లక్ష్మీం విహారరసికామివ రాజహంసీం ఛాయా మివాభ్యు దయినీ మవనీం చ తస్యాః"** (భగవానుడనే సరస్సులో విహరించడంలో ఆసక్తిని కల్గిన రాజహంసవంటి లక్ష్మీదేవిని, ఆమెకు అభ్యుదయాన్ని కల్గించే, ఆమె నీడవంటి భూదేవిని)అని, శ్రీగుణరత్నకోశంలో **"దేవి! త్వా మనునీళయా సహ మహీదేవ్యః సహస్రం తథా యాభి స్త్వం స్తవబాహుదృష్టిభి రివ స్వాభిః ప్రియం శ్లాఘసే"** అని పల్కిన సూక్తులు ఇక్కడ స్మరణీయాలు. భక్తులకు నీడవంటివారనే అర్థాన్ని గూడా చెప్పవచ్చు.

**(కణ్డు నిఱ్కుఙ్గొల్ మీళుఙ్గొల్)**- ఈ రెండు విరుద్ధ భావాలు సందేహం వల్ల కల్గినవి. ఈ దేవేరులు భగవానుని విడచి ఉండని రీతిలో మనకు కూడా నిత్యయోగం లభిస్తుందా! లేక, ఇంకా మాఱి మాఱి పలు జన్మలు జన్మించే రీతి కల్గుతుందా?- అని ఆఴ్వార్లు కళవళపడుతున్నారు. **"తణ్ణమ్ తుఴాయ్ అఴల్ పోల్ అడుమ్ శక్కరత్తణ్ణల్"**- అనే ప్రయోగానికి చల్లని తులసిని, అగ్నివలె దహించే చక్రాన్ని కల స్వామి- అనే అర్థం ఇతః పూర్వం తెలుపబడింది. వేఱు రీతిలో కూడా అర్థాన్ని చెప్పవచ్చు. చల్లని తులసియొక్క దళంవలె తపింపజేసే చక్రాన్ని కల్గిన స్వామి- అనే అర్థాన్ని చెప్పవచ్చు. చల్లని తులసి తపింపజేస్తుందా? అంటే, **"మేవు తణ్ మదియుమ్ వెమ్మదియు మాలో! మెన్ మలర్పళ్ళి వెమ్పళ్లియాలో!"** (చల్లని చంద్రుడు కూడా వేడి చంద్రుడైనాడు, అయ్యో! మెత్తని పూలపాన్పు అగ్నివలె దహించే పాన్పు అయినది, అయ్యో!) అనే రీతిలో భగవానుని విశ్లేషించిన స్థితిలో తపింపజేస్తుంది. విరహిణులకు ఇది అనుభవసిద్ధం. ఆఴ్వార్లు ఇపుడు విశ్లేషాసహిష్ణుదశలో ఉన్నందున ఈ విధంగా భావించడం యుక్తం. **"అణ్ణల్"**- ఇది పుంలింగ గౌరవవాచకం. **"తని నెఞ్జమ్"** - నన్నువిడచి, అక్కడ ముఖాన్ని చూపలేక, ఒంటరిగా ఉండే మనస్సు- అని అర్థం.

ఆఴ్వార్లు, తమ మనస్సు వేదాలలో ప్రవేశించి, ఆ ప్రమాణాల మూలంగా శ్రియఃపతిని అనుభవించడం ఆరంభించింది- అని, ఈ దివ్యానుభవం మాఱిపోతుందో! లేక, మాఱకుండా నిత్యంగా ఉంటుందో? అని తమకు సందేహంగా ఉన్నది- అని ఈ పాశురం ద్వారా వ్యక్తం చేశారు.

"అప్పుళ్ళిన్ పిన్ పోన తని నెఞ్జమ్ కణ్డు నిఱ్కుఙ్గొల్? మీళుఙ్గొల్ ?" అనే సూక్తిని వివరిస్తూ పూర్వాచార్యులు చేసిన నిర్వాహాలు కొన్ని నమ్బిళ్ళై ఈడు వ్యాఖ్యలో ప్రస్తావింపబడ్డాయి.

భగవానునిపట్ల తమకు గల అభినివేశం కేవలం మానసానుభవంగానే నిలచిపోతుందా? లేక, యథార్థంగా భగవానుని సాక్షాత్తు దర్శించే భాగ్యం లభిస్తుందా? అని ఆళ్వార్లు ప్రశ్నిస్తున్నారని ఇచటి స్వాపదేశార్థంగా తిరుమలైనంబి తెలిపినట్లు పిళ్ళై తిరునఱైయూర్ అరైయర్ పలికారు.

చిరకాలంగా నాకు లౌకికజీవితంతో గల సంబంధాన్ని తీర్చాలి- అని ఆళ్వార్లు ప్రార్థించేటట్లుగా, గొప్ప రూపసౌందర్యాన్ని కల్గిన భగవానుని మొట్ట మొదట దర్శించినపుడు కలిగే ఆ ఆనందాన్ని తట్టుకొని తమాయించు కొనే శక్తి తమ మనస్సుకు ఉంటుందా? ఉండదా?- అని ఆళ్వార్లు సందేహ పడుతున్నారని భట్టర్ పల్కినట్లు నంజీయర్ తెలిపారు.

మొదటి రెండు పాశురాలతో తాము భగవానునకు శేషమై ఉండే రీతిని పల్కిన ఆళ్వార్లు, ఈ మూడవ పాశురంతో తమ మనస్సు గరుడుని వెంబడించి పోయిందని పల్కినందున, దాస్యంలో చరమావధి అయిన భాగవత దాస్యాన్ని కల్గిఉండడాన్ని తెలిపి ఆనందిస్తున్నారు-అని నమ్బిళ్ళై ఇక్కడ అర్థనిర్వాహాన్ని చేశారు.

**నాయకుని విశ్లేషించిన నాయకి చల్లగాలికి తాళలేక బాధతో పల్కడం**

**4. తని నెఞ్జమ్ మున్నవర్ పుళ్ళే కవర్న్దదు, తణ్ణన్దుழాయ్**
**క్కిని నెఞ్జమిఙ్గు క్కవర్వదు యామిలమ్-, నీ నడువే**
**ముని వఞ్జ ప్పేయ్చ్చిములై శువైత్తాన్ ముడిశూడు తుழాయ్**
**పనినఞ్జ మారుదమే!, ఎమ్మదావి పనిప్పియల్వే?**

తని నెఞ్జమ్ = (నాతో) సంబంధం లేని ఒంటరి అయిన నా మనస్సును అంతా, మున్ = ముందుగానే, అవర్ పుళ్ళే = ఆ స్వామియొక్క గరుడుడే, కవర్న్దు = (ఇతరులకు కొంచెంకూడా మిగలని రీతిలో) అపహరించు కొనిపోయాడు. (అందువల్ల), తణ్ అమ్ తుழాయ్క్కు = ఆ స్వామియొక్క చల్లని, అందమైన తులసిని, కవర్న్దు = అపహరించుకొని పోవడానికి తగిన, నెఞ్జమ్ = ఇంకొక మనస్సు, ఇని ఇఙ్గు యామ్ ఇలమ్ = ఇక ఇక్కడ మేము కల్గినవారం కాము,

(స్థితి ఈవిధంగా ఉండగా),ముని = కోపించే స్వభావాన్ని కల, వఞ్జమ్ పేయ్చ్చి= వంచనను కల పిశాచి (స్త్రీ) అయిన పూతనయొక్క, ములై = (విషం పూసిన) స్తన్యాన్ని, శువైత్తాన్ = (ఆకలి తీరేటట్లుగా) రుచి చూచి, ఆరగించిన శ్రీకృష్ణుని యొక్క, ముడి శూడు తుయ్ాయ్ = శిరస్సుపై చుట్టబడిన (అలంకరించబడిన) తులసియొక్క, పని నఞ్జమ్ మారుతమే = చల్లదనాన్ని కల, విషంవంటి మారుతమా!, నీ నడువే = నీవు మధ్యలో ప్రవేశించి, ఎమ్మదు ఆవి పనిప్పు = (ఇంతకుముందే క్లేశపడుతున్న) మా ప్రాణాన్ని ఇంకా జంకేటట్లు చేయడం, ఇయల్వే = నీకు తగిన స్వభావమేనా? (కాదుకదా).

**భావదీపిక** : నాయకుని విశ్లేషించి, ఆ విరహాన్ని సహించలేని నాయకి చల్లగాలివల్ల బాధను పొంది పలికే పాశురం, ఇది. విడచిపోయిన నాయకుని వెంట తన మనస్సుకూడా పోగా, దానిని కోల్పోయిన నాయకి, ఆ నాయకుని తులసీ మాలలో తనకు గల అభినివేశంచేత క్లేశపడుతున్న సమయంలో, ఆ తులసీపరిమళ సంబంధాన్ని కల్గిన వాయువు ఆమెపై వీచి ఆమెను మఱింత బాధపెట్టింది. దానిని సహించలేక, "మనస్సును కోల్పోయి బాధపడే నన్ను నీవుకూడా వచ్చి శత్రువువలె బాధించడం తగదు సుమా!" అని ఆ మారుతాన్ని ఉద్దేశించి, నాయకి పల్కుతున్నది.

గడచిన పాశురంలో ఆళ్వార్లు **"అప్పుళ్ళిన్ పిన్ పోన తని నెఞ్జమే"** అని ప్రమాణపూర్వకంగా భగవానునిపట్ల తమ మనస్సు ఆసక్తమై అతని వెంట పోయిన విషయాన్నిగూర్చి అనుగ్రహించారు. ఆ విధంగా ఆ స్వామివెంట పోయిన తమ మనస్సుకు ఈ లోకంలో ఉండే భోగ్యపదార్థాలలో ఏ ఒక్కటి కూడా తమకు ప్రియంగా ఉండకపోవడమేకాక, అవి హింసిస్తున్నవి - అని దీనిద్వారా తెల్పు తున్నారని తెలియాలి.

**(తని నెఞ్జమ్ మున్ అవర్పుళ్ళే కవర్న్దదు)** - **"అప్పుళ్ళిన్ పిన్ పోన తని నెఞ్జమే"** అని గడచిన పాశురంలో పల్కిన విషయం దృఢమైనదని తోచేటట్లు ఆ విషయమే మళ్ళీ ఇక్కడ అనువదింపబడింది. భగవానుని తెలియడానికి గొప్ప ప్రమాణమైన వేదంయొక్క దారిలోనే నా మనస్సు ఊనికను (నిష్ఠను) కల్గి ఉన్నదని ధ్వన్యర్థం.

**(తణ్ణమ్ తుయ్ాయ్క్కు ఇని నెఞ్జ మిఙ్గ యామిలమ్)**- తులసి ఏవిధంగా పచ్చగా ఉండి మనస్సును అపహరిస్తున్నదో, ఆ విధంగా మనస్సును అపహరించ

గల్గిన మాయ- అనే ప్రకృతియే ఇక్కడ **"తణ్ణమ్ తుழாయ్"** అనే పదంద్వారా సూచింపబడింది. వేదప్రమాణమూలంగా భగవద్విషయంలో ఆసక్తమైన నా మనస్సును ఇక ప్రకృతి ఆక్రమించి, స్వాధీనం చేసికోవడం సాధ్యం కాదు- అని దీని భావం.

ఆழ்వార్లు భగవానుని విశ్లేషించి బాధపడేటపుడు భగవానుని సంబంధాన్ని కల్గిన వస్తువులన్నీ విరహోద్దీపకాలుగా ఉంటాయి. కనుక, "అయ్యో! ఇతఃపూర్వమే గాయపడిన నన్ను తులసి ఇంకా బాధించాలా? తులసీ సుగంధాన్ని కల మారుతం ఇపుడు ఎందుకోసం నాపై వీస్తున్నది? అతడు, నేను కలసి ఉన్నపుడు కదా ఇది భోగ్యంగా ఉంటుంది. ఇపుడు ఇది బాధకే కారణమవుతున్నదే?" అని తులసిని ఉద్దేశించే పల్కుతున్నారని కూడాచెప్పవచ్చు. సంశ్లేషకాలంలో ఆనందాన్ని ఇచ్చే వస్తువులన్నీ విశ్లేషకాలంలో బాధను కల్గిస్తాయి. కనుక, తులసికి అతనితో సంబంధం కల వాయువుకు నాయకి భయపడడం తగినదే.

**కవర్‌వదు+యామ్ = కవర్‌వదియామ్.** సంధివల్ల వచ్చిన అక్షరంలోని మార్పు. **"యవ్వరిన్ ఇయ్యుమ్"** అని నన్నూల్ సూత్రం.

శ్రీకృష్ణుని పుత్రునిగా పొందిన దేవకికి సహోదరుడై, ఆ శ్రీకృష్ణునకు మేనమామయైన కంసుడు, తనను చంపడంకోసం పుట్టిన ఆ దేవకీపుత్రుడు రహస్యంగా రేపల్లెలో పెరుగుతున్నట్లు తెలిసి, ఆ శ్రీకృష్ణశిశువును వెదకి పట్టుకొని వధించడంకోసం పలువురు అసురులను నియోగించాడు. వారిలో ఒకతె పూతన అనే రక్కసి. ఆమె చక్కని స్త్రీరూపాన్ని శ్రీకృష్ణశిశువును ఎత్తుకొని, విషం పూసిన తన స్తన్యాన్ని ఇచ్చి చంపాలని చూచింది. భగవానుడైన ఆ శిశువు ఆ రక్కసి స్తనాలను తన చేతులతో గట్టిగా పట్టుకొని, పాలను తాగే భావనలో ఆమె ఉసురును పీల్చగా, ఆమె పెద్దగా ఆక్రందించి క్రిందపడి నిజరూపంతో మరణించింది- అనేది పూతనానిరసన వృత్తాంతం.

ఈ వృత్తాంతాన్ని ఇక్కడ అనుసంధించి, **"ముడిశూడు తుழாయ్ ప్పనినెఙ్ఞ మారుతమే!"**- అటువంటివాని కిరీటానికి అలంకారంగా చుట్టబడిన తులసియొక్క పరిమళాన్ని వీచే ఓ మారుతమా! అని సంబోధించడంలోని తాత్పర్యం ఏమంటే- వంచన చేయాలని వచ్చిన పూతనవంటివారి ఉసురును తీయడమే తులసిని

అలంకరించుకొన్నవాని కార్యం. నీవు ఆ రీతిలో కాకుండా, భక్తిని కలవారి ప్రాణాలను కూడా తీస్తున్నావే! ఇది తగునా?- అని.

**(ఎమ్మదావి పనిప్పియల్వే!)** - మనస్సు తమను విడచి, స్వామివద్దకు పోయినట్లుగా, ప్రాణాలు కూడా పోయి ఉండవచ్చు. అంతటి నిశ్చయం ఈ పాడు ప్రాణాలకు లేదు- అనే భావం తోచేటట్లుగా **"ఎమ్మదు ఆవి"** అని (హార్దంగా) అన్నారు.

**(పనిప్పు ఇయల్వే)** - "అందటి తాపాన్ని తీర్చగల్గిన నీవేనా, మనస్సును కోల్పోయినవారిని ఈ చిత్రవధను చేయడానికిగా ఉన్నావు! ఇది నీకు తగదు"- అని భావం. **"పనిప్పు" - "పు"** అనే ప్రత్యయాన్ని చివర కల్గిన **"తొ*ழி*ల్ పెయర్"** (పనిని తెలిపే పదం). చివరలో (**"ఇయల్వే"** అనేచోట) గల ఏకారం వ్యతిరేకార్థకం (**"ఎదిర్మఱై"**). నీకు స్వభావం కాదని భావం.

ఈ పాశురంలో మొదటి పాదంలో భగవానుని ఉద్దేశించి, **"అవర్"** అని బహువచనంలో పల్కి, మూడవ పాదంలో **"ములై శువైత్తాన్"** అని ఏకవచనంలో పల్కడం దోషం కాదా? - అని అంటే, కాదు. ఈ విధంగా పల్కడానికి ద్రావిడంలో **"వ*ழு*వమైది"** (బహు ప్రయోగసమ్మతమైన వ్యాకరణ విరుద్ధ ప్రయోగం) అనబడుతుంది. భగవానుడు తనను విశ్లేషించిన రీతిని భావించి కోపాన్ని పొందిన నాయకి, తన కోపం స్ఫురించేటట్లు **"అవర్"** అని బహువచనంలో ఉపాలంభ నాత్మకంగా పల్కింది. స్వామి, పూర్వం చేసిన పూతనానిరసమనే ఉపకారాన్ని తలచి కోపం ఉపశమించగా, మూడవ పాదంలో **"శువైత్తాన్"** అని సహజమైన ఏకవచనంలో పల్కింది.

### చల్లగాలికి క్లేశపడే నాయకిలోని వైవర్ణ్యాన్ని చూచి సఖి దుఃఖించడం

5. **పనిప్పియల్ వాక ఉడైయ తణ్వాడై, ఇక్కాలమి వ్వూర్**
   **పనిప్పియల్వెల్లామ్ తవిర్న్దెరివీశుమ్, - అన్దణ్ణన్దు*ழ*ాయ్**
   **పనిప్పుయల్ శోరుమ్ తడజ్గణ్ణి మామై త్తిఱత్తుక్కొలామ్?**
   **పనిప్పుయల్ వణ్ణన్, శెజ్గోల్ ఒరు నాన్టు తడావియదే**

పనిప్పు ఇయల్ ఆక ఉడైయ = చల్లబఱచడం- అనేదానిని స్వభావసిద్ధమైన వృత్తిగా కల, తణ్ వాడై = చల్లని గాలి, ఇ కాలమ్ = ఇపుడు ఈ సమయంలో

మాత్రం, ఇ ఊర్ = ఈ ఊరులో మాత్రం, పనిప్పు ఇయల్వు = చల్లబఱచడమనే తన స్వభావాన్ని, ఎల్లామ్ తవిర్న్దు = పూర్తిగా విడచిపెట్టి, ఎరి వీశుమ్ = వేడిమిని వీస్తున్నది. (ఈ విధంగా), పని పుయల్ = చల్లని కాలమేఘంవంటి, వణ్ణన్ = స్వభావాన్ని కల భగవానుని, శెజ్గోల్ = ఏనాడూ మాఱని ఆజ్ఞ, ఒరు నాన్టు తడావియదు = ఒక్కొక్క సమయంలో వక్రంగా అవుతున్నది, అమ్ తణ్ణమ్ తుళ్ళాయ్ = అందమైన, చల్లని (ఆ స్వామియొక్క) తులసి విషయంగా (ఆశపడి), పని పుయల్ శోరుమ్ =చల్లని వర్షపుకణాలను కల మేఘంవలె నీటిని (కన్నీటిని) వర్షించే, తడ కణ్ణి = విశాలమైన నేత్రాలను కల ఈమెయొక్క, మామై తిఱత్తు కొల్ ఆమ్ = మేని వర్ణాన్ని పాడు చేయడంకోసమే కాబోలు!

**భావదీపిక :** విశ్లేషదశలో చల్లని మందమారుతంవల్ల క్లేశపడి మేనిలావణ్యాన్ని పోగొట్టుకొన్న నాయకియొక్క అవస్థను చూచి ఆమె సఖి జాలిపడి పలికే పాశురం ఇది. అందఱియొక్క, అన్ని విధాలైన తాపాలను ఉపశమింపజేయడమే స్వభావంగా కల మందమారుతం ఇపుడు ఈ ఊరిలో ఈమెను దహిస్తున్నది. దహించడం అనేది అగ్నియొక్క స్వభావమే తప్ప మారుత స్వభావం కానేరదు. చల్లగా చేయడమే స్వభావంగా కల మారుతానికి ఈ విధంగా స్వభావం మాఱడానికి ఏమి కారణం? ''ఈమె మేనివర్ణాన్ని నశింపజేయాలి''- అని భావించిన భగవానుడు తన ఆజ్ఞాస్వభావాన్ని మార్చుచేసి, మారుత స్వభావాన్ని వేఱుచేసి దానిని పంపాడు కాబోలు! ఈ ఈ వస్తువులు ఈ ఈ స్వభావాలను కల్గినవై ఉండాలి- అని సృష్ట్యారంభంలో భగవానుడొక నియతిని ఏర్పరచాడు. దాని క్రమంలోనే, చల్లదనాన్ని స్వభావంగా కల్గినదై ఉండదగిన మారుతం ఇపుడు దహించడం అనేదానిని స్వభావంగా కల్గినది- అంటే- భగవానుడు తాను పూర్వం చేసిన వ్యవస్థను తానే మార్చుచేసి ఉండాలి. "మందమారుతం పరాంకుశనాయకికి తాపాన్ని కల్గించాలి'' అని సంకల్పించాడు కాబోలు ! - అని సఖి జాలిగా అంటున్నది.

భగవత్సన్నిధిని చేరడంలోని ఆలస్యాన్ని సహించలేక త్వరపడే ఆళ్వార్లకు ఇహలోకంలోని వస్తువులన్నీ వెగటును కల్గిస్తున్నాయి- అని మధురకవులవంటివారు పలికే భావనతో ఆ ఆళ్వార్లు తమ అవస్థను వ్యక్తం చేస్తున్నారనేది ఈ పాశురంలోని స్వాపదేశార్థంగా గ్రహించాలి. ఈ లోకంలో ఉండే ప్రాకృతులకు ఆనందాన్ని కల్గించే వస్తువులు ఆళ్వార్లకు వెగటును, దుఃఖాన్ని కల్గించేవిగా తోచడం మొదటి రెండు

పాదాలలో సూచింపబడింది. ఇక్కడ ఈ లోకంలో ఉండే అందరినీ ఆనందింపజేసే శబ్దాదివిషయాలు తిరుక్కురుకూరుర్‌లోని ఈ ఆళ్వార్లకు మాత్రం వెగటు కల్గడానికి లక్ష్యమయ్యాయి - అని భావం.

**"తణ్‌వాడై"** అనిగాని, **"పనిప్పియల్‌వాక వుడైయ వాడై"** అని గాని అంటే చాలు కదా ! ఈ రెండు విశేషణాలను ప్రయోగించడం ఎందుకు? వృత్తిస్వభావాన్ని **("తొళ్ళిల్ పణ్బు")**, గుణ స్వభావాన్ని **("కుణప్పణ్బు")** ఉద్దేశించి ఈ విధంగా రెండు విశేషణాలను ఆళ్వార్లు ప్రయోగించారు. పంచభూతాలలో ఒకటైన వాయువు, ఇంకొక భూతమైన అగ్నియొక్క స్వభావాన్ని పొందిన ఈ అనీతి ఇంతకు ముందెపుడూ లేదు. ఇక ఏ చోట ఉండదు. అతనిని విశ్లేషించిన ఈ సమయంలోనే, విశ్లేషించి ఒంటరిగా ఉండే ఈ ఊరిలోనే- అనే భావం స్ఫురించేటట్లుగా **"ఇక్కాల మివ్వూర్"** అని ప్రయోగింపబడింది. ఈ మారుతం పూర్వం ఈ పరాంకుశనాయకికే భోగ్యంగా ఉన్నదనే విషయం తెలిసేటట్లుగా **"ఇక్కాలమ్"** అని అనబడింది. ఈ పరాంకుశనాయకియొక్క చూచిన తిరునగరి లోనివారిని కూడా ఈ మందమారుతం తపింపజేసినందున **"ఇవ్వూర్"** అని అనబడింది. గరుడుని ద్వారా స్వామి పరాంకుశనాయకి మనస్సును అపహరించు కొని పోయాడు. మందమారుతాన్ని పంపి మేనిలోని కాంతిని అపహరించు కొనిపోవాలని తలచి, మారుతం దహించే స్వభావాన్ని కల్గినదిగా అయేటట్లు సంకల్పించి, దానిని నియోగించి ఉండవచ్చు- అనే భావం స్ఫురించేటట్లుగా **"మామై తిఱత్తుక్కొలామ్"** అని అనబడింది.

**(పుయల్ వణ్ణన్)** - మేఘంవంటి నల్లని వర్ణాన్ని, ఆ మేఘంవలె తాపాన్ని తీర్చి ప్రత్యుపకారాన్ని ఎదురు చూడకుండా, చేసే సహజమైన చల్లని గుణాన్ని కల్గినవాడని ప్రసిద్ధి చెందిన స్వామి ఇపుడు విరుద్ధసంకల్పాన్ని చేసి, బాధించడం ఆరంభించాడే! అని పలుకబోయి, "ఇపుడు నన్ను బాధించే ఈ స్వామియొక్క సహజస్వభావం మాత్రం ఇది'' అని సఖి సూచించింది. స్వామి మేఘవర్ణుడై ఉండి, ఇపుడు ఈమెను క్లేశపెడుతున్నాడే! అతడు వాయువు స్వభావాన్ని మాత్రమే మార్చలేదు. తన సహజస్వభావాన్ని కూడా మార్చుకొన్నాడు- అని హార్దభావం.

"నెడుమ్ కడల్ నిఱ్పదుమ్ **ఖాయిఱు** కాయ్‌వదుమ్ ని**ఱ్ఱ**లుమ్ కాల్ ఒడుజ్గి నడప్పదుమ్ తణ్ కార్ పొ**ళ్ళి**వదుమ్ ఊ**ళ్ళి**దనిల్ కడుమ్ కనల్ ప**ఱ్ఱి**

చ్చడాదే యిరుప్పదుమ్ తువ్మై పునైన్దు అడుమ్ కనలాఱ్ఱి అరజ్గేశర్ తన్ తిరువాణైయినే" (విశాలమైన సముద్రం తన పరిధిలో నిలువడం, సూర్యుడు ఎండను కాయడం, వాయువు వీచడం, చల్లని మేఘం వర్షించడం అంతా జ్వలించే శ్రీసుదర్శన ధారి అయిన శ్రీరంగనాథుని ఆజ్ఞవలననే) (తిరువరఙ్గక్కలమ్బకమ్-15) అనే రీతిలో లోకంలోని సృష్టింపబడిన వస్తువులన్నీ ఆ యా సహజస్వభావాలను కల్గి ఉండడం భగవదాజ్ఞవలననే కనుక, ఇక్కడ మందమారుతంయొక్క గుణం మాఱడం భగవానుని ఆజ్ఞలోని వక్రతవల్లనే సంభవించిందని నాయకి సూచించింది.

**(ఒరునాస్టు తడావియదే)** భగవానుని ఆజ్ఞాప్రకారం అనేది ఏనాడు తన స్థితిని కోల్పోదు. అటువంటిది ఈమె లావణ్యాన్ని నశింపజేయడంకోసం ఈ సమయంలోమాత్రం స్థితిని కోల్పోయింది.

ఈ పాశురాన్ని సఖీవచనంగా కాకుండా, మాతృవచనంగా కూడా గ్రహించవచ్చు. **"తణ్ణమ్"** అనే పదంలో **"అమ్"** అనేది గుణవాచక ప్రత్యయం- **("పణ్బుప్పెయర్ వికుతి")** అనిగాని, **"శారియై"** (నామవాచక, విశేషణ పదాలను కలిపే పదం) అని కాని చెప్పవచ్చు. **"తడావియదు"**- వక్రించింది. **"తడ"**- అనే పదం వక్రంగా ఉండేదానిని తెల్పుతుంది కనుక, తన్మూలంగానే **"తడావియదు"** అనే పదం పుట్టిందని చెప్పవచ్చు.

### నాయకి అందాన్ని చూచి ఆశ్చర్యపడి నాయకుడు పల్కడం

**6.** **తడావియ వమ్బుమ్ మురిన్ద శిలైగళుమ్ పోగవిట్టు,**
**కడాయిన కొణ్డొల్కుమ్ వల్లి యిదేనుమ్-, అశురర్ మఙ్గ**
**క్కడావియ వేగప్పఱవైయిన్ పాగన్ మదనశెఙ్గోల్**
**నడావియ కూఱ్ఱమ్ కణ్డీర్, ఉయిర్కామిన్గళ్ ఞాలత్తుళ్ళే**

ఇదు = ఈ రూపం, తడావియ = వంగిన (వక్రంగా ఉండే), అమ్బుమ్ = బాణాలను, మురిన్ద =విరిగిన, శిలైకళుమ్ = ధనుస్సులను, పోకవిట్టు = గ్రహించకుండా విడచిపెట్టి, కడాయిన కొణ్డు = ఉపయోగించదగిన ధనుస్సులను, బాణాలను గ్రహించి, ఒల్కుమ్ = ఒయ్యారంగా నడిచే, విల్లి ఏనుమ్ = ఒక పూతీగవంటి స్త్రీరూపంలో ఉన్నదైనా, అశురర్ మఙ్గ = అసురులు నశించేటట్లుగా, కడావియ = అధిరోహించి నడుపబడే, వేకమ్ = వేగాన్ని కల, పఱవై = పక్షిరాజు

అనే వాహనానికి, ఇన్ పాకన్ = భోగ్యుడైన చోదకుడగు భగవానుని (సంబంధాన్ని పొందిన), మదనన్ = మన్మథునియొక్క, శెజ్గోల్ = ఆజ్ఞను, నడావియ = చెల్లుబాటు చేసే, కూ*ఱ్ఱ*మ్ = యముడై ఉన్నది, ఞానత్తుళ్ళే = ఈ భూలోకంలో, కణ్డీర్ = ఈ అందమైన రూపాన్ని చూచినవారలారా!, ఉయిర్ కామిన్కళ్ = (ఇక) మీ ప్రాణాలను కాపాడుకోండి.

**భావదీపిక :** జ్ఞానసాధనాలతో గొప్పవారై, మిక్కిలి స్థైర్యంతో, పరిపూర్ణతతో వేంచేసి ఉండే ఆ*ళ్వా*ర్ల ప్రభావాన్ని దర్శించినవారు, వారి పట్ల ప్రేమను (భక్తిని) కల భాగవతులు తమ మనస్సులో ఆనందించి, లోకంలోనివారిని ఉద్దేశిస్తూ, "ఈ ఆ*ళ్వా*ర్లు తమను ఆశ్రయించిన సంసారులకు ఈ తమోమయమైన సంసారంలోని జన్మను తీర్చి వారిని ముక్తులను చేయగల్గినవారు. మీరు సంసారంలోనే నిలచి ఉండాలని కోరుకొన్నవారైతే, **"ఊరుమ్ నాడుమ్ ఉలకముమ్ తమ్మైప్పోల్"** (ఊరును, దేశాన్ని, లోకాన్ని తమవలె) చేయగల వీరికి వశపడకుండా తప్పి బతికి బయటపడండి''- అని ఆ*ళ్వా*ర్ల ప్రభావాన్ని ఆశ్చర్యంతో పలికే భాగవతసూక్తి రూపమైన స్వాపదేశార్థాన్ని ఈ పాశురం కల్గినది. ఒక నాయకియొక్క అందమైన రూపాన్ని చూచి, ఆ అందంవల్ల మిక్కిలి అభినివేశాన్ని కల్గిన నాయకుడు లోకులను ఉద్దేశించి "ఈ రూపం పైపైన గమనించి చూడడానికి విలక్షణమార్దవాన్ని కల్గిన రూపంగా కన్పించినా, వాస్తవానికి మన్మథుని ఆజ్ఞను పూర్తిగా ఏమాత్రం లోపం లేకుండా ప్రవర్తింపజేసే మృత్యువు సుమా! ఈ లోకంలో ప్రసిద్ధుడైన మృత్యువు నుండి తప్పుకొన్నా తప్పుకోవచ్చు ఈ మృత్యువునుండి తప్పుకోవడం అరుదు. ఇది, దర్శించినవారిని తన వశం చేసికొనే స్వభావాన్ని కల్గినది కనుక, మీ ప్రాణాలను దీనిలో చిక్కుకోకుండా, మీరు కాపాడుకొని బతికి బయటపడండి'' అని పలికే సూక్తిగా అమరిఉన్నది. పూర్వం తెల్పిన స్వాపదేశార్థంలో **తలైమకళ్** (నాయకి)- ఆ*ళ్వా*ర్లు, **"తలైమకన్"** - (నాయకస్థానీయులు) భాగవతులు (నమ్మా*ళ్వా*ర్ల పట్ల గొప్ప అభినివేశాన్ని కల భాగవతులు).

గతంలో, భగవానుని నాయకునిగా పల్కిన ఆ*ళ్వా*ర్లు, ఇందులో శ్రీవైష్ణవులను నాయకునిగా గ్రహించే రీతిలో పాశురాన్ని అనుగ్రహించ వచ్చునా?- అని అంటే, వినండి. ద్రావిడాలంకార ప్రక్రియలో **"కిళవి త్తలైమకన్"** అని, **"పాట్టు త్తలైమకన్"** అని రెండు విధాలైన ప్రబంధనాయకులున్నారు. ఆ*ళ్వా*ర్లు, భగవానుని విషయంలో

వలెనే, అతని సంబంధాన్ని పొందిన భగవద్భక్తుల విషయంలో కూడా చాలా భక్తిని కల్గి, వారిని తమకు నాయకులుగా భావించే స్వభావాన్ని కలవారనే విషయం **"మాయప్పిరానడియార్కళ్ కుழாజ్గళై ఉడన్ కూడువదు ఎన్ఱుకొలో!"** (ఆశ్చర్యకర చేష్టితుడైన భగవానుని భక్తుల సంఘాలతో కలసి ఉండడం ఎపుడో కదా) (తిరువాయ్ 2-3-10) ఇత్యాది పాశురాల వల్ల వ్యక్తమవుతున్నందున శ్రీవైష్ణవులను **"కిళవిత్తలైమకన్"** (శృంగార నాయకుడు) గా చెప్పవచ్చు. భగవానుడు ఎల్లప్పుడు (సదా) **"పాట్టు త్తలైమకన్"**. (ప్రబంధనాయకుడు)

**"తడావియ వమ్బుమ్ మురిన్ద శిలైకళుమ్ పోకవిట్టు క్కడాయిన కొణ్డు ఒల్కుమ్ వల్లి ఇదేనుమ్"** -ఇక్కడ **"వల్లి"** (తీగ) అనే పదంద్వారా కన్యలు చెప్పబడతారు. ప్రకృతంలో పరాంకుశనాయకి నిర్దేశింపబడుతున్నది. ఉపఘ్నాన్ని (పట్టుకొమ్మను) ఆధారం చేసికొంటే తప్ప, తానే స్వయంగా నిలువలేని తీగవలె, ఆழ்వార్లు, భగవానుని ఆశ్రయిస్తే తప్ప నిలువలేని పారవశ్యాన్ని కలవారు - అనే విషయం దీనిద్వారా వ్యక్తమవుతుంది. ఉపయోగం లేని బాణాలను, ధనుస్సులను తీసివేసి, చక్కని బాణాలను, ధనుస్సులను గ్రహించినట్లు చెప్పడంలో అంతరార్థం ఏమి? అంటే, మార్పును పొందే స్వభావాన్ని కల ప్రాకృతజనుల జ్ఞానం, ఉపాయాలు- అనే వీటికంటే ఆழ்వార్ల స్థిరమైన జ్ఞానానికి, తదనురూపమైన ఉపాయానికి కల గొప్పతనం తెలుపడమే. ఈ విషయమే పాశురం యొక్క ఉత్తరార్ధంలో వివరింపబడింది.

**(అశురర్ మజ్గ- ఇత్యాది)**- వాదంలో కాఠిన్యాన్ని కల మతాంతరస్థులే ఇక్కడ అసురశబ్దవాచ్యులు. వారి స్థితి నశించే రీతిలో ఉపయోగింపబడే గొప్ప ప్రమాణమైన వేదానికి నాథుడైన- వేదప్రతిపాద్యుడైన- భగవానునిపట్ల గొప్ప భక్తిని కల్గించి, ముక్తిని పొందించి, తన్మూలంగా అనాది కర్మసంబంధానికి ఒక ఆழ்వార్లు- యముడై ఉన్నారు- అని భావం.

**(కణ్డీర్! ఉయిర్ కామిన్కళ్ ఞాలత్తుళ్ళే)**- లోకంలో ఆழ்వార్లను సేవించ గల్గినవారిలో ఎవరూ స్వతంత్రులై ఉండడం సాధ్యం కాదు. వారు అందఱు ఆழ்వార్ల పట్ల అనన్యార్హశేషత్వమనే స్వరూపాన్ని పొందినవారై ఉంటారు. ఆ విధంగా ఉండడంకోసమే వీరి (ఆழ்వార్లు) అవతారం సంభవించింది. ఆ విధమైన, అనురూపమైన స్వరూపాన్ని పొందకుండా, నిత్యసంసారులుగా పరిభ్రమించగోరి,

మీ ప్రాణాలను మీకు స్వాధీనంగా, చెందినదిగానే ఉంచుకోవాలనే అభిప్రాయం మీకు ఉంటే, మీరు ఈ ఆఴ్వార్ల కటాక్షానికి లక్ష్యభూతులు కాని రీతిలో తప్పుకోండి- అని ఇచటి భావం. స్వాపదేశంలో- జ్ఞానమని చెప్పబడే నేత్రానికి గురి తప్పకుండా ప్రయోగింపబడే బాణం ఉపమానంగా చెప్పబడిందనందున, ఆఴ్వార్ల జ్ఞానం పరమాత్మను తప్పకుండా లక్ష్యంగా కల్గిన స్వభావాన్ని కల్గినది- అని సూచింపబడింది. విల్లు అనేది బాణాలను ప్రయోగించే సాధనం కనుక, స్వాపదేశంలో అది జ్ఞానసాధనాన్ని సూచిస్తుంది. జ్ఞానమనే బాణానికి వక్రత ఏమంటే- విషయాంతరాలను లక్ష్యంగా కల్గి ఉండడం. జ్ఞానసాధనాలైన ధనుస్సు (లకుగల లోపం) భగ్నం కావడం ఏమంటే- ఒకసారి గురి తప్పడం. ఈ రీతిలోని దోషం లేని, స్థిరమైన జ్ఞానసాధనాలను ఆఴ్వార్లు కలవారనే భావం స్ఫురించేటట్లుగా **"కడాయిన కొణ్డు"** అని అనబడింది. **"కణ్డీర్ ఉయిర్ కామిన్కళ్ ఞానత్తుళ్ళే"** అనేదానికి ఆఴ్వార్లను సేవిస్తే సంసారం సమూలంగా తొలగిపోతుందని భావం.

ఇక, అన్యాపదేశార్థ వివరణాలు కొన్నితెలుపబడుతున్నాయి. ఈ నాయకి మన్మథుని ఆజ్ఞను లోకంలో తప్పకుండా చెల్లుబాటు చేయడంకోసం చక్కని బాణాలను, ధనుస్సులను గ్రహించింది. అన్యస్త్రీల కనుబొమల అందంకంటే ఈమె కనుబొమల అందం మిక్కిలి గొప్పది. మన్మథుని బాణాలు, ధనుస్సు వంకరపోయే అవకాశం ఉన్నదని తలచి, వాటిని విడచిపెట్టి, తన నేత్రాలను, కనుబొమలనే తగిన బాణాలుగా, ధనుస్సుగా గ్రహించి, ఈమె సంచరిస్తున్నది. మన్మథుని అయిదు పుష్పబాణాలు, ఒక చెఱుగడ విల్లు- ఈమె యొక్క రెండు నేత్రాలనుండి వెలువడే కటాక్షాలు, ఈమె రెండు కనుబొమలు - అనే ఇవి అధికంగా కోరికను కల్గించడంలో సమర్థమైనవి - అని తెలుపడంకోసం ఈవిధంగా చెప్పబడింది.

శ్రీకృష్ణుని పత్ని, లక్ష్మీదేవి అవతారమైన రుక్మిణీదేవికి మన్మథుడు ప్రద్యుమ్నుడనే పేరుతో కుమారుడుగా జన్మించాడనే విషయాన్నిబట్టి మన్మథుడు శ్రియఃపతి కుమారుడు కనుక, **"పఱవైయిన్ పాకన్ మదనన్"** అని ప్రయోగింపబడింది. **"పాకన్మదనన్"** అనే సమస్త ప్రయోగంలో సమసించిన షష్ఠీవిభక్తియొక్క అర్థం పితాపుత్రభావరూప సంబంధం. లోకంలోని వస్తువులనన్నిటిని భగవానునితో ఏదో ఒక విధమైన సంబంధాన్ని కల్గినవిగా తప్ప వేఱు విధంగా పల్కడం తెలియని భక్త్యతిశయంచేత, కోరికను కల్గించి, బాధించే మన్మథుని, భగవత్సంబంధాన్ని

కలవాడని స్ఫురించేటట్లుగా ఆழ్వార్లు నిర్దేశించారు. మన్మథుని సేనగా చెప్పబడే స్త్రీలలో గొప్పది అయిన ఈమె అతని సేనానాయకురాలిగా అక్కడక్కడ సంచరించి, మరణపర్యంతమైన కామవేదనను జీవులకు కల్గించి, ఈ రీతిలో మన్మథుని ఆజ్ఞను చెల్లుబాటు చేస్తున్నది- అనే అర్థం స్ఫురించేటట్లు "మదనన్ శెఙ్గోల్ నడావియ కూఱ్ఱమ్" అని ప్రయోగింపబడింది. ("మీన్ శేర్ కుழாమనైయ మేకలైయుమ్ వెమ్ములైయుమ్ కూఱ్ఱమ్ కూఱ్ఱమ్, ఊన్ శేర్ ఉయిరుయ్య క్కొణ్డోడి ప్పోమిన్కళురైత్తోమ్" అని, "ఇక్కొడియై యీన్ఱాళ్ పోరుమ్ కొళ్వానులకు క్కోర్ కూఱ్ఱీన్ఱాళ్ అమ్మవో కొడియవాతే" అని ఇటువంటి అర్థాన్ని ఇచ్చే జీవకచింతామణి పాశురాలు ఇక్కడ స్మరణకు వస్తాయి.)

ఈ పాశురంద్వారా ఆழ్వార్లు- "నేను సంసారులనందఱిని మూటగట్టుకొని పరమపదానికి తీసికొని పోవడంకోసం వచ్చాను. ఈ కార్యంకోసం భగవానుడు కూడా కొన్ని అవతారాలు ఎత్తినా, అతని ప్రయత్నాలు ఫలించలేదు. నా ప్రయత్నాలు ఆ విధంగా నిష్ఫలం కావు సుమా! నా దృష్టిని తప్పించుకొని, బ్రతికి బయటపడాలని అనుకొనే లోకులారా! తప్పుకోండి. మిగిలినవారిని నేను తప్పకుండా పరమపదానికి తీసికొనిపోతాను" అని తెలిపారు - (అనేది ఇచటి స్వాపదేశార్థ సంగ్రహం).

**నాయకి కాలాన్ని గూర్చి భ్రమపడడం (కాలమయక్కు)**

**7. ఞాలమ్ పనిప్ప చ్చెఱిత్తు, నన్నీరిట్టు క్కాల్ శిదైన్దు**
**నీలవల్లేఱు పొరానిన్ఱ వానమిదు-, తిరుమాల్**
**కోలమ్ శుమన్దు పిరిన్దార్ కొడుమైకుழఱు తణ్పూమ్**
**కాలఙ్గొలో? అఱియేన్, వినైయాట్టియేన్ కాణ్గిన్ఱవే**

ఞాలమ్ పనిప్ప = లోకం అంతా జంకి వణకేటట్లుగా, శెఱిత్తు = తమలో తాము సమ్మర్దించి, నల్ నీర్ ఇట్టు = (తమ దేహంలోని) నీటిని బాగా బయటకు చిందించి, కాల్ శిదైత్తు = కాళ్ళతో భూమిని గీరుతూ, నీలమ్ వల్ ఏఱు = నల్లని బలిష్ఠమైన ఎద్దులు, పొరానిన్ఱ = పోరాడుతున్న, వానమ్ ఇదు = ఆకాశమా ఇది!, తిరు మాల్ = శ్రియఃపతియొక్క, కోలమ్ శుమైన్దు = రూపాన్ని కల్గినదై, పిరిన్దార్= విశ్లేషించిపోయిన నాయకుని, కొడుమై కుழఱు = మనఃకాఠిన్యాన్ని తెలిపే, తణ్ పూ కాలమ్ కొల్ ఓ = చల్లని, అందమైన వర్షాకాలమా!, వినైయాట్టియేన్ =

దుష్కర్మను కల నేను, కాణ్గిల్ల = చూచినవానిని, అఱియేన్ = ఇదమిత్థంగా తెలియలేకున్నాను.

**భావదీపిక :** **"కాలమయక్కు"** అనే ద్రావిడ శృంగారప్రక్రియలో ఈ పాశురం రచింప బడింది. ఈ ప్రక్రియ తిరుక్కోవైయార్‌లో **"కాలమఱైత్తు ఉరైత్తల్"** అని వ్యవహరింప బడింది. నాయకితో కలసి ఉన్న నాయకుడు ఒక కార్యం కోసం దేశాంతరానికి పోదలచి, "కాంతా! నేను బయలు దేరిపోయి, వర్షాకాల సమయానికి తిరిగి వస్తాను'' అని పల్కి కాలనిర్దేశాన్ని చేసి వెళ్ళిపోయాడు. అతడు నిర్దేశించిన వర్షాకాలం వచ్చినా అతడు తిరిగి రాలేదు. అపుడు "అయ్యో! నాయకుడు సూచించిన కాలం రానే వచ్చిందే! ఇంతవరకు అతడు రాలేదే!'' అని వర్షాకాలాగమనాన్ని, ప్రియుని అనాగమనాన్ని ఉద్దేశించి క్లేశపడే నాయకిని చూచి ఆమెతో ఆమె చెలికత్తె "సఖీ! నీవెందుకు వ్యర్థంగా శోకిస్తున్నావు? నిజంగా వర్షాకాలం వచ్చినపుడు కదా నీ ప్రియుడు వస్తాడు. అతడు నిర్దేశించి పోయిన వర్షాకాలం ఇంకా రాలేదు సుమా! వర్షాకాలం కాకపోతే, ఇదిగో! వర్షం కురుస్తున్నదే! మఱి ఇదేమి? అని అడుగుతావు కాబోలు! ఆకాశంలో దట్టంగా ఉండి నీటిని వర్షించేవి మేఘాలు కావు సుమా! ఒక దానితో ఇంకొటి పోరాడే నల్లని పొగరుబెద్దులను చూచి, వాటిని మేఘాలని నీవు భ్రమిస్తున్నావు; అంతే. అవి నల్లని వృషభాలే తప్ప, మేఘాలు కావమ్మా! వర్షిస్తున్నది వర్షజలం కాదు. ఆ వృషభాలు స్వేదజలం, మూత్రజలం. ప్రవించడాన్ని చూచిన నీవు దానిని వర్షజలంగా భ్రమపడుతున్నావు'' అని నాయకిని ఒక రీతిలో ఓదార్చదలచి, సఖి కాలాన్ని గూర్చి భ్రమం కలుగజేసి పల్కుతున్నది.

ఈ విధంగా చెలికత్తె అసత్యాన్ని పల్కడం పాపం కాబోదా! అంటే, కాదు. **"పొయ్‌మ్మైయుమ్ వాయ్‌మై యిడత్త, పురై తీర్న్ద నన్మై పయక్కుమెనిన్"** (మంచిని కల్గిస్తే అసత్యంకూడా సత్యంతో సమానమే) అని తిరుక్కుఱళ్ పేర్కొన్నది. గొప్ప అనర్థం సంభవించేటపుడు, మరణం సంభవించేటపుడు, ఒక అసత్యం ద్వారా అవి తొలగి ఆనందం కల్గితే, అపుడు అసత్యం పల్కినా దోషం కాదు. ప్రకృతంలో, విరహార్తితో నాయకికి కల్గిన అపాయాన్ని ఒక అసత్యవచనం ద్వారా సఖి తీర్చిన వైనాన్ని గమనించవచ్చు. ఈరీతిలో సఖి అసత్యం పల్కినా, నాయకికి నిజమేదో తెలియదా? ఏ రీతిలో అయినా నన్ను ఓదార్చడం కోసంగా కల్పనావైఖరిలో పూర్తి

అసత్యాన్ని పల్కుతున్నది - అని భావించదా? అని అంటే, ఆ విధంగా ఆమె భావించి, గ్రహించడంకోసమే వెంటనే **"తణ్ పూమ్‌కాలజ్గొలో ! అఱియేన్"** (నిజంగా ఇది వర్షాకాలమేనా! ఏమో! తెలియలేను) అని తానుకూడా సందేహిస్తున్నట్లుగా పల్కి సఖి తన వచనాన్ని ముగించింది.

"ఇది వర్షాకాలం కాదు'' అని నిస్సందేహంగా పల్కినపుడు కదా నాయకికి ఊరట కల్గుతుంది. మొదట కాలాన్నిగూర్చి భ్రమించేటట్లు పల్కి, వెంటనే "ఆ వర్షాకాలమే ఏమో!" అని అంటే, నాయకికి దుఃఖమేకదా మిగులుతుంది? సాంత్వన కలుగదే!" అని అంటే, "మన సఖి రెండు విధాలుగా పల్కుతున్నది. ఆమె అసత్యాన్ని చెప్పేది అయితే, "ఇది వర్షాకాలం కాదు'' అని ఖండితంగా చెప్పవచ్చు. ఆవిధంగా పలుకకుండా, సందేహాస్పదంగా పల్కినందున ఆమె కూడా నిశ్చయించలేనట్లుగా ఉన్నది కాబోలు. దీనిని నేను పరిశీలించి నిశ్చయించాలి'' అని నాయకి భావించి, "ఇది నల్లని పొగరుటెద్దులు పోరాడుతున్న ఆకాశమా! లేక, వర్షాకాలమా?'' అని పరిశీలించడం ఆరంభిస్తుంది. ఈ పరిశీనలో కొంచెంసేపు అయినా ఆమె ఆశ్వాసాన్ని పొందుతుంది- అనేది చెలికత్తె అభిప్రాయం.

**"తిరుమాల్ కోలమ్ శుమైన్దు, పిరిన్దార్ కొడుమై కుఱఱు తణ్పూమ్ కాలజ్గొలో! అఱియేన్"** - శ్రియఃపతి రూపాన్ని ధరించి ఉండేది, విశ్లేషించిన నాయకుని కాఠిన్యాన్ని గూర్చి తెలిపేదైన వర్షాకాలమా ఇది? ఏమో తెలియలేను- అని నాయకి అంటున్నది. వర్షాకాలంలోని మేఘం ప్రకాశించే మెఱుపులతోను, నల్లని వర్ణంతోను- లక్ష్మీదేవిని వక్షఃస్థలంలో కల్గి, నల్లని తిరుమేని వర్ణాన్ని కల శ్రీమహావిష్ణువుతో పోలి ఉండడంచేత **"తిరుమాల్ కోలమ్ శుమన్దు"** అని పలుకబడింది. మేఘం గర్జించడం అనేది నాయకిని విశ్లేషించిపోయి, ఈ కాలానికి కూడా తిరిగి రాని నాయకుని కాఠిన్యాన్ని జ్ఞప్తి చేస్తున్నందున **"పిరిన్దార్‌కొడుమై కుఱఱు"** అని అనబడింది. "ఈ వర్షాకాలంలో అయినా వచ్చి సంశ్లేషించకుండా ఈమెను ఒంటరిగా చేసిన నాయకుడు చాలా కఠినుడు'' అని ఘోషిస్తున్నట్లుగా మేఘం గర్జిస్తున్నది. నాయకుని కాఠిన్యమేమంటే- తాను చెప్పినట్లుగా వర్షాకాలసమయానికి రాకపోవడమే. **"తణ్పూమ్ కాలమ్"**- అనే ప్రయోగంలో **"తణ్ పూ"**- అనే విశేషణాలను ప్రయోగించి పల్కడం ఎందుకంటే, "ఆ కాలం సంశ్లేషానికి అనువైనది'' అనే దానిని తెలుపడంకోసం. **"తణ్ పూమ్ కాలమన్ఱు"** అని అనకుండా, **"తణ్ పూమ్ కాలజ్గొలో!"** అని అనడంవల్ల, నాయకుడుండే

ఊరిలో కూడా ఈ వర్షాకాలమే కాబట్టి, "నీవలె అతడు కూడా విశ్లేషాన్ని సహించలేని వాడై వేగంగా తప్పక వస్తాడు, బాధపడకు'' అని సఖి ఆశ్వాసించినట్లయింది.

సఖి, తనను **"వినైయాట్టియేన్"** అని నిర్దేశించుకొన్నది. "నీవు ఈవిధంగా దుఃఖపడుతూ ఉండగా, నేను నిన్ను చూచే రీతిలోని పాపాన్ని చేశానే, నేను''- అని సఖి తనను తాను నిందించుకొంటున్నది. అతడు రాకుండా నీవు దుఃఖ పడడానికి కారణం - అతని కాఠిన్యం కాదు. నీ విరహార్తికూడా కాదు. కాలం కాదు. దీనిని అంతా కళ్ళారా చూస్తున్నా నా పాపమే సుమా!'' అని సఖి అంటున్నది. **"మత్పాపమేవాత్ర నిమిత్త మాసీత్"** -శ్రీరాముడు అరణ్యానికి వెళ్ళడానికి కారణం- మంధరయొక్క పన్నాగం కాదు; కైకేయియొక్క కర్మ కాదు; దశరథ చక్రవర్తియొక్క అనుమతి కూడా కాదు; కైకేయి కడుపున నేను పుత్రుడుగా పుట్టిన నా పాపమే కారణం'' అని భరతాழ்వాన్ పల్కినట్లుగా, సఖి అంటున్నది. **"వినైయాట్టియేన్"**- పాపాన్ని పాలించేదానను. పాపాన్ని కల్గినదానను- అని భావం. **"వినై"** అనేది సత్కర్మ-దుష్కర్మలకు రెండిటికి సాధారణ వాచకమైనా, సందర్భానుగుణంగా ఇక్కడ దుష్కర్మను తెల్పుతుంది.

**"ఞాలమ్ పనిప్ప"**- అనేదానిని **"శెటిత్తు"** అనే పదంతో అన్వయిస్తే "లోకులు చూచి భయపడేటట్లు పరస్పరం సమ్మర్దించి''- అని అర్థం. **"నన్నీరిట్టు"** అనే దానితో అన్వయిస్తే, **"ఞాలమ్"** -భూమి అంతా, **"పనిప్ప"**- తడిసేటట్లుగా, బాగా జలాన్ని వర్షించి''- అని అర్థం. **"నీర్"**- ఇక్కడ పోరాడే వృషభాల ఘర్మజలం, మూత్రజలం. వృషభాలు కోపంతో పోరాడేటపుడు కాళ్ళను భూమిపై దువ్వడం అలవాటు. **"పోరానిఙ్గ వానమిదు"** -భూమిలో చోటు చాలక, ఆకాశంలో పోరాడు తున్నవి సుమా! - అని సఖి అంటున్నది. "ఈ రీతిలో కూడా సంభవిస్తుందా?'' అని ఈమె కొంచెం ఆలోచించనీ. ఆ మాత్రంసేపు అయినా విరహ బాధను మఱచి ఆశ్వాసాన్ని పొందుతుంది కదా'' - అని సఖి ఆలోచన.

ఈ పాశురానికి స్వాపదేశార్థాలను పలు రీతులలో పూర్వాచార్యులు పలికారు. ఆళవందార్ తమ స్తోత్రరత్నంలో **"అవివేక ఘనాంతదుర్ముఖే బహుధా సంతత దుఃఖ వర్షిణి, భగవన్! భవదుర్దినే"** (భగవాన్! అవివేకమనే మేఘాలతో ఆవరింప బడినది, అనేక విధాలుగా నిత్యం దుఃఖమనే వర్షాన్ని కురిసేది అయిన సంసారమనే సూర్యుడు కన్పించని దుర్దినంలో) అని అన్నారు. సంసారాన్ని వర్షాకాలంగా

రూపిస్తారు. దుర్దినం ఏవిధంగా ఉంటుంది? అంటే- మేఘాలచే ఆవరింపబడి, చీకటి నిండి, దిక్కులు ఏవో తెలియలేనట్లుగా ఉంటుంది. అంతేకాక, నిరంతరం నీటిప్రవాహాన్ని కల్గినదై వర్షాకాలం ఉంటుంది. సంసారం కూడా- **"నణ్ణాదార్ ముఱువలిప్ప నల్లుఱ్ఱార్ కరైన్దేఙ్గ, ఎణ్ణారాత్తుయర్ విళైక్కుమ్ ఇవై ఎన్న ఉలకియఱ్కై"** (విరోధులు నవ్వేటట్లు, అనుకూలురు ద్రవించి దుఃఖించేటట్లు, లెక్కలేనన్ని దుఃఖాలను కల్గించే లోక స్వభావం ఇది ఏమి?) అనే రీతిలో పలు రీతులలోని క్లేశాలనబడే జలధారలను వర్షిస్తుంది. అందువల్ల, ఈ రీతులలో వర్షాకాలమని చెప్పదగిన సంసారాన్ని చూచి ఆళ్వార్లు బాధపడుతున్నారు. దుఃఖం అధికమైన తరువాత ఆనందం కల్గుతుంది- అని శాస్త్రవచనం ఉన్నందున, "సంసారం నీపై పడి నిన్ను బాధించినపుడు, నేను ప్రత్యక్షమవుతాను'' అని భగవానుడు స్వయంగా వాగ్దానం చేసినందున, ఇటువంటి క్లేశపడే స్థితిలో కూడా భగవానుడు వచ్చి సహాయపడలేదే! అని ఆళ్వార్లు బాధపడ్డారు. ఆ క్లేశాన్ని ఏవో కొన్ని వ్యాజోక్తుల ద్వారా వారి భక్తులు తీర్చాలని చూచారు- అనే అర్థాన్ని వ్యక్తం చేస్తున్నది, ఈ పాశురం. ఇక, ఈ భావానికి అనుగుణంగా ప్రత్యేకంగా ప్రతిపదార్థాన్ని అభిజ్ఞులు ఊహించగలరు.

మొదటి పాదంలో **"శెఱుత్తు"**- అనే పాఠం ఉన్నది. **"పొరా నిన్ఱ వానమ్"**- పోరాడడానికి చోటైన ఆకాశమని దీని అర్థం. **"కుళఱుతల్"** - అవ్యక్తంగా పల్కడం. (పక్ష్యాదుల ధ్వనివంటిది. ఇక్కడ మేఘగర్జనమని అర్థం)

భాగవతులు భగవానుని విశ్లేషించి వెళ్ళిపోతారేమో! అనే అస్థానే భయశంకను ఆళ్వార్లు పొందుతున్నట్లుగా ఈ పాశురంలోని స్వాపదేశార్థాన్ని నమ్పిళ్ళై పల్కుతూ, తిరుక్కచ్చినంబికి సంబంధించిన ఈక్రింది ఐతిహ్యాన్ని ప్రస్తావించారు.

శ్రీరంగంలో భగవద్రామానుజులు తమ శిష్యులతోపాటు వేంచేసి ఉండే సమయంలో, ఒకనాడు "కాంచీపురానికి వెళ్ళి తిరుక్కచ్చినంబి క్షేమవార్తను తెలిసి కొని వచ్చేవారెవరైనా ఉన్నారా?'' అని అడిగారు. అపుడు ఎవరూ బదులివ్వవలేదు. మఱునాడు ప్రాతఃకాలంలో పెరియనంబి శ్రీరామానుజుల దగ్గరకు వచ్చి, "కాంచీపురానికి పోయి వరదరాజస్వామిని సేవించి వస్తాను'' అని అన్నారు. "దాసు నకు ఆచార్యులైన దేవరవారిని నేను కాదనగలనా? ఆవిధంగానే వేంచేయండి'' అని శ్రీరామానుజులన్నారు. పెరియనంబి కంచికి పోయి తిరుక్కచ్చి నంబి క్షేమాన్ని

తెలిసికొని, శ్రీరంగానికి తిరిగి బయలు దేరారు. అపుడు నంబి "కొద్దినాళ్ళలో వరదరాజస్వామి బ్రహ్మోత్సవం జరుగనున్నది. సేవించి వెళ్ళవచ్చునే" అని అన్నారు. అపుడు పెరియనంబి "నేను వచ్చిన పని పూర్తి అయినది. వెంటనే తిరిగి వెళ్ళాలి" అని బదులిచ్చారు. తిరుక్కచ్చినంబి "మీరు ఏ పనిగా వచ్చారు?" అని ప్రశ్నించగా, పెరియనంబి తమ రాకకు గల కారణాన్ని తెలిపి, శ్రీరామానుజుల కోరికను నెఱవేర్చడంకోసం తాము వచ్చామని పల్కి, తిరిగి వెళ్ళిపోయారు.

### నాయకుడు ధనసంపాదనార్థం విశ్లేషించి వెళ్లనున్నాడని సూచనవల్ల గ్రహించిన నాయకి ఆ విషయాన్ని సఖితో పల్కడం

8. **కాణ్గిన్ఱనగళుమ్ కేట్కిన్ఱనగళుమ్ కాణిల్, ఇన్నాళ్**
**పాణ్కున్ఱ నాడర్ పయిల్గిన్ఱన-, ఇదెల్లా మఱిన్దోమ్**
**మాణ్కున్ఱ మేన్ది తణ్మామలై వేఙ్గడత్తుమ్బర్ నమ్బుమ్**
**శేణ్ కున్ఱమ్ శెన్ఱు, పొరుళ్ పడైప్పాన్ క*ఱ్ఱ* తిణ్ణనవే**

కున్ఱమ్ నాడర్ = పర్వతాలను కల్గిన దేశానికి అధిపతి అయిన నాయకుడు, ఇ నాళ్ = ఈనాడు, పయిల్ కిన్ఱన = పలురీతులలో ప్రవర్తించేవి అయిన, కాణ్గిన్ఱన కళుమ్ = కన్పించే కార్యాలను, కేట్కిన్ఱనకళుమ్ = వినబడుతున్న మాటలను, కాణిల్ = పరిశీలించి చూచినపుడు, పాణ్ = అవి కేవలం బాహ్యోపచారాత్మకాలు మాత్రమే, ఇదు ఎల్లామ్ = ఈ మిక్కిలిగా ఉండే ఔపచారికాలన్నీ, మాణ్ కున్ఱమ్ ఏన్ది = గొప్పతనాన్ని కల్గిన గోవర్ధనపర్వతాన్ని ఏ అలసట లేకుండా ఎత్తిన శ్రీకృష్ణుని, తణ్ మా మలై = చల్లని గొప్ప పర్వతమైన, వేఙ్గడత్తు = తిరువేంకటాచలంయొక్క, ఉమ్బర్ నమ్బుమ్ = ఊర్ధ్వలోక (పరమపద) వాసుల చేత, ఆశపడి ఆదరింపబడే, శేణ్ కున్ఱమ్ = ఉన్నత శిఖరాన్ని, శెన్ఱు =పోయి చేరి, పొరుళ్ పడైప్పాన్ = అక్కడ ధనాన్ని సంపాదించడంకోసం, క*ఱ్ఱ* = కొత్తగా నేర్చిన, తిణ్ణనవు = బలిమియొక్క కార్యం (అని), అఱిన్దోమ్ = తెలిసికొన్నాము.

భావదీపిక : నాయకుడు ధనసంపాదనార్థం తనను విడిపెట్టి వెళ్ళిపోయాడని గూఢంగా గ్రహించిన నాయకి, తన సఖితో ఆ విషయాన్ని తెలిపే సందర్భం-ఇది. దేశాంతరానికి పోయి, ధనం సంపాదించడంకోసం నాయకిని విడచి వెళ్ళడానికి (ద్రావిడ శృంగార ప్రక్రియలలో) "పొరుళ్ వయిఱ్పిరివు" అని పేరు. ("పొరుళ్ వయిన్" = ధననిమిత్తమైన- అని అర్థం.)

ఇక్కడ ఒక సందేహం కల్గుతుంది. అన్ని విధాల పరిపూర్ణుడైన ఉత్తమ పురుషునే కావ్యనాయకునిగా చేసి కావ్యరచనను కవులు చేస్తారు. ఆ నాయకుడు ధనాన్ని సంపాదించడంకోసం నాయకిని వీడి దేశాంతరానికి వెళ్ళాలని చూస్తున్నా డంటే, అతడు నిర్ధనుడని తెలుస్తున్నది కదా! అటువంటివాడు నాయకుడై ఉండే అవకాశం లేదే!- అనేది ఆ సందేహం. దీనికి తగిన బదులును వినండి. నాయకుడు ధనం లేనివాడై, ధనాన్ని సంపాదించడంకోసం నాయకిని విడచిపెడుతున్నాడని ఇక్కడ అర్థం కాదు. తన తండ్రి తాతలచే ఆర్జింపబడిన పలువిధాలైన సంపదలను అతడు నిండుగా కల్గినవాడే. ఆ ధనాన్ని వ్యయం చేసి తాను జీవించడం మగతనం కాదు- అని భావించి, తాను స్వయంగా ధనాన్ని ఆర్జించిన ధనాన్ని వెచ్చించి బతకాలని తలచి, అందుకోసం నాయకిని విశ్లేషించిన విశ్లేషమిది- అని తెలియాలి. దేవకార్యం, పితృకార్యం- అనే పనిని స్వార్జితంతో నిర్వహిస్తే తప్ప వాటి ఫలం దక్కదు. దాయాది ధనంతో చేయడం దేవతలకు, పితృదేవతలకు ఆనందాన్ని కల్గించదు. అందువల్ల, వారిని కూడా ఆనందింపజేయదలచి నాయకిని విశ్లేషించడం నాయకుని దారిద్ర్యాన్ని సూచించదు.

సంపద పూర్ణంగా కల్గిన నాయకుడు ధనసంపాదనార్థం నాయకిని విడచి వెళ్ళడానికి కారణాన్ని తెలిపే తిరుక్కోవైయార్ గ్రంథవ్యాఖ్యాత - **"పొరుళ్ వయిఱ్పిరిదలెన్బదు - గురవర్కళాల్ పడైక్కప్పట్ట పొరుళ్ కొణ్డు ఇల్లఱమ్ శెయ్దాల్, అదనాల్ వరుమ్ పయన్ అవర్క్కు ఆమ్ అత్తుణై యల్లదు తమక్కు ఆకామైయాల్, నమదు పొరుళ్ కొణ్డు ఇల్లఱమ్ శెయ్దఱ్కు ప్పొరుళ్ తేడ ప్పిరియానిఱ్ఱల్" ("పొరుళ్ వయిఱ్పిరిదల్"** -అంటే -పెద్దలచే సంపాదింపబడిన ధనంతో గార్హస్థ్యాన్ని సాగిస్తే, దానివల్ల కలిగే ఫలం ఆ పెద్దలకే తప్ప తనకు చెందదు. అందువల్ల ధనం సంపాదించి గృహస్థాశ్రమాన్ని నిర్వహించడంకోసం, ధనాన్వేషణార్థం నాయకిని విడచి వెళ్ళడమే ఇది.) అని చేసిన వివరణం స్మరణీయం.

నాయకుడు, నాయకిని విశ్లేషించి పోవాలని తలచినపుడు, ఆ ఆలోచనను నోరు తెరచి నేరుగా చెప్పకుండా, తాను తిరిగి వచ్చేవరకు ఆమె తనను స్మరించి ధరించి ఉండడంకోసంగా ఆమెవద్ద కొన్ని అపూర్వమైన చేష్టలను చేయడం, కొన్ని అపూర్వమైన మాటలను పల్కడం అలవాటు. అంటే- మాటి మాటికి నాయకిని ఆలింగనం చేసికోవడం, విడువకుండా ఆమెను ముద్దుపెట్టుకోవడం, ఆమె కాళ్ళను

పట్టుకోవడం, చేతులను పట్టుకోవడం, చేతులను జోడించడం, నమస్కరించడం, "నిన్ను విడచి ఒక క్షణం కూడా విశ్లేషించను. విశ్లేషించి ఉండలేను'' అని పల్కడం- మొదలైనవి. ఈ రీతిలోనే, ధనాన్ని సముపార్జించడం కోసం నాయకిని విడచి వెళ్ళాలని తలచిన నాయకుడు నాయకివద్ద విలక్షణమైన కొన్ని చేష్టలను చేయడం, కొన్ని మాటలను పల్కడం జరిగింది. వీటిని గమనించిన నాయకి "ఇంతకు ముందు ఇతడు ఇటువంటి పనులను చేయలేదు. ఇటువంటి మాటలను చెప్పలేదు. ఇపుడు ఏదో కొత్తగానే ఇవి సంభవిస్తున్నాయి. వీటిని బాగా గమనించి చూస్తే, ఇవి బయటికి వేసే వేషాలవలె ఉన్నవి. ఈవిధంగా ఒక అవధికి మించిన రీతిలో ఇతడు పనులు చేయడానికి, మాటలు మాటలాడడానికి ఒక అభిప్రాయం ఉండి ఉండాలి. అది ఏదయి ఉంటుంది? అంటే, ధనార్జనకోసం నన్ను విడచిపెట్టిపోవాలని ఇతడు అనుకుంటున్నట్లున్నాడు. విశ్లేషించి పోవాలనే తలపు ఇతనికి లేకపోతే, ఇటువంటి కొత్త కొత్త పనులను చేయడం, కొత్త కొత్త మాటలను పల్కడం జరుగదు''- అని నిశ్చయించుకొని, ఆ నిశ్చయాన్ని నాయకి నోరు తెరచి సఖితో పలికే పాశురం, ఇది.

నాయకుడు ఇటువంటి కేవలోపచారవచనాలను, కార్యాలను చేయడాన్ని చూచినందున, "ఇతడు చాలా గొప్పదైన పర్వతప్రదేశానికి పోయి, అక్కడ ధనాన్ని అన్వేషించడంలో తనకు ఉండే తీవ్రమైన నిశ్చయాన్ని, ఆసక్తిని వ్యక్తం చేశాడు. వియోగానికి సూచకాలుగానే వీటిని చేశాడు''- అని నాయకి పల్కినట్లయినది. ధనార్జనకోసం విశ్లేషించాలని భావించి ఈ మనఃకాఠిన్యం పొందడం ఈ నాయకునకు సహజగుణం కాదు. ఎక్కడనుండో కొత్తగా అభ్యసించిన, ఆరోపితమైన గుణం- అనే విషయాన్ని తెలుపడంకోసం **"కற్ఱ తిణ్ణనవు"** అని అనబడింది. పూర్వం అంతా నాయకుడు తనను చూచి "నా లక్ష్మీస్వరూపిణీ ! నీవే నాకు సంపద. నిన్ను విడచి పొందవలసినది ఏదీ లేదు'' అని ఉపచారంగా పల్కిన మాటలు అన్నీ, ఇపుడు ధనాన్ని సంపాదించాలిన వెడుతున్నట్లు తెలుపాలని భావించినందున, అవి అసత్యాలైన విషయాన్ని **"పొరుళ్ పడైప్పాన్ కற్ఱ తిణ్ణనవే"** అని అనడం ద్వారా పల్కి పరిహసించి నట్లయినది.

**"ఇన్నాళ్"**- అని అన్నందున పూర్వం ఈ విధంగా ఒక అవధిని అతిక్రమించి చేష్టలు చేయలేదని స్ఫురిస్తుంది. **"పయిల్కిన్ఱన"**- అని అన్నందున ఒకసారి చేసిన

దానినే పలుమార్లు చేయడం, ఒకసారి పల్కిన మాటనే మళ్ళీ పలుమార్లు పల్కడం స్ఫురిస్తుంది. **"పాణ్ కున్ఱ నాడర్"**- అనేచోట **"పాణ్"** -అనే పదాన్ని ప్రత్యేకమైన సమాపకక్రియగా (**"తనిముఱ్ఱు"**) గ్రహించి వివరించవచ్చు. లేక, **"కున్ఱ"** అనే శబ్దానికి విశేషణంగా చేసి అర్థాన్ని చెప్పవచ్చు. మొదటి పక్షంలో- **"పాణ్"**-అంటే **"పాణర్"** అనే జాతివారి వృత్తి- అని అర్థం. సంగీతాన్ని పాడి పొగడేవారికి **"పాణర్"** అని పేరు. ఈ జాతివారు వస్త్రాన్ని ఎగురవేస్తూ **"తొప్పై తళ్ళుదు, తొప్పై తళ్ళుదు"** ఇత్యాదిగా మనఃపూర్వకంగా కాకుండా, పైపైన పలికే పొగడ్తలవలె, ఇక్కడ నాయకుడు అసత్యంగా పలికే మాటలుకూడా వేషాన్ని ధరించి ఆడుతున్నట్లుగా ఉన్నదే తప్ప, నిజమైన ప్రేమ ప్రేరేపించగా చేసే పనులుగా తోచడం లేదు- అని భావం. ఇక, రెండవ పక్షంలో, **"పాణ్ కున్ఱమ్"** (తుమ్మెదల) సంగీతాలను కల పర్వతం- అని అర్థం. పర్వతాలతో నిండిన దేశానికి నాయకుడై ఉండడం నాయకునకు ఉండే వైలక్షణ్యం కనుక, **"కున్ఱనాడర్"**- అని అనబడింది. స్వాపదేశంలో- నాయకుడైన భగవానుడు హస్తిగిరి, వేంకటగిరి, తిరుమాలిరుమ్‌శోలైమలై, తిరుమెయ్యమలై మొదలైన పర్వతాలు ప్రకాశించే దేశానికి నాయకుడు- అనేది గమనించాలి **"కల్‌నెఞ్జర్"** (రాతి మనస్సువాడు) అని పలుకగోరి **"కున్ఱనాడర్"** అని ఆళ్వార్లు అన్నారు కాబోలు!

**"మాణ్ కున్ఱ మేన్ది తణ్‌మామలై వేఙ్గడత్తు"**- అని అన్నందున ఒక పర్వతాన్ని పైకెత్తి, ఇంకొక పర్వతంపై నిలచి ఉండి, సమయోచితంగా ప్రాణులను భగవానుడు రక్షిస్తాడు - అని తోస్తుంది. రేపల్లెలో గొల్లవారందరు కలసి వర్షంకోసం ఇంద్రుని ఆరాధించాలని వండి సిద్ధం చేసిన వంటకాలను శ్రీకృష్ణుడు ఆ ఇంద్రునకు పెట్టకుండా అడ్డుకొని, గోవర్ధన పర్వతానికి నివేదించమని పల్కి, తానే ఒక దేవతారూపాన్ని ధరించి, ఆ వంటకాలను అన్నిటిని ఆరగించాడు. ఆ ఇంద్రుడు ఆకలి కోపంతో పలు మేఘాలను పంపి, శ్రీకృష్ణుడు ఆదరంతో మేపే లేగదూడలకు, గోవులకు, శ్రీకృష్ణునకు ఇష్టులైన గొల్లలకు, గొల్లపడుచులకు హాని కలిగేటట్లుగా (వడగళ్ళ) వర్షాన్ని ఏడునాళ్ళపాటు కురిపించాడు. శ్రీకృష్ణుడు గోవర్ధనమనే పర్వతాన్ని ఎత్తి గొడుగుగా పట్టుకొని, ఆ వర్షాన్ని అడ్డుకొని, ప్రాణులన్నిటికి ఏవిధమైన అంతరాయం, హాని కలగకుండా రక్షించాడు. దీనిని పురస్కరించుకొని **"కున్ఱమేన్ది"** అని భగవానునకు పేరు వచ్చింది. లెక్క లేనన్ని పశువులు, లేగదూడలు, గోపాలకులు ఎన్ని రోజులు కావాలన్నా- సుఖంగా నిలువడానికి ఆశ్రయం

పొందడానికి తగిన చోటయిన పర్వతం- అనే అర్థం స్ఫురించేటట్లు "మాణ్ కున్ఱమ్" అని అనబడింది. అదేవిధంగా "మాణ్" అనే పదం వామనునకుకూడా పేరు కనుక, వామనావతారాన్ని ఎత్తినవాడు, గోవర్ధనపర్వతాన్ని ఎత్తినవాడైన భగవానుడు- అనే అర్థాన్ని గ్రహించవచ్చు. ఆఴ్వార్లు వామనావతారాన్ని, శ్రీకృష్ణావతారాన్ని కలిపి అనుభవించే అనుభవం పలు చోట్ల కన్పిస్తుంది. తిరువాయ్‌మొఴి ప్రబంధంలో వేఱు ఏ అవతార చరిత్రం కలవకుండా, కేవలం శ్రీకృష్ణావతారాన్నే ప్రస్తావించి, ఆనందించడం కోసంగా అనుగ్రహించిన "కురవై యాచ్చియరోడు కోత్తదుమ్" (6-4) అనే దశకంలోని ఆఱవ పాశురంలో "అశల్ కొళ్ వైయమళన్ద మాయన్ ఎన్నప్పన్ఱన్ మాయజ్గళే పకలిరా ప్పరవ ప్పెగ్ఱ్రేన్" (భూమిని కొలిచిన ఆశ్చర్య చేష్టితుడైన నాస్వామి చేసిన ఆశ్చర్య లీలలను పగలు రాత్రి నిరంతరం అనుసంధించ గలిగాను.) అని వామనావతార చరిత్రను విడువకుండా కలుపుకొని అనుభవించడం స్మరణీయం.

"కున్ఱమేన్ది" - అనే పదం "విన్నైయెచ్చమ్" (కృదంత రూపం) కాదు. "ఇ" అనే ప్రత్యయాన్ని చివరకల్గిన నామపదం.

"ఉమ్బర్ నమ్బుమ్ వేఙ్గడత్తు చ్చేణ్ కున్ఱమ్"- లోకాలకు అన్నిటికి పైన ఉండే పరమపదంలో గల నిత్యసూరులు ఆశపడి, వేగంగా వచ్చి సేవించడంకోసంగా సమీపంలో ఉండేటట్లుగా ఉన్నతమైనది, గొప్పది అయిన తిరుమలశిఖరం - అని అర్థం. పరమపదంలో తాము అనుభవించే భగవానుని పరత్వగుణం కంటే, తిరుమలలో భగవానుడు అనుభవింపజేసే సౌలభ్య- సౌశీల్య గుణాలు గొప్పవి- అని అక్కడివారు ఈ దేశాన్ని ఆదరిస్తారు- అని భావం. ("నమ్బుమ్ మేవుమ్ నశైయాకుమ్మే" అని తొల్‌కాప్పియవచనం) "పర్వతాన్ని ఎక్కి ఎలుకను పట్టుకొనదలచినట్లు, నన్ను విడచిపెట్టిపోవాలని అనుకుంటున్నాడా" అనే పరిహాసం ఇందులో ధ్వనిస్తుంది. ఈ పాశురం సఖిని ఉద్దేశించి పల్కిన పాశురం కావచ్చు. లేక, నాయకుని ఉద్దేశించియే అతని సమక్షంలోనే పరోక్షంగా నాయకి పల్కిన పాశురం కావచ్చు. నాయకుడు ధనార్జనకోసంగా దేశాంతరానికి పోతున్నాడని తెలిసిన సఖి నాయకుని ఉద్దేశించి పల్కిన పాశురం కావచ్చు.

ఆఴ్వార్లు, భగవానుని విశ్లేషాన్ని సహించలేక బాధపడే స్థితిలో తమను ఊరడించిన తమపట్ల ప్రేమను కల భాగవతులు తరువాత పరమాత్మను

అన్వేషించిపొందడం కోసం దివ్యదేశయాత్రను చేయాలనే అభిలాషను కలవారై, తిరువేంకటాచల యాత్రను చేయడం గ్రహించిన ఆళ్వార్లు, వారి విశ్లేషాన్ని సహించలేనివారై పల్కిన సూక్తి ఇది- అని స్వాపదేశంలో చెప్పవచ్చు. ఆళ్వార్లను విడచి వెళ్ళదలచిన భాగవతులు, వారి అనుమతిని పొందదలచి, వారిపట్ల పలు రీతులలో సేవచేసి నమస్కరించి, కొన్ని సూక్తులను పలుకగా, "ఇదంతా వీరు నన్ను విడిచి వెళ్ళడం కోసం'' అని గ్రహించి, వారి విరహాన్ని సహించలేక, "వీరి సేవలన్నీ నర్మగర్భంగా ఉన్నాయి. వీటి ఉద్దేశ్యాన్ని గ్రహించాను'' అని ఆళ్వార్లు పల్కడం పూర్వార్థంలోని తాత్పర్యం. ఈ భాగవతులు **"వేఙ్గడత్తు ప్పదియాక వాళ్వీర్కాళ్!"** అనే రీతిలో వేంకటాద్రిని నివాసంగా కల్గి ఉజ్జీవించగోరినవారు కనుక, వీరిని **"కున్ఱనాడర్"** అని అన్నారు. **"కున్ఱమేన్ది క్కుళిర్మళై కాత్తవన్ పరన్ శెన్ఱు శేర్ తిరువేఙ్గడమామలై"** (పర్వతాన్ని ఎత్తి, చల్లని వర్షం నుండి కాచిన వాడు వచ్చిచేరిన శ్రీవేంకటాద్రి) లో సాటిలేని నిత్యముక్తులు ఆశపడి సేవించే గొప్ప శిఖరాన్ని చేరి, అక్కడ **"వైత్తమానిది"** అయిన మదుసూధనుని పొందడం కోసం చేసికొన్న నిశ్చయమే ఇది- అనేది ఉత్తరార్థంలోని తాత్పర్యం.

భాగవతులతో కూడి ఉండే స్థితిని కాదని, వేఱుగా భగవానుడాదరించి వేంచేసి ఉండే దివ్యదేశాలకు పోవాలని భావించడం తగదు - అని అంటూ భాగవత సహవాసంయొక్క గొప్పతనం ఈ పాశురంద్వారా వ్యక్తం చేయబడిన దని తెలియాలి.

### నాయకిని విడచివెళ్లడంలోని దుష్కరత్వాన్ని గూర్చి నాయకుడు పల్కడం

9. **తిణ్ పూఙ్జుడర్ నుతి నేమియమ్ శెల్వర్, విణ్ణాడనైయ**
   **వణ్పూమణివల్లి యారే పిరిబవర్తామ్?-, ఇవైయో**
   **కణ్! పూఙ్గమలమ్ కరుఙ్జుడరాడి వెణ్ముత్తరుమ్బి**
   **వణ్ పూఙ్గువళై, మడమాన్ విళిక్కిన్ఱ మాయిదళే**

తిణ్ = దృఢమైన, పూ = అందమైన, శుడర్ = ప్రకాశాన్ని (కాంతిని) కల, నుతి = పదును కల్గిన, నేమి = శ్రీసుదర్శనచక్రంయొక్క, అమ్ శెల్వర్ = అందమైన అన్ని సంపదలను కల భగవానుని, విణ్ నాడు అనైయ = పరమపదంతో పోలిన, వణ్ మణి పూ వల్లి = అందమైన గొప్ప పూల తీగవంటిదానిని, యారే

పిరివర్‌తామ్ = ఎవరు విశ్లేషించగలరు? (ఎవరూ విడచిపెట్టి పోలేరు. ఎందుకంటే), ఇవైయో కణ్ = ఈమె కన్నులు కన్నులుగా మాత్రమే ఉన్నవా?, పూ కమలమ్ = తామరపూలై, వణ్ పూమ్ కువళై = అందమైన ఎఱ్ఱని కలువపూల, మా ఇతழ் = పెద్ద రేకులను కల్గినవై, కరు శుడర్ అడి = నల్లని కాటుకయొక్క కాంతితో అలంకరించుకొని, వెణ్ ముత్తు అరుమ్బి = (తనకు విరహార్తి వల్ల కల్గిన కన్నీరు-అనే) తెల్లని ముత్యాలను (మొగ్గవేసి) వెలువరించేదై, మడమాన్ = మౌగ్ధ్యాన్ని కల్గిన జింకవలె, విழிక్కిన్ఱ = చూస్తున్నది.

**భావదీపిక :** నాయకుడు నాయకిని విడచి, విశ్లేషించి ఉండలేని స్థితిని తెలిపే పాశురం ఇది. గడచిన పాశురంలో పల్కినట్లుగా, "నాయకుడు తనను విడచి వెళ్ళ బోతున్నాడు"- అనే విషయాన్ని సూచనలవల్ల తెలిసిన నాయకి, అతనితో కలసి ఉండే స్థితిలో కూడా ఇకపై సంభవించబోయే విరహాన్ని భావించి సహించలేక, విశ్లేషించిన తరువాత కలుగబోయే విరహార్తిని అపుడే పొందింది. ఆ దేహకాంతిని, వైలక్షణ్యాన్ని చూచి, ఆమెను విడచి వెళ్ళలేని నాయకుని అంతరంగంలోని మాటయే- ఈ పాశురం.

శ్రీహస్తంలో సుదర్శనాన్ని ధరించినందువల్ల ఏర్పడిన అందాన్ని కల భగవానుని పరమపదంవలె చేరినవారిని తిరిగి పోనివ్వని రీతిలో అంతులేని ఆనందాన్ని ఇవ్వగల్గినదై, తీగవంటిదైన ఈ నాయకిని ఎవరు విడచిపోగలరు? మానవునకు ఉండ దగిన వివేకం ఉండేవారెవ్వరూ ఈమెను విడచిపోలేరు- ఎందుకు? అంటే, ఈమె నేత్రసౌందర్యాన్ని చూస్తే ఈమెను విడచి పోవాలని ఎవరికైనా ఆలోచన కల్గుతుందా? ఈమె నేత్రాలు మిగిలినవారి నేత్రాలవలె సామాన్యంగా ఉన్నాయా? ఇవి ఎఱ్ఱని రేఖలను కల్గి వెల్లడంలో ఎఱ్ఱ తామరల పూలతో సాటి వస్తున్నాయి. (చివరలో ఎఱుపు వర్ణాన్ని కల్గి ఉండడంలో ఎఱ్ఱ కలువతో సాటివస్తున్నాయి) నేను విడచి పోలేని రీతిలో అందంగా చూస్తున్నాయి. నన్ను దోచుకొనే స్వభావంలో జింకపిల్ల చూపుతో సాటివస్తున్నాయి. ఈమె కంటి పైరెప్ప, కిందిరెప్పలు తామరపూవులోని పెద్దపెద్ద రేకులతో పోలి ఉన్నాయి. ఈ విధంగా వెలిగే ఈమె కన్నులు నాయకుని విశ్లేషాన్ని గూర్చి భావించినంత మాత్రంలోనే ముత్యాలు మొగ్గతొడిగినట్లుగా విషాదశ్రువులను చిందిస్తున్నవే! అటువంటి స్థితిని నిరంతరం దర్శిస్తూ ఉండడమే కదా కన్నులు కల్గి ఉన్నందుకు

ఫలం! ఆ ఫలాన్ని పొందకుండా విశ్లేషించిపోవాలని జ్ఞానం కలవారెవరైనా అను కుంటారా?- అని తెలిపినట్లయింది.

భగవానుని శ్రీసుదర్శనం ఆయుధకోటిలో అన్వయించి, శత్రువులపట్ల కాఠిన్యాన్ని ప్రదర్శించినందున **"తిణ్"** అనే విశేషణం, ఆభరణకోటిలో అన్వయించి, భక్తులకు భోగ్యతను, ఆనందాన్ని కల్గించినందున **"పూ"** అనే విశేషణం ప్రయోగింప బడ్డాయి. **"వణ్ పూమణివల్లి"** అనేది ఆ*ళ్వా*ర్ల స్వభావాన్ని తెల్పుతుంది. ఆచార్య హృదయగ్రంథంలోని రెండవ ప్రకరణంలో నాయనార్ **"విద్యై తాయాక పె*ఱ్ఱు*"** ఇత్యాది చూర్ణికలో **"మణివల్లి ప్పేచ్చు వన్దేతి యన్ఱు"** అని పల్కడం గమనార్హం.

**"మాయిద*ళ్లే*"** అనేది అధరంయొక్క స్వభావాన్ని తెల్పుతున్నట్లుగా కూడా చెప్పవచ్చు. లేక, "గొప్ప అధరాన్ని కల్గినదానా !" అనే సంబోధనాంతంగా గ్రహించి వివరించవచ్చు. అపుడు **"వల్లి"** అనేది ప్రత్యక్షంలో పరోక్షనిర్దేశం.

గడచిన పాశురంలో- తమను విడచివెళ్ళే భాగవతులను విశ్లేషించలేకుండా క్లేశపడిన ఆ*ళ్వా*ర్ల (మృదు) స్వభావాన్ని, జ్ఞానాధిక్యాన్ని చూచి, వారిని విశ్లేషించలేక, ఆ భాగవతులు పలికే మాటయే ఈ పాశురంలోని స్వాపదేశార్థం. భగవానుని పరమపదంవలె అంతు లేని ఆనందాన్ని ఇచ్చేదై,. **"కోల్‌తేడి యోడుమ్ కొ*ళు*న్దదే పోన్ఱదే మాల్ తేడియోడుమ్ మనమ్"** (పట్టుకొమ్మను వెదకుతూ పాకే తీగవంటిది ఆశ్రితవ్యామోహాన్ని కల భగవానుని అన్వేషిస్తూ పోయే మనస్సు) అనే విధంగా ఒక పట్టుకొమ్మనే ఆధారంగా చేసికొని నిలచే లతవలె, పారతంత్ర్యమే స్వరూపంగా కల్గినవారైన ఈ ఆ*ళ్వా*ర్లను జ్ఞానులు విడచిపెట్టాలని అనుకుంటారా? అని పాశుర పూర్వార్ధంలో స్వాపదేశం.

**(ఇవైయో కణ్)** - వీరి జ్ఞానం మిగిలిన లోకంలోని వారి జ్ఞానం వంటిదా! కానేకాదు. ఇది పరమవిలక్షణమైనది.

**(పూజ్గమలమ్ కరుమ్ శుడరా*ళి*)** - వీరి జ్ఞానం ఎఱ్ఱ తామరవంటి వర్ణాన్ని కల లక్ష్మీదేవిని, అంజనవర్ణుడైన భగవానుని లక్ష్యంగా కల్గి ధన్యమైనది - అని భావం.

**(వెణ్ముత్తరుమ్బి)** - వీరి జ్ఞానం శుద్ధసత్త్వగుణమయమైనది. భగవానుని అనుభవించినందున (దర్శించి ఆనందించినందున) ఆనందబాష్పాలను స్రవిస్తున్నది- అని కూడా అర్థం.

"యారే?"- అనే పదంలో "యార్" అనే ప్రశ్న వ్యతిరేకార్థకం. ఏకారం వాక్యాలంకారం. "ముత్తు" - ముత్యంవంటి కన్నీటిని ఈ పదం తెల్పుతున్నందున సాదృశ్యనిబంధనమైన లక్షకపదం (**ఉవమైయాకుపెయర్**). "**మాన్ విழிక్కిన్ఱ**" - అనేది జింకపిల్లవలె చూస్తున్నది- అనే అర్థాన్ని ఇస్తుంది. కనుక, "**ఉవమైత్తొకై**" (లుప్తోపమ. ఇక్కడ ఉపమేయ లుప్తోపమ. ఉపమానమైన "**మాన్**" ద్వారా ఉపమేయమైన పరాంకుశనాయకి సూచింపబడింది.) "**విழிక్కిన్ఱ**" - "**అన్**" అనే శారియై పదం లోపించిన బహువచనార్థక సమాపక్రియ. "**విழிక్కిన్ఱన**" అని అర్థం. "**మాయితழ்**" అనే పదంలో "**మా**" అనేది "**ఉరిచ్చొల్**" అయినందున దానికి ముందు యకారం ఆదేశంగా వచ్చింది. (**మా+ఇతழ் = మాయితழ்**).

తమను విశ్లేషించదలచిన భాగవతులను విశ్లేషించలేక క్లేశపడే ఆழ்వార్ల స్వభావాన్ని, జ్ఞానాధిక్యాన్ని చూచి, వారిని విడువలేక ఆ భాగవతులు పలికే సూక్తి- అనేది ఈ పాశురంలోని ధ్వన్యర్థం. ఒక పర్యాయం శ్రీరామానుజులను విశ్లేషించ వలసివచ్చినపుడు ఆ విధంగా వీడిపోలేక పిళ్ళై ఉఱజ్గావిల్లిదాసర్ (ధనుర్దాసు) అనే భక్తులు ఈ పాశురాన్ని అనుసంధించిన ఐతిహ్యాన్ని నమ్పిళ్ళై తమ ఈడు వ్యాఖ్యలో ప్రస్తావించారు.

భగవద్రామానుజులు శ్రీరంగంలో వేంచేసి ఉండే సమయంలో ఒక పర్యాయం శ్రీరంగంలో వారికి ఏదో మనోవ్యాకులం కల్గి, తిరుమలకు వెళ్ళిపోవాలని తలచారు. అపుడు ఒక శ్రీవైష్ణవునకు తమ మఠంనుండి గ్రాసంగా ధాన్యాన్ని ఇవ్వదలచి, ఆ స్వామికి తనచేతి వేలికి ఉండే పవిత్రాన్ని (అంగుళీయకాన్ని) గుర్తుగా ఇచ్చి, ధాన్యాగారం రక్షకులైన పిళ్ళై ఉఱజ్గా విల్లిదాసర్ దగ్గరకు పంపించారు. ఆ శ్రీవైష్ణవుడు దాసర్ దగ్గరకు వెళ్ళారు. అప్పటికే శ్రీరామానుజులు తిరుమలకు వెళ్ళదలచిన విషయం దాసర్‌కు తెలిసి, మిక్కిలి క్లేశంతో "**కాణ్గిన్ఱనకళుమ్ కేట్కిన్ఱనకళుమ్**" అనే ప్రకృతపాశురాన్ని అనుసంధిస్తూ తలుపులను మూసివేశారు. అపుడు ఆ శ్రీవైష్ణవుని రాకను గూర్చి ఉఱజ్గావిల్లిదాసర్‌కు తెలియజేసేవారెవరూ లేకపోయారు. ఇక చేయగల్గినది లేక ఆ శ్రీవైష్ణవుడు శ్రీరామానుజుల దగ్గరకు తిరిగి వెళ్ళారు. "చాలా త్వరగా తిరిగి వచ్చిన ఆ వైష్ణవుని చూచి ఏమి జరిగినదని శ్రీరామానుజులు ప్రశ్నించగా, ఆ స్వామి జరిగిన విషయాన్ని తెలిపారు. అపుడు శ్రీరామానుజులు "**వణ్పూమణివల్లి యారే పిరిబవర్తామ్?**" అనే అనంతర్ పాశురాన్ని తాము

(దాసర్) అనుసంధించి ఉండవచ్చుకదా! అని అన్నారట. దీని తాత్పర్యమేమంటే- పిళ్ళైఉఅఙ్గావిల్లిదాసర్‌ను విడచి ఉండడం తమకు కూడా సాధ్యం కాదని. ఈ ఐతిహ్యం పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానంలో కూడా సంగ్రహంగా ప్రస్తావింపబడింది.

ఆళ్వార్ల అవయవశోభలోను, వాక్కులోను అభినివేశాన్ని పొందిన భాగవతులు వారిని విశ్లేషించలేక పలికే వార్త- అనేది ఈ పాశురంలోని స్వాపదేశం. భగవానుని పట్ల చాలా అభినివేశాన్ని కల్గినవారికి దేహగుణాలు కూడా ఆత్మగుణాల వలె మిక్కిలి ఆదరణీయాలు- అనే విషయానికి నమ్పిళ్ళై వ్యాఖ్యానంలో ఒక ఐతిహ్యం ప్రస్తావింపబడింది.

తిరుక్కోట్టియూర్‌నంబి శ్రీరంగానికి వచ్చి మళ్ళీ తిరుక్కోట్టియూర్‌కు తిరిగి వెళ్ళేటపుడు శ్రీరామానుజులు వారిని అనుసరించి **"మోరాచ్చిపురమ్"** అనే ఊరివరకు వెళ్ళి సాగనంపి తిరిగి వచ్చేవారు. ఆ విధంగా, ఒక పర్యాయం శ్రీరంగానికి వచ్చి తిరిగి వెళ్ళేటపుడు ఒక చోట నంబి ఆగి జలకార్యంకోసం (స్నానంచేయడంకోసం) వెళ్ళినపుడు, శ్రీరామానుజులు వారిని "దాసునకు రక్షకంగా నిత్యం అనుసంధించుకొనదగిన రీతిలో ఏదైనా ఒక సూక్తిని అనుగ్ర హించాలి" అని అర్థించారు. అపుడు నంబి- "ఆళవందార్ స్నానం చేయడంకోసం చెఱువులో దిగి మునిగేటపుడు కూర్మాసనం విస్తరించినట్లు ప్రకాశించేవారి వెనుక (పృష్ఠభాగం), వారి శ్రీసూక్తులు, కటాక్షం- ఇవి అన్నీ వారు పరమపదం చేరిన తర్వాత నాకు రక్షకంగా భావిస్తాను. మీరుకూడా ఆ విధంగానే వాటిని రక్షకంగా భావించండి" అని అన్నారు. దీనివల్ల మహాభక్తుల ఆత్మగుణాల వలె దేహగుణాలు కూడా ఉపాదేయాలని తెలుస్తున్నది.

## సఖిని అంగీకరింపజేసిన నాయకుడు ఆమెకు నాయకిపై తన ప్రేమను తెలియజేసి ఆమె సహాయాన్ని అర్థించడం

**10.** మాయోన్ వడ తిరువేఙ్గడనాడ, వల్లిక్కొడిగాళ్!
**నోయో వురైక్కిలుమ్ కేట్కిన్ఱిలీరురైయీర్-, నుమదు**
**వాయో? అదు వన్ఱి వల్వినై యేనుమ్ కిళియు మెళ్గుమ్**
**ఆయో? అడుమ్ తొణ్డైయో?, అఱైయో? ఇదఱివరిదే**

మాయోన్ = ఆశ్చర్యాన్ని కల్గించే గుణాలను, చేష్టితాలను కలవాడైన భగవానునియొక్క, వడ తిరువేఙ్గడమ్ నాడ = ఉత్తరదిశలోని తిరువేంకటా చలాన్ని నివాసంగా కల, వల్లి కొడికాళ్ = పూలతీగవంటి లేత వయస్సులోని కన్యకలారా!, నోయ్ ఒ ఉరైక్కిలుమ్ కేట్కిన్రిలీర్ == (నా) ప్రణయబాధను (మీరు స్వయంగా గ్రహించి తెలిసికోలేకపోయినా) నేను పల్కినా వినడం లేదు, నుమదు = మీయొక్క, వాయో = అధరం యొక్క అందమా?, అదు అన్రి = అది కాక, వల్వినైయేనుమ్ కిళియుమ్ ఎళ్కుమ్ = బలమైన దుష్కర్మను కల నేను, (నా పెంపుడు) చిలుక తల్లడిల్లేటట్లు, ఆయో =మీరు పలికే **"ఆయో"** అనే మాటయా?, తొణ్డైయో= దొండపండువంటి ఎఱ్ఱని మీ అధరమా, అడుమ్ = నన్ను చిత్రవధచేస్తున్నది, ఇదు అఱివు అఱిదు = వీటిలో "ఇది నన్ను బాధిస్తున్నది''- అని తెలియడం దుర్లభంగా ఉన్నది, ఉరైయీర్ = మీరు (నిశ్చయించి) వివరించి పల్కండి. (**"అఱైయో!"**- ఇది మొఱపెట్టి పలికే మాట.)

**భావదీపిక** : ఈ పాశురం ద్రావిడశృంగారాలంకారిక ప్రక్రియలలో **"మదియుడమ్బు డుత్తలుఱ్ఱ తలైవన్ కుఱైయుఱ ఉరైత్తల్"** అనే ప్రక్రియలో రచింపబడింది. చెలికత్తెతో ఏకాభిప్రాయాన్ని పొందిన నాయకుడు ఆమెతో నాయకిపట్ల తన కోరికను ప్రస్తావించి పల్కడం ఈ ప్రక్రియలోని విశేషం.

నాయకుడు నాయకితో ఏదో ఒక విధంగా సంశ్లేషించి, తరువాత (ఆమెను) విశ్లేషించాడు. విశ్లేషించిన తరువాత మళ్ళీ ఆమెను కలవాలని తలచి, ఆమె చెలికత్తె వద్దకు వెళ్ళి, తన మనోరథాన్ని ఆమెకు తెలియజేసినా, ప్రయోజనం పొందలేక పోయాడు. ఇక ఏమి చేయాలి?- అని అతడు ఆలోచిస్తూ ఉండగా అతనికి నాయకి, ఆమె సఖి కలసి పొలాన్ని కాపు కాసే సమయం లభించింది. అతడు వారి దగ్గరకు వెళ్ళి, కొత్తవానివలె వర్తిస్తూ, ఏవో కొన్ని మాటలను పల్కి, తన మనోరథాన్ని తెల్పి, తన అభిప్రాయంతో చెలికత్తె ఏకీభవించేటట్లు చేశాడు. **'మదియు డమ్బుడుత్తల్", "మదియుడన్ పడుత్తల్"** - అనేవి రెండు ఒకటే. వీటి అర్థమేమంటే- నాయకిలో కల్గిన మార్పును, నాయకుడైన తన చేష్టలను, గమనించి తెలిసి, వీటికి ఏది కారణం? ఏమి చేయాలనే విచారాన్ని సఖి పొందింది. అపుడు నాయకుడు తన అభిప్రాయాన్ని ఆమెకు తెలుపడం ద్వారా వీటికి అన్నిటికి నిజమైన కారణాన్ని ఇదమిత్థంగా సఖి తెలిసికొనేటట్లు చేయడమే - **మదియుడమ్బుడుత్తల్ - మదియై**

ఉడన్ పడుత్తల్ - మది - అంటే అభిప్రాయం. చెలికత్తె అభిప్రాయం తన అభిప్రాయంతో ఏకమయేటట్లు చేయడమని దీని అర్థం.

మొదటి పాదంలో **"వల్లిక్కొడికాళ్!"** అని నాయకుడు బహువచనంలో సంబోధించినందు వల్ల నాయకి, సఖి కలసి ఉండే సన్నివేశంలో పలికే పాశురమిది- అనే విషయం వ్యక్తమవుతుంది. పాశురంలో తరువాత **"వల్వినైయేనుమ్ కిళియుమ్ ఎళ్కుమ్ ఆయో?"** అని అన్నందున పొలం కాపు కాసే సన్నివేశంలో పలికే పాశురం ఇది- అనేది తెలుస్తుంది. **"ఆయో"**- చిలుక మొదలైన పక్షులు వచ్చి ధాన్యపు కంకులను అపహరించకుండా వాటిని బెదరగొట్టడం కోసం పెద్దగా చేసే శబ్దం **"ఆయో!"** అనేది. ఇక్కడ **"అదియా!"** అని ప్రశ్నించే రీతి.

ఇక్కడ ఒక చిన్న సందేహం కల్గుతుంది. నాయకి పొలాన్ని కాపలా కాయడ మంటే- ధాన్యం, జొన్నలు, రాగులు మొదలైన ధాన్యాలు మొలిచే క్షేత్రాలను కావలి కాయడం. ఇటువంటి వృత్తిలో నాయకి ప్రవృత్తమై ఉన్నదంటే, ఇది ఆమె సౌకుమార్యానికి కొఱతయే (లోపమే) కదా! పలువురు సఖులు గుమిగూడి సేవలు చేయగా నాయకి వేంచేసి ఉండేటట్లు గొప్పగా చెప్పవలసి ఉండగా, ఆ రీతిలో పలుకకుండా సస్యక్షేత్రాలను నాయకి కాపలా కాస్తున్నది- అని అనడం ఆమె సౌకుమార్యంలోని తక్కువదనాన్నే కదా! తెల్పుతుంది. అంతేకాక, పలువేల మందలమంది పదునైన ఈటెలను ఆయుధంగా కల్గిన యువకులు వెంటరాగా, రథమెక్కి వేటకు పోయే స్వభావాన్ని కలవాడైన నాయకుడు ఈ విధంగా ఒంటరిగా వచ్చి, తన మనోరథాన్ని వెలిబుచ్చాడనడం కూడా అతనికి తక్కువదనమే కదా! అనేది ఆ సందేహం. కాని, ఇది తక్కువదనం ఏమాత్రం కాబోదు. నాయకికి చెప్పబడే పొలాన్ని రక్షించే ఈ పని జీవనవృత్తి కాదు. ఆమె చేసే పలు పలు క్రీడలలో ఇది కూడా ఒకటి. నాయకునకు సంకేతస్థలాన్ని సూచించేటపుడు తాను ఒంటరిగా కలవాలనే అభిప్రాయంతో కూడా పొలాన్ని కాపలా కాయవచ్చు. నాయకుడు నాయకితో కలువడానికి ఒంటరిగా రావడం, ఆమెపై మక్కువ మిక్కిలిగా వృద్ధి చెంది, సఖిద్వారా కలవాలనే అభిప్రాయంతో తన కోరికను అర్థించడం- ఇవన్నీ నాయకునకు తక్కువదనాన్ని కల్గించవు. ఈ విషయం తజ్ఞైవాణన్ కోవై గ్రంథవ్యాఖ్యానంలో **"ఎళియళాయ్ పున్నమ్ కాత్తాళుమల్లళ్, ఎళియనాయ్ కుఱైయుఱ్ఱిరున్దానుమల్లన్"** (నాయకి సౌకుమార్యంలో అల్పురాలై

పొలాన్ని కాపలాకాయడం లేదు. నాయకుడు స్వభావంలో అల్పుడై ఈవిధంగా అర్థించడం లేదు) ఇత్యాదిగా స్పష్టంగా గమనించవచ్చు.

"వల్లి" అనేది, "కొడి" అనేది ఒకే అర్థాన్ని ఇచ్చే పదాలై ఉండగా, "వల్లిక్కొడి కాళ్" అని అనడం పునరుక్తి ("కూఱియదు కూఱల్") అనే దోషం కాదా? అని అంటే, కాదు. 'కొడి' అనేది నామమాత్రమై, స్త్రీసామాన్యాన్ని తెల్పుతుంది. "వల్లి" అనేది ఉపమానం. సఖిని కూడా "కొడి" అని సమానంగా పల్కి సంబోధించ వచ్చునా? అని అంటే, నాయకితో తాను కలవడానికి సహాయకురాలై ఉండే స్వభావాన్ని దృష్టిలో పెట్టుకొని ఆ విధంగా (కృతజ్ఞతాభావంతో) పలుకబడింది. "తిరువేఙ్గడనాడ వల్లిక్కొడికాళ్" అని అంటేనే చాలు కదా! "వడ" అనే విశేషణం ఎందుకోసం? "తెన్ తిరువేఙ్గడమ్" అని ఇంకొకటి ఉంటే కదా! తేడా తెలియడం కోసం "వడవేఙ్గడమ్" అని అనాలి, అని అడిగితే, ఇది వ్యవచ్ఛేదక విశేషణం కాదు. స్వభావాన్ని తెలిపే విశేషణపదం. వేఙ్గడమ్ అనే క్షేత్రం ఎక్కడ ఉన్నది? అని అంటే , ఉత్తరదిక్కులో ఉన్నదని కదా చెప్పాలి. ద్రావిడ దేశానికి "వేఙ్గడమ్" ఉత్తర దిక్కు ఎల్ల- అనేది తెలిసేటట్లుగా ఈవిధంగా పలుకబడిందనికూడా చెప్పవచ్చు. ఈ విధంగా మొదటి పాదంలో తిరుమలక్షేత్రంలో పొలాన్ని కాపలా కాసే నాయకిని, ఆమె సఖిని నాయకుడు సంబోధించాడు.

ఈ విధంగా సంబోధించి తరువాత అతడు చెప్పే విషయం ఏమి? అంటే, ప్రణయబాధలో తాను చిక్కుకొని క్లేశపడుతున్న విషయాన్ని వారికి తెల్పుతున్నాడు. నా విరహంవల్ల మీరు బాధపడడంలేదు. బాధపడేవాడను నేనే. బాధపడేవాడనైన నన్ను మీరు ఏదయినా అడగడం అనేది ఉన్నదా? లేదే! నేను పడే బాధను నేనే చెప్పుకొంటున్నానే! అయ్యో! దానిని కనీసం చెవి ఒగ్గి మీరు వినడంకూడా లేదే! నా బాధను మీరు తీర్చనక్కరలేదు. మీరు చెవులతో వినడమే చాలు- అని రెండవ పాదంలో తెలుపబడింది.

'కేట్కిన్ఱిలీర్"- అని అన్నందున కేవలం వినడం మాత్రమే నేను ప్రయోజనంగా భావిస్తానని సూచింపబడింది.

(కేట్కిన్ఱిలీర్ ఉరైయీర్)- 'కేళాదవర్‌కళై -శొల్లీర్"- ఎన్గిఱదు ఆశైయిన్ మికుది యిరున్దపడి" (మాట విననివారిని "చెప్పండి'' అని అనడం ఆశలోని ఆధిక్యాన్ని సూచిస్తుంది.) అని పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానశ్రీసూక్తి. నాగు

చేనును కాపలా కాసేవారు చిలుకలు మొదలైన పక్షులను బెదిరించడం కోసం ఎలుగెత్తి అరచే అరుపుల వంటి నాయకి అరుపులను విని, అపుడు అధరసౌందర్యాన్ని చూచి నాయకుడు అభినివేశాన్ని పొందడం ఉత్తరార్ధంలో తెలుపబడింది.

**"కిళియుమ్ ఎళ్కుమ్ ఆయో?"** - వీరు పలికే **"ఆయో!"** అనే మాటను విని చిలుకలు జంకి భయపడి వెనుకు పోతున్నాయి. చిలుకలు తాము ముద్దుముద్దుగా పలికే పలుకుకూడా వీరి కంఠధ్వనికి సాటి రాదు- అని అవి సిగ్గుపడిన విషయం ఇక్కడ స్ఫురిస్తున్నది. **"కిళియుమ్ వెళ్కుమ్"** అనే పాఠాంతర మున్నది. వీరి మాటకు ఓడిపోవడం తనకు, చిలుకకు సమానం అయినందున **"వల్విన్తైయేనుమ్, కిళియుమ్ ఎళ్కుమ్"** అని నాయకునితో కలిపి చెప్పబడింది. ఇటువంటి ప్రణయబాధలో తాను చిక్కుకొని బాధపడడం **"వల్విన్తైయేన్"** అనే పదం ద్వారా సూచింపబడింది. నేను బాధపడడం నాకు తెలుస్తున్నదే తప్ప, ఈ కారణంవల్ల బాధపడుతున్నాను- అని నాకు స్పష్టంగా తెలియడం లేదు. కార్యం తెలుస్తున్నదే తప్ప, కారణం తెలియలేదు. "ఇది దీనికి కారణం''- అని వివేకించి మీరు చెప్పండి- అని ఇచటి భావం. "ఈ లక్ష్మీసంపన్ను రాలైన చిన్నదానిని విశ్లేషించినందువల్ల క్లేశపడుతున్నావు'' అనే సఖీవచనరూపంలో సమాధానం వెలువడాలి - అని ఎదురు చూచేవాడైనందున నాయకుడు ఆ కారణాన్ని తాను తెలిసినా, వ్యక్తం చేయడం లేదు. ఇది ఒకవిధమైన చమత్కారోక్తి. **"నుమదు"-** అనేదానిని **"ఆయో, తౌణ్తైయో"** అనే పదాలతో అన్వయించాలి. **"మాయన్"** అనేది **"మాయోన్"** అనే పదంయొక్క వికారం. **"నాడ"** - **"నాడు"** అనే పదం ద్వారా పుట్టిన తద్ధితరూపం. **(పెయరెచ్చమ్)**

**"అత్తైయో"** అనేది మొఱపెట్టడాన్ని సూచించే పదం. వీరి (సఖి, నాయకి) మాటను వినడంలోని ఆసక్తివల్ల మొఱపెట్టిన పదం కూడా కావచ్చు, లేక, బాధకు గల కారణాన్ని తెలియలేనందున నాయకుడు మొఱపెడుతూ చెప్పే మాటగా కూడా చెప్పవచ్చు.

స్వాపదేశంలో- ఆళ్వార్లను విడచి ఉండలేని భాగవతులు ఆళ్వార్ల అవయవ సౌందర్యంలోను, వారు పలికే సూక్తులలోను అభినివిష్టులై పలికే వార్త. ఇది- అని గ్రహించాలి.

(మాయోన్ వడతిరువేఙ్గడనాడ వల్లిక్కొడికాళ్!)- ఆశ్చర్యకరుడైన భగవానుడు లోకసంరక్షణార్థంగా పరమపదాన్ని విడచి తిరుమలకు వచ్చి నిలచి ఉండే సౌలభ్యాన్ని అన్వేషించేవారు, తీగవలె పారతంత్ర్యాన్ని కలవారైన ఆళ్వార్లూ! అని ఆళ్వార్లను భాగవతులు సంబోధించిన తీరు ఇది. ఇక్కడ బహువచనం- పూజాయాం బహువచనం.

(నోయో వురైక్కిలుమ్ కేట్కిన్టిలీర్)- మీపట్ల ప్రేమాతిశయం చేత మేము పడే పాట్లను విన్నపం చేసినా మీ పారవశ్యంచేత వినడం లేదు.

(నుమదు వాయో - ఇత్యాది)- మీ తిరుముఖమండలంలోని కాంతియా! లేక, మిమ్ములను విడచి పోవడానికి సాధ్యం కాని రీతిలో కట్టివేసే బలమైన పాశ బంధనాన్ని కల మేము, చిలుకపచ్చని వర్ణాన్ని కలవాడైన భగవానుడు అభినివేశం పొందే రీతిలోని మీ సూక్తి వైఖరియా? అటువంటి సూక్తులను పలికే మీ అధరసౌందర్యమా? లేక, కంఠస్వరమాధుర్యమా? మమ్ములను మీ దగ్గర చేస్తున్నాయి! ఇవి అన్నీ ఒక్కొక్కటి బాధించే స్వభావాన్ని కల్గినవి కనుక, వీటిలో ఇది మమ్ములను బాధిస్తున్నది- అని వివేకించి తెలియడం సాధ్యం కాలేదు. మీరే దీనిని నిశ్చయించి పల్కండి- అని అన్నట్లయినది.

## తన విశ్లేషాన్ని సహించలేని నాయకిలోని వైలక్షణ్యాన్ని చూచి నాయకుడు పల్కడం

11. అరియనయా మిన్టు కాణ్గిన్టన, కణ్ణన్ విణ్ణనైయాయ్!
పెరియన కాదమ్ పొరుట్కో పిరివెన-, ఞాల మెయ్‌ద
ఉఱ్కరియన వొణ్ ముత్తుమ్ పైమ్బొన్ను మేన్ది యోరో కుడఙ్గై
పెరియన కెణ్డైక్కులమ్, ఇవైయో వన్దు పేర్గిన్టవే

యామ్ ఇన్టు కాణ్గిన్టన = మేము ఇపుడు చూస్తున్నవి, అరియన = (లోకంలో వేఱెక్కడా చూడడానికి) అరుదైనవి, కణ్ణన్ విణ్ అనైయాయ్ = భగవానుని పరమపదంవలె అంతు లేని ఆనందాన్ని ఇచ్చేదానా!, పెరియన కాదమ్ పిరివు = మిక్కిలి దూరంలోని పలు యోజనాలలోని విశ్లేషం (వారు వారు తమ ప్రియులను విశ్లేషించడం అనేది) పొరుట్కో = ధనాన్ని సంపాదించడానికేనా?, ఎన = అని నేను సాధారణమైన లోకరీతిని గూర్చి ప్రశ్నించగా, అపుడు, ఞాలమ్ ఎయ్‌దఱ్కు

ఉరియన = అన్ని లోకాలను తమ వశంలో ఉంచుకొనగల్గినవి, ఓరో కుడజ్జై పెరియన = ప్రత్యేకంగా ఒక పుడిసిలి అంత పరిమాణంలో (చారెడంత) పెద్దవిగా ఉన్నవి అయిన, కెణ్డై క్కులమ్ ఇవై = మత్స్యవిశేషద్వయమైన ఈ కన్నులు, ఒళ్ ముత్తుమ్ పై పొన్నుమ్ ఏన్ది = విరహార్తివల్ల కల్గిన కన్నీటి తుంపురులనే, అందమైన ముత్యాలను, శరీరంయొక్క పచ్చని వర్ణమనే బంగారాన్ని గ్రహించి, వన్దు పేర్కిన్ఱ= (నాముందే) వచ్చి విహరిస్తున్నవి, ఓ = ఇదేమి ఆశ్చర్యం!

**భావదీపిక :** ప్రియుడు తనను విశ్లేషించబోతున్నాడని తెలిసిన నాయకి ఆ విరహాన్ని సహించలేక శరీరంలో మార్పును పొందింది, దానిని చూచిన ప్రియుడు పలికే పాశురం ఇది. గడచిన పాశురంలో నాయకుడు ధనాన్ని ఆర్జించడంకోసం దేశాంతరానికి వెళ్ళాలని తలచిన విషయాన్ని నాయకి సంకేతాల ద్వారా తెలిసి, దానిని గూర్చి పల్కింది. ఆ సంగతి అటు ఉండగా, ధనాన్ని సంపాదించడం కోసం నాయకిని విడచి వెళ్ళాలని భావించిన నాయకుడు, ఆ విషయాన్ని ఆమెకు తెలుపకుండా, గభాలున నేను విశ్లేషించినా, లేక, నేను "దేశాంతరానికి పోబోతున్నాను" అని చటుక్కున తన విరహాన్నిగూర్చి తెల్పినా, ఆమె తాళలేక మరణపర్యంతమైన ఆపదను పొందుతుంది- అని భావించి, ఆమె సహించేటట్లు కొంచెం కొంచెంగా తన విశ్లేషాన్నిగూర్చి తెలియజేయడం ఆరంభించి, లోకాభి రామాయణంగా పలు ప్రస్తావనలు చేశాడు. అపుడు "లోకంలో ధనాన్ని సంపాదించడం కోసం, నాయకుడు నాయకిని విడచిపెట్టి దేశాంతరానికి వెళ్ళడమనే ఒక విషయం ఉన్నది" అని సాధారణమైన విరహప్రస్తావనను చేశాడు. ఆమె ఆ మాట వినగానే "ఇపుడు ఇతడే విషయాన్ని ప్రస్తావించడం ఊరికే కాదు. ఇది లోకాభిరామాయణంగా పల్కిన మాట కానేకాదు. నన్ను విడచి పోవడంకోసమే పలికి సూచించిన మాట" అని తలచి, అతనితో విశ్లేషం అపుడే సంభవించినట్లుగా తలచి, బాధపడి, విరహార్తివల్ల కలిగే వైవర్ణ్యమనే అవస్థను పొంది, కన్నీరు మున్నీరయినది. దానిని చూచిన నాయకుడు, "నేను విడిచిపోతున్నానని చెప్పకపోయినా, కేవలం సామాన్యమైన వార్తగా పల్కిన నా మాటలోని ఆంతర్యాన్ని తెలిసికొన్న ఈమె స్థితి ఈ విధంగా అయినదికదా! ఆహా !"- అని ఆశ్చర్యపడి, సఖిని చూచి పల్కిన మాట ఇది- అని కాని, తన మనస్సును ఉద్దేశించి నాయకుడు స్వగతంగా పల్కినమాట ఇది- అని కాని చెప్పవచ్చు.

ఇంతవరకు నేను లోకంలో ఎన్నో ఆశ్చర్యాలను గమనించాను. కాని, ఈ నాడు చూచే ఆశ్చర్యం ఏనాటికీ ఎక్కడా చూడడం సాధ్యం కాదు- అనే అంతులేని ఆశ్చర్యం స్ఫురించేటట్లుగా పాశురాన్ని ఆరంభించేటపుడే **"అరియన యామిన్ఱు కాణ్గిన్ఱన"** అని నాయకుడు అంటున్నాడు. పాశురంలోని తరువాత గల భాగమంతా ఆ ఆశ్చర్యాన్నే వివరిస్తున్నది. సాధారణంగా లోకరీతిని నేను ప్రస్తావించి నంతమాత్రంలోనే ఈ నాయకి తనను విశ్లేషించడంకోసంగానే ఆ మాటను నేను పలికానని, ఆ పిమ్మట ఆ విరహం సంభవించినట్లుగాను తలచి విలక్షణమైన వికారాన్ని పొందిందే! దీనికంటే మించిన ఆశ్చర్యం ఉంటుందా?- అని భావం.

"నిన్ను విడచి పెట్టిపోవడం ఏ సమయంలోను నాకు సాధ్యం కాదు'' అనే విషయం వ్యక్తమయేటట్లు **"కణ్ణన్ విణ్ణనైయాయ్!"** అని అంటూ నాయకిని నేను సంబోధించి పల్కినా, ఈమె విరహాన్ని శంకించిందే!- అని నాయకుడు మనస్సులో బాధపడడం గమనించాలి. భగవానుని పరమపదాన్ని పొందినవారు, దానిని విడచి తిరిగి వెళ్ళలేనట్లుగా. ఈమెను చేరినవారు ఈమెను విడచిపెట్టి పోలేరు- అని ఈ సంబోధన ద్వారా తెలుపబడింది.

**(పెరియన కాదమ్ పొరుట్కో పిరివు ఎన)** - **"పొరుట్కో"** అనే పదంలోని **'ఓ"** అనే దానిని ప్రశ్నార్థకంగా గ్రహించవచ్చు. నిశ్చయార్థకంగా కూడా చెప్పవచ్చు. లోకంలో ప్రేమికులు ప్రేయసిని విడచిపెట్టి ద్వీపాంతరాలకు వెడతారు. ఇది ధనం సంపాదించడంకోసం పోయే ప్రయాణమా? - అని నాయకుడు నాయకిని ప్రశ్నిస్తున్నట్లుగా కూడా గ్రహించవచ్చు. ధనసంపాదనకోసమే ఆయా వ్యక్తులు ద్వీపాంతరాలకు వెడతారు- అనే లోకప్రసిద్ధిని ప్రస్తావించినట్లుకూడా చెప్పవచ్చు.

**(ఞాల మెయ్దఱ్కురియన)**- లోకాన్ని అంతటిని అవలీలగా పొందడానికి తగినవి- అని దీనిని వివరించవచ్చు. లోకాలన్నీ ఆశపడదగినవి- అని కూడా చెప్పవచ్చు.

**(ఒణ్ ముత్తుమ్ పైమ్ పొన్ను మేన్ది)** - ఇక్కడ కన్నీటి బిందువులు ముత్యాలుగా, పాలిపోయిన రంగు బంగారుగా చెప్పబడింది. అందువల్ల ఇవి లక్షణావృత్తిద్వారా అర్థాన్ని బోధించే లక్షకపదాలు **(ఆకుపెయర్)**. పాలిపోయిన వర్ణం బంగారువర్ణంతో పోలి ఉంటుంది. **"పొన్కులామ్ పయలై పూత్తన మెన్తోళ్"** అనే తిరుమంగై ఆళ్వార్ల (పెరియతిరుమొழி 2-7-9) పాశురం గమనార్హం.

పాలిపోయిన వర్ణాన్ని గూర్చి **"కుఱుమ్‌తొకై"** అనే ద్రావిడగ్రంథంలో ఒక పాశుర మున్నది. **"ఊరుణ్ కేణి యుణ్డుఱైత్తొక్క పాశియ*ఱ్ఱే* పశలై, కాదలర్ తొడువు*ழி* తొడువు*ழி* నీఙ్గి విడువు*ழி* విడువు*ழி* ప్పరత్తలానే"** (399) అనేది ఆ పాశురం. దీని భావమేమంటే- ఊరిలోని జనం అంతా నీటిని తాగే సరస్సులో పుట్టి వ్యాపించి ఉండే పాచివంటిది పాలిపోయిన రంగు. చల్లని నీటిలో మనం చేయిపెడితే, చేయి పెట్టిన చోట అంతా పాచి తొలగిపోతుంది. చేతిని పైకెత్తగానే ఆచోట అంతా పాచి వ్యాపిస్తుంది. అదే రీతిలో భర్త చేయి సోకిన చోట అంతా పాలిపోయిన రంగు తొలగిపోతుంది. ఆలింగనం చేసికొన్న చేయి వీడిపోగానే, ఆ వైవర్ణ్యం వ్యాపిస్తుంది. అందువల్ల పాచివంటిది వైవర్ణ్యం - అని భావం. **(తొడువు*ழி*త్తొడు వు*ழி*"** -తాకిన చోట అంతా- అని **"విడువు*ழி* విడువు*ழி*"** - విడచినచోట అంతా- అని అర్థం. **'పరత్తలాన్"** వ్యాపించినందున- అని అర్థం.)

**"కెణ్డైక్కులమ్ పోన్ఱ కణ్‌కళ్"**- అని పలుకవలసిన చోట ఉపమేయాన్ని నిర్దేశించకుండా ఉపమానాన్ని మాత్రం పల్కడం **"ము*ఱ్ఱు*వమై"** (పూర్ణోపమ). చల్లదనం, మిలమిలలాడడం మొదలైన గుణాలలో కళ్ళు చేపలవలె ఉంటాయి- **"కెణ్డైక్కులమ్"** అనేదానిని, **"కుల క్కెణ్డై"** అని మార్చి అన్వయించి, గొప్ప జాతికి చెందిన (శ్రేష్ఠమైన బేడిన) చేప - అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"ఇవైయో"**- అనేచోట **"ఓ"** అనేది ఆశ్చర్యార్థకం. ధనం సంపాదించడంకోసం విడిచిపోవడాన్ని గూర్చి పల్కడం ఆరంభించిన నాముందు, ఆమె విశాలమైన నేత్రాలు లోకాలను అన్నిటిని తమకు మూల్యంగా పొందదగినవై, గొప్ప ముత్యాలను, బంగారాన్ని గ్రహించికొని వచ్చి ఎదురుగా నిలచి, "నీవు ధనంకోసంగా విడిచిపోవద్దు. ముత్యాలు, బంగారు- ఈ వస్తువులు నీకు చెందినవే సుమా! - అని పల్కుతున్నట్లున్నవి - అనే రస్యమైన అర్థం స్ఫురిస్తుంది. విరహాన్నిగూర్చి తలచినంతమాత్రంలోనే కన్నీటిని, వర్ణంలో వైలక్షణ్యాన్ని కల్గిన నాయిక స్థితి వినూత్నమై, ఒక ముత్యాల నగను, ఒక బంగారు నగను అలంకరించుకొన్నట్లుగా ఉన్నదై, తనకొక అపూర్వశోభ కల్గింది- అనేది స్ఫురించేటట్లుగా **"ఒణ్ ముత్తుమ్ పైమ్ పొన్ను మేన్ది"** అని ప్రయోగింపబడింది.

**"కుడఙ్గై"** - **"తడ"** అనే పదంవలె **"కుడ"** అనే పదం కూడా గుండ్రంగా ఉండడాన్ని తెలిపే ఒక విశేషణపదం కనుక, **"వళైత్త కై"** అనే అర్థాన్ని కల్గినదై అరచేతిని తెల్పుతుంది. **"కుడక్కై"**- అనే ఒత్తుతో (పరుషంతో) కూడిన రూపంగా

కాకుండా, "కుడజ్జై" అని సరళంతో కూడిన రూపం కావడం "కుడ" శబ్దం సంబంధి (విశేషణ) వాచకమైనందువల్ల. నేత్రానికి పుడిసిలి ఆకారంలో ఉపమానం. "ఓరో"- ఇక్కడ "ఓ" కారం - "అశై", "పేర్కిన్ఱ" - ఇది సమాపకక్రియ. (వినైముఱ్ఱు) "అన్" అనే ("శారియై") పదం లోపించిన రూపం.

ఇక, ఈ పాశురంలోని స్వాపదేశం ఏమంటే - ఆళ్వార్లను విడచి దివ్యదేశ యాత్ర పోవాలని తలచిన వారి భక్తులు, తమ విశ్లేషాన్ని సహించలేని రీతిలోని ఆళ్వార్ల జ్ఞానవిశేషాన్ని చూచి, దానినిగూర్చి పల్కడం.

**(అరియునయా మిన్ఱు కాణ్గిన్ఱన)** - ఆళ్వార్ల జ్ఞానవిశేషం వేఱెక్కడా దర్శించలేనిది.

**(కణ్ణన్ విణ్ణనైయాయ్!)**- భగవానుని పరమపదంవలె అంతులేని మహిమను కల్గిఉండడం, అవధి లేని మహానందాన్ని ఇవ్వడం, ప్రకృతి సంబంధాన్ని కల్గి ఉండకపోవడం, ఏనాడూ మార్పు లేని స్వభావం- అనే వీనిని కల్గిన ఆళ్వార్లా!- అని ఆళ్వార్లు దీనిద్వారా సంబోధించబడ్డారు.

**(పెరియన కాదమ్ పొరుట్కో పిరివెన)**- పరమపురుషుడైన భగవానుని సేవించడంకోసం చాలా దూరం దివ్యదేశయాత్ర చేయాలి- అని మేము ప్రస్తావం చేసినంతనే,

**(ఞాలమ్ ఎయ్‌దఱ్కురియన)**- అన్ని లోకాలను కోరిన రీతిలో పొందడానికి తగినవి - అని అర్థం. లేక, లోకంలోనివారినందఱిని వశం చేసికొన గల్గినది- అని కూడా అర్థం. "ఉలకమెన్బదు ఉయర్న్దోర్ మాట్టే" (లోకం అంటే లక్షణయా లోకంలోనివారు తెలుపబడతారు) అని చెప్పబడినందున విశేషజ్ఞానాన్ని కల వైష్ణవులందఱు అనుభవించ దగినవి- అని కూడా అర్థం.

**(ఒణ్ ముత్తమ్ పైమ్ పొన్ను మేన్ది)** - శుద్ధసత్త్వగుణాన్ని, జ్యోతిర్మయమైన భగవానుని రూపాన్ని తనలో కల్గినవి.

**(ఓరో కుడజ్జై ప్పెరియన)** - పుడిసిళ్ళతో నింపుకొని గ్రహించి అనుభవించే రీతిలో భక్తులకు సులభమైనవి. లేక, కైవసమైనవి - అని అర్థం.

**(కెణ్డైక్కులమ్)** - భగవానుని మత్స్యావతారంలో ప్రవేశించి, అందులో అబినివేశాన్ని పొంది, తన్మయమైన,

**(ఇవై)**- ఆళ్వార్ల జ్ఞాన ప్రకారాలు- అని అర్థం.

**(వన్దు పేర్‌కిన్ఱ)** - వ్యాపించి, విశ్లేషించలేని రీతిలో ఆశను రేపుతున్నవి. **"ఇవైయో!"** అనేటపుడు **"ఓ"** కారం ఆశ్చర్యార్థకం. లోకంలో విరహమనేది ఒకటి ఉంటే అది శ్రీవైష్ణవుల విషయంలో తమకు ఎపుడైనా ఒకసారి కల్గుతుందేమో! అని భీతిల్లే రీతిలో ఆళ్వార్లకు ఆ భాగవతుల విషయంలో కల్గిన విరహార్తి ఈ పాశురం ద్వారా స్ఫురింపజేయబడింది.

**"అరియన యామ్ ఇన్ఱు కాణ్‌గిన్ఱన"** అనే సూక్తిని నమ్పిళ్ళై వివరిస్తూ- కలసి ఉండే సమయంలోనే కలగబోయే విశ్లేషాన్ని స్మరించడం చాలా అరుదైనది అని, అది సంశ్లేషానికి అవరోధమని పల్కుతూ, ఈ సందర్భంలో భట్టర్ పల్కిన ఒక వార్తను ఉట్టంకించారు.

కూరత్తాళ్వాన్ దేవేరి ఆణ్డాళ్ ఒక వైకుంఠ ఏకాదశినాడు పూర్తిగా ఉపవాసం చేసి, మఱునాడు ద్వాదశీతిథిలో ఉదయమే తమ కుమారుడైన భట్టర్‌ను చూచి- పెరుమాళ్‌తీర్థం ఇవ్వండి - అని అన్నారట. అపుడు భట్టర్ "ఈ విధంగా పెరియ తిరునాళ్ళు (అధ్యయనోత్సవాలు) గొప్పగా జరిగే ఈ సమయంలో మీరు ఈ రీతిలో ఏకాదశిని ఎక్కడినుండి వెదకి పట్టుకొన్నారు'' అని అన్నారట.

ఇరవైదినాలపాటు నిర్విరామంగా గొప్పగా జరిగే అధ్యయనోత్సవాలలో అందఱు భగవదనుభవంలో నిమగ్నులై ఉంటారు. ఆ సమయంలో ఏకాదశితిథి నాడు ఉపవసించడంవల్ల శరీరంలో బలహాని కల్గి, భగవదనుభవానికి అది ఆటంకం అవుతుంది. కనుక, అధ్యయనోత్సవాలలో మధ్యలో భగవదనుభవానికి అడ్డుగా ఉండే ఈ రీతిలో ఉపవసించే తిథిని ఎక్కడనుండి మీరు వెదకి పట్టుకొన్నారు?- అని భట్టర్ సూక్తిలోని భావం. లేక, నిరంతరం భగవదనుభవం కొనసాగే ఈ అధ్యయనోత్సవ సమయంలో ఎవరకీ భోజనానికి సంబంధించిన స్మరణే కలుగకూడదే! మఱి, ఈ ఉత్సవాలమధ్యలో ఏకాదశితిథి అని, ఆనాడు ఉపవసించాలనే స్మరణ ఏవిధంగా వచ్చింది? అని భావించిన భట్టర్ ఈవిధంగా అన్నారని కూడా చెప్పవచ్చు.

ఈ ఐతిహ్యం తిరుప్పావై 13వ పాశురానికి ఆయ్ అనుగ్రహించిన నాలాయిరప్పడి వ్యాఖ్యలో కూడా ప్రస్తావింపబడింది.

**నాయకి తన మనస్సుతో తాను పొందే విరహార్తినిగూర్చి పల్కడం**

**12\. పేర్కిన్ఱదు మణిమామై పిఱజ్గి యళ్ళల్పయలై,**
**ఊర్గిన్ఱదు కజ్గులూళ్ళిగళే-, ఇదెల్లా మినవే**
**ఈర్కిన్ఱ శక్కరత్తెమ్బెరుమాన్ కణ్ణన్ తణ్ణన్దుళ్ళాయ్**
**శార్కిన్ఱ నన్నెజ్జినార్, తన్దుపోన తనివళమే**

మణి మామై = నా అందమైన వర్ణం (మణివర్ణంవంటి మేనిశోభ- లావణ్యం)- పేర్కిన్ఱదు = వికారాన్ని పొందుతున్నది, పిఱజ్గి అళ్ళల్ పయలై = ప్రకాశించి, దట్టంగా ఉండే వైవర్ణ్యం - పాలిపోయిన రంగు, ఊర్కిన్ఱదు= ఇంకా ఇంకా వ్యాపించి వృద్ధిచెందుతున్నది, కజ్గుల్ = రాత్రివేళ, ఊళ్ళికళే = అనేకకల్పాలుగా తోస్తున్నది, ఇదు ఎల్లామ్ ఇనవే = ఈ స్వభావాన్ని కల ఇవి అన్నీ, ఈర్కిన్ఱ శక్కరత్తు = (దుష్టులను) ఖండించే చక్రంయొక్క, (సుదర్శన చక్రాన్ని ఆయుధంగా కల్గిన), ఎమ్బెరుమాన్ కణ్ణన్ = నా స్వామి అయిన శ్రీకృష్ణుని, తణ్ ఆమ్ తుళ్ళాయ్ = చల్లని, అందమైన తులసిలో, శార్కిన్ఱ = ఆశపడుతున్న, నల్ నెజ్జినార్ = నామంచి మనస్సుగారు, తన్దు పోన = తాను పోయేటపుడు నాకిచ్చి పోయిన, తని వళమే= సాటిలేని సంపదలే. (బలమే)

**భావదీపిక :** ఈ పాశురంలో - నాయకుని విశ్లేషించిన నాయకి తన విరహార్తిని గూర్చి పల్కి మనస్సుతో సంభాషిస్తున్నదని, లేక, సఖిని చూచి నాయకి తన విశ్లేషార్తిని తెల్పుతున్నదని చెప్పవచ్చు. స్త్రీలకు చిన్నతనంలో ఉండే, శోభను కల్గించే వర్ణం **"మామై"** అనబడుతుంది (ఇదే లావణ్యం). నాయకి తన మేని రంగును తానే **"మణిమామై"** అని పొగడుతూ పల్కడం ఆత్మప్రశంస కాదా?- అంటే, కాదు; తన వర్ణాన్నిగూర్చి అతడు (నాయకుడు) ప్రశంసించే రీతిలో పల్కుతున్నందు వల్ల. (అనువదిస్తున్నందున). నాయకుని విశ్లేషించినందున తన మేనివర్ణం మాఱిపోయిందని భావం.

**(పిఱజ్గి యళ్ళల్ పయలై ఊర్కిన్ఱదు)** - పాలిపోయిన రంగు దట్టమై, ఇంకా ఇంకా వ్యాపించడం ఆరంభించింది- అని భావం. ఈ వైవర్ణ్యాన్నిగూర్చి విశదంగా గడచిన పాశురంలో వివరింపబడింది. **"అళ్ళల్ పయలై"** అనే ప్రయోగం వైవర్ణ్యానికి గల పేరుకుపోయే స్వభావాన్ని తెల్పుతున్నదని కూడా చెప్పవచ్చు.

**(కఙ్గుల్ ఊழிకళే)**- నాయకునితో కలసి ఉండే కాలంలో ఒక క్షణకాలంగా గడచిన రాత్రి, విరహకాలంలో కల్పకోటికాలంగా సాగుతున్న రీతి దీనిద్వారా తెలుపబడింది. **"ఇదెల్లా మినవే"** అని అన్నందున మలయమారుతం, క్రౌంచపక్షులు, చంద్రుడు, సముద్రం, కోయిలలు మొదలైనవి అన్నీ నాయకిని బాధిస్తున్నవి - అని తెలుపబడింది.

**(ఈర్కిన్ర శక్కరత్తెమ్బెరుమాన్)**- ఆశ్రితవిరోధులైన అసురులను, రాక్షసులను ఖండించే సుదర్శనచక్రం కల్గిన స్వామి- అని, చేతిలో శ్రీసుదర్శనాన్ని ధరించి నందున ఆ చేరికవల్ల కల్గిన అందాన్ని చూపి, నన్ను బాధించే స్వామి- అని దీనిని వివరించవచ్చు. ప్రతికూలురను మగతనంతో వధిస్తాడు, అనుకూలురను అందంతో బాధిస్తాడు? **(ప్రతికూలర్లై ఆణ్మైయాలే కొల్లుమ్, అనుకూలర్లై అழகాలే కొల్లుమ్)** అనే పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యాన శ్రీసూక్తిలోని మాధుర్యం ఇక్కడ అవశ్యం అనుభావ్యం.

**(కణ్ణన్ తుழாయ్ శార్కిన్ర నెఞ్జు)** - భగవానుని సంబంధాన్ని పొందిన తులసితో అయినా మనకు సంబంధం కలిగింది కదా- అని దీనిని గొప్ప అపూర్వ ఫలంగా భావించి, అభినివేశాన్ని పొందిన మనస్సు- అని అర్థం. **"శార్కిన్ర"**- అని అన్నందున- దొరుకుతుంది, దొరకదు- అని విచారించకుండా అవిచారితంగా ఆశపడడం వ్యక్తమవుతుంది.

**(నల్ నెఞ్జు)**- స్వామిని అయిన నన్ను విడచి, బాధించి, నాయకుని వద్దకు వెళ్లిన మిక్కిలి ఆశను కల మనస్సు- అని భావం. అచేతనమైనది, ఏక వచనంలో నిర్దేశించదగినదైన మనస్సును **"నెఞ్జినార్"** అని చేతనసమాధిలో, బహువచనంలో పల్కడం కోపాతిశయంచేత. ఇది లింగవచన వ్యత్యయప్రయోగం. **("తిణ్‌పాల్ వழுవమైది")** వ్యాకరణవిరుద్ధమైనా, మహాకవి ప్రయోగ ప్రాచుర్యంవల్ల సాధుత్వాన్ని పొందిన ప్రయోగం **"వழுవమైది"** అనబడుతుంది. లేక, ఆనందాతి రేకంతో గొప్పగా బహువచనంలో చేతన సమాధిలో నిర్దేశింపబడిన దని కూడా చెప్పవచ్చు.

**(తన్డు పోన తనివళమే)** - మేని సహజవర్ణాన్ని కోల్పోవడం మొదలైన వానిని **"వళమ్"** (బలం) అని అనడం విపరీతలక్షణా ప్రయోగం. ఒక నిర్ధనుని చూచి "అతడు చాలా ధనవంతుడు'' అంటే అది వ్యతిరేక లక్షణద్వారా అతడు ఏమీ

లేనివాడు- అనే అర్థాన్ని ఇచ్చినట్లే, ఇక్కడ కూడా మేనివర్ణం మాఱిపోయి, వైవర్ణ్యం దట్టంగా వ్యాపించి, రాత్రి దీర్ఘంగా తోచి బాధపడుతూ ఉండడమే నేను పొందిన భాగ్యం- అని లోక వ్యవహారరీతిలో పల్కిన తీరు ఇది. ఇటువంటి సంపద నాకు తప్ప వెఱేవ్వరికి లభించడం అరుదు- అనేది తోచేటట్లు "తనివళమ్" అని ప్రయోగించబడింది.

ఆழ్వార్లు, తమ ఆంతరనేత్రంతో భగవానుని దర్శించినా, ఆ స్వామి దరికి చేరలేక, మనస్సులో క్లేశపడి, ఒంటరిగా బాధపడేవారై, తమ ఆర్తిని గూర్చి పల్కడం ఈ పాశురంలోని ధ్వన్యర్థం. చేతిలో చక్రాన్ని ధరించి, భుజాలలో వనమాలను దాల్చినవాడై దర్శనాన్ని అనుగ్రహించే భగవానుని తిరుమలలో సేవించాలి- అని ఆశపడి, ఆ దర్శనం లభించనందున **"ఒరు పకల్ ఆయిరమూழியాలో"** (ఒక పగలు వేయి కల్పాలు అయినది, అయ్యో!) అని బాధపడడం, **"శఙ్గు విల్ వాళ్ తణ్డు శక్కరక్కైయఱ్కు.. కొழ్గలర్ తణ్ణమ్ తుழాయ్ముడియానుక్కు ఎన్ మజ్జై యిழన్దదు మామై నిఱమే"** (శంఖం, విల్లు, ఖడ్గం, గద, చక్రం- అనే వానిని శ్రీహస్తాలలో కలవాడు, మిక్కిలిగా విరిసిన చల్లని తులసిని కిరీటంపై కలవానికోసం నా కన్య తన లావణ్యాన్ని కోల్పోయింది) అని క్లేశించడం సంభవించింది- అని భావం.

**వియోగాన్ని సహించలేని నాయకి తాను చీకటికి, చల్లగాలికి తాను తాళలేకపోవడాన్ని పల్కడం**

13. తనివళర్ శెఙ్గోల్ నడావు, తழల్ వాయరశవియ
పనివళర్ శెఙ్గోలిరుళ్ వీఱ్ఱిరున్దదు-, పార్ముழుదుమ్
తునివళర్ కాతల్ తుழాయై త్తుழావు తణ్ వాడై తడిన్దు
ఇనివళై కాప్పవరార్?, ఎనై యూழికళ్ర్వనవే

తని వళర్ = సాటిలేని రీతిలో పెరిగే స్వభావాన్ని కల, శెఙ్గోల్ = (తన కాంతి అనే) రాజ్యాంగాన్ని, నడావు = (అంతటా ఏ అడ్డు లేకుండా) ప్రవర్తింపజేసే (నడిపే), తழల్ వాయ్ అరశు = వేడిమిని కల్గిన సూర్యుడనే ప్రభువు, అవియ = అస్తమించగా, పని వళర్ శెఙ్గోల్ ఇరుళ్ = (జనులకు) భయాన్ని కల్గించే పాలనను సాగించే చీకటి అనే చిన్న ప్రభువు, పార్ ముழుదుమ్ = భూమిలో అంతటా,

వీగ్ర్గిరున్దదు = పాలిస్తూ వేంచేసి ఉన్నాడు, ఇని = ఇకపై, తుని వళర్ కాదల్ = క్లేశాన్ని అధికం చేసే నా ఆశకు లక్ష్యమైన, తుళాయ్ = నాయకుని తులసీమాలను, తుళావు = స్పృశిస్తూ వచ్చే, తణ్ వాడై =చల్లని గాలిని, తడిన్తు = దండించి, వళై= (విరహార్తిచేత కృశించి, నా చేతులనుండి జారిపడిపోతున్న) గాజులను, కాప్పవర్= ఆ విధంగా జారిపోకుండా అడ్డుకొని కాపాడేవారు, ఆర్ = ఎవరున్నారు? (ఎవరూ లేరు), ఊళికళ్ = కల్పరూపంలోని రాత్రులు, ఎనై = నన్ను, ఈర్వన= చీల్చే స్వభావాన్ని కల్గినవి.

**భావదీపిక :** నాయకుని విశ్లేషించి, సహించలేని నాయకి చీకటికి, చల్లగాలికి భరించలేక పలికే పాశురం. ఇది. చెవి, నోరు కన్నులు మొదలైన ఇంద్రియాలు పలు విధాల విషయాలను అన్వేషించవచ్చు కనుక, నాయకుని విరహాన్ని పగటివేళ ఒక విధంగా సహించి ఉండవచ్చు. రాత్రివేళలో ఆ విధంగా కాకుండా చీకటిలో ఏ వస్తువు గోచరించినందున, ఇంద్రియాలతో పాటు మనస్సు కూడా నాయకుడనే ఒకే ఒక్క విషయాన్నే అన్వేషిస్తుంది కనుక, సంశ్లేషానికి రాత్రి అనుకూలమైన సమయం కనుక, ఆ రాత్రి సమయంలో విరహార్తిని సహించలేక ఎక్కువ క్లేశపడడం సహజం. ఈ పరాంకుశ నాయకి కూడా ఆవిధంగానే క్లేశపడుతున్నది.

లోకంలో మహారాజు తన రాజ్యపాలనను సాగించేటపుడు చిన్నచిన్న రాజులు తల ఎత్తలేరు. ఆ మహారాజు తల వాలిస్తే, వెంటనే చిన్న రాజులు తల ఎత్తి తమ ఇష్టం వచ్చినట్లు ఆడడం ఆరంభిస్తారు. అదే రీతిలో, తన కాంతితో చంద్రుడు, నక్షత్రాలు, దీపాలు మొదలైన అన్ని జ్యోతిస్సులు అవి ఉన్న చోటు ఏదో తెలియనట్లుగా మఱుగుపడి ఉండేటట్లు తన అద్వితీయశాసనాన్ని సాగించేవాడైన సూర్యుడనే మహాప్రభువు తల వాల్చగానే (అస్తమించగానే) చీకటి అనే చిన్నరాజు తన తలను విప్పి ఆడడం ఆరంభించాడు- అని పాశురం ముందు భాగంలో తెలుపబడింది. సూర్యుని ఉష్ణకిరణాలు, మహాప్రభువు ప్రతాపం- అనే రెండు **"తళల్ వాయ్"** అనే ప్రయోగం ద్వారా తెలుపబడ్డాయి. సూర్యాస్తమయాన్ని తెలుపగోరితే **"ఞాయిఱు మఱైయ"** (సూర్యుడు అస్తమించగా) అని అనవచ్చుకదా! ఆవిధంగా అనకుండా, **"అవియ"** అనేది- తిరిగి సూర్యోదయం కావడం కన్పించ కుండా, కేవలం రాత్రి సమయమే కొనసాగుతున్నట్లు తోచడంచేత, సూర్యుడు నశించిపోయినట్లున్నాడు- అనే భావంతో పలుకబడింది.

అందఱిని ఆనందపరచి రాజ్యపాలనను చేయడం **"శెజ్గోల్ శెలుత్తుదల్"**- రాజశాసనాన్ని ప్రవర్తింపజేయడమని అంటారు. దుఃఖాన్ని వృద్ధి చేసే స్థితిని కల చీకటిరాజ్యాన్ని **"శెజ్గోల్ శెలుత్తుదల్"** అని ఏవిధంగా చెప్పవచ్చు? అంటే, విపరీతలక్షణా ప్రక్రియలో ఈ విధంగా చెప్పబడిందని గ్రహించాలి. విరహంలో ఉండేవారిని బాధించడమనే హింసావృత్తి తమస్సుయొక్క కార్యమని భావం.

**(పార్ ముఱ్ఱుదుమ్ వీఱ్ఱిరున్దదు)**- లోకాన్ని అంతటిని తనలో ఇముడ్చు కొని, తనను ఎదిరించేవారెవరు లేకుండా, తన గొప్పతనం స్ఫురించేటట్లుగా ఉన్నదని భావం. "సూర్యుడు పాలించిన చోటు అంతా ఇపుడు చీకటి వేంచేసి ఉండడానికి మాత్రమే చోటయినది'' అనే విశేషార్థం కూడా చెప్పబడింది. "ఆదిత్యు డెపుడు అస్తమించబోతాడు?'' అని ఎదురుచూచిన చీకటి అతడు అస్తమించగానే రాజ్యం అంతా వ్యాపించి విరహిణులను బాధించడం ఆరంభించింది- అని తెలుపబడినట్లయింది.

ఈ విధంగా చీకటి ఒకవైపు చిత్రవధ చేస్తూ ఉండగా, వేఱొక వైపు స్వామి ధరించిన తులసీగంధాన్ని కల వాయువు వచ్చి వీచి, నన్ను చిత్రవధ చేస్తున్నదే! దీనిని దండించి మనలను రక్షించడం ఎపుడో? అని బాధపడుతున్నది, పాశురం ఉత్తరార్ధంలో.

పూర్వం తాను నాయకునితో కలసి ఉండే సమయంలో ఈ తులసీ పరిమళాన్ని కల వాయువు చల్లగా వీచి ఆనందాన్ని కల్గించిన స్థితిని స్మరించి **"తణ్వాడై"** అని అనబడింది. లేక, విపరీతలక్షణ ద్వారా వేడిగాలిని **"తణ్వాడై"** అని అంటూ గర్హిస్తున్నారని కూడా చెప్పవచ్చు. ఉత్తరదిక్కునుండి వీచే గాలికి **"వాడై"** అనే పేరు ఉన్నా, విశేషవాచకం సామాన్యార్థాన్ని తెలిపే క్రమంలో ఇక్కడ **"వాడై"** అనే పదం వాయుసామాన్యాన్ని తెల్పుతున్నది.

**(తడిన్దు)** ఖండించి- అని అర్థం. వాయువు ఖండిస్తున్నదని అనడం తగునా? వాయువంటే- రూపం లేని వస్తువు కదా? అని అంటే, వాయువు కల్గించే బాధ సహించలేనిది అయినందున, ఇది కోపం స్ఫురించేటట్లుగా పల్కిన మాట - అని గ్రహించాలి.

**(ఇని)** - రక్షించే నాయకుడు విడచి పెట్టిపోయాడు. హింసించే రాత్రి సమయం వచ్చిన తరువాత- అని అర్థం.

**(వళై కాప్పవరార్?)**- విరహం వల్ల కృశించిన దేహాన్ని పూర్వం ఉన్న రీతిలో పుష్టిని కల్గి ఉండేటట్లు చేసేవారెవరు? అని భావం. దేహం కృశించడానికి కారణం నాయకుని విరహం. ఆ విశ్లేషం తొలగి, సంశ్లేషం కల్గితే దేహం నిలచి, గాజులు కూడా నిలుస్తాయి. అందువల్ల **"వళై కాప్పవర్ ఆర్ ?"** అని అనబడింది. సంశ్లేషాన్ని కల్గించేవారెవరు? అని దీని భావం.

**(ఎనై యూఴికళ్ ఈర్వన)**- **"ఎన్నై"** అనే పదం ఇక్కడ **"ఎనై"** అని మారినదని భావించి తదనుగుణంగా పూర్వం వివరింపబడింది. ఆ రీతిలో కాకుండా, **"ఎత్తనై"** అనే పదం యొక్క వికృతిగా గ్రహించి, ఎన్ని కల్పాలు బాధిస్తాయి? అని కూడా వివరించవచ్చు. ఒక రాత్రే పలు కల్పాలుగా తోచిందని భావం. చివరిపాదంలో **"ఎన వళై కాప్పవరార్?"** అనే పాఠంకూడా ఉన్నది. అపుడు **"ఎన"** - నాయొక్క - అని అర్థం.

సర్వేశ్వరుని విరహాన్ని సహించలేక, జ్ఞానం కలుషితమై మోహం కల్గి, క్లేశాన్ని పొంది, సహాయాన్ని అన్వేషించే రీతిలోని తమ స్థితిని గూర్చి ఆళ్వార్లు పల్కడం ఈ పాశురంలోని స్వాపదేశార్థం.

**(తనివళర్ శెజ్గోల్ నడావు తఴల్వాయరశు అవియ)**- చీకటిని పోగొట్టేది, వేడిమిని కల్గినది, అడ్డు లేనిది, సాటి లేనిది- అయిన సూర్యుని తేజస్సువలె, మతాంతరులను నిరసించగల్గినది, దానివల్ల ప్రతాపాన్ని మిక్కిలి కల్గినది, భగవానుని ఆజ్ఞను అంతటా అడ్డు లేక నిర్వర్తించేది, దానివల్ల సాటి లేనిది అయిన వివేకం నశించేటట్లు - అని అర్థం.

**(పనివళర్ శెజ్గోలిరుళ్ పీఱ్ఱిరున్దదు)**- క్లేశాన్ని వృద్ధి చేసే గొప్పతనాన్ని కల మోహాంధకారం వ్యాపించింది. ఇకపై.

**(తునివళర్ కాదల్ తుఴాయ్ త్తుఴావు తన్వాడై తడిత్తు)** - విశ్లేషించిన దశలో దుఃఖాంతంగా ముగిసే నా భక్త్యతిశయానికి విషయమైన భగవానుని భోగ్యతను స్మరింపజేసి, త్వరను కల్గిస్తూ సాగే ఈ లౌకికవిషయాలను నిరసించి,

**(వళై కాప్పవర్ ఆర్)**- మఱచిపోయి అయినా దేవతాంతరాలను కొలువని రీతిలో నాకు గల దాస్యశేషత్వ స్వభావాన్ని తొలగిపోకుండా రక్షించేవారెవరు? **"వళై"** అనేది భర్త జీవించి ఉండే స్త్రీలకు సుమంగళిగా ఉండే సమయంలో గుర్తు కనుక, అది స్వాపదేశంలో భగవత్సంబంధానికి చిహ్నమైన శేషత్వాన్ని సూచిస్తుంది.

(ఎనై యూழிకళ్ ఈర్వనవే)- "కూవి క్కొళ్ళుమ్ కాలమ్ ఇన్నమ్ కుఱుకాదో!" (నన్ను నా దగ్గరకు పిలుచుకొనే సమయం ఇంకా దగ్గరపడలేదా?) అని త్వరపడే నాకు ఈ కాలవిలంబం సహించలేనిదై ఉన్నది- అని తెలిపినట్లయింది.

**నాయకి నేత్రసౌందర్యాన్ని గూర్చి నాయకుడు పల్కడం**

**14.** ఈర్వనవేలు మఞ్జేలుమ్, ఉయిర్మేల్ మిళిర్న్దివైయో
పేర్వనవో వల్ల దెయ్వనల్ వేట్కణై-, పేరొళియే
శోర్వన నీల చ్చుడర్ విడుమేని యమ్మాన్ విశుమ్బూర్
తేర్వన, దెయ్వ మన్నీరకణ్ణో? ఇచ్చె ழுఙ్గయలే

ఈర్వన వేలుమ్ = శత్రువులను చీల్చి చెండాడే వేలాయుధంవలె, అమ్ శేలుమ్ = అందమైన "శేల్" అనే చేపలవలె ఉన్నవి అయిన, ఇవై = ఇవి, ఉయిర్ మేల్ మిళిర్న్దు = నా ప్రాణాలను వశీకరించుకొని, దానిపై వ్యాపించి, పేర్వనవో అల్ల = దానిని విడచి వెళ్ళడం లేదు, దెయ్వమ్ =దైవస్వభావాన్ని కల, నల్ = అందమైన, వేళ్ = మన్మథుని, కణ్ = బాణాల, పేర్ ఒళియే = గొప్ప కాంతినే, శేర్వన = తాము వ్యక్తం చేస్తున్నాయి, నీలమ్ = నీలమణి యొక్క, శుడర్ = కాంతిని, విడు = చిమ్ముతున్న, మేని = తిరుమేనిని కలవాడైన, అమ్మాన్ = స్వామియొక్క, ఊర్ విశుమ్బు = ఊరైన పరమపదాన్ని, తేర్వన = తను సాటిగా అన్వేషించే స్వభావాన్ని కల్గినవి, ఇ శెழு కయల్ = మిక్కిలి బలిసిన బేడిస చేపలని చెప్పదగిన ఇవి, దెయ్వమ్ అన్నీర = మోహిని అనే స్త్రీ దైవాన్ని పోలిన మీయొక్క, కణ్ణో = నేత్రాలా!

భావదీపిక : నాయకుడు నాయకియొక్క స్వభావాన్ని పొగడుతూ పల్కే "నలమ్ పారాట్టు" అనే ప్రక్రియలో ఈ పాశురం రచింపబడినది. ఈ ప్రక్రియ యొక్క రూపం ఏమంటే - నాయకుడు నాయకితో సంశ్లేషించి, కొంతకాలం తరువాత విశ్లేషించే సమయంలో మూడు కారణాలవల్ల నాయకి అందాన్ని పొగడడం కవి సంప్రదాయం. వాస్తవంగా ఆమె అందంలో తాను ఆసక్తుడై ఉండడం మొదటి కారణం. విశ్లేషించిన సమయంలో ఈ పొగడ్త తన ప్రాణధారణకు ఉపయోగిస్తుందనేది రెండవ కారణం. "ఇతడు నన్ను చిరకాలం వీడిపోయి బతుకలేడు. త్వరలో తిరిగి వస్తాడు'' అని నాయకి తెలిసికొని, ఆశ్వాసాన్ని పొందాలి- అనేది మూడవ కారణం.

ఇది, నాయకి నేత్రసౌందర్యంలో ఆసక్తుడై నాయకుడు పలికే పాశురం. చాలా పదునైన మొనతో (అగ్రభాగంతో) శత్రువులను వధించే వేలాయుధంవలె పదునైన చూపులతో నన్ను ఈ (నాయకి) నేత్రాలు బాధిస్తున్నాయి- అనే భావం స్ఫురించేటట్లు **"ఈర్వన వేలుమ్"** అని అనబడింది. చేపలవలె అందాన్ని, మెఱిసే, మిలమిలలాడే స్వభావాన్ని కల్గినవి- అనేది స్ఫురించేటట్లు **"అమ్‌శేలుమ్"** అని అనబడింది. **"వేల్ పోలవుమ్"** అని అనవలసి ఉండగా, ఇక్కడ ఉపమానవాచకం లోపించింది. లక్ష్యాన్ని తప్పకుండా మర్మస్థానంలో తగిలి భేదించి, ప్రాణాలను తీసే బాణంవలె, ఇది కూడా (నాయకి చూపు కూడా) ప్రాణస్థానంలో తగిలి, దానిని దోచుకొని పోకుండా ఉండదు - అనే భావం తోచేటట్లు **"ఉయిర్‌మేల్ మిళిర్న్దు ఇవైయో పేర్వనవో అల్ల"** అని అనబడింది. అనిత్యమై, నాశాన్ని పొందే స్వభావాన్ని కల దేహాన్ని నశింపజేయడం మాత్రమే కాక, నిత్యమై, నశించే స్వభావాన్ని లేని ఆత్మను, ప్రాణాన్ని కూడా నశింపజేయడం ఆరంభించిందనే అర్థం ఇక్కడ స్ఫురిస్తుంది.

**(పేర్వనవో అల్ల)**- పెఱికి వేయదగినవిగా లేవు- అని అర్థం. **"దెయ్వ నల్ వేట్కైక్ పేరొళియే శోర్వన"** అనే దానియొక్క భావం ఏమంటే- మన్మథుడు తన అయిదు బాణాలతో చేసే పని అంతా ఈ రెండే చేస్తున్నాయి- అని. ఏనాటికీ తీరని నిందను కల్గించడం, వర్ణానికి వికారం పొందించడం మొదలైనవి మన్మథ బాణాల కార్యాలు. వీటినే నాయకియొక్క నేత్రాలు చేస్తున్నాయి- అని భావం.

**(నీలచ్చుడర్ విడు మేని యమ్మాన్ విశుమ్బూర్ తేర్వన)**- తనను ఒకసారి అనుభవించినవారు (దర్శించినవారు) మళ్ళీ తిరిగి రాకపోవడంలో పరమపదంతో నాయకి నేత్రాలు పోలి ఉన్నవి. ఈ లీలావిభూతిని వశం చేసికొన్నంత మాత్రంతో తృప్తిని పొందకుండా, నిత్యవిభూతి అనే పరమపదాన్ని సైతం వశం చేసికోవాలని అన్వేషిస్తున్నాయి- అనే అర్థాన్ని కూడా ఇక్కడ చెప్పవచ్చు. **"విశుమ్బూర్ తేర్వన"** అనే ప్రయోగానికి "పరమపదాన్ని అన్వేషిస్తున్నాయి" అనేది అర్థం అయినట్లు, "పరమపదంచే అన్వేషింపబడేవి" అనేది కూడా అర్థం కనుక, "పరమపదంలో అంతు లేని ఆనందాన్ని అనుభవించే నిత్యులచే, ముక్తులచే ఆశపడి అన్వేషించ డానికి తగినది- అనికూడా భావం.

**(దెయ్వ మన్నీరకణ్ణో!)**- ఇక్కడ నమ్బిళ్ళై వ్యాఖ్యానాన్ని గమనిస్తే, ఇక్కడ స్వరరూపం భేదం లేకుండా, అక్షరరూపంలో మాత్రం భేదించే రెండు విధాలైన

పాఠభేదాలు గ్రహించదగినవి. ఇక్కడ నమ్బిళ్ళై ఈడు వ్యాఖ్యానం ఏమంటే- **"దెయ్వజ్గళినుడైయ స్వభావత్తై యుడైయనవాయిళ్ళన- ఎన్నుదల్, అన్ఱిక్కే, దెయ్వమన్నీరెన్ఱు ఇవర్కళ్ తజ్గళుక్కు పేరాక్కి, అప్రాకృతస్వభావైకళాన ఉజ్గళుడైయ ఎన్నవాయిరున్దన"** అని ఇక్కడ పల్కిన రెండు అర్థాలలో, మొదటి అర్థానికి **"అన్నీర్"** అనేది తగిన పాఠం. **'దెయ్వ మన్నీరై"** - దివ్యమని చెప్పదగిన, అటువంటి స్వభావాన్ని కల్గినవి- అని అర్థం. (ఇక్కడి నకారం తవర్గపంచ మాక్షరంగా ద్రావిడలిపిలో కన్పించే నకారం.) రెండవ అర్థానికి **"అన్నీర"** (ఇక్కడి నకారం త వర్గపంచమాక్షర నకారం కంటే భిన్నమైనది. ఇది అంతఃస్థాలైన యరలవల వరుసలో చేరిన నకారం) అనేది తగిన పాఠం. ఇక్కడ **"అన్నీర"** అనే పదంలో **"అ"** అనేది షష్ఠీ విభక్తి. లేక "అశై"గా కూడా చెప్పవచ్చు.

ఆళ్వార్ల జ్ఞానవైశద్యాన్ని, ప్రకాశాన్ని చూచి పొగడే భాగవతుల సూక్తి- ఈ పాశురానికి స్వాపదేశం. ఈ పాశురానికి స్వాపదేశంలో- నాయకస్థానీయులు భాగవతులు.

**(ఈర్వనవేలుమ్ అజ్జేలుమ్)** - వీరి జ్ఞానం యొక్క వైశిత్యం, స్వభావం మతాంతరాలను ఓడించి, స్వకీయులను ఆనందింపజేసే స్వభావాన్ని కల్గినవి- అని అర్థం.

**(ఉయిర్ మేల్ మిళిర్న్దు ఇవైయో పేర్వనవో వల్ల)** - వీరి జ్ఞానం చేతను లందఱిపట్ల పూర్ణమైన కృపను తప్పకుండా కల్గినవి- అని భావం.

**(దెయ్వ నల్ వేట్కైక్ఱె ప్పేరొళియే శోర్వన)**- మన్మథబాణాలనే పుష్పాలు ఏవిధంగా సుకుమారంగా ఉంటాయో, ఆ విధంగానే వీరి జ్ఞానం చాలా సుకుమారంగా ఉన్నదని, మూఢజ్ఞానం కాదని భావం.

**(నీలచ్చుడర్ విడు మేని యమ్మాన్ విశుమ్బూర్ తేర్వన)- "ఇరుళ్ తరు మాఞాలత్తు ఇని ప్పిఱవి యాన్ వేణ్డేన్"** (అజ్ఞానప్రదమైన ఈలోకంలో ఇక జన్మను కోరను) అని ఈ లోకాన్ని గర్హించి, నిత్యవిభూతిలోని ఉజ్జీవనకోసం అన్వేషించడమే వీరి జ్ఞానానికి పని - అని భావం.

**(ఇచ్చెళ్ళుమ్ కయలే)**- భగవానుని మత్స్యావతారం మొదలైనదానిలో లోతుగా అవగాహించినది వీరి జ్ఞానం - అని అర్థం. **"దెయవ మన్నీర కణ్ణో"** అనేదానికి -

దేవరవారు లోకవిలక్షణులై ఉండేటట్లే, దేవరవారి జ్ఞానంకూడా లోకవిలక్షణంగా ఉన్నదని భావం. ఈ రీతిలో వీరి జ్ఞానస్వభావాన్ని దర్శించిన భక్తుల సూక్తి, ఈ పాశురం.

"విశుమ్బూర్ తేర్వన" అని నాయకి నేత్రాలను వర్ణించే ప్రయోగాన్ని వివరించే నమ్బిళ్ళై ఈడువ్యాఖ్యలో "విశుమ్బూర్"- అనేది పరమపదాన్ని సూచిస్తుందని తెలిపి, "విశుమ్బూర్ తేర్వన" అనే దానికి స్వాపదేశంలో రెండు విధాలైన యోజనలను చూపించారు.

నాయకినేత్రాలు పరమపదంలోని నిత్యసూరులచే కూడా అన్వేషింపబడేవి- అని, అవి లీలావిభూతిని వశం చేసికోవడమే కాక, ఆ పరమపదాన్ని కూడా వశీకరించుకోవాలని చూస్తున్నవి-అని ఈ ప్రయోగానికి రెండు రీతులలో అర్థాన్ని చెప్పవచ్చు- అని నమ్బిళ్ళైవ్యాఖ్య. ఎల్లప్పుడూ ఆనందాన్ని అనుభవించేటట్లుగా ఉండే పరమపదంలో ఉండేవారు, భగవానుని అనుభవించడం తప్ప వేఱుదేనినీ తెలియనివారైన నిత్యసూరులు కూడా తిరుక్కురుకూర్‌కు వచ్చి ఆదరించే రీతిలో నాయకినేత్రాలున్నాయని మొదటి అర్థం. పరమపదంలో కామదేవుడైన మన్మథుని ఆజ్ఞ చెల్లదు కనుక, అతని ఆన పరమపదంలో కూడా చెల్లేటట్లుగా చేయాలని నాయకి కన్నులు- అన్వేషిస్తున్నాయి. అంటే- ఈ లోకంలోని వారిని అందఱిని తన వశం చేసికోవడంతో చాలదని, పరమపదాన్ని కూడా వశపరచుకోవాలని నాయకి నేత్రాలు అన్వేషిస్తున్నాయని రెండవ అర్థం.

ఇక్కడ "కణ్" అనే పదానికి స్వాపదేశంలో జ్ఞానం- అని పిళ్ళై తిరునఱైయూర్ అరైయర్ తెలిపారు. పరాంకుశనాయకి నేత్రసౌందర్యం నిత్యసూరులను కూడా వశీకరించుకోవడం అంటే- ఆళ్వార్ల జ్ఞానాన్ని చూచి నిత్యసూరులు కూడా వారిపట్ల అభినివేశాన్ని పొందడమే.

### నాయకుని మనస్సును తెలిసి సఖి పల్కడం

15. **కయలో నుమకణ్గళెన్ఱు కళిఱు వినవి నిఱ్ఱీర్,**
**అయలోరఱియిలు మీదెన్న వార్త్తై!-, కడల్ కవర్న్ద**
**పుయలోడులామ్ కొణ్డల్ వణ్ణన్ పునవేఙ్గడత్తెమ్మొడుమ్**
**పయలోవిలీర్, కొల్లై కాక్కిన్ఱ నాళుమ్ పలపలవే**

కళిఱు వినవి = ఏనుగు ఇక్కడకు రావడం చూచారా? - అని ఏనుగును గూర్చి అడగడం ఆరంభించి, కయలో నుమ కణ్‌గళ్ ఎన్ఱు నిన్‌ఱీర్ = మీ నేత్రాలు బేడిస చేపలా ఏమి! - అని మా కన్నులను పొగడి, కాలు కదపకుండా ఉన్నారు, అయలోర్ అఱియిలుమ్ = ఇరుగు పొరుగువారు తెలిసినా, ఈదు ఎన్న వార్‌త్తై= ఇదేమి పొసగని మాట!, కడల్ కవర్‌న్ద = సముద్రజలాన్ని అంతటిని కొల్లగొట్టినది, పుయలోడు ఉలామ్ = వర్షంతో మెల్లగా సంచరించేది అయిన, కొణ్డల్ = కాలమేఘంవంటి, వణ్ణన్ = (చల్లని) వర్ణాన్ని కలవాడైన భగవానుని, పునమ్ వేఙ్గడత్తు = (పలు సస్యక్షేత్రాలను) కల వేంకటాద్రిలో, కొల్లై కాక్కిన్ఱ నాళుమ్ పల పల = (మనం) పెరడును కాపలా కాస్తున్న చాలా దినాలలో ఒక్క దినంలో కూడా, ఎమ్మోడు పయలో ఇలీర్ = మీతో మాకు సంబంధం (పరిచయం) లేదు.

సస్యక్షేత్రంలో ఏనుగును గూర్చి ప్రశ్నించాలని వచ్చి నాయకి నేత్ర సౌందర్యాన్ని పొగడిన నాయకుని ఉద్దేశించి సఖి, ఆ నాయకుని మనస్సులోని భావాన్ని గమనించి పల్కిన పాశురం ఇది. ఇక్కడ పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానంలోని పరమభోగ్యమైన సూక్తులు కొన్ని అవశ్యజ్ఞాతవ్యాలు. "ఇయఱ్కైయిలే కలన్దు పిరిన్ద తలైమకన్ ఇరణ్డామ్ కూట్టత్తుక్కాక పునత్తిలే వన్దు కిట్టక్కడవదాక క్కుఱివరై యిట్టు ప్పోయ్, క్కాలాతిక్రమమ్ పిఱన్దు, పిన్బు అఙ్గే శెన్ఱు కిట్టినవన్, ఇవర్‌కళై క్కణ్డు కలఙ్గి, అసంగతభాషణమ్ పణ్ణ, అవర్‌కళుమ్ అత్తైక్కొణ్డు, ఇవర్ వరువతాక ప్పోనపడి క్కుమ్, వన్దపడిక్కుమ్, ఇప్పోదు ఆర్‌త్తరాయ్ తోన్‌ఱ పేశుకిఱ పేచ్చుక్కుమ్ ఒరు శేర్‌త్తి కణ్డిలో మెన్ఱు శిరిత్తు క్కొణ్డాడుకిఱార్‌కళ్. ఇవన్‌తాన్ వీరనాకైయా కైయాలే, ఎన్ఱుమ్ ఆనై వేట్టైక్కుప్పోమ్ పழక్కత్తాలే, ఆనైవేట్టైయై వినవిక్కొణ్డు శెల్లక్కడవదాక నినైక్కిఱాన్. పిడియై ఇழన్దదొరు కళిఱు తన్ ఆర్‌త్తరామైయాలే అమణానై ప్పట్టుత్తిరియుమాపోలే, ఇవర్‌కళై యిழన్దు తాన్ ఆర్‌త్తరామైయోడే తిరికిఱపడియై అన్యాపదేశత్తాలే ఆవిష్కరిక్కిఱాన్" (సహజసంశ్లేషాన్ని నాయకితో పొంది తరువాత, ఆమెను విశ్లేషించిన నాయకుడు, ఆమెను రెండవ పర్యాయం సంశ్లేషించడంకోసం, ఉద్యానవనానికి వచ్చి ఆమెను కలుస్తానని సంకేతాన్ని పల్కి, రావడంలో ఆలస్యం చేశాడు. ఆలస్యంగా ఉద్యానవనానికి వచ్చిన నాయకుడు అక్కడ నాయకిని, ఆమె సఖిని చూచి, తడబడి పల్కుతూ అసంగతభాషణాన్ని చేశాడు. వారుకూడా దానిని గమనించి, అతడు సంకేతస్థలానికి వస్తానని చెప్పి పోయిన రీతికి, వచ్చిన రీతికి, ఇపుడు ఆర్తి స్ఫురించేటట్లుగా పలికే మాటలకు

ఏవిధంగాను పొంతన కనబడడం లేదు- అని నవ్వుకొన్నారు. నాయకుడు మహావీరుడైనందున, ఎల్లప్పుడు ఏనుగులను వేటాడడం కోసం వెళ్ళే అలవాటువల్ల, ఏనుగుల వేట కోసం పోవాలని తలచాడు. ఆడఏనుగును కోల్పోయిన (దూరమైన) మగ ఏనుగు తన విరహక్లేశంతో పిచ్చెక్కి తిరిగే రీతిలో, నాయకిని కోల్పోయి దూరమైన నాయకుడు తాను ఆర్తితో సంచరించే రీతిని అన్యాపదేశప్రక్రియలో ఈ పాశురంలో ఆవిష్కరిస్తున్నాడు.)

నాయకి గాంధర్వవివాహక్రమంలో నాయకునితో కలసింది. దైవం విశ్లేషం కలుగజేయగా ఆమెకు నాయకుడు దూరమయ్యాడు. పూర్వం తెల్పిన సంకేతానికి అనుగుణంగా నాయకి, ఆమె సఖి ఇద్దఱు కలసి పొలాన్ని కాపలా కాచే నెపంతో అతని రాకను ఎదురు చూస్తూ పెరటి ప్రదేశంలో వేచి ఉన్నారు. చాలా ఆలస్యంగా అక్కడకు నాయకుడు వచ్చి నిలచి, "నేను ఆలస్యంగా వచ్చానే. వీరి మనస్సు కోపాన్ని పొంది, నాపట్ల వ్యతిరేకభావంతో ఉండవచ్చుకదా! ఇపుడు వీరికి నాపట్ల ప్రేమ ఏరీతిలో ఉన్నది?- అని తెలిసికోకుండా పూర్వం పల్కిన ప్రేమ వచనాలను పల్కడం తగదు. అందువల్ల అన్యపరమైన సాధారణ వచనాలను ప్రస్తావించి, వాటికి వీరు పలికే సమాధానాలద్వారా వీరి ప్రేమదశను తెలిసికొని, తరువాత నేను ప్రేమవచనాలను పల్కడం ఆరంభించవచ్చు" అని తలచి, ఏనుగు రాకను గూర్చి ప్రశ్నించడం ఆరంభించాడు. అది ఏమంటే- **"వేழమ్ వినాదెన్బదు- కుఱైకూఱ త్తుణియానిన్ఱ తలైమకన్ ఎన్ కుఱై ఇన్నదెన్ఱు ఇవళుక్కు వెళిప్పడై కూఱువేనాయిన్ ఇవళ్ మఱుక్కవుమ్ కూడుమెన ఉట్కొణ్డు, ఎన్‌కుఱై ఇన్నదెన్ఱు ఇవళ్‌దానే ఉణరుమళవుమ్ కరన్ద మొழియాల్ శిల శొల్లి ప్పిన్ కుఱై యుఱువదే కారియమెన, వేట్టై క్కురుతి చ్చొన్ఱానాక అవ్విరువరుழై చ్చెన్ఱు నిన్ఱు, తన్ కాదల్ తోన్ఱ "ఇవ్విడత్తే మదయానై వరక్కణ్డీరో? ఎన వేழమ్ వినావా నిற்றల్"** అనేది తిరుక్కోవైయార్ వివరణం. దీని భావం ఏమంటే- తన కోరికను వ్యక్తం చేయాలని తలచిన నాయకుడు, "నా కోరిక ఇది- అని ఈమెకు వ్యక్తంగా తెల్పితే, ఈమె ఒకవేళ దానిని తిరస్కరించవచ్చు." అని తలచి, "నా మనోరథం ఇది- అని ఈమె స్వయంగా గ్రహించేవరకు అన్యాపదేశమైన మాటలను పల్కి, తరువాత నా మనస్సును తెలుపడం తగిన పని"- అని తలచి, వేటను ఉద్దేశించి పల్కేటట్లుగా ఆ ఇద్దఱి దగ్గరకు వెళ్ళి నిలచి, నాయకిపట్ల తన ప్రేమ వ్యక్తమయేటట్లుగా "ఇక్కడకు మదపుటేనుగు ఏదయినా వచ్చిందా?" అని ప్రశ్నించడమే.

నాయకిని, సఖిని చూచిన నాయకుడు ఏనుగు వేటాడే అలవాటును కల మహావీరుడు కనుక, ఏదో వేట కోసం తాను అరణ్యప్రాంతానికి వచ్చినట్లు, అక్కడ ఒక ఏనుగు తన ఆడ ఏనుగును వెంటబడి తరుముతూ వచ్చినట్లు, దానిని అన్వేషిస్తూ తాను అక్కడకు వచ్చినట్లుగా భావనను ప్రదర్శించి, "ఇక్కడకు ఒక మదపుటేనుగు రావడం చూచారా?'' అని అ పొలాన్ని కాచే వారిని ప్రశ్నించడమే. **"కళిఱు వినాదల్"** అని, **"వేౖళమ్ వినాదల్"** అని చెప్పబడుతున్నది. ఈ రీతిలోనే **"కలైమాన్ వినాదల్, వౖళివినాదల్"**, (దారిని అడగడం) **"పడి వినాదల్, పెయర్ వినాదల్"** పేరును అడగడం మొదలైన పలు ప్రశ్నించే రీతులున్నాయి. నాయకితో సంభాషించగోరిన నాయకుడు "ఇక్కడ జలం లభిస్తుందా?'' ఇక్కడ కొంచెం సున్నం దొరుకుతుందా?'' అని కొన్ని అవసరమైన వస్తువులను గూర్చి ప్రశ్నించే వ్యాజంగా పొలంలోకి వచ్చి, మాటలను పల్కడం, నాయకి అభిప్రాయాన్ని గమనించి తెలిసికోవడానికి అవకాశాన్ని పొందడం అనేది లోకరీతిగా ఉండడం గమనార్హం.

నాయకుడు నాయకితో తాను మాట్లాడాలనే నెపంతో కొన్ని ప్రశ్నలను అడగడం ఆరంభించినా, నాయకియొక్క నేత్రసౌందర్యంలో ఇంతకుముందే అభినివిష్టుడైనందున, ఇపుడా సౌందర్యం అతనిని పరవశుణ్ణి చేస్తున్నందున, దానిని పొగడే రూపంలో తన ఆర్తిని తెలిపే మాటలు అతని నోటినుండి అతడు మాట్లాడే మాటల మధ్య వెలువడ్డాయి. "ఇవి కన్నులేనా? లేక, చేపలా?'' అనేటట్లుగా కొన్ని మాటలను అతడు పలికాడు. వీటివల్ల అతని అభిప్రాయాన్ని సూచనగా గ్రహించి, చెలికత్తె అతని ఆశను (కోరికను) మఱుగుపరచడం కోసం ఇతరులు భావించే రీతిలో పల్కడమేకాక, నాయకి మనోరథాన్ని కూడా సూచనగా ఈ పాశురంలో. అతనికి తెలిపింది, ప్రేమాతిశయం స్ఫురించే రీతిలోను, ప్రేమను కప్పి పుచ్చే రీతిలోను ఈ పాశురంలోని ఉక్తి క్రమం అమరి ఉండే అందం గమనించదగినది.

**(కయలో నుమ కణ్‌గళెన్ఱు కళిఱు వినవి నిఱ్ఱీర్)**- దీనిని రెండు రీతులలో యోజనచేయాలి. **"కళిఱు వినవి కయలో నుమ కణ్‌గళెన్ఱు నిఱ్ఱీర్"** - మీరు గజాన్నిగూర్చి ప్రశ్నించడానికి వచ్చినవారైతే, ఆ ప్రశ్నతో నిలువకుండా, మా నేత్రసౌందర్యాన్నిగూర్చి కూడా పల్కుతున్నారే! ఇది ఏమి?

**(అయలో రఱియిలుమ్ ఈదెన్న వార్త్తై?)** - అసంగతమైన ఈ మాటలను చుట్టుపక్కలవారి చెవిలో పడితే ఏమి అనుకొంటారు? వీరికి ఇతనితో ఏదో

సంబంధం ఉన్నది కాబోలు!'' అని తలచి మా వంశానికి అపకీర్తి తెస్తారే! ఇటువంటి అసంగతమైన మాటను నిలపండి- అనేది పైన తోచే అభిప్రాయం. ఇక, ప్రేమ స్ఫురించేటట్లుగా పలికే అభిప్రాయానికి అనుగుణంగా రెండవ యోజనను గమనించండి.

**(కయలో నుమ కణ్‌గళెన్ఱు కళిఱు వినవి నిగ్ఱ్గీర్, అయలోర్ అఱియిలుమ్ ఈదెన్న వార్‌త్తై)-** మీకన్నులు చేపలా! అని మా నేత్రసౌందర్యంలో అభినివేశాన్ని పొంది పలికారు. మీ అభిమానానికి, ప్రేమకు చాలా సంతోషాన్ని పొందాము. దానికి పిమ్మట గజాన్నిగూర్చి ప్రశ్నించారే! అది ఎందుకు? మా నేత్ర సౌందర్యంలో అభినివేశాన్ని పొందే వచ్చారు- అని మేము తలచి ఆనందించకుండా, "వేట అనే వేఱు పనికోసం వచ్చినట్లున్నారు'' అని తలచి క్లేశపడేటట్లుగా మీరు గజాన్ని గూర్చి ప్రశ్నించడం తగునా? మీ ప్రేమను ఇరుగుపొరుగువారు తెలిసినా తెలియనీ. దానివల్ల మా వంశానికి ఏమి అపకీర్తి వస్తుంది?

**(ఈదెన్న వార్‌త్తై?)-** వచ్చిన పనిని విడచి ఏనుగును గూర్చి ప్రశ్నించడం కూడా ఒక మాటయేనా?- అనేది మనస్సులోని భావం. ఇక్కడ **"అయలోర్"** అని అన్నందున "మేము మీకు సంబంధించినవారం. మీరు మాకు చెందినవారు'' అనే భావం వ్యక్తమవుతుంది. మేము మీకు ఇరుగు పొరుగువారం కాము. చుట్టు పక్కలవారు వేఱే ఉన్నారని భావం.

**(పున వేఙ్గడత్తు ఎమ్మొడుమ్ పయలో విలీర్)- "పాదియుమ్ శిగ్ఱ్గాళుమ్ పళ్ళముమ్ పయలెనల్"** అనే పింగళ నిఘంటువునుబట్టి **"పయల్"** అనేదానికి భాగమని పేరు. మాతో మీకు భాగం లేదు- సంబంధం లేదని భావం. **"పయిలో ఇలీర్"** అనే పాఠాంతరం ఉన్నది. అపుడు "అలవాటును కలవారు కారు'' అని అర్థం. కొత్తగా పరిచయమైన మీరు బాగా అలవాటు పడినవారివలె ఉండడం తగదు- అని భావం. అందువల్ల, కొత్తగా వచ్చిన మీరు మాతో ఉమ్మడిపొలాన్ని కల్గిన వారివలె ఇక్కడ మాతో చిరకాలం వ్యర్థ సంభాషణను చేయడం తగదు- అని తాత్పర్యం.

**(కొల్లై కాక్కిన్ఱ నాళుమ్ పలపలవే)-** మేము పొలాన్ని కాపలా కాయడం అనేది నిన్నటిది ఈనాటిది కాదు. పలు ఏండ్లుగా ప్రతిదినం పొలాన్ని కాపలా కాస్తున్నాము. ఈవింతను మేమేనాడు చూడలేదు. చాలాకాలంగా పరిచయం

ఉన్నవారివలె నీవు ఇక్కడకు వచ్చి పల్కడం తగదు. దూరంగా వెళ్ళిపో- అనేది పైపైన భావం. నీ రాకను మేము ఎదురు చూచి, పెరటిలోని పొలాన్ని కాపలా కాయడమనే నెపంతో చిరకాలంగా వేచి ఉంటే, నీవు ఈనాటి వరకు రాలేదు. మాతో సంశ్లేషాన్ని పొందడంలో ఆశను నీవు కల్గి ఉండ లేదే! అనేది లోపలి భావం.

**(పయలో ఇలీర్)**- చిరకాలంగా పరిచయం కల్గి, దగ్గరగా మెలిగినా, ఏనాడూ చూడనివి, కొత్తవివలె ఉండేవి మీ సౌందర్యాదులు- అని తెల్పినట్లుకూడా ఇచటి భావం. చెలికత్తె ఈ విధంగా పల్కి నాయకి ప్రేమను నాయకునకు సూచించింది.

ఆళ్వార్లు వేంచేసి ఉండే సన్నివేశాన్ని చూచి అభాగవతులు కొందఱు అసంగత భాషణాన్ని చేయగా, దానివల్ల ఆళ్వార్లలో కల్గిన మార్పు ఈ పాశురంలో తెలుపబడుతున్నదనే స్వాపదేశార్థాన్ని ఈ పాశురానికి తెల్పిన నమ్బిళ్ళై, భగవానునితో కలిగే సంబంధంకంటే, భగవద్భక్తులతో కలిగే సంబంధం గొప్పది- అనే అర్థాన్ని విశదీకరించడంకోసం **"సంసారవిషవృక్షస్య"** ఇత్యాది సంస్కృతశ్లోకాన్ని ఉదాహరించి వివరిస్తూ ఒక ఐతిహ్యాన్ని ప్రస్తావించారు.

**"సంసారవిషవృక్షస్య ద్వే ఫలే హ్యమృతోపమే, కదాచిత్ కేశవే వృత్తిః తద్భక్తైర్వా సమాగమః"** (సంసారమనే విషవృక్షానికి రెండు అమృతంవంటి ఫలాలున్నాయి. అవి, ఏవో ఒక సమయంలో కేశవుని పట్ల ఏర్పడే భక్తి - అనేది ఒకటి, అతని భక్తులతో కలయికను పొందడం- అనేది ఇంకొకటి) అనేది ఆ సంస్కృతశ్లోకం.

మేల్నాడులో (తిరునారాయణపురంలో) కేశవదీక్షితులనే వారి ఇంటిలో వేంచేసి ఉండేటపుడు భగవద్రామానుజులు ఈ శ్లోకానికి **"అన్ద ఉద్దేశ్యమానదుదానే సిద్ధిక్కిలుమ్ సిద్ధిక్కుమ్ కాణ్"** అనే ఒక అరుదైన అర్థాన్ని- తెలిపారని నమ్బిళ్ళై తెలియజేశారు.

**"కదాచిత్ కేశవే భక్తిః తద్భక్తై ర్వా సమాగమః"** అనే సూక్తిలో ఉండే **"వా"** అనే పదానికి "లేక''- అనేది సామాన్యంగా చెప్పబడే అర్థం. ఆ రీతిలో కేశవునిపట్ల భక్తిగాని, లేక, అతని దాసులపట్ల భక్తిగాని- అనేవి సంసారమనే విషవృక్షంలో లభించే అమృతంవంటి ఫలాలు- అనే అర్థం సామాన్యంగా ఈ శ్లోకానికి స్ఫురిస్తుంది. ఈ అర్థంలో రెండు కొఱతలున్నాయి. **"వా"** అనేది వికల్పాన్ని తెలిపే పదంవల్ల, "ఇది కాని, అది కాని''- అనే అర్థం స్ఫురిస్తుంది. కనుక, ఏదో ఒక

ఫలమే సిద్ధిస్తుంది, రెండూ సిద్ధించవు- అనే భావం కల్గుతుంది. అయితే, శ్లోకంలో **"ద్వే ఫలే"** అని చెప్పబడినందున, ఈ వికల్పార్థం పొసగదు. అంతేకాక, భగవద్భక్తి కంటే భాగవత భక్తి గొప్పది- అనే అర్థంకూడా ఇక్కడ స్ఫురించదు. అందువల్ల **"వా"** అనే పదానికి **"ఏవ"** అనే అర్థాన్ని గ్రహించి, "ఏదో ఒక సమయంలో భగవద్భక్తి కల్గుతుంది. ఆ పిమ్మట, అంతకంటే గొప్పది అయిన భాగవత భక్తియే కూడా సిద్ధిస్తుంది. ఆ ఉద్దేశ్యమే - పొందదలచినదే - సిద్ధిస్తుంది - అనే అర్థాన్ని శ్రీరామా నుజులు తెలిపారు. ఏ ఉద్దేశ్యం పొందడం దుర్లభమో, అదే లభిస్తుందని దీని తాత్పర్యం. ఈ ఐతిహ్యప్రస్తావన తిరువాయ్‌మొழிలోని **"పయిలుమ్ శుడరొళి"** (3-7) దశకప్రవేశంలో కూడా కన్పిస్తుంది.

### చీకటిరాత్రి దైర్ఘ్యాన్నిగూర్చి ఆశ్చర్యపడుతూ నాయకి, సఖితో పల్కడం

**16. పలపల వూழிగళాయిడుమ్, అన్ఱి యోర్ నాழிగైయై**
**ప్పలపల కూఱిట్ట కూఱాయిడుమ్-, కణ్ణన్ విణ్ణనైయాయ్!**
**పలపల నాళన్బర్ కూడిలుమ్ నీఙ్గిలుమ్ యా మెలిదుమ్**
**పలపల శూழలుడైత్తు అమ్మ! వాழி యిప్పాయిరుళే**

కణ్ణన్ విణ్ అనైయాయ్ = భగవానుని పరమపదంవలె చాలా ప్రియమైన దానా!, పల పల ఊழிకళ్ ఆయిడుమ్ = నాయకుని విశ్లేషించిన దశలో రాత్రి సమయం ఎన్నో కల్పాల కాలంవలె దీర్ఘంగా ఉంటుంది, అన్ఱి = అంతేకాక, (నాయకునితో కూడి ఉండే స్థితిలో ఈ సమయం) ఓర్ నాழிగైయై పల పల కూఱు ఇట్ట కూఱు ఆయిడుమ్ = ఒక గడియను పలు పలు భాగాలుగా చేస్తే వానిలో, ఒక భాగంగా (చిన్నదిగా) ఉన్నది, అన్బర్ = నాయకుడు, పల పల నాళ్ కూడిలుమ్ = పలు దినాలుగా సంశ్లేషించి ఉన్నా, (కాలం చాలా సంకోచించి నందున), యామ్ మెలిదుమ్ = మేము క్లేశపడుతున్నాము, (అన్బర్ పల పల నాళ్) నీఙ్గిలుమ్ = నాయకుడు పలు పలు దినాలు విశ్లేషించి దూరమై ఉన్నా, (కాలం మిక్కిలిగా వృద్ధి చెందినందున), యామ్ మెలిదుమ్ = మేము చాలా బాధపడుతున్నాము, (అందువల్ల), ఇ పాయ్ ఇరుళ్ = ఈ వ్యాపించిన చీకటి సమయం, పల పల శూழల్ ఉడైత్తు =చిన్నదిగా ఉండేటపుడు పలు ఉపాయాలను కల్గినదై, పెద్దదిగా ఉండేటపుడు పలు ఉపాయాలను కల్గినదై ఉన్నది, అమ్మ వాழி = ఏ స్థితిలో అయినా నన్ను బాధించే ఈ రాత్రికాలం, అయ్యో! వర్ధిల్లనీ!

భావదీపిక : నాయకునితో కొంతకాలం సంశ్లేషించి, తరువాత విశ్లేషించిన నాయకి ఆ విశ్లేషాన్ని సహించలేనిదై, నాయకుడు లేకుండా రాత్రి సమయాన్ని గడపడం సాధ్యంకాకుండా ఉన్న రీతిని తన సఖితో పల్కుతున్నది. ఏనాడూ విశ్లేషం లేని నాయకుని సంశ్లేషంపట్ల తనకు గల తీవ్రమైన అభిలాషను దీనిద్వారా వ్యక్తం చేస్తున్నది. ఈవిధంగా కాకుండా, సంశ్లేషం ప్రవృత్తమైన తరువాత నాయకిని చూచి, సఖి ఆ సంశ్లేషక్రమాన్నిగూర్చి ఆమెను ప్రశ్నించగా, "విరహంలో ఉన్నపుడు కాలం దీర్ఘంగా కూడి ఉండేటపుడు కాలం కుఱుచగా ఉండే రీతి ఏమి ఆశ్చర్యం!'' అని అంటూ సంశ్లేషసమయంలో కాలం అనేది ఏవిధంగా గడచిపోయిందో తెలియలేదని తన ఆనందాతిశయాన్ని ఆమెతో నాయకి అంటున్నది- అనికూడా చెప్పవచ్చు.

**"నీణ్గిల్ ఊழி యాయిడుమ్, కూడిల్ నాழிకై క్కూఱాయిడుమ్"** అని మార్చి అన్వయించి అర్థాన్ని చెప్పవచ్చు. అపుడు ఇది **"ఎదిర్ నిరనిఱైప్పొరుళ్కోళ్"**- పదాలను వ్యతిరేక క్రమంలో అన్వయించి అర్థం చెప్పినట్లవుతుంది. నాయకీ నాయకులిద్దరు కూడి ఉన్నపుడు దీర్ఘమైన కాలం అంతా ఒక క్షణంవలె త్వరగా గడచిపోవడం, విరహదశలో అల్పకాలంకూడా చిరకాలమై దీర్ఘం కావడం లోకంలో అందఱి అనుభవంలోను ఉన్నదే! (**"మొழிమాఱ్ఱునిఱై, మయక్కనిరనిఱై"** అని కూడా ఈ అన్వయక్రమానికి పేరు)

**(అన్బర్ నీణ్గిల్ పల పల ఊழிకళాయిడుమ్)**- నాయకునకు దూరంగా ఉండే కాలం- పలు అవాంతర కల్పాలను కల పలు మహాకల్పాలకాలంవలె చాలా దీర్ఘంగా తోస్తున్నది- అని భావం. **"ఊరెల్లామ్ తుఞ్జి"** అనే తిరువాయ్‌మొழி దశకార్థం ప్రకృతంలో అనుసంధేయం.

**(అన్బర్ కూడిల్ ఓర్ నాழிకైయై ప్పల ప్పల కూఱిట్ట కూఱాయిడుమ్)**- నాయకునితో కలసి ఉన్నకాలం చాలా అల్పకాలంగా గడచిపోతున్నది. ఒక గడియను పలు పలు భాగ విభాగాలుగా చేస్తూ వస్తే, కలా, కాష్ఠానిమేషాదులతో, ఇకపై విభాగించడానికి వీలు లేని రీతిలో ఉండే ఒక అత్యల్పకాలపరిమితిగా సంశ్లేష సమయంలోని కాలం తోస్తుంది.

ఆళవందార్ స్తోత్రరత్నంలో, భగవానుడు లక్ష్మీదేవితో కలసి, ఆమెను సంతోషింపజేసే వైభవాన్ని వర్ణించేటపుడు **"అపూర్వనానారసభావనిర్భర ప్రబుద్ధయా ముగ్ధవిదగ్ధలీలయా, క్షణాణువత్ క్షిప్తపరార్ధకాలయా ప్రహర్షయంతం మహిషీం**

మహాభుజమ్" (44) అనే శ్లోకంలో "క్షణాణువత్ క్షిప్తపరార్ధకాలయా" అనే విశేషణం ఇక్కడ గమనించదగినది. బ్రహ్మయొక్క ఆయుష్కాలపరిమితికి పరమని పేరు. భగవత్క్రీడలో అందులో సగభాగానికి "పరార్ధ"మని పేరు. ఇటువంటి చాలా పెద్ద పరిమితిని కల కాలం అంతా చిన్న క్షణకాలం వలె గడచిపోయింది, "అవిదితగతయామా రాత్రిరేవ వ్యరంసీత్" అనే ఉత్తర రామచరితనాటకంలో చెప్పబడిన సూక్తికూడా ఇక్కడ పోలికగా స్మరించాలి. ఆశ్చర్యకరంగా లీలారసాలను అనుభవించడం ఆరంభిస్తే పల కోటి నూఱువేల సంవత్సరాలు కూడా అవలీలగా గడచిపోతాయికదా. '**కోழி కూవెన్ఱు మాల్ తోழி ! నాన్ ఎన్ శెయ్‌వేన్, ఆழிవణ్ణర్ వరుమ్ పొழుదాయిఱ్ఱు కోழி కూవెన్ఱు మాల్**" (సఖీ! కోడి 'కూ'' అని కూస్తున్నది. అయ్యో! నేనేమి చేయను? సముద్రవర్ణుడు వచ్చే సమయమైనది. కోడి 'కూ' అని కూస్తున్నది. అయ్యో!) అనే కలియన్ పాశురం స్మరణీయం.

**(అన్బర్ కూడిలుమ్ నీజ్గిలుమ్ యామెలిదుమ్)**- కలసి ఉండేకాలం ఒక క్షణకాలంగా గడచిపోతున్నదే -అని ఒక బాధ; విశ్లేషించినపుడు కాలం పలుపలు కాళరాత్రులై దీర్ఘంగా తోస్తున్నదే- అని ఇంకొక బాధ. "**సంయోగాః విప్రయోగాంతాః**" అన్నట్లు సంశ్లేషం విశ్లేషాన్ని కల్గిస్తుంది కనుక, ఆ సంశ్లేషకాలం అతిస్వల్పంగా గడచిపోయినందున, అయ్యో! సంశ్లేషాన్నికూడా కోరే యోగ్యత లేకుండా పోయిందే! అని విచారించిన రీతి ఇది. "**మెలితుమ్**" - ఇక్కడ "**తుమ్**" అనే ప్రత్యయం కాలవాచకంకాదు. స్వభావాన్ని తెల్పుతుంది (తద్ధర్మరూపమైనది).

**(ఇప్పొయిరుళ్ పల పల శూழలుడైత్తు)**- రాత్రివేళయొక్క సామర్థ్యాన్ని గూర్చి ఏమని చెప్పను? సంశ్లేషంలో కుఱచగా అవుతున్నది. వియోగంలో దీర్ఘమవుతున్నది. "**శూழల్**" - "**శూழ్చ్చి**" ఉపాయమని అర్థం. "**అమ్మ**"- ఇది అవ్యయపదం. ఇక్కడ ఆశ్చర్యాన్ని, బాధను తెల్పుతుంది. "**వాழி**"- మిక్కిలి కోపంతో నిందించవలసిన సందర్భంలో విపరీతలక్షణతో "**వాழி**" (మంగళం) అని అనబడింది.

ఈ పాశురంలోని ధ్వన్యర్థమేమంటే - భాగవతులను కలసిన స్థితిలో అతి స్వల్పమై, వారిని విశ్లేషించిన సమయంలో చాలా దీర్ఘమై ఉండే కాలంవల్ల రెండు రీతులలోను తాము పడే క్లేశాన్ని ఆழ్వార్లు తమ భక్తులకు తెలిపే పాశురమిది. "**ఇప్పొయిరుళ్**"- అనే దానికి మోహాంధకారాన్ని కలుగజేసే కాలమని అర్థం. "**కణ్ణన్ విణ్ణనైయాయ్!**" - కాలపరిణామం లేని పరమపదంవలె మీరు ఉన్నారు - అని

ఆళ్వార్లను ప్రశంసించిన రీతి, ఇది. "అమ్మ! వాళి" అనేది తాను తలచిన రూపాన్ని పొందగల కాలంయొక్క స్వభావాన్నిగూర్చి ఆశ్చర్యపడి, బాధపడిన రీతిని తెల్పుతుంది.

"పల పల ఊళికళాయిడుమ్.." ఇత్యాది సూక్తికి- ఆళ్వార్లకు భగవానునితో విశ్లేషించిన కాలం చాలా దీర్ఘంగా తోస్తున్నదని, కలసి ఉండే కాలం చాలా త్వరగా సాగుతున్నదనే స్వాపదేశాన్ని తెల్పుతూ నమ్బిళ్ళై శ్రీరామాయణంలోని ఒక సూక్తిని ప్రమాణీకరించి, దాని వివరణలో ఒక సంవాదాన్ని ప్రస్తావించారు.

వనానికి వెళ్ళిన శ్రీరాముడు తిరిగి వస్తాడనే ఆశతో సుమంత్రుడు గంగానదీ తీరంలో రెండు మూడు దినాలపాటు గుహునితో పాటు వేచి ఉన్నాడు. ఆ విషయాన్ని దశరథునితో **"గుహేన సార్ధం తత్రైవ స్థితోఽస్మి దివసాన్ బహూన్"** అని అన్నాడు.

గుహునితో కలసి ఉన్నది రెండు మూడు దివసాలే అయినపుడు **"దివసాన్ బహూన్"** (పలు దినాలు) అని ఏవిధంగా అన్నాడు? ఒంటరిగా ఉంటే కాలం చాలా దీర్ఘంగా తోచి ఉండవచ్చు. కాని గుహునితో కలసి ఉన్నాడు కదా! మఱి ఈవిధంగా ఎందుకు అన్నాడు? అని నమ్బిళ్ళై నంజీయర్‌ను ప్రశ్నించారు.

అభిమతవిషయాన్ని విశ్లేషించినపుడు దానిని స్మరింపజేసేవారి సమక్షంలో క్లేశం ద్విగుణీకృతం అవుతుంది కదా! శ్రీరాముని విశ్లేషించిన సమయంలో, అతనిని గుర్తుకు తెస్తూ గుహుడు పల్కినందున శ్రీరామవిరహక్లేశం మఱింత వృద్ధి అయినది. అందువల్ల, తాను వేచి ఉన్నది వాస్తవానికి రెండు మూడు దినాలైనా, ఆ సమయం పలు దినాలుగా సుమంత్రునకు తోచింది- అని నంజీయర్ బదులిచ్చారు.

### సముద్రాన్ని చూచి నాయకుని రథచక్రపు గుర్తులను చెఱిపి వేయవద్దని నాయకి అనడం (తేర్వళితూరల్)

17. ఇరుళ్ విరిన్దాలన్న మానీర్ త్తిరై కొణ్డు వాళియరో,
ఇరుళ్ పిరిన్దారన్బర్ తేర్వళి తూరల్-, అరవణైమేల్
ఇరుళ్విరి నీలక్కరునాయిఱుశుడర్ కాల్వదుపోల్
ఇరుళ్ విరిశోది, పెరుమానుఱైయు మెఱికడలే!

ఇరుళ్ విరి = చీకటిని బయటకు ఉమిసే (వెలువరించే), నీలమ్ = నీలరత్నంవంటి, కరు = నల్లని వర్ణాన్ని కల, ఞాయిఱు = సూర్యమండలమని, శుడర్ కాల్వదుపోల్ = కాంతిని ప్రసరించేటట్లు, ఇరుళ్ విరి శోది పెరుమాన్ = నల్లని వర్ణాన్ని, మిక్కిలి కాంతిని కల శ్రియఃపతి, అరవుఅణై మేల్ = శేషశయనంపై, ఉఱైయుమ్ = నిత్యవాసం చేసే, ఎఱి కడలే = అలలు ఎగసిపడే ఓ సముద్రమా!, వాழி = నీకు మంగళం, ఇరుళ్ విరిన్దాల్ అన్న = చీకటి వ్యాపించినట్లుగా, మా నీర్ తిరై కొణ్డు = నల్లని నీటిని కల్గిన అలలచేత, ఇరుళ్ పిరిన్దార్ అన్బర్ తేర్ వழி తూరల్ = చీకటిలో నన్ను విడచిపెట్టి పోయిన నాయకుని రథం పోయిన దారి గుర్తులను చెఱపకుండా ఉంటావుగాక.

భావదీపిక : నాయకి సముద్రాన్ని ఉద్దేశించి, **"తేర్వழి తూరల్"** అనే ప్రక్రియలో పాడిన పాశురమిది. ఈ ప్రక్రియ తిరుక్కోవైయార్‌లో **"తేర్వழி నోక్కి క్కడ లొడు క్కూఱల్"** (రథం మార్గాన్ని (గూర్చి) ఉద్దేశించి సముద్రంతో పల్కడం) అని తెలుపబడింది. **"ఉళ్ళు మురుకి ఉరోమమ్ శిలిర్ప్ప ఉడైయ వనాట్కొళ్ళు మవరిలొర్ కూట్టమ్ తన్దాన్ కునిక్కుమ్ పులియూర్, విళ్ళుమ్ పరిశు శెన్దార్ వియన్ తేరివழி తూరల్ కణ్డాయ్ పుళ్ళుమ్ తిరైయుమ్ పొరచ్చుఱ్ఱమార్క్కుమ్ పొరుకడలే!"** అనే, ఈ ప్రక్రియలో రచింపబడిన తిరుక్కోవైయార్ పాశురం ఇక్కడ స్మరణీయం. రహస్యంగా నాయకితో సంశ్లేషించిన నాయకుడు, దానివల్ల ఊరంతా అపవాదు వ్యాపిస్తున్నదని తెలిసి, ఆ అపవాదు సమసిపోయేటట్లుగా కొన్నాళ్ళు నాయకిని విడిచి వెళ్ళాలని నిశ్చయించుకొన్నాడు. ఆ విషయాన్ని నాయకికి తెలుప కుండా, తాను ఆమెను విడచివెళ్ళడం ఆమెకు తెలిస్తే ఆమె బాధపడుతుందని, ఆమెకు తెలియకుండా, ఊరిలోని వారికి తెలియకుండా ఉండే రీతిలో ఆమెను విడచివెళ్ళాడు. ఆమె సమక్షంలో తాను పోలేనందున, చీకటి వేళలో వెళ్ళిపోయాడు. నాయకికి ఈ విషయం తరువాత తెలిసి, నాయకుని విరహాన్ని సహించలేక, అతడు వెళ్ళిపోయేటపుడు అతని రథచక్రం ముద్రితమైన గుర్తులను అతడు తిరిగి వచ్చేవరకు తన ప్రాణాలను నిలుపుకోవడానికి ఆలంబనంగా భావించి, వానినే చూస్తూ ఉన్నది. ఆ విధంగా నాయకిని నాయకుడు విశ్లేషించిన చోటు సముద్రతీరమనే జలప్రదేశమైనందున, ఆ రథచక్రపు గుర్తులను సముద్రపు అలలు చెఱిపి వేయబోయాయి. అపుడు నాయకి సముద్రాన్ని ఉద్దేశించి పల్కుతూ, ఆ నాయకుని రథచక్రగుర్తులను చెఱిపివేయవద్దని అర్థిస్తూ పలికే పాశురం ఇది.

పూర్వం, శ్రీరాముడు వనవాసయాత్రకోసం బయలుదేరినపుడు అతనిని ఆయోధ్యాపురవాసులు వెంబడించారు. అపుడు వారు తెలిసికోలేని రీతిలో రాత్రివేళ రథాన్ని ఎక్కి శ్రీరాముడు వెళ్ళిపోయినట్లుగా, ఈ నాయకుడు కూడా రాత్రివేళ వెళ్ళిపోయాడు. రథచక్రపు గుర్తులు కూడా కన్పించకుండా శ్రీరాముడు వెళ్ళిపోయాడు. ఆ రీతిలో గుర్తులు తెలియని రీతిలో పోకుండా, గుర్తులు కన్పించేటట్లు నాయకుడు పోవడమే ఇక్కడ తేడా. సముద్రమా! రాత్రి సమయంలో విశ్లేషించే నాయకుడు పోయిన దారిని, చీకటి వ్యాపించినట్లుగా ఉండే నీ గొప్ప నీటి తరంగాలతో చెఱిపి వేయవద్దు- అని నాయకి చేతులను జోడించి అర్థిస్తున్నది. తేరు వెళ్ళిన మార్గాన్ని చెఱిపివేయకుండా, తనకు సహాయపడడంకోసం **"వాృయ్యరో!"** అని మంగళాశాసనం చేస్తున్నది. సముద్రమా! నీ నాథుడైన స్వామి ఏనాడూ నిన్ను విడచిపెట్టిపోకుండా, నీవద్దనే వాసం చేయడంవల్ల విశ్లేషవ్యసనాన్ని తెలియకుండా ఆనందించి గర్విస్తున్నావు- అనే భావం స్ఫురించేటట్లుగా చివరి రెండు పాదాలున్నాయి.

సముద్రంలో నివసించే భగవానుడు పాశురంలోని ఒకటిన్నర పాదంతో వర్ణింపబడుతున్నాడు లోకంలో ఉండే ఏ వస్తువు కూడా భగవానునకు సాటి రాదు- అనే విషయం తోచేటట్లు మూడవ పాదంలో ఒక అభూతోపమ **(ఇల్ పొరుళ్ ఉవమై)** ప్రయోగింపబడింది. భగవానుని తిరుమేనియొక్క గొప్ప కాంతిని, నల్లని తిరుమేని వర్ణాన్ని పురస్కరించుకొని ఈ ఉపమ ప్రయోగింపబడింది. నీలరత్నంవలె నల్లని వర్ణాన్ని కల ఒక అపూర్వమైన సూర్యమండలం కాంతిని ప్రసరించేటట్లుగా (ఉండే) నల్లదనం నిండిన కాంతిని కల శ్రియఃపతి - అని నాయకి అంటున్నది. **"ఓర్ కరు ఞాయిఱు అన్న మిల్లాక్కదిర్ పరప్పి అలర్న్దదొక్కు మమ్మానే"** (అద్వితీయుడైన నల్లని సూర్యుడు అంతులేని కిరణాలను వ్యాపింపజేసి, వికసింప జేసినట్లున్నది) అని తిరువాయ్మొృలిలో కూడా ఈరీతిలో పలుకబడింది. **"ఇరుళ్ విరి, నీలమ్, కరు"** అనే మూడింటిని ఒకే అర్థాన్నిచ్చే పలు పదాలుగా గ్రహించాలి. వీటిద్వారా - మిక్కిలి నల్లని రంగును కల సూర్యుడనే భావం వ్యక్తమవుతుంది.

**"తిరై కొణ్డు తేర్వృి తూరల్, వాృయ్యరో!"** అని అనకుండా, వాక్యం మధ్యలో **"వాృయ్యరో!"** అని అనడం, అలలు నిండిన సముద్రమైనందున, కార్యం

పూర్తి అయేవరకు ఆగకుండా, పూర్తిగా వినకుండా, తన అలలతో రథమార్గాన్ని చెఱిపివేస్తుందని భయపడి మధ్యలో నాయకి **"వాழியరో !"** అని అంటూ దానిని శరణు వేడుతున్నది.

ప్రియుడు పగటివేళ విడచి వెళ్ళి ఉంటే అతడు విరహార్తికి బాధపడుతూ వెళ్ళే సన్నివేశాన్ని చూచి, దానినే స్మరిస్తూ ప్రాణాన్ని నిలుపుకోవచ్చు. ఆ అవకాశం లేని రీతిలో చీకటిలో వెళ్ళిపోయినందున ఈ రథచక్రం గుర్తులు తప్ప నా ప్రాణాలను నిలుపుకోవడానికి వేఱు ఏ ఆధారాన్ని కల్గినదానను కాను నేను- అనే భావం స్ఫురించేటట్లుగా **"ఇరుళ్ పిరిన్దారన్బర్"** అని అనబడింది. "సంశ్లేషించడానికి తగిన రాత్రి కాలంలో విడచిపెట్టిపోయాడే! అయ్యో!'' అని కూడా దీని భావాన్ని చెప్పవచ్చు.

ఈ సందర్భంలో పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యాన శ్రీసూక్తులు గమనించ దగినది. **"పకలిలే పిరిన్దు పోనారాకిల్, ఆగ్ర్ రాప్తైయాలే నడక్క మాట్టా దొழிకిఱపడియైయుమ్, అవర్ ముకత్తిలుణ్డాన కుళిర్త్తియైయుమ్, స్మితత్తై యుమ్ కణ్డు ధరిత్తిరుక్కలాయ్‌త్తు - అవర్ తాముమ్ పకలిల్ పోకిల్. ఇవళై క్కణ్డు వైత్తు క్కాల్ నడైతారాదెన్డు ఇరుళిలే పోనార్. ఎఙ్గనుమ్ పోనారుమ్ మీణ్డు వన్దు శేరుమ్ కాలత్తిలే పోనార్. పదార్థదర్శనఙ్గళాలే ఆఱియిరుక్కవొణ్ణాద కాలత్తిలే పోనార్. సంభోగకాలత్తిలే పోనార్"** (పగటివేళ పోయి ఉంటే అతడు విరహార్తితో నడువలేని సన్నివేశాన్ని, అతని ముఖంలో ఉండే చల్లదనాన్ని, చిఱునవ్వును చూచి ప్రాణాలను నిలుపుకోవచ్చు. అతడు, పగటివేళ విశ్లేషిస్తే, ఈమెను చూచి నడక సాగదని రాత్రివేళ పోయాడు. ఎక్కడికి వెళ్ళినవారైనా నాయకిని చేరే రాత్రికాలంలో పోయాడు. బాహ్యపదార్థాలను చూచి ఆశ్వాసాన్ని పొందడానికి వీలుకాని రాత్రివేళ పోయాడు) అనేవి ఆ సూక్తులు.

**"తేర్‌వழி"** -రథచక్రం పోయిన గుర్తులను కల దారి - అని అర్థం. **"తూరల్"-** చెఱుపవద్దు- అని అర్థం. వ్యతిరేకార్థకమైన విధ్యర్థక ఏకవచనరూపం. **("ఎదిర్‌మఱై ఏవల్ ఒరుమై")**

ఈ పాశురంలోని స్వాపదేశార్థం ఏమంటే- ఆழ்వార్లు తమకు భక్తులైన భాగవతులను విశ్లేషించి బాధపడే స్థితిలో వారిపట్ల తమ మనోరథాన్ని నిరంతరం కలవారై, అందువల్ల అయినా ఒక విధంగా సాంత్వన పొందే తమ మనోరథవైఖరి

ప్రకారం మధ్యలో పోకుండా కొనసాగుతూ ఉండాలని సంసారమనే సముద్రాన్ని ఉద్దేశించి ఈ పాశురంలో ప్రార్థించడమే. సంసారాన్ని అలలు వీచే సముద్రంగా పల్కడం- అది పలు దుఃఖాలు అధికాధికంగా కల్గించి, తనలో చిక్కుకొన్నవారు మునిగి పోయేటట్లుగా వ్యాపించే స్వభావాన్ని కల్గినది అయినందున, పరిచ్ఛేదించి పలుకలేని విస్తృతిని కల్గినది అయినందున. (ఆవిధంగా పలుకబడింది.) సంసారం భగవానుని లీలావిభూతి- అనే విషయాన్ని ఉత్తరార్థం తెల్పుతున్నది. భగవానుని దాసులపట్ల అభినివేశం కల తమకు హాని చేయకుండా ఉండడం కోసం, సంసారానికి కల భగత్సంబంధాన్ని ప్రస్తావించి, ఆ సంబంధాన్ని కీర్తించారు.

**(ఇరుళ్ విరిన్దాలన్న మానీర్ త్తిరై క్కొణ్డు)**- మోహాంధకారప్రవాహాన్ని పుట్టించే పలు సంసారక్లేశాలనే అలలచేత,

**(ఇరుళ్ పిరిన్దారన్బర్ తేర్వ*ழి* తూరల్)- "ఇరుళ్ తరు మాఞాలమ్"** (అజ్ఞానాన్ని కల్గించే గొప్ప భూలోకం) అయిన ఈ లోకంలో మమ్ములను విడచి వెళ్ళిన ఆప్తబంధువులైన భాగవతుల విషయంలో నేను కల్గి ఉండే మనోరథమార్గాన్ని పాడు చేయవద్దు - అని ప్రార్థించిన రీతి ఇది. తమకు ఆ హాని చేయకుండా సహాయపడడంకోసం **"వా*ழి*"** అని అన్నారు.

**"వా*ழి*య"** -అనే **"వియఙ్గోళ్"** (విధ్యర్థక క్రియ) పదంలోని చివరి అచ్చు అయిన అకారం, హల్లు అయిన యకారంలోపించి **"వా*ழి*"** అని మిగిలింది. **"అరో"** ఇది **"అశైచ్చొల్"**, **"వా*ழి*యర్"** అనే పదంపై అశైచ్చొల్ అయిన ఓకారం రాగా **"వా*ழி*యరో"** అయినది అని కూడా చెప్పవచ్చు.

### వర్షాకాలాన్ని చూచి చింతిల్లే నాయకి ఆర్తిని చూచిన సఖి బాధపడడం

**18. కడల్ కొణ్డె*ழு*న్దదు వానమ్, అవ్వానత్తై యన్ఱి చ్చెన్ఱు**
**కడల్ కొణ్డొ*ழి*న్ద వదనాలిదు-, కణ్ణన్ మణ్ణుమ్ విణ్ణుమ్**
**కడల్కొణ్డె*ழு*న్ద అక్కాలఙ్గలో? ఉయఙ్గాలఙ్గలో?**
**కడల్ కొణ్డ కణ్ణీర్, అరువి శెయ్యా నిఱ్కుమ్ కారికైయే!**

కడల్ కొణ్డ = సముద్రమంత పరిమితిని కల, కణ్ నీర్ అరువి = కన్నీటి ప్రవాహాన్ని, శెయ్యా నిఱ్కుమ్ = ప్రవహిస్తూ ఉండే, కారికైయే = అందమైన చిన్నదానా!, వానం = ఆకాశం, కడల్ కొణ్డు ఎ*ழு*న్దదు = సముద్రాన్ని ఆక్రమించి

విజృంభించింది, కడల్ = ఆ సముద్రం,అప్ప్టి = ఆ విధంగా తనను కొల్లగొట్టిన ఆకాశంపై కోపించి, అ వానత్తై శెన్టు కొణ్డు ఒ౯్రిన్ద అదనాల్ = ఆకాశాన్ని పోయి ఆక్రమించినందున, ఇదు = ఈ స్థితి ఏర్పడింది, కణ్ణన్ మణ్ణుమ్ విణ్ణుమ్ = భగవానుని సొత్తు అయిన భూలోకాన్ని, పరమపదాన్ని, కడల్ కొణ్డు ఎ౯ున్ద అ కాలమ్ కొల్ ఓ = ప్రళయసమయంలో తనలో ఇముడ్చుకొని, పైకి విజృంభించిన ఆ కల్పాంతకాలమేనా?, లేక, పుయల్ కాలమ్ కొల్ = వర్షాకాలమేనా? (ఏదో తెలియలేకున్నాను).

భావదీపిక : ఈ పాశురం ఏ ఆలంకారిక ప్రక్రియలో రచింపబడినది? అనే విషయంలో పూర్వాచార్యులలో అభిప్రాయభేదాలున్నాయి. గడచిన ఏడవ పాశురాన్ని వలె దీనినికూడా **"కాలమయక్కు"** అనే రీతిలో గ్రహించవచ్చునని నమ్పిళ్ళై, పెరియవాచ్చాన్‌పిళ్ళై అభిప్రాయం. వర్షాకాలాగమనాన్ని చూచి క్లేశపడే నాయికయొక్క ఆర్తిని చూచి, సఖి జాలిపడడం, బాధపడడం- అనేది వాదికేసరి అ౯ుకియమణవాళచ్చీయర్ అభిప్రాయం. దీని భావమేమంటే- "వర్షాకాలాగమన సమయానికి తిరిగి వస్తాను'' అని కాలనిర్దేశాన్ని చేసి విడచి పోయిన నాయకుడు, ఆ కాలం వచ్చినా రానందున, నాయకి వర్షాకాలాన్ని చూచి ఆర్తితో క్లేశపడగా, చెలికత్తె దానిని చూచి జాలితో బాధపడడమే.

**"కలన్దు పిరిన్ద తలైమకన్ కార్ కాలత్తై క్కుఱిత్తు ప్పోనానాయ్, అక్కాలమ్ వన్దు అవన్ వారాదొ౯ియ, అత్తాల్ ఆర్తి౯ాపై మీదూర్‌న్దు, నోవుపడుకిఱ పిరాట్టియై క్కణ్డ తో౯ియానవళ్, అవన్ వరుమళవుమ్ ఇవళై జీవిప్పిక్కైక్కాక క్కాలత్తై మయక్కి, ఆశ్వసిప్పిక్కిఱాళా యిరుక్కిఱదు"** (సంశ్లేషించి, విశ్లేషించిన నాయకుడు వర్షాకాలాన్ని తన ఆగమనసమయంగా నిర్దేశించిపోయాడు, ఆ కాలం వచ్చినా, అతడు రాకపోగా, అందువల్ల ఆర్తి అధికమై, క్లేశపడుతున్న నాయకిని చూచిన ఆమె చెలికత్తె, అతడు వచ్చేవరకు ఆమెను జీవింపజేయడం కోసం కాలాన్నిగూర్చి భ్రమకలుగజేసి, ఊరడిస్తున్నది) అనేది నమ్పిళ్ళై ఈడువ్యాఖ్యాన సూక్తి. అ౯ుకియమణవాళచ్చీయర్ ఉరైలో - **"ఇదు కాలమయక్కమన్ఱు"** (ఇది **"కాలమయక్కు"** అనే ప్రక్రియకాదు) అని అంటూ, కాదని పలుకబడినా, అది స్వతంత్రమైన వ్యాఖ్యాన రీతి- అని తిరస్కరించ దగినది. దీనిని **"కాలమయక్కు త్తుఱై"** అని గ్రహించడమే ఉచితం. ఇందులో **"పుయఱ్కాలఙ్గొలో"** అని చెప్పబడి

నందున, కాలాన్ని గూర్చి తెలిసిన సఖి, నాయకిపై జాలిపడి పల్కిన పాశురమనియే గ్రహించాలి- అని ఆచార్యుల భావం. పూర్వం **"కాలమయక్కు"** అనే ప్రక్రియలో రచింపబడిన ఏడవ పాశురంలో కూడా **"తిరుమాల్ కాలమ్ శుమన్దు పిరిన్దార్కొ డుమై కుఱైయు తణ్ పూజ్కాలజ్గలో! అటియేన్"** అని ఉన్నది. ఇక్కడ కూడా ఆవిధంగా గ్రహించడం అనుచితం కాదు.

నాయకితో కలసి ఉండే నాయకుడు, కార్యార్థంగా దేశాంతరానికి వెళ్ళవలసి వచ్చింది. "కాంతా! నేనిపుడే వస్తాను" అని పల్కి, కాలనిర్దేశాన్ని చేసి (సంకేతాన్నిచేసి) విడచివెళ్ళాడు. నిర్దేశించిన ఆ వర్షాకాలం వచ్చినా, అతడు తిరిగి రాలేదు. అపుడు "అయ్యో! నాయకుడు గుర్తు చెప్పిన వర్షాకాలం వచ్చిందే! ఈ సమయానికి అతడు రాలేదే!" అని వర్షాకాలాగమనాన్ని, ఆ సమయానికి నాయకుడు రాకపోవడాన్ని తలచి బాధపడే నాయకిని ఆమె చెలికత్తె "గుణపూర్ణులారా! (నంగాయ్!) నీవెందుకు వ్యర్థంగా బాధపడుతున్నావు! నిజంగానే వర్షాకాలం వచ్చినపుడుకదా, నాథుడు తిరిగివస్తాడు. అతడు చెప్పిన వర్షాకాలం ఇంకా రాలేదు. మఱి ఇదేమి? అని అంటావా! చెబుతున్నాను, విను. ఆకాశం సముద్రాన్ని తీరపర్యంతంగా ఆవరించి జలజంతువులను సైతం హరించింది. దానిని గమనించిన సముద్రం "చాలా గొప్ప తత్త్వాన్ని అయిన నన్ను ఏమాత్రం లెక్కించకుండా నన్ను, నా ప్రాణులను బాధించి, నా సొత్తును కూడా ఈవిధంగా ఆకాశం కొల్లగొడు తున్నదే!" అని కోపించి, ఆ ఆకాశంతో పొరాడడానికి సిద్ధపడుతున్నది. అందువల్ల సముద్రం, ఆకాశం ఒకటితో ఇంకొకటి కలసి పోరాడే కాలం ఇది. అంతే తప్ప, నాయకుడు చెప్పిపోయిన వర్షాకాలం రాలేదు- అని అంటూ నాయకిని ఒక విధంగా ఓదార్చగోరిన సఖి కాలాన్నిగూర్చి భ్రమ కలుగచేసి పల్కి, వెంటనే, ఈ విధంగా నేను అసత్యాన్ని పల్కినప్పటికీ, నాయకికి నిజం తెలియకుండా పోతుందా? "ఏరీతిలో అయినా, నన్ను ఓదార్చడంకోసంగా సఖి కల్పించి పూర్తిగా అసత్యాన్ని పల్కుతున్నది"- అని తలుస్తుంది- అని భావించి, ఆవిధంగా ఆమె భావించకుండా ఉండడంకోసం తానుకూడా భ్రమను పొందినట్లుగా, ఉత్తరార్థంలో సఖి పల్కుతున్నది. అన్ని ప్రాణులను హరించడంకోసం వచ్చిన ప్రళయకాలమా! తెలియడంలేదే! అని అంటున్నది.

"ఇది వర్షాకాలం కాదు" అని నిస్సందేహంగా పల్కినపుడు కదా, నాయకికి ఊరట కల్గుతుంది. మొదట కాలాన్ని గూర్చి భ్రమ కలుగజేస్తూ పల్కి, వెంటనే

"ఇది వర్షాకాలమే కదా'' అని అంటే నాయకికి దుఃఖమే కదా అధికమవుతుంది. ఊరట ఏమాత్రం కలుగదే! అని అంటే, "నా సఖి రెండు రీతులలో పల్కుతున్నది. ఆమె అసత్యాన్ని పల్కినదైతే "ఇది వర్షాకాలం కాదు''అని నిశ్చయించుకొనవచ్చు. ఆ రీతిలో పలుకకుండా సందేహంగానే పల్కినందు నందున, "ఈమె కూడా నిశ్చయించుకోలేనట్లుగా ఉన్నది కాబోలు. దీనిని నేనే విచారించి చూచి నిశ్చయించు కుంటాను''- అని నాయకి భావించి, ఇది సముద్రానికి, ఆకాశానికి మధ్య ఏర్పడిన స్పర్ధయా? వర్షాకాలమా?- అని పరిశీలించడం ఆరంభిస్తుంది. ఆ పరిశీలనలో కొంతసేపు అయినా విరహాన్ని మఱచి ఊరటను పొందుతుంది. ఇంతలో నాయకుడు తిరిగివస్తాడు- అనేది చెలికత్తె అభిప్రాయం.

**"కారికై"** - అందం - అని అర్థం. దానిని కల్గిన నాయకిని ఈ పదం ఇక్కడ లక్షిస్తుంది.

భగవానుడు తనతో సంబంధం కలవారిని ఏనాడూ విడువడు. తగిన కాలంలో పరిగ్రహిస్తాడు. ఇది కాలం కాదు. అతడు మనస్సులో నిశ్చయించుకొన్న కాలం ప్రాప్తం అయేవరకు వేచి ఉండాలి- అని ఆళ్వార్లను వారి భక్తులు ఓదార్చడం దీనిలో ధ్వన్యర్థం.

మొదటి పాదంలో **"అన్ఱి"** - అంటే కోపాన్ని పొంది - అని అర్థం. **"అన్ఱుదల్"**- కోపించడం. **"అన్ఱియ వాణనాయిరమ్ తోళుమ్ తుణియ"** అనే చోట ఈ అర్థాన్ని గమనించాలి.

### నాయకి పెంపుడు తల్లి లోకనిందకు బాధపడడం

**19.** **కారిగైయార్ నిఱైకాప్పవర్ యారెన్ఱు, కార్ కొణ్డిన్నే**
**మారికై యేటి అఱైయిడుమ్ కాలత్తుమ్-, వాళ్ళియరో**
**శారిగై పుళ్ళర్ అన్దణ్ణన్దుళా యిఱై కూయరుళార్**
**శేరి కై యేఱుమ్, పళ్ళియాయ్ విళైన్దదెన్ శిన్మొళ్ళిక్కే**

కారికైయార్ నిఱై కాప్పవర్ యార్ ఎన్ఱు = స్త్రీలలో నాముందు అణకువను పోగొట్టు కోకుండా కాపాడుకోగల్గినవారెవరు? అని భావించి, మారి = మేఘాలు, కార్ కొణ్డు = నల్లని రంగును గ్రహించి, ఇన్నే = ఈవిధంగా, కై ఏఱి = (చక్కగా) ఆకాశంలోకి అధిరోహించి నిలచి, అఱైయిడుమ్ కాలత్తుమ్ = విజయధ్వానాన్ని

చేసే సమయంలోను, శారిక్కై పుళ్ళర్ = వేగమైన నడకను కల గరుడపక్షిని వాహనంగా కల్గినవాడైన ఈ నాయకుడు, అమ్ తణ్ణమ్ తుழாయ్ = అందమైన చల్లని (తన) తులసిని, కూయ్ ఇణై అరుళార్ = ఈమెను పిలచి, ఈమెకు కొంచెం కూడా ఇచ్చినవాడు కాడు, అందువల్ల, ఎన్ శిల్ మొழிక్కు= మధురమైన మాటలను కల నా కూతురైన ఈమెకు, శేరిక్కై ఏఱుమ్ పழி ఆయ్ విళైన్దదు = (అతనిపట్ల కల్గిన ప్రేమ అయితే) ఈ ఊరు అంతా వ్యాపించే నిందయై పర్యవసించింది, వాழிయరో = ఈమెకు కల్గిన ఈ దుఃఖం తీరి, ఉజ్జీవించాలి.

**భావదీపిక :** పెంపుడు తల్లి (**శెవిలిత్తాయ్**) లోకనిందకు బాధపడి పలికే పాశురం ఇది. ఈ సమయంలో తిరిగి వస్తానని సమయనిర్దేశాన్ని చెప్పిపోయిన నాయకుడు తన మాట తప్పినందులకు సహించలేని నాయకికి కలిగే అపనిందనుగూర్చి ఆమె పెంపుడు తల్లి బాధపడుతున్నది.

అழகియమణవాళచ్చీయర్ ఉరైలో **"పాజ్గి పழிక్కు ఇరజ్గిన పాశురమ్"** (సఖి లోకనిందకు బాధపడి పల్కిన వచనం) అని అంటూ ఇది సఖీవచనంగా చెప్పబడినప్పటికీ, నమ్బిళ్ళై, పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యలలో మాతృవచనంగా గ్రహింపబడినందున, **"ఎన్ శిల్మొழிక్కు"** అని అంటూ తన సొత్తుగా (సంతానంగా) స్ఫురించేటట్లు పల్కిన ఔచిత్యంవల్ల, ఈపాశురాన్ని మాతృ వచనంగా గ్రహించడమే ఉచితం. సామాన్యంగా తల్లి వచనాన్ని **"ఎన్ మకళ్"** అనే పదవైఖరితో ఆవిర్భవించడం, సఖీవచనం ఆ రీతిలో ఆవిర్భవించకపోవడం కానవస్తుంది. ఈ ఇద్దఱి వచనాల మధ్య సులభంగా తేడాన్ని తెలియదగిన సూక్ష్మాంశాలలో ఇది ఒకటి.

మేఘాలు గర్జించడం గమనిస్తే, "మాముందు స్త్రీలు ఎవరైనా సరే, తమ అణకువను కాచుకొనగల్గినవారు ఎవరైనా ఉన్నారా? ఎవరూ లేరు'' అనే వీర వచనాలను అవి పల్కినట్లున్నది- అని మొదటి పాదంలో అంటున్నది. వర్షాకాలంలో సిగ్గు, భయం, ఒద్దిక మొదలైన స్త్రీలకు తగిన గుణాలను ఎవరూ రక్షించుకోలేక, పతిసంయోగంకోసం తహతహలాడడం స్త్రీలకు స్వాభావికం కనుక, ఈ విధంగా ఉద్ఘోషిస్తున్నట్లుగా మేఘగర్జనను అనడం తగును- అని భావం. **"నిఱై"** అంటే- మనస్సులో దాచుకొనవలసినవానిని నోటితో వ్యక్తం చేయకుండా దాచుకోవడం. **"నాణమ్"** మొదలైన స్త్రీత్వగుణపూర్ణత- అని కూడా అర్థం. **"యార్?"** అనే ప్రశ్న-

ఎవరూ లేరు- అనే వ్యతిరేకార్థక నిశ్చయాన్ని సూచిస్తుంది. 'కార్ కొణ్డు" అనే పదానికి "కోపాన్ని పొంది'' అనే అర్థాన్ని గ్రహించవచ్చు. **"కఱుప్పుమ్ శివప్పుమ్ వెకుళిప్పొరుళ్"** (ఎఱుపు నలుపు కోపానికి సూచకాలు)అనేది తొల్కాప్పియవచనం. **"కార్"**- ఇది **"కరుమై"** అనే స్వభావవాచకం యొక్క వికృతి.

**"కార్ మారి కొణ్డు కైయేఱి"** అని అన్వయాన్ని మార్చి, 'మేఘాలు వర్షంతో అలంకారంగా చేసికొని పైకివచ్చి'' అని కూడా అర్థం. **"కేయేఱి"**- వరుసగా నిలువడం- అని అర్థం. **"అఱై యిడుదల్"**- విజయ గర్జన చేయడం. పోరాడడానికి బలాత్కారంగా పిలువడం- అనికూడా అర్థం. మేఘాల గర్జన ఇక్కడ విజయ ధ్వానంగా చెప్పబడింది.

వాయువు వేగానికి తగిన రీతిలో మిక్కిలి వేగంగా వచ్చే మేఘాల రాకకు తగినట్లుగా నాయకుడు నడచి రాగలడా? అని అంటే, అతడు మిక్కిలి వేగమైన నడకను కల గరుడుని వాహనంగా కలవాడు కనుక, అతనికి మాత్ర ఎంతదూరంలో నుండి రావాలని ఉన్నా, అతనికి రాలేకపోవడం అనేది లేదు- అనే అర్థం స్ఫురించేటట్లు **"శారికై ప్పుళ్ళర్"** అని ప్రయోగింపబడింది. **"శారికై"**- వేగమైన నడక, వలయంగా పోయే నడక- అని అర్థం. **"తుழాయ్ అరుళార్"**- ఈమె ఆనందించేటట్లు సంశ్లేషాన్ని అనుగ్రహించకపోయినా, ఈమె ఊరటను పొంది ఉజ్జీవించేటట్లు తన సంబంధాన్ని కల్గిన తులసిని అయినా ఇవ్వలేదే!- అని భావం. ఉజ్జీవింపజేసే, ప్రాణాన్ని నిలిపే మూలికవలె (సంజీవనివలె) పోయిన ప్రాణాన్ని సైతం తిరిగి రప్పించగల్గినది, తులసి- అనేది స్ఫురించేటట్లు దానిని **"తణ్ణమ్ తుழాయ్"** అని విశేషించి పలికారు. **"కూయరుళార్"**- తులసిని ఇవ్వకపోయినా, ప్రేమతో పిలువడం కూడా అరుదైపోయిందే- అని దీనిభావం.

**(ఎన్శిన్ మొழிక్కు చ్చేరి కైయేఱుమ్ పழிయాయ్ విళైన్దదు)**- భగవానుడు తులసిని అనుగ్రహించకపోతే, ఈమెకు కలిగే అపనింద ఏమి? అని అంటే - ఈస్థితిలో కూడా నాయకుడు రాలేదు - అని, ఈమెను అతడు చాలా చక్కగా ప్రేమిస్తున్నాడు- అని, అతనిపట్ల అభినివేశాన్ని పొందిన ఆమెకు ఈమాత్రం కావలసినదే- అని, చాలా చిన్నతనంలోనే ఈమె ఈవిధంగా అయినదే- అని, ఈవిధంగా కూడా ఒక తహతహ ఉంటుందా? - అని ఈరీతిలో పలువిధాలుగా తమకు తోచిన రీతిలో లోకులు నిందను పల్కుతారు.

**"శిన్‌మొ*ఝి*"**- కొన్ని ముద్దు మాటలను నేర్చినది. నాల్గు వార్తలను పల్కుడంకూడా చేతకానిదై, ముద్దుముద్దు మాటలను పలికే లేతవయస్సులో ఉన్నది- అని భావం. ఏపనిని చేయలేక, ఏవో కొన్ని మాటలను మాత్రం పలుక గల్గినదని కూడా ఈపదం వివరింపబడింది.

స్వాపదేశంలో - భగవదనుభవానికి తగిన కాలాన్ని గమనించి అభినివేశాన్ని పొందిన ఆ*ఝ్వా*ర్లకు భగవానుడు వేగంగా తన అనుభవాన్ని కల్గించకుండా ఆలస్యం చేసినందున ఆ*ఝ్వా*ర్లు పడే బాధను చూచి జ్ఞానులు పలికే పాశురమే ఇది.

**(కార్కైయార్ నిఱై కాప్పవర్ యారెన్టు)** - స్త్రీవలె పరతంత్రులైన వీరు ఆశ్వాసాన్ని పొంది సహించి ఉండే స్థితికి భంగం కల్గకుండా రక్షించుకొనే వారెవరైనా ఉన్నారా?

**(కార్ కొణ్డు ఇన్నే మారి కైయేఱి అఱైయిడుమ్ కాలత్తుమ్)**- భగవానుని స్వరూపాన్ని, గుణసౌందర్యాన్ని స్మరింపజేస్తూ కాలం సమీపించి, త్వరను కల్గిస్తున్నది.

**(శారికై ప్పుళ్ళర్ అన్దణ్ తు*ఝా*య్ ఇఱైకూయరుళార్)**- అందమైన గొప్ప వాహనాన్ని కల, (లేక), భంగం లేని ప్రమాణాన్ని కల భగవానుడు గజేంద్రునకు అనుగ్రహించినట్లుగా, త్వరగా వచ్చి తన గంభీరమైన కంఠధ్వనితో వీరిని పిలచి, అనుగ్రహాన్ని వీరికి కొంచెం కూడా చేయడం లేదు.

**(ఎన్‌శిన్ మొ*ఝి*క్కు)**- సంగ్రహంగా పల్కినా అర్థాన్ని స్ఫుటం చేయగల వాక్ సౌందర్యాన్ని కలవారై, మా మనోరథానికి తగిన లక్ష్యభూతులైన వీరికి (ఆ*ఝ్వా*ర్లకు),

**(శేరి కై యేఱుమ్ ప*ఝి*యాయ్ విళైన్దదు)** - తమ ప్రేమ (భక్తి)లోకంలో ఉండే సాత్త్వికజనులంతా ద్రవించి, చేతులెత్తి నమస్కరించి అర్థించడం నిందగా పరిణమించిందని భావం. భగవానుడు రక్షకుడై ఉండగా, ఎన్ని క్లేశాలు కల్గినా సహించి ఉండకుండా, తానే తన కార్యాన్ని నిర్వహించి పూర్తి చేసికోవాలని త్వరపడడం దోషంగా పర్యవసిస్తుంది- అనే అర్థం ఇక్కడ స్ఫురిస్తుంది. ఈ సందర్భంలో నమ్బిళ్ళైసూక్తి- **"ఇప్పోదు ఇవర్ ప*ఝి* ఎన్గిఱదు- భగవత్ప్రావణ్యత్తైయిఱే. అత్తై ప్ప*ఝి* ఎన్బానెన్? ఎన్నిల్, అత్తలైయాలే వరక్కణ్డిరుక్కుమత్తనై యొ*ఝి*య, ఇత్తలైయాలే పెఱ ప్రవర్తిక్కుమదు ప*ఝి*యాయిరుక్కుమిఱే. ఆన**

పిన్బు ప్పఝి యెన్న త్తట్టిల్లైయిఱే” (ఇపుడు ఆఝ్వార్లు నింద అనేది - భగవానుని విషయంలోని ప్రావణ్యాన్ని కదా! దానిని నింద అని అంటున్నారేమి? అంటే, భగవానునివల్ల ప్రాప్యం సిద్ధించాలని చూస్తారు తప్ప, తమ ప్రయత్నంవల్ల దానిని పొందాలని ప్రయత్నించడం నిందగా అవుతుంది కదా! అందువల్ల నింద -అని భగవత్ప్రావణ్యంవల్ల ఏర్పడే స్వప్రవృత్తిని అనడంలో అడ్డు లేదు) అనేది.

## తగని ఉపాయాలతో నాయకి ఆర్తిని తీర్చగోరిన నాయకి తల్లి ప్రయత్నాన్ని సఖి నిషేధించడం (వెఱివిలక్కు)

**20. శిన్మొఝినోయో కఝి పెరున్దెయ్వమ్, ఇన్నోయినదెన్ఱు**
**ఇన్ మొఝి కేట్కు మిళన్దెయ్వ మన్ఱిదు-, వేల! నిల్నీ**
**ఎన్ మొఝి కేణ్మిన్ ఎన్నమ్మనైమీర్! ఉలగేఝుముణ్డాన్**
**శొల్మొఝి, మాలై యన్దణ్ణన్దుఝాయ్ కొణ్డు శూట్టుమినే**

శిల్ మొఝి నోయో = కొన్ని మాటలను మాత్రం పలుకగల్గిన ఈమె వ్యాధి అయితే, కఝి పెరుమ్ దెయ్వమ్ = చాలా పెద్దదైవమైన భగవానుని విషయంగా కల్గినది, ఇ నోయ్ ఇనదు ఎన్ఱు ఇల్ మొఝి కేట్కుమ్ ఇళ దెయ్వమ్ అన్ఱు ఇదు= ఈ వ్యాధి ఇటువంటిది- అని ఇదమిత్థంగా నిశ్చయం లేని మాటలతో చెబితే వినదగినట్టి క్షుద్రదైవంవల్ల కల్గినది కాదు, వేల = ఓ మంత్రగాడా!, నీ నిల్ = నీవు తొలగిపో, ఎన్ = అమ్మనైమీర్ = నా తల్లులారా!, ఎన్ మొఝి కేణ్మిన్ = (ఈమె స్వభావాన్ని యథార్థంగా తెలిసిన) నా మాటను వినండి, ఏఝు ఉలకమ్= అన్ని లోకాలను, ఉణ్డాన్ = ప్రళయం గ్రహించకుండా తన ఉదరంలో పెట్టుకొని రక్షించిన స్వామియొక్క, శొల్ మొఝి కొణ్డు = తిరునామాన్ని కీర్తించి, మాలై అమ్ తణ్ణమ్ తుఝాయ్ =అతని మాలికయైన అందమైన, చల్లని తులసిని, కొణ్డు శూట్టుమిన్ = తీసికొనివచ్చి ఈమెకు ముడువండి.

**భావదీపిక :** ఈ పాశురంలోని శృంగార ప్రక్రియ “వెఱివిలక్కు” అనే పేరును కల్గినది. రహస్యంగా నాయకిని సంశ్లేషించిన నాయకుడు, తరువాత ఆమెను అందఱికి తెలిసేటట్లు వివాహం చేసికోవడంకోసం ధనాన్ని సంపాదించగోరి ఆమెను విడచి వెళ్ళాడు. అతడు నిర్దేశించిన సంకేతకాలానికి రాకుండా ఆలస్యం చేశాడు.

ఆ స్థితిలో, విరహతాపాన్ని సహించలేక మిక్కిలి ఆర్తిని పొందిన నాయకిని ఆమె (శెవిత్తాయ్) పెంపుడుతల్లి కలసి ఆమె రూపంలోని వైలక్షణ్యాన్ని గమనించి చూచి, "ఈమె ఈ రీతిలో కృశించిపోవడానికి కారణమేమి?'' అని బాధపడి, కట్టువిచ్చి (సోదికత్తె)ను పిలిపించి సోదెను చెప్పించింది. ఆ కట్టువిచ్చికూడా సాంప్రదాయికంగా విచారించి చూచి, ఈమెకు "మురుగన్" అనే దైవం ఆవేశించింది తప్ప వేఱు కారణం ఏమీ లేదు- అని అన్నది. దానిని ఆలకించిన పెంపుడు తల్లి వెంటనే మంత్రవేత్తను (వేలన్) పిలిపించి, వాని ద్వారా దైవావేశంతో (పూనకంతో కూడిన ఆటను) ఆడించడానికి ప్రయత్నించగా, దానిని చూచి నాయకి చాలా బాధ పడుతూ ఉన్నది. ఆ సమయంలో, ఆమెకు కల్గిన క్లేశానికి గల యథార్థమైన కారణాన్ని తెలిసిన సఖి "వేలన్" (మంత్రవేత్త)ను, పెంపుడు తల్లిని చూచి కొన్ని మాటలను పల్కి, వేలన్ ఆడే దైవావేశంతో కూడిన (పూనకంతో కూడిన) ఆటను నిషేధించడం ఇందులోని ప్రమేయం.

తిరువాయ్‌మొ*ழி* ప్రబంధంలో కూడా **"తీర్‌ప్పారై యామిని"** అని ఆరంభ మయే "వెఱివిలక్కు" దశకంలో **"తిశైక్కిన్ఱదే యివళ్ నోయ్ ఇదు మిక్క పెరున్దెయ్‌వమ్, ఇశైప్పిన్ఱి నీర్ అణఙ్గాడుమ్ ఇళమ్ దెయ్‌వ మన్ఱిదు, తిశైప్పిన్ఱియే శఙ్గశక్కర మెన్ఱివళ్ కేట్క నీర్, ఇశైక్కి*ఱ్ఱి*రాకిల్ నన్ఱే యిల్బెఱుమిదు కాణ్‌మినే"** (ఈమెకు కల్గిన వ్యాధినిగూర్చి మీరు భ్రమిస్తున్నారు. ఇది గొప్పదైవం కారణంఘా కల్గినది. ఏవిధమైన సంబంధం లేకుండా మీరు దయ్యపు ఆటను ఆడించే క్షుద్రదేవతవల్ల కల్గినది కాదు. ఎవరో చెప్పిన మాటలకు భ్రమపడకుండా, ఈమె వినేటట్లుగా స్వామియొక్క శంఖచక్రనామాలను ఉచ్చరిస్తే ఈమె జీవిస్తుంది. ఈ విషయాన్ని గమనించండి.), **"ఇదుకాణ్‌మిన్ అన్నైమీర్ ఇక్కట్టువిచ్చి శొల్కొణ్డు నీర్ ఎదువానుమ్ శెయ్‌దు అఙ్గోర్ కళ్ళుమ్ ఇఱైచ్చియుమ్ తూవేల్‌మిన్, మదువార్ తు*ழா*య్ ముడి మాయప్పిరాన్ క*ழ*ల్ వా*ழ்*త్తినాల్, అదువే ఇవళు*ఱ్ఱ* నోయ్‌క్కుమ్ అరుమరున్దాకుమే"** (ఓ అమ్మలారా! నా మాటను వినండి. మీరు ఈ సోదెకత్తె మాటలను విని ఏదో ఒక తగని పనిని చేయకండి. కల్లును, మాంసాన్ని నివేదన చేయకండి. మకరందం ఒలికే తులసిని శిరస్సులో కలవాడైన, మాయాచేష్టితుని శ్రీపాదాలను కీర్తిస్తే అదే ఈమె వ్యాధికి తగిన గొప్ప మందు కాగలదు.) అనే పాశురాలు ఇక్కడ అనుసంధేయాలు.

"ఈ గుణపూర్ణకు (నప్పైకు) ఇపుడు కల్గిన వ్యాధి వీరు భావించేటట్లుగా క్షుద్రదైవం కారణంగా కల్గినది కాదు. పరస్మాత్ పరుడైన భగవానునిపట్ల గల అభినివేశం కారణంగా కల్గిన వ్యాధి ఇది" అని చెలికత్తె గ్రహించి చెప్పినప్పటికీ మంత్రగాడు నోటికి వచ్చినట్లుగా ప్రలపిస్తూ ఆడడం మానలేదు. అపుడు సఖి అతనిని **("నీ నిల్")** "ఇక చాలు ఆపు" అని క్షేపోక్తిద్వారా నిలువరించి, పెంపుడు తల్లిని చూచి, "మీరు ఈ విధంగా మనస్సులో కలత పొందడం తగదు. మీకంటే నేను చాలా చిన్నదాననే అయినా, ఇపుడు నేను పలికే మాటను కొంచెం విని ఆదరించండి. ఈ విపరీత ప్రయత్నాలను విడచిపెట్టి, లోకాలను గ్రసించిన గొప్ప నోటిని కల స్వామియొక్క తిరునామాలను ఈమె చెవులకు వినిపించేటట్లుగా పలకండి. అతని తులసీ ప్రసాదాన్ని తీసికొని వచ్చి ఇవ్వండి. ఇదే ఈమె వ్యాధికి పరిహారంగా చేయదగినది" - అని అన్నది.

**(శిన్మొழி)**- పూర్తిగా మాటలను పలుకడం కూడా చేయలేని లేత వయస్సును కల్గినది. మితభాషిణి. తేనెవంటి తీయని పలుకులను పలికేది. చల్లని పలుకులను పలికేది- అని కూడా అర్థం. **"నోయో"**- ఇక్కడ **"ఓ"** అనేది బాధను సూచిస్తుంది. వ్యాధియొక్క తీవ్రతను చూచి బాధ పడడం తెల్పుతుంది. పరదేవత అయిన భగవానునకు, క్షుద్రదేవతకు మధ్యగల పర్వత- పరమాణురూపమైన భేదం స్ఫురించేటట్లు **"కழி పెరున్దెయ్వమ్"** అని, **"ఇళమ్ దెయ్వమ్"** అని అన్నది. **"నోయ్ కழிపెరున్దెయ్వమ్"**- అనేదానికి - ఈవ్యాధి పరదేవత కారణంగా కల్గినది- అని భావం. **"ఇళమ్ దెయ్వమన్టిదు"**- అనేది కూడా క్షుద్ర దేవతాంతరం వల్ల కల్గినది కాదు, ఈ వ్యాధి- అని తెల్పుతున్నది.

**(ఇన్మొழிకేట్కు మిళమ్ దెయ్వమ్)**- అర్థం లేని స్తోత్రవాక్యాలను విని ఆనందించే క్షుద్రదేవత, తనకు లేని గొప్పతనం ఉన్నట్లుగా పల్కి కవిత్వాన్ని పల్కి వర్ణించే మాటలను విని ప్రశంసించే అల్పదైవం- అని భావం. ఇక్కడ పెరియవాచ్చాన్పిళ్ళై శ్రీసూక్తిని గమనించండి. **"అర్థరహితమాన మొழி కేట్కుమ్ ఇళమ్ దెయ్వమ్ అన్టు ఇదు; తనక్కు ఇల్లాదదై ఉణ్డాక చ్చొల్లప్పుక్కాల్ కేట్టుకొణ్డాడుమ్ దెయ్వమన్టు ఇదు; కైక్కూలికొడుత్తు క్కవిపాడువిత్తు క్కొళ్ళుమ్ దెయ్వజ్గళన్టు"** (అర్థం లేని స్తుతులను వినే అల్పదైవం కాదు, ఇది. తనకు లేని దానిని ఉన్నట్లు పల్కితే విని సంతోషంతో ఆడే దైవం కాదు, ఇది. కూలిని ఇచ్చి, పాడించుకొనే దైవాలు కావు.) అనేది ఆ సూక్తి.

"వేలన్" - అనే పదం పూనకంతో ఆడేవానిని ("వెఱియాడుమవన్") తెల్పుతుంది. అతడు, షణ్ముఖుని ఆయుధమైన శూలాన్ని తనకు చిహ్నంగా పట్టుకొని నిలచి ఆడడం వల్ల "వేలన్" (వేల్‌ను కలవాడు) అని వ్యవహరింప బడతాడు. "వేల్ మకన్" అని కూడా వ్యవహరింపబడతాడు. "ఈ తిరుమాళిగను దేవతాంతరపరులు ప్రవేశించే తిరుమాళిగ కాదు సుమా ! వెంటనే పరుగెత్తి పో"- అని వేలన్‌ను తరిమిన రీతి ఇది. "**కూరాళి** వెణ్ శజ్గేన్ది" అనే రీతిలో తన బాహువులలో శంఖచక్రాలతో దర్శనమివ్వవలసిన ఈ తిరుమాళిగలో నీవు నీ చేతిలో వేల్ ఆయుధాన్ని ధరించి నిలుచున్నావే? పాపీ! తొలగిపో" అని అంటున్నది.

(**ఉలకేళుముణ్డాన్**)- అనేది లోకసంరక్షణంలో భగవానునకు కల ఆదరాన్ని, అద్భుతశక్తిని సూచిస్తుంది. ఈమె (నాయకి) వ్యాధిని తీర్చడానికి లోకానికి అంతటికి కల్గిన వ్యాధిని పరిహరించిన స్వామియొక్క తిరునామమే తగినదని భావం. "**ఒరుజ్గాగవే ఉలకేళుమ్ విళుజ్గి ఉమిళ్న్దిట్ట** పెరున్దేవన్ పేర్ శొల్లకిత్కిల్ ఇవళై ప్పెఱుదిటే" (ఒకానొక సమయంలో లోకాలను ఆరగించి బయటపెట్టిన గొప్పదైవం పేరును పల్కితే ఈమెను మీరు బతికించుకోగలరు.) అని తిరువాయ్‌మొళిలో కూడా ఆళ్వార్లు అంటారు. ఆ వ్యాధిని తీర్చడానికి భగవానుని తిరునామం తగిన మంత్రం. అతని ప్రసాదమైన తులసి మూలికౌషధం. "**శూట్టుమిన్**"- అని అన్నందున ఆ సంజీవనీమూలికయే లోపలకు గ్రహించదగినది అనేకాక, "**తలై మేల్కొణ్డు**" అనే ప్రయోగంద్వారా శిరసా మిక్కిలి గౌరవింపదగినది- అనికూడా తోస్తుంది. వ్యాధిగ్రస్తులకు లోపలకు గ్రహించడానికొక మందును, పైన శరీరంపై పూసికోవడానికొక మందును ఉపయోగించేటట్లే భగవానుని తిరునామాలను ఆమె చెవులద్వారా లోపలకు ప్రవేశించేటట్లే ఉచ్చరించి, పైన అతడు అలంకరించుకొన్న తులసీ మాలను తీసికొని వచ్చి చుట్టండి- అని పరిహారం తెల్పినట్లయింది.

"**వేల! నిల్ నీ, ఉలకేళుముణ్డాన్‌శొల్ మొళి, ఎన్ అమ్మనైమీర్! ఎన్ మొళి కేళ్‌మిన్, మాలై యన్దణ్ణన్దుళాయ్ కొణ్డు శూట్టుమిన్**" అని అన్వయించి అర్థాన్ని గ్రహించడంకూడా తగినదే. ఈ అన్వయంలో "**మొళి**" అనేది విధ్యర్థకమైన ఏకవచన సమాపకక్రియ. "**ఏవల్ ఒరుమై వినైముఱ్ఱు**" (ఏవల్ - విధి, ఆజ్ఞ). ఏడు లోకాలను గ్రసించిన నోటిని కలవాని నామాలను పల్కు - అని అర్థం. నీ పూనకంతో కూడిన ఆటలను నిలిపి, భగవన్నామసంకీర్తనాన్ని చేయి- అని మంత్ర గానిని సఖి ఆజ్ఞాపించింది.

"కళ్ళి పెరు"- ఒకే అర్థాన్ని ఇచ్చే రెండు పదాలు ఇవి. చాలా గొప్ప- అని అర్థం. "కళ్ళి" - ఇది ఆధిక్యాన్ని తెలిపే "ఉరిచ్చొల్" (విశేష్యసాపేక్షమైన విశేషణపదం) "ఇనదు" - ఇది "ఇన్నదు"- అనే పదంయొక్క వికృతి. "ఇన్మొళ్ళి"- ఇది విశేషణ కర్మధారయ సమాసం. ("పణ్బుత్తొకై") "ఉలకు ఏళ్ళ్" - క్రింది ఏడు లోకాలు, పైన ఏడు లోకాలు - అని అర్థం.

భగవానుని సంశ్లేషాన్ని పొందలేక బాధపడే ఆళ్ళ్వార్ల క్లేశాన్ని తీర్చడంకోసం జ్ఞానులు కొందఱు, వారిపట్ల గల ఆదరాతిశయంవల్ల తమకు కల్గిన కలత చేత, భగవానుడు ఉపాయాంతరాలతో పొందదగినవాడు కాడు- అనే విషయాన్ని మఱచి, దేవతాంతరపూజనం వల్ల అయినా వీరి విరహక్లేశాన్ని ఉపశమింప జేయగలమేమో!- అని చూచి, ఆ ప్రయత్నాన్ని చేయబోగా, వారిని ఉద్దేశించి, ఆళ్ళ్వార్ల స్వభావాన్ని తెలిసిన వారి భక్తులు ఆ ప్రయత్నాన్ని నిషేధిస్తూ పలికే సూక్తి దీనికి ధ్వన్యర్థం. (స్వాపదేశార్థం)

(శిన్మొళ్ళి) - ఆళ్ళ్వార్లు, ఇతరుల హితంకోసం పల్కడమే తప్ప, స్వకార్యార్థంగా పల్కడమనేదానిని తెలియనివారని భావం.

(నోయ్)- భగవానుని అనుభవించాలనే (దర్శించి ఆనందించాలనే) ఆశ అనే భక్త్యతిశయంవల్ల కల్గిన ఆర్తిని ఇది తెల్పుతుంది.

## వృషభాలను మర్దించి దాని శుల్కంగా నాయకిని వివాహమాడమని నాయకునితో సఖి పల్కడం

21. శూట్టు నన్మాలైగళ్ తూయన వేన్ది, విణ్ణోర్గళ్ నన్నీర్
ఆట్టి అన్దూపమ్ తరా నిఱ్కవే యఙ్గు-, ఓర్ మాయైయినాల్
ఈట్టియ వెణ్ణెయ్ తొడువుణ్ణ పోన్దిమేలేర్ఱువన్కూన్
కోట్టిడై యాడినై కూత్తు, అడలాయర్తమ్ కొమ్బినుక్కే

అఙ్గు = పరమపదమనే ఆ విభూతిలో, విణ్ణోర్కళ్ = నిత్యసూరులు, నల్ నీర్ ఆట్టి = చక్కగా తిరుమంజనాన్ని సమర్పించి, తూయన శూట్టు నల్ మాలైకళ్ ఏన్ది = పరిశుద్ధమైన, నీకు అలంకరించదగిన, అందమైన పూమాలికలను చేతులతో ధరించి నిలచి, అమ్ దూపమ్ తరా నిఱ్క = అందమైన ధూపాన్ని సమర్పిస్తూ ఉండగా, (ఆ ధూపంవల్ల స్వామి తిరుముఖమండలం మఱుగుపడిన సమయంలో),

ఓర్ మాయైయినాల్ = నీ (సాటి లేని) మాయాప్రకారంతో, ఈట్టియ వెణ్ణెయ్ = ఈ విభూతిలోని రేపల్లెలో ఉండేవారు ప్రతిదినం పెరుగును చిలికి చేర్చి పెట్టిన వెన్నను, తొడు ఉణ్ణ పోన్దు= చేతులతో ఎత్తి గ్రహించి ఆరగించాలని ఆశపడి వచ్చి, అడల్ ఆయర్ తమ్ కొమ్బినుక్కు = బలిమిని కల గోపాలురకులంలో పుట్టిన పూతీగవంటి కాంత అయిన నప్పిన్నైను వివాహమాడడంకోసం, ఇమిల్ = మూపురాలను కల, ఏఱు = ఏడెద్దుల, వల్ కూన్ కోట్టిడై = బలిష్ఠమై, వంగిన కొమ్ముల మధ్యలో, కూత్తు ఆడినై = నాట్యం చేశావు.

**భావదీపిక :** ఈ తిరువిరుత్తప్రబంధంలోని మొదటి పాశురం, చివరి పాశురం తప్ప మిగిలిన తొంభై ఎనిమిది పాశురాలు **"అకప్పొరుళ్‌తుఱై"** (శృంగార రసాత్మక ప్రక్రియలు) గానే రచింపబడినవి- అని గ్రహించాలని కొందఱి అభిప్రాయం. ఆళ్వార్లు, తాము ఆళ్వార్లమనే భావనతో పల్కినవిగా నిర్వహింపదగిన పాశురాలను **"కిళవిత్తుఱై"** ప్రణయరసాత్మక ప్రక్రియలుగా గ్రహించవలసిన ఆవశ్యకత లేదు- అని పూర్వాచార్యుల అభిప్రాయం. ఈ పాశురం ఆళ్వార్లు తాము ఆళ్వార్లు అనే భావనతో శ్రీకృష్ణావతారలీలలలో అభినివిష్టులై పల్కినట్లుగా ఉండడంచేత, ఇక్కడి ఆలంకారిక ప్రక్రియనుగూర్చి ఏమీ ప్రస్తావించకుండా నమ్బిళ్ళై మొదలైన ఆచార్యులు వ్యాఖ్యానించారు. ఆ మార్గాన్ని అనుసరిస్తూ ఈ పాశురం వ్యాఖ్యానింపబడుతున్నది.

మొదటి రెండు పాదాలలో భగవానుని పరత్వాన్ని, తరువాత రెండు పాదాలలో సౌలభ్యాన్ని కీర్తిస్తూ పల్కుతున్నారు. పరమపదంలోని నిత్యసూరులు భగవంతునకు తిరువారాధనాన్ని సమర్పించాలని తలచే సన్నివేశంలో స్నానాసనాన్ని, అలంకారాసనాన్ని సమర్పించి (అంటే- తిరుమంజనాన్ని చేసి, పూమాలికలను అలంకరించి), ధూపాన్ని సమర్పించే సమయంలో, దట్టమైన ఆ పొగవల్ల స్వామి తిరుముఖ మండలం కన్పించకుండా ఉంటుంది కదా! ఆ సమయంలో వెన్నను ఆరగించాలని తలచి, రేపల్లెకు వేంచేసి, నప్పిన్నై ప్పిరాట్టికోసం ఏడెద్దులను అణచి, ఆమెను వివాహమాడిన ఓస్వామీ! నీ శక్తిని విశేషాన్ని ఏమని పొగడగలం! అని అంటూ చాలా అభినివేశంతో ఆళ్వార్లు పల్కుతున్నారు.

పొగనీడ చాటున రహస్యంగా వచ్చేవారివలె అక్కడనుండి ఇక్కడకు రావడం స్ఫురించేటట్లు **"అన్దూపమ్ తరా నిఱ్కవే అఙ్గు ఓర్ మాయైయినాల్... పోన్దు"**

అని అనబడింది. **"కోట్టిడై క్కూత్తాడినై"** -ఆ వృషభాల పొగరును అణచడం కోసం చాలా ధైర్యంగా వాటి కొమ్ముల మధ్యలో ప్రవేశించి వేగంగా వీరకృత్యాన్ని చేసిన రీతి తెలుపబడింది. కుంభుడనే గొల్లనాయకుని కుమార్తెగా నీళాదేవియొక్క అంశభూతురాలుగా అవతరించినది, **"నీళా"** - అనే పేరుతో వ్యవహరింపబడేది అయిన నప్పిన్నై ప్పిరాట్టిని వివాహం చేసికోవడంకోసం ఆమె తండ్రి కన్యాశుల్కంగా నిర్దేశించిన ప్రకారం ఎవరికీ అణగని, అసురావేశం కల ఏడు ఎద్దులను శ్రీకృష్ణుడు ఏడు రూపాలను ధరించి వెళ్ళి బలంగా అణచి, ఆ నప్పిన్నైను వివాహమాడిన వృత్తాంతం పురాణప్రసిద్ధం.

భగవంతుని తిరువారాధనంలో అంగమైన స్నానాసనం, అలంకారాసనం, నిత్యవిభూతిలో జరిగాయని, భోజ్యాసనం, శయనాసనం లీలావిభూతిలో జరిగాయని ఇక్కడ చెప్పబడినందున ఈవిభూతులు రెండు అతనికి ఏవిధమైన రీతిలోను, తేడా లేకుండా ఒకే విధమైన సొత్తు- అనేది స్ఫుటపడుతుంది. ఇక్కడ ధర్మైక్యం చెప్పబడినదని (పరరూప-విభవరూపాల ధర్మైక్యం చెప్పబడినదని) గ్రహించాలి.

**(ఓర్ మాయైయినాల్)-** ఈ ప్రయోగం భగవానుని సంకల్పాన్ని తెల్పుతున్నది. **"మాయా"** అనే సంస్కృతపదానికి ఉండే పలు అర్థాలలో జ్ఞానమనేది ఒక అర్థం. ఈ పదం సంకల్పరూపజ్ఞానాన్ని ఇక్కడ తెల్పుతుంది. **'సంభవామ్యాత్మ మాయయా"** (భగవద్గీత) అనేచోట కూడా ఈ అర్థాన్ని గమనించవచ్చు; లేక, **"మాయైయినాల్"**-మాయారీతిలో - అని కూడా అర్థం. **"ఈట్టియ వెణ్ణెయ్"**- రేపల్లెలో ప్రతి ఇంటిలో చిలికి తీసి పెట్టిన వెన్నను- అని అర్థం. **"తొడు ఉణ్ణ"** - దొంగతనంగా ఆరగించిన - అని అర్థం. **"మాయై తొడు పట్టిమై వఞ్జనై యాకుమ్"** (పింగళనిఘంటువు) అనే వచనాన్ని గమనించాలి. (దీనివల్ల **"తొడు"** అనే పదానికి దొంగతనమని అర్థం.) **"అడలాయర్"**- బలశాలురైన గొల్లలు- అని అర్థం. **"కొమ్బు"- "ఉవమై యాకు పెయర్"** ఇది సాదృశ్యనిబంధనాత్మకమైన లక్షకపదం. (తీగ అని అర్థమిచ్చే ఈ పదం తీగవంటి సుకుమారి అయిన స్త్రీని ఇక్కడ లక్షిస్తుంది) ప్రబ్బలితీగవలె చాల సన్నని సున్నితమైన నడుమును కల్గినది- అని అర్థమిచ్చే స్త్రీవాచకం. **"ఆడినై"**- ఆడావు- అని అర్థం. ఇది **"మున్నిలై ఇఱన్దకాల వినైముఱ్ఱు"** -మధ్యమపురుష భూతకాలిక సమాపక క్రియారూపం.

కొందఱి అభిప్రాయానుసారంగా, ఈ పాశురానికి కూడా శృంగార రసప్రక్రియను అన్వయించి చెప్పవలసివస్తే, **"ఏఱు కోళ్ కూఱి వరైవు కడాదల్"** అని చెప్పవచ్చు. అంటే- అరణ్య (వన) ప్రాంతానికి చెందిన నాయకిని రహస్యంగా (దొంగతనంగా) కలసిన నాయకుని చూచి సఖి, "ఇక నీవు ఈమె కులానికి తగిన సంప్రదాయానికి అనుగుణంగా బహిరంగంగా త్వరగా వచ్చి, వృషభాలను అణచి, ఈమెను వివాహం చేసికో" అని బలవంతపెట్టి పల్కడం. పూర్వం నప్పిన్నైను వివాహమాడడంకోసం నీవు ఎడెద్దులను అణచావు- అని పల్కడం ద్వారా, సఖి నాయకుని "ఇపుడు నీవు ఏడెద్దులను అణచి ఈమెను వివాహం చేసికో" అని సూచిస్తూ పల్కినందున, పూర్వం ప్రస్తావించిన **"ఏఱు కోళ్ కూఱి వరైవుకడాదల్"** అనే ప్రక్రియలో పల్కినట్లయినది. (**ఏఱుకోళ్ కూఱి** = ఎద్దుల బలిమి అణచేటట్లు పల్కి, **వరైవు కడాదల్** = వచ్చి వివాహం చేసికొనమని పల్కడం) అందువల్ల ఇది సఖీ వచనంగా గ్రహించాలి. లేక, నాయకి పాశురంగా కూడా చెప్పవచ్చు.

**"శూట్టు నన్ మాలైకళ్ తూయన వేన్ది"** అనే సూక్తి వివరణంలో పెరియ వాచ్చాన్‌పిళ్ళై, భక్తుడు తన పాదాలతో ఇచ్చినదానిని కూడా భగవానుడు ప్రేమతో శిరసా గ్రహిస్తాడు-అని వివరిస్తూ దానికి ఆధారంగా పిళ్ళై ఉఱఙ్గావిల్లిదాసర్ పల్కిన వార్తను ఉదాహరించారు.

శ్రీకృష్ణుడు భగవద్గీతలో **"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి, తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతార్జున!"** అని (9-26) పలికాడు. (ఎవడు, నాకు పత్రాన్ని కాని, పుష్పాన్నికాని, ఫలాన్ని కాని, జలాన్ని కాని భక్తితో ఇస్తాడో) పరిశుద్ధమైన మనస్సును కల అతనిచే భక్తిపూర్వకంగా సమర్పింపబడిన ఆవస్తువును నేను భుజిస్తాను- అని దీని భావం. "ఫలాన్ని భుజిస్తాను"- అంటే ఆ మాట పొసగుతుంది. పత్రం, పుష్పం, జలం- మొదలైనవానిని భుజిస్తాను - అంటే పొసగదు. కాని, **"పత్రం పుష్పం ఫలం తోయం... అశ్నామి"** అని భగవంతుడు పల్కినందున భగవానుడు భక్తునిచే ఇవ్వబడిన వస్తువులోని గౌరవాన్ని చూడడు; సమర్పించినవాని మనస్సులో ఉండే భక్తినే గమనిస్తాడు- అనేది అర్థమవుతున్నది. దీనినే ఈ శ్లోకంలో **"భక్త్యా ప్రయచ్ఛతి, భక్త్యుపహృతమ్"** అని రెండుమార్లు అనడం ద్వారా భగవానుడు తెలిపాడు. ఇటువంటి భక్తుడిచ్చిన వస్తువును శిరసా గ్రహిస్తాడని వేఱే చెప్పాలా?- అని పిళ్ళై ఉఱఙ్గావిల్లిదాసర్ తమ భార్య హేమాంబికతో అన్నారట.

## సఖి నాయకుని పరిహసించడం

22. కొమ్బార్ తழைక్కై శిఱునాణెఱివిలమ్, వేట్టై కొణ్డాట్టు
అమ్బార్కళిఱు వినవువదైయర్-, పుళ్ళూరుమ్ కళ్వర్
తమ్బారగత్తెన్ఱు మాడాదన తమ్మిల్ కూడాదన
వమ్బార్ వినా చ్చొల్లవో? ఎమ్మై వైత్తదివ్వాన్పునత్తే

ఐయర్ = ఈ గొప్పవాని, కై = చేతిలో ఉండే, కొమ్బు ఆర్ తழై = చెట్టు కొమ్మల గుత్తిలో పొందికగా ఉండే ఒక చిన్న కొమ్మ, శిఱు నాణ్ ఎఱివు ఇలమ్= (ఇతని చేతిలోని విల్లు లేనందున) చిన్న అల్లెతాడును (చేతివేళ్ళతో) నాటి వింటి టంకారాన్ని చేయడం మేము వినలేదు, కొణ్డాట్టు = (ఇతడు తనకు) ఇష్టంగా వ్యక్తం చేసేది, వేట్టై = వేటయే, వినవువదు = (ఇతడు మనలను ఉద్దేశించి) అడిగేది, అమ్బు ఆర్ కళిఱు = (ప్రయోగింపబడిన) బాణంతో కూడిన ఏనుగును, (ఈ విధంగా ఇతని పనులు, మాటలు) పుళ్ ఊరుమ్ కళ్వర్తమ్ = గరుడపక్షిని అధిరోహించి నడిపే మాయావి అయిన శ్రియఃపతికి చెందిన, పార్ అకత్తు = (సొత్తు అయిన) ఈ భూలోకంలో, ఎన్ఱుమ్ ఆడాదన = ఎల్లప్పుడు నడవనివి, తమ్మిల్ కూడాదన = (ఇవి) ఒకదానికి ఇంకొకదానితో పొందిక లేనివి (గాఉన్నాయి), వమ్బు ఆర్ వినా శొల్లవో = మిక్కిలి కొత్తగా ఉండే ప్రశ్నలకు సమాధానం పల్కడం కోసమేనా, ఎమ్మై = మమ్ములను, ఇ వాన్ పునత్తే వైత్తదు = ఈపెద్దదైన, పెరటిప్రదేశంలో- క్షేత్రంలో- (మన పెద్దలు) కావలిగా పెట్టినది?

**భావదీపిక** : గాంధర్వవివాహ క్రమంలో నాయకిని సంశ్లేషించి, ఆమెకు దూరమైన నాయకుడు తరువాత సఖిద్వారా మళ్ళీ ఆమెను చేరాలని తలచాడు. ఆ సఖి ఒంటరిగా ఉండడం గమనించి, తన మనోరథాన్ని వ్యక్తంగా పలికి ప్రార్థించకుండా, సూచనగానే పలకాలని భావించాడు. నాయకి, ఆమె సఖి కలసి పొలాన్ని కాపలా కాసే చోటుకు చేరి, చేతిలో చెట్టుకొమ్మను, దారాన్ని పెట్టుకొని వెళ్ళి, వారిని చూచి వేటకు వచ్చినవానివలె "నా బాణం నాటుకొన్న ఒక మదగజం ఇక్కడకు రావడం గమనించారా?'' అని అడిగాడు. అపుడు ఆ నాయకుని రీతిని వేళాకోళం చేస్తూ అతనితో సఖి పలికే పాశురం ఇది.

ఈ పెద్దమనిషి అయితే, వృక్షస్కంధాలనుండి పెఱికి వేయబడిన ఒక రెమ్మను చేతిలో ధరించి నిలచి ఉన్నాడు. ఏదో వేటకోసంగా ఈ పొలం సమీపంలో

పోతున్నట్లుగా పల్కుతున్నాడు. తానొక ఏనుగుపై బాణాన్ని ప్రయోగించినట్లు, ఆ బాణంతో ఆ ఏనుగు పరుగెత్తుకొని పోయినట్లు పల్కుతూ, "ఆ ఏనుగు ఇక్కడకు రావడం గమనించారా?'' అని అంటున్నాడు. ఇతడు నిజంగానే వేటకు పోయినట్లయితే, చేతిలో విల్లు ఉండవద్దా? వాటి అల్లె తాడును చేతి వేళ్ళతో మీటుతూ టంకారాన్ని చేయవద్దా! అదేమీ లేదే! అందువల్ల ఇతడు పలికే మాటలకు, చేతలకు ఒక దానితో ఇంకొకటి సంబంధం లేనివిగా, ఏమాత్రం పొసగనివిగా ఉన్నాయి. ఏమాత్రం పొందికలేని ఈ మాటలు, పనులు ఈ లీలావిభూతిలో లేవు. చేతిలోని చెట్టురెమ్మకు, వేటకు ఏమి సంబంధం? ఇటువంటి వ్యర్థప్రశ్నలకు సమాధానం పల్కడంకోసమేనా మమ్ములను మా పెద్దలు ఇక్కడ పొలం కాపలాకోసం పెట్టారు!- అని పరిహాసం స్ఫురించేటట్లుగా సఖి పల్కుతున్నది.

ఈమె పర్వతప్రాంతానికి చెందిన నాయకి (గిరిజననాయకి) అయినందున, చెట్టురెమ్మను, దారాన్ని చేతిలో సాధనంగా కల్గినవారై కన్పించడం ఈమె కులక్రమానికి అనుగుణమైనందున, తాను చేతిలో ధరించి వెళ్ళే రెమ్మను వారు అంగీకరించినట్లయితే, అది తనను అంగీకరించిన విషయానికి చిహ్నం కాగలదని నాయకుడు భావించినందున, ఇతడు తన చేతిలో చెట్టురెమ్మను ధరించి వెళ్ళాడని గ్రహించాలి. అంతేకాక, చెట్టుకొమ్మనుండి కోయబడిన రెమ్మ వాడిపోయి ఉంటుంది కనుక, నాయకిని కలువలేనందున తనకు కల్గిన క్లేశాన్ని సూచించే ఒక గుర్తుగా ఉంటుందని భావించి కూడా అతడు రెమ్మను చేతధరించి వెళ్ళాడని చెప్పవచ్చు. సఖి ఆ స్వభావంలో తాత్పర్యాన్ని మనస్సులో పెట్టుకొని **"కొమ్బార్ తழைకై"**- అని అన్నందున, ఈ రెమ్మయే ఇతని చేయి సోకినందున వాడిపోయింది, నాయకికి ఈ స్థితి కలుగలేదే!- అని జాలిపడుతున్నది.

**"శిఱునాణ్ ఎఱివిలమ్"** - అనే ప్రయోగానికి ఇపుడు చేతిలో విల్లు లేకపోవడమే కాదు, పూర్వం వింటినారిని సంధించినపుడు దాని తాకిడివల్ల భుజంపై కల్గిన కణుపును (కాయవంటి గుర్తు) కూడ చూడలేకున్నాము- అని, చిన్న వింటిదారం సంధింపబడిన వింటిని ఇతని చేతిలో చూడలేదు -అని రెండు రీతులలో వివరింపబడింది. రెండవ వివరణంలో **"శిఱు నాణెఱివు"**- అనేది వింటికి **("తొழிల్ ఆకుపెయర్")** కార్యపదం దాని సాధనాన్ని లక్షించడం.

**(వేట్టై కొణ్డాట్టు)**- వేట అనేది బయటకు నెపం మాత్రమే. నాయకిపట్ల ఉండే కోరిక అధికమైనందునే ఇతడు వచ్చాడు- అని భావం.

**(అమ్బార్ కళిఱు వినవువదు)- "పణ్ణాఱ్ఱ తేన్ మొఴి ప్పావై నల్లీర్! ఓర్ పకఴి మూఴ్క పుణ్ణాఱ్ఱ మా ఒన్రు పోన్దదుణ్డో నుమ్ పునత్తయలే",** (రాగంతో నిండిన, తేనెవలె తీయని మాటలను పలికే కన్యలారా! అద్వితీయమైన బాణం నాటుకొని గాయపడిన జింక ఒకటి ఈ తోటలోకి పోయిందా?) **"మణ్పట్ట కోడుమ్ మదమ్ పట్ట వాయుమ్ వడిక్కణై తోయ్, పుణ్ పట్ట మేనియుమాయ్, అన్దో! ఒరు పోర్క్కళిఱే"** (మన్ను అంటుకొన్న దంతాన్ని, మదజలం కారే ముఖాన్ని, పదునైన బాణం నాటుకొని పుండుపడిన మేనిని కల ఒక మదగజం వచ్చిందా?) అని గల **"తఞ్జవాణన్ కోవై"** మొదలైన కావ్యాలలోని పాశురాలు స్మరణీయాలు. ఈ విధంగా ప్రశ్నించడంవల్ల- "ఈమె చూపుకు నేను లక్ష్యమై పడే పాట్లు బాణం దెబ్బతగిలి బాధపడే ఏనుగు పడేపాట్ల వలె ఉన్నది సుమా'' అని సూచించి నట్లయినది.

సఖి, "నీవిక్కడకు రావడం ఎందుకు?'' అంటే, నాయకుడు "వేటకోసం వచ్చా''నన్నాడు. "అయితే విల్లు ఎక్కడ?'' అంటే, తన చేతిలోని చెట్టుకొమ్మ రెమ్మను చూపించాడు. "విల్లు లేకపోయినా బాణాలైనా ఉన్నాయా?'' అని అంటే, "బాణాలు ఏనుగుకు నాటుకొన్నాయి'' అన్నాడు. ఈ రీతిలో బలమైన కోరికవల్ల సిగ్గు, లజ్జలేకుండా పలు అబద్ధాలను నాయకుడు పల్కినందున **"ఐయర్"**- అనే గౌరవవాచకంతో నిర్దేశించి సఖి అతనిని పరిహసించింది.

**"ఇలమ్"**- లేము- అని అర్థం. ఇది **"తన్మై ప్పన్మై ఎదిర్మఱై క్కుఱిప్పు ముఱ్ఱు"**- ఉత్తమపురుష బహువచనంలోని వ్యతిరేకార్థకసమాపకక్రియ. **"వేట్టై"**- **"వేడు"** అనే పదంలో చివర గల హ్రస్వ ఉకారం లోపించి డకారస్థానంలో ద్విత్వటకారం, దానిపై **"శారియైచ్చొల్"** రూపమైన ఐకారం రాగా సిద్ధించిన రూపం ఇది. **"కొణ్డాట్టు"-"కొణ్డాడుదల్"** పొగడడం. (గొప్పగా భావించడం) ధాతురూపంలో మొదట మార్పు వచ్చి, దానినుండి పుట్టిన క్రియా నామవాచకం. **"ముదనిలైతొఴిల్ పెయర్".**

**(పుళ్ళూరుమ్ కళ్వర్తమ్ పారకత్తు ఎన్ఱు మాడాదన)**- ప్రాణులను వాటిని తెలియకుండా తానే తనకు స్వాధీనం చేసికొనేవాడు- అనేది **"కళ్వర్"** అనే పదంయొక్క అర్థం. ఏమాత్రం పొందిక లేని ఈ చేతలను, మాటలను ఈ లోకంలో ఎక్కడా చూడలేదు. ఆ పరమపదంలో ఉన్నాయో, ఏమో! తెలియదు- అని దీని భావం.

**(తమ్మిల్ కూడాదన)** - చేతిలో రెమ్మను ధరించి రావడానికి, "బాణం దెబ్బతగిలిన ఏనుగు ఈవైపు వచ్చిందా ?"అని అన్వేషించడానికి ఏవిధమైన పొందిక లేదు- అని భావం. ఈవిధంగా అసత్యంతో కలసినవి అయినా, అతడు అడిగే ప్రశ్నలు తమకు కొత్తవిగా, ఆశ్చర్యాన్ని కల్గించేవిగా ఉండడం స్ఫురించేటట్లు **"వమ్బార్ వినా"**- అని అంటున్నది. **"వమ్బార్ వినా చ్చొల్లవో!"** అనే ప్రయోగానికి వ్యర్థంగా ప్రశ్నింపబడడానికేనా?'' అనే అర్థాన్ని గ్రహించవచ్చు. **"వమ్బార్ వినా"**- ఇంతవరకు ప్రశ్నించగా వినని మాటలు (ప్రశ్నలు)- అని అర్థం. **"ఎమ్మై వైత్తదు ఇవ్వాన్ పునత్తే"** - అని అనడంవల్ల, మేము మా పెద్దవారికి పరతంత్రులము, స్వతంత్రులం కాము. అందువల్ల, ఆ పెద్దవారిని అడిగి, పలువురు తెలిసికొనేటట్లుగా వివాహం చేసికోవడం సక్రమమైనది- అనే అర్థం సూచింపబడింది.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే- భగవానునకు ప్రీతికరంగా ఉండే ఈ ఆళ్వార్ల దగ్గర మనం కొన్ని ప్రశ్నలకు అడగాలి- అని వచ్చిన విద్యాగర్వాన్ని కలవారిని చూచి, "వీరి మాటలు, చేష్టలు ఒక దానితో ఇంకొకటి పొంతన లేకుండా, పరస్పర విరుద్ధంగా ఉన్నాయని ఆళ్వార్లతో పల్కడమే.

**(కొమ్బార్ తழைకై)**- పంచేంద్రియాల కోరికలనే చిగుళ్ళను (రెమ్మలను) వీరు విడువలేదు.

**(శిఋ నాణెఱివిలమ్)**- ప్రణవమహామంత్రమనే వింటియొక్క ఉచ్చారణమనే ధనుష్టంకారం వీరి వద్దలేదు. **"ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే"** (ప్రణవం ధనుస్సు, ఆత్మ బాణం, ఆబాణానికి లక్ష్యం పరబ్రహ్మ) అనే సూక్తి స్మరణీయం.

**(వేట్టై క్కొణ్డాట్టు)** సంసారమనే అరణ్యంలో ఉండే కామక్రోధాదులనే క్రూరజంతువులను తరిమివేయడం మేము ఆరంభించాము- అనే గొప్పలు చెప్పుకోవడంమాత్రమే వీరికి ఉన్నది.

**(అమ్బార్ కళిఋ వినావువదు)** - శాస్త్రజ్ఞానమనే బాణాన్ని తాము ప్రయోగించగా, తమ ఇంద్రియాలనే ఏనుగులు శబ్దాదివిషయాలనే అరణ్యంలో వేగంగా పరుగెత్తిపోయాయి - అని, ఇంద్రియాలను వెంబడించి తరిమివేయడమే వీరి పని.

**(ఐయర్)-** వీరి విద్యామదాన్ని పరిహసించిన తీరు ఇది.

**(పుళ్ళూరుమ్ కళ్వర్- ఇత్యాది) -** వేదమనే ప్రబలప్రమాణాన్ని అంతటా వ్యాపింపజేసేవాడు, ఎవరికీ తెలియకుండా మఱుగు పడి ఉండి, అన్నిటిని రక్షించేవాడైన భగవానుడు సృష్టించిన ఈ లోకంలో ఏ కాలంలో అయినా లేనివి, ఒక దానితో ఇంకొటి పొంతన లేనివి అయిన, కొత్తవైన వీరి వ్యర్థప్రశ్నలకు సమాధానం చెప్పడంకోసమా, భగవచ్ఛేషభూతులమైన మమ్మలను ఈ లీలావిభూతిలో స్వామి నియమించి ఉంచాడు? అని భావం. తత్త్వజ్ఞానాన్ని, ప్రపత్తిమార్గాన్ని అనుసరించకుండా అసత్యమైన తగని మార్గంలో వర్తించే గర్వాన్ని కల పండితులను సంస్కరించడంకోసం ఈ విధంగా పలుకబడింది.

**నాయకుడు తన మనోరథాన్ని నాయకితో, ఆమె సఖితో పల్కడం**

**23. పునమో? పునత్తయలే వ*ళ్ళి*పోగు మరువినైయేన్,**
**మనమో? మగళిర్! నుజ్ఞావల్ శొల్లీర్-, పుణ్డరీగత్తజ్కే*ళ్*
**వనమోరనైయ కణ్ణాన్ కణ్ణన్ వానాడమరుమ్ తెయ్వ**
**త్తినమోరనైయీర్కళాయ్, ఇవైయో నుమ్మియల్వుగళే!**

మకళిర్ = ఓ కాంతలారా!, నుమ్ కావల్ = మీ కాపలాకు చెందిన విషయం, పునమో = ఈ పొలమా?, పునత్తు అయలే వ*ళ్ళి* పోకుమ్ అరు వినైయేన్ మనమో= ఈ పొలం సమీపంలో మార్గం ద్వారా ప్రయాణం చేసే పాపియైన నా మనస్సా!, శొల్లీర్ = చెప్పండి, పుణ్డరీకత్తు అమ్ కే*ళ్* వనమ్ ఓర్ అనైయ కణ్ణాన్ = ఎఱ్ఱ తామరపూవుయొక్క అందమైన కాంతిని కల వనాన్ని ఒక రీతిలో పోలి ఉండే నేత్రాలను కలవాడైన, కణ్ణన్ = శ్రీకృష్ణుని, వాన్ నాడు = పరమపదంలో, అమరుమ్= వాసం చేసే, దెయ్వత్తు ఇనమ్ = నిత్యసూరివర్గాన్ని, ఓర్ అనైయీర్ కళ్ ఆయ్ = ఒక విధంగా పోలి ఉండేవారైన, నుమ్ ఇయల్పుడన్ = మీరు కల్గి ఉండే స్వభావాలు, ఇవైయో = ఇరుగుపొరుగువారి మనస్సులను కొల్లగొట్టడం మొదలైన ఈ కృత్యాలుగా ఉండడం తగినదా?

**భావదీపిక :** పెరటిలోని పొలాన్ని కాపలాకాసే నాయకిని, ఆమె సఖిని చూచి, నాయకుడు తన కోరికను తెల్పుతూ పల్కిన ఆలంకారిక ప్రక్రియ **("తుఱై")** ఇది. తమ మనస్సు వీరికి వశమైనదని చేసిన సూచనద్వారా, తన మనోరథాన్ని

ఇతడు వ్యక్తం చేశాడు. మీరు పొలాన్ని విడచిపెట్టి వెళ్ళని రీతిలో నా మనస్సును కూడా విడచిపెట్టి వెళ్ళడం లేదు- అని, పొలంవలె మా మనస్సుకూడా మీ రక్షణలో అంతర్భవించి ఉన్నదనే భావం స్ఫురించేటట్లు "ఓ కాంతలారా! మిమ్ములను పెద్దలు ఇక్కడ పెట్టినది పొలాన్ని కాపలా కాయడం కోసమా? లేక, నా మనస్సును కాపలా కాయడం కోసమా? పొలాన్ని కాపలా కాయడంతో నిలువకుండా, నా మనస్సును కాపలా కాయడంలో కూడా ఉద్యమించడం మీకు తగదు- అని అంటున్నాడు, నాయకుడు. వారి అందాన్ని తాను చూడడం కోసం, తన ముఖాన్ని వారు చూడడం కోసం, వీరుండే చోట దగ్గరగా ఇతడు తడబడి సంచరిస్తూ ఉండే విషయం స్ఫురించేటట్లు **"పునత్తయలే వ*ழி* పోకుమ్ అరువినైయేన్"** అని అంటున్నాడు. "అరువినైయేన్"- చిక్కితే తప్పుకోలేకుండా బాధించడానికి కారణమైన పూర్వజన్మ కృతదుష్కర్మను కల్గినవాడను- అని భావం. **"మకళిర్"** - స్త్రీలకు తగిన అన్ని సద్గుణాలను కలవారు. **"పునమో? మనమో?"** - అనే ఈ పదాలలోని ఓకారం ప్రశ్నార్థకం.

**(పుండరీకత్తు - ఇత్యాది)**- గొప్పతనంలో తామరపూలు సాటిరాలేని రీతిలో ఉండే నేత్రాలను కల పుండరీకాక్షుని పరమపదంలో నిత్యవాసం చేసే నిత్యసూరి వర్గం, మీ వైలక్షణ్యం అంతటికి ఏ రీతిలో సాటిరావడానికి చాలని అతిశయాన్ని కల్గినవారైన మీకు ఇరుగుపొరుగువారి మనస్సును కొల్లగొట్టడం మొదలైన ఈ కార్యాలు తగినవి కావు- అని భావం.

భాగవతులు ఆ*ழ*్వార్ల పట్ల తమ మనస్సు అత్యంత ప్రావణ్యాన్ని కల్గిన విషయాన్ని తెలుపడం ఈ పాశురంలోని ధ్వన్యర్థం. మీ ఎల్లలోపల ఉండే చోటా! లేక, ఆ చోటుకు సమీపంలో ప్రయాణం చేసే మీపట్ల బంధాన్ని కల నా మనస్సా?- పరతంత్రులైన మీ రక్షణకు తగినది? పల్కండి. నేత్రసౌందర్యంలో గొప్పవాడు, సర్వసులభుడైన భగవానుని పరమపదంలో నివసించే నిత్యసూరివర్గంలో ఒక రీతిలో సామ్యాన్ని పలికేటట్లు, **"విణ్ణుళారిలుమ్ శీరియర్"** అనే రీతిలో వారికంటే గొప్పవారైన మీరు చేసే కృత్యాలు ఉపాయాంతరపరులై అన్యమార్గంలో వర్తించేవారినికూడా మీ దారిలోకి వచ్చేటట్లు చేసి సంస్కరించేవా?- అని ఆశ్చర్యపడిన రీతి ఇది. ఆ*ழ*్వార్లు ఒక్కరు వేంచేసి ఉండే సన్నివేశం **"అయర్వఱు మమర్కళ్"** అయిన నిత్యసూరులందఱు కలిసి ఉన్నట్లుగా ఉంటుంది కనుక, **"దెయ్వత్తు ఇనమ్ ఓరనైయార్కళాయ్"**- అని ప్రయోగింపబడింది. **"అనైయార్ కళాయ్"** అనే దానికి

తరువాత "ఉళ్ళ" (ఉండే) అనే ఒక క్రియను అధ్యాహారం చేసికోవాలి. లేక, "ఆయ్" అనే దానిని "ఆయ" -అనే పదంయొక్క వికృతిగా గ్రహించడం కూడా పొసగుతుంది. "పుణ్డరీకమ్" -ఇది సంస్కృతపదం.

ఈ పాశురంలో నాయకీ స్థానీయులు ఆళ్వార్లు. నాయకస్థానీయులు శ్రీవైష్ణవులు. దీనిప్రకారం, శ్రీవైష్ణవులు ఆళ్వార్ల విషయంలో అభినివేశాన్ని పొందడం ఈ పాశురంలో తెలుపబడింది. ఈ సందర్భంలో నమ్బిళ్ళై తమవ్యాఖ్యలో ఒక వార్తను ప్రస్తావించారు.

ఈ పాశురాన్ని అప్పాన్ తిరువళున్దూర్ అరైయర్ ఇంటిలోని తిన్నైపై(మచ్చు) వేంచేసి ఉండి, పిళ్ళైతిరునఱైయూర్ అరైయర్‌కు వివరించేటపుడు "పునమో పునత్తయలే వళిపోకు మరువినైయేన్" అనే ప్రయోగస్వారస్యాన్ని వివరించదలచి- "భగవానుడు వేంచేసి ఉండే పలు దివ్యదేశాలుండగా, వాటిని అన్నిటినీ విడచిపెట్టి ఆళ్వార్‌నాయకి అవతరించిన చోటైన తిరునగరిలో తిరుప్పుళియాళ్వార్ మార్గంలో ప్రయాణం చేసే పాపాన్ని చేశాను- అని నాయకుడు అంటున్నాడు'' అని అన్నారట. "భగవద్విషయాన్ని ఆశ్రయించి సుఖంగా పడి ఉండకుండా, తిరిగి పోలేని భాగవత విషయంలో ప్రవేశించేటట్లు అయినదే'' అని దీని భావం. ఈ వివరణం పెరియవాచ్చాన్ పిళ్ళైవ్యాఖ్యలో కూడా ఉన్నది.

## వియోగాన్ని సహించలేని నాయకి పొందిన అభినివేశాన్ని చూచి ఆమె దాది బాధపడడం

**24.** ఇయల్వాయిన వఞ్జనోయ్ కొణ్డులావుమ్, ఓరో కుడఙ్గై
క్కయల్ పాయ్వన పెరునీర్ క్కణ్గళ్ తమ్మొడుమ్-, కున్దమొన్దాల్
పుయల్వాయిన నిరైకాత్త పుళ్ళూర్‌ది కళ్ళూరుమ్ తుళాయ్
కొయల్‌వాయ్ మలర్మేల్, మనత్తొడెన్నాఙ్గొల్ ఎమ్‌కోల్ వళైక్కే

ఇయల్‌వు ఆయిన = సహజమైనది, వఞ్జమ్ = ఇతరులు తెలియని రీతిలో ఉండేది అయిన, నోయ్ = ఈ ప్రణయవ్యాధిని, కొణ్డు = కల్గినదై, ఉలావుమ్ = ఆర్త్యతిశయంవల్ల అంతట వ్యాపించి సంచరించే, ఓరో కుడఙ్గై = ఒక్కొక్కటి ఒక్కొక్క పుడిసిలి పరిమితిలో ఉండే, కయల్ = సొఱచేపవలె, పాయ్వన = మిలమిలలాడేవి అయిన, పొరు నీర్ కణ్‌గళ్ తమ్మొడుమ్ = గొప్ప నీటి ప్రవాహాన్ని

కల కన్నులతోను, పుయల్ వాయ = పూర్వం వర్షం కురిసిన సమయంలో, కున్రమ్ ఒన్రాల్ = గోవర్ధన పర్వతంతో, ఇనమ్ నిరై కాత్త = పశువుల సమూహాన్ని రక్షించినవాడు, పుళ్ ఊర్ది = గరుడవాహనుడైన శ్రీకృష్ణుని, కళ్ ఊరుమ్ తుழாయ్ = తేనె స్రవించే తులసియొక్క, కొయల్ వాయ్ మలర్ మేల్ = కోయడానికి తగిన పూవుపై (ఆశపడిపోయిన) మనత్తొడు = మనస్సు కూడిన, ఎమ్ కోల్ వళైక్కు = అందమైన గాజులను కల మా కూతురుకు, ఎన్ ఆమ్ కొల్= ఇపుడు ఏ స్థితి కల్గుతుందో కదా!

**భావదీపిక :** విరహాన్ని సహించ లేని నాయకి అభినివేశాన్ని చూచిన పెంపుడు తల్లి, బాధపడుతూ పలికే పాశురం, ఇది. నా కూతురు కన్నులు విరహవేదనతో ఎఱ్ఱబడినవి. మనస్సు వికలమైనది. ఇక ఇంతకంటే మించి ఏమవుతుందో! ఏమో!- అని బాధపడుతూ పెంపుడు తల్లి అంటున్నది. ఈమె కన్నులయితే, స్వాభావికం గాను, ఇతరులు గ్రహించడానికి వీలుకానట్లుగాను ఉండే ప్రణయబాధను కల్గినవై, విరహాత్యతిశయం వల్ల, అంతట వ్యాపించి చూస్తున్నవై, ఒక్కొక్కటి ఒక్కొక్క చారెడు (అరచేయి) పరిమాణంలో ఉన్నవై, సొరచేపలవలె మిలమిల లాడుతున్నవై, గొప్పనీటి ప్రవాహాన్ని కల్గినవై ఉన్నవి. ఈమె మనస్సు అయితే, **"కున్రమేన్ది క్కుళిర్ మழைకాత్తవన్"** (గోవర్ధనాన్ని దాల్చి వర్షం నుండి రక్షించిన) గరుడవాహనుడైన శ్రీకృష్ణుని తేనెలు ఊరే తులసీమాలపై ఆశపడుతున్నది. ఇంతకంటే మించి ఇక ఈమెకు ఏదశ ప్రాప్తిస్తుందో? ఏమో?- అని తల్లి కలతను పొందింది. **"ఇయల్ వాయన వఞ్జనోయ్ కొణ్డులావుమెన్కొల్! వళైక్కు"** అని అన్వయించవచ్చు. దేహం కృశించినందున చేతి గాజులు జారిపోయే స్థితి కల్గుతుందేమో!- అని ఈమెకు కల్గిన బాధ స్ఫురింపజేయబడేటట్లు- **"కోల్వళైక్కు"** అని అనబడింది- అందమైన గాజులను కల ఈమెకు -అని దీని భావం. **"కోలమ్"**- అనే పదం **"కోల్"** అనే వికృతిని పొందింది, (**"నీళమ్"- "నీళ్"** అనేదానివలె).

**"వాయిల్ పల్లెழுన్దిల మయిరుమ్ ముడికూడిఱ్ఱిల... మాయన్ మామణి వణ్ణన్ మేలివళ్ మాలుఱుకిన్రనళే"** (పెరియాழ్వార్-3-7-3) (నోటిలో ఇంకా దంతాలు మొలవలేదు, కేశపాశం ముడిపడడంలేదు, .... ఆశ్చర్యచేష్టితుడు, గొప్ప నీలమణి వర్ణం వంటి వర్ణాన్ని కల స్వామిపట్ల ఈమె వ్యామోహాన్ని పొందు తున్నదే?) అనేరీతిలో ఈమె చాలా చిన్నతనంనుండి శ్రీకృష్ణునిపట్ల ప్రేమను కల్గి ఉండడం

స్ఫురించేటట్లుగా **"ఇయల్‌వాయిన నోయ్"** అని అనబడింది. ఈ ప్రబంధంలోని అఱువైయవ పాశురాన్ని కూడా ఈ రీతిలో గమనించవచ్చు. **"వఞ్జనోయ్"** అనేదానికి - నాయకుడు విడచి వెళ్ళి తిరిగి రాకుండా వంచించి నందున కల్గిన బాధ- అని కూడా చెప్పవచ్చు. లేక, **"వఞ్జనోయ్ కొళ్ళుదల్"**- ఇతరులను నేత్రసౌందర్యంతో వశపరచుకొని బాధించే స్వభావాన్ని కల్గి ఉండడం- అని కూడా చెప్పవచ్చు. కన్నులు విస్తరించి, దీర్ఘంగా ఉండే స్థితికి **"కయల్"** (సొరచేప) ఉపమానం. **"కయల్ పెరు నీర్ ప్పాయ్‌వు అన కణ్‌గళ్"** అని అన్వయించి, సొరచేప మిక్కిలి నీటిపౌష్కల్యాన్ని కల ప్రవాహంలో విహరించేటట్లుగా, కన్నీటి ప్రవాహంలో మిలమిలలాడే కన్నులు- అని వివరించవచ్చు.

**"పుయల్‌వాయ్"**- ఇక్కడ **"వాయ్"** అనేది సప్తమీవిభక్తి. వర్షం కురిసే కాలంలో - అని అర్థం. **"కోల్‌వళై"** - ఇది **"పణ్బుత్తొక్కై అన్‌మొழி"** **"పుళ్ళూర్‌ది"**- ఇది కర్మధారయగర్భ బహుప్రీహిసమాసం. **"ఊర్‌ది"** - **"ఊర్వవదు ఊర్‌ది"**- (మోస్తుంది కనుక **"ఊర్‌ది"** - వాహనం) అనేది వ్యుత్పత్తి. గరుడుని వాహనంగా కలవాడని భావం. **"కొయల్"** - క్రియా వాచకం. కోయడమని అర్థం. **"కొయల్ వాయ్ మలర్"**- కోయబడిన పూవు- అని భావం.

ఈ పాశురానికి స్వాపదేశార్థం భగవానుని దరిచేరలేక బాధపడే ఆழ்వార్ల స్వభావాన్ని చూచిన జ్ఞానులు పల్కినసూక్తి.

**(ఇయల్‌వాయిన)** - కృతకంగా కాకుండా, **"అఱియా క్కాలత్తుళ్ళే అడిమై క్కణ్ అన్బు శెయ్‌విత్తు, అఱియా మామాయ త్తడియేనై వైత్తాయాల్"** (ఏమీ తెలియని చిన్నతనం నుండి దాస్యంపట్ల రుచి నాకు కల్గించావు) అనే విధంగా భక్తి సహజంగా ఉన్నది.

**(వఞ్జమ్)** - తనవల్ల తప్ప ఇతరులకు తెలియరానిది అయిన, **(నోయ్)** విరహార్తిని కల్గించే భక్త్యతిశయాన్ని, **(కొణ్డు)**- కల్గినవై, **(ఉలావుమ్)**- ఒక దశలో స్థిరంగా ఉండకుండా తడబడే,

**(ఒరో కుడఙ్గై క్కయల్ పాయ్‌వన పెరునీర్ క్కణ్‌గళ్ తమ్మొడుమ్)**- పుడిసిళ్ళతో పోగుచేసి ఎత్తుకొని, అనుభవించేటట్లు అందమైన స్థితిని కల్గినవై, విరహార్తివల్ల కల్గిన కన్నీటి ప్రవాహంలో ఓలలాడే జ్ఞానప్రకారాలనే కన్నులతో- అని అర్థం.

**(కున్దమొన్దాల్... మనత్తోడు)** - శరణాగతరక్షణార్థం అరుదైన పనులను చేసేవాడు, పశుప్రాయులైన జీవులను కాపాడేవాడు, మిక్కిలి త్వరను కలవాడైన భగవానుని మిక్కిలి భోగ్యమైన తులసీమాలికయొక్క అందాన్ని అనుభవించడంలో మునిగిన మనస్సుతో కూడిన - అని అర్థం.

**(ఎన్కోల్ వళైక్కు)** - నాకు మిక్కిలి ఇష్టులైన వీరికి - అని అర్థం **(ఎన్ అమ్కొల్)**- ఇంకా ఏ దశ ప్రాప్తిస్తుందో కదా!

ఇందులో **"పుళ్ళూర్ కళ్ళూరుమ్ తుళాయ్ క్కొయల్వాయ్ మలర్మేల్ మనత్తొడు"** అని అంటూ పరాంకుశనాయకి భగవానుని తులసీమాలిక పట్ల ఆశను పొందినట్లు తెలుపబడింది. ఈ రీతిలో తన మాలికను ఆశపడినవారికి సర్వేశ్వరుడు ఇస్తాడా? అనే ప్రశ్నకు సమాధానం పెరియవాచ్చాన్పిళ్ళై తమ వ్యాఖ్యలో శ్రీరామాయణ శ్రీసూక్తిని ఉట్టంకించి, సమాధానిస్తూ రెండు పూర్వాచార్య నిర్వాహాలు తెలిపారు.

దశరథచక్రవర్తి తనను పిలిచినపుడు శ్రీరాముడు అంతఃపురంనుండి బయలుదేరగా, అతని వెంట సీతాదేవి కూడా వెంబడించి వచ్చింది. అపుడు శ్రీరాముడు సీతను సమ్మానించాడు - అని అంటూ వాల్మీకి **"పతిసమ్మానితా సీతా భర్తార మసితేక్షణా, ఆద్వార మనువవ్రాజ"** అని అన్నారు.

ఇక్కడ **"పతిసమ్మానితా"** అనే దానికి పూర్వాచార్యుల వివరణం ఏమంటే- "నేను తిరిగి వచ్చేవరకు వృత్తకీర్తనాన్ని చేస్తూ ఉండు- జరిగిన సంగతిని భావిస్తూ ఉండు" అని. కాని, భట్టర్ ఇంతకంటే సరసమైన నిర్వాహాన్ని చేశారు. అది ఏమంటే- "శ్రీరాముని సౌందర్యాన్ని నేత్రాలతో పానంచేస్తూ అతని వెంట ద్వారంవరకు వచ్చిన సీతాదేవిని చూచి, ఆమె పారవశ్యంవల్ల తనను మఱచి అంతఃపురం గడపదాటి బయటకు వస్తుందేమోనని తలచి, శ్రీరాముడు తన కంఠసీమలోని మాలికను తీసి ఆమె కంఠంలో అలంకరించి, ఆమె పాదాలను తాకి "ఇక నిలు" అని అన్నాడు- అని (భట్టర్ నిర్వాహం) ఈవిధంగా భగవానుడు తన మాలికను ఆశపడినవారికి ప్రేమతో అనుగ్రహిస్తాడని దీనివల్ల తెలుస్తున్నదని ఇచటి భావం. ఈవివరణాన్ని తిరుప్పావై 27వ పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ పెరియవాచ్చాన్పిళ్ళై తమ మూవాయిరప్పడి వ్యాఖ్యలో కూడా ప్రస్తావించారు.

## నాయకుని మాలికను ఆశపడిన నాయకి ఆర్తితో పల్కడం

25. ఎఙ్గోల్వళై ముదలా క్కణ్ణన్ మణ్ణుమ్ విణ్ణు మ్మళిక్కుమ్,
    శెఙ్గోల్ వళైవు విళైవిక్కు మాల్-, తిఱల్ శేరమరర్
    తఙ్గోనుడైయ తఙ్గోన్ ఉమ్బరెల్లాయవర్క్కుమ్ తఙ్గోన్
    నఙ్గోనుగక్కుమ్ తుழாయ్, ఎన్ శెయ్యాదిని నానిలత్తే?

తిఱల్ శేర్ = సామర్థ్యాన్ని నిండుగా కల, అమరర్‌తమ్ = దేవతలందఱికి, కోనుడైయ = ప్రభువైన బ్రహ్మదేవునకు, తమ్‌కోన్ = నాయకుడై ఉండేవాడు, ఉమ్బర్ ఎల్లాయవర్క్కుమ్ తమ్ కోన్ = పరమపదంలో ఉండే నిత్యసూరులందఱికి నాయకుడైనవాడు, నమ్ కోన్ = ఈ లోకంలో ఉండే మనకు స్వామియైనవాడు, ఉకక్కుమ్ = ఆశపడి ధరించిన, తుழாయ్ =తులసి, ఎమ్ కోల్ వళై ముదల్ ఆ = మా చేతిలో ఉండే అందమైన గాజులకోసం, కణ్ణన్ మణ్ణుమ్ విణ్ణుమ్ = భగవానుని లీలావిభూతిని, నిత్యవిభూతిని, అళిక్కుమ్ =రక్షించే, శెఙ్గోల్ వళైవు విళైవిక్కుమ్ = అడ్డు లేని ఆజ్ఞయొక్క వర్తనానికి ఒక విధమైన చెడ్డను కలుగజేస్తున్నాయి, ఇని = ఈ విధంగా ఉన్న తరువాత, నా నిలత్తు =ఈ లోకంలో, ఎన్ శెయ్యాదు = ఆ తులసి వేఱు ఏ చెడ్డను చేయదు?

**భావదీపిక** : నాయకుడు ధరించిన మాలికను ఆశపడిన నాయకి (దానిని పొందలేక) ఆర్తితో పలికే పాశురం ఇది. పూర్వం నాయకిని సంశ్లేషించిన సమయంలో నాయకుని దేహంయొక్క సంబంధంవల్ల నాయకికి ఆనందాన్ని కల్గించిన తులసి, విశ్లేషసమయంలో ఆ ఆనందాన్ని జ్ఞాపకం చేసి, ఆర్తిని పొందేటట్లు చేయగా, దానివల్ల నాయకి శరీరం కృశించి, చేతిగాజులు జారిపడిపోయాయి. ఇందువల్ల, ఈ తులసి ఏ పక్షపాతం లేకుండా ప్రాణులను అన్నిటిని రక్షిస్తున్న అడ్డులేని భగవానుని ఆజ్ఞావర్తనానికికూడా కొఱతను కల్గిస్తున్నది (అంటే నన్ను రక్షించకుండా పోవడమనే కొఱతను కల్గిస్తున్నది) ఇక, ఇంతకుమించి ఇంకా కూడా నన్ను ఏ పాట్లను పెడుతుందో? అని నాయకి పరితపిస్తున్నది. ఈ పాశురాన్ని మాతృవచనంగా గ్రహిస్తే **"ఎఙ్గోల్ వళైముదలా"** అనే ప్రయోగానికి- అందమైన గాజులను కల నా కుమార్తె నిమిత్తంగా- అనే అర్థాన్ని గ్రహించాలి. ఆ విధంగా చెప్పడంకూడా పొసగుతుంది. ఇక, నాయకుడైన శ్రీకృష్ణుడు తానే (విశ్లేషించి పోయి, తిరిగి రాకుండా

ఉపేక్షిస్తే), నా అందమైన గాజుల కారణంగా ఉభయవిభూతి రక్షకుడైన తన ఆజ్ఞకు ఒక వక్రత కల్గిస్తున్నాడు. దీనికి మించి, అతని పరివారమైన తులసి అయితే, ఇక ఏ కొఱతను కల్గించదు? అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. అతడు ఉపేక్షించి నంతమాత్రంలో ఇది (తులసి) నశింపజేస్తుందని (బాధిస్తుంది) భావం. నా గాజులు కారణంగా (గాజుల కోసంగా) ఇతడే నశింపజేయడం ఆరంభిస్తే, ఇక రక్షించేవారు వేఱెవ్వరు? అని సారం.

**"తోళిణైమేలుమ్ నన్ మార్బిల్ మేలుమ్ శుడర్ ముడిమేలుమ్, తాళిణై మేలుమ్ పునైన్ద తణ్ణన్తుழాయ్ ముడియమ్మాన్"** (తన భుజద్వంద్వంపై, అందమైన వక్షస్సులో,ప్రకాశించే కిరీటంపై, పాదయుగంపై అలంకరింపబడిన చల్లని అందమైన తులసిని కల స్వామి) అనే విధంగా తులసి భగవానునకు చాలా ప్రియమైనది కనుక **"నజ్గోన్ ఉకక్కుమ్ తుழాయ్"** అని అనబడింది.

ఈ పాశురానికి స్వాపదేశార్థం- భగవానుని భోగ్యతలో అభినివేశాన్ని పొందిన ఆழ్వార్లు ఆ భోగ్యతాప్రకర్ష తమకు ఆర్తిని కల్గించి, బాధిస్తున్నదని పల్కడం.

"ఎల్లాయవర్"- అనే దానిలో "ఎల్లామ్"- అనే ప్రకృతిలోని మకారం లోపించింది. "య్" -అనేది ఆగమం. "అ" అనేది శారియైచ్చొల్లు, 'వ'కారం సంధివశం చేత వచ్చింది. "ఆర్" -బహువచన ప్రత్యయం. అందఱు- అని అర్థం. **"నానిలమ్"** - ఇది **"పణ్బు త్తొకై యన్మొழி"**. **"ముల్లై, కుఱిఞ్జి, మరుతమ్, నెయ్దల్"** అనే నాల్గు విధాలైన ప్రదేశాలను కల దక్షిణ దేశానికి ఇది లక్షకపదం. మొదటి పాదంలో "విణ్ణుమ్ మళిక్కుమ్" అనే సంధిరూపం రావలసి ఉండగా, "విణ్ణుమ్ మళిక్కుమ్" అని అంటూ మకారం ఒత్తుకల రూపం రావడం "విరిత్తల్ వికారమ్". ఇది గణభంగం కాకుండా ఉండడంకోసం వచ్చింది.

## నాయకుడు నాయకితో ప్రయాణం చేస్తూ ఆమెకు తన నగరాన్ని చూపడం ( నగర్కాట్టుదల్ )

**26.** నానిలమ్ వాయ్ క్కొణ్డు నన్నీరఱ మెన్ఱు కోదు కొణ్డ,
వేనిలజ్జెల్వన్ శువైత్తుమిழ்పాలై-, కడన్ద పొన్నే
కాల్నిలమ్ తోయ్న్దు విణ్ణోర్ తొழுమ్ కణ్ణన్ వెంశికావుదు అమ్బూమ్
తేనిళఞ్జోలై యప్పాలదు, ఎప్పాలైక్కుమ్ శేమత్తదే

నాల్ నిలమ్ = (ముల్లై, కుఱిఞ్జి, మరుతమ్, నెయదల్ -అనే) నాల్గు విధాలైన ప్రాంతాలను, వాయ్ కొణ్డు = తన కిరణాలద్వారా నోటిలో గ్రహించి, (ఆ దేశాలలోని), నల్ నీర్ అఱ మెన్డు = సారమైన నీటి భాగాన్ని (భుజించి) ఎండిపోయే టట్లు చేసి, కోదు కొణ్డ = అసారమైన భాగం ఇది- అని గ్రహించిన, వేల్ అమ్ శెల్వన్ = వేడిమిని తనకు సంపదగా కల్గిన సూర్యుడు, శువైత్తు ఉమిழ్= రుచిని చూచి (దూరంగా) ఉమిసిన (పరిహరించిన), పాలై = ఎడారిప్రాంతాన్ని, కడన్ద = దాటి వచ్చిన, పొన్నే = బంగారువంటిదానా!, విణ్ణోర్ = పైలోకంలోని (పరమపదం లోని) వారందఱు, కాల్ నిలమ్ తోయ్న్దు తొழுమ్ = (నేలపై మోపడం అనేది లేని తమ) కాళ్ళు భూమిపై నిలచేటట్లుగా ఇచటకు వచ్చి నిలచి నమస్కరించే, కణ్ణన్ వెంకా = శ్రీకృష్ణుని దివ్యదేశమైన తిరువెంకా అనే క్షేత్రం, ఉదు = సమీపంలో ఉన్నది, ఆమ్ పూ తేన్ =అందమైన పూలను, తేనెలను కల, ఇళ = వయస్సులో ఉండే, శోలై = ఉద్యానవనం, అప్పాలదు = ఆ చోట ఉన్నది, ఎ ప్పాలైక్కుమ్ శేమత్తదు = (అది మన) అన్ని దుఃఖాలకు మాఱుగా ఆనందాన్ని కల్గించే ప్రదేశం.

భావదీపిక : **"నకర్‌కాట్టల్"** అనేది ఈ పాశురంలోని ద్రావిడశృంగారాలంకార ప్రక్రియ. నాయకుడు నాయకిని వెంట బెట్టుకొని ప్రయాణం చేస్తూ, దారిమధ్యలో ఎడారిప్రాంతాన్ని దాటి తన ఊరికి పోయేటపుడు ఆమెకు దారిలో కలిగే శ్రమ తెలియకుండా ఉండడంకోసం ఆమెను చూచి, "అదిగో! కన్పించే ఆ పెద్ద నగరమేసుమా మన నగరం'' అని తన నగరాన్ని చూపి, దగ్గరకు సమీపిస్తున్నట్లు పల్కడమే **"నకర్‌కాట్టల్"** అనే ప్రక్రియ. **"పుణర్‌న్దు ఉడన్ పోన తలైమకన్ నడన్దు ఇళైత్త తలైవియై క్కుఱిత్తు ఇడన్దలై ప్పెయ్‌దమై శొన్న పాశురమ్"** (సంశ్లేషించి, నాయకితో పాటు ప్రయాణం చేసే నాయకుడు నడచిన, అలసిన నాయకిని చూచి మధ్యలో మజిలీ చేయడాన్ని తెలిపే పాశురం.) అనేది అழுకియ మణవాళచ్చీయర్ ఉరైలోని సూక్తి. నాయకుడు, నాయకి తాము ఒకరినొకరు ఛాయవలె అనుసరిస్తూ ఉన్నందున, వీరికి ఈ ఎడారి ప్రాంతంలోని అంత అలసట కల్గకపోయినా, కాలక్షేపంకోసం నాయకుడు నాయకితో ఈవిధంగా పలికే రీతికూడా ఉన్నది. "నాయకీ! మన దారి మధ్యలో దైవాధీనంగా ఎడారి ప్రాంతాన్ని దాటడం జరిగింది. అది ఇక దాటవలసినదై ఉండి ఉంటే చాలా కష్టపడవలసి వచ్చేది. మంచి కాలం! దానిని దాటివేశాము. ఇక మన నగరం సమీపంలోనే ఉన్నది చూడు'' అని అంటున్నాడు.

సూర్యుడు నాల్గు విధాలైన ప్రాంతాలను తన కిరణాలద్వారా గ్రసించి, సారమైన జలాంశం ఎండిపోయేటట్లు బాగా పీల్చి, అసారమైన భాగానికి వెలువరించిన భాగమే ఎడారిప్రాంతం. దానిని దాటి అయినది- అని భావం.

**(నానిలమ్ వాయ్‌క్కొణ్డు)** - నాల్గు విధాలైన భూములు ఏవి? అంటే- **ముల్లై, కుఱిఞ్జి, మరుతమ్, నెయ్‌దల్-** అనేవి. అరణ్యం, దానికి సమీపంలో ఉండే దేశం **"ముల్లైనిలమ్"** అనబడుతుంది. సముద్రం, దాని తీరప్రాంతం **"నెయ్‌దల్ నిలమ్"** అనబడుతుంది. గ్రామాలు. దానిచుట్టు ప్రక్కల ఉండే ప్రదేశం **"మరుతనిలమ్"** అనబడుతుంది. పర్వతం, దానికి సమీపంలో ఉండే చోటు **"కుఱిఞ్జినిలమ్"** అనబడుతుంది. ఈ నాలుగేకాక, **"పాలైనిలమ్"** - అనే ఇంకొక విధమైన ప్రదేశమున్నదని కొందఱి అభిప్రాయం. ఇది, నీరు, నీడ ఏమాత్రం లేని ఎడారి ప్రదేశం. పూర్వం తెల్పిన నాల్గు విధాలైన ప్రాంతాలు తమ తమ స్వభావాలను కోల్పోయినపుడు అవి "పాలైనిలమ్"గా మారతాయి - అనే అభిప్రాయాన్నిబట్టి ఈవిధంగా (నాల్గు అని) చెప్పబడింది.

**(నానిలమ్ వాయ్‌క్కొణ్డు నన్నీరఱమెన్ఱు కోదు కొణ్డ వేనిలమ్ శెల్వన్ శువైత్తు ఉమిఴ్ పాలై)-** అనే ఈప్రయోగం ద్వారా, సహజంగా "పాలై"- అనే ప్రత్యేకమైన ప్రాంతం ఏదీ లేదని, నాల్గు విధాలైన ప్రాంతాలు తమ తమ స్వభావాలను పోగొట్టుకొని ఎడారిగా మారతాయని స్ఫురిస్తున్నది. ఈ భావాన్ని తెలిపే శిలప్పదికారం అనే గ్రంథంలోని- 'కోత్తొఴిలాళరొడు కొఱ్ఱవన్ కోడి వేఱ్ఱియ విఴన్ద వియనిలమ్ పోల వేనిఱ్కిఴవనొడు వెజ్గదిర్ వేన్దన్, తానలన్దిరుక త్తన్మైయిఴ్న్ది ముల్లైయుమ్ కుఱిఞ్జియు ముఱైమైయిఱ్ఱిరిన్దు నల్లియల్ పిఴైన్దు నడుఙ్గు తుయరుఱుత్తు ప్పాలై యెన్బదోర్ వడివమ్ కొళ్ళుమ్" అనే సూక్తి స్మరణీయం. ఈ సందర్భంలో నమ్పిళ్ళై ఈడు వ్యాఖ్యాన శ్రీసూక్తి- "నిలన్దాన్ నాల్ ఎన్బారుమ్, అఞ్జు ఎన్బారుమాయిరుక్కుమ్. ఐన్దు ఎన్గిఱవర్‌కళ్ పాలై నిలత్తైయుమ్ తన్నిలే ఒన్ఱాక్కి చొల్లువర్‌కళ్. నాల్ ఎన్దవర్‌కళ్ ఇప్పాలై నిలన్దాన్ మఱ్ఱై నాలిలుమ్ ఉణ్డెన్గిఱార్‌కళ్. అదాకిఱదు- నీరుమ్ నిఴలుమిల్లాద విడమ్ పాలైయా మత్తనైయిఱే" (భూప్రదేశం- నాల్గు విధాలైనది- అని అనేవారు, అయిదు విధాలైనది- అని అనేవారుగా ఉన్నారు. అయిదు- అనే వారు "పాలై" అనే ప్రాంతాన్ని కూడా ఒక ప్రకారంగా లెక్కించి పల్కుతారు. నాల్గు- అనేవారు ఈ

**"పాలై"** ప్రదేశం మిగిలిన నాల్గింటిలో అంతర్భవిస్తుందని అంటారు. అంటే- నీరు, నీడ ఏమాత్రం లేని చోటు **"పాలై"** అనబడే ప్రాంతం, అంతే కదా.)

**"పాలై"** అనబడే ప్రాంతానికి అసాధారణ లక్షణం నీరు లేక పోవడమే- అనేది **"నన్నీరఆమెన్ట"** అనడం ద్వారా సూచింపబడింది. సూర్యుడు తన కిరణాలతో భూమిలో ఉండే నీటిని గ్రహిస్తున్నాడనేది **"నానిలమ్ వాయ్కొణ్డు నన్నీరఅమెన్టు"** అనడం ద్వారా సూచింపబడింది. నాల్గు విధాలైన ప్రదేశాలలో ఉండే **"పాలై నిలమ్"** అసారమైనది- అని, సుఖానికి పనికిరాకుండా, కేవలం విరహక్లేశానికి మాత్రమే అనుగుణమైనది. దీని కాఠిన్యం- **"కోదు కొణ్డ"** అని పల్కినందువల్ల, **"మెన్టు శువైత్తు ఉమి*ழ்*"** అని అన్నందున సూచింపబడింది. ఈ ప్రాంతానికి తగిన కాలమైన మధ్యాహ్నసమయం, **"ఇళవేనిల్, ముదువేనిల్"** అనేవి (గ్రీష్మకాలం). **"వేనిల్"** అని అనడం ద్వారా సూచింపబడింది. దీనికి అధిదేవత సూర్యుడు అనేది **"వేనిలమ్ శెల్వన్"** అనే సూక్తి ద్వారా సూచింపబడింది. **"వేనిలమ్ శెల్వన్ శువైత్తుమి*ழ்* పాలై"** అని అన్నందున ఉష్ణకిరణాలను సహజంగా కల్గిన సూర్యుడు సైతం వెఱచేటట్లుగా **"పాలై"** ప్రదేశం యొక్క కాఠిన్యం (తీవ్రత) ఉన్నదనే అర్థం తోస్తుంది. **"నన్నీరఆ మెన్టు కోదు కొణ్డ వేనిళమ్ శెల్వన్"** అని పల్కిన తరువాత మళ్ళీ **"శువైత్త"** అని అనడం- ఏమాత్రం నీటి స్పర్శ లేని రీతిలో పూర్తిగా నీటిని పీల్చివేశాడనే విషయం స్ఫురించడంకోసం **"పాలై"**- నీరు, నీడ ఏమాత్రం లేని ఎడారి. సంస్కృతంలో మరుకాంతారమని దీనికి పేరు.

**(పాలై కడన్ద పొన్నే)**- ఇటువంటి తీవ్రమైన వేడిమిని కల ఎడారిప్రాంతాన్ని కాలితో నడచి ప్రయాణం చేసి వచ్చి మిక్కిలి అలసటను పొందిదగిన స్థితిలో కూడా నాయకుని విడిచి ఉండకుండా, అతనితో పాటు రావడమే ఆనందంగా తలచి, మండే నిప్పులలో కాచి వడబోసిన బంగారంవలె ప్రకాశించే ఆమె స్వభావాన్ని ఈ పదం ద్వారా తెలుపబడింది. **"పొన్"**- బంగారమా! అని అర్థం. ఇక్కడ ఉపమానపదం ద్వారా ఉపమేయం సూచింపబడినందున ఇది **"ఉవమై ఆకుపెయర్"** (ఉపమేయాన్ని సూచించే ఉపమాన లక్షకపదం.) **"ఆకుపెయర్"** - లక్షణావృత్తిద్వారా అర్థాన్ని బోధించే పదం. (లేక) లక్ష్మీదేవి వంటిదానా!- అని కూడా అర్థం. (**"హిరణ్యవర్ణామ్"**- అనే శ్రీసూక్తసూక్తి స్మరణీయం)

**(కాల్ నిలమ్ తోయ్న్దు విణ్ణోర్ తొ*ழு*మ్ కణ్ణన్ వెంగికా ఉదు)**- దేవతలకు ఈ మానవలోకంలో కాలు నిలుపలేక పోవడం వారి స్వభావం. అది మాఱిపోయి,

కాలును భూమిపై మోపారు- అని అనడం ఆ లోకంలోకూడా దివ్యదేశానికి ఉండే గొప్పతనాన్ని సూచించడంకోసం. భూమిపై కాలును మోపే భూలోక వాసులు కూడా కాలు మోపడానికి సాధ్యం కాని ఎడారిప్రాంతం యొక్క వేడిమిని ఉపశమించేటట్లు చేయగల్గినదైన తిరువెఃకా అనే దివ్యక్షేత్రం, భూమిపై కాలు మోపలేని దేవలోకవాసులు (నిత్యసూరులు) కూడా కాలును సుఖంగా మోపగల్గినది- అనే వైలక్షణ్యం గమనించదగినది. ఆ దివ్యదేశంపట్ల ఉండే భక్త్యుత్కర్షవల్ల వారు ఆ ప్రాంతాన్ని గమనించకుండా తమ కాలును మోపుతారు.

ఈ తిరువెఃకా దివ్యదేశంలో వేంచేసి ఉండే భగవానుడు **"పత్తుడై యడివర్క్కెళియవన్"** (భక్తిని కల్గినవారికి సులభుడు) అయినందున, కణికణ్ణన్ మాటను విన్న తిరుమழிశై ప్పిరాన్ పల్కిన రీతిలో, భక్తులు పల్కిన రీతిలో తాను ఆచరించి **"శొన్నవణ్ణమ్ శెయ్ద పెరుమాళ్", "యథోక్తకారి"** అనే తిరునామాలను పొందిన విషయం స్ఫురించేటట్లుగా సౌలభ్యగుణాన్ని సూచించే **"కణ్ణన్"** అనే తిరునామంతో ఇక్కడ భగవానుడు నిర్దేశించబడ్డాడు.

**"వెఃకా"** - 108 దివ్యతిరుపతులలో- తొండమడలంలోని కాంచీపురమనే పెరుమాళ్‌కోయిల్‌లో గల ఒక దివ్యదేశం. ఇచటి స్వామి, బ్రహ్మచేసిన యాగాన్ని పాడుచేయడంకోసం వచ్చిన వేగవతీనదిని అడ్డుకొనే నిమిత్తం దానికి వారధిగా అడ్డంగా శయనించాడు. కనుక, ఆ స్వామికి సంస్కృతంలో **'వేగాసేతు"** అని పేరు.అది తమిళంలో **"వేగవణై"** అని ద్రావిడీకరింపబడింది. తరువాత, (**"నాగవణై"**- అనేది **"నాగణై"** అయినట్లుగా), **"వేగవణై"** అనేది **"వేగణై"** అనే వికృతిని పొంది, ఆతరువాత **"వెఃకణై"** అని మాఱింది. ఆ పిమ్మట **"వెఃకా"** అనే మార్పుతో ఇపుడు వ్యవహరింపబడుతున్నది. ఆழ்వార్లలో ముఖ్యులైన నమ్మాழ்వార్ తమ మొదటి దివ్యప్రబంధమైన ఈ తిరువిరుత్తంలో తిరువేంగడమ్, తిరువెఃకా, తిరువరఙ్గమ్- అనే మూడు దివ్యదేశాలకు మాత్రమే మంగళాశాసనాన్ని చేసినందున, ఆమూడు **"కోయిల్, తిరుమలై, పెరుమాళ్‌కోయిల్"** అనే విలక్షణమైన రీతిలో వ్యవహరింపబడుతున్నాయని పెద్దలంటారు.

**"ఉదు"** మిక్కిలి దూరంలోను, మిక్కిలి దగ్గరలోను కాకుండా, మధ్యలో ఉండే దానిని సూచించే పదం. **"అదువిదువుదు"** అనే తిరువాయ్‌మొழி ప్రయోగం స్మరణీయం. **"ఇళఙ్గోలై"** - ఎల్లప్పుడు వసంత కాలం వర్తించే, లేత వయస్సులో

ఉండే ఉద్యానవనం. ఈవిధంగా పల్కడం- విరహతాపాన్ని తీర్చడానికి తగిన చోటు- అని చూపడంకోసం, చక్కని **"కుఱిఞ్జి"** (పర్వతం, తత్సమీపప్రాంతం) ప్రదేశంలో సంశ్లేషించి, మిక్కిలి తీవ్రమైన **"పాలై"** దేశాన్ని దాటి, భోగ్యమైన **"మరుతమ్"** (గ్రామాలు, తత్సమీపం) ప్రాంతానికి చేరుతున్నాము- అని సూచింపబడినట్లయినది. **"ఎప్పాలైక్కుమ్"** అనే ప్రయోగంలోని **"పాలై"** అనే పదం లక్షణావృత్తి ద్వారా విరహక్లేశాన్ని లక్షిస్తుంది. దీనిని, **"పాన్మై" (పాల్మై)- పాన్మై** అనే స్వభావవాచకపదంలోని **"మై"** అనే ప్రత్యయంలోపించి, **"ఐ"** అనే ప్రత్యయం చేరగా **"పాలై"**య అనే రూపాన్ని పొందిన పదంగా గ్రహించి, **"ఎప్పాలైక్కుమ్"** - అనే ప్రయోగానికి 'ఏస్థితిలో అయినా'' అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"ఎప్పాలైక్కుమ్ శేమత్తదే"** అనే చోట నమ్బిళ్ళై ఈడుసూక్తి-గమనించండి. **"ఎల్లా ప్పాలై నిలఙ్గళాల్ వన్ద వెమ్మైయైయుమ్ పోక్కి, నమక్కు రక్షకముమాన దేశఙ్గాణ్ అదు (వెంఃకా). ఇన్ద ప్పాలైనిలమేయన్ఱిక్కే ఇన్నముమ్ శిల పాలైవనముమ్ కడక్కలామ్ కాణ్ ఇన్నిలముణ్డాక"** (ఎడారి ప్రాంతాలన్నిటిదల్ల కల్గిన శ్రమను తీర్చి, మనకు రక్షకమైన దేశంసుమా, అది. ఈ ఎడారి ప్రాంతమేకాక, ఇంకా కొన్ని ఎడారి వనాలను కూడా దాటవచ్చు, ఈ ప్రాంతం ఉన్నందున).

**"అప్పాలదు"** - అక్కడ ఉన్నది- అని అర్థం (**"పాల్"** -చోటు) లేక, తిరువెఃకా దివ్యక్షేత్రానికి ఆవలి వైపున (దగ్గరలో) ఉండే **"తిరుత్తణ్కా"** అనే దివ్యదేశాన్ని దృష్టిలో పెట్టుకొని- **"అమ్పూమ్ తేనిళమ్ శోలై అప్పాలదు"** అని పల్కినట్లుగా కూడా చెప్పవచ్చు. **"తిరుత్తణ్కా"**- ఇది **'విళక్కొళి'** (దీపప్రకాశుడు) అనే అర్చామూర్తి వేంచేసి ఉండే దివ్యదేశం. సంస్కృతంలో హిమోపవనమనబడుతుంది. **"పాలై"**- ప్రాంతాన్ని దాటి వెళ్ళే శ్రీరామలక్ష్మణులకు ఉపదేశించిన **"బలా, ఉపబలా"**- అనే మంత్రవిద్యవలె ఈ నాయకుని మాట నాయకికి తాపాన్ని తీరుస్తుందని భావం.

ఆళ్వార్లు తీవ్రమైన సంసారమార్గాన్ని దాటిన స్వభావాన్ని, భగవానుడు అభిమానించి, ఆదరించి వేంచేసి ఉండే దివ్యదేశాల భోగ్యతనుగూర్చి వారికి భాగవతులు పల్కి, వారి విరహవేదనను తీర్చడం ఈ పాశురానికి స్వాపదేశార్థం. ముందు రెండు పాదాలలో- "జ్యోతిర్మయరూపుడైన భగవానుని పలు రీతులలోని అవస్థలను (రూపాలను) మనస్సులో భావించి, పరిశీలించి, వాటిలో అసారమని

వదలి పెట్టిన, మిక్కిలి తీవ్రమైన సంసారాన్ని దాటి, మిక్కిలి కాంతిని పొందిన ఓ ఆళ్వార్లూ!" - అని సంబోధింపబడ్డారు. తరువాత గల రెండుపాదాలలో- పునరావృత్తిలేని లోకమైన పరమపదంలో ఉండే నిత్యసూరులు తిరిగి వచ్చి నివసించే రీతిలోని మహిమను కల అర్చావతార స్థలం- అతిసమీపమై, మిక్కిలి భోగ్యతను కల్గించేదై, ఏవిధమైన దుఃఖాన్ని కల్గించనిదై, క్షేమంకరమైన ఆశ్రయస్థానమై ఉన్నదని తెలుపబడింది.

**నాయకి నాయకుని మాలికను పొంది ఆనందించడం**

**27. శేమమ్ శెఙ్గోనరుళే, శెఱువారుమ్ నట్పాగువరెన్ఱు**
**ఏమమ్ పెఱవై యమ్శొల్లుమ్ మెయ్యే-, పణ్డెల్లా మఱై కూయ్**
**యామఙ్గడోఱెరి వీశుమ్ నఙ్గణ్ణన్ అన్దణ్ణన్దుళాయ్**
**త్తామమ్ పునైయ, అవ్వాడై యీదో వన్దు తణ్ణెన్ఱదే**

శెమ్ కోన్ అరుళే = (అన్ని వస్తువులకు) సాక్షాద్రక్షకుడైన భగవానుని కరుణయే, శేమమ్ = మంచిని (క్షేమాన్ని) రక్షించేది (అని భావించగా), శెఱు వారుమ్ నట్పు ఆకువర్ ఎన్ఱు = ప్రతికూలురు కూడా అనుకూలురు కాగలరు- అని, ఏమమ్ పెఱ = నిశ్చయాన్ని (నమ్మకాన్ని)పొందేటట్లు, వైయమ్శొల్లుమ్ = లోకులు పలికే, మెయ్యే = సత్యవచనాల రీతిలో, పణ్డు ఎల్లామ్ అఱై కూయ్ యామఙ్గళ్ తోఱు ఎరి వీశుమ్ = పూర్వకాలంలో అంతా విశ్లేషసమయంలో, పగబట్టి, ఎదురు వచ్చి, తగవుకు పిలిచి, రాత్రులంతా అగ్నిజ్వాలలను మాపై వీచే స్వభావాన్ని కల, అ వాడై= ఆ వాయువు, నమ్ కణ్ణన్ అమ్ తణ్ణమ్ తుళాయ్ తామమ్ పునైయ = మన నాయకుడైన భగవానుని అందమైన, చల్లని తులసీ మాలికను (మేము పొంది) ధరించినందున, ఈదో వన్దు తణ్ణెన్ఱదు = ఇదిగో వచ్చి, ఇపుడు చల్లగా ఉన్నది.

**భావదీపిక :** నాయకుడైన సర్వేశ్వరుని తులసీ మాలికను ధరించగల్గినందున ఇంతకు ముందు బాధిస్తున్న చల్లనిగాలి ఇపుడు ఉపశమనాన్ని కల్గించగా, దాని ఆ స్వభావాన్ని నాయకి మనస్సులో పెట్టుకొని పలికిన పాశురం ఇది. విశ్లేషాన్ని సహించలేక, మిక్కిలి బాధపడే నాయకికి ఒక రీతిలో ఉపశమనాన్ని కలుగజేయ దలచిన నాయకుడు రాత్రిసమయంలో సంశ్లేషించినట్లుగా స్ఫురింపజేసే పాశురంగా కూడా చెప్పవచ్చు.

ఎన్ని క్లేశాలు అడ్డుకొన్నా, వాటికి చలించకుండా, "భగవానుని కరుణయే మనలను రక్షిస్తుంది'' అనే నిశ్చయాన్ని కల్గి ఉంటే శత్రువులు కూడా మిత్రులవుతారు- అని లోకంలో పెద్దలు వచిస్తారు. అది ఇపుడు నిజమైనది. ఏవిధంగా? అంటే, చల్లని గాలి పూర్వం అంతా నాపై పగబట్టి ఎదిర్చి, యుద్ధానికి పిలచి, రాత్రులంతా అగ్నిజ్వాలలను నాపై వీచే స్వభావాన్ని కల్గి ఉండేది. కాని, ఇపుడు మన నాయకుని అందమైన, చల్లని తులసీమాలికను నేను పొంది, ధరించినందున, ఆ వాయువే, ఇదిగో! వచ్చి చల్లదనాన్ని కల్గిస్తున్నది సుమా! - అని నాయకి శేషమాలికను పొంది ఆనందించిన విషయాన్ని పల్కుతున్నది.

సహజంగా ఆనందాన్ని కల్గించే చల్లని గాలి, చంద్రుడు మొదలైన వస్తువులు విరహకాలంలో విరహోద్దీపకాలై, సంశ్లేషకాలంలో సంతోషాన్ని కల్గించేవిగా ఉండడం దీనివల్ల తెలుపబడింది.

సర్వేశ్వరుని గుణవిశేషాలను అనుసంధించి, అందువల్ల ఒక విధంగా విరహార్తికి ఉపశమనాన్ని పొందిన ఆళ్వార్లు, పూర్వం ఆ భగవానుని జ్ఞాపకం చేసి, నిరంతరం బాధించిన ఈ లోకంలోని వస్తువులు ఇపుడు భోగ్యతను కల్గి ఉండడాన్ని తెలుపడం దీనికి ధ్వన్యర్థం. భగవానుని కరుణయే రక్షకమైతే, అతనికి అణగి ఉండే అందఱు అనుకూలంగా ఉంటారు- అని నమ్మకం కలిగేటట్లుగా పెద్దలు పలికే సత్యవచనాను సారంగా, పూర్వం విరహాన్ని సహించ లేని స్థితిలో బాధించి, ఎదిర్చి, ఎల్లప్పుడు తాపహేతువైన లౌకికపదార్థజాతం భగవానుని అనుగ్రహాన్ని పొందగానే అను కూలించి, విరహక్లేశాన్ని ఉపశమింపజేసింది- అని అన్నందున భగవత్సంబంధాన్ని పురస్కరించుకొని చూచినపుడు లౌకికపదార్థాలు కూడా ఉద్దేశ్యాలు అవుతాయి- అని తెలుస్తుంది.

ఆచార్యహృదయమనే గ్రంథంలోని రెండవ ప్రకరణం చివరలో గల చూర్ణికలోని **"పన్దు క*ழ*ల్ పావై కు*ழ*మణమ్ యా*ழ்* తెన్దల్ మదియమ్ అడిశిల్ శాన్దమ్ పూణ్ అకిల్ శి*ற்ற*ిల్ తూదై ముదలావన"** అని ఆరంభించి, **"మదీయ మెన్నిల్ విట్టకలవుమ్, తదీయమెన్నిల్ ఇక*ழ்*వఱవుమ్ మునివదు మిక్కాల్ మీదో వెన్నప్పడుమ్ పొజైమ్మునలిల్ సమూహమ్"** అనే సూక్తికి శ్రీవరవరమునులు కృపజేసిన వ్యాఖ్యాన శ్రీసూక్తులు అనుసంధేయాలు.

## నాయకుని విశ్లేషించిన నాయకి చల్లగాలికి తాళలేక బాధపడడం

28. తణ్ణన్దుழாయ్ వళైకొళ్వదు యా మిழప్పోమ్, నడువే
వణ్ణమ్ తుழாవి ఓర్ వాడై యులావుమ్-, వళ్వాయలగాల్
పుళ్ నన్దుழாమే పొరునీర్ త్తిరువరఙ్గా! అరుళాయ్
ఎణ్ణమ్ తుழாవుమిడత్తు, ఉళవో? పణ్డు మిన్నన్నవే

వళ్ వాయ్ అలకాల్ = పదును కల నోటి చివరి భాగంతో (ముక్కుతో), పుళ్ = పక్షులు, నన్దు ఉழாమే = (తనలో ఉండే) శంఖాలను పొడిచి బాధించ కుండా (పొడవకుండా) ఉండేటట్లు, పొరు = అలలను వీచే, నీర్ = కావేరీ నదీ జలాలచే పరివేష్ఠితమైన, తిరు అరఙ్గా = శ్రీరంగమనే దివ్యక్షేత్రాన్ని కలవాడా!, తణ్ అమ్ తుழாయ్ = చల్లని, అందమైన నీ తులసి, వళై కొళ్వదు = చేతిగాజులను కొల్లగొడుతున్నది, యామ్ = నీపట్ల అభినివేశాన్ని కల్గిన మేము, ఇழప్పోమ్ = చేతిగాజులను పోగొట్టుకొంటున్నాము (ఈ విధంగా ఉండగా), ఓర్ వాడై = (మాతో తనకు ఏవిధమైన సంబంధం లేని) ఒక వాయువు, ఇడైవే = మధ్యలో ప్రవేశించి, వణ్ణమ్ తుழாవి ఉలావుమ్ = నా లావణ్యాన్ని అపహరించాలని తడవి వెదకుతూ సంచరిస్తున్నది, అరుళాయ్ = (దానికి మా లావణ్యం కోల్పోని రీతిలో) వచ్చి రక్షించు, ఎణ్ణమ్ తుழாవుమ్ ఇడత్తు = మనస్సు క్లేశపడే సమయంలో కూడా, పణ్డుమ్ ఇన్నన్న ఉళవో = పూర్వం కూడా ఇటువంటి మా అవస్థలవంటి స్థితులు వేటెక్కడైనా ఎవరికైనా ఉన్నవా? (కల్గినవా?)

**భావదీపిక** : గడచిన పాశురంలో ప్రస్తావింపబడి పరాంకుశ నాయకికి సంభవించిన సంశ్లేషం కలలోని దృశ్యంవలె అయినందున క్షణికమైనది. మళ్ళీ, పూర్వపు విశ్లేష వ్యసనమే కల్గింది. అందువల్ల నాయకుని విశ్లేషించిన నాయకి చల్లగాలికి బాధపడుతూ పలికే పాశురం ద్వారా ఆழ్వార్లు తమ క్లేశాన్ని వ్యక్తం చేస్తున్నారు. ఆర్త్యతిశయంవల్ల నాయకుడు సాక్షాత్తు ఎదురుగా ఉన్నట్లుగా భావించి, మధ్యమ పురుషలో సంబోధించిన పాశురం ఇది. లేక, ప్రత్యక్షసమానాకార రూపంగా నాయకుని దర్శనాన్ని మానసికంగా పొందిన నాయకి నాయకుని చూచి పల్కుతున్నదని కూడా చెప్పవచ్చు.

నీతో సాక్షాత్ సంబంధాన్ని పొందిన తులసి విశ్లేషకాలంలో సంశ్లేషాన్ని గుర్తుకు తెచ్చి, చాలా క్లేశాన్ని కల్గించి, దేహాన్ని కృశింపజేయడం, దానికి తట్టుకోలేక, నేను

కృశించి, చేతిగాజులను జార్చుకోవడం- ఇదంతా యుక్తం కావచ్చు. అంతేకాక, **"భీషాస్మాద్వాతః పవతే"** (భగవానునివల్ల భీతిని పొందినవాడై, (అతని ఆజ్ఞకు లోబడి) వాయువు వీస్తున్నాడు.) అనే ఉపనిషద్వాక్యానుసారంగా, సహజంగా నీకు భయపడి నడచే స్వభావాన్ని కల వాయువు నీ సంబంధాన్ని కల్గిన మమ్మ సమయాన్ని చూచి బాధించి కొల్లగొట్టాలని చూడడం తగినదా ? వాయువు నన్ను బాధించడానికి ఏమి ప్రాప్తి (సంబంధం) ఉన్నది? ఆవిధంగా అది చేయకుండా నన్ను రక్షించాలి. నీపట్ల ప్రేమను కలవారిలో నా వలె బాధపడినవారు, నీచే ఉపేక్షింపబడినవారు ఇది వరకు ఎక్కడా ఎవరూ లేరు సుమా!- అని అంటున్నారు. తులసి నన్ను కావాలంటే ఎంతవరకైనా బాధించనీ. దానికి నేను సమ్మతించవలసిన దాననై ఉన్నాను- అనే అభిప్రాయంతో పల్కిన సూక్తి కాదు, అది. వాయువు నన్ను హింసించడమనేది ఏ రీతిలోను యుక్తం కాదు- అని దృఢంగా పల్కడంలోనే ఇది దృష్టిని కల్గినది. ఒకవైపు తులసి బాధించడం, ఇంకొకవైపు వాయవు బాధిస్తూ వీచి, క్లేశపెట్టడం- ఈవిధంగా రెండు హింసించే వస్తువులకు అవకాశాన్ని ఇవ్వడం నావల్ల కావడం లేదు. ఈ హింసకు అవకాశం లేకుండా సంశ్లేషాన్ని నాకు కల్గించు- అని భావం.

విరహంలో ఉండేవారిని హింసించడంలో వేఱు ఏ సహాయం అక్కరలేకుండా అసహాయశూరమైన వాయువు -అని తెలుపగోరి- **"ఓర్ వాడై"** (అద్వితీయమైన గాలి) అని అనబడింది. **"ఉలావుమ్"** అని అన్నందున వాయువుయొక్క గంభీరమైన సంచారం సూచింపబడింది. **"వళ్వాయ్ అలకాల్ పుళ్వన్తుళ్ళామే పొరునీర్ త్తిరువరజ్గా!"** అని సంబోధనవల్ల నీ దేశానికి కావలసిన చల్లని నీరు ఇచ్చి, తనను ఆశ్రయించని వస్తువును శత్రువు అపహరించిన రీతిలో కెరటాలనే చేతులతో రక్షిస్తున్నదే ! నీకుమాత్రం అది స్వభావం కాదా ! ఆశ్రయించినవారిని రక్షించే స్వభావం అచేతనవస్తువుకే ఉన్నపుడు పరమచేతనుడవైన నీకు అది మిక్కిలిగా ఉండవద్దా?- అని సూచింపబడింది. కావేరీనదీజలంలోని అలలు తీరాన్ని తాకడం సహజమే అయినా, తనవద్ద ఉండే నత్తలను (శంఖాలను) పక్షులు పొడిచి, తమ పదునైన ముక్కు చివరి భాగంతో పొడవకుండా ఉండడంకోసం అలలు తాకుతున్నట్లు వర్ణించడం ఒక వాక్చమత్కారం. **"ఉళ్ళామే"**- ఇది **"మే"** అనే ప్రత్యయం చేరిన వ్యతిరేకార్థక కృదంతరూపం. **(ఎదిర్మఱై వినైయెచ్చమ్)** **"ఉళ్ళుదల్"**- ముక్కుతో పొడవడం.

**"అరుళాయ్"**- ఇది **"శెయ్యాయ్"** అనే అర్థాన్ని ఇచ్చే జాతీయ ప్రయోగం. **(వాయ్ప్పాడుచ్చొల్)** ఇది అనుకూల-వ్యతిరేకార్థాలను రెండిటిని ఇస్తుంది. "నీవు అనుగ్రహించాలి- అనే అర్థంవలె, "నీవు అనుగ్రహించడం లేదు- అనే అర్థాన్ని కూడా దీనికి గ్రహించవచ్చు.

భగవానుని దరి చేరలేని దశలో ఈ లౌకిక పదార్థాలన్నీ అతని భోగ్యతనుగూర్చి స్మరింపజేస్తున్నవై, అవి తనను బాధించే స్థితినిగూర్చి ఆళ్వార్లు ఆ భగవానుని ఉద్దేశించి సంబోధించి పల్కడం దీనికి ధ్వన్యర్థం.

**(తణ్ణన్తుళాయ్ వళైకొళ్వదు యామిళప్పోమ్)**- చల్లని స్వభావాన్ని, అందమైన గుణాన్ని కల్గిన నీ భోగ్యత మా అనన్యార్హశేషత్వాన్ని అపహరించి, కొల్లగొట్టనీ. దానిని నీ భోగ్యతకోసంగా మేము కోల్పోతాము. అంతేకాక.

**(ఒర్ వాడై నడువే వణ్ణన్తుళావి ఉలావుమ్)**- నీ ఆజ్ఞను అనుసరించి వర్తించదగిన లౌకికపదార్థాలు నా రూపాన్ని మార్చివేసే స్వభావాన్ని పొందాయి.

**(పుళ్ నన్దు వళ్వాయ్ అలకాల్ ఉళామే పొరుమ్ నీర్ తిరువరఙ్గా!)**- వంచనా స్వభావాన్ని కల మాయ (ప్రకృతి) శుద్ధస్వభావాన్ని కల ఆత్మను క్రూరమైన ప్రాక్తన పాపాలమూలంగా బాధించని రీతిలో అడ్డుకొని రక్షించే గుణాన్ని కల్గిన ఓ శ్రీరంగనాథా!- అని భావం.

**(అరుళాయ్)**- అదే రీతిలో మా వద్దకూడా కరుణ చూపు.

**(ఎణ్ణమ్ తుళావు మిడత్తు వణ్ణమ్ ఇన్నన్న ఉళవో)**- దుఃఖంతో మనస్సు తల్లడిల్లే స్థితిలో కూడా ఈ రీతిలో కరుణ చూపకుండా ఉండే స్వభావం నీకు పూర్వం ఉన్నదా? లేదని భావం. శ్రీజానకీదేవి, ద్రౌపది, గజేంద్రాళ్వాన్, ప్రహ్లాదుడు, విభీషణుడు, కాకాసురుడు మొదలైన అంతు లేనంతమంది దాసుల విషయంలో అంతా నీవు ఇటువంటి ఉపేక్ష చేయలేదే! నాకే ఈవిధంగా అయినదే- అని హార్దభావం. **"ఇన్నన్న"**- **"ఇన్న+అన్న"** అనే పదాల సంధిరూపం. ఇటువంటివి, ఇటువంటివి - అని అర్థం. **"వణ్ణన్తుళావు మిడత్తు"** అనేదానికి - మనస్సులో పరిశీలించి గమనించినపుడు - అనే అర్థాన్ని గ్రహించడంకూడా తగును. నీ గుణాలను విచారించి చూస్తే, ఇటువంటి ఉపేక్ష వేఱెవ్వరి విషయంలోను కన్పడడంలేదు. పాపి అయిన నాకే ఈ విధంగా జరిగింది- అని తాత్పర్యం.

**"వళ్వాయలకాల్... తిరువరఙ్గా అరుళాయ్"** అనే సూక్తిని పెరియవాచ్చాన్‌పిళ్ళై వివరించేటపుడు శరణు పొందినవారిని దుఃఖం పొందకుండా కాపాడి తీరాలి- అనేదానికి ఒక ఐతిహ్యాన్ని ఉట్టంకించారు.

ఒక స్త్రీ తప్పుచేసింది - అని భట్టర్ వద్దకు వచ్చి కొందఱు చెప్పారు. వారు ఆమెను దండించడానికి వారు భట్టర్ వద్ద అనుమతిని వేడారు. అపుడు భట్టర్ "అన్నిటినీ విడచిపెట్టి ఈ శ్రీరంగంలో నివసించడమే ప్రాప్యంగా ఈమె తలచి ఇక్కడ ఉన్నది. ఈవిధంగా శ్రీరంగంలో నిత్యవాసం చేయాలని కోరిన ఈమెను ఏవిధంగా దండించడం సాధ్యం? - అని అన్నారట.

ఈ సందర్భంలోనే ఇంకొక ఐతిహ్యం కూడా ప్రస్తావింపబడింది. వీరసుందరుడనే ప్రభువుతో ఎమ్బార్‌కు ఒక పర్యాయం అభిప్రాయభేదం ఏర్పడింది. అది క్రమంగా వారిద్దరి మధ్య విరోధంగా మాఱింది. ఆ స్థితిలో, వీరసుందరుని విరోధి ఒకడు అతనికి భయపడి ఎమ్బార్‌వద్దకు వచ్చి శరణు వేడాడు. అపుడు అక్కడ ఉండేవారు "ఇంతకుముందే మీకు వీరసుందరునితో వైషమ్యం కల్గింది. ఇతనిని ఇపుడు మీరు అంగీకరించవలసి ఉన్నదా?'' అని అన్నారు. అపుడు ఎమ్బార్ "మనలను శరణు పొందినవారిని మనం కాపాడితే, ఆ శరణాగతి ధర్మమే మనలను అందఱిని రక్షిస్తుంది'' అని బదులిచ్చారు.

## నాయకి హంసతో గర్హిస్తూ పల్కడం

**29. ఇన్నన్న తూదెమ్మై ఆళ *ఱ్ఱి* ప్పట్టిరన్దాళివళెన్టు,**
**అన్నన్న శొల్లా ప్పెడై యొడుమ్బోయ్‌వరుమ్-, నీలముణ్డ**
**మిన్నన్న మేని ప్పెరుమానులగిల్ పెణ్ తూదు శెల్లా**
**అన్నన్న నీర్మైకొలో!, కుడి చ్చీర్మైయిలన్నఙ్గళే**

కుడి శీర్మై ఇల్=ఆభిజాత్యం వల్ల (గొప్ప వంశంలో పుట్టినందువల్ల) కలిగే వైలక్షణ్యాన్ని లేని, (గొప్పవంశంలో పుట్టని), అన్నఙ్గళ్ = ఈ హంసలు, (ఏమి చేస్తున్నవి? అని అంటే), ఇవళ్ = ఈ పరాంకుశనాయకి, ఆళ్ అ*ఱ్ఱ*మ్ పట్టు = తనకు వేఱు వ్యక్తి లేనందువల్ల, ఇన్నన్న తూదు = ఇటువంటి దూతగా, ఎమ్మై = మమ్ములను, ఇరన్దాళ్ ఎన్టు = తన మనోరథాన్ని తెల్పి, నమస్కారపూర్వకంగా ప్రార్థించింది- అని తలచి, అన్నన్న శొల్లా = అటువంటి దూతవచనాలను

(నాయకుని వద్దకు పోయి) చెప్పకుండా, పెడై యొడుమ్ = (తనకు ఇష్టమైన) పెంటి పక్షులతోనే (మందగతితో ఆనందంగా) విహరిస్తున్నాయి. (దీనికి కారణం), నీలమ్ ఉణ్డ = నీలవర్ణాన్ని లోపల కల్గిన, మిన్ అన్న = మెఱుపువంటి, మేని = తిరుమేనిని కల్గిన, పెరుమాన్ = భగవానునకు చెందిన, ఉలకిల్ = లోకంలో, పెణ్ తూదు శెల్లా = స్త్రీలకోసం దౌత్యం చేయడం లేని, అన్నన్న నీర్మైకొలో = అటువంటి స్వభావాన్ని కల్గి ఉండడమేనా!

**భావదీపిక :** నాయకి హంసలను ఉద్దేశించి నిష్ఠూరంగా పలికే పాశురం ఇది. తన నాయకుని వద్దకు దూతగా వెళ్ళమని అపేక్షించినప్పటికీ, ఆ పనిని చేయకుండా, తన ఆడ హంసలతో ఉల్లాసంగా సంచరించే మగహంసలను ఉద్దేశించి, నిష్ఠూరంగా నాయకి పల్కుతున్నది. ఈ ప్రక్రియ తిరుక్కోవైయార్ అనే గ్రంథంలో **"అన్నమోడు అళిదల్"** (హంసతో నిష్ఠూరాలు పల్కడం) అని తెలుపబడింది. **"ఉలకమెల్లామ్ తుయిలానిఙ్గ ఇన్నిలమై క్కణ్ణుమ్ యాన్ తుయిలామైక్కు క్కారణ మాకియ ఎన్ వరుత్తత్తై చ్చెన్ఱు అవర్క్కు చ్చొల్లాదు, తాన్ తన్ శేవలై ప్పొరున్ది క్కవఱ్చి యన్ఱి త్తుయిలానిఙ్గదు- ఎన అన్నత్తోడు అళిన్దుకూఱై నిగ్ఱల్"** (లోకం అంతా నిద్రించే ఈ సమయంలో కూడా నేను నిద్రించక పోవడానికి కారణమైన నా విరహవ్యథను గూర్చి నాయకుని వద్దకు పోయి, అతనికి తెలుపకుండా, తాను తన పెంటి పక్షితో పొందికగా ఏవిధమైన ఆందోళన లేకుండా నిద్రిస్తున్నది- అని హంసతో నిష్ఠూరంగా పల్కడం) అనేది ఆ సందర్భంలోని వ్యాఖ్యానం.

సాక్షాత్తు పురుషోత్తముడైన సర్వేశ్వరుని విషయంలో దూతగా పోవడమనేది, తక్కువగా ఉండేవారి విషయంలో దూతగా పోవడంవలె నింద్యమైనది కాదు, సరికదా, శ్లాఘించదగినది- అనే విషయం స్ఫురించేటట్లు **"ఇన్నన్న తూదు"** అని చెప్పబడింది. భగవానుని వద్ద స్వయంపురుషార్థంగా వెళ్ళాలని కోరడం యుక్తం. అది లేకపోయినా, ఇతరులకోసం దూతగా వెళ్ళే నెపంతో అయినా పోవడం తటస్థిస్తే, అది పరమభాగ్యమని తలచి పోవచ్చు కదా! వేగంగా దూతగా వెళ్ళడానికి తగిన రెక్కలను కల్గి ఉండడం మొదలైన సాధన సంపత్తిలో ఏ కొఱత లేకపోవడాన్ని ఉద్దేశించి కదా, ఈ హంసలను నేను దూతగా వెళ్ళమని అర్థించాను. మా వల్లకాదనే అశక్తతను తెలిపి, నిరాకరించే రీతిలోని ప్రాణినా, నేను ప్రార్థించాను! నవవ్యాకరణ

పండితుడైన హనుమానుని వంటివారిని ప్రార్థించడానికి తగిన దూత్యం మనకు లభించింది కదా ! అని ఇవి భావిస్తున్నట్లు లేదు. వెళ్ళిరాకుండా ఇక్కడే ఉన్నప్పటికీ, దోషం లేదు. తమ కార్యంకోసం పెంటిపక్షితో సంతోషంగా అక్కడ ఇక్కడ సంచరిస్తున్నాయి. ఆ విధంగా సంచరించేటపుడు, నా కార్యంకోసం వెళ్ళవచ్చుకదా! అది కూడా లేదే ! నా స్త్రీత్వాన్ని చూడకుండా, తాను పక్షి అనే సంగతి చూడకుండా, మనలను ఈమె అర్థిస్తున్నది కదా! ఈ పనిని కొంచెం చేయాలి'' అని కూడా జాలిపడడం లేదు. వేఱు వ్యక్తిని చూపించి, తాము ఈ పనినుండి తొలగిపోవడానికి అవకాశం లేని రీతిలో, (తామే చేయవలసిన) నిస్సహాయంగా ఉండే నా స్థితిని కూడా ఇవి గమనించడం లేదే! - అని పరాంకుశనాయకి క్లేశపడుతున్నది.

తన ప్రార్థనలోను ఏ కొఱత లేదు, హంసశక్తిలోను ఏ కొఱత లేదు. అయినా, ఇవి దూత్యం చేయకపోవడానికి ఏమి కారణం ఉండి ఉంటుంది? అని పరాంకుశ నాయకి గమనించి చూపింది. పూర్వపు ఇతిహాసాలలో హనుమానుని దూత్యం, శ్రీకృష్ణుని దూత్యం, నలుని దూత్యం మొదలైన వృత్తాంతాలలో పురుషులకోసమే దూతగా వెళ్ళడం సంప్రదాయంగా కన్పిస్తున్నందున స్త్రీకోసం దూతగా వెళ్ళడం తగదు- అని ఇవి భావించాయా!- అని ఉత్తరార్ధంలో నాయకి పల్కుతున్నది. తన అభిప్రాయానుసారం వెళ్ళనందున **"కుడిచ్చీర్మైయిల్ అన్నఙ్గళ్"** అని అంటూ కులాన్ని సైతం నిందిస్తున్నది. **"నలత్తిన్కణ్ నారిన్మై తోన్ఱిన్, అవనై క్కులత్తిన్ కణ్ ఐయప్పడుమ్"** (సద్గుణం విషయంలో సందేహం కల్గితే, అతనికులం విషయంలో కూడా సందేహం కల్గుతుంది) అనే రీతిలో ఉన్నతకులంలో పుట్టిన వారికి స్వభావసిద్ధమైన తీయని మాట, ప్రార్దనను తిరస్కరించకపోవడం, ఉపకారం మొదలైన సద్గుణాలు లేనపుడు కులహీనత చెప్పబడుతుంది కనుక, ఈ సద్గుణాలు వీటిలో లేనందువల్ల **"కుడిచ్చీర్మై ఇల్"** అని అనబడింది. భగవానుని తిరుమేనిలో ఉండే నల్లని రంగును, దివ్యతేజస్సును ఉద్దేశించి, **"నీలముణ్డ మిన్నన్న మేని ప్పెరుమాన్"** అని అనబడింది. **"మిన్ ఉణ్డ నీలమన్నమేని"** అని మార్చి అన్వయించి, మెఱపుతీగను నడుమ కల్గిన నీలమేఘంవంటి తిరుమేని- అని వివరిస్తే, అపుడు **"మిన్నమ్"**- అనేది వక్షస్సులో నిత్యవాసం చేసే లక్ష్మీదేవికి, **"మేకమ్"**- అనేది తిరుమేనికి ఉపమానాలు.

స్వాపదేశంలో - **"తూతు"** అనేది ఆచార్యవిషయమంటారు. భగవానుని దగ్గరకు చేరలేని ఆళ్వార్లు తమ ఎవరైనా ఆర్తిని ఒకరి ద్వారా స్వామికి తెలుపాలని

భావించి, తాము కోరినప్పటికీ, ఎవరూ తగినవారు లభించక, వారు వారు తమ తమ కార్యాలలో నిమగ్నులై ఉండగా, ఆ*ழ்*్వార్లు నిష్ఠూరంగా పలికే మాట -ఈ పాశురంలోని ధ్వన్యర్థం. హంస తెల్లని రంగును కల్గినది. పక్షులలో గొప్పది. పాలను, నీటిని వేఱు చేసి, నీటిని విడచి, పాలను గ్రహించే స్వభావాన్ని కల్గినది. అదే రీతిలో, సత్త్వగుణ పరిపూర్ణుడై, మిగిలిన వారికంటే గొప్పవాడై, విలక్షణుడై, సారాసారాలను వివేకించి తెలిసి, అసారాన్ని వదలి, సారాన్ని గ్రహించే స్వభావాన్ని కల్గినవాడైన గొప్ప ఆచార్యులు -ఈ పదంద్వారా వివక్షితులు.

రెండవ పాదంలో **"శొల్లా"**- అనే పదానికి చెప్పకుండా- అని అర్థం. చివరి భాగం (**"ఈఱు"**) లోపించిన వ్యతిరేకార్థక కృదంతం. (**"ఎదిర్మఱైయిన్ వినై యెచ్చమ్"**)

**నాయకి హంసలను, నారపక్షులను దూతలుగా పొమ్మని అర్థించడం**

**30. అన్నమ్ శెల్వీరుమ్ వణ్డానమ్ శెల్వీరుమ్ తొ*ழு*దిరన్దేన్,**
**మున్నమ్ శెల్వీర్గళ్ మఱవేల్మినో-, కణ్ణన్ వైగున్దనోడు**
**ఎన్నెఞ్జినారై క్కణ్డాల్ ఎన్నై చ్చొల్లి అవరిడై నీర్**
**ఇన్నమ్ శెల్లీరో, ఇదువో తగవెన్నిశైమిన్గళే**

అన్నమ్ శెల్వీరుమ్ = ఆకాశంలో ఎగిరి సంచరించే హంసలనే మిమ్ములను, వణ్డానుమ్ శెల్వీరుమ్ = (ఆ విధంగానే) సంచరించే నార పక్షులనే మిమ్ములను, తొ*ழு*దు ఇరన్దేన్ = నేను నమస్కరించి ప్రార్థిస్తున్నాను, (ఏమని? అంటే), మున్నమ్ శెల్వీర్కళ్ మఱైవేన్మినో = మీలో ముందు వెళ్ళేవారు (నా ప్రార్థనను) మఱచి పోకుండా ఉండండి, కణ్ణన్ వైకున్దనోడు = శ్రీకృష్ణావతారాన్ని ఎత్తినవాడు, పరమపదనాథుడైన భగవానునితో, ఎన్ నెఞ్జినారై కణ్డాల్ = (పూర్వం అక్కడ వెళ్ళిన) నా మనస్సును (అక్కడ మీరు) చూస్తే, ఎన్నై శొల్లి = (దానితో మీరు) నన్ను గూర్చి పల్కి, అవరిడై నీర్ ఇన్నమ్ శెల్వీరో = ఆస్వామి దగ్గరకు మీరు ఇంకా చేరకుండా ఉన్నారా?, ఇదు తకవో = ఇది తగినదేనా!, ఎన్ను ఇశైమిన్కళ్= అని పల్కండి.

**భావదీపిక :** నాయకుని విశ్లేషించిన నాయకి, హంసలను, నారపక్షులను దూతలుగా వెళ్ళమని ఇందులో అర్థిస్తున్నది. భగవానుని దగ్గరకు దూతగా పొమ్మని

ప్రార్థించడం లేదు. తనను విడచి, నాయకుని వెంట పోయిన తన మనస్సు దగ్గరకు దూతగా వీటిని పంపిస్తున్నది. మనస్సు తనను విడచిపెట్టి పోయినదని, అందువల్ల దాని దగ్గరకు దూతగా పంపిస్తున్నాని అనడం ఒకవిధమైన ఉక్తి చమత్కారం. నాయకుని వద్దనే నాయకి మనస్సు బాగా నిలచి ఉన్నది- అనేది దీనివల్ల స్ఫుటమవుతుంది. "నీరిరుక్క మడమజ్ఞైమీర్! కిళికళ్ తామిరుక్క మదుకరమెల్లామ్ తామ్ నిఱ్ఱైన్దిరుక్క, మడవన్న ముళ్ళనీరైయా యిరుక్క పుఱైయామల్ యాన్, ఆరిరుక్కిలుమ్ ఎన్నెఞ్జ మల్లదొరు వఞ్జమ*ద్రీఱ* తుణై యిల్లై యెన్ఱాదరత్తినోడు తూతువిట్ట పి*ళ్ళై*యారిడత్తు రైశెయ్దూఱువేన్, శీరిరుక్కు మఱై ముడివు తేడరియ తిరువరజ్గరై వణజ్గియే తిరుత్తు*ళ్ళా*య్ తరిల్ విరుమ్బియే కొడు తిరుమ్బియే వరుదలిన్ఱియే, వారిరుక్కు ములైమలర్ మడన్దైయుడై మార్బిలే పెరియతోళిలే మయజ్గీ యిన్బుఱ ముయజ్గీ ఎన్నైయు మఱన్దు తన్నైయు మఱన్దదే" (అమాయకత్వాన్ని కల చెలులారా! ఎదురుగా మీరంతా ఉండగా, చిలుకలు ఉండగా, తుమ్మెదలు అన్నీ ఉండగా, అందమైన హంసలు అన్నీ గుంపులుగా ఉండగా, వీటికి దూతలగా పంపకుండా, నేను వేరెవ్వరున్న నా మనస్సు తప్ప, ఇంకొక వంచన చేయని సహాయము లేదని తలచి, ఆదరంగా దానిని స్వామి వద్దకు దూతగా పంపిన దోషాన్ని గూర్చి ఏమని చెప్పను? గొప్ప వేదాంతాలు కూడా అన్వేషించలేని శ్రీరంగనాథుని దర్శించి, నమస్కరించి, అతడు తన తులసిని ప్రసాదంగా ఇస్తే తీసుకొని, తిరిగిరాకుండా, కంచుకాలపు తగి ఉండే స్తనాలను కల లక్ష్మీదేవిని వక్షస్సులో కల ఆ స్వామి బాహువులలో వ్యామోహాన్ని పొంది నా మనస్సు నన్ను మరచి పోవడమేకాదు, తనను కూడా మరిచిపోయింది.) అనే తిరువరజ్గక్కలమ్బకమ్ లోని పాశురం ఇక్కడ స్మరణీయం.

"వణ్డానమ్"- అనేది జల పక్షులలో ఒక జాతి. హంసలు, "వణ్డానమ్" అనే జలపక్షులు సహజంగా ఆకాశంలో ఎగిరి సంచరిస్తాయి. ఆకాశంలో ఎగిరేవి అన్నీ భగవానుని సేవించడం కోసం పరమపదంవైపు వెడుతున్నాయి- అనేది ఈ ఆళ్వార్ల అభిప్రాయం కాబోలు. అందువల్ల "ఓ పక్షులారా! మిమ్ములను నా శిరస్సుతో నమస్కరించి యాచిస్తున్నాను. మీరు చాలా వేగంగా వెడుతున్నారు. మీలో మునుముందుగా పరమపదానికి చేరేవారు నా వేడికోలును మఱచి పోకుండా నెరవేర్చాలి. అది ఏది? అంటే, నామనస్సు (గారు) వైకుంఠనాథుని ఇక్కడకు వేంచేపు చేసికొని రావడం కోసమో, లేక ఏదైనా ప్రసాదాన్ని పొంది రావడం కోసమో

నిత్యవిభూతికి వెళ్ళారు. ఇంకా తిరిగి రాలేదు. నేను ఇక్కడ ఈ లోకంలోనివారిచేత ఉపేక్షింపబడి, చింతచెట్టు కింద ఉన్నప్పటికీ, అక్కడకు వెళ్ళిన నామనస్సు అక్కడ ఉండేవారిచేత గౌరవింపబడి, దివ్యసింహాసనంలో అమరి ఉండి, **"పరాక్! స్వామీ! పరాక్", "అరుళప్పాడు నమ్మాళ్వార్ నెఞ్జినార్!"** అని పరివేష్ఠనంతో అలంకరింపబడి, అతిశయం స్ఫురించేటట్లుగా వేంచేసి ఉంటుంది. భగవానుని అంతరంగ సన్నిధానంలో ఉంటుంది. చూడగానే మీరు వారిని "ఇది ఆళ్వార్ల మనస్సు" అని గుర్తించవచ్చు. దానిని చూచి "ఓయ్! నీవు కురుకూర్‌శడకోపన్ అనే పరాంకుశ నాయకి యొక్క మనస్సువు కదూ!" అని దానికి నన్ను జ్ఞాపకం చేసి, "నిన్ను ఇక్కడకు ఆయన పంపి ఎన్నాళ్ళయినదని! ఇంకా ఇక్కడే ఉన్నావే! వచ్చిన కార్యాన్ని ఒకటికి రెండు సార్లు గమనించి, పూర్తి చేసి తిరిగి రాకుండా, ఇక్కడే ఈ విధంగా ఆలస్యం చేయడం తగునా? అంతరంగమని ఆయన నిన్ను దూతగా పంపినందుకు ఇదేనా తగిన పని !" అని గట్టిగా చెప్పండి- అని అంటున్నది, నాయకి.

**(తొழుదు ఇరన్దేన్)- "తొழుదు"** అని అన్నందున కాయికమైన ప్రార్థన, **"ఇరన్దేన్"** అని అన్నందున వాచికమైన ప్రార్థన చెప్పబడ్డాయి. **"యన్మనసా ధ్యాయతి తద్వాచా వదతి తత్కర్మణా కరోతి", "మనః పూర్వో వాగుత్తరః"** అని శ్రుతి కనుక, వాచిక - కాయికాలతో అవినాభావ సంబంధాన్ని కల (వాటికి కారణమైన) మానసికప్రార్థన ఈ రెండిటివల్ల స్వయంగా వ్యక్తమవుతుంది. అందువల్ల, మనస్సు, వాక్కు, చేష్ట (శరీరం)- అనే త్రికరణాల ద్వారా పక్షులను నాయకి శరణు వేడడం ఇక్కడ స్ఫురిస్తుంది. ఈవిధంగా శరణు పొందేవారి వేడికోలు నిరాకరించదగినది కాదని భావం.

**"మఱవేన్మినో"**- అని అన్నందున, దీనికి ముందు ఈ రీతిలోనే కొన్ని పక్షులను వద్ద తాము పల్కి వాటిని దూతలుగా పంపడం, అవి మఱిచిపోవడం వ్యక్తమవుతుంది. **"ఇవళ్ ప్రకృతియై యఱియుమ్ నాయకన్ మఱన్దాన్. అవన్ కైపిన్నే పోననెఞ్జమ్ మఱన్దదు. ఇని, యార్‌దాన్ మఱవాదార్?"** (ఈమె ప్రకృతిని తెలిసిన నాయకుడు మఱచాడు. అతని వెంట పోయిన మనస్సుకూడా మఱచింది. ఇక, ఎవరు మఱచిపోరు?) అని నమ్పిళ్ళైఈడు వ్యాఖ్యలోని రసోక్తి. మఱచిపోవడం అనేది మీకు సహజం కాకపోయినా, అతనితో స్నేహంవల్ల మఱవడం సంభవించవచ్చు. ఆ విధంగా మఱువవద్దు- అని భావం. **"కణ్ణన్"** అనేది సౌలభ్యావాచకం. **"వైకున్దన్"** అనేది పరత్వవాచకం. **"కణ్ణన్ వైకున్దనోడు ఎన్ నెఞ్జినారై కణ్డాల్"**

అని పల్కినందున తన సౌలభ్యాన్ని ముందు చూపించి, నా మస్సును అపహరించి, తన పరత్వంతో నన్ను ఇంతవరకు అపహరించకుండా నిలచినవానివద్దకు నా మనస్సు వ్యర్థంగా పోయి చేరి అల్లాడుతున్నది- అనే అర్థం స్ఫురిస్తుంది. నాయకుని వద్ద తనకు ఉండే గౌరవం వల్ల అతని వద్దకు పోయిన తన మనస్సును **"నెఞ్జినార్"** అని గౌరవంగా (బహువచనంలో) పల్కింది.

"పరమపదనిలయుడైన భగవానుని దర్శిస్తే దర్శించవచ్చు. అతనిని వద్దకు చేరిన బలంవల్ల గర్వించినది, అతని అంతరంగపరివారంలో తాను కూడ ఒకటిగా ఉండేది అయిన (నా) మనస్సును దర్శించడం మాత్రం అరుదు"- అనే అర్థం స్ఫురించేటట్లుగా **"వైకున్దనోడు నెఞ్జినారై క్కణ్డాల్"** అని అన్నది. (ఇది **"ఆల్"** - అనే ప్రత్యయార్థం)

**(ఎన్నై చ్చొల్లి)** ఆ మనస్సుకు యజమాని నేను- అనే విషయం, అది నా సొత్తు- అనే విషయం స్ఫురించేటట్లు పల్కి- అని భావం. అందువల్ల, వీటిని అన్నిటిని మనస్సు మఱచిపోవడం స్ఫురిస్తుంది. పురుషోత్తముడైన గొప్ప నాయకుని తాను కూడినందువల్ల కల్గిన గౌరవాన్నిబట్టి తనను (మనస్సును) ఇతరులు గౌరవంగా పలికే రీతిలో **"అవర్"** అని అనబడింది.

**(అవరిడైనీర్ ఇన్నమ్ శెల్వీరో)**- "ఓ ఆఴ్వార్ల మనస్సుగారూ! మీరు వచ్చేటపుడే ఆర్తి మిక్కిలిగా కల్గిన ఆఴ్వార్లకు అంతఃకరణమైన మీరు వారి బాధను గ్రహించి, తీర్చకుండా, నాయకుని కోసమేకాకుండా, మీ కోసంకూడా ఆయన (మమ్మలను) దూతలుగా పంపించేటట్లుగా మీరు ఇంకా రాకుండా ఉండవచ్చునా?" అని పల్కండి.

ఎగిరి పోయే పక్షులలో "ఇది ముందు పోతుంది" అని తెలియనందున **"శెల్వీర్‌కళ్"** అని, **"మఱవేన్మినో"** అని, **"ఇశైమిన్‌కళ్"** అని బహువచనంలో నాయకి పల్కింది. జీవకచింతామణి అనేగ్రంథంలో **"తనిక్కయత్తుఴక్కి వెన్దీర్ తైయలై చ్చార్మిన్"** అనే చోట గల బహువచనాన్ని వ్యాఖ్యాత నచ్చినార్క్కినియర్ **"తుణియులాకైమైయిన్ పన్మైయాల్ కూఱినాళ్"** (నిశ్చయం కల్గనందున బహువచనంలో పల్కింది) అని అన్నందున **"వీరు"** అని నిశ్చయం స్ఫురించని చోట బహువచనంలో పల్కడం సంప్రదాయమని గ్రహించాలి. లేక, ముందుగా ముందుగా వెళ్ళేవారందఱు మనస్సును చూచి వెళ్ళండి- అని కూడా చెప్పవచ్చు.

పలువురు నిందించి పల్కితే తమ మనస్సు ఒకవేళ తిరిగి రావచ్చు- అని కూడా భావం. ఈవిధంగా పెక్కింటిని ఒకే కాలంలో దూతలుగా పంపినందున, ఒకదానిని ముందు దూతగా పంపి, అది వెళ్ళి కార్యాన్ని సఫలం చేసి వచ్చేవరకు కాలక్షేపం చేసి, వేచి ఉండలేని స్థితి స్ఫురిస్తుంది. ఇది నాయకికి గల అభినివేశాతిశయాన్ని సూచిస్తుంది.

ఆళ్వార్లు, తమను భగవానుని వద్దకు చేర్చడానికి తగిన ఆచార్యులుగా కొందఱిని వరించి, వారిని ఉద్దేశించి పలికే మాట దీనికి స్వాపదేశార్థం. వారిలో గొప్పవారు హంసలని, కొంచెం తక్కువవారు **"వణ్డానమ్"** అని నిర్దేశింపబడ్డారు. **"శెల్వీర్"** అని అన్నందున వారు భగవానుని దివ్యదేశాన్ని ఉద్దేశించి ప్రయాణం చేయడం సూచింపబడింది.

భగవానుని నిరంతరం భావించడంకంటే, అతనిని చేరి దర్శించి అనుభవించాలనే ఆర్తిని కల్గి ఉండడంకంటే, అతనిని మఱచిపోవడమే మంచిది - అని ప్రేమాధిక్యంవల్ల ఒక విధమైన విరక్తిని పొందిన ఆళ్వార్లు తమ మనస్సును భగవానునివద్దనుండి నివర్తించేటట్లు చేయాలని చూస్తున్నారు - అని ఇచటి స్వాపదేశంలోని తాత్పర్యం.

కన్పించిన పక్షులను అన్నిటిని దూతలుగా పంపిస్తే అవి నాయకీనాయకులను ఇద్దఱిని చేర్చడానికి సంతోషంతో ప్రయత్నిస్తాయా?- అనే సందేహానికి సమాధానాన్ని పలికే క్రమంలో, పెరియవాచ్చాన్‌పిళ్ళై శ్రీరామాయణంలో సీతను అన్వేషించడం కోసం పంపబడిన వానరవీరులు అందఱు, హనుమంతుడు సీతను చూచినందున గొప్ప సంతోషాన్ని పొందారని, వారు ఆ ఆనందాన్ని మధువనాన్ని పాడుచేయడం ద్వారా వ్యక్తం చేశారని అంటూ, ఈ సందర్భంలో భట్టర్ పల్కిన ఒక వార్తను ఉట్టంకించారు. ఆ వార్త ఏమంటే- **"అమ్మధువనమన్టాకిల్ రాజపుత్రర్‌కళ్ ముదుకోడేపోమ్"** అని. దీని తాత్పర్యమేమంటే- సీతాదేవిని దర్శించనందువల్ల కల్గిన ఆనందానికి పరీవాహరూపంగా వానరవీరులందఱు రామలక్ష్మణుల వీపును తట్టి, తమ ఆనందాన్ని వ్యక్తం చేసి ఉండే వారుకదా! ఆవిధంగా వానరులంతా రామలక్ష్మణుల వీపుపైతట్టి ఉంటే వారు వీపు ఏమయి ఉండేది? ఏదో ఒక విధంగా మధువనం అనేది ఒకటి ఉన్నందున వానరులు తమ ఆనందాన్ని దానిద్వారా వ్యక్తంచేశారు. అందువల్ల రామలక్ష్మణుల వీపుకూడా సురక్షితంగా నిలచింది'' అని

(భావం). ఈ వార్తను తిరువాయ్‌మొழிలోని **"ఎన్‌కుழల్‌మేల్"** (6-8-3) అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ నమ్బిళ్ళైకూడా ఉదాహరించారు.

**"తొழுదు ఇరన్దేన్"** అనే ప్రయోగాన్ని పెరియవాచ్చాన్‌పిళ్ళై వివరిస్తూ, భగవద్విషయంలో- నమస్కరించాలి- అనే భావమే చాలు. అది భగవానునిచే అధికంగా భావింపబడుతుంది - అనే విషయానికి ఉదాహరణంగా ఒక ఐతిహ్యాన్ని ప్రస్తావించారు.

ఒకసారి, నమ్బి తిరువழுది వళనాడు దాసర్- అనే ఆచార్యులు, ఇంకా కొందఱు కిడాంబి ఆచ్చాన్ దగ్గరకుపోయి, **"అన్యత్ పూర్ణాత్"** అనే శ్లోకానికి వివరణాన్ని అనుగ్రహించమని అర్థించారు. **"అన్యత్ పూర్ణాదపాం కుంభా దన్యత్పాదావనే జనాత్, అన్యత్ కుశలసంప్రశ్నాన్నచేచ్ఛతి జనార్దనః"** అనేది ఆ శ్లోకం (మహాభారతం-ఉద్యోగ-87-13). దీని భావం- ఒక జలపూర్ణకలశం కంటే, ఒక పర్యాయం పాదాలను కడగడం కంటే, కుశలాన్ని ప్రశ్నించడంకంటే అధికంగా వేఱు దేనిని భక్తులనుండి జనార్దనుడు ఆశించడు- అని. మిక్కిలి సులభమైనవి అయిన వీటిని తప్ప ఇక వేనినీ భగవంతుడు కోరడని చెప్పబడినది కదా! ఇవి కూడా ఒకసారి చేస్తే చాలు- అని అనడం కూడా అతని సౌలభ్యాన్ని సూచకంగా గ్రహించవచ్చునా?- అని వారందఱు అడిగారట. అపుడు ఆచ్చాన్ "ఒక పర్యాయం కాదు, సగం పర్యాయమైనా చాలు'' అని అన్నారట. అంటే- వీటిని ఒకసారి చేస్తే చాలు- అనేది కూడా కాదు. **"చేయాలి"** అని మనస్సులో భావిస్తేనే చాలు. తావన్మాత్రంతో భగవానుడు వానిని నిజంగా చేసినట్లుగానే తలచి తృప్తి పడతాడు. ఇది అతని సౌలభ్యంలోని పరాకాష్ఠ- అనేది కిడాంబిఆచ్చాన్ సూక్తిలోని భావం. ఈ శ్లోకవివరణం నాచ్చియార్ తిరుమొழிలోని (9-6) పాశురం పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యలో కూడా ఉన్నది.

**దూతలుగా వెళ్ళని మేఘాలను ఉద్దేశించి నాయకి బాధపడడం**

**31. ఇశైమిన్గళ్ తూదెన్ఱు ఇశైత్తాల్ ఇశైయిలుమ్, ఎన్‌తలైమేల్**
**అశైమిన్గళ్ ఎన్ఱాల్ అశైయుఙ్గొలామ్-, అమ్బొన్ మామణిగళ్**
**తిశై మిన్‌మిళిరుమ్ తిరువేఙ్గడత్తు వన్‌తాళ్ శమయమ్**
**మిశై, మిన్ మిళిరియ పోవాన్ వழிక్కొణ్డ మేగఙ్గళే !**

అమ్ పొన్ = అందమైన బంగారం, మా మణికళ్ = గొప్ప రత్నాలు, తిశై = దిక్కులన్నిటిలోను, మిన్ మిళిరుమ్ = మెఱుపువలె ప్రకాశించే, తిరు వేఙ్గడత్తు = శ్రీవేంకటాద్రిపై, వల్ తాళ్ = బలమైన పర్వతచరియల ప్రాంతాన్ని కల శిఖరాలపై, మిన్ మిళిరియ పోవాన్ = మెఱుపులను మెఱవడంకోసం, వழి క్కొణ్డ = ప్రయాణం చేసే, మేకఙ్గళ్ = మేఘాలు, తూదు ఇశైమిన్కళ్ ఎన్ఱు ఇశైత్తాల్ = (మీరు మాకోసం) దూత్యాన్ని అంగీకరించి వెళ్ళండి- అని పల్కి వేడితే, ఇశై యిలుమ్= (దానికి వెంటనే) అంగీకరించి, వెళ్ళడం మేము చూడలేదు, ఎన్ తలైమేల్ అశైమిన్కళ్ ఎన్ఱాల్ = మీరు నా తలపై ఉండండి- అని ప్రార్థిస్తే, అశైయుమ్ కొల్ ఆమ్ = అవి అక్కడకు వెళ్ళడం సంభవిస్తుందా? ఏమి!

**భావదీపిక** : దూతలుగా వెళ్ళమని పల్కినప్పటికీ ఆ విధంగా వెళ్ళని మేఘాలను ఉద్దేశించి నాయకి బాధపడుతూ పలికే పాశురం ఇది. చేరడంకోసం ప్రయాణం చేసే మేఘాలను ఉద్దేశించి నాయకి "నన్ను వీడి శ్రీవేంకటాద్రిపైకి పోయి అక్కడ నివసించే నా నాయకునకు నా అవస్థనుగూర్చి తెలుపడంకోసం మీరు నా దూతలుగా వెళ్ళాలి- అని వేడినా, దానికి అవి అంగీకరించినట్లు కన్పించలేదు. అపుడు మళ్ళీ వాటిని ఉద్దేశించి "అతడుంటే చోటుకు వెళ్ళే భాగ్యాన్ని కల్గిన మీరు, ఆ రీతిలో అతనివద్దకు చేరలేని నా తలపై మీరు మీ పాదాలను మోపి అయినా వెళ్ళండి'' అని ప్రార్థించింది. తిరుమల శిఖరాలపైకి వెళ్ళి అక్కడ ఉండడానికి త్వరపడుతున్న మేఘాలు ఈమె శిరస్సుపై నిలచి కాలుమోపి ఉండడానికి అంగీకరించలేదు. వాటి స్వభావాన్ని ఉద్దేశించి నాయకి క్లేశపడుతూ పలికే పాశురంగా కూడా చెప్పవచ్చు.

గడచిన పాశురంలో హంసలను, నార (జల) పక్షులను, దూతలుగా పొమ్మని ప్రార్థించిన నాయకి, అవి తాను కోరిన రీతిలో అవి దూతలుగా పోవడం గమనించనందున, "ఈ పక్షులు తమ తమ కార్యాలలోనే ఆసక్తిని కల్గి ఉన్నవి కనుక, నా కార్యాన్ని చేయలేదు'' అని భావించింది. మేఘాలను చూచి, "ఎల్లప్పుడు ప్రత్యుపకారాన్ని ఆశించక, ఇతరులకు సహాయం చేయడమే స్వభావంగా కల్గిన ఇవి నా కార్యాన్ని చేయదగినవి'' అని నిశ్చయించుకొని, ఆ మేఘాలను తనకు దూతలుగా పొమ్మని ప్రార్థించింది. అవికూడా ఈమె పనిని చేయనందు ఈపాశురంలో నాయకి చాలా బాధపడుతున్నది. ఈ విధంగా నాయకి పలుమార్లు పల్కి యాచించడంలో ఏమి ప్రయోజనం? అంటే, మూతపెట్టబడి, వేగిపోతున్న

పాత్ర, దానిపై ఉండే మూత తీసివేసినట్లయితే, ఆ పాత్రలోని ఆవిరి పైకి వచ్చి లోపల ఉండే వేడిమి తగ్గిపోయేటట్లుగా, ఆర్తివల్ల లోపల లోపల కుమిలి పోతున్న నాయకి తన తాపాన్ని నోరు తెరచి వ్యక్తం చేస్తే, అది కొంతవరకు ఆమె బాధతగ్గడానికి కారణమవుతుంది కనుక. **"పూరోత్పీడే తటాకస్య పరీవాహః ప్రతిక్రియా, శోకక్షోభే చ హృదయం ప్రలాపైరేవ ధార్యతే"** (తటాకానికి నీటి ప్రవాహం వల్ల మిక్కిలి ఒత్తిడి కల్గితే, నీటిని తూముద్వారా బయటకు వదలి పెట్టడమే తగిన పరిష్కారం. శోకంతో క్షోభిల్లే హృదయం రోదనతోనే తట్టుకుంటుంది.) అనే ఉత్తరామచరిత నాటకంలోని శ్లోకం స్మరణీయం.

ఈ సందర్భంలోని పెరియవాచ్చాన్‌పిళ్ళై శ్రీసూక్తులు పరమభోగ్యంగా అనుభావ్యాలు.

**"కీழ், నీలముణ్డ మిన్నన్న మేని ప్పెరుమాన్ ఉలకు- ఎన్టు పరమపదత్తే తూదువిట్టాళ్. అదు, పరభక్తిపరజ్ఞానపరమభక్తియుక్తరానార్క్కల్లదు పుకవొణ్ణాద దేశమాకైయాలే, అవతారఙ్గళిలే తూదు విడప్పార్‌త్తాళ్. అదువుమ్ సమకాల త్తిలుళ్ళార్‌క్కాయ్, పిన్నై యిల్లైయాకైయాలే, పిఱ్పట్టార్‌క్కుమ్ అనుభవిక్కలామ్పడి సులభమాన తిరుమలైయిలే తిరువేఙ్గడముడైయాన్ తిరువడికళిలే మేకత్తై తూదాక విడుకిఱాళ్. "తిరుమలై నోక్కిప్పోకిఱ మేకఙ్గళే! ఎన్నుడైయ తూదువాక్కియఙ్గళై క్కొణ్డుపోయ్ చ్చొల్లుఙ్గోళ్"- ఎన్టాల్ శొల్లుకిఱిలికోళ్. తిరుమలైక్కు ప్పోకిఱ పరాక్కిలే పోకాదే పోకిఱవఱ్ఱై క్కణ్డు, శొల్లమాట్టికోళాకిల్ ఉఙ్గళ్ తిరువడికళై ఎన్ తలైమేలే వైయుఙ్గోళ్- ఎన్టాల్, వైప్పుదికోళో! తిరుమలైక్కు ప్పోవారుడైయ తిరువడికళ్ ఉద్దేశ్యమాయిఱే యిరుప్పదు. తిరుమలైక్కు ప్పోకిఱవర్‌కళై తలైయిలే వైక్కక్కిడక్కుమో! తిరువడియై (హనుమానై) ప్పిరాట్టి యిఙ్గే ఓరిరా త్తఙ్గిప్పోక వేణుమెన్టు అరుళిచ్చెయ్య, ఒణ్ణాదు- ఎన్టు అవనుమ్ మఱుత్తు ప్పోనాప్పోలే పోకానిన్టవ"** అనేది ఇచటి వ్యాఖ్యాన శ్రీసూక్తులు.

దీని తాత్పర్యం ఏమంటే- "ఇంతకుముందు "నీలముణ్డ మిన్నన్న మేని" (మెఱుపును లోపల కల్గిన మేఘంవంటి మేనిని కల) స్వామియొక్క లోకమని భావించి, నాయకి పరమపదానికి దూతలుగా హంసలను, నారపక్షులను పంపింది. ఆ దేశం, పరభక్తి-పరజ్ఞాన-పరమభక్తులను కలవారికి తప్ప ఇతరులకు ప్రవేశించ రాని దేశమైనందున, భగవదవతారాలను ఉద్దేశించి దౌత్యాన్ని పంపాలని చూచింది.

ఆ రూపాలు కూడా సమకాలంలో ఉండే వారికోసం తప్ప, అనంతరకాలంవారికి దౌత్యం పంపడానికి వీలులేనందున, తరువాత కాలంవారికికూడా అనుభవించే టట్లుగా సులభుడైన తిరుమలైలోని వేంకటేశ్వరుని శ్రీచరణాలలో మేఘాలను దూతలుగా నాయకి పంపుతున్నది. వేంకటాద్రిని ఉద్దేశించి పోయే మేఘాలలారా! నా దూతవాక్యాలను తీసికొనిపోయి స్వామికి చెప్పండి- అని అంటే మీరు చెప్పడం లేదు. తిరుమలకు పోవాలనే తొందరలో మాట్లాడకుండా పోయే వాటిని చూచి నాయకి మీరు నా దూత్యాన్ని చెప్పనివారైనా కనీసం, మీ శ్రీచరణాలను అయినా నా తలపై పెట్టండి- అని అంటే ఆవిధంగా అయినా మోపుతారా? అని నాయకి అంటున్నది ఇక్కడ స్వాపదేశం ఏమంటే- తిరుమలైకు యాత్రగా పోయేవారి శ్రీచరణాలు సేవించదగినది- అని, తిరుమలకు పోయేవారి పాదాలను శిరస్సుపై ధరించగల్గడం అరుదు - అని భావం. హనుమానుని సీతాదేవి "ఇక్కడ ఒకరాత్రి ఉండిపో. అని అంటే, "వీలుకాదు'' అని అతడు కాదని వెళ్ళిపోయినట్లుగా ఇవి (మేఘాలు) కూడా వెళ్ళిపోతున్నాయి''.

రత్నాలు కాంతులను వెదజల్లే వేంకటాచలానికి పోవాలని బయలు దేరిన "మీరు నా కోసం వేంకటేశ్వరుని దగ్గరకు దూతలుగా వెళ్ళాలి'' అని నేను నోటితో మాత్రం ప్రార్థించినందున ఈ మేఘాలు అంగీకరించడంలేదు- కాబోలు! వాటి కాళ్ళను నా శిరస్సుపై పెట్టే రీతిలో శరణాగతిని చేస్తే అపుడు ఒకవేళ అవి అంగీకరించి, వెళ్ళవచ్చునేమో! అనేది ఇచటి భావం. ఆకాశంలో ఎగిరి పోయే హంసలు మొదలైన పక్షులను చూచి పరమపదనాథుని దగ్గరకు పోయేవి- అని భావించినట్లే, ఆకాశంలో సంచరించే మేఘాలను చూచి అవి శ్రీవేంకటేశ్వరుని దగ్గరకు వెళ్ళగలవని నాయకి భావించిందని- తెలియాలి. ఎవరైనా, ఎక్కడికైనా నడచి ప్రయాణం చేసి వెడితే, వారు దివ్యదేశాలకు యాత్రగా వెడుతున్నారనే భావించడం ఆళ్వార్ల ప్రవృత్తి. **"వరువార్ శెల్వార్ వణ్పరిశారత్తిరున్ద ఎన్ తిరువాళ్ మార్బఱ్కు ఎన్ తిఱమ్ శొల్లార్ శెయ్వదెన్?"** (వచ్చేవారు, పోయేవారుగా ఉండే వణ్పరిశారమ్ అనే దివ్యక్షేత్రంలో ఉండే తిరువాళ్మార్బన్ అనే పేరు గల నా స్వామికి వారి విరహబాధను గూర్చి చెప్పడంలేదు. ఏమి చేయను?) అని తిరువాయ్మొళ్లిలో కూడా ఆళ్వార్లు అన్నారు. దారిలో, స్వకార్యంలో ఆసక్తులై వెళ్ళేవారందఱు తిరువణ్పరిశారమ్ అనే క్షేత్రానికి వెడుతున్నారనే భావన వారికి (ఆ దశకంలో) కల్గింది.

దూతగా పంపించడానికి తగిన పక్షులను తన తలపై కాలుపెట్టమని అనే రీతిలో ఆ*ళ్వా*ర్లు వేడడం **"ఎజ్గానల్ అకమ్ క*ళి*వాయ్ ఇరైశేర్న్దిజ్గిని తమరుమ్, శెజ్గాల మడనారాయ్! తిరుమూ*ళి*క్కళత్తుఱైయుమ్, శెజ్గార్ పూన్తు*ళా*య్ముడి ఎన్ కుడక్కూత్తజ్కేన్ తూతాయ్ నుమ్కాల్కళ్ ఎన్తలైమేల్ కె*ళు*మీరో నుమరోడే"** (సముద్రతీరంలో తోటల నడుమగల ఉప్పు కాలువలలో ఆహారాన్ని అన్వేషిస్తూ సుఖంగా ఉండే ఎఱ్రని పాదాలను కల ఓ నారపక్షులారా! తిరు మూ*ళి*క్కళంలో అనే దివ్యదేశంలో నివసించేవాడు, తేనె వొలికే తులసిని కిరీటంలో కలవాడు, కుంభనృత్యాన్ని చేసినవాడైన నా స్వామి దగ్గరకు దూతలుగా మీ బంధువులతో కలసి వెళ్ళి, నా శిరస్సుపై నీ పాదాలను పెట్టండి) (తిరువాయ్ మొ*ళి*-9-7-1) అనే చోటకూడా కన్పిస్తుంది.

**"ఇఱైయిలమ్"** -అంటే అంగీకరించబడినవారం కాము- అని అర్థం. **"అమ్"**- ఇది **"అశై"**, **"తాళ్"**- ఇది పాదమనే సంస్కృతపదంయొక్క అర్థాన్ని ఇచ్చేపదం. **"పాదాః ప్రత్యంతపర్వతాః"** అని అమరకోశవచనం. **"మిళిరియ"**- **"శెయ్యియ"** అనే జాతీయ కృదంతరూపం (**"వాయ్పాడు వినైయెచ్చమ్"**) **"ఇయ"**- భవిష్కత్కాలిక ప్రత్యయం. **"మిళిరియ"**- అనే పదాన్ని **"తెరినిలై యిఱన్దకాల ప్పెయరెచ్చమ్"** (**"తెరినిలై"** -భూతకాలిక తద్ధితాంతరూపం)గా గ్రహించి 'మెఱసిన' అనే అర్థాన్ని చెప్పి, మేఘానికి విశేషణంగాకూడా చేయవచ్చు. **"పోవాన్"** - **"వాన్"** అనే ప్రత్యయం చేరిన భవిష్యత్కాలిక కృదంతరూపం. **(ఎదిర్కాల వినైయెచ్చమ్)**

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే -గడచిన పాశురంలో భగవానునిపట్ల అవగాహించిన తమ మనస్సును నివర్తింపజేసేటట్లుగా అభ్యర్థింపబడిన ఆ*ళ్వా*ర్లచే భాగవతులు "వీరి మనస్సును నివర్తింపజేయడం సర్వశక్తి అయిన ఆ భగవానునకు కూడా అసాధ్యమైనపుడు, మనవల్ల ఏమవుతుంది?" అని వారు వదలిపెట్టగా, తరువాత దివ్యదేశయాత్రాపరులై, తిరుమలను ఉద్దేశించిపోయే కొందఱిని ఆ*ళ్వా*ర్లు చూచి, "వీరు నా అభిలాషను భగవానుని వద్ద విన్నపించి, నన్ను స్వామితో చేర్చడానికి తగిన పురుషకారం కాగలరు- అని భావించి వారిని ఆచార్యులుగా వరించారు. కాని, వారు, వీరికి ఆచార్యులు కావడానికి అంగీకరించనందున **"ఎమ్బెరుమాన్ తాళ్ తొ*ళు*వార్ కాణ్మిన్ ఎన్తలైమేలారే"** అనే రీతిలో వీరు మన శిరస్సుపై తమ కాళ్ళను పెట్టడం కూడా పురుషార్థం కాగలదని తలచి, దానికోసం వారిని ఆ*ళ్వా*ర్లు వేడుతున్నారు.

**నాయకి నాయకుని రూపసామ్యాన్ని మేఘాలలో దర్శించి పల్కడం**

32. మేగజ్గళో! పురైయిూర్, తిరుమాల్ తిరుమేని యొక్కుమ్
యోగజ్గళ్ ఉజ్గళుక్కెవ్వాఱు పెఱ్ఱీర్ ?-, ఉయిరళిప్పాన్
మాగజ్గళెల్లామ్ తిరిన్దు నన్నీర్‌గళ్ శుమన్దు నున్దమ్
ఆగజ్గళ్ నోవ, వరుత్తుమ్ తవమామరుళ్ పెఱ్ఱదే?

మేకజ్గళో = ఓ మేఘాలలారా, తిరు మాల్ తిరుమేని ఒక్కుమ్ యోగజ్గళ్= శ్రియఃపతి అయిన భగవానుని తిరుమేని పోలిన ఉపాయాలను, ఉజ్గళుక్కు ఎవ్ ఆఱు పెఱ్ఱీర్ =మీకు (సిద్ధించే రీతిలో) ఏవిధంగా పొందారు?, ఉరైయిూర్ = చెప్పండి, ఉయిర్ = ప్రాణులను, అళిప్పాన్ = రక్షించడంకోసం, నల్ నీర్‌కళ్ శుమన్దు = మంచి జలాన్ని పానం చేసి, (మోసి), మా కజ్గళ్ ఎల్లామ్ తిరిన్దు = గొప్ప ఆకాశంలో అంతటా సంచరించి, నుమ్ తమ్ = మీయొక్క, ఆకజ్గళ్ నోవ= శరీరాలు నొప్పి పుట్టేటట్లు వరుత్తుమ్ = (ఆ శరీరాలను) శ్రమపెట్టిన, తవమ్ ఆమ్ = తపస్సా!, అరుళ్ పెఱ్ఱతు = ఆ భగవానుని అనుగ్రహాన్ని పొందడానికి హేతువు?

భావదీపిక : నాయకుని విశ్లేషించిన దశలో కంటికి కన్పించే వస్తువులను అన్నిటినీ చూచి పలు రీతులలో క్లేశపడే నాయకి, వర్ణంతో స్వభావంతో పురుషోత్తమునితో పోలిన మేఘాలను చూచి, వానిని ఉద్దేశించి "భగవానుని తిరుమేనితో పోలిన తిరుమేనిని కల్గి ఉండడమనే సారూప్యదశను మీరు ఏ ప్రయత్నం చేసి పొందారు? ప్రత్యుపకారాన్ని ఆశించకుండా, పరోపకారంకోసమే మంచి నీటిని మోస్తూ, శరీరాన్ని క్లేశపెట్టుకొని, అక్కడక్కడ సంచరించి వర్షించి, సమస్త ప్రాణులను రక్షించడమనే గొప్ప తపస్సును కల్గినందున మీకు భగవానుని కరుణ లభించి, దానివల్లనే ఈ స్థితి కల్గిందా! చెప్పండి"- అని అంటున్నది నాయకి.

పొయ్‌కై ఆళ్వార్ సముద్రాన్ని సంబోధించి పల్కుతూ **"మాలుమ్ కరుమ్ కడలే! ఎన్ నోఱ్ఱాయ్! వైయకముణ్డు ఆలిలై త్తుయిన్ఱ వాళియాన్, కోల క్కరుమేని శెజ్గణ్‌మాల్ కణ్‌పుడైయుళ్ ఎన్డుమ్ తిరుమేని నీ తీణ్డప్పెఱ్ఱు"** (నల్లని ఓ సముద్రమా! ఏమి నోము నోచావో కదా! భూమిని గ్రసించి, వటపత్రంలో శయనించే సుదర్శనధారి, అందమైన, నల్లని మేనిని కలవాడు, ఎఱ్ఱని నేత్రాలను కలవాడైన స్వామియొక్క తిరుమేని స్పర్శను నిత్యంగా పొందుతున్నావు) అని

"భగవానుడు సర్వదా నీవద్దనే శయనించి ఉండడానికి తగినట్లు ఏ తపస్సును ఆచరించావు?'' అని ప్రశ్నించారు. ఈ ఆళ్వార్లు మేఘాన్ని సంబోధించి "భగవానునితో రూపసామ్యాన్ని పొందే రీతిలో మీరు ఏ తపస్సును చేశారు?''అని ప్రశ్నిస్తున్నారు. అవి అనుష్ఠించిన ఉపాయాన్ని తెలిసికొని, నేనుకూడా అనుష్ఠించి, ఆ స్థితిని పొందాలి- అనే అభిప్రాయం కాబోలు! మేఘం, రూపంతో భగవానునితో పోలి ఉంటుందని నాయకి పల్కడం **"నన్దు పెయ్యుమ్ మళ్ళై కాణిల్ నారణన్ వన్దానెన్దు ఆడుమ్"** (చక్కగా వర్షించే మేఘాన్ని చూస్తే నారాయణుడు వచ్చాడని పరాంకుశనాయకి నాట్యం చేస్తుంది.), **"కరుమ్ పెరు మేకజ్గళ్ కాణిల్ కణ్ణనెన్దు ఏఱప్పఱక్కుమ్",** (నల్లని పెద్ద మేఘాలను చూచి శ్రీకృష్ణుడని పరుగు తీస్తుంది) **"ఒక్కుమమ్మానురువ మెన్దు ఉళ్ళమ్ కుళైన్దు నానాళుమ్, తొక్కమేకప్పల్ కుళ్ళాజ్గళ్ కాణుమ్ తోఱుమ్ తొలైవన్ నాన్"** (స్వామిరూపంతో సాటిగా ఉన్నది అని నా మనసులో తలచి, ప్రతిదినం మేఘాల గుంపులను పెక్కింటిని చూచి నప్పుడు అంతా నా మనస్సు క్లేశపడుతున్నది.) అనే సూక్తులలో గమనించవచ్చు.

**"మేకజ్గళో"**- ఇక్కడ ఓకారం అధికంగా వచ్చింది. ఇది సంబోధన విభక్తి ప్రత్యయం (లేక) **"ఓ మేకజ్గళ్ !"** అని మార్చి చెప్పవచ్చు. ఎంతదూరంలో ఉన్నా, తన కంఠధ్వని వినబడేటట్లుగా **"మేకజ్గళో!"** అని నాయకి పిలుస్తున్నది. **"నారాయణా! ఓ మణివణ్ణా! నాకణైయాయ్"** అనే గజేంద్రుడు ఆక్రందించినట్లే ఇదికూడా. **"యోకమ్"** -పోలి ఉండడానికి కారణమైన ఉపాయం. **"మహోఖమ్"** - అనే సంస్కృతపదం. **"మాకమ్"** అని వికారాన్ని పొందింది. ఆకాశం అనేకం కాదు, ఒకటే కదా! **"మాకజ్గళ్"** అనే బహువచనం ఎందుకు? అంటే, ఇక్కడ బహువచనం పదార్థంయొక్క బహుత్వాన్ని తెలుపదు. ఒకే వస్తువు పలుచోట ఉండడాన్ని తెల్పుతుంది. **"నీర్కళ్"**- అనేచోట్ల బహువచనం పౌష్కల్యాన్ని తెల్పుతుంది. 'మేఘాలు అనేకం కనుక, నీళ్ళుకూడా అనేకాలు అయినవి''- అని చెప్పవచ్చు.

శ్రీవైకుంఠంలో ఉండేవారు, భగవానునితో పోలిన రూపాన్ని అతని అనుగ్రహంవల్ల పొందినవారైన ముక్తులను ఆళ్వార్లు భావనాప్రకర్షవల్ల సాక్షాత్తుగా దర్శించి, వారిని సంబోధించి, "మీరు ఈ సారూప్యస్థితిని ఏవిధంగా పొందారు, చెప్పండి- **"అది యన్ద మనన్ద మఱ్పుతమాన వానవర్తమ్ పిరాన్, పాదమామలర్ శూడుమ్ పత్తియిలాద పావికళ్ ఉయ్న్దిడ, త్తీదిల్ నన్నెఱి కాట్టి ఎజ్గుమ్ తిరిన్దు అరజ్గమెమ్మానుక్కే కాదల్ శెయ్తొణ్డర్"** (ఆద్యంతాలులేని, ఆశ్చర్యకరుడైన

నిత్యసూరినాథుని పాదపద్మాలను సేవించాలనే భక్తిలేని పాపులు సైతం తరించేటట్లుగా ఏదోషం లేని సన్మార్గాన్ని చూపి, అంతట సంచరించి, శ్రీరంగ నాథుని విషయంలోనే అనురాగాన్ని కల భక్తులు) అనే రీతిలో ఈ లోకంలో అన్ని ప్రాణులను ఉజ్జీవింపజేయడంకోసం శరీరాన్ని శ్రమపెట్టుకొని అంతటా తిరిగే గుణరసపూర్తిని పురస్కరించుకొని మంచివర్తనాన్ని చూపి, ప్రత్యుపకృతిని ఆశించకుండా సంచరించడమనే సాధనంతో భగవత్కృపను పొంది, దానివల్ల మీకు ఈ స్థితి ఏర్పడింది కాబోలు''- అని పల్కడం దీనికి స్వాపదేశార్థం.

**నాయకి ఆర్తిని చూచిన సఖి నాయకునితో కఠినోక్తులను పల్కడం**

33. అరుళార్ తిరుచ్చక్కరత్తాల్ అగల్ విశుమ్బుమ్ నిలనుమ్,
ఇరుళార్ వినై కెడ చ్చెజ్గోల్ నడావుదిర్-, ఈజ్గోర్ పెణ్పాల్
పొరుళో వెను మిగழ்వో? ఇవత్తిన్ పుఱత్తాళెన్ఱెణ్ణో?
తెరుళో మరవణైయీర్! ఇవళ్ మామై శిదైక్కిన్ఱదే

అరవు అణైయీర్ = ఆదిశేషశయనాన్ని కలవాడా! అరుళ్ ఆర్ తిరు శక్కరత్తాల్ = కరుణ నిండిన చక్రంతో, అకల్ విశుమ్బుమ్ = విశాలమైన పరమపదంలోను, నిలనుమ్ = భూలోకంలోను, ఇరుళ్ ఆర్ వినై కెడ = చీకటి వంటి క్రూరకర్మలు సంభవించని రీతిలో, (దుష్టనిగ్రహాన్ని చేసి), శెజ్గోల్ నడావుదిర్= నీ ఆజ్ఞను ఏ అడ్డు లేకుండా చెల్లుబాటు చేస్తున్నావు, (ఆ విధంగా లోకాలను రక్షించే నీవు) ఇవళ్ = ఈ పరాంకుశనాయకియొక్క, మామై = తిరుమేనివర్ణాన్ని, శిదైక్కిన్ఱదు = పాడుచేయడం, ఈజ్గు = ఈ లోకంలో, ఓర్ పెణ్పాల్ =ఒక స్త్రీని రక్షించడం, పొరుళ్ ఎనుమ్ = (ఒక) పురుషార్థమా?- అనే, ఇకழ்వో = అనాదరమా?, (లేక), ఇవற்றిన్ పుఱత్తాళ్ ఎన్ఱు ఎణ్ణో = మీచే రక్షింపబడే భూలోక-పరమపదాల లోపల లేకుండా బయట ఉండే ఒకతె ఈమె- అనే అభిప్రాయమా?, తెరుళోమ్ = తెలియలేకున్నాము.

భావదీపిక : నాయకుని విశ్లేషంవల్ల నాయకి తల్లడిల్లుతున్నప్పటికీ, ఆమె దగ్గరకు వచ్చి ఉపశమనాన్ని కల్గించని నాయకుని ఉద్దేశించి సఖి గర్హిస్తూ పల్కిన పాశురం ఇది. నీవు సామాన్యుడవు కావు. శ్రీసుదర్శనచక్రాన్ని ఆయుధంగా (సాధనంగా) గ్రహించి, అన్ని లోకాలలోను దుష్టులను నిరసించి, శిష్టులను రక్షించడమే వ్రతంగా కలవాడవు. ఈ విధంగా సర్వరక్షకుడవైన నీవు ఈమెను

రక్షించవలసిన బాధ్యతను కల్గి ఉన్నా, ఈమెను ఒక్కతెను మాత్రం రక్షించకుండా విడచిపెట్టావు. "ఈమె నాచే రక్షింపబడవలసినది కాదు. రక్షింపబడడానికి తగిన యోగ్యత ఏమీ ఈమెలో లేదు"- అని నిరసించి ఈమె చేయి విడిచావా? లేక, నాచే రక్షింపబడే లోకాలలో ఈమె అంతర్భవించినది కాదు, 'బహిర్భూత' అని భావించి విడచిపెట్టావా?"- అని క్లేశపడుతూ పల్కిన సూక్తి, ఇది.

శ్రీసుదర్శనుడు కూడా చేతనవర్గంలో ఒకడు కనుక, **"అరుళార్ తిరుచ్చక్కరత్తాల్"** అని అతడు దయ కల్గి ఉండడం తెలుపబడింది. ఆయుధకోటి, ఆభరణకోటి- అనే ఈ రెండు వర్గాలలో అన్వయించే సుదర్శనానికి ప్రతికూల నిగ్రహంలో కోపంవలె అనుకూలరక్షణంలో కృప కల్గి ఉండడం యుక్తమే.

**(ఇరుళార్ వినై కెడ)** - శ్రీసుదర్శన శతకంలోని **"బాహ్యాబాహ్యాంధకార "క్షతజగదదంకార భూమ్నా స్వధామ్నా"** అనే సూక్తిస్మరణీయం. ఇక్కడ **"ఇరుళ్"** అనేది ఆంతరతమస్సు- అనే అజ్ఞానాన్ని తెల్పుతుంది.

ఇక్కడ భగవానుని **"అరవణైయీార్!"** అని సంబోధించడం సాభిప్రాయంగా ఈమె భూతలంపై క్లేశపడుతూ పడి ఉండగా, నీకు సుఖకరమైన పడుక ఏవిధంగా పొందికగా ఉన్నది? నీ పడుకకు మేల్కట్టు అక్కరలేదా? పడుకలో పరుండేవారు బ్రహ్మచారిగానేనా శయనిస్తారు? ఒంటరిగా శయనించవచ్చునా? ఈమె అక్కరలేదా? అని హార్దభావం.

**"ఇవళ్ మామై శిదైక్కిన్ఱదే"** అనే చోట గల ఈక్రింది పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానసూక్తిని గమనించండి- **"(ఇవళుడైయ మేనినిఱత్తై) అవన్‌తానే కైతొట్టు అழிక్కిఱాన్ - ఎన్ఱపడి. ప్రజై కిణఱ్ఱిల్ విழுన్దాల్ వాఙ్గాద తాయై "తళ్ళినాళ్" ఎన్నుమోపాది రక్షకనానవన్ రక్షియాదొழிన్దాల్ అవ్వళవుమ్ శొల్లలామిఱే".** (ఈమె మేని లావణ్యాన్ని నాయకుడే తాకి పోగొడుతున్నాడని భావం. బిడ్డ బావిలోపడితే బయటకు తీయని తల్లిని చూచి ఆమె గెంటివేసిందనే రీతిలో, రక్షకుడు రక్షించకపోతే తావత్పర్యంతం నిందింపబడుతుంది కదా.)

స్వాపదేశార్థంలో- ఈ పాశురం ఆழ்వార్ల ఆర్తిని చూచినవారి భక్తులు భగవానుని ఉద్దేశించి విన్నపించిన సూక్తి. మొదటి వాక్యంతో భగవానుని సంకల్పరూపుడైన శ్రీసుదర్శనుని పురస్కరించుకొని నిత్యవిభూతిలో భగవదనుభవ ప్రతికూలమైన చీకటి ప్రవర్తించని రీతిలో, లీలావిభూతిలో అజ్ఞానకార్యమైన

అసత్ప్రవర్తన- అనే చీకటి ప్రవర్తించని రీతిలో చేసి, రెండు విభూతులలో చీకటి లేని రీతిలో రక్షించడం స్ఫురిస్తుంది. ఇక్కడ నమ్బిళ్ళై ఈడువ్యాఖ్య- **"కైయుమ్, తిరువాళ్ళియుమాన అళ్ళకై క్కాట్టి, పిరియామైయాలే రక్షిక్కుమ్, అఙ్గుళ్ళారై. అత్తై క్కొణ్డు విరోధికళై ఇరు తుణ్డమాక ఇట్టు రక్షిక్కుమ్ ఇఙ్గుళ్ళారై"** అని. (చేతిలో సుదర్శనాన్ని ధరించినపుడు స్ఫురించే అందాన్ని చూపి, విశ్లేషించకుండా ఉండి పరమపదంలోని వారిని రక్షిస్తాడు. శ్రీసుదర్శనంలో విరోధులను రెండు ఖండాలుగా చేసి, ఈ విభూతిలోని వారిని రక్షిస్తాడు.) ఆళ్వార్లకు వెనువెంటనే ప్రాప్యాన్ని అనుగ్రహించకుండా, నీవు వారికి విరహార్తిని కల్గించి, దానివల్ల వారి శరీరవర్ణంలో మార్పును కల్గించడం- ఈ లోకంలో ఒక వైపు తమను తాము రక్షించుకోవడానికి శక్తి లేకుండా పరతంత్రులై ఉండేవారు. వీరు- అనే ఉపేక్షచేతనా? లేక, ఈలోకంలోని వారివలె సంసారంలో మునిగి ఉండడం, ఆ లోకంలోనివారివలె (నిత్యముక్తుల వలె) భగవానుని దరిచేరి, దాస్యం చేసి ఆరాధించడం- అనేవి లేనివారైనందున, వీరు నా రక్షణలో అంతర్భూతమైన రెండు లోకాలలోను చేరకుండా, బాహ్యులై ఉన్నారు- అనే అభిప్రాయమా? కారణం ఇదమిత్థంగా తెలియలేదు- అని ఆళ్వార్ల భక్తులు పల్కిన రీతి, ఇది.

**"అశక్తియుమ్, పారతంత్ర్యముమ్ అనాదరత్తుక్కు ఉఉప్పల్లామైయాలుమ్, విభూతిద్వయవ్యావృత్తి వైలక్షణ్యత్తుక్కు ఉఉప్పాకైయాలుమ్ అఙ్గీకారహేతు ఉణ్డెన్టపడి. "అరవణైయీర్!" ఎన్గైయాలే అన్గ విభూతియిల్ ఉళ్ళారోడు నిత్య సంశ్లేషమ్ నడక్కిఅపడి శొల్లుకిఅదు"** అనేది అళ్ళకియమణవాళచ్చీయర్ ఉరైలోని సూక్తి. (అశక్తి, పారతంత్ర్యం- అనేవి అనాదరించడానికి కారణాలు కానందున, ఉభయవిభూతులకంటే వ్యావృత్తిని కల్గి ఉండడం వైలక్షణ్యానికి హేతువైనందున, ఆళ్వార్లను అంగీకరించడానికి హేతువు ఉన్నదని భావం. **"అరవణైయీర్"** శేషశాయీ!- అని అన్నందున ఆ విభూతిలో ఉండేవారితో నిత్యసంశ్లేషం భగవానుడు కల్గి ఉండడం సూచింపబడింది.)

**"అరుళార్ తిరుచ్చక్కరత్తాల్"** అనే సూక్తిని వివరిస్తూ నమ్బిళ్ళై తమ ఈడు వ్యాఖ్యలో- అందఱిని రక్షించే బాధ్యత ఆ సర్వేశ్వరునిదే- అనే విషయానికి ఉదాహరణంగా ఒక ఐతిహ్యాన్ని ఉదాహరించారు.

కూరత్తాళ్వాన్ కుమారులైన పరాశరభట్టర్‌కు వివాహవయస్సు వచ్చింది. అయితే, వారి వివాహాన్నిగూర్చి ఆళ్వాన్ ఏ ప్రయత్నం చేయకపోవడాన్ని చూచి,

ఆళ్వాన్ దేవేరి ఆణ్డాళ్ "కుమారరులకు వివాహ వయస్సు ప్రాప్తించినా మీరింకా వివాహప్రయత్నాన్ని ఎందుకు చేయడంలేదు?'' అని అడిగినది. అపుడు ఆళ్వాన్- "భగవత్కుటుంబం కోసం నన్ను ప్రయత్నించమంటావా? అయినా, పెరుమాళ్ళ సన్నిధిలో నేను పురాణప్రవచనం చేసేటపుడు పిల్లలను అక్కడకు పంపు'' అని అన్నారు. ఆవిధంగానే ఆణ్డాళ్ పరాశరభట్టర్‌ను, శీరామప్పిళ్ళైను కోవెలకు పంపింది. కోవెలలో పురాణ ప్రవచనం పూర్తి అయిన తరువాత ఆళ్వాన్ అక్కడ జంకుతూ నిలవడం గమనించిన శ్రీరంగనాథుడు అర్చకముఖంగా "కూరేశా! మీరేదో చెప్పాలని అనుకుంటున్నట్లున్నారే!'' అని అడిగాడు. అపుడు కూరేశులు- "పిల్లలకు యుక్త వయస్సు వచ్చిందని అందఱు అంటున్నారు'' అని అన్నారు. శ్రీరంగనాథుడు "ఈ కార్యానికి మేము బాధ్యులం. తగిన చోటును చూచి సంబంధాన్ని ఘటింప చేస్తాం'' అని రంగనాథుడన్నాడు. ఆ పిమ్మట రెండు, మూడు దినాలలో పరాశర భట్టర్‌కు తగిన కన్యతో వివాహం జరిగింది.

ఈ ఐతిహ్యం తిరువాయ్‌మొళ్ళి ఈడు **"కఙ్గులుమ్ పకలుమ్"** (7-2) దశకప్రవేశ వ్యాఖ్యలో, (5-5-7) పాశురవ్యాఖ్యలో కూడా ప్రస్తావింపబడింది.

### కూడల్ వలయాలను చెరిపి వేసి బాధపడే నాయకి అవస్థను గూర్చి ఆమె సఖి పల్కడం

**34.** **శిదైక్కిన్డదాళ్ళియెన్ఱు ఆళ్ళియై చ్చీఱి, తన్ శీఱడియాల్**
**ఉదైక్కిన్డ నాయకమ్ తన్నొడు మాలే !-, ఉనదు తణ్డార్**
**తదైక్కిన్డ తణ్ణన్దుళ్ళా యణివానదువే మనమాయ్**
**ప్పదైక్కిన్డ మాదిన్ తిఱత్తు, అఱియేన్ శెయఱ్పాలదువే**

మాలే = ఓ సర్వాధికుడవైన స్వామీ!, ఆళ్ళి = **"కూడల్"** వలయం, శిదైక్కిన్డదు = కార్యాన్ని చెడగొడుతున్నది, ఎన్ఱు = అనే కారణంచేత, ఆళ్ళియై= ఆ కూడల్ వలయాలను, శీఱి = కోపించి, తన్ శీఱు అడియాల్ = తన చిన్న కాళ్ళతో, ఉదైక్కిన్డ నాయకమ్ తన్నొడు = తొక్కి వేసే రీతిలోని నాయకత్వం (పరత్వం)తో, ఉనదు = నీయొక్క, తణ్ తార్ తదైక్కిన్డ = వాడని పూలతో నిండిన, తణ్ అమ్ తుళ్ళాయ్ = చల్లని అందమైన తులసీమాలికను, అణివాన్ అదువే మనమ్ ఆయ్ పదైక్కిన్డ = అలంకరించుకోవడంకోసం అందులోనే

అభిప్రాయం కల్గి క్లేశపడే, మాదిన్ తిఱత్తు = ఈ నాయకి విషయంలో, శెయ్‌ల్‌వు ఆనదు = చేయదగినదానిని, అఱియేన్ = నేను తెలియలేకున్నాను.

**భావదీపిక :** ఇది, నాయకుని వియోగాన్ని పొంది బాధపడే నాయకి స్థితిని చెలికత్తె నాయకునకు తెలిపే పాశురం. నాయకుడైన భగవానుని కలవడంకోసం **"కూడల్"** వలయాలను గీసి, అవి చెఱిగి పోయినందున, "దానివల్ల కలత చెంది బాధపడే నాయకి దుఃఖాన్ని చూచి ఆమె సఖి కలత చెంది నాయకి సి&థతిని గూర్చి నాయకునితో పల్కుతున్నది. **"కూడలిழைత్తల్"** అంటే- నాయకుని విశ్లేషించిన నాయకి **"కూడల్ దైవాన్ని"** (నాయకీ నాయకులను ఒకటిగా చేర్చే దైవాన్ని) కీర్తించి, ఇసుకలో గుండ్రంగా ఒక గీతను గీచి, దానిలో గీతలను సుడులుగా దాని చుట్టు సుడులు చుట్టి, ఆ సుడులు రెండు రెండుగా లెక్కించినపుడు, ఆ గణన సరిసంఖ్యలో ముగిసినట్లయితే, విశ్లేషించిన నాయకుడు వచ్చి చేరగలడని, బేసిసంఖ్యలో పూర్తి అయితే నాయకుడు రాడని గుఱిని (శకునాన్ని) చూడడమనే ఒక సంప్రదాయం. ఇది నాచ్చియార్ తిరుమొழிలో కన్పిస్తుంది. **"తెళ్ళియార్ పలర్ కైతొழுమ్ దేవనార్'** అనే దశకంలో గోదాదేవి **"శొల్లుమాకిల్ నీ కూడిడు కూడలే", "కూట్టుమాకిల్ నీకూడిడు కూడలే", "కోమకన్ వరిల్ కూడిడు కూడలే"** అని పలు రీతులలో ఈ సంకేతాన్ని గోదాదేవి పరీక్షించి చూడడం కన్పిస్తుంది. ఆ సందర్భంలో పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానానికి పెద్దలు అనుగ్రహించిన అరుమ్బద ఉరైలో- **"కూడలావదు- వట్టమాక క్కోట్టై క్కీఱి, అదుక్కుళ్ళే శుழி శుழியాక చ్చుఱ్ఱు చ్చుழித్తు, ఇవ్విరణ్డు శుழியాక క్కూట్టినాల్, ఇరట్టై ప్పట్టాల్ కూడుకై; ఒన్టై ప్పట్టాల్ కూడామై- ఎన్ఱు సంకేతమ్"** (**"కూడల్"** - అంటే గుండ్రంగా వృత్తాలని గీచి, దాని లోపల సుడులుగా సుడులుగా గీతలను గీచి, వాటిని లెక్కించనపుడు, ఆ గీతల సంఖ్య సరి సంఖ్యగా వస్తే సంశ్లేషము సంభవిస్తుందని, బేసి సంఖ్య వస్తే విశ్లేషం సంభవిస్తుంది అని భావించే సాంప్రదాయికమైన సంకేతం) అని వివరింపబడింది.

**(అழி శిదైక్కిన్ఱదెన్ఱు)- "కూడల్ వట్టమ్"** (సంకేతం చూడడంకోసం గీచిన వలయాలు) కార్యాన్ని చెడగొట్టడం అంటే- సుడుల లెక్కలో చివరకు బేసిసంఖ్యగా ముగిసి, విశ్లేషాన్ని సూచించడం. ఇదే **"కలఙ్గుతల్"** అని, **"పిழైత్తల్"** అని, **"తవఱుదల్"** అని, **"కూడామై"** అని, **"శిదఱుదల్"** అని చెప్పబడుతుంది. సరిసంఖ్యలో ముగిసి సంయోగాన్ని సూచించడం కార్యాన్ని అనుకూలింపజేయడం.

అది "కూడుదల్" అనబడుతుంది. ఇక, "కూడలిళ్లైత్తల్" అంటే- కన్నులను మూసికొని, భూమిపై గుండ్రంగా ఒక గీత గీసి, తరువాత కళ్ళను తెఱచిచూచి నపుడు అది ప్రారంభమైన చోటకు తప్పకుండా వచ్చి కూడినట్లయితే, విశ్లేషించిన నాయకుడు తన వద్దకు వచ్చి కలుస్తాడని, ఆ విధంగా వచ్చి కలువకుండా వేఱుగా ఉంటే, నాయకుడు వచ్చి కలువడనే సంకేతాన్ని పరీక్షించి చూడడం- అని కూడా కొందఱు అంటారు. ఆ విధంగా లక్షణాన్ని గ్రహించడానికి నిదర్శనాలు మృగ్యం. విశ్లేషించినవారు బాధపడే చోటు "నెయ్‌తల్‌నిలమ్" (సముద్రతీరం, తత్సమీపం) కనుక, ఈ సంకేతపరీక్ష సముద్రతీరంలో సంభవిస్తుంది.

"శిదైక్కిన్టదు ఆఴ్లియెన్ట అదనై చ్చీఱి" అని అనవలసిఉండగా, "ఆఴ్లియై చ్చీఱి" అని అనడం పెద్దల ప్రయోగానికి పొసగుతుంది. (ఇక్కడ) "ఆఴ్లియై" అనేది "దానిని'' అని పరోక్షంగా అర్థాన్ని తెలుపడంలోనే ఉద్దేశాన్ని కల్గినది. "ఆ వర్తులాకారరేఖలను (ఆఴ్లి)'' అని తాత్పర్యం. "ఆఴ్లి శిదైక్కిన్టదు" అని అంటూ శకునపరీక్షకోసం గీచిన వర్తులాకారరేఖ కార్యాన్ని పాడుచేస్తున్నదని అనడం- తన కార్యం సఫలం కాలేదని సూచించడంకోసం. చాలా ఆశగా చేతితో శ్రమపడి గీచిన "కూడల్ వట్టమ్" (వర్తులాకారరేఖ)ను చాలా నిరసిస్తూ తన కాలితోనే వేగంగా నాయకి చెఱిపివేస్తున్నది. (ఎందుకంటే), తన కార్యం సఫలమవుతుందనే సంకేతం రాలేదనే కారణంచేత. ఆవిధంగా కాలితో చెఱిపివేయడం "ఉదైక్కిన్ట" అని అనడం ద్వారా తెలుపబడింది.

"సుదలడి ముఱుప్పెన మూవఴ్లి చ్చిఱుకి" (కలిత్తొకై- ముల్లైకలి-8) అనే రీతిలో స్త్రీలకు పాదాలు చిన్నవిగా ఉండడం శుభలక్షణంగా చెప్పబడింది. కనుక "శీఱడి" అని ప్రయోగింపబడింది. "శిఱుమై+అడి = శీఱడి", "శిఱుమై" అనే స్వభావవాచకం లో "ఈఱు" (చివరలో ఉండే భాగం) ("మై) పోయి శకారంపై ఉండే ఇకారం దీర్ఘమైనది. "ఉదైక్కిన్టదు" అనే ప్రయోగానికి తగినట్లు "శీఱడి" అనే దానికి "శీఱ్ఱమ్ కొణ్డ అడి"- (కోపాన్ని పొందిన పాదం) అనే ఒక విలక్షణమైన అర్థం స్ఫురించే రీతిని ఇక్కడ గమనించవచ్చు. "శీరడి" అనే పాఠానికి తగినట్లుగా "అందమైన పాదం'' అనే అర్థాన్ని గ్రహించాలి. "నాయకన్ తన్నొడు" అనేది సరి అయిన పాఠం కాదు. "నాయకమ్ తన్నొడు" అనేదే సరి అయిన పాఠం. "నాయకమ్" అంటే నాయకత్వం. "కూడల్ వట్టాన్ని" కోపించి, కాలితో చెఱిపి వేసే అవధిలోని గొప్పతనంతోను, నాయకుడు తులసీమాలికను అలంక

రించుకొన్నందువల్ల కల్గిన మెండైన ఆశతోను కూడిన ఈమె విషయంలో- అని తాత్పర్యం.

**"తార్"**- పూవు - అనే అర్థాన్ని కూడా ఈ పదం ఇస్తుంది. **"మాలైయుమ్ మలరుమ్ కొడిప్పడై ప్పెయరుమ్ కిణ్గిణి మాలైయుమ్ తారెన కిళత్తుప"** అని పింగళనిఘంటువచనం. **"తార్ తదైక్కిన్ట"** అనే దానికి "మాలగా కూర్చిన'' అనే అర్థాన్ని గ్రహించడంకూడా పొసగుతుంది. **"అణివాన్"**- అలంకరించుకోవడం కోసం- అనే అర్థాన్ని ఇస్తున్నందున ఈ పదం కృదంతం. **("ఎచ్చమ్") "పదైక్కిన్ట"**- తల్లడిల్లుతున్న- అని అర్థం. **"మాదు"**- అనే పదం **"మాదర్"** అనే పదం యొక్క వికృతి. ఇది ఆశపడ తగిన అందమైన స్త్రీని తెల్పుతుంది. ఇక్కడ **"మాదిన్ తిఱత్తు"** అనేది- ఈ క్లేశాన్ని సహించడానికి తగనిది (అంతటి సౌకుమార్యాన్ని కల్గినది) అనే అర్థాన్ని తెల్పుతుంది. **"శెయఱ్పాలదు యానఱియేన్"** అని అన్నందున ఈమెను క్లేశపెట్టే నీవే దానికి పరిహారాన్ని తెలియగలవు- అని సూచింపబడింది.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే - ఆర్తి అతిశయించిన ఆ*ழ்*్వార్లు "భగవానుని దరికి చేరడానికి నేను చేయదగిన ప్రయత్నం ఏమయినా ఉన్నదా?''- అని గమనించి చూచి, అది సాధ్యం కానందున, మళ్ళీ తిరిగి బాధపడ్డారు. అటువంటి వారి స్వభావాన్ని చూచిన వారి భక్తులు దానినిగూర్చి భగవానుని వద్ద విన్నపించడం. దీనిలోని స్వాపదేశం **"ఆ*ழ்*ి శిదైక్కిన్టదు"** అంటే- మన చేతిలో (స్వప్రయత్నంగా) చేసే అనుష్ఠానం ప్రాప్యసిద్ధికి కారణం కాబోదు- అని తెలిసికొని- అని అర్థం. **"ఆ*ழ்*ియై చ్చీఱి"**- ఆ ఉపాయాన్ని పరిగ్రహించకుండా నిరసించి (వదలిపెట్టి)- అని అర్థం. **"తన్ శీరడియాల్ ఉదైక్కిన్ట"**-ఆ ఉపాయాన్ని (కాలితో తన్ని) తోసిరాజని విడచిపెట్టే - అని అర్థం.

**(నాయకమ్‌తన్నొడు)**- సామర్థ్యంతో, బలిమితో, **"ఉనదు తణ్‌తార్ తదైక్కిన్ట తణ్ణన్తు*ழ*ాయణివానదువే మనమాయ్ ప్పదైక్కిన్ట"**- నీ భోగ్యతను అనుభవించ డానికి అందులో పూర్తిగా నిమగ్నమై, కాలవిలంబాన్ని సహించలేక, త్వరపడి, ఆర్తితో బాధపడే- అని అర్థం. **"మాదిన్ తిఱత్తు"** - పరతంత్రులైన ఈ ఆ*ழ்*్వార్ల కోసం, **"శెయఱ్పాలదు అఱియేన్"**- చేయదగిన కార్యం "ఇది" అని మేము తెలియలేము- అని భావం. **"మాలే"**- జ్ఞానశక్త్యాది అన్ని గొప్ప గుణాలను కలవాడా! అని సంబోధించినందున ఇటువంటి మహాపురుషుడవైన నీవు వీరిని ఇంకా నీ దరికి చేర్చుకోకుండా ఉండడం తగదు- అనే తాత్పర్యం ఇక్కడ స్ఫురిస్తుంది.

"శిదైక్కిన్దదు ఆழி యెన్దు ఆழியై చ్చీఱి త్తన్ శీఱడియాల్ ఉదైక్కిన్ద" అనే సూక్తికి ఇంకొక విధంగా కూడా అర్థాన్ని గ్రహించవచ్చు. "ఆழி" అని సముద్రానికి కూడా పేరు కనుక, ఆ అర్థాన్ని "ఆழியై" అనే ప్రయోగంలోని "ఆழி" శబ్దానికి గ్రహించవచ్చు. తాను కోల్పోయే "కూడల్ వట్టా"న్ని సముద్రం చెఱిపి వేస్తున్నది- అనే కారణంవల్ల సముద్రంపై కోపించి, కాలితో తన్నే- అని అర్థం. ఇక్కడ పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యాన శ్రీసూక్తిని గమనించండి "అవన్ వరుమళవుమ్ ఆఱియిరుక్క వొణ్ణాదాకైయాలే కూడలిழைక్క త్తొడఙ్గినాళ్. అదు తప్పిన పడియై క్కణ్డు అత్తోడే శీఱి అழியానిన్డాళ్- ఎన్బర్‌కళ్. భట్టర్, ఇదు కూడుకైక్కు ఏకాన్తమన్టియే, పిరికైక్కుమ్ ఒరుపుడై యుణ్డాయిరుక్కైయాలే శీఱి యుదైయానిన్డాళన్డు కూడలిழைక్కప్పుక్కవాఱే కడలానదు తన్ తిరైయాకియ కైయాలే అழிక్కప్పుక, అత్తోడే శీఱానిన్డాళ్- ఎన్బర్" (నాయకుడు వచ్చేంతవరకు సహించి ఉండలేనందువల్ల నాయకి సంశ్లేషశకునాన్ని పరీక్షించడంకోసం వర్తుల రేఖలను గీయడం ఆరంభించి, లెక్కించింది. ఆ పరీక్షలో తప్పినందున, నాయకుని చూస్తే కోపించే రీతిలో "కూడల్" దేవతను చూచి కోపపడుతున్నది. పూర్వ వ్యాఖ్యాతలు- వర్తులరేఖలను గీయడం ఆరంభించగానే, తప్పిన రీతిని చూచి, వానిపై కోపించి, వానిని చెఱిపివేస్తున్నది- అని వివరించారు. భట్టర్- ఈ పరీక్ష సంశ్లేషానికే ఏకాంతం కాకుండా, విశ్లేషానికికూడా ఒక విధంగా అవకాశం ఉన్నందున, కోపించి చెఱిపివేస్తున్నది- అని అర్థం కాదు. "కూడల్"ను పరీక్షించడం కోసం వర్తులాలను గీయడం ఆరంభించగానే సముద్రం తన కెరటాలనే చేతులతో వాటిని చెఱపి వేయగా, ఆ సముద్రాన్ని చూచి నాయకి కోపిస్తున్నది- అని వివరించారు)

"ఆழியై చ్చీఱి తన్ శీరడియాల్ ఉదైక్కిన్ద" అనే సూక్తిని వివరించేటపుడు నమ్పిళ్ళై ఒక సంవాదాన్ని ఉదాహరించారు.

భట్టర్ ఈసూక్తిని వివరించేటపుడు విழுప్పరైయర్ అనే ఆచార్యులు "ఈమె తన పాదంతో ఈ ఇసుకను తొక్కడం తెలిసికొంటే భగవానుడు ఈమె పాదం తనపై పడాలి- అనే భావంతో ఈ ఇసుకలో ప్రవేశించకుండా ఉంటాడా?"- అని అన్నారట. అపుడు భట్టర్ ఇంకా సరసంగా- "అతడు ఈ ఇసుకలో వ్యాపించాలా? ఈమె పాదం సోకిన ఇసుకయే పరతత్త్వంకదా!" అని అన్నారట. అంటే- ఇంతకు ముందు ఈమె పాదస్పర్శను పొందిన ఇసుకనే కదా ఇపుడు మనం పరతత్త్వమని అంటున్నాము- అని దీనిలోని హార్దభావం.

## నాయకి, సాయంసమయానికి సహించలేకపోవడంతో పాటు చల్లగాలికి బాధపడడం

35. పాల్వాయ్ ప్పిఱైప్పిళ్ళై ఒక్కలై క్కొణ్డు, పగలిழన్ద
మేల్పాల్ తిశై ప్పెణ్ పులమ్బుఱుమాలై-, ఉలగళన్ద
మాల్పాల్ తుழాయ్క్కు మనముడైయార్క్కు నల్కి*ర్ఱై* యెల్లామ్
శోల్వాన్ పుగున్దు, ఇదువోర్ పనివాడై తుழాగిన్దదే

పాల్ వాయ్ పిఱై పిళ్ళై = అమృతకిరణాలను బయటకు వెలువరించే బాలచంద్రుడనే పాలు కారే నోటిని కల చిన్న శిశువును, ఒక్కలై కొణ్డు = తన ఒడిలో ఒక ప్రక్కన పెట్టుకొని, పకల్ ఇழన్ద మేల్ పాల్ తిశై పెణ్ = సూర్యుడనే పతిని కోల్పోయిన పడమటి దిక్కు అనే స్త్రీ, పులమ్బు ఉఱుమ్ = బాధలో ఆక్రందించే, మాలై = సాయంకాలపు పొద్దు, ఉలకు అళన్ద మాల్ పాల్ = లోకాలను కొలిచిన భక్తవ్యామోహాన్ని కలవాని దగ్గర ఉండే, తుழాయ్క్కు = తులసికోసం, మనమ్ ఉడైయార్క్కు = ఆశ కల్గిన మనస్సును కలవారికి, నల్కి*ర్ఱై* ఎల్లామ్ = అనుగ్రహించినదానిని అంతా, శోల్వాన్ = అపహరించడంకోసం, పుకున్దు = ప్రవేశించి వచ్చి, ఇదు ఓర్ పని వాడై = ఈ అద్వితీయమైన చల్లని మారుతం, తుழాకిన్దదు = నాపై ప్రసరిస్తున్నది, ఏ = అయ్యో!

**భావదీపిక :** (విరహోద్దీపకమైన) సాయం సమయంలో నాయకి విరహాన్ని సహించలేక బాధపడుతూ ఉండేటపుడు, దానికి తోడుగా, చల్లని గాలి వీచి ఆమెను బాధించింది. దానికి ఆమె తపిస్తూ పలికే పాశురం, ఇది. చల్లని గాలి ("వాడై"- ఉత్తరదిక్కునుండి వీచే గాలి) వల్ల కలిగే క్లేశాతిశయాన్ని చూచినపుడు సాయం సమయంవల్ల కల్గిన బాధ తీయనిది (మెఱుగైనది)- అని తోచినందున, నాయకునకు దూరమై, అతని ప్రసాదమైన తులసిని అయినా పొంది ప్రాణధారణను చేయవచ్చు - అని ఆశపడిన, స్త్రీలకు సాయంసమయం చేసిన సహాయాన్ని అంతటిని కొల్లగొట్టడంకోసం వచ్చి ఈ ఉత్తరపుగాలి (వాడై) వీస్తున్నది- అని నాయకి అంటున్నది. సాయంకాలం అనేది మిగిలినవానిని అన్నిటిని కొల్లగొట్టినా, ప్రాణాన్ని మాత్రం అపహరించకుండా విడచిపెట్టింది. ఈ ఉత్తరపుగాలి దానినికూడా కొంచెం అయినా మిగలకుండా ఉండే రీతిలో తీసికొనివెళ్ళాలని వచ్చింది- అని అంటున్నది, నాయకి.

**(ఇదు ఓర్ పని వాడై)** - **"ఇదు"**- అని ప్రత్యక్ష నిర్దేశం చేయడం- ఆ గాలియొక్క క్రౌర్యాన్ని గూర్చి నోటితో వివరించి పల్కడం సాధ్యం కాక, చేతిలో నిర్దేశిస్తూ పల్కిన రీతి. **"ఓర్ వాడై"**- అనేది దీనికి పూర్వం వీచిన వాయువులవంటిది కాకుండా, ఇది స్త్రీజన్మను ఎత్తినవారిని చాలా బాధించి, నూతనమైనదై, సాటి లేనిదై, ఎవరి సహాయం అక్కర లేకుండానే ఒంటరిగానే వచ్చే అద్వితీయమైనది- అని భావం. **"పనివాడై"**- అనేది పూర్వం చల్లగా ఉండే స్థితిని ఉద్దేశించి పల్కిన సూక్తి. ఇపుడు చాలా వేడిగాకదా ఉంటుంది. అంతేకాక, 'పని'- (స్త్రీలను) వణకించే భీతిని కల్గించే వాయువు- అని కూడా చెప్పవచ్చు.

**(తుళ్ళా కిన్డదు)**- ప్రాణం ఉండే చోటును వెదకి చూచి మర్మస్థానంలో చేతిని పెట్టి వెదకి తడవుతున్నది- అని భావం.

**(ఓర్ వాడై పుకున్దు తుళ్ళాకిన్డదు)**- వెన్నెల, సాయంం సమయం, సముద్రఘోష- అనేవి అన్నీ కలసినా చేయలేని హింసను ఈ ఉత్తరపుగాలి ఒక్కటే చేస్తున్నది- అని భావం.

నాయకుని విశ్లేషించి బాధపడే తన కంటికి కన్పించే పదార్థాలు అన్నీ తనవలెనే బాధపడుతున్నట్లుగా తోచినందున సూర్యుడనే పతిని కోల్పోయిన పడమటి దిక్కు అనే స్త్రీ బాధపడి విలపించే సాయంకాలం **"పకలిళన్దమేల్ పాల్ తిశైప్పెణ్ పులమ్బుఱు మాలై"** అని నాయకి అన్నది. దీనివల్ల, సాయంకాలంలో పతిని విశ్లేషించిన స్త్రీలు బాధపడతారని వ్యక్తం చేయబడింది. **"పాల్‌వాయ్"** అనే విశేషణాన్ని ఉపమానమైన **"పిఱై"** అనే పదానికి, ఉపమేయమైన **"పిళ్ళై"** అనే పదానికి- రెండిటికి అన్వయించాలి.

పాశురంలోని ఒకటిన్నర పాదంతో సాయంకాలాన్ని నాయకి వర్ణిస్తున్నది. పడమటి దిక్కు అనే ఒక స్త్రీ సూర్యుడనే తన నాథుని కోల్పోయి, బాలచంద్రుడనే పాలు మాఱని నోటిని కల తన చిన్నబిడ్డను తన చంకలో పెట్టుకొని, "అయ్యో! చిన్నబిడ్డను విడచిపెట్టి నాథుడు వెళ్ళిపోయాడే!'' అని దుఃఖిస్తూ విలపించేవారివలె ఉన్నది- సాయంకాలం. ఇటువంటి సాయంకాలం, **(ఉలకళన్ద మాల్‌పాల్ తుళ్ళాయ్‌క్కు మనముడైయార్‌క్కు నల్‌కిన్డదెల్లామ్)**- లోకాలను కొలిచిన స్వామి దగ్గర ఉండే తులసిని ఆశపడే మనస్సును కల స్త్రీలకు ఏదో సహాయం చేస్తున్నదని, ఆ సహాయాన్ని అంతటిని ఉత్తరదిశలోని గాలి **(వాడై)** అపహరించడంకోసం వచ్చి

తడవుతున్నదని ఇక్కడ చెప్పబడుతున్నది కదా! ఆవిధంగా సాయంసమయం ఏ సహాయం చేస్తున్నది? అని అంటే- ప్రాణాలను హరించి తీసికొనిపోకుండా విడచిపెట్టడమే అది చేసిన గొప్ప ఉపకారమని భావం. అది తీసికొనిపోకుండా వదలి పెట్టిన ప్రాణాలను సైతం తీసికొని పోవడంకోసం ఈ ఉత్తరదిక్కులోని గాలి- వచ్చింది, అని అంటూ వాడై క్రౌర్యాన్ని తెలిపినట్లయింది.

"మనముడైయేఱ్కు" అని ఉత్తమపురుషలో పలుకవలసిన చోట "మనముడై యార్క్కు" అని తమను ప్రథమపురుషలో (పరోక్షంగా) నిర్దేశించి పలుకబడింది. లేక, తమవంటివారిని నిర్దేశించినట్లుగా కూడా చెప్పవచ్చు. "నల్కి**ణ్ ణ్రై**ఎల్లామ్"- బహువచనార్థంలో ఏకవచన ప్రయోగం ఇది. "నల్కి**ణ్ ఱు**" ఏకవచనంలో భూతకాలికమైన క్రియాజన్యనామపదం. **"వినైయాల్ అణైయుమ్ పెయర్" ("ఒణ్ణన్ పాల్ ఇఱన్ద కాల వినైయాల్ అణైయుమ్ పెయర్") "శోల్వాన్"** ఇది- కృదంత రూపం. **(వినైయెచ్చమ్). "శోర్వాన్"**- అనే పాఠాంతరం కూడా ఉన్నది.

భగవానుని దరి చేరి ఆనందాన్ని అనుభవించగోరిన ఆ*ழ்*వ్వార్లకు ఆసంశ్లేషం, వేగంగా అపుడే లభించనందున క్లేశపడ్డారు. అపుడు ఆ*ழ்*వ్వార్లకు ఆ అనుభవానికి తగిన కాలం ప్రాప్తమై ఆర్తిని అధికం చేస్తూ ఉండే సమయంలో, సంసారంలో సుఖహేతువులైన పదార్థాలన్నీ బాధకాలుగా తోచాయి. ఇంకా ఇంకా క్లేశపెట్టే (వాటి) స్వభావాన్ని చూచి, ఆ*ழ்*వ్వార్లు క్లేశపడుతూ పలికే సూక్తి - ఈ పాశురంలోని స్వాపదేశం. భగవంతుని విశ్లేషించిన స్థితిలో అతనిని చేరడానికి తగిన కాలం సమీపిస్తే, కొంచెం జ్ఞానమే మిగిలి ఉండేటట్లుగా మిక్కిలి ప్రకాశాన్ని కల్గిన వివేకం అంతా నశించి, పరతంత్రులై ఉండేవారికి గొప్ప ఆర్తి (సహించలేని స్థితి) ఏర్పడుతుంది- అనేది **"పాల్వాయ్ పిఱైప్పిళ్ళై ఒక్కలై క్కొణ్డు పకలి*ழ்*న్ద మేల్పాల్ తిశై ప్పెణ్ పులమ్బుఱుమాలై"** అనే సూక్తి ద్వారా స్ఫురిస్తుంది. **"పాల్వాయ్ పిఱైప్పిళ్ళై"**- జ్ఞానంలోని అల్పభాగం- అని అర్థం., **"పకలి*ழ்*త్తల్"**- వివేకం నశించడం. **"మేల్ పాల్ తిశైప్పెణ్"** -మిగిలినవారికి గొప్పదైన, ఉన్నతమైన దారిని చూపే పరతంత్రులు, **"పులమ్బుఱుదల్"**- ఆర్తి అతిశయించడం, **"మాలై"**- సంశ్లేషానికి తగిన కాలం. పాశురంలోని ఉత్తరార్ధంలో- సకల ప్రపంచాలను తనకే చెందిన వస్తువులుగా కల్గిన నాయకుడైన భగవానుని భోగ్యతలో అభినివేశాన్ని కల్గినవారికి ఆ స్వామియొక్క అనుభవం లభించనందున కల్గిన ఆర్తికి తోడు, సంసారంలోని పదార్థాలుకూడా బాధకాలై, క్లేశాన్ని కల్గిస్తాయి- అని భావం.

"ఉలకళన్దమాల్"- అని అన్నందున వారు వారు ప్రార్థించకపోయినా, జీవులందఱి తలలపై శ్రీచరణాలను తానే పెట్టి, స్వామి అవి అన్నీ తన సొత్తుగా పాలించాడు. పరిగ్రహించాడు. కాని, ప్రార్థించే నన్ను దాసురాలినిగా స్వీకరించకుండా ఉన్నాడే- అనే నాయకి యొక్క ఆర్త్యతిశయం స్ఫురిస్తుంది.

"మనముడైయార్క్కు" - అని పరోక్షనిర్దేశం చేసినందున ఈ పాశురాన్ని సఖీవచనంగా మాతృవచనంగా భావించేవారున్నారు. అపుడు, ఆళ్వార్ల స్థితిని చూచి శ్రీవైష్ణవులు భయపడడం స్వాపదేశార్థంగా గ్రహించాలి.

### సఖి నాయకుని కాఠిన్యాన్ని గూర్చి పల్కడం

**36. తుళ్ళానెడుమ్ శూళ్ళిరుళెన్ఱు, తన్తణ్డారదు పెయరా**
**ఎళ్ళానెడు వూళ్ళి యెళ్ళున్ద విక్కాలత్తుమ్-, ఈఙ్గివళో**
**వళ్ళానెడుమ్ తున్బత్తళెన్ఱిరఙ్గారమ్మనో! ఇలఙ్గై**
**క్కుళ్ళా నెడుమాడమ్, ఇడిత్త పిరానార్ కొడుమైగళే**

తుళ్ళా నెడు శూళ్ ఇరుళ్ ఎన్ఱు = (కంటికి వస్తువులు కన్పించనందున చేతులతో) తడవి వెదకవలసిన రీతిలో అంతు లేకుండా నిండిన చీకటి సమయం అని (ఒక పేరును పెట్టి), ఎళ్ళా నెడు ఊళ్ళి ఎళ్ళున్ద = పూర్వం ఏనాడూ తోచని చాలా దీర్ఘమైన కల్పం తోచిన, ఇ క్కాలత్తుమ్ = ఈ సమయంలో కూడా, ఈఙ్గు ఇవళో = ఇక్కడ ఈ (విరహప్రయుక్తమైన) ఏకాంతాన్ని సహించలేని ఈమెయే కదా, తమ్ తణ్ తార్ అదు పెయర్ ఆ = తమ చల్లని తులసీమాలిక విషయంగా (తులసీమాల- అనే పేరునే మాటిమాటికి పల్కుతూ), వళ్ళా నెడు తున్బత్తళ్ = అంతరాయం లేని- నిరంతరమైన- దీర్ఘమైన దుఃఖాన్ని పొందింది, ఎన్ఱు = అని ఈమె స్థితిని మనస్సులో పెట్టుకొని, ఇరఙ్గార్ = (నాయకుడు) జాలిపడి, వచ్చి అనుగ్రహించడం లేదు, అమ్మనో = అమ్మో!, ఇలఙ్గై= ఈ లంకా నగరంలోని, కుళ్ళామ్ =గుంపులుగా ఉండే, నెడు మాడమ్ = పెద్ద పెద్ద మేడలను, ఇడిత్త = (తమ సేనను గొని) భగ్నం చేసి పడదోసిన, పిరానార్ =నాథుని, కొడుమైకళే= కాఠిన్యాలుండే తీరు ఏమో కదా!

**భావదీపిక :** నాయకుని కాఠిన్యాన్నిగూర్చి సఖి పలికే పాశురం ఇది. గడచిన పాశురంలో సాయం సమయం, ఉత్తరపు గాలి హింసించే రీతి తెలుపబడింది.

దానికి మించి చీకటి ముసురుకొన్నది. ఉత్తరపు గాలి, రాత్రి- అనే రెండు "ఈమెను నేను ముందు వధిస్తాను, కాదు, నేను ముందు ఈమెను వధిస్తాను'' అని అంటూ వెళ్ళే రీతిలో అవి బాధిస్తున్నాయి. ఒక రాత్రిసమయమే పలు యుగాలుగా తోచి, క్లేశాన్ని అధికం చేసే ఈ కాలంలో కూడా ఈమె స్వభావాన్ని తెలిసినా, జాలిపడి వచ్చి సహాయపడని నాయకుడు చాలా కఠినుడు - అని సఖి అంటున్నది.

**(అమ్మనో!)** - అయ్యో! అనే రీతిలోని ప్రయోగం ఇది. నాయకుని కాఠిన్యానికి భయపడి పల్కిన మాట. నాయకుని విశ్లేషించి ఒంటరిగా ఉండే ఈ నాయకికి రాత్రిసమయం చాలా దీర్ఘమవుతున్నదని, ఈమె, విశ్లేషాన్ని సహించలేని స్వభావాన్ని కల్గినదని, ఈ తులసీ మాలికను అయినా పొందితే ఒక విధంగా ఈమె ప్రాణాలను ధరించవచ్చునని, దానినే విడువకుండా పలవరించే రీతిలో ఈమె విరహార్తి అతిశయించినదని, ఆ ఆర్తి వేఱు ఏ రీతిలోను తీరదని- ఈవిధంగా జాలిపడడానికి అనేక కారణాలు ఉండగా, వీటిని చూచి జాలిపడకపోవడం- నాయకుని ప్రత్యేక ప్రత్యేకమైన కాఠిన్యాలనే భావం (ఇక్కడ కారణవైవిధ్యాన్నిబట్టి కాఠిన్యవైవిధ్యం భావ్యం) స్ఫురించేటట్లుగా **"కొడుమైకళే"** అనే బహువచనప్రయోగం చేయబడింది. పూర్వం ఒక (సీతా) పిరాట్టియొక్క ఆర్తిని చూచి జాలిపడి, దానిని తీర్చడంకోసం లంకను నాశనం చేసి, ఆమెకు ఉపకారం చేసినవాడు ఇపుడు ఆ స్వభావం మాఱి, ఈమె విషయంలో కఠినుడైన రీతి ఏమో కదా!- అనే భావంతో **"ఇలఙ్గై క్కుழா నెడుమాడమ్ ఇడిత్త పిరానార్ కొడుమైకళే"** అని సఖి అంటున్నది. తిరువరఙ్గక్కలమ్బకమ్‌లోని **"కడల్ వழிవిడ నిశరర్ పొడిపడ విరుకణ్ శీఱి వడకయిలైయై లెழு విడై తழுవియదు మఱన్దారో, అడలరవమళియలఱి తుయిలమరు మరఙ్గేశర్ ఇడర్ కెడ వరుకిలర్ మురుకలర్ తుళవు మిరఙ్గారే"** (బలాన్ని కల శేషుడనే శయనంలో యోగనిద్రను పొందే శ్రీరంగనాథుడు నా విరహవేదన తీరేటట్లుగా రావడం లేదు. అంతేగాక, సువాసనను కల తన తులసీమాలికను నాకు అనుగ్రహించడం లేదు. అందువల్ల పూర్వం సముద్రం దారిచూపగా, అసురులు చూర్ణం అయ్యేటట్లుగా తన రెండు నేత్రాలలో కోపాన్ని పొంది, శ్రీకృష్ణావతారంలో ఉత్తర దిక్కులో గల కైలాసపర్వతం వంటి ఏడు ఎద్దులను మర్దించిన విషయాన్ని అతడు మరిచాడా?) అనే సూక్తి స్మరణీయం. లేక, అపుడు లంకను పాడుచేసినది, పిరాట్టి విషయంలో జాలివల్ల కాదు, దుష్టనిగ్రహాన్ని చేసి, తమ ప్రభుత్వాన్ని సుస్థాపనం చేయడంకోసమే (స్వార్థం కోసమే)- అనే భావం స్ఫురించేటట్లు ఈ విధంగా సఖి పల్కిందని చెప్పవచ్చు.

ఈ సందర్భంలో పెరియవాచ్చాన్‌పిళ్ళై శ్రీసూక్తిని గమనించండి. **"ఒరుత్తిక్కాక క్కడల్ అడైత్తు, రామనెన్టుమ్ లక్ష్మణనెన్టుమ్ వెట్టిన అమ్బుకళై పుకవిట్టు కుట్టిచ్చువరుమ్ మట్టైత్తెఱ్ఱుమాక్కి మూలై యడియే పోకప్పణ్ణిన ఇన్ద ఉపకారనుడైయ ఇన్ద నీర్మైయెల్లామ్ ఎఙ్గే కుడిపోయిఱ్ఱో? ఎన్టు ఎమ్బార్ అరుళిచ్చెయ్‌వర్. ఇదు వుమ్ అఴకిదొన్టు ఉణ్డాయిరుక్కలాకాదెన్టు అసూయైయాలే అఴిత్తానిత్తనైకాణ్. ఒరుత్తిక్కాక ఉదవినవనల్లకాణ్ -ఎన్గిఱాళ్. ఎన్టు తిరుమలైనమ్బి"** (ఒకతె (సీతాదేవి) కోసం సముద్రాన్ని బంధించి, రాముడని, లక్ష్మణుడని పేర్లు చెక్కిన బాణాలను ప్రయోగించి లంకను నాశనం చేసిన ఈ ఉపకారకుని ఈ కృపాస్వభావం అంతా ఎక్కడికి పోయిందో కదా!- అని ఎమ్బార్ అనేవారు. ఇది కూడా చాలా అందమైన నగరం. ఇది ఉండకూడదు- అనే అసూయతో నశింపజేశాడు. అంతేసుమా! ఒకతె కోసం సహాయపడినవాడు కాడు- అని అంటున్నది- అని తిరుమలైనంబి అనేవారు)

**"తుఴా"**- అనే పదానికి విశ్లేషించిన నాయకి ప్రాణాలను చేతితో తడవి వెదకే- అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"శూఴ్ ఇరుళ్"**- తప్పుకోవాలని ప్రయత్నించినా తప్పుకోనివ్వని చీకటి- అని అర్థం. **"తణ్డారదు పెయరా వఴా నెడుమ్ తున్బత్తళ్"**- అని అన్వయం. తులసీమాలికకోసం నాయకి క్లేశపడుతున్నది- అని భావం. లేక, **"తణ్డారదు పెయరా ఊఴి యెఴున్ద"** అని అన్వయించి, ఈమె నాయకుని మాలికను ఆశపడినది - అనే నెపంతో ఈమెను బాధించడంకోసం చీకటి అనే ఒక కల్పం పుట్టిన ఈ సమయంలో కూడా- అనే అర్థాన్ని చెప్పవచ్చు.

**(ఇరుళెన్టు ఊఴి ఎఴున్ద ఇక్కాలమ్)**- వచ్చేటపుడు ఒక సన్యాసిగా వచ్చి, దగ్గరకు చేరినపుడు రావణుడైనట్లే, వచ్చేటపుడు ఒక చీకటిగా, దరి చేరినపుడు పలు కల్పాలై ఉండే కాలం- అని భావం.

**(ఇరఙ్గార్)**- శ్రీరామచంద్రుడు అంగుళీయకాన్ని ఇచ్చి, హనుమానుని దూతగా సీతదగ్గరకు పంపినట్లే, తన తులసిని ఇచ్చి ఎవరో ఒకరిని దూతగా పంపించలేదే- అని నాయకి అంటున్నది. ప్రేమించకపోయినా, అయ్యో! అనే జాలిని అయినా నాయకుడు చూపించలేదే! అని అంటున్నది. జాలి అంటే- ఇతరుల దుఃఖాన్ని సహించలేకపోవడం. **"నెడు ఊఴి"** అనే దానికి- కల్పానికి కూడా ఒక అవధి ఉన్నది; ఆ అవధికూడా దీనికి లేదు' అనే విశేషార్థాన్ని చెబుతారు. ప్రళయకాలంలో వచ్చి కన్పించి రక్షించేవాడు ఈ కాలంలో కూడా కన్పించకుండా ఉండవచ్చా? అనే భావం స్ఫురించేటట్లు **"ఇక్కాలమ్"** అని అనబడింది.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే -తగిన సమయం వచ్చినప్పటికీ ఫలం చేజిక్కని ఆళ్వార్లకు కల్గిన ఆర్త్యతిశయాన్ని చూచిన వారి భక్తులు "భగవానునకు దయలేదా !" అని శంకించి పల్కడం.

**(తుళ్లానెడుమ్ శూళ్లిరుళెన్ఱు ఎళ్లానెడు ఊళ్లి యెళ్లున్ద ఇక్కాల త్తుమ్)-** అని అన్నందున కాలవిలంబాన్ని సహించలేనందున మోహాంధకారాన్ని కల్గించే కాలం వీరికి దీర్ఘమై తోస్తున్నది- అనేది తెలుస్తున్నది.

**(ఊజ్గివళో తమ్ తణ్డారదుపెయరా వళ్లానెడున్దున్బత్తళ్ ఎన్ఱిరజ్గార్) -** అని అన్నందున "ఈ తామసమయమైన లోకంలో తమ క్లేశాన్ని తాము తీర్చుకొనే శక్తి లేని ఈ ఆళ్వార్లు నా భోగ్యతను గూర్చే పల్కుతూ, దానిని పొందలేని కారణంగా చాలా బాధపడుతున్నారని" భావించి, భగవానుడు వారిపై దయ చూపలేదు- అనే భావం తెలుపబడుతున్నది.

**"ఇలజ్గె క్కుళ్లా నెడుమాడ మిడిత్త పిరానార్ కొడుమైకళే"-** అని అన్నందున లోకం అంతా ఉజ్జీవించడంకోసం అవతరించి, దుష్టనిగ్రహాన్ని, శిష్టపరిపాలనాన్ని చేసినవాడు ఈ ఆళ్వార్ల ఒక్కరిపట్ల దయ చూపని కాఠిన్యం అయ్యో! ఏమి- అనే భావం స్ఫురిస్తుంది. ఈ పాశురాన్ని నాయకి మాటగా కూడా గ్రహించవచ్చు. అపుడు స్వాపదేశార్థంలో ఆళ్వార్ల సూక్తిగా గ్రహించాలి.

**"తుళ్లా"** ఇది **"తుళ్లావు"** అనే పదంయొక్క వికృతి. **"తుళ్లామ్"** అని విడదీసి దీనిని **"తుళ్లావుమ్"** అనే కృదంత రూపంలోని చివరి అచ్చు, హల్లు లోపించిన రూపంగా గ్రహించవచ్చు. "ఎల్లప్పుడు తడవి వెదకే- అనే అర్థాన్ని గ్రహించవచ్చు, ఈరూపంలోని చివరిహల్ వర్ణంలోపించిన **'తుళ్లా'** అనే రూపంగా చెప్పవచ్చు. **"తారదు"** - ఇక్కడ **"అదు"** -అనేది **"పకుదిప్పొరుళ్‌వికుది"** (పదం యొక్క అర్థం మారకుండే వానికి చేరిన ప్రత్యయం) **"అమ్మనో"** -ఇది అవ్యయం. సంస్కృతంలోని **"అహహ"** అనే పదం వంటిది **"ఎళ్లా"** **-ఎళ్లాద** (ఉదయించని), **"ద"** అనే **"వళ్లా"- వళ్లాద** (భ్రంశం లేని) అని అర్థం. ఈ రెండు పదాలు **"ఈఱు"** (పదంలోని అంతిమభాగం) లోపించిన వ్యతిరేకార్థక తద్ధితాంతరూపాలు. **("ఈఱు కెట్ట ఎదిర్ మఱై పెయరెచ్చమ్")**

## కన్నతల్లి తన కుమార్తె ప్రయాణం చేసే మార్గంలోని దుర్గమత్వాన్ని గూర్చి పల్కి బాధపడడం

37. కొడుఙ్గాల్ శిలైయర్ నిరైకోళుఱ్ఱువర్, కొలైయిల్ వెయ్య
కడుఙ్గాలిళైఞర్ తుడి పడుమ్ కవ్వైత్తు-, అరువినైయేన్
నెడుఙ్గాలముమ్ కణ్ణన్ నీణ్మలర్ ప్పాదమ్ పరవి ప్పెఱ్ఱ
తొడుఙ్గాలొశియు మిడై, ఇళమాన్ శెన్ఱ శూఱ్ఱ్ కడమే

అరు వినైయేన్ = అనుభవించి పూర్తికాని దుష్కర్మఫలాన్ని కల్గిన నేను, నెడు కాలముమ్ = చిరకాలం, కణ్ణన్ =శ్రీకృష్ణుని, నీళ్ మలర్ పాదమ్ = పొడుగైన తామరపూవువంటి శ్రీచరణాలను, పరవి = ఆరాధించి, (శరణు పొంది), పెఱ్ఱ= ఆ ఆరాధన ఫలంగా పొందిన, తడుఙ్కాల్ ఒశియుమ్ ఇడై ఇళమాన్ = తాకితేనే పగిలి పోయే రీతిలోని (చాలా మృదువైన) నడుమును కల్గినది, లేలేత పరువాన్ని కల లేడి కన్నులవంటి కన్నులను కల్గినదైన కుమార్తె, శెన్ఱ = నడచిపోయిన, శూఱ్ఱ్ కడమ్ = విస్తృతమైన ఎడారిప్రాంతం (ఎటువంటిది? అంటే), కొడు కాల్ శిలైయర్= క్రూరమైన నారిని కల వింటి అగ్రభాగాన్ని కల్గినవారు, నిరై కోళ్ ఉఱ్ఱువర్ = పశువుల సమూహాలను అపహరించడమే వృత్తిగా కల్గినవ వారైన, కొలైయిల్ వెయ్య= హింసావృత్తిలో కఠినులు, కడు కాల్ = నడకలో మిక్కిలి వేగాన్ని కల్గిన కాళ్ళను కలవారైన, ఇళైఞర్ = లేతవయస్సులోని వీరుల, తుడి = డప్పులు, పడుమ్ = శబ్దించే, కవ్వైత్తు = సంరంభాన్ని కల్గినది.

**భావదీపిక :** తన కుమార్తె వెళ్ళిన మార్గం దుర్గమమైనదని తెలిసి నాయకి కన్నతల్లి (నల్తాయ్) బాధపడుతున్నది, నాయకునితో కలసి రహస్యం నాయకితో కలసిన, నాయకుడు తమను గూర్చి లోకులు పలు విధాలుగా మాట్లాడుతున్నారని సఖిద్వారా తెలిసినపుడు, వెంటనే నాయకిని బహిరంగంగా వివాహమాడడం అలవాటు. ఆ విధంగా చేయకపోతే, జనం పలికే నింద అణగిపోయేవరకు కొన్నాళ్లు నాయకిని విడచి ఉండడమో, లేక, ఆమెను తీసికొని తన ఊరికి వెళ్ళిపోవడమో జరుగుతుంది. ఈ ప్రక్రియలో ప్రస్తుతం నాయకుడు నాయకిని వెంటబెట్టుకొని తన ఊరికి వెళ్ళిపోయిన సందర్భం ప్రస్తావింపబడుతున్నది. ఆ విధంగా అతడు, నాయకితో కలసి పోయిన దారి అరణ్యప్రాంతం. దుర్గమమైన అడవి. ఆ దారిలో నాయకి ప్రయాణం చేసిన సంగతిని సఖిద్వారా తెలిసిన నాయకి పెంపుడు తల్లి

దానిని కన్న తల్లికి తెలుపగా, ఆమె తన కుమార్తె పయనించిన ఆ ఎడారిప్రాంతంలో ఎదురయ్యే పలు క్లేశాలను, తన కుమార్తె సౌకుమార్యాన్ని తలచి బాధపడుతూ పల్కుతున్నది.

కొంతకాలం నాయకునితో సంశ్లేషించి నాయకి, నాయకుడు తిరిగి వచ్చేవరకు సహించి ఉండలేక, విశ్లేషాన్ని పొందిన కన్నతల్లికి తెలియకుండా రాత్రివేళ ఒంటరిగా బయలుదేరి నాయకుడుండే చోటుకు వెళ్ళింది. కొంతసేపటికి ఈమె పడుకలో లేకపోవడం గమనించిన తల్లి, ఆమెకు దారిలో ఎదురయ్యే కష్టాలను, అపాయాలను తలచి శోకిస్తున్నది- అని కూడా కొందఱి వివరణం.

**"అరువినైయేన్ నెడుమ్ కాలముమ్ కణ్ణన్ నీణ్ మలర్ప్పాదమ్ పరవి ప్పెఱ్ఱ తొడుఙ్కాలొశియు మిడై ఇళమాన్ శెన్ఱ శూழ் కడమ్ కొడుఙ్గాల్ శిలైయర్ నిరైకోళుழవర్ కొలైయిల్ వెయ్య కడుఙ్కాల్ ఇళైఞర్ తుడిపడుమ్ కవ్వైత్తు"** అనేది పాశురాన్వయం.

పలు దినాలు దేవతానమస్కారం, దేవాలయప్రదక్షిణం మొదలైనవానిని చేసి కని, మురిపెంగా పెంచిన కూతురు తనతో చెప్పకుండా తనను విడచి, చాలా కఠినమైన ఎడారిదారిని దాటి పయనించినందుకు కారణమైన మహాపాపాన్ని కల్గినదానను, నేను- అనే భావంతో **"అరువినైయేన్"**- అని తల్లి అంటున్నది. పాపిష్ఠురాలనైన నేను పలు ఏండ్లు భగవానుని ఆరాధించి, దాని ఫలంగా పొందిన నా కూతురు యొక్క సౌకుమార్యం ఎటువంటిదో తెలుసునా? **"తొడుఙ్కాల్ ఒశియు మిడై"** - ఆమెను కౌగలించుకొనే నాయకుడు తాను దానిని తాకినంతలోనే భగ్నమైపోతుందేమో! అనే రీతిలో చాలా సూక్ష్మంగా ఉండే నడుమును కల్గినది. ఉల్లాసంగా, ఒయ్యారంగా తన నడుముపై తాను చేయిపెట్టుకొన్నా, ఒక పర్వతాన్ని పెట్టుకొన్నట్లుగా సహించలేని సుకుమారమైన నడుమును కల్గినది. "నడుము అనేది అసలు ఉన్నదా? లేదా?'' అనే సందేహం తీరడంకోసంగా నడుముపై చేయి పెట్టి చూచినా, ఆ స్పర్శను సైతం సహించలేని నడుమును కల్గినది. లేత వయస్సులోని జింకవంటిది. ఇటువంటి అపురూపసౌందర్యవతి ఇపుడు నడచి పోయిన ఎడారి ప్రదేశంలోని కాఠిన్యం ఎటువంటిదో తెలుసునా?

**(కొడుఙ్గాల్ శిలైయర్ నిరైకోళుழవర్ కొలైయిల్ వెయ్య కడుఙ్గాల్ ఇళఞర్ తుడిపడుమ్ కవ్వైత్తు)**- ప్రాణిహింసనే వృత్తిగా తిరిగే పాపులు మోగించే డప్పుల

ఘోష అనే మిక్కిలి సంరంభం కల్గినది. అంతటి సుకుమారి ఇటువంటి భయంకర మైన దారిలో నడచి వెళ్ళిందే!- అని కడుపుపై మోదుకుంటూ తల్లి శోకిస్తూ పల్కుతున్నది. తన కుమార్తె వెళ్ళిన ఎడారిదారిలో ఉండేవారి క్రౌర్యాన్ని నాల్గు విశేషణాల ద్వారా తల్లి పల్కుతున్నది.

**(కొడుఙ్గాల్ శిలైయర్)-** వంచిన ధనుర్దండాన్ని కల్గినవారని అనడం ద్వారా- ఒక వస్తువును చూచిన తరువాత, దానిపై బాణప్రయోగం చేయడంకోసం వింటిని వంచి, నారి సంధించి బాణాలను పూన్చి చేతిలో సిద్ధం పెట్టుకొని, బాణప్రయోగం చేయడంకోసం లక్ష్యాన్ని అన్వేషిస్తూ తిరిగే వారు- అని అర్థం స్ఫురిస్తుంది. **"కొడుఙ్గాల్"** - అనేచోట **"కొడుమై"** అంటే -వంగి ఉండడం- అనే అర్థాన్ని **'కొడుమరమ్"** అనే పదం వింటియొక్క పర్యాయనామమైనందున గ్రహించవచ్చు. లేక, **"కొడుమై"** - భయంకరమైన- అని కూడా అర్థం. **"కాట్చిలై"** -**"శిలైక్కాల్"** (అని పదాలను మార్చి అన్వయించాలి) ధనుర్దండమని అర్థం.

**(నిరైకోళ్ ఉழవర్)-** గో(పశు) వధకుసైతం ఏమాత్రం జంకనివారు- అని అర్థం. "నిరై"- పశు సమూహాన్ని **"కోళ్"**- హింసించడమే, **ఉழవర్** - వృత్తిగా కలవారు. క్షేత్రాన్ని శ్రమపడి దున్ని పైరు చేసేటట్లుగా, పరహింసనే నిరంతరం శ్రమపడి ప్రయత్నించి మిక్కిలి ఆసక్తితో చేయడమే జీవనోపాధిగా కలవారని తాత్పర్యం.

**(కొలైయిల్ వెయ్య)-** హింసాప్రవృత్తిలో పరమక్రూరులు. ధనంకోసం, పగ తీరడంకోసం, వేఱొక ప్రయోజనంకోసం కాకుండా, ఇతరులు దుఃఖిస్తే బాధపడితే చూడడంకోసంగా వధించడం వీరి హింసలోని క్రౌర్యం. లేక, చచ్చే రీతిలో హింసించ కుండా ప్రాణావశిష్టంగా చిరకాలం పడి ఉండి బాధపడేటట్లు హింసించడం- అని కూడా భావం.

**(కడుఙ్కాల్ ఇళైఞర్)-** "పది యోజనాలకు, ఇరవై యోజనాలకు ఆవల హింసించడానికి ఒక ప్రాణి ఉన్నది'' అని ఎవరైనా అంటే, ఆ విషయంలో ఏమీ వెనుకముందు చూడకుండా, అంత దూరం వేగంగా పోయి, తిరిగి రాగల్గిన కాలిబలం కలవారు- అని భావం. ఈ విధంగా ఇటువంటి క్రూరకర్మలలో సమర్థులైన యువవీరులు వాయించే డప్పులు నిరంతరం మోగే ప్రాంతం, ఈ లేడివంటి చిన్నది పోయిన ఎడారి ప్రాంతం- అని భావం. **"శుழ్ కడమ్"** అనేదానికి

"శూఴ్‌చ్చిఱై యుడైయ వఴి" అని, "శూఴ్‌చ్చియావదు- వెమ్మైయాల్ తుయరై విళైత్తల్" (ఇక్కడ "శూఴ్‌చ్చి"- పన్నాగం ఏమంటే- క్రౌర్యంతో దుఃఖాన్ని కల్గించడం) అని అఴగియమణ వాళచ్చీయర్ వివరణం.

**(తుడి పడుమ్ కవ్వైత్తు)- "తుడి"** -అంటే- ఎడారి ప్రాంతంలో వాయించే డప్పు. (వాద్యం). ఇక్కడ ఊరివారు నోటిని డప్పుగా, నాలుకను దండంగా చేసి మోగించే (పలికే) అపనిందలనే సంరంభంకంటే అక్కడ ఎడారి ప్రాంతంలోని వ్యాధులు చేసే వాద్యవిశేషధ్వనినే నాయకి భోగ్యంగా తలచిన రీతి ఏమి? ఆశ్చర్యం!- అని అంటున్నది తల్లి.

**"నెడుమ్ కాలముమ్"** అనే ప్రయోగంలోని **"ఉమ్" (ముఱ్ఱువైమ్మై)** ఆధిక్యాన్ని (మికుతి) సూచిస్తుంది. **"కణ్ణన్ నీణ్ మలర్‌ప్పాదమ్"** అనే ప్రయోగం త్రివిక్రమావతారంలో తన శ్రీపాదాన్ని చాచిన సందర్భాన్నిగూర్చి చేయబడినదన వచ్చు. లేక, శ్రీచరణాలకు గల దైర్ఘ్యమేమంటే- సమయం చూచి భక్తుల మనస్సులలోకి వెంటనే వచ్చిచేరడమే. **"మాన్"**- ఉపమానలక్షకపదం. **"ఉవమై యాకు పెయర్"** - ఉపమేయాన్ని లక్షించే ఉపమానపదం. (ఇక్కడ జింక -అని అర్థమిచ్చే ఈ పదం జింకవంటి నాయకిని లక్షిస్తుంది) ఇక్కడ అందమైన చూపును కల్గి ఉండడానికి ఉపమానం జింక. ఆమె తనను, సఖులను విడచిపెట్టి వెళ్ళినందున సంభవించిన ఒంటరితనం వల్ల భీతిల్లిన జింకపిల్లవలె అన్ని వైపుల భయంగా చూస్తూ ఉన్నది- అనే అర్థాన్ని భావించి **'ఇళమాన్'** (జింకపిల్ల) అని తల్లి అన్నది.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే- పయనించడానికి అరుదైన సంసారమార్గంలో ఆఴ్వార్లు అంతు లేని భక్తితో వర్తించడాన్ని తెలిసిన జ్ఞానులు దుర్లభులు- అని ప్రశంసిస్తూ పలికే సూక్తి. **"ఇళమాన్"** -ఈ పదం పరువాన్ని, (స్త్రీ)త్వాన్ని తెల్పినందున అభినవదాస్యాన్ని (శేషత్వాన్ని) కల్గిన, విశేషభక్తితో కూడిన జ్ఞానాన్ని కల ఆఴ్వార్లు- అని అర్థం.

**(తొడుఙ్కాల్ ఒశియుమిడై)** - అనేది భక్తికార్యమైన వైరాగ్యం యొక్క పరిణతిని స్ఫురింపజేస్తుంది. **"ఇడైయఴకెన్పదు ఒన్ఱుమ్ పొఱాద వైరాగ్యత్తై"** (ఇక్కడ నడుము అందం ఏమంటే- లౌకిక వాంఛను సహించని వైరాగ్యం)- అని అఴగియమణవాళచ్చీయర్ వ్యాఖ్యానం. **"అరువినైయేన్ నెడుఙ్కాలముమ్ కణ్ణన్ నీణ్‌మలర్ ప్పాదమ్ పరవి ప్పెఱ్ఱ"** అని అన్నందున పలు జన్మలలో చేసిన

తపస్సు, జ్ఞానం, యోగం- అనేవానిలో దుష్కర్మ నశిస్తే తప్ప వీరిపట్ల మనవారనే అభిమానం కలుగదు- అని, తమకు ఆ దుర్లభమైన ప్రాప్యం సిద్ధించినదని తెలుపబడినట్లయినది. "శెష్టవూ*ళ్* కడమ్"- వీరు ఈవిధంగా భక్తిని కలవారై వర్తించే సంసారమనే మహాసముద్రం-అని అర్థం.

**(కొడుఙ్కాల్ శిలైయర్- ఇత్యాది)-** బలమైన పంచేంద్రియాలు డప్పు వాయించినట్లుగా ప్రసిద్ధిని పొందిన ఆడంబరాన్ని కల్గినవి- అని భావం. మిక్కిలి భయంకరమైనవి- అనే ప్రసిద్ధి పొందిన పంచేంద్రియాలు స్వరూపహానిని కల్గించే చోటైన ఈ తమోమయలోకంలో పడి ఉండి క్లేశపడుతున్నానే- అని అంటూ ఆ*ళ్*వార్లు తమ దుఃఖాన్ని అన్యాపదేశంగా పల్కుతున్నారు.

## నాయకునకు దూరమైన నాయకి లౌకికపదార్థాలలో నాయకుని పోలికను చూచి ఆనందించడం

38. కడమాయినగళ్ క*ళ్*ిత్తు తఙ్కాల్ వన్మైయాల్, పలనాళ్
తడమాయిన పుక్కు నీర్ నిలై నిన్ఱ తవమిదుకొల్-,
కుడమాడి యిమ్మణ్ణుమ్ విణ్ణుమ్ కులుఙ్గ వులగళన్దు
నడమాడియ పెరుమాన్, ఉరువొత్తన నీలఙ్గళే

కడమ్ ఆయినకళ్ క*ళ్*ిత్తు = అరణ్యాలుగా ఉండే ప్రాంతాలను దాటిపోయి, తడమ్ ఆయిన పుక్కు = తటాకాలతో కూడిన ప్రాంతాలను ప్రవేశించి (అక్కడ), తమ్ కాల్ వన్మైయాల్ = తమ కాళ్ళ బలిమితో, పల నాళ్ = పలు దినాలు, నీర్ నిలై నిన్ఱ = నీటిలో నిలకడగా నిలచి చేసిన, తవమ్ ఇదు కొల్ = ఈ తపస్సు చేతనేనా, నీలఙ్గళ్ = నల్ల కలువలు, కుడమ్ ఆడి = (శ్రీకృష్ణావతారంలో) కుంభ నృత్యాన్ని చేసినవాడు, (త్రివిక్రమావతారంలో), ఇ మణ్ణుమ్ = ఈ భూమిని, విణ్ణుమ్=పైలోకాలను, కులుఙ్గ =(అవి) మనస్సు తేలిక పడేటట్లు, ఉలకు = లోకాలను, అళన్దు= కొలిచి, నడమ్ ఆడియ = ఈ విధంగా దివ్యలీలలను చేసిన పెరుమాన్ = భగవానుని, ఉరు ఒత్తన = తిరుమేని వర్ణంతో పోలిన వర్ణాన్ని పొందినవి.

**భావదీపిక :** ఇది నాయకుని విశ్లేషించిన నాయకి (నాయకుని) పోలికను చూచి ఆనందిస్తూ పలికే పాశురం. సర్వేశ్వరుడైన నాయకుని విరహాన్ని సహించలేక

విలపించే పరాంకుశనాయకి తాను క్లేశపడే ప్రాంతమైన **"నెయ్‌తల్"** -(సముద్రతీర) ప్రాంతంలో ఉండే నల్ల కలువపూలను చూచి, అవి నాయకుడైన శ్రీమన్నారాయణుని తిరుమేనివర్ణంతో పోలి ఉండడం గమనించి, అవి స్వామి తిరుమేనివర్ణంతో పోలి ఉండడమనే సారూప్యస్థితిని పొందడాన్నిగూర్చి ఆశ్చర్యపడి, "ఇవి చిరకాలం జలప్రదేశంలో నిలచి, నిరంతరం చేసిన తపస్సుయొక్క ఫలంకదా ఇది!" అని అంటున్నది. పోలికను చూచి ఆనందించడం **("పోలికణ్డు మకి*ழ்*దల్")** అనే ప్రక్రియయే కాకుండా, **("పోలికణ్డు అ*ழி*దల్")** - పోలికను చూచి శోకించడం- అనే ఇంకొక ప్రక్రియగా కూడా దీనిని చెప్పవచ్చు. పోలికను చూచి ఆనందించడం, దుఃఖించడం- అనేవి రెండూ ఉన్నాయి. **"పూవైయుమ్ కాయావుమ్, నీలముమ్ పూక్కిన్ఱ కావి మలరెన్ఱుమ్ కాణ్దోఱుమ్, పావియేన్, మెల్లావి మెయ్ మికవే పూరిక్కుమ్, అవ్వవై యెల్లామ్ పిరానురువే ఎన్ఱు"** (అవిసె పూలు, నల్లకలువపూలు, పూచే ఎర్రకలువలు - అనే వీటిని చూచినప్పుడంతా ఇవన్నీ భగవానుని రూపాలే అని నా మృదువైన శరీరం, ప్రాణం చాలా ఉబ్బితబ్బిబ్బుపోతున్నవి) అనే పెరియ తిరువన్దాది పాశురంలో ఆనందించడం, **"ఒక్కు మమ్మా నురువమెన్ఱు ఉళ్ళమ్ కు*ழை*న్దు నాణాళుమ్, తొక్కమేక ప్పల్ కు*ழா*ఙ్గళ్ కాణుమ్ తోఱుమ్ తొలైవన్ నాన్"** (మేఘసమూహాలను చూచినపుడంతా స్వామి రూపంతో పోలి ఉన్నాయని ప్రతిదినం నేను క్లేశపడుతున్నాను) అనే తిరువాయ్‌మొ*ழி* (8-5-3) పాశురంలో శోకించడం గమనించవచ్చు. **"పైమ్బొ*ழி*ల్ వా*ழ்* కుయిల్‌కాళ్! మయిల్‌కాళ్! ఒణ్ కరువిళైకాళ్! వమ్బు క్కళఙ్గనికాళ్! వణ్ణపూవై నఱుమలర్‌కాళ్! ఐమ్బెరుమ్ పాతకర్‌కాళ్! అణిమాలిరుమ్‌శోలై నిన్ఱ ఎమ్బెరుమానుడైయ నిఱమ్ ఉఙ్గళుక్కెన్ శెయ్‌వదే"** (9-4) అనే నాచ్చియార్ తిరుమొ*ழி* పాశురం కూడా గమనార్హం.

**(కడమాయినకళ్ క*ழி*త్తు నీర్‌నిలనిన్ఱ తవ మిదుకొల్!)** ఆ నీల కలువల సమూహాలు- అటవీప్రాంతాలను కాదని తమకు స్థానంగా జలప్రదేశాన్ని చేసికొన్న స్వభావాన్ని- దుర్గమమైన అరణ్యాలలో పయనించి నడచి, తపస్సుకు తగిన చోటును అన్వేషించి పొందినదానికి చిహ్నంగా పల్కుతున్నారు. నీలోత్పల పుష్పాలు, కుంభనృత్యాన్ని చేసినవాడు, లోకాలను కొలిచినవాడైన భగవానుని తిరుమేనివర్ణం వంటి వర్ణాన్ని పొందడం అనేది- అరణ్యాలుగా ఉండే ప్రాంతాన్ని దాటి తటాకాలతో నిండిన చోటులో ప్రవేశించి, అక్కడ తమ కాళ్ళను బలంతో చిరకాలం నీటిలో కదలకుండా నిలచి చేసిన తపస్సుయొక్క ఫలమా ?- అని అంటున్నారు. వర్షం,

మంచు, ఎండ- అనే తేడాలు ఏమీ లేకుండా అన్నికాలలోను జలప్రదేశాలలో పాచి పట్టేటట్లు నిలవడం- తపస్సుకు ఒక లక్షణమనేది లోకం తెలిసిన విషయం. ఈ పుష్పాలు ఆ విధంగా నిలచి ఉండడమే తపస్సు చేస్తున్నట్లుగా చెప్పబడింది. ఇవి ఒక్కొక్కటి ఊర్ధ్వముఖంగా ఒక కాడలో నిల్చి వికసించి, తేనెను స్రవించడం- సూర్యునకు అభిముఖంగా ఒంటి కాలితో నిలచి, మనస్సు ద్రవించి ఆనంద బాష్పాలను స్రవించి యోగాన్ని అనుష్ఠించినట్లున్నదని భావం. తపస్సు చేసి ముక్తిని పొందినవారు **"తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్యము పైతి"** అనే శ్రుతిక్రమంలో భగవానునితో పరమసామ్యాన్ని పొందుతారు. కనుక, **"తవ మిదుకొల్... పెరుమా నురువొత్తన నీలజ్గళ్"** అని అనబడింది. ఇది హేతూత్ప్రేక్షాలంకారం. పూర్వం **"మేకజ్గళో! ఉరైయీర్!"** అనే పాశురంవంటిదే ఇది కూడా.

**(కడమాయినకళ్ కళ్ళిత్తు)**- అనే ప్రయోగానికి తాము అనుభవించవలసి ఉండే దుష్కర్మలను అన్నిటిని తీర్చుకోవడానికి ఆరంభించి- అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. దీర్ఘమైన కాడలలో స్థిరంగా నిలచి ఉండే స్వభావమే నల్ల కలువలకు గల కాలి బలంగా చెప్పబడింది.

**(కూడమాడి)**- బ్రాహ్మణులకు ఐశ్వర్యం మిక్కిలిగా ఉంటే యాగం చేసేటట్లుగా, గొల్లలకు సంపద పుష్కలంగా ఉంటే దానివల్ల కల్గిన అతిశయం వ్యక్త మయేటట్లు కుంభనృత్యాన్ని చేస్తారు. శ్రీకృష్ణుడు, తాను గోపాలకులంలో పుట్టిన సత్యత్వభావనవల్ల **"కుడజ్గళ్ ఎడుత్తేఱవిట్టు క్కూత్తాడవల్ల ఎజ్కోవే!"** (కుండలను పైకి ఎగురవేసి నృత్యాన్ని చేయగల్గిన మాస్వామీ?) అనే రీతిలో మాటి మాటికి కుంభనృత్యాన్ని చేయడం అలవాటు. తలపై కుంభాన్ని నిలుపుకొని, రెండు భుజాలపై రెండు కుండలు ఉండగా, రెండు చేతులలో రెండు కుండలను పట్టుకొని వాటిని ఆకాశంలోకి ఎగురవేస్తూ ఏ కుండ క్రింద పడకుండా చాతుర్యంతో ఆడే నృత్యానికి కుంభనృత్యమని పేరు. ఇది పదకొండు విధాలైన క్రీడలలో ఒకటి అని, ఆఱు విధాలైన నృత్యాలలో ఒకటి అని పల్కి, **"కుడత్తాడల్ కున్ఱెడుత్తోన్ఆడల్ అదనుక్కడైక్కుప వైన్దుఱుప్పాయ్న్దు"** అనే ఉదాహరణాన్ని శిలప్పదికారగ్రంథ వ్యాఖ్యలో అడియార్క్కు నల్లార్ అనే వ్యాఖ్యాత చూపించారు.

**(ఇమ్మణ్ణుమ్ విణ్ణుమ్ కులుజ్గ)**- ఈ ప్రయోగాన్ని మధ్యమదీపన్యాయంలో ముందు, వెనుక అన్వయించవచ్చు. **"ఇమ్మణ్ణుమ్ విణ్ణుమ్ కులుజ్గ క్కుడమాడి"**

(ఈ భూలోకం, పైలోకం మనస్సు తేలికపడేటట్లు కుంభనృత్యాన్ని చేసి) అని, **"ఇమ్మణ్ణుమ్ విణ్ణుమ్ కులుజ్గ ఉలకళన్దు నడమాడియ పెరుమాన్"** (ఈ భూలోకం, పైలోకం మనస్సు తేలికపడేటట్లు లోకాలను కొలిచి నాట్యం చేసిన స్వామి) అని అన్వయించవచ్చు. కుంభనృత్యాన్ని చేయడం చూచి భూలోకంలోని వారివలె పైలోకంలోనివారుకూడా సౌలభ్యగుణాన్ని కీర్తించి ఆశ్చర్యపడ్డారు- అని భావం. కుంభనృత్యాన్ని చేయడం, లోకాలను కొలువడం చేసేటపుడు కొంచెంకూడా అలసట తోచకుండా చాలా లీలగానే చేయడం స్ఫురించేటట్లు **"నడమాడియ"** అని ప్రయోగించబడింది. **"వామననాయ్ శెయ్‌ద కూత్తుక్కళ్ కణ్డుమే"** (వామనుడై చేసిన నృత్యాలను దర్శించాము కదా!) అనే తిరువాయ్‌మొ*ழ*ి శ్రీసూక్తిలోకూడా ఆ*ழ*్వార్లు త్రివిక్రముని నృత్యాన్ని పల్కిన రీతిని గమనించవచ్చు. (లోకాలను కొలువడం నృత్యం చేసినట్లు అందంగా ఉన్నదని భావం)

**"ఇమ్మణ్ణుమ్ విణ్ణుమ్ కులుజ్గ"** అనే దానికి - ఈలోకంలోని వారి, పరమపద వాసుల మనస్సు తేలికపడేటట్లు- అని వివరించడమే సంప్రదాయం. లోకాలు భీతిల్లేటట్లు- అని వివరించడం సంప్రదాయం కాదు. పెరియ వాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానసూక్తిని చూడండి- **"సంహారకారణనుడైయ కృత్యమాకిలితే లోకమ్ నడుజ్గి*న్ఱ*ు- ఎన్నలావదు; అజ్గనన్ఱిక్కే, లోకముడైయ అచ్చెయలుక్కు నెజ్జు ఉళుక్కినపడి"** అనేది ఆ సూక్తి. భగవానుని శ్రీపాదం పుష్పంకంటే సుకుమారమైనది కనుక, అది పైన స్పృశించినపుడు ఆనందం కల్గుతుందే తప్ప, దుఃఖం కలుగదని గ్రహించాలి.

ఈ పాశురంలో స్వాపదేశార్థం ఏమంటే- భగవానుని దరి చేరలేక, బాధపడే ఆ*ழ*్వార్, పరమపదంలోని ముక్తులు భగవానుని రూపంతో సాటి వచ్చే రూపాన్ని పొందిన స్వభావాన్ని తమ జ్ఞాననేత్రంతో దర్శించి, "వీరు ఈ రీతిలో ఉపాయాంత రాలను విడచి, చిరకాలం ఈ లోకంలో నిలచి ఉండి చేసిన యోగంవల్లనా, ఈ రూపాన్ని పొందారు?'' అని ఒక కారణాన్ని ఉత్ప్రేక్షించి, "ఆ కారణం ఇది'' అని నిస్సందేహంగా, స్ఫుటంగా తెలిస్తే, నేను కూడా దానిని చేసి ఈ రూపసామ్యాన్ని పొంది ఉండేవాడనే''- అని భావించడం ఈ పాశురంలోని స్వాపదేశం. పరభక్తి మార్గంలో నిలచి ఉండేవారు మిగిలిన సాధనానుష్ఠానాలను విడువడం ఇక్కడ **"కడమాయినకళ్ క*ழ*ిత్తు"** అని చెప్పబడింది. లేక, భగవానునిపట్ల చేయదగిన కర్తవ్యం నిర్దుష్టంగా చేసి పూర్తిచేయడం- అని కూడా చెప్పవచ్చు. లేక, దివ్యదేశ

యాత్రలను చేసి ముగించడం- అని కూడా చెప్పవచ్చు. వారి నిరంతరప్రయత్నం యొక్క మహిమ **"తమ్‌కాల్ వన్మై"** అని తెలుపబడింది. (**"కాల్"**-అని ప్రయత్నానికి ఒక పేరున్నది కదా!) పలు దినాలు జలప్రదేశాలలో నిలచి ఉండడం అంటే- తటాకంవలె చల్లని భగవానుని చల్లని భగవానుని స్వరూపంలో అభినివేశాన్ని పొందడం. "నీర్ నిలైనిన్ఱ" - ఆ భగవానుని ఆశ్రితసౌలభ్యమనే స్వభావంలో అవగాహించడం. **"తవ"** మనేది ఇక్కడ గొప్ప సాధనమనే అర్థాన్ని ఇస్తుంది. భగవానుని రూపంతో పోలి ఉండడం అంటే- సారూప్యాన్ని పొందడం. ముక్తులను నల్ల కలువగా పల్కడం- అందఱు ఆనందించి తలపై ధరించే రీతిలోని గొప్ప తనాన్ని, పరత్వాన్ని, ముఖవికాసాన్ని వారు కల్గి ఉండడాన్ని తెల్పుతుంది.

పరాంకుశనాయకికి లౌకికపదార్థజాతం అంతా భగవానుని స్మరింపజేస్తున్నదనే విషయానికి ఉదాహరణగా నమ్బిళ్ళై ఒక సంవాదాన్ని ప్రస్తావించారు.

**కురుకైకావలప్పన్**- అనే ఆచార్యులను చూచి ఒకరు జగత్తుకు, ఈశ్వరునకు మధ్య ఉండే సంబంధం ఏవిధంగా ఉన్నది? అని అడిగారు. అపుడు అప్పన్ "నీవు ఏ జగత్తుకు, ఏ ఈశ్వరునకు మధ్య ఉండే సంబంధాన్ని గూర్చి ప్రశ్నిస్తున్నావు?'' అని అడిగారు. **"శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః, గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్"** (గీత-15-8) (శరీరాన్ని, ఇంద్రియాలను నియమించే ఆత్మ, ఏ శరీరాన్ని పొందినా, ఏ శరీరం నుండి నిర్గమించినా, సుగంధన్ని కల్గిన వస్తువులనుండి వాటి సుగంధాన్ని వాయువు గ్రహించిపోయేటట్లు, ఇంద్రియాలను, సూక్ష్మభూతాలతో పాటు గ్రహించి వెడతాడు) అని చెప్పబడి నందున ఆ శరీరమనే జగత్తుకు ఆత్మ ఈశ్వరుడు. ఆ విధంగా ఈ శరీరానికి, ఆత్మకు ఎటువంటి సంబంధం ఉన్నదో, ఆ సంబంధమే (ఆ శరీర - శరీరి సంబందమే) ఈ జీవాత్మకు (జగత్తుకు), భగవంతునకు మధ్య ఉన్నది. (శరీరం లోపల ఆత్మ ఉన్నట్లే, ఆత్మ లోపల భగవంతుడున్నాడు) అని అప్పన్ బదులిచ్చారు. ప్రశ్నించిన వ్యక్తి మళ్ళీ అప్పన్‌తో "నాకు భగవంతుని స్మరించే ఒక దారిని తెలుపండి'' అని అనగా, అప్పన్ "నేను నీకు దానిని చెబుతాను. కాని ముందుగా నీవు నాకు, భగవంతుని మఱచిపోవడానికి ఒక ఉపాయాన్ని చెప్పు'' అని అన్నారట. అని పదార్థాలను పరమాత్మ వేంచేసి ఉన్నందున, ఏ వస్తువుయొక్క నామరూపాలు అనేవి దానిలో భగవంతుడు అంతరాత్మగా వ్యాపించి ఉండకపోతే ఉండవు. అందువల్ల ఏ వస్తువును చూచినా, ఆ వస్తువులో భగవానుడు అంతర్యామిగా

ప్రవేశించి ఉన్నాడు- అనే భావన. కలుగవలసి ఉన్నందున, ఆ భగవంతుని స్మరించ డానికి తగిన దారిని గూర్చి అడగాలా?'' అని భావం. ఈ సంవాదాన్ని నమ్పిళ్ళై తిరువాయ్‌మొழிలోని (3-4-4)వ పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ ఈడు వ్యాఖ్యలో కూడా ప్రస్తావించారు.

## ప్రత్యక్ష సమానాకారంగా నాయకుని మనస్సులో దర్శించిన నాయకి సఖితో ఆవిషయాన్నిగూర్చి పల్కడం

39. నీల త్తడవరైమేల్ పుణ్డరీగ నెడున్దడజ్గళ్
పోల, పొలిన్దెమక్కెల్లా విడత్తవుమ్-, పొజ్గు మున్నీర్
ఞాలప్పిరాన్ విశుమ్బుక్కుమ్ పిరాన్ మற்றுమ్ నల్లోర్ పిరాన్
కోలమ్ కరియపిరాన్, ఎమ్బిరాన్ కణ్ణిన్ కోలజ్గళే

నీలమ్ = నీలమణిమయమైన, తడ వరై మేల్= పెద్ద పర్వతంపై ఉండే, పుండరీకమ్ నెడు తడజ్గళ్‌పోల్ పొలిన్దు = పెద్ద ఎఱ్ఱ తామరపూలు నిండిన సరస్సులవలె ప్రకాశిస్తున్నవి, ఎమక్కు ఎల్లా ఇడత్తవుమ్ =మాకు చూచిన చోట అంతటా కన్పించేవిగా ఉన్నవి (ఏవి ?అంటే), పొజ్గు మున్నీర్ ఞాలమ్ పిరాన్= వృద్ధి చెందే సముద్రంచే పరివేష్ఠితమైన భూలోకానికి నాథుడు, విశుమ్బుక్కుమ్ పిరాన్ = పరమపదానికి నాథుడు, మற்றுమ్ నల్లోర్ పిరాన్ = ఇంకా ఉండే మంచివారికి అందఱికి ప్రభువు, కోలమ్ కరియ పిరాన్ = నల్లని దేహవర్ణాన్ని కల్గిన ప్రభువు అయిన, ఎమ్ పిరాన్ = మా స్వామియొక్క, కణ్ణిన్ = తిరునేత్రాల, కోలజ్గళ్ = అందాలు (అవి).

**భావదీపిక :** నాయకుని రూపాన్ని ప్రత్యక్షంగా చూచిన నాయకి తన సఖితో దానిని గూర్చి వర్ణిస్తూ పలికే పాశురం ఇది. ఒక వస్తువునుగూర్చి నిరంతరం భావనను కల్గి ఉంటే, ఆ భావనయొక్క ప్రకర్షచేత ఆ రూపం సాక్షాత్తు కంటికి ఎదురుగా కన్పించే రీతిలో మనస్సుకు తోచడం సహజం. అందులో, నాయకి నేత్రసౌందర్యంలో నాయకి గాఢంగా అవగాహించి పలికే సూక్తి. ఇది.

సముద్రపరివేష్ఠితమైన భూలోకానికి ప్రభువు, పరమపదానికి నాథుడు, సాధుజనులకందఱికి నాయకుడు, నల్లని తిరుమేనిని కలవాడైన స్వామి తిరునేత్రాల అందాలే మాకు చూచిన చోట అంతా సాక్షాత్కరించేవిగా ఉన్నాయి.

అవి ఏ విధంగా వెల్గుతున్నాయి? అంటే, నీలరత్నమయమైన ఒక పెద్ద పర్వతంపై ఉండే పెద్ద తామరపూల తటాకాలవలె ప్రకాశిస్తున్నాయి.

భగవానుని నల్లని గొప్ప తిరుమేనికి గొప్ప నీలరత్నమయపర్వతం, ఆ స్వామినేత్రాలకు పుండరీకాలతో నిండిన విశాలమైన తటాకాలు ఉపమానాలు. **"కోలజ్ఞళే"**- అనేటపుడు చివరలో గల ఏకారం అన్యయోగవ్యవచ్ఛేదకం. సర్వాంగ సుందరుని నేత్రసౌందర్యంలో అభినివేశాన్ని కల్గినవారికి వేఱొకటి ఏదీ ఒకవస్తువుగా తోచదనే విషయం దీనివల్ల తెలుస్తుంది. **"తోళ్ కణ్డార్ తోళే కణ్డార్, తడక్కై కణ్డారు మఃదే, వాళ్కొణ్డ కణ్ణార్ యారే వడివినై ముడియ క్కణ్డార్, ఊழ் కొణ్డ శమయత్తన్నానురువు కణ్డారై యొత్తార్"** (శ్రీరాముని బాహువులను దర్శించినవారు వాటినే దర్శించారు. ఇక ఏ వేఱొక అవయవంలోను వారి దృష్టి పోలేదు) అనే రీతిలో ఇక, ఏకారాన్ని విషాదసూచకం గ్రహిస్తే, కంటికి కన్పించే రూపం చేతలలో స్పృశించడానికి అందక, క్లేశపడడం సూచిస్తుంది.

ఈ పాశురంలో **"ఞాలమ్"** -అని అన్నందున లీలావిభూతి, **"విశుమ్బు"**- అని అన్నందున నిత్యవిభూతి తెలుపబడ్డాయి. **"మఱ్ఱుమ్ నల్లోర్"** అనేది ఈ లోకంలో అభినివేశాన్ని పొంది, మధ్యలో నిలచి ఉండే ముముక్షువును తెల్పుతుంది. లేక, **"విశుమ్బు"** - అంటే దేవలోకం, **"నల్లోర్"** - అంటే నిత్యులు, ముక్తులు- అని కూడా చెప్పవచ్చు.

భగవత్కటాక్షంలో అభినివేశాన్ని పొందిన ఆழ்వార్లు, ఆ అభినివేశాతి శయం చేత భగవానుని నేత్రసౌందర్యం తమ కంటికి ప్రత్యక్షమై, అంతటా గోచరించి ప్రకాశించగా దర్శించి, దానిని గూర్చి భక్తులతో పల్కడం ఈ పాశురంలోని స్వాపదేశం. తిరువాయ్మొழிలో కూడా **"ఏழైయర్ ఆవి యుణ్ణుమ్ ఇణై కూఱ్ఱజ్గొలో అఱియేన్, ఆழியమ్ కణ్ణపిరాన్ తిరుక్కణ్గళ్ కొలో అఱియేన్, శూழవుమ్ తామరై నాణ్మలర్పోల్ వన్దు తోన్తుమ్ కణ్డీర్, తోழியర్కాళ్! అన్నైమీర్! ఎన్ శెయ్వేన్? తుయరాట్టియేనే"** (ప్రాణాలను తీసే రెండు మృత్యు దేవతలా? లేక, శ్రీకృష్ణుని నేత్రాలా ఇవి? తెలియలేకున్నాను. అపుడే వికసించిన తామరపూవు వలె అవి నాచుట్టూ దర్శనమిస్తున్నాయి. సఖులారా! తల్లులారా! పాపిష్ఠిదానను నేను ఏమి చేయను?) అని పల్కడం గమనించవచ్చు. కాంతి, చల్లదనం, వికాసం, వైశాల్యం, ఎఱ్ఱదనం మొదలైన గుణాలను పురస్కరించుకొని

"కణ్ణిన్ కోలజ్గళ్" అని అనబడింది. "కరియ వాకి పుడై పరన్దు మిళిర్న్దు శెవ్వరియోడు నీణ్డ అప్పెరియవాయ కణ్కళ్ ఎన్నైప్పేదమై శెయ్‌దనవే" (నల్లనివై, పర్యంతాల వరకు వ్యాపించి, మెఱసి, ఎఱ్ఱని రేఖలతో దీర్ఘంగా ఉండే ఆ పెద్దవైన శ్రీరంగనాథుని నేత్రాలు నన్ను మూఢుని చేస్తున్నాయి) అనే అమలనాదిపిరాన్ పాశురాన్ని గమనించవచ్చు. "ఏమక్కొల్లావిడత్తవుమ్" అనే దానివల్ల "నిన్ఱు తోన్ఱి క్కణ్ణుళ్ నీజ్గా నెఞ్జుళ్ళుమ్ నీజ్గావే" (నిలచి ప్రకాశించి నా కన్నులనుండి తొలగి పోవడంలేదు. మనస్సులో నుండి తొలగిపోవడం లేదే!) అనే రీతిలో తమ మనస్సు భగవానుని సౌందర్యంలో అభినివిష్టమై, వేఱొకదానికి చెందకుండా పోయిన రీతి చెప్పబడింది.

### చీకటిని చూచి బాధపడే నాయకి, బంధువులు తనను నాయకునకు ఇచ్చి వివాహం చేసే రోజు వస్తుందా ? - అని అనడం (వరైవు విరుప్పురుదల్)

**40.** **కోల ప్పగల్ కళిఱు ఒన్ఱు కఱ్పుయ్య, కుళ్లామ్ విరిన్ద**
**నీలక్కఙ్గల్ కళిఱెల్లామ్ నిఱైన్దన-, నేరిళ్లైయీర్**
**ఞాలప్పొన్‌మాదిన్ మణాళన్ తుళ్లాయ్ నజ్గళ్ శూళ్లుకుళ్లత్కే**
**ఏలప్పునైన్దెన్నైమార్, ఎమ్మై నోక్కువదెన్ఱుకోలో!**

కోలమ్ = అలంకారాన్ని కల, పకల్ = సూర్యుడనే, కళిఱు ఒన్ఱు = సాటి లేని ఏనుగు, కల్ పుయ్య = అస్తగిరిలో అదృశ్యం కాగా, కుళ్లామ్ విరిన్ద = గుంపులుగా వ్యాపించిన, నీలమ్ = నల్లని రంగును కల, కఙ్గల్ =రాత్రి అనే, కళిఱు ఎల్లామ్ = ఏనుగులన్నీ, నిఱైన్దన = అంతటా ఎదురుగా వచ్చి నిండుగా చేరాయి, నేర్ ఇళ్లైయీర్ = తగిన ఆభరణాలను కలవారలారా!, ఞాలమ్ = భూదేవికి, పొన్ మాదిన్ = శ్రీదేవికి, మణాళన్ = నాయకుడైన స్వామి, తుళ్లాయ్= తన తులసీమాలను, నజ్గళ్ శూళ్ల్ కుళ్లత్కే = మన దట్టమైన కేశపాశానికే, ఏల పునైన్దు = తగినట్లుగా చుట్టుకొన్న (ముడుచుకొన్న), ఎన్నైమీర్ = నా తల్లులు, ఎమ్మై నోక్కువదు = నన్ను చూడడం, ఎన్ఱుకొలో = ఎపుడో కదా!

భావదీపిక : చీకటిని చూచి విలపించిన నాయకి తన సఖితో "వరైవు విరుప్పు రైత్తల్" (నాయకి నాయకుని రాకను ఆశపడి పల్కడం) అనే ప్రక్రియలో పలికే పాశురం ఇది. పగటికాలం గడచి, అంతటా చీకటి వ్యాపించడం గమనించి, క్లేశపడే

నాయకి "స్వామికి నన్ను వివాహం చేసికోవడం ఎపుడో కదా !'' అని సఖులను చూచి పల్కుతున్నది, ఈ పాశురంలో.

తగినవి అయిన ఆభరణాలను కల సఖులారా ! సూర్యుడనే ఒక గజం అస్తమయపర్వతంపై పడి మఱుగుపడగా, గుంపులుగా విస్తరించిన నల్లని రంగును కల రాత్రి అనే ఏనుగులన్నీ వరుసగా ఎదురుగా వచ్చి చేరాయి. (సూర్యుడస్త మించగానే రాత్రి పొద్దువచ్చింది) ఇపుడు నా విరహవ్యసనం సహించరానిదిగా ఉన్నందున, భూదేవికి, శ్రీదేవికి వల్లభుడైన భగవానుడు తన తులసీమాలికను అనుగ్రహిస్తే దానిని నా కేశపాశంలో తగినట్లుగా ముడువగా, నా తల్లులు నన్ను కటాక్షించడం ఏనాడో కదా! -అనే ఈ పాశురసూక్తి. **"అన్టిప్పిన్ మ*ఱ్ఱ*ారువర్ క్కెన్నై ప్పేశలొట్టేన్, మాలిరుమ్‌శోలై ఎమ్మాయఱ్కల్లాల్, కొ*ఱ్ఱ*వనుక్కివళామ్ ఎన్టెణ్ణి క్కొడుమిన్‌కళ్ కొడీరాకిల్ కో*ழ*మ్బుమే"** (తిరుమాలిరుమ్‌శోలై క్షేత్రంలోని స్వామికి తప్ప వేరొకరికి నన్ను ఇచ్చి వివాహం చేస్తానని అనడం నేను అంగీకరించను. విజయ స్వభావుడైన నాస్వామికి ఈమె తగినది - అని తలచి నన్ను అతనికి ఇవ్వండి. ఇస్తే మీ వ్యాకులం తీరిపోతుంది.) అనే పెరియా*ழ*్వార్ తిరుమొ*ழ*ి (3-4-5) సూక్తి రీతిలో ఆ భగవానునకు నన్ను దానజలధారా పూర్వకంగా దానం చేయడానికి తల్లులు, సఖులు వేగంగా కార్యం నిర్వహించాలి- అని భావాన్ని వ్యక్తం చేస్తుంది.

సూర్యుడు సహజంగా ఎఱ్ఱని రంగును, సాయంసమయంలో ఎఱ్ఱని రూపాన్ని కలవాడై, గంభీరుడై ఉంటాడు. ఉత్తమజాతిలో పుట్టిన ఏనుగు సహజంగా ఉత్తమలక్షణమైన ఎఱ్ఱని మచ్చలను కల్గి ఉంటుంది. సహజంగా ఎఱ్ఱని రంగును కల ముఖపటమనే అలంకారాన్ని కల్గినదై, గంభీరంగా ఉంటుంది. ఈవిధంగా ఇటువంటి సామ్యాలను ఉద్దేశించి **"కోలప్పకల్ కళిఱొన్టు"** అని అంటూ సూర్యుడు ఒక ఏనుగుగా రూపించి పలుకబడ్డాడు. పగటి కాలం రాత్రి సమయంవలె కాకుండా కొంచెం ఆశ్వాసాన్ని పొందడానికి తగినదై ఉండే స్వభావాన్ని బట్టి **"కోలప్పకల్"** అని విశేషించి పలుకబడింది. ఇక్కడ **"పకల్"** అనే పదం సూర్యుని లక్షణావృత్తి ద్వారా బోధిస్తున్నది. పగటి కాలానికి అధిదేవత అయినందున సూర్యుడు **"పకల్"** అని నిర్దేశింపబడ్డాడు. **"కల్"** అనేది పర్వతానికి వాచకంగా ప్రయోగింపబడడం **"కల్ ఎడుత్తు క్కల్ మారి కాత్తాయ్"** ఇత్యాదులలో గమనించవచ్చు.

ఒక ఏనుగును లేకుండా చేయడానికి పలు ఏనుగులు వచ్చి ప్రవేశించాయి- అని ఒక చమత్కారం స్ఫురించేటట్లుగా **"పకళ్కళిఱొన్డు కఱ్పియ్య క్కఙ్గుఙ్కళి తెల్లామ్ నిరైన్దన"** అని అనబడింది. ఒక రాత్రిని ఉద్దేశించి **"కళిఱు ఎల్లామ్"** అని అనడం నల్లదనాన్ని, దట్టంగా ఉండడాన్నిబట్టి, **"కుఴామ్‌విరిన్ద"** అనేదానిని సూర్యుని కాంతిచే పూర్వం గుంపులు గుంపులుగా చెదఱిపోయిన- అని వివరించడం పొసగుతుంది.

**(నిరైన్దన)-** తిరిగి వచ్చి చేరాయి- అని భావం. **"నిరన్దన"** అనే పాఠం కూడా ఉన్నది. **"నిరత్తల్"-** వచ్చి కూడడం. రాత్రిని బహువచనంలో పల్కడం దాని దైర్ఘ్యాన్నిబట్టి. ఒక్క రాత్రే అనేక రాత్రులుగా తోచడంవల్ల. పగలు ఆ విధంగా తోచనందువల్ల దానిని ఏకవచనంలో పల్కడం జరిగింది.

**(నేరిఴైయీర్)-** దేహంయొక్క అందానికి తగినట్లుగా ఆభరణాల అందం పొసగి ఉండేవారలారా! అని భావం. సుకుమారమైన ఆభరణాలను కలవారలారా! అనికూడా అర్థం. (తిరుప్పావై మొదటి పాశురంలోని ఇటువంటి సంబోధన స్మరణీయం)

**(ఞాలప్పొన్‌మాదిన్ మణాళన్)- "ఞాలమాదు, పొన్‌మాదు"** అని ప్రత్యేక ప్రత్యేకంగా **"మాదు"** శబ్దాన్ని అన్వయించాలి. **"ఇన్‌మణాళన్"** అని గ్రహించి మనస్సుకు భోగ్యభూతుడైన భర్త- అని కూడా చెప్పవచ్చు. **"ఎన్నైమార్"** -అనేది **"మూత్తవర్"** (వృద్ధులు) అనే అర్థాన్ని ఇచ్చేదై, తండ్రిని కూడా తెల్పుతుందని అనవచ్చు. **"ఞాలప్పొన్ మాదిన్ మణాళన్"** అని పల్కినందున భూదేవి, శ్రీదేవి అనే దివ్యపత్నుల అనుభవంవంటి అనుభవం మాకు లేదే- అని మనస్సులో నాయకి వ్యాకులం పొందడం స్ఫురిస్తుంది.

భగవానుడు తన తులసీమాలికను మన కేశపాశంలో తగినట్లుగా చుట్టగా, మా తల్లితండ్రులు ఎపుడు చూడబోతారో?- అని, భగవానుని తులసీమాలికను మా తల్లిదండ్రులు నా తలపై చుట్టి, నన్ను ఏనాడు ఆనందంగా చూడబోతారో?- అని పాశుర ద్వితీయార్ధానికి భావాన్ని చెప్పవచ్చు.

మొదటి వాక్యం రూపకాలంకారం. **"పుయ్య"** ఇది **"పుయ్"** అనే ధాత్వంశ నుండిపుట్టిన రూపం. **"మాదు" - మాదర్"** అనే పదం యొక్క వికృతి. **"మణవాళన్"** అనేపదం **"మణాళన్"** అనే వికృతిని పొందింది. **"కఴుఙ్కు"** - అనేది పాదాలలో

అనే అర్థాన్ని ఇచ్చే పదం కనుక ఇది విభక్తివ్యత్యయం (**"ఉరువు మయక్కమ్"**) ప్రయోగం. **"పునైన్దు"**- ఇది **"పునైయ"** అనే కృదంత రూపంయొక్క వికృతి. (**"ఎచ్చన్ త్తిన్ తిరిపు"**).

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఇక వివరింపబడుతున్నది. భగవానుని దరి చేరి, ఆనందించలేని స్థితిలో ఆళ్వార్లు తమ వివేకప్రకాశం కూడా రూపు మాసిపోయే టట్లుగా మోహాంధకారం అలముకొన్నందున, "ఈ స్థితిలో మాపెద్దలు నన్ను భగవానుని అనుగ్రహానికి పాత్రమయేటట్లు సమర్పించకుండా ఆలస్యం చేస్తున్నారే?" అని భక్తులను చూచి పల్కడమే- ఇక్కడ స్వాపదేశార్థం.

**(కోలప్పకళ్కళిఱొన్డు కఋప్పయ్య)**- భక్తి అతిశయించి, ఋజువైన వివేక ప్రకాశం అదృశ్యమయేటట్లు- అని భావం.

**(కుళ్లామ్ విరిన్ద నీలక్కఋగల్ కళిఱు ఎల్లామ్ నిరైన్దన)**- మోహాంధకారం మిక్కిలి పైబడి అలముకొన్నది. దీనిని (అంధకారాన్ని) ఏనుగుగా పల్కడం- ఎందుకంటే, అణచడం అరుదు కనుక.

**(ఞాలప్పొన్మాదిన్ మణాళన్)**- అని అన్నందున దివ్యపత్నులవలె (ఆళ్వార్లు) తాముకూడా భగవానునితో చేరడంలో ఆశను పొందడం స్ఫురిస్తుంది.

**(మణాళన్ తుళ్లాయ్ నఙ్గళ్ శూళ్ కుళ్లక్కే ఏల పునైన్దు)**- భగవానుని ప్రసాదాన్ని మా శిరస్సులపై గ్రహించేటట్లు లభింపజేసి- అని అర్థం. **"ఎన్నైమార్"**- అనేది భగవద్భక్తులలో తమకంటే వృద్ధులను ఉద్దేశించి పలుకబడింది. **"ఎన్టుకొలో"**- అని అన్నందున దాని విషయంగా అపేక్షయే వీరికి ప్రధానమైన స్వభావం- అని స్ఫురిస్తుంది. **"నేరిళ్లైయీర్!"** అనేది భక్తులకు సద్గుణాలనే అలంకారాలు చక్కగా ఉండడం స్ఫురింపజేస్తుంది, **"జ్ఞానవైరాగ్యభూషణమ్"** అని అన్నట్లు.

కట్టళైక్కలిత్తురై ఛందస్సులోని పద్యాలన్నీ ఏకారాన్ని చివరకల్గి పూర్తి కావాలి- అనే లక్షణాన్ని పురస్కరించుకొని, ఈ పాశురం చివరలో **"ఎన్టుకొలే"** అని కొందఱు సంస్కరించాలని చూచారు. ఆ ప్రయత్నం అక్కరలేదు. భ్రమ ప్రమాద విప్రలంభాది దోషరహితమైన, భక్తిగా పరిణమించిన జ్ఞానాన్ని భగవదనుగ్రహంవల్ల పొందిన ఆళ్వార్లు ఈ విధంగా పల్కినందున, కట్టళైక్కలిత్తురైకు ఓకారం చివర కల్గి ఉండడం కూడా లక్షణమేనని గ్రహించాలి. **"ఇలక్కియమ్ కణ్డదఱ్కిలక్కణ్ణ**

మియమ్బిలన్" అని కదా నన్నూల్ అనే గ్రంథంలో చెప్పబడింది. అంతేకాక, సంస్కృతభాషలో వాల్మీకివ్యాసాది మహర్షుల కవితలలో ఏదైనా లక్షణవిరుద్ధ ప్రయోగాలు కన్పిస్తే **"ఆర్షత్వాత్ న దోషః"** (ఋషివాక్యమైనందున దోషం లేదు) అని దానిని **"వ*ழு*వమైది"** (ప్రయోగ ప్రాచుర్యతో సిద్ధమైన వ్యాకరణ విశుద్ధ ప్రయోగం) గా గ్రహించడం సంప్రదాయం కనుక, వారికంటే పరిణత భక్తిరూపాపన్న జ్ఞానాన్ని కల ఆ*ழ*్వార్ల శ్రీసూక్తులను ఆ విధంగా అన్వయించి- అర్థం చెప్పడంలో తప్పు ఏమీ లేదు. ఇంతేకాక, సంస్కృతవేదంలోని ప్రయోగాలకు మిగిలిన సంప్రదాయాల ప్రయోగాల కంటే భేదం ఉండేటట్లే, ద్రావిడవేదమైన ఈ దివ్యప్రబంధానికికూడా ఆవిధంగానే గ్రహించాలి. విలక్షణప్రయోగాలైన వీటికి లక్షణం, లక్ష్యం లభించిన చోట గమనించాలి. ఈరీతిలో కాకుండా **"ఎన్టుకాలే"** అని ఏకారాన్ని చివర ఉండేటట్లు మార్చడం అసంప్రదాయమని, ఆ*ழ*్వార్ల వాగ్వైఖరికి పొసగదని తెలియాలి.

## చల్లగాలికి క్లేశపడిన నాయకి వచనం

**41.** **ఎన్టుమ్ పున్‌వాడై ఇదు కణ్డఱిదుమ్, ఇవ్వాఱు వెమ్మై**
**ఒన్టు మురువుమ్ శువడుమ్ తెరియిలమ్-, ఓజ్గశురర్**
**పొన్టుమ్ వగై పుళ్ళైయూర్వానరుళరుళాద విన్నాళ్**
**మన్టిల్ నిఱైపழி తూర్*ऱ्*ఱి, నిన్టెన్నై వన్ కా*ఱ్*ఱడుమే**

ఎన్టుమ్ = ఎల్లప్పుడు, పున్ = కాఠిన్యాన్ని చూపే, వాడై ఇదు = ఈ ఉత్తరపు గాలిని, కణ్డు అఱిదుమ్ = చూచి తెలియము, ఇ ఆఱు వెమ్మై ఉరువుమ్ = ఇటువంటి (గాలిలోని) వేడిమియొక్క స్వభావాన్ని, శువడుమ్ = గుర్తును, ఒన్టుమ్= (ఏదో) ఒక విధంగా అయినా, తెరియిలమ్ = తెలిసికొనలేము, ఓజ్గు అశురర్ = బలిమితో విజృంభించే అసురులు, పొన్టుమ్ వగై = నశించేటట్లు, పుళ్ళై = గరుడపక్షిని, ఊర్‌వాన్ = అధిరోహించి నడిపే స్వామి, అరుళ్ అరుళాద = తన కరుణతో వచ్చి నన్ను రక్షించని, ఇ నాళ్ = ఈ కాలంలో, వన్ కా*ఱ్*ఱు= బలమైన మారుతం, ఎన్నై = నన్ను, మన్టిల్ నిఱై పழி = బయట వ్యాపించి ఉండే అపవాదును, తూ*ఱ్*ఱి = ఇరుగుపొరుగువారిని పురస్కరించుకొని వ్యాపింపజేసి, నిన్టు అడుమ్ = (విడిచి దూరంగా పోకుండా) నిలచి ఉండి బాధిస్తున్నది.

**భావదీపిక :** మలయమారుతంవల్ల క్లేశపడే విరహిణి అయిన నాయకి పలికే సూక్తి ఇది. విశ్లేషదశలో చాలా సేపు ఆమెను చల్లగాలి బాధించినందున, దానిని ఉద్దేశించి మాటిమాటికి పల్కి ప్రలపించేటట్లుగా ఈ పాశురసూక్తి ప్రవర్తించింది. (ఏర్పడింది.) అందువల్ల పునరుక్తి అనే దోషానికి అవకాశం లేదని గ్రహించాలి. ఈ విధంగా పునరుక్తిగా తోచే ఇంకా పలు సందర్భాలలో కూడా ఇటువంటి సమాధానం భావ్యం.

ఎల్లప్పుడు బాధించడమే, కఠినంగా ఉండడమే స్వభావంగా కల ఈ వాయువునుగూర్చి ఈనాడు, నిన్న కాదు, చిరకాలంగా తెలియలేకున్నాము. **"వాడై వరున్దకిఱదు"** (వాయువు బాధిస్తున్నది) అని సామాన్యంగా పల్కడం సాధ్యం తప్ప, ఈ రూపాన్ని కల్గి, ఈ గుణంతో ఈ పనిని చేసి బాధిస్తున్నది- అని ఏ రీతిలోను వివరించి- ఇతమిత్థంగా పలుకలేనట్లుగా దీని కాఠిన్యం ఉన్నది. ఆసురప్రకృతిని కల దుష్టులను నశింపజేసి, శిష్టులైన భక్తులు రక్షించే స్వభావాన్ని కల స్వామి నాకు ఈ కఠినమైన వాయువు బాధించకుండా ఉండేటట్లు చేసి, శేషభూతురాలనైన నన్ను రక్షించకుండా ఉన్నాడే! నేను వాయువువల్ల క్లేశపడడం చూచి ఊరిలోనివారు నా గూర్చి అపనిందలు పలికేటట్లు అయినదే ! ఈ రీతిలో కదా నన్ను ఈ గాలి చిత్రవధ చేస్తున్నది - అని నాయకి అంటున్నది.

**"పున్వాడై"** -అనే పదానికి మందమారుతమనే అర్థాన్ని గ్రహించవచ్చు. **"వాడై ఇదు కణ్డఱిదుమ్"**- ఈ మందమారుతం చేసే దౌష్ట్యాన్ని అనుభవిస్తున్నాము- అని దీని భావం.

పాశురంలోని పూర్వార్ధభావాన్ని ఇంకొక విధంగా కూడా వివరించవచ్చు. చాలా కాలంగా ఈ మారుతాన్ని అనుభవిస్తున్నాము. కాని, ఇటువంటి వేడిమిని కల్గిన రూపం, స్వభావం (దీనికి ఉన్నవి అని) పూర్వం గమనించి చూడలేదు. దీని స్వరూపస్వభావాలు ఇపుడే మార్పును పొందాయి- అని వివరించవచ్చు. ఈ వ్యాఖ్యలో **"ఒన్దుమ్"** అనేది తద్ధింతాతం. **(పెయరెచ్చమ్)** ఒన్దుదల్- పొసగి ఉండడం-అనిఅర్థం.

**"ఓఙ్గు అశురర్"**- దేవతాంతరాలను ఆరాధించి, పొందిన వరబలంచేత, భుజబలంచేత వృద్ధి పొందుతున్న అసురులు- అనే భావమే కాక, ఎవరికీ శిరస్సు వంచి నమస్కరించని ప్రభువులై, ఎత్తిన తలలను కలవారై ఉండే అసురులు- అని కూడా భావం.

"మన్టిల్ నిఱైపழி తూற்ఱి"- అని అంటూ అపనిందను వ్యాపింప జేయడానికి వాయువునే కర్తగా చెప్పబడడంలోని తాత్పర్యం ఏమంటే- తాను మందమారుతానికి క్లేశపడడం చూచి ఊరిలోనివారు అపనిందలను ప్రచారం చేస్తున్నందున, మారుతాన్ని ప్రయోజకకర్తగా నాయకి చెప్పింది. "ఒక చిన్నది ప్రియునకు దూరమైనదట. గాలి సోకినంత మాత్రంలోనే ఈమె భరించలేకుండా ఉన్నదట. ఈమె సిగ్గు, అణకువ, ఒద్దిక చాలా చక్కగా ఉన్నాయే!"- అని ఇతరులు నిందించేటట్లు అయినదని భావం- **"ఇరుమ్ కుఙ్కుమత్తోళరఙ్గేశర్ మున్నాళ్ ఇలఙ్గాపురఙ్గావలన్ కాలినాల్ వీழ், కరుఙ్కున్టుపోల్ మణ్ముకఙ్కుత్తి వీழக్కణ్డా రెనక్కిన్టు తణ్డార్ అళిత్తాల్ మరుఙ్గెఙ్గుమ్ వమ్బొదువార్ వాయడఙ్గమ్ వాడైక్కుమ్ నిలమఙ్గైయాడైక్కుమ్ నోకేన్, నెరుఙ్గున్దనమ్ శన్దనమ్ పూశలాకుమ్ నీళాది రామైయల్ మీళాదిరాదే"** (శ్రీరామఅవతార సమయంలో లంకారాధుడైన రావణుడు గొప్ప గాలి వలన కిందపడే పెద్దపర్వతంవలె తలక్రిందులుగా భూమిపై పడేటట్టు చేసిన వాడు, కుంకుమతో అలంకరింపబడిన బాహువులను కలిగినవాడైన శ్రీరంగనాథుడు ఇప్పుడు నాకు తన చల్లని తులసి మాలికను అనుగ్రహిస్తే, నా చుట్టూ మిక్కిలిగా వదరుతున్న స్త్రీల నోరు మూసికొంటుంది. చల్లగాలికి, భూదేవి వస్త్రమైన సముద్రానికి నేను బాధపడను. నా నిబిడమైన వక్షస్సులో చందనం పూసినట్లు అవుతుంది. రాత్రి సమయం దీర్ఘం కాదు. కామవ్యాధి తొలగిపోకుండా ఉండదు.) అనే పిళ్ళైప్పెరుమాళ్ ఐయ్యంగార్ రచించిన తిరువరఙ్గక్కలమ్బకమ్ పాశురంలోని భావం ఇక్కడ అనుసంధేయం. **"నిఱైపழி"** అనేది నాయకిని గూర్చిన నింద- అని మాత్రమేకాకుండా, నాయకుని గూర్చిన నిందకూడా- అనేది పెరియవాచ్చాన్‌పిళ్ళై అభిప్రాయం. ఒక స్త్రీని తనపట్ల ఆశ కలిగేటట్లుగా చేసి, మందమారుతానికి అభినివేశాన్ని పొంది క్లేశపడేటట్లు ఉపేక్షిస్తున్నాడే! అని భగవానునిగూర్చిన అపనిందలను పల్కి వ్యాపింపజేస్తారు- అని భావం. **"అడుమ్"**- వధిస్తుంది; మరణ పర్యంతమైన వేదనను కల్గిస్తుంది- అని తాత్పర్యం. **"వన్ కాற்ఱు ఎన్నై అడుమ్"** - దయలేని మారుతం, పరిహారం చేయడానికి, సహించి ఉండడానికి సాధ్యం కాని రీతిలో సుకుమారిని అయిన నన్ను "స్త్రీవధ మహా పాతకం" అని కూడా చూడకుండా నాశనం చేస్తున్నది. - అని తాత్పర్యం.

ఇక, ఈ పాశురంలోని స్వాపదేశార్థం ఏమంటే - ఆழ்వార్లు, తాము భగవానునివద్దకు చేరడానికి త్వరపడే సమయంలో వెంటనే ఆ ఫలం సిద్ధించకుండా

ఆలస్యమైనందున, అపుడు ఈ లోకంలోని పదార్థాలు తమను బాధించే రీతిని తెలుపడమే. పూర్వం సంసారంలో అనుభవించిన దుఃఖపరంపరలే తీయనివి- అనే రీతిలో ఇపుడు భగవానుని చేరలేని దుఃఖం అధికం కావడం ఇందులో స్ఫురిస్తుంది.

**(ఎన్టుమ్ పున్‌వాడై యిదు కొణ్డిటిదుమ్)**- ఎల్లప్పుడు బాధించే స్వభావం కల్గిన ఈ లౌకిక పదార్థాలను మేము చూచి గ్రహించాము.

**(ఇవ్వాఱు వెమ్మై ఉరువుమ్ శువడుమ్ ఒన్టుమ్ తెరియిలమ్)**- ఇటువంటి పదార్థాలు - వీటి స్వభావాన్ని, లక్షణాన్ని ఏరీతిలోను మేము పలుకలేని రీతిలో మించి ఉన్నాయి.

**(ఒజ్జశురర్ పొన్టుమ్ వరై పుళ్ళియూర్‌వాన్ అరుళరుళాద ఇన్నాళ్)**- దుష్టనిగ్రహ- శిష్టపరిపాలన శీలుడు, దానికి తగినట్లు వేగాన్ని కల్గిన వాహనాన్ని కలవాడైన స్వామి తన సహజమైన కరుణతో దాసుడనైన నన్ను రక్షించని ఈ సమయంలో,

**(మన్టిల్ నిఱై పழி తూఱ్ఱివన్ కాఱ్ఱు ఎన్నై నిన్టు అడుమ్)**- భగవానుని శరణు పొందినప్పటికీ ఈ విధంగా పరాభవాన్ని పొందుతున్నాను- అనే నిందను పలువురు అంతటా పల్కి ప్రచారం చేసేటట్లుగా చేసి ఈలోకంలోని పదార్థాలు నన్ను నిలకడగా బాధిస్తున్నవి- అని భావం. స్వాపదేశంలో "పழி" అంటే- భగవానుని తానే వచ్చి స్వీకరించి రక్షించేవరకు వేచి సహించి ఉండలేక, ప్రాప్యసిద్ధి కోసం తహతహలాడుతున్నందున కలిగే స్వరూపహాని. "పేఱ్ఱుక్కు త్తాన్ ప్రవర్త్తిక్కైయుమ్ పழியిఱే" అని ఇక్కడ నమ్బిళ్ళైవ్యాఖ్యానం.

### నాయకుని నేత్రసౌందర్యంలో నాయకి అభినివేశం పొంది పల్కడం

**42. వన్‌కాఱ్ఱఱైయ ఒరుజ్గే మఱిన్దు కిడన్దలర్న్ద,**
**మెన్‌కాల్కమలత్తడమ్పోల్ పొలిన్దన-, మణ్ణుమ్ విణ్ణుమ్**
**ఎన్‌కాల్కళవిన్మై కాణ్మిన్ ఎన్బానొత్తువాన్ నిమిర్న్ద**
**తన్ కాల్‌పణిన్ద వెన్బాల్, ఎమ్బిరావ తడజ్గణ్గళే**

ఎమ్బిరాన్ = మా స్వామియొక్క, తడ కణ్‌కళ్ = పెద్దవి అయిన నేత్రాలు (ఏవిధంగా ప్రకాశిస్తున్నాయి? అంటే), మణ్ణుమ్ విణ్ణుమ్ = భూలోకం అనే

విశాలమైన రెండు లోకాలు, ఎన్ కాఋ్కు = నారెండు పాదాల పరిమితికి, అళవు ఇన్మై = చోటు చాలని అద్భుతాన్ని, కాణ్మిన్ = దర్శించండి, ఎన్బాన్ ఒత్తు = అని (ఆయా లోకాలలో ఉండేవారికి పల్కి) ఒక అద్భుతవిద్యను చూపేవానివలె, వాన్ నిమిర్న్ద = పైలోకాల దిశలో వృద్ధిచెందిన (ఊర్ధ్వముఖంగా పెరిగిన), తన్= తన, కాల్ = శ్రీచరణాలను, పణిన్ద = నమస్కరించిన, ఎన్ పాల్ = నాపట్ల, వన్ కాఱ్ఱు అఱైయ = పెద్ద గాలి వీచినందున, ఒరుఙ్గే మఱిన్దు కిడన్దు అలర్న్ద = ఒక పక్కగా వంగి ఉండి వికసించిన, మెన్ కాల్ = సుకుమారమైన నాళాన్ని కల్గిన, కమలమ్ తడమ్ పోల్ = తామరపూల తటాకంవలె, పొలిన్దన = గొప్ప అందంతో వెల్గుతున్నవి.

**భావదీపిక :** ఇది, నాయకుని కటాక్షాలపట్ల అభినివేశాన్ని పొందిన నాయకి ఆశ్చర్యంతో పల్కిన పాశురం. సర్వేశ్వరుడైన నాయకుడు తన కడగంటి చూపులతో పరాంకుశనాయకి అయిన తనను ఓరకంటితో అర్ధనిమీలితంగా చూచి, అనన్యార్హంగా చేసికొని పోయిన స్వభావంలో అభినివిష్టురాలై పల్కిన సూక్తి ఇది.

భగవానుని తిరునేత్రాలు, లోకాలను కొలిచిన తన శ్రీచరణాలలో నమస్కరించిన నా విషయంలో (నాకు) ఏవిధంగా భాసించాయి? అంటే, బలమైన గాలి వీచినందున ఒక పక్కగా వంగి ఉండి వికసించిన తామరపూల తటాకంవలె అందం మిక్కిలిగా కల్గినవై ప్రకాశించాయి- అని నాయకి అంటున్నది. ఓరకంటితో అర్ధనిమీలితంగా చూచిన నేత్రాలు- బలమైన గాలితో నిటారుగా నిలువలేక ఒకపక్కకు వంగి, ఆ స్థితిలో పూచిన తామరపూలవలె ఉన్నవి.

ఈ పాశురాన్ని కొంతభాగం అనుసరించి, శ్రీరంగరాజస్తవం ఉత్తరశతకంలో **"శ్రీరంగేశయ శరణం మమాసి వాత్యా వ్యాలోలత్ కమలతాటకతాణ్డవేన"** అని భట్టర్ పల్కిన సూక్తి ఇక్కడ స్మరణీయం.

భగవానుడు లోకాలను కొలిచిన వృత్తాంతాన్ని ఒక ఉత్ప్రేక్షాలంకారంతో కూర్చి పల్కుతున్నది- పూర్వార్ధం. భూలోకం, "పైలోకం అనే విస్తృతమైన లోకాలు రెండు నా రెండు పాదాల పరిమితికి చోటు చాలని ఆశ్చర్యాన్ని చూడండి''- అని ఆ లోకంలో ఉండేవారితో పల్కి, ఒక విద్యను చూపించేవానివలె లోకాలను స్వామి కొలిచాడట. భూమి, ఆకాశం భగవానుని పాదాల పరిమితికి చాలని స్థితి కంబ

రామాయణంలో "నీన్ఱ కాల్ మణ్ణెలామ్ నిరప్పియ పుఋమ్, శెన్ఱు పావి**న్ఱ్**ని**లై** శిఱిదు పొరెనా ఒన్ఱు వానక మెలా మెడుక్కియుమ్బురై వెన్ఱకాల్ మీణ్డదు వెళిపెఱా మైయే", "ఉలకమెలా ముళ్ళొడుక్కి" ఇత్యాది సూక్తులచే చూపబడింది. "తన్ కాల్ పణిన్ద" అనే ప్రయోగంలోని "కాల్" అనే పదాన్ని సప్తమీ విభక్తిరూపంగా గ్రహించి, తన విషయంలో అభినివేశాన్ని పొందిన- అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు.

లోకాలన్నిటిలోని ప్రాణులను తన శ్రీచరణాల క్రింద శేషభూతులుగా చేసికొని ఆనందించిన భగవానుడు ఈ లోకాన్ని చూచి "మీ తలలపై నా పాదాన్ని పెడతాను'' అని అంటే, ఈ జీవులలో అహంకార మమకారాలను కల్గినవి "నీవు మా తలలపై నీ పాదాన్ని పెట్టనివ్వము'' అని ఆనపెట్టి అడ్డుకోవచ్చు- అని తలచి, ఆ విధంగా చెప్పకుండా, "నా కాలుకు ఇవి చాలని ఆశ్చర్యాన్ని చూడండి'' అనే ఒక వ్యాజంతో పల్కి, వాటి తలలపై పాదాన్ని పెట్టి, వానిని శేషభూతంగా చేసికొన్నాడు- అనే భావం. "మణ్ణుమ్ విణ్ణుమ్ ఎన్ కాల్కళవిన్మై కాణ్మిన్ ఎన్బానొత్తువాన్ నిమిర్న్ద తన్కాల్" అనే ప్రయోగంలో వ్యక్తమవుతుంది. జీవులకు, వారి ప్రయత్నం ఏమీ లేకుండానే, భగవానుడు అనుగ్రహించడం దీనివల్ల తెలుస్తున్నది.

రెండవ పాదంలో "మణ్ణుమ్ విణ్ణుమ్" అనేది "విణ్ణుమ్ మణ్ణుమ్" అని అంటే, ప్రాసకు పొసగుతుంది. ఆ పాఠమే మొదటి పాఠమై, తరువాత మాఱి ఉండవచ్చు. "ఎమ్బిరాన" అనే దానిలో చివరలో గల "అ" కారం షష్ఠీవిభక్తిరూపం. "కలియన తమి**ఴ్**వై" అనేచోటలో వలె దీనిని గ్రహించాలి.

ఆ**ఴ్**వార్లు, తమపట్ల భగవానుడు పరిపూర్ణ కటాక్షాన్ని చూపిన రీతిని భావించి అనుభవించి, దానిని గూర్చి పలికే పాశురం, ఇది. "వన్కా**న్ఱ్**ఱ**లై**య" అనే దానికి అడ్డు లేని నడకను కల్గిన, కరుణచే ప్రేరేపింపబడిన కటాక్షవీక్షణమని అర్థం. "కారుణ్యమారుతానీతైః" అని తిరుక్కచ్చినంబి అన్నారుకదా! "ఒరుజ్గే మఱిన్దు కిడన్దలర్న్ద" అనేది ఈ ఆ**ఴ్**వార్లు ఒకరిపట్ల భగవానుని నేత్రాలు అభిముఖమై వీరినే ఉద్దేశించి వికసించడం తెలుపుతున్నది. "మెన్కాల్" అంటే- ఈ కరుణా దృష్టికి మూలమైన మనస్సులోని ఆర్ద్రత. "కమలత్తడమ్" అని వర్ణంతోను, చల్లదనంతోను, విస్తృతితోను కల్గిన భోగ్యతను ఉద్దేశించి పలుకబడింది.

## నాయకుని రూపసౌందర్యాన్ని గూర్చి ఆశ్చర్యంతో నాయకి పల్కడం

**43.** కణ్ణుమ్ శెన్దామరై కైయు మవై యడియో వవైయే,
వణ్ణమ్ కరియదోర్ మాల్ వరైపోన్ఱు-, మదివికఱ్పాల్
విణ్ణుమ్ కడన్దుమ్ పరప్పాల్‌మిక్కు మ***ర్ఱై***ప్పాల్‌యవర్క్కుమ్
ఎణ్ణు మిడత్తదువో?, ఎమ్బిరానదె***ర్ఱి***ల్ నిఱమే

కణ్ణుమ్ = తిరునేత్రాలు, శెమ్ తామరై = ఎఱ్ఱ తామరపూవుతో సాటి, కైయుమ్ = శ్రీహస్తాలు, అవై = ఆ తామరపూవువంటివి, అడియో = శ్రీచరణాలు కూడా, అవైయే = ఆ తామరపూలతో సాటి వచ్చేవి, ఎమ్బిరానదు = భగవానుని, ఎ*ర్ఱి*ల్ నిఱమ్ = అందమైన తిరుమేని ప్రకాశం, వణ్ణమ్ = వర్ణంలో, కరియదు = నల్లనిదైన, ఓర్ మాల్ వరై పోన్ఱు = అద్వితీయమైన గొప్ప పర్వతంవంటిది, మది వికఱ్పాల్ = జ్ఞానాధిక్యం చేత, విణ్ణుమ్ కడన్దు = స్వర్గలోకవాసులను మించి, ఉమ్బర్ అప్పాల్ మిక్కు = దానికి పైన ఉండే సత్యలోకవాసులకు ఆవలి వైపున పోయి, మ*ర్ఱు* ఎప్పాల్ యవర్క్కుమ్ = దానికి పైన గల పరమపదంలో ఏ చోట ఉండే నిత్యసూరులకు అయినా, ఎణ్ణుమ్ ఇడత్తదువో = (అటువంటిది అని) పరిచ్ఛేదించే రీతిలోని స్వభావాన్ని కల్గినదా? (కాదు).

**భావదీపిక :** ఇది, నాయకుని రూపవైలక్షణ్యాన్ని వివరించే నాయకి పాశురం. **"కైవణ్ణమ్ తామరై వాయ్ కమలమ్ పోలుమ్ కణ్ణిణైయుమ్ అరవిన్దమ్ అడియు మంఃదే"** (శ్రీహస్తం తామరవంటిది, ముఖం కమలం వంటిది, రెండు నేత్రాలు తామరలు, పాదాలు కూడా అటువంటివే) అనే తిరునెడున్దాణ్డకసూక్తితో మొదటి పాదం పోలి ఉన్నది. వేఱు ఉపమానం లభ్యం కావడం అరుదు- అనేది స్ఫురించే టట్లు పలు దివ్యాంగాలకు ఒక వస్తువే ఉపమానంగా చెప్పబడింది. భగవానుని తిరునేత్రాలు, శ్రీహస్తాలు, శ్రీచరణాలు- అనే దివ్యాంగాలు సాక్షాత్తు తామరపూలే. ఇక, తిరుమేనివర్ణం అయితే, ఒక కాటుక కొండవలె ఉన్నది. దీని వైలక్షణ్యాన్ని గూర్చి పల్కితే - ఈ లీలావిభూతిలో ఉండే అందఱికంటే జ్ఞానంలో ఆధిక్యాన్ని కల పరమపదంలోని నిత్యసూరులకు సైతం ఇటువంటి స్వభావాన్ని కల్గినది''- అని మనస్సుతో భావించడానికి కూడా సాధ్యం కాదు- అని అంటే, ఇక నోటితో పలుక గల్గినవారున్నారా? అని అన్నట్లయినది. మానవుల కంటే దేవతలు, ఇంద్రాది దేవతలకంటె సృష్టికర్త అయిన బ్రహ్మ, అతని కంటే ముక్తులు, వారికంటే నిత్యులు

జ్ఞానంలో అధికులని గ్రహించాలి. చాలా గొప్ప జ్ఞానులచే కూడా భగవానుని తిరుమేని అందం పరిచ్ఛేదించి చెప్పరానిది కనుక, ఇక్కడ ఉండేవారిచే పరిచ్ఛేదించడం సాధ్యం కానిది- అనేది తనంతతానే స్ఫురిస్తుంది. **"మది విగఱ్పాల్ ఎన్నుమిడత్తదువో?"** అని అన్వయం. **"వికల్ప"**మనే సంస్కృతపదం **"విగఱ్ప"** అని మారింది. వికల్పమంటే మార్పు, వైలక్షణ్యం. మిగిలినవారి జ్ఞానంకంటే గొప్ప విలక్షణంగా భాసించే జ్ఞానంతో- అని భావం. అటువంటి జ్ఞానంచే కూడా భావించడానికి సాధ్యం కానిది- భగవానుని ప్రకాశించే తిరుమేని అందం- అని ఇచటి తాత్పర్యం.

ఆళ్వార్లు తమ ఆంతరనేత్రానికి గోచరమైన భగవానుని రూప సౌందర్యంలో అభినివిష్టులై, "ఇది మాకేకాక, నిత్యసూరులకు కూడా పరిచ్ఛేదించరానిది"- అని దీనివల్ల పల్కినట్లయినది.

మూడవ పాదంలో **"యావర్క్కుమ్"** అనే రూపం **"యవర్క్కుమ్"** అని సంకోచాన్ని పొందింది. **"ఉయర్వఱ ఉయర్నల ముడైయవన్"** అనే పాశురంలోను, **"నెఞ్జినాల్ నినైప్పాన్ యవన్"** అనే పాశురంలోను **"యవన్"** అని, **"పయిలుమ్ తిరువుడైయార్ యవరేలుమ్ అవర్ కణ్డీర్"** అనే దానిలో **'యవర్'** అనే ప్రయోగాన్ని గమనించవచ్చు. కొందఱు **"యవన్"**, **"యవర్"** అనే పాఠాలకు బదులు ఎకారంతో కూడిన **"యెవన్"**, **"యెవర్"** అనే పాఠాంతరాలను స్వీకరించాలని అనడం అసంప్రదాయం. వ్రాతప్రతులలో అంతటా యకారఘటితమైన పాఠమే కన్పిస్తున్నది.

ఇందులో ఆళ్వార్లు ముందుగా భగవానుని నేత్రసౌందర్యాన్ని అనుభవించారు. తరువాత తమను ఆలింగనం చేసికొనే స్వామి చేతిని అనుభవించారు. ఆలింగనం చేసికొనేటపుడు కలిగే ఆనందంతో సొమ్మసిల్లి వాలే చోటు అయిన శ్రీచరణాలను తరువాత అనుభవించారు. దానికి పిమ్మట భగవంతుని తిరుమేనిని అనుభవించారు- అని వివరిస్తూ పెరియవాచ్చాన్పిళ్ళై, శేషభూతునకు ఎల్ల అయిన శ్రీచరణాలను దర్శించిన తరువాత తిరుమేనిని అనుభవిస్తున్నారేమి? అనే సందేహానికి సమాధానంగా పిళ్ళైప్పిళ్ళైయాళ్వాన్ పల్కిన సూక్తిని ఉదాహరించారు.

స్తనంధయ శిశువునకు తల్లిస్తన్యంవలె, దాసులకు ప్రాప్యావధి భగవానుని శ్రీచరణాలు. పాలు తాగే శిశువు, ముందుగా తన నోటిలో తల్లిస్తన్యాన్ని పెట్టుకొని తరువాత తల్లిముఖాన్ని చూస్తుంది. అదేవిధంగా ఆళ్వార్లు భగవానుని శ్రీచరణా

లను దర్శించిన తరువాత, అతని తిరుమేనిలో దృష్టిని సారించారు- అని పిళ్ళైప్పిళ్ళైయాఴ్వాన్ అనే ఆచార్యులు అన్నారట.

### నాయకుని గొప్పతనాన్ని గూర్చి నాయకి పల్కడం

**44.** **నిఱముయర్ కోలముమ్ పేరు మురువు మివై యివై యెన్ఱు,**
**అఱముయల్ ఞాన చ్చమయిగళ్ పేశిలుమ్-, అజ్గజ్గెల్లామ్**
**ఉఱవుయర్ ఞానచ్చుడర్ విళక్కాయ్ నిన్ఱదన్ఱి యొన్ఱుమ్**
**పెఱముయన్ఱారిల్లైయాల్, ఎమ్బిరాన పెరుమైయైయే**

నిఱమ్ =తిరుమేనివర్ణం, ఉయర్ కోలముమ్ = గొప్ప అలంకారం, పేరుమ్= తిరునామం, ఉరువమ్ = రూపం, ఇవై ఇవై ఎన్ఱు = ఇవి ఇవి అని, అఱమ్ ముయల్ ఞానమ్ శమయికళ్ పేశిలుమ్ = ధర్మమార్గంలో ప్రయత్నించి పొందిన జ్ఞానాన్ని కల వైదిక సంప్రదాయస్థులు (ఒకవిధంగా ఇతరులకు) పల్కినా, (వారు) అజ్గు అజ్గు ఎల్లామ్ = పూర్వం పల్కిన వర్ణం, అలంకారం, తిరునామం,రూపం- అనే వీటి అన్నిటికంటే, ఉఱ ఉయర్ ఞానమ్ శుడర్ విళక్కు ఆయ్ నిన్ఱదు అన్ఱి= మిక్కిలి గొప్ప (తమ) జ్ఞానమనే దీపంతో కొంచెం వివరణను (వైశద్యాన్ని) పొందారే తప్ప, ఎమ్బిరాన్ పెరుమైయై = భగవానుని నిస్సమాభ్యధికమైన మహిమను, ఒన్ఱుమ్ పెఱ ముయన్ఱార్ ఇల్లై = ఏ రీతిలోను పూర్తిగా పరిచ్ఛేదించి పలుక గలిగే రీతిలో ప్రయత్నం చేసినవారు లేరు.

భావదీపిక : నాయకి, నాయకుని గొప్పతనాన్నిగూర్చి పలికే పాశురం ఇది. **“వాళ్ కొణ్డ కణ్ణార్ యారే వడివినై ముడియ క్కణ్డార్, ఊఴ్ కొణ్డ శమయత్తన్నా నురువు కణ్డారై యొత్తార్”** అనే కంబరామాయణ సూక్తిరీతిలో భగవానుని నామం, రూపం, గుణాలు మొదలైన గుణాలలో ఆయా మతస్థులు తాము తాము ఒక్కొక్క భాగాన్ని తెలిసికొన్నారే తప్ప, పూర్తిగా ఎవరూ తెలియలేదు- అని అంటున్నది (నాయకి). గడచిన పాశురంలో **“ఎమ్బిరానదెழిల్ నిఱమ్ యవర్క్కు మెణ్ణ మిడత్తదువో!”** అని పల్కిన తరువాత, ఇపుడు, భగవానుని వర్ణాన్ని, అలంకారాన్ని, నామాలను, రూపాన్ని “ఇవి, ఇవి'' అని జ్ఞానాన్ని కల వేదాంతులు పల్కుతున్నారు కదా! ఆ విధంగా ఉన్నపుడు, మఱి, **“ఎణ్ణ మిడత్తదువో!”** అని ఏవిధంగా అన్నారు? అనే ప్రశ్నకు సమాధానం పల్కుతున్నట్లుగా ఈ పాశురం ఉన్నది. వారుకూడా

అతని గొప్పతనాన్ని కొంచెం కొంచెం దర్శించారే తప్ప పూర్తిగా చూడలేదని ఈపాశుర భావం.

**"అఱముయల్ ఞానశమయికళ్"** అనే చోట **"అఱమ్+ముయల్"** అని విడదీయకుండా, **"అఱముయల్"** అని ఏకపదంగా గ్రహించి "మిక్కిలి ప్రయత్నించి పొందిన'' అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"అఱ"** -మిక్కిలి.

ఆళ్వార్లు తమకు సేవను అనుగ్రహించిన సర్వేశ్వరుని మహిమ ఎంత జ్ఞానం కల్గినవారికికూడా పూర్ణంగా తెలియడానికి సాధ్యం కానిది- అనే వాస్తవాన్ని ఇందులో తెలిపారు. స్వప్రయత్నంతో తెలిసికొందాము- అని ప్రయత్నించే వారికి తెలియడానికి సాధ్యం కానిదై, పరిచ్ఛేదించడానికి సాధ్యం కానిదైన తన మహిమను పరమకృపతో తమకు భాసించేటట్లు చేసిన ఉపకారాన్ని తలచి ఆళ్వార్లు **"ఎమ్పిరాన్"** అని అన్నారు.

**(నిఱముయర్ కోలముమ్ పేరుమ్ ఉరువుమ్)- "నిఱమ్"-** అంటే- **"మున్నై వణ్ణమ్ పాలిన్ వణ్ణమ్ ముళుదుమ్ నిలైనిన్ద పిన్నై వణ్ణమ్ కొణ్డల్ వణ్ణమ్"** (భగవానుని వర్ణం కృతయుగంలో క్షీరవర్ణం. ఆ తర్వాత వర్ణం మేఘవర్ణం.) ఇత్యాదులలో చెప్పబడిన తెలుపు, నలుపు మొదలైనవి. **'కోలమ్"** అంటే- శ్రీకౌస్తుభమణి మొదలైనవి. **"పేర్"**- సహస్రనామాలు. **"ఉరు"** - మత్స్యకూర్మాది అవతార ప్రకారాలు.

**"పేరుమ్ ఉరువమ్ ఇవై ఇవై ఎన్ఱు"** అనే సూక్తిని వ్యాఖ్యానించేటపుడు పెరియవాచ్చాన్పిళ్ళై ఒక ఐతిహ్యాన్ని ప్రస్తావించారు.

తిరుమలైనంబి తమ చరమావస్థలో కణియనూర్ శిఱియాత్తాన్- అనే ఆచార్యులను పిలచి "పిళ్ళై (భట్టర్) తమకు రక్షకంగా భావించే తిరునామం ఏది?'' అని అడిగారు. దాశరథి అనే పేరును గల శిఱియాత్తాన్ "తిరుమలైనంబి సమక్షంలో నేనేమి చెప్పగలను?'' అని భావించి బదులు పలుకకుండా మౌనంగా ఉండిపోయారు. అపుడు తిరుమలై నంబి "దాశరథీ! బదులు పలుకకుండా ఉండే సమయం కాదిది'' అని అన్నారు. శిఱియాత్తాన్ "నారాయణ మొదలైన పలు నామాలను భట్టర్ అనుసంధించినా, వారు చాలా ఆదరించిన నామం అళ్ళకియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ అనే తిరునామమే'' అని సమాధానం పలికారు. ఆచార్యభక్తిని మిక్కిలిగా కల్గిన నంబి- "ఆచార్యుని తిరునామాన్ని చెప్పవలసిన

నోటిలో భగవన్నామాన్ని ఉచ్చరించడం భర్త పేరును భార్యచెప్పడం వంటిది. అయినా, భట్టర్ మనస్సుకు అభిమతమైన నామమే మనకు రక్షకం'' అని పల్కి, **"అழకియమణవాళప్పెరుమాళే శరణమ్"** అని అనుసంధిస్తూ పరమపదాన్ని అలంకరించారు. తిరుమలనంబి భట్టర్‌కు పితృసమానులు. అందువల్ల భట్టర్‌ను **"పిళ్ళై"** అని పలిచేవారు. ఈ తిరుమలైనంబి శ్రీరామానుజుల మేనమామ అయిన పెరియతిరుమలైనంబి కుమారులైన శిఱియ తిరుమలైనంబి- అని అరుంబద వివరణంలో తెలుపబడింది. ఈ ఐతిహ్యమే పెరియాழ్వార్ తిరుమొழிలోని **"నావకారియమ్" (4-4-1)** అనే పాశురవ్యాఖ్యలో మణవాళ మహామునులచే ప్రస్తావింపబడింది. భట్టర్ మిక్కిలి ఆదరించిన నామం **"అழకియమణవాళన్"** అనే తిరునామం అనే విషయాన్ని పెరియతిరుమొழி ప్రబంధంలోని **(5-5-1)** పాశురవ్యాఖ్యలో, తిరునెడున్దాణ్డకమ్ ప్రబంధంలోని **27**వ పాశురవ్యాఖ్యలో పెరియవాచ్చాన్‌పిళ్ళై, తిరువాయ్‌మొழிలోని **(6-5-7)** పాశుర ఈడువ్యాఖ్యలో నమ్పిళ్ళై ప్రస్తావించడం గమనించదగినది.

ఈ సందర్భంలోనే పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానంలో ఇంకొక ఐతిహ్యం ప్రస్తావించబడింది. **"ఆచ్చిమకన్"**- అనేవారు మరణదశలో తమను తెలియని అచేతనావస్థలో ఉండగా, వారిని విచారించడం కోసం భట్టర్ వెళ్ళారు. ఆచ్చిమకన్‌కు అழకియమణవాళన్‌పై ఉండే అభినివేశాన్ని స్మరించి, వారి చెవిలో మెల్లగా **"అழకియమణవాళ ప్పెరుమాళే శరణమ్"** అని అన్నారట. ఆ నామోచ్చారణను ఆలకించిన ఆచ్చిమకన్, పూర్వసంస్కార వశంచేత తెలివిని పొంది, చాలా సేపు ఆ నామాన్నే అనుసంధిస్తూ పరమపదానికి వేంచేశారు. ఈ ఐతిహ్యం తిరువాయ్‌మొழி ఈడువ్యాఖ్యలో **(4-5-2)**వ పాశురవివరణలో కూడా ప్రస్తావింపబడింది.

**"ఉరువమ్"** అనే పదాన్ని వివరించేటపుడు పెరియవాచ్చాన్‌పిళ్ళై మఱి ఒక ఐతిహ్యాన్ని కూడా ప్రస్తుతించారు. ఆళవన్దార్ కుమారులు శొట్టైనమ్బి అంతిమదశలో ఉండగా వారి దగ్గరకు కొందఱు వెళ్ళి "ఈ సమయంలో మీరు ఏమని అనుకుంటున్నారు?'' అని అడిగారు. అపుడు శొట్టైనమ్బి "పరమపదానికి వెళ్ళినపుడు అక్కడ నమ్బెరుమాళ్ చల్లని ముఖంవలె వైకుంఠనాథుని ముఖం చల్లగా లేకపోతే తిరిగి ఈ లోకానికి పరుగెత్తివస్తాను'' అని అన్నారట. దీనివల్ల శొట్టైనంబికి నమ్బెరుమాళ్ దివ్యరూపంపట్లగల అభినివేశాతిశయం స్ఫుటమవుతున్నది. ఈ ఐతిహ్యం నాచ్చియార్ తిరుమొழி **(11-5)**వ పాశురంలో కూడా ప్రస్తావింపబడింది.

ఇక్కడే వేఱొక ఐతిహ్యం పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానంలో ఉన్నది. భట్టర్ నమ్బెరుమాళ్ తిరుమంజనాన్ని నిర్వహించేవారు భట్టర్‌ను చూచి "మీకేమి కావాలి" అని అడిగారు. "వస్త్రాన్ని తొలగించి నమ్బెరుమాళ్ళ కటి ప్రదేశాన్ని, ఊరువులను రెండిటిని ఒక మాఱు దర్శింపజేయాలి" అని భట్టర్ అన్నారు. ఆవిధంగానే అర్చకులు సేవింపజేయగా భట్టర్ దర్శించారు. అపుడు నమ్బెరుమాళ్ భట్టర్‌తో "భట్టర్! చూచి భయపడ్డారా ఏమి!" అని అనగా, "స్వామీ! పరమపదం అనేది నేను రాసిన చీటీ ప్రకారం చెల్లుబాటు అవుతుంది. అందువల్ల అది నాకు ప్రాప్తించడంలో లోటులేదు. కాని, నీ చల్లని తిరుముఖాన్ని, తిరునామాన్ని అక్కడ సేవించలేను కదా! అని తలచి భయపడుతున్నాను అంతే" అని అన్నారట. ఈ ఐతిహ్యాన్ని నాచ్చియార్‌తిరుమొழி (11-5)వ పాశురంలోని **"నల్లార్‌కళ్"** అనే పదాన్ని వివరించేటపుడు వ్యాఖ్యానంలో పెరియవాచ్చాన్‌పిళ్ళై ఉదాహరించారు. అయితే, ఈ వ్యాఖ్యలో భట్టర్‌కు నడుముపై ఏర్పడిన వ్రణంవల్ల బాధపడుతూ ఉండే సమయంలో ఈసందర్భం జరిగినట్లు తెలుపబడింది. ఈ ఐతిహ్యంద్వారా భట్టర్‌కు నమ్బెరుమాళ్ దివ్యరూపంపట్ల గల గొప్ప అభినివేశం వ్యక్తమవుతున్నది.

### నాయకి, నాయకుడు తనను నీటిప్రమాదంనుండి రక్షించిన సంగతిని ప్రస్తావించడం

**45.** పెరుజ్గేழలార్‌దమ్ పెరుమ్ కణ్ మలర్ పుణ్డరీగమ్, నమ్మేల్
**ఒరుజ్గే పిఱழ వైత్తారివ్వకాలమ్,- ఒరువర్ నమ్పోల్**
**వరుమ్ కేழ்బవరుళరే? తొల్లై వాழியమ్ శూழ்పిఱప్పు**
**మరుజ్గే వరప్పెఱుమే? శొల్లు వాழி మడ నెఞ్జమే!**

మడ నెఞ్జమే = ఓ మూఢ మనసా!, పెరు కేழలార్ = (ప్రళయజలంలో మునిగిన భూమిని ఉద్ధరించడం కోసం) మహావరాహరూపియైనవాడు, ఇ అ కాలమ్ = (రక్షించడానికి) సులభం కాని ఈ కాలంలో, తమ్ = తన, పెరు కణ్ మలర్ పుణ్డరీకమ్ = పెద్ద ఎఱ్ఱ తామరపూవువంటి తిరునేత్రాలను, నమ్మేల్ = మనవైపు, ఒరుజ్గే పిఱழ వైత్తార్ = ఏకరీతిలో ప్రకాశించేటట్లు (మెఱిసేటట్లు) కటాక్ష పాతాన్ని చేసినవాడు (కటాక్షించి కాపాడినవాడు), తమ్ పోల్ వరుమ్ కేழ்పవర్ = (తనతో)మనవలె పొందికగా ఉండే సంబంధాన్ని కలవారు, ఒరువర్ ఉళరే = వేఱొకరు ఉన్నారా? (లేరు), తొల్లై వాழியమ్ = వారితో అనాదియైన

ఉజ్జీవనాన్ని మనం కల్గి ఉన్నాము, (అటువంటి మనకు), శూ*ழ்* పిఱప్పు = విడువకుండే చుట్టుకొనే జన్మక్లేశం, అరుళ్గే వర పెరుమే = దగ్గరకు రాగలదా?, శొల్లు =పల్కు, వా*ழி* = నీవు (అజ్ఞానం తీరి) ఉజ్జీవిస్తావు గాక!

**భావదీపిక :** నాయకుడు తనకు జలమయప్రదేశంలో చేసిన అనుగ్రహాన్ని **(నీరిడైయుదవి)** నాయకి స్మరించి, దానిని గూర్చి ఈ పాశురంలో పల్కుతున్నది. నాయకుని విశ్లేషించిన ఈ నాయకి, అతనినే నిరంతరం చింతిస్తూ, చాలా కాలం క్లేశపడుతూ ఉన్నది. ఆ క్లేశాతిశయం వల్ల ఆమె మనస్సు, అతడు పూర్వం చేసిన సహాయాన్ని, అతనికి తనకు మధ్య గల సంబంధాన్ని మఱచిపోయి, "అతడు దయావిహీనుడు, మనస్సులో ఆర్ద్రత లేని కఠినుడు" అని అతని కాఠిన్యాన్నే ప్రస్తావించి పల్కి గర్హించింది. అపుడు నాయకి తన మనస్సును సంబోధిస్తూ "ఓమనసా! మనం పూర్వం (నీర్ నిలై) జలమయప్రదేశంలో క్రీడించే సమయంలో, నీటి ప్రవాహంలో చిక్కుకొని మునిగి, ప్రాణం పోయే స్థితిలో, అతడువచ్చి తనకు అపాయం కల్గుతుందేమోనని కూడా వెనుదీయకుండా దిగి, మనలను ఉద్ధరించి తీరాన్ని చేర్చి ప్రాణాలను కాపాడిన మహానుభావుడు కదా! అని, "ఇటువంటి సంబంధం అతనితో వేఱెవరికి కల్గింది?" అని, "ఈ సహాయాన్ని చేయడానికి పూర్వమే అతనితో మనం సహజసంబంధాన్ని పొందాముకదా" అని- ఈ విధంగా అనాదికాలంగా అతనితో ఉండే సంబంధాలను ప్రస్తావించి పల్కి మనస్సును మార్చడం ద్రావిడప్రణయ సాహిత్యంలో ఒక ఆలంకారిక (శృంగార) ప్రక్రియ. ఆ ప్రక్రియలో ఈ పాశురం రచింపబడినదని కూడా చెప్పవచ్చు.

ఈ పాశురంలో జల ప్రదేశంలో నాయకుడు చేసిన ఉపకారాన్ని గూర్చి పల్కడం స్పష్టంలో కన్పించలేదే!- అని భావించనక్కరలేదు. **"పెరుమ్*కే**ழ*లార్"** అనేది భగవానుడు మహావరాహమూర్తియై అవతరించడం, ప్రళయాబ్ధిలో చిక్కుకొని మునిగిపోయిన భూదేవిని ఆ సముద్రం నుండి పైకి లేవనెత్తి రక్షించడంకోసం కనుక, అదే **"నీరిడైయుదవి"** (జల మయదేశంలో చేసిన ఉపకారం) కనుక, అది ఇక్కడ స్మరించి ప్రస్తావింపబడింది. ఆ ఉపకారం భూదేవికి చేసిన ఉపకారమైనా, ఆశ్రితులలో ఎవరికి ఏ ఉపకారాన్ని చేసినా, దానిని మిగిలిన దాసులందఱు తమకు చేసినట్లు భావించడంలో కొఱత లేదు. అంతేకాక, **"పిన్నైకొల్! నిలమామకళ్ కొల్! తిరుమకళ్కొల్ పిఱన్దిట్టాళ్!"** (నీళాదేవియా? లేక, భూదేవియా? లేక,

లక్ష్మీదేవియా జన్మించింది?) అనే ఐక్యం కూడా దివ్యపత్నులతో పరాంకుశనాయకికి ఉన్నది.

**(తమ్‌పెరుజ్కణ్ మలర్ పుణ్డరీకమ్ నమ్మేల్ ఒరుజ్గే పిఱఴ్వైత్తార్)**- అనేది తనను భగవానుడు చల్లగా కటాక్షించడం తెల్పుతుంది. మనపై ప్రసరింపజేసిన కటాక్షాన్ని మార్చి పిరాట్టి తనవైపు ప్రసరించేటట్లు చేసికోవాలని అనుకున్నా, ఆ విధంగా మార్చలేనట్లుగా కటాక్షపాతాన్ని చేశాడనే భావం స్ఫురించేటట్లుగదా **"ఒరుజ్గే"** అని పలుకబడింది. **"ఎజ్గుమ్ పక్కనోక్కఱియాన్ ఎన్ పైన్దామరై క్కణ్ణనే!"** (నా పుండరీకాక్షుడు ఎక్కడా పక్కచూపులు చూచి ఎరుగడు) అని తిరువాయ్ మొఴిలో ఆఴ్వార్లు కూడా అన్నారు. **"పిఱఴ్"**-మిక్కిలి- అని అర్థం.

**"ఇక్కాలమ్"** అని అనకుండా **"ఇవ్వక్కాలమ్" (ఇ అ కాలమ్)** అని అన్నందున- తన ప్రాణం పోయినా పోనీ- అని తనను లెక్కించకుండా వచ్చి రక్షిస్తే తప్ప, మిగిలిన రీతిలో సులభంగా రక్షించడానికి సాధ్యం కాని కాలం - అనే భావం స్ఫురిస్తుంది- ఇకపై మనం బతికే అవకాశం లేదు- అని నిరాశను పొందిన సమయంలో వచ్చి రక్షించాడని భావం. కాలం కాని కాలం అకాల మనబడుతుంది. మహావరాహమై కటాక్షించి రక్షించడం చాలా కాలానికి పూర్వమే జరిగినా, ప్రేమాతిశయం చేత ఇపుడే జరిగినట్లుగా తోచినందున **"ఇవ్వక్కాలమ్"** అని సమీపకాలవాచక సర్వనామపదంతో పలికింది.

భగవత్కటాక్షాన్ని పొందిన అతిశయంచేత కల్గిన మానసికానందం పాశురం ఉత్తరార్ధంలో విశదంగా తెలుపబడుతున్నది. "అతనితో మనవలె పొందికను కల సంబంధాన్ని పొందినవారు వేఱెవరైనా ఉన్నారా? లేరుకదా! ఈ సంబంధం మనకే అసాధారణం. మనం ఈనాడు, నిన్న ఉజ్జీవించామా? చిరకాలంగా ఉజ్జీవనాన్ని కల్గి ఉన్నాముకదా! ఇటువంటి మనకు సంసారక్లేశాలు దగ్గరకైనా వస్తాయా? చెప్పు మనసా!"- అని నాయకి అంటున్నది. "ఈ సంసారంలో పుట్టిన స్త్రీలకు కల్గడానికి అవకాశం ఉండే విరహక్లేశాలు ఈ విధంగా కరుణను, సంబంధాన్ని కల నాయకుని కల్గిన మనకు రావు"- అని తాత్పర్యం.

నోరు తెఱచి ఏదయినా పల్కడానికి యోగ్యత లేని మనస్సును చూచి **"శొల్లు"** అని అనడం ఒక కవితాచమత్కారం. **"కాణ్"** అనే రీతిలోనే ఇది కూడా. **"ఉళరే", "పెఱుమే"** అనే ఏకారాలు (**"ఇలర్"** అని, **"పెఱాదు"** అని అర్థాన్ని

ఇస్తున్నందున) వ్యతిరేకార్థకాలు తొల్లై- (పణ్బుప్పెయర్) "ఐ" అనే ప్రత్యయాన్ని పొందిన స్వభావవాచకం.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ప్రత్యేకంగా వివరించనక్కరలేక పోయినా, ఒకవిధంగా నిష్కర్షించి తెలుపుతాము. మనం సంసార సముద్రంలో చిక్కుకొని బాధపడే ఈ కాలం సులభంగా రక్షించడానికి వీలయినది కాదు. ఇటువంటి ఆ కాలంలో, ప్రళయ సముద్రంలోని భూమిని ఉద్ధరించి రక్షించిన స్వామి మనపై పూర్ణకటాక్షాన్ని చేశాడు. అందువల్ల మనవలె అతనితో సంబంధాన్ని పొందినవారు వేఱెవరూలేరు. అంతేకాక, పరమాత్మ అయిన అతనితో జీవాత్మలమైన మనం సహజంగా శేషత్వసంబంధాన్ని కల్గి, ఉజ్జీవనాన్ని కల్గినవారం. మనకు ఇక జన్మక్లేశాలు కనీసం దగ్గరకుకూడా రాలేవు. (భగవత్కటాక్షం కల్గి, అనుభవం పొందినవారికి జన్మసంబంధం ఉన్నదని ఎక్కడైనా విన్నామా?) మనసా! ఇక కలతను పోగొట్టుకొని, తేటపడి ఉజ్జీవించు- అని ఆళ్వార్లు జన్మక్లేశానికి భయపడి బాధపడే తమ మనస్సును ఉద్దేశించి పల్కి, తేటపడేటట్లు చేసే పాశురం ఇది.

### మనస్సును స్వామివద్దకు దూతగా పంపిన నాయకి అది తిరిగి రానందున విచారించడం

**46.** మడనెఞ్జ మెన్టుమ్ తమదెన్టుమ్, ఓర్ కరుమమ్ కరుది
విడనెఞ్జైయుత్తార్ విడవో వమైయుమ్,- అప్పొన్‌పెయరోన్
తడనెఞ్జమ్ కీణ్డ పిరానార్ తమదడిక్కీళ్ విడ ప్పోయ్
త్తిడ నెఞ్జమాయ్, ఎమ్మైనీ త్తిన్టు తాఱుమ్ తిరిగిన్టదే

మడమ్ నెఞ్జమ్ ఎన్టుమ్ = మూఢత్వాన్ని కల మనస్సు- అని భావించి, తమదు ఎన్టుమ్ = మనకు అంతరంగమైనది- అని భావించి, ఓర్ కరుమమ్ కరుది = ఒక కార్యాన్ని ఉద్దేశించి, నెఞ్జై విడ ఉఱ్ఱార్ = మనస్సును దూతగా పంపించాలని నిశ్చయించుకొన్నవారు, విడవో అమైయుమ్ = ఆ నిశ్చయాన్ని, విడచిపెట్టడం యుక్తం. (ఎందుకు? అంటే), అ పొన్ పెయరోన్ = ఆ కఠినుడైన హిరణ్యకశిపుని, తడ నెఞ్జమ్ = విశాలమైన వక్షస్సును, కీణ్డ = సులభంగా బ్రద్దలు చేసిన, పిరానార్ తమదు = పరాక్రమశాలి అయిన స్వామియొక్క, అడి కీళ్ = శ్రీచరణసమీపంలోకి, విడ = (మనం మన మనస్సును) దూతగా పంపించగా (అది), పోయ్ = వేగంగా పోయి, తిడమ్ నెఞ్జమ్ ఆయ్ = నిశ్చయమైన, స్థిరమైన

భావాన్ని కల్గినదై, ఎమ్మై నీత్తు = (దూత్యాన్ని పంపినవారం, తనకు స్వామి అయిన) మనలను లెక్కించకుండా విడచిపెట్టి, ఇన్రు తాఱుమ్ = ఈనాటివరకు, తిరికిన్ఱదు= (ఆ స్వామినే అనుసరించి ఉల్లాసంగా) సంచరిస్తూ ఉన్నది.

**భావదీపిక :** నాయకుని వద్దకు తన మనస్సును దూతగా పంపిన నాయకి, అది తిరిగి తనవద్దకు రాకపోవడం గమనించి బాధపడి పలికే పాశురం ఇది. ఈ పాశురాన్ని ఒక విధంగా అనుసరిస్తూ పిళ్ళైప్పెరుమాళ్ అయ్యంగార్ తిరువరఙ్గ క్కలమ్బకమ్ - అనే ప్రబంధంలో **"నీరిరుక్క మడమజ్గైమీర్! కిళికళ్ తామిరుక్క మదుకరమెలామ్ నిఱైన్దిరుక్క మడవణ్ణమన్న నిరైయాయిరుక్క వురైయామల్ యాన్, ఆరిరుక్కిలుమ్ ఎన్నెఞ్జ మల్లదొరు వఞ్జమఱ్ఱ తుణైయిల్లై యెన్ఱాదరత్తి నొడు తూతువిట్ట పిఴైయారిడత్తురై శెయ్దాఱువేన్, శీరిరుక్క మఱైముడివు తేడరియ తిరువరఙ్గరై వణఙ్గియ తిరుత్తుఴాయ్ తరిల్ విరుమ్బియే కొడు తిరుమ్బియే వరుదలిన్ఱియే, వారిరుక్కు ములై మలర్మడన్దైయుఱైమార్బిలే పెరియ తోళిలే మయఙ్గి యిన్బుఱ ముయఙ్గి యెన్నైయు మఱన్దు తన్నైయు మఱన్దదే"** (అమాయకత్వాన్ని కల చెలులారా! ఎదురుగా మీరంతా ఉండగా, చిలుకలు ఉండగా, తుమ్మెదలు అన్నీ ఉండగా, అందమైన హంసలు అన్నీ గుంపులుగా ఉండగా, వీటికి దూతలగా పంపకుండా, నేను వేరెవ్వరున్న నా మనస్సు తప్ప, ఇంకొక వంచన చేయని సహాయము లేదని తలచి, ఆదరంగా దానిని స్వామి వద్దకు దూతగా పంపిన దోషాన్ని గూర్చి ఏమని చెప్పను? గొప్ప వేదాంతాలు కూడా అన్వేషించలేని శ్రీరంగనాథుని దర్శించి, నమస్కరించి, అతడు తన తులసిని ప్రసాదంగా ఇస్తే తీసుకొని, తిరిగిరాకుండా, కంచుకాలపు తగి ఉండే స్తనాలను కల లక్ష్మీదేవిని వక్షస్సులో కల ఆ స్వామి బాహువులలో వ్యామోహాన్ని పొంది నా మనస్సు నన్ను మరచి పోవడమేకాదు, తనను కూడా మరిచిపోయింది.) అనే పాశురం రచించారు.

మేఘాలు, చిలుకలు, తుమ్మెదలు,హంసలు, సఖులు- మొదలైనవి దూతలుగా పంపదగినవై ఉండగా, కపటం, వంచన లేనిది- అని, మన మనస్సు- అని, **"నెఞ్జై ఒళిత్తొరు వఞ్జకమిల్లై"** (మనస్సును దాచడం కంటే మించిన వంచన లేదు) అని మొదలైన కారణాలను ఆలోచించి, మిగిలినవారిని దూతలుగా పంపడంకంటే మనస్సునే దూతగా పంపడం ఉచితంగా భావించి, దానిని ఒక కార్యం కోసం ఒకచోటకు దూతగా పంప నిశ్చయించినవారందఱు, ఆ నిశ్చయాన్ని మార్చు

కోవడమే తగినది. ఎందుకంటే, నా నాయకుని వద్దకు పూర్వం నేను దూతగా పంపిన నా మనస్సు, ఇంతవరకు తిరిగి రాకపోవడమే కాదు; నాకు తనకు ఉండే సంబంధాన్నిగూర్చి నా మనస్సునుగూర్చి ఏమాత్రం ఆలోచించకుండా, కాఠిన్యాన్ని వహించి, అతని (నాయకుని) వెంటనే సంచరిస్తూ ఉన్నది- అని మనస్సును దూతగా పంపిన నాయకి తన అనుభవంతో లోకులకు ఒక నిశ్చయాన్ని దృఢంగా పల్కుతున్నది.

**"మడమ్"**- మౌఢ్యం, కపటం, వంచన మొదలైన దుర్గుణాలు లేకపోవడానికి పర్యాయం. కన్పించినవారిని ఎవరినైనా గ్రహించి, నిర్వహించదగిన కార్యాలు కొన్ని ఉంటాయి. కాని, అంతరంగులనే మాత్రమే పురస్కరించుకొని చేయదగిన కార్యాలు కూడా కొన్ని ఉంటాయి. బయటవారిని పురస్కరించుకొని నిర్వహించదగినవే కాక, దగ్గరవానితో నిర్వహించదగిన కార్యమైతే, ఆ కార్యంలో మనస్సును నియోగించడం తగినది కానేకాదు- అని పూర్వార్ధంలో తెలుపబడింది.

**"విడనెఞ్జై యుడ్రీరార్"**- అనే చోట **"విడమ్, నెఞ్జై"** అని విడదీసి, విషంవలె క్రూరమైన మనస్సును కలవారిని, **"విడ అమైయుమో"** -దూతగా పంపడం తగునా?- అనికూడా వివరించవచ్చు. **"ఓర్ కరుమమ్ కరుతి విడనెఞ్జై యుడ్రీరార్ విడవో వమైయుమ్"** అనే దానికి - ఒక కార్యాన్ని ఉద్దేశించి మనస్సును దూతగా పంపాలని నిశ్చయించుకొన్నవారు ఆ విధంగా దానిని దూతగా పంపడం కంటే, ఆ పనిని విరమించడమే మంచి- అని కొందఱు వివరిస్తారు. మనస్సును దూతగా పంపడం తగదు- అని మీరు అనడానికి ఏమి కారణం? అని అంటే "దానిని దూతగా పంపి నేను పడిన పరాభవాన్ని వినండి'' అని అంటున్నారు (ఆళ్వార్ నాయకి) ఉత్తరార్ధంలో. "హిరణ్యకశిపుని వక్షస్సును చీల్చి, ప్రహ్లాదళ్వాన్‌కు గొప్ప అనుగ్రహాన్ని చూపిన స్వామి మన విషయంలోకూడా అనుగ్రహించకుండా ఉండడు. ఆ అనుగ్రహాన్ని పొంది రా''- అని ఆ స్వామి శ్రీచరణాల సాన్నిధ్యంలో దూతగా పంపిన మనస్సు అక్కడకు పోయి నన్ను మఱచి పోయి విడచిపెట్టి, ఈనాటికీ ఆస్వామిచరణాల సన్నిధిలోనే సదా నా కాలక్షేపాన్ని చేస్తూ తిరుగుతున్నది- అని భావం.

**"అప్పాన్‌పెయరోన్"** అనే అకరచ్చుట్టు (సర్వనామపదమైన అకారంతో నిర్దేశించడం) క్రౌర్యంలో అతనికి ఉండే ప్రసిద్ధి తెల్పుతుంది. బంగారానికి

సంస్కృతంలో హిరణ్యమనే పర్యాయపదమున్నది కనుక, హిరణ్యాసురుడు **"పొన్‌పెయరోన్"** అని నిర్దేశింపబడ్డాడు. బంగారువర్ణంలో మేనిని కలవాడైనందున అతనికి ఈ పేరు వచ్చినది.

"నెఞ్జమ్ కీణ్డ" - "నెఞ్జమ్" అని మనస్సుకు పేరు. దానికి స్థానమైన హృదయాన్ని అది లక్షణయా బోధిస్తుది. తనను శరణు పొందినవారికి ఎవరితో అయినా బలమైన శత్రుత్వం ఉన్నా, దానిని సులభంగా తీర్చి, వారిని రక్షించే గొప్ప ఉపకారం చేసే మహాగుణాన్ని కలవాడు- అనే భావం, **"అప్పొన్‌పెయరోన్ తడనెఞ్జమ్ కొణ్డ పిరానార్"** అని అన్నందున భాసిస్తుంది. **"అడిక్కీழ్"** అనేది ఉపచారం (**"పోయ్ త్తిడ నెఞ్జమాయ్"** అని అన్నందున) నా మనస్సు పోయేటపుడు నా విరహార్తిని చూచి దయను కల్గి ఉన్నది. అక్కడకు పోయిన తరువాత అతనివలెనే కాఠిన్యాన్ని పొందింది- అనే భావం స్ఫురిస్తుంది. **"తిరికిన్డదు"** -నేను తప్ప ఇంకొక సహాయకులు లేని వారిని ఒంటరిగా విడచి వచ్చామే!- అనే అనుతాపంతో ఒక చోట పడి ఉన్నదని చెప్పడానికి వీలులేకుండా, ఉల్లాసం వ్యక్తమయేటట్లు తాను యథేష్టంగా తిరుగుతున్నది- అని భావం.

**"ఇన్ఱు తాఱుమ్"** - ఈనాటివరకు - అని అర్థం. **"కాఱు"** అనే పదంవలె **"తాఱు"** అనేది కూడా పర్యంతవాచకం. **"తనైయుమ్ కాఱుమ్ తాఱుమ్ తుణైయుమ్... అళవిన్ పెయరెన్ఱు అఱైన్దనర్ పులవర్"** అని పింగళనిఘంటువచనం.

గడచిన పాశురంలో వరాహావతారంలో అభినివేశాన్ని పొందిన ఆழ்వార్లు ఈ పాశురంలో దానికి అనంతరం సంభవించిన నృసింహావతారంలో ఆసక్తులై, తమ మనస్సు వెనుకకు మరల్చడానికి వీలుకాని రీతిలో భగవానునిపట్ల అవగాహించిన రీతినిగూర్చి అనుగ్రహించారు.

### వియోగాన్ని సహించలేక బాధపడే నాయకి స్థితిని చూచి దాది చింతించడం

**47.** తిరిగిన్డదు వడమారుదమ్, తిజ్గళ్ వెన్దీ ముగన్దు
శొరిగిన్డదు అదువు మదు,- కణ్ణన్‌విణ్ణూర్ తొழுవే
శరిగిన్డదు శజ్గమ్ తణ్ణన్దుழாయ్‌క్కు, వణ్ణమ్బయలై
విరిగిన్డదు ముழு మెయ్యుమ్, ఎన్నాజ్గొలెన్ మెల్లియత్కే?

వడ మారుతమ్ = ఉత్తరదిశలోని వేడిగాలి, తిరికిన్ఱదు = వీస్తున్నది, తిజ్గళ్= (చల్లని స్వభావాన్ని కల్గిన) చంద్రమండలం, ముకన్దు శొరికిన్ఱదు= గ్రహించి వచ్చి వెదజల్లుతున్నది, అదువుమ్ అదు = పూర్వం తెల్పిన ఉత్తరపుగాలి ఆ విధంగానే అగ్నిని వీస్తున్నది, కణ్ణన్ = శ్రీకృష్ణుని, విణ్ ఊర్ = పరమపదమనే వాసస్థానాన్ని, తొழுవే = నిరంతరం సేవించి, అనుభవించాలని ఆశపడి, అది లభించనందున కల్గిన కార్శ్యంచేత, శజ్గమ్ = (నా కుమార్తె చేతిలో ఉండే) గాజులు, శరికిన్ఱతు = జారిపడిపోతున్నవి, తణ్ అమ్ తుழாయ్క్కు = అతని చల్లని అందమైన తులసి విషయంలో పెట్టుకొన్న ఆశచేత, (అది లభించనందున), ముழு శెయ్యుమ్ = శరీరం అంతట, వణ్ణమ్ పయలై విరికిన్ఱదు = సహజమైన పచ్చని రంగు మాఱిపోయి, పాలిపోయిన రంగు వ్యాపిస్తున్నది. (ఇక), ఎన్ మెల్లియళుక్కు = మార్దవస్వభావాన్ని కల నా కుమార్తెకు, ఎన్ ఆమ్ కొల్ = ఏమవుతుందో! అయ్యో!

**భావదీపిక :** విరహవేదనను సహించలేక బాధపడే నాయకి స్థితిని చూచి ఆమె కన్నతల్లి విలపిస్తూ పలికే పాశురం ఇది. మారుతం, చంద్రుడు- ఆనందాన్ని కల్గించేవి అయినా, విరహిణులకు దుఃఖాన్ని కల్గిస్తాయి కనుక, వాటికి సహించలేక గాజులు జారిపోయి, పాలిపోయిన రంగు వ్యాపించి, నాయకి బాధపడుతున్నది. ఆ దశలో కుమార్తెను చూచి తల్లి విలపిస్తూ పల్కుతున్నది.

**(తిరికిన్ఱదు వడమారుతమ్)-** ఒక మదగజం, తాను బాధించడానికి ఒక వ్యక్తిని అన్వేషిస్తూ తిరిగే రీతిలోనే, ఈ ఉత్తరపుగాలి ఈమెను బాధించడంలో ఉద్దేశ్యాన్ని కల్గినదై సంచరిస్తున్నది. **"తిరితల్"** అనేది వికారాన్ని పొందడానికి కూడా వాచకం కనుక, **'తిరికిన్ఱదు"** -వికారాన్ని పొందుతున్నది. (అంటే- తన స్వభావంలో మార్పును పొందుతున్నది. తనకు సహజమైన చల్లదనం మాఱి, వేడిమిని పొంది దహిస్తున్నది) అని కూడా వివరిస్తారు. **"వడమారుతమ్"**- అని అన్నందున సమయం శరత్కాలమనేది స్ఫురిస్తుంది. ఉత్తరదిక్కు వైపు పోయే గాలి **"వడమారుతమ్"** అని గ్రహిస్తే ఈ పదం దక్షిణదిక్కునుండి వీచే మలయ మారుతానికి **("తెన్ఱల్")** కూడా పేరు కావచ్చు.

**(తిజ్గళ్ వెన్దీ ముకన్దు శొరికిన్ఱదు)-** చంద్రుడు వేడి నిప్పును కుండతో ఎత్తుకొని వచ్చి జల్లుతున్నట్లు కురిపిస్తున్నాడు. లోకంలోని నిప్పుకంటే మిక్కిలి వేడిమిని కల్గినదొక కొత్త నిప్పు- అనే అర్థం స్ఫురించేటట్లు **"వెమ్తీ"** అని విశేషించి పలుకబడింది.

**(అదువు మదు)**- ఉత్తరపు గాలికూడా మిక్కిలి వేడిమిని కల్గిన అగ్నిని కురిపిస్తున్నదని భావం. **"వెన్దీ ముకన్దు శొరికిన్ఱదు"** అని తన నోటిని తెరచి పలుకడానికి జంకి, **"అదువు మదు"** అని తన కళ్ళను మూసికొని పల్కుతున్నది కాబోలు. ఇందువల్ల వడమారుతానికి కల కాఠిన్యం **"పడియున్ మేల్ వెమ్మైయై ప్పకరినుమ్ పకరునా ముడియ వేమ్"** (ఎడారి ప్రాంతంలోని వేడిమిని గూర్చి నోటితో పల్కితే కూడా ఆనోరుకూడా ఎండిపోతుంది) అని పలికే రీతిలో ఉన్నది- అని వ్యక్తమవుతున్నది.

**(కణ్ణన్ విణ్ణూర్ తొ*ఴు*వే శరికిన్ఱదు శజ్గమ్)**- భగవానుని పరమపదాన్ని అనుభవించాలని ఆశపడి, అది లభించనందున నాయకికి ఏర్పడిన కృశత్వంవల్ల ఆమె చేతిలో అలంకరించుకొన్న గాజులు జారిపోతున్నవి. సహజసౌందర్యం, **("ఇయఱ్కైయ*ఴ*కు")** ఆభరణావల్ల కల్గిన అందం- **"శెయఱ్కై య*ఴ*కు"** (కృతకసౌందర్యం) అనే రెండు విధాలైన అందాలలో లోపించిన విషయం దీనివల్ల సూచింపబడింది. సహజసౌందర్యం పోయిన విషయం **"కణ్ణన్ తు*ఴా*య్క్కు వణ్ణమ్ పయలై విరికిన్ఱదు ము*ఴు* మెయ్యుమ్"** అని అన్నందున చెప్పబడింది.

**(తు*ఴా*య్క్కు)**- తులసిని ఆశపడి, అది లభించని కారణం చేత -అని దీని భావం. ఉత్తరపు గాలివల్ల, చంద్రునివల్ల కల్గిన తాపం తీరడంకోసం అతని తులసిని కోరిన విషయం తోచేటట్లు ఇక్కడ **"తణ్ణన్తు*ఴా*య్"** అని అనబడింది. ఇన్ని దుఃఖాలను సహించలేని అత్యంత సౌకుమార్యాన్ని కల్గినది ఈమె- అనేది తోచేటట్లు **"మెల్లియల్"** అనే పదం ప్రయోగింపబడింది.

**"మారుతమ్, శజ్గమ్"**- ఇవి సంస్కృతపదాలు.**"వర్ణ"** మనే సంస్కృతపదం **"వణ్ణమ్"** అనే కృతిని పొందింది. **"మెల్లియల్"**- ఇది విశేషణ పూర్వపదకర్మ ధారయ గర్భమైన బహువ్రీహి. **"పణ్బుత్తొకైయన్మొ*ఴి*"** మృదుస్వభావాన్ని కల్గినది- అని అర్థం.

ఈ పాశురానికి స్వాపదేశం ఏమంటే- భగవానుని దరి చేరలేక బాధపడే దశలో ఆ*ళ్వా*ర్లను ఈ లోకంలోని పలు పదార్థాల బాధించే స్వభావాన్ని చూచి జ్ఞానులు బాధపడుతూ పలికే సూక్తి.

**(తిరికిన్ఱదు వడమారుతమ్ తిజ్గళ్ వెన్దీ ముకన్దు శొరికిన్ఱదు అదువుమ్ అదు)** - ఈ లోకంలోని భోగ్యపదార్థాలు అన్నీ భగవానుని భోగ్యత జ్ఞాపకం చేస్తున్నందున, అతనిని విశ్లేషించిన ఈ దశలో దుఃఖాన్ని కల్గిస్తున్నవి- అని భావం.

(కణ్ణన్‌విణ్ణూర్ తొ*ళ్ళు*వే శరిక్కిదు శజ్గమ్)- సర్వసులభుడైన భగవానుని పరమపదంపట్ల అభినివేశం కల్గినందున వీరి పారతంత్ర్యం తొలగిపోతున్నది- అని భావం.

(తణ్ణమ్ తు*ళ్ళా*య్‌క్కు వణ్ణమ్ పయలై విరిక్కిన్దదు ము*ళ్ళు* మెయ్యమ్)- ఆ భగవానుని భోగ్యతలో కల్గిన అభినివేశం వల్ల వీరి స్వరూపం కూడా మార్పును పొందే పర్యంతంలో వీరికి ఆర్తి అధికమైనదని భావం.

(ఎన్ మెల్లియళుక్కు ఎన్ ఆమ్‌కొల్ !) - మాకు స్వామి అయిన ఈ ఆ*ళ్వా*ర్లకు కల్గిన ఈ ఆర్తి ఏవిధంగా పరిణమిస్తుందో కదా!

## నాయకుని రాకను సూచించే శుభశకునాలను చూచినందున తాను విశ్లేషదుఃఖాన్ని సహిస్తున్నట్లు నాయకి సఖితో పల్కడం

**48. మెల్లియలాక్కైక్కిరుమి, కురువిల్ మిళిర్ తన్దాజ్గే**
**శెల్లియ శెల్‌గైత్తు ఉలగై యెన్ కాణుమ్?,- ఎన్నాలుమ్‌తన్నై**
**చ్చొల్లియ శూ*ళ్ళ*ల్ తిరుమాలవన్ కవియాదు క*ర్*గ్రేన్**
**పల్లియిన్ శొల్లుమ్ శొల్లా, కొళ్‌వదో వుణ్డు పణ్డు పణ్డే**

మెల్ ఇయల్ = సుకుమారమైన స్వభావాన్ని కల్గిన, ఆక్కై = మేనిని కల, కిరుమి = కృమి (పురుగు), కురువిల్ = వ్రణంలోనుండి, మిళిర్ తన్దు = బయటకు వచ్చి, ఆజ్గే = అక్కడే, శెల్లియ = సంచరించే రీతిలోని, శెల్‌కైత్తు = స్వభావాన్ని కల్గినది (అది), ఉలకై ఎన్ కాణుమ్ = లోకనడతను (మర్యాదను) ఏవిధంగా తెలియగలదు? (తెలియలేదు. అదే రీతిలో), ఎన్నాలుమ్ = నాచేకూడా, తన్నై శొల్లియ = తనను పాడించుకొన్న, శూ*ళ్ళ*ల్ = ఉపాయాన్ని కల, తిరు మాలవన్= శ్రియఃపతి అయిన, ఆ సర్వేశ్వరుని, కవి = పొగడ్తరూపంలోని కవిత, యాదు క*ర్*గ్రేన్ = (నేను) ఏది అని తెలియగలను?, పల్లియిన్ శొల్లుమ్ = బల్లి పలుకును కూడా, శొల్ ఆ కొళ్‌వదో = (తరువాత జరుగబోయేదానిని ముందుగా సూచించే) పలుకుగా గ్రహించడమనేది, పణ్డు పణ్డే ఉణ్డు = చాలా పూర్వకాలంనుండి ఉన్నది.

భావదీపిక : నాయకి మంచి శకునాన్ని చూచి తాను విరహార్తిని సహించగల్గిన శక్తిని పొందడం గూర్చి చెలికత్తెతో పలికే పాశురం, ఇది. నాయకుడు విడచిపోయిన కాలంలో అతని విశ్లేషాన్ని సహించలేక క్లేశపడే నాయకి, తన సమీపంలో బల్లి

నాయకుని రాకను సూచిస్తూ మంచి చోట శబ్దించడం గమనించి, ఆ శుభశకునం వల్ల నాయకుడు త్వరలో వస్తాడు- అని నిశ్చయించుకొని కొంత ఊరటను పొందగా, పూర్వం ఆమె దుఃఖాన్ని చూచి తానుకూడా బాధపడే సఖి ఇపుడీమె కొంత తేఱుకొని ఉండడం చూచి, "తటాలున నీవు ఈవిధంగా ఆశ్వాసాన్ని పొందడానికి ఏదయినా కారణం ఉన్నదా? నాయకుడు నీతో కలసి ఉన్నపుడు నిన్ను దగ్గరకు తీసికొని ఆలింగనం చేసికొని, 'నిన్ను విడచిపోను, విడిచివెళ్ళవలసివస్తే నేను భరించలేను. త్వరలో తిరిగివస్తాను'- అని పలికే మాటలను స్మరించి నీవు ఊరటను పొందావా? లేక, ఇంకేదైనా కారణం ఉన్నదా?'' -అని ప్రశ్నించగా, దానికి నాయకి తాను తేరుకోవడానికి గల కారణాన్ని తెలిపే రీతిలో ఈ పాశురం ఉన్నది.

**"కొట్టాయ్ పల్లిక్కుట్టీ! కుడమాడి యులకళన్ద మట్టార్ పూఙ్కుழల్ మాదవనై వరక్కొట్టాయ్ పల్లిక్కుట్టీ!"** (ఓ బల్లీ! శబ్దించు. కుంభ నృత్యాన్ని చేసి, లోకాలను కొలచినవాడు, మకరందం జాలువారే పూలతో అలంకరింప బడిన క్లేశపాశాన్ని కలవాడైన మాధవుని రాతను సూచిస్తూ శబ్దం చేయి.) అనే తిరుమంగై ఆழ్వార్ పాశురంలో నాయకి, నాయకుని రాకను గూర్చి తెలుపమనే రీతిలో బల్లిని కోరినట్లు పాడినందున, కలిత్తొకై అనేద్రావిడ గ్రంథంలో **"ఇనైనలముడైయ కాణక్షైన్డోర్, పునైనలమ్ వాట్టు నరల్లర్మనై వయిల్, పల్లియుమ్ పాఙ్గొత్తిశైన్దన, నల్లైழిలుణ్ కణుమాడు మాలిడమే"** (పాలైక్కవి-10) అనే నిమిత్తాన్ని పల్కి నాయకి సఖిని ఊరడించినందున బల్లి పలుకును శుభశకునంగా గ్రహించడం అనేది అనాదిగా వస్తున్న చాలా ప్రాచీనమైన సంప్రదాయం కనుక, "మన ఇంటిలో బల్లి మంచిచోట అతని రాకకు తగినట్లు శబ్దించడం చూచి, ఆ మంచి శకునంవల్లనే నేను ఊరటను పొందాను''- అని నాయకి అంటున్నది.

నాయకుడు కలసి ఉండే కాలంలో "నిన్ను విడచిపోను, విశ్లేషిస్తే సహించలేను'' అని పలికిన మాటలను తలచి నీవు ఆశ్వాసాన్ని పొందావా?'' అని సఖి అడిగిన ప్రశ్నకు సమాధానంగా పూర్వార్ధం ఉన్నది. వ్రణంలో పుట్టిన కృమి తాను పుట్టిన చోటైన ఆ పుండును తప్ప వేఱొకటిని తెలియని రీతిలోనే, అంతరంగమైన అతని ప్రేమలో చిక్కుకొన్న నేను అతనినే భావించి ఉన్నాను తప్ప, బాహ్యమైన మాటలను, కార్యాలను భావించనేరదు. అందువల్ల, వాటిని తలచి ఆశ్వాసాన్ని పొందినదానను కాను- అని తాత్పర్యం. అయినా, బల్లి పల్కిన మాటను (శబ్దాన్ని) విని తేరు కొన్నాను- అని ఉత్తరార్ధంలో తెలుపబడింది.

క్రిమి అనేది తాకితే చాలు సహించలేని చాలా సుకుమారమైన శరీరాన్ని కల్గినది కనుక, **"మెల్లియలాక్కై క్కిరుమి"** అని అనబడింది. **"కురు"** అనేదానికి పుండు (వ్రణం) అనే అర్థం ఉన్నదనే విషయాన్ని **"వేర్క్కురు"** అనే వ్యవహారాన్ని బట్టి తెలియవచ్చు. పురుషోత్తముడైన నాయకుని విషయంలో అభినివేశాన్ని పొందిన తనకు, పుండులో వ్యక్తమైన క్రిమిని ఉపమానంగా పల్కడం- ఆ వ్రణాన్ని తప్ప వేఱొక దానిని తెలియకపోవడమనే సాధర్మ్యాన్నిబట్టి. **"వేమ్బిన్ పు*ழு* వేమ్బన్ఱి యుణ్ణాదు అడియేన్ నాన్ పిన్నుమ్ ఉన్ శేవడియన్ఱి నయవేన్"** అనే తిరుమంగై ఆ*ழ*్వార్ల పాశురాన్ని గమనించాలి. ఇందువల్ల ఇది హీనోపమ అనే దోషంలోకి పర్యవసించదని తెలియాలి.

**"ఎన్నాలుమ్"** అనేచోట **"ఉమ్మై"** (చివరలో గల **"ఉమ్"** అనే పదప్రయోగం) అతిశయసూచకం. ఎందుకంటే- **"కాము*ఱ్ఱ* పెణ్ణుక్కు అణికలమ్ నాణుడైమై"** (ప్రేమించిన స్త్రీకి బిడియం ఒక ఆభరణం) అనే రీతిలో **'నాణ్"** (లజ్జ)ను ముఖ్యగుణంగా గ్రహించే (తలచే) స్వభావం కల నాచే కూడా- అనే అర్థాన్ని ఇస్తున్నందున లజ్జనే సంపదగా తలచిన నేను ఆ సిగ్గును వీడి, నా వశంలో లేక పారవశ్యాన్ని పొంది, అతని విషయంలోనే ఇష్టం వచ్చినట్లుగా నోరు తెరచి కలవరించే రీతిలో నాకు మోహాన్ని కల్గించినవాడు- అనే భావం స్ఫురించేటట్లు **"ఎన్నాలుమ్ తన్నై చ్చొల్లియ శూ*ழ*ల్ తిరుమాలవన్"** అని పలుకబడింది. ఇక్కడ **"తిరుమాల్"** అనే ప్రయోగం వేఱొక స్త్రీపట్ల అభిలాషను కల్గినవాడనే అర్థాన్ని సూచించడంకోసం. పూర్వం **'కాణ్కిన్ఱనకళుమ్"** అనే ఎనిమిదవ పాశురంలో **"పాణ్"** అనే దానివలెనే ఇక్కడ **"కవి"** అనేది- వాస్తవంగా కాకుండా బుద్ధిచాతుర్యంతో కన్పించి పలికే పలుకులను తెల్పుతుంది.

**(ఎన్నాలుమ్ తన్నై చ్చొల్లియ శూ*ழ*ల్ తిరుమాలవన్ కవియాదు క*ఱ్ఱే*న్)**- మృదుస్వభావాన్ని కల నన్ను ఈ విధంగా పలు మాటలు పలవరించేటట్లుగా కామవేదనను కల్గించినవాడు, వేఱొకతె (లక్ష్మీదేవి) పట్ల మనోరథాన్ని మిక్కిలి కలవాడైన నాయకుడు పూర్వం నాతో పల్కిన ప్రేమ వచనాలను నిజమని తలచి ఆదరించడానికి గాని, అసత్యమని భావించి గర్హించడానికి గాని నేను అటువంటి గొప్పతనాన్ని కల్గినదానను కాను- అని భావం. **"పల్లియిన్ శొల్లుమ్"**- అనేచోట గల **"ఉమ్"** అనే పదం నైచ్యాతిశయ సూచకం- వివేకజ్ఞానం లేని జంతువైన బల్లిమాటలను కూడా- అనే అర్థాన్ని ఇది ఇస్తుంది కనుక.

భగవానుని దరిచేరడానికి ఆలస్యమైనందున విరహార్తి అతిశయించిన ఆళ్వార్లను చూచి వారి భక్తులు "మీరు ఈ విధంగా పరమపదానుభవంకోసం త్వరపడవచ్చునా? మిమ్ములను పురస్కరించుకొని లోకాన్ని సంస్కరించడం కోసం, పాశురాలను పాడించడంకోసం కదా భగవానుడు మిమ్ములను ఈలోకంలో నిలిపి ఉంచాడు?"- అని పల్కి, ఊరడించడానికి ఆరంభించగా, వారిని చూచి ఆళ్వార్లు తమ నైచ్యం మొదలైనవానిని ప్రస్తావిస్తూ ఈ పాశురంలో పల్కుతున్నారు.

**(మెల్లియలాక్కై క్కిరుమి కురువిల్ మిశిర్న్దదు ఆజ్జే శెల్లియ శెల్కైత్తు ఉలకై ఎన్ కాణుమ్)**- అల్పమైన జ్ఞానశక్త్యాదులను కల నేను లోకాన్ని తెలిసికొని సంస్కరించడం ఏమి? దీనికి నేను అశక్తుడను- అని భావం. తమ నైచ్యాన్ని వ్యక్తం చేయడంకోసం కృమిని ఉపమానంగా గ్రహించారు. "ఆళ్వార్లూ! మీరా ఈవిధంగా పల్కుతున్నారు! భగవానుడు మిమ్ములను పురస్కరించుకొని పాశురాలను పాడించాలని భావిస్తున్నాడే!" అని అనగా **"ఎన్నాలుమ్ తన్నై చ్చొల్లియ శూళ్ల్ తిరుమాలవన్ కవియాదు కఱ్ఱేన్"** అని అంటున్నారు. చాలా నిహీన జాతిలో పుట్టినవాడనైన, జ్ఞానవృత్తాలలో తక్కువవాడనైన నన్ను పురస్కరించుకొని తననుగూర్చి కవిత చెప్పించుకొన్న ఉపాయాన్ని కల శ్రియఃపతి కవిత అది తప్ప, నేనేమి తెలియగలను? ఇందులో నాకేమీ అన్వయం లేదు -అని భావం. నేను ఏమి పలికానో, అది శ్రియఃపతికవితయే- అని కూడా భావం. ఇందువల్ల వీరు వాక్కును పురస్కరించుకొని భగవానుడే స్వయంగా కవితను పాడించాడు- అని స్పష్టమవుతున్నది. ఉన్నతులందరిలో మిక్కిలి ఉన్నతుడైన తనను గూర్చి, నీచులందరిలో మిక్కిలి నీచుడనైన నన్నుగొని కవితను పల్కించిన ఉపాయం ఎంతటిది?- అని భగవానుని అద్భుతశక్తిని చూచి ఆశ్చర్యపడడం **"ఎన్నాలుమ్ తన్నై చ్చొల్లియ శూళ్ల్"** అనే సూక్తివల్ల స్పష్టమవుతుంది. తన ఉన్నతస్థితిని గూర్చి తానే కవిత్వం చెబితే అందులో గొప్ప లేదు- అని తలచి, ఆ స్థితిని యథాతథంగా తెలిసి కవిత్వాన్ని పలుక గల్గినవారు లోకంలో ఎవరూ లేనందున, నన్ను ఒక వ్యాజంగా చేసికొని, నన్ను పురస్కరించుకొని తనను తానే కీర్తించుకొని కవిత్వాన్ని చెప్పించుకొన్న ఉపాయం- అనేది **"శూళ్ల్"** అనే పదంలోని అంతరార్థం.

వాదికేసరి అళ్గియమణవాళ జీయర్ ఈ దివ్యప్రబంధానికి రచించిన ఉఱై అవతారికలో **"ఈశ్వరన్ తానే లోకత్తై తిరుత్తుక్కైక్కు ఇవర్ ఆవర్- ఎన్ఱు అంగీకరిత్తు, "ఎన్నాలుమ్ తన్నై చ్చొల్లియ శూళ్ల్ తిరుమాలవన్ కవియాదు**

కఱ్ఱేన్" ఎన్టుమ్బుడి ఇవర్ తిరువుళ్ళత్తిలుమ్, నాక్కిలుమ్ నిన్టు, ఇవన్ తమ్మై క్కొణ్డు తానే ప్రవర్తిప్పిక్కైయాలుమ్ అత్యంత వ్యావృత్తరాయిరుప్పా-రొరువర్" అని పల్కిన సూక్తి ఇక్కడ అనుసంధేయం.

**(తిరుమాలవన్‌కవి)-** పిరాట్టి, భగవానుడు కలసి ఉండే సన్నివేశం ఏవిధంగా గొప్పగా అమరి ఉన్నదో, అదే రీతిలో కవిత్వం కూడా గొప్పగా అమరింది- అని భావం. అతడు ముందుగా కవితలోని పదాలను ఉచ్చరించగా, నేను దానిని అనుసరించి ఆ పదాలను తిరిగి పలికాను, అంతే. నేను నా జ్ఞానంతో తెలిసి కవిత్వాన్ని చెప్పలేదు- అనే భావం స్ఫురించేటట్లు **"యాదు కఱ్ఱేన్"** (దానిని అభ్యసించాను) అని అన్నారు. నేను నా వశాన్ని కోల్పోయి, భక్తి పారవశ్యాన్ని పొంది, నోటికి వచ్చినట్లు పాడడం, అంతమాత్రమే తప్ప, వేఱేమీ లేదు- అనే భావం ఇక్కడ స్ఫురిస్తుంది.

అయితే, ''మీరు పాడిన కవిత'' అని లోకంలోనివారు, భగవానుడు పల్కుతున్నారే!- అని అంటే- **(పల్లిన్ శొల్లుమ్ శొల్లా క్కొళ్వదో వుణ్డు పణ్డు పణ్డే)-** అల్పప్రాణి అయిన బల్లి తనకు తానే చేసే శబ్దాన్ని తమ తమ గొప్ప కార్యాలను సూచిస్తున్నదని శకునశాస్త్రజ్ఞులు పలికే పద్ధతి అనాదికాలంగా ఉన్నది కదా! ఆ రీతిలోనే, నేను పరతంత్రంగా పల్కినదంతా, నా నైచ్యాన్ని చూడకుండా, అందఱు అంగీకరించి, అర్థాన్ని ప్రశంసిస్తున్నారు- అని తమ వినయం స్ఫురించేటట్లు పల్కుతున్నారు.

**"యాక్కై"** అనే పదం **"ఆక్కై"** అని అయినది. ఇదివేఱే ప్రత్యేక పదమని కూడా కొందఱు అంటారు. సృష్టింపబడినదని అర్థం. **"కిరుమి"** -**"కృమి"** లేక, **"క్రిమి"** అనే సంస్కృతపదంయొక్క వికృతి. **"కిరిమి"** అని కూడా రూపం ఉన్నది. **"పణ్డు పణ్డే"** అనేచోట ఆమ్రేడనం ఆధిక్యాన్ని సూచిస్తుంది. చాలా ప్రాచీనకాలంగా- అని భావం.

### చీకటిని సహించలేని నాయకి, సఖితో పల్కడం

**49.** పణ్డుమ్ పలపల వీఙ్గిరుళ్ కాణ్డుమ్, ఇప్పాయిరుళ్‌పోల్
కణ్డు మఱివదుమ్ కేట్పదుమ్ యామిలమ్,- కాళవణ్ణ
వణ్డుణ్ తుழாయ్‌ప్పెరుమాన్ మదుశూదనన్ తామోదరన్
ఉణ్డు ముమిழ்న్దమ్ కడాయ, మణ్ణేరన్న వొణ్ణుదలే

కాళ వణ్ణమ్ = నల్లని వర్ణాన్ని, వణ్డు ఉణ్ తుళాయ్ = తుమ్మెదలు తేనెను భుజించే తులసీమాలికను కల, పెరుమాన్ = సర్వేశ్వరుడు, మదుశూదన్ తామోదరన్ =మధుసూదనుడని, దామోదరుడనే తిరునామాలను కల శ్రియః పతి, ఉణ్డుమ్ = ప్రళయకాలంలో ఉదరంలో పెట్టుకొని, ఉమిళ్న్దుమ్ = (ప్రళయం ముగిసినపుడు) వెలువరించి, కడాయ = రక్షింపబడిన, మణ్ =భూమియొక్క, ఏర్ =అందాన్ని, అన్న= పోలిన, ఒళ్ నుదలే = కాంతిని కల ఫాలాన్ని కల్గినదానా!, పణ్డుమ్ = పూర్వంకూడా, పల పల = మిక్కిలి అనేకమైన, వీజ్గు ఇరుళ్ = గొప్ప చీకటి సమయాలను, కాణ్డుమ్ = చూచాము, ఇ పాయ్ ఇరుళ్ పోల్ = ఈ వ్యాపించిన చీకటి ప్రొద్దువలె, కణ్డుమ్ అఱివదుమ్ కేట్పదుమ్ = (వేఱొక వస్తువును) చూచి, తెలిసి, విని, యామ్ ఇలమ్ = మేము లేము.

**భావదీపిక :** చీకటి సమయానికి సహించలేని నాయకి, ఆ చీకటి కాఠిన్యాన్ని (బాధించే స్వభావాన్ని) గూర్చి సఖితో పలికే పాశురం ఇది. "మా జీవితంలో ఇంతవరకు మేము ప్రతిదినం చీకటి పొద్దులను చూస్తూనే ఉన్నాము వాటికి అంతటికి ఒక అవధి ఉన్నది. క్లేశాన్ని కల్గించే స్వభావం వాటికి లేదు. ఈ విధంగా అంతు లేకుండా దీర్ఘంగా కొనసాగేది, బాధను వృద్ధి చేసేది అయిన ఈ కాళరాత్రిని ఎక్కడా ఎప్పుడూ చూచి, విని ఎఱుగము"- అని బాధపడుతూ నాయకి పల్కుతున్నది.

చీకటి కాఠిన్యాన్నిగూర్చి పలికే ఈ పాశురంలో భగవానునకు **"కాళవణ్ణమ్"** అనే విశేషణాన్ని ప్రయోగించడం- ఈ చీకటి ప్రొద్దు భగవానుని చీకటిరంగులోని నల్లని దేహాన్ని కల భగవానుని దర్శింపజేసి బాధిస్తున్నది- అనే భావాన్ని వ్యక్తం చేస్తున్నదని చెప్పవచ్చు. లేక, **'కాలవణ్ణమ్"** అనే దానిని భగవానునకు విశేషణం చేయకుండా, తుమ్మెదలకు విశేషణంగా చేయవచ్చు.

ఉత్తరార్ధం సఖీసంబోధన. తులసీమాలికను అలంకరించుకొని, అందఱికి నాయకుడై వెలిగేవాడు, తన దాసుల శత్రువులను సంహరించేవాడు, అభిమానించే వారికి తాము బంధించేటట్లుగా సులభుడైన భగవానుడు ప్రళయంలో ఆరగించి, తరువాత బయటపఱచి రక్షించిన చాలా పెద్దదైన భూలోకం అంతటికి వెలకు సాటి వచ్చే విశాలమైన, అందమైన ఫాలభాగాన్ని కల్గినదానా!- అని సఖి ఇక్కడ సంబోధింపబడింది.

పరాంకుశ నాయకి తన సఖిని సంబోధించి ఈ పాశురాన్ని పల్కుతున్నట్లు చెప్పడంలో ఒక కొఱత ఉన్నది. ఆచార్యహృదయంలోని రెండవ ప్రకరణంలో **"ఇత్తిరుమణ్ణేరన్న వొణ్ణుదల్ పిన్నైకొల్ ఎన్గిఱ వొప్పు"** ఇత్యాది చూర్ణికలో **"మణ్ణేరన్న వొణ్ణుదలే!"** అనే ఈ సంబోధనను ఆళ్వార్ల విషయంలో ఉద్దేశించినట్లుగా స్ఫురించినందున, ప్రకృతంలో చేయబడిన అన్వయం ఈ ఆచార్యహృదయసూక్తికి పొసగదు. పొసగేటట్లు వ్యాఖ్యానించవలసినందున, ఈ పాశురం సఖి నాయకిని చూచి పల్కుతున్నది- అని చెప్పడం తగినది. "సంశ్లేషించి తరువాత వియోగాన్ని పొంది, ఆ విశ్లేషాన్ని సహించలేని నాయకి రాత్రి వ్యసనంతో తాను బాధపడే రీతిని తానే పల్కుతున్నది. లేక, సఖీవచనం కావచ్చు'' **"కలన్దు పిరివాఱ్ఱాద తలైమకళ్ రాత్రివ్యసనత్తాలే తాన్ నోవుపడుకిఱ పడియై త్తానే శొల్లుకిఱాళాదల్; తోழிవార్త్తై యాదల్"** (సంశ్లేషించి విశ్లేషాన్ని పొంది, ఆ విశ్లేషాన్ని సహించలేని నాయకి రాత్రివేళ కల్గిన వ్యసనంతో తానుపడే బాధను గూర్చి తానే పల్కుతున్నది- అనిగాని, ఆమె బాధను సఖి పల్కుతున్నదని గాని చెప్పవచ్చు) అనే నమ్బిళ్ళై ఈడువ్యాఖ్యలోని ఈ పాశురావతారికలో గల సూక్తి అనుసంధేయం. **"మణ్ణేరన్న వొణ్ణుదలే!"**- భూదేవివలె భగవానునకు ప్రియమహిషియై ఉండే ఓ పరాంకుశ నాయకీ! అని తాత్పర్యం.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే- భగవానుడు పలు రీతులలో రక్షించిన లీలావిభూతిని ఒక విధంగా సాటి చెప్పదగిన జ్ఞానప్రకాశాన్ని ముఖంలో వెలిగే ఓ ఆళ్వార్లూ! అని భావం. లేక, ఊర్ధ్వపుండ్రరూపమైన తిరుమణ్‌కాప్పును తగినట్లు ధరించిన ఫాలభాగాన్ని కల ఆళ్వార్లూ! దీనికి ముందు పలు పలు వ్యామోహపరంపరలను మీవద్ద దర్శించాము. ఇపుడు చాలా మిక్కిలిగా ఉండే ఈ వ్యామోహంవంటి వ్యామోహాన్ని ఎపుడూ దర్శించి విని ఎఱుగము- అని భాగవతులు ఆళ్వార్ల భగవద్విషయకమైన వ్యామోహాతిశయాన్ని సాశ్చర్యంగా పల్కడం (ఇందులోని స్వాపదేశం).

రెండవ పాదం ఆరంభంలో **"కణ్డుమ్"** అనే ప్రయోగంలోని **"ఉమ్"** - **"అశైనిలై"**. **"కణ్డఱిదుమ్, కేట్టఱిదుమ్"** అని ప్రత్యేకంగా అన్వయించాలి. **"కణ్డుమిల్లోమ్, అఱివదుమిల్లోమ్, కేట్పదుమిల్లోమ్"** - చూచిన వారంకాము, తెలిసినవారం కాము, విన్నవారంకాము) అని కూడా వివరిస్తారు.

## నాయకుడు తిరిగి వస్తూ సారథితో పల్కడం

50. ఒణ్ణుదల్ మామై ఒళి పయవామై, విరైన్దు నన్దేర్
నణ్ణుదల్ వేణ్ణుమ్ వలవ! కడాకిన్దు,- తేన్ నవిన్ఱ
విణ్ ముదల్నాయగన్ నీణ్ ముడివెణ్ ముత్త వాశిగైత్తాయ్
మణ్ముదల్ శేర్వుఱ్ఱు, అరువి శెయ్యానిఱ్కుమ్ మామలైక్కే

వలవ = ఓ రథసారథీ!, ఒళ్ నుదల్ = అందమైన ఫాలభాగాన్ని కల నాయకి యొక్క, మామై ఒళి =మేనివర్ణంలోని కాంతి (లావణ్యం), పయవామై = పాలి పోయిన రంగును పొందకుండా ఉండేటట్లు (దానికి ముందుగానే), నమ్ తేర్ = మన రథం, విరైన్దు నణ్ణుదల్ వేణ్డుమ్ = త్వరగా వచ్చి చేరాలి (ఏ చోటుకు? అని అంటే), తేన్ నవిన్ఱ = తుమ్మెదలు గానం చేసే, విణ్ ముదల్ నాయకన్ నీళ్ ముడి = పరమపదనాథుడైన స్వామియొక్క దీర్ఘమైన కిరీటంలో ధరించిన, వెళ్ ముత్తమ్ వాశికైత్తు ఆయ్ = తెల్లని రంగును కల ముత్యాల మాల స్వభావాన్ని కల్గినదై, మణ్ ముదల్ శేర్వుఱ్ఱు =(శిరస్సునుండి) పాద ప్రదేశంలో చేరే రీతిలోని, అరువి=నీటిప్రవాహాన్ని, శెయ్యానిఱ్కుమ్ = ప్రవహింపచేస్తూ ఉండే, మా మలైక్కు= పెద్ద పర్వతానికి, ఇన్దు కడాక = ఇపుడు రథాన్ని నడపాలి (చేర్చాలి.)

**భావదీపిక :** నాయకుడు నాయకి ఉండే చోటును చూచి, తిరిగి వచ్చేటపుడు రథసారథితో పలికే పాశురం, ఇది. ధనసంపాదనార్థం నాయకిని విశ్లేషించి పోయిన నాయకుడు కార్యాన్ని పూర్తిచేసికొని, రథంలో తిరిగి వస్తున్నాడు. వచ్చేటపుడు తాను నిర్దేశించి పల్కిన కాలం దాటి వస్తున్న సంగతిని తలచి, నాయకి చాలా క్లేశపడుతూ ఉంటుందని భావించి, రథసారథిని చూచి, త్వరగా రథాన్ని నడపు- అని ఆజ్ఞాపిస్తున్నాడు, ఈ పాశురంలో.

తనను విడచి, నందిగ్రామంలో క్లేశపడుతూ భరతాళ్వాన్ పడే ఆర్తిని భావించి శ్రీరామచంద్రుడు పద్నాలుగు సంవత్సరాలకాలం పోయిన దూరాన్ని కొద్ది సమయంలో దాటి తిరిగి వచ్చినట్లే, నాయకిని చిరకాలం విశ్లేషించిన నాయకుడు తాను తాను తిరిగి వస్తానని పూర్వం నిర్దేశించి పోయిన కాలం సమీపించిన సమయంలో, నాయకి ఆర్తిని తలచి, చిరకాలం తాను పోయిన దారిని కొంచెం సమయంలోనే దాటి తిరిగి రావాలని భావించి సారథిని చూచి, "వేగంగా తేరును నడపు" అని అంటున్నారు.

"వలవ! ఒణ్ణుదల్ మామై ఒళి పయవామై మామలైక్కు నమ్ శేర్ విరైన్దు నణ్ణుదల్ వేణ్డుమ్. (ఆకైయాలే) విరైన్దు కడాక" అని అన్వయించాలి. "నాయకి యొక్క మేనివర్ణంలోని కాంతి (లావణ్యం) వికారాన్ని (మార్పును) పొందడానికి ముందుగానే తిరుమలకు చేరాలి కనుక, తేరును వేగంగా నడుపు''- అని పల్కినందున నాయకియొక్క మేనిలోని అందం మాటిపోతే తాను సహించలేనని, పాలిపోయిన రంగు మేనిలో వ్యాపిస్తే అది తనవల్ల కూడా తిరిగి పోగొట్టడానికి సాధ్యం కాదని తోస్తుంది.

**(విరైన్దు నమ్ తేర్ నణ్ణుదల్ వేణ్డుమ్)**- వేగంగా పోయి చేరకపోతే ఆర్తి అతిశయించి ఆమె మరణిస్తుంది. కనుక, మనకు అపనింద కల్గుతుంది. దానికి ముందే వెళ్ళి చేరాలి- అని భావం.

**(వలవ కడాక ఇన్దు)** - **"వలవన్"** -**"వల్లవన్"**- సారథి. తేరును నడపడంలో సమర్థుడైనవాడా! ముందువలె కాకుండా ఇపుడు నీ కౌశల్యం అంతటిని ఉపయోగించి త్వరగా నడపాలి- అని భావం.

**"వలవ"**- అనేది సమీపసంబోధన. **"కడాక"** - నడవు అని అర్థం. **"కడాక+ ఇన్దు"** - **"కడాకనిన్దు"**- అనే రూపాన్ని పొందాలి. కాని ఆవిధంగా కానందున ఇక్కడ **"తొకుత్తల్ వికారమ్"** వచ్చింది. లేక, **"కడాకిన్దు"** అనే దానిని **"కడావుక" (కడవు)** అనే అర్థాన్ని చెప్పే ప్రయోగం గ్రహిస్తే ఇది **"వినైత్తిరిచ్చొల్"**, **"కడాకిన్దు నణ్ణుదల్ వేణ్డుమ్"** అని అన్వయించి, తేరును నడుపుతూ. సమీపించాలి- అని వివరించారు. కొందఱు అపుడు **"కడాకిన్దు"** అనేది వర్తమానకాలిక కృదంతం. **"నికழ் కాలవినైయెచ్చమ్"**.

ఉత్తరదిక్కులోని తిరువేఙ్గడమలై వైపు రథాన్ని నడపాలి- అని ఉత్తరార్థం తెల్పుతున్నది. ఇందువల్ల పరాంకుశ నాయకి తిరుమలైలో అవగాహించి, బాధపడడం స్ఫురిస్తుంది. పూర్వం **"కాణ్గిన్టనకళుమ్"** అనే ఎనిమిదవ పాశురంలో **"ఇదెల్లామ్ అటిన్దోమ్ మాణ్ కున్దమేన్ది తణ్మామలై వేఙ్గడత్తుమ్బర్ నమ్బుమ్ శేణ్ కున్దమ్ శెన్దు పొరుళ్ పడైప్పాన్ కழ్ఱ తిణ్ణనవే"** అని అంటూ ధనసంచయార్థం విశ్లేషించి, వేంకటగిరికి వెళ్ళాలని నాయకుడు తలచినట్లు చెప్పబడింది. ఇందులో, ధనసంపాదన కోసం విశ్లేషించిన నాయకుడు కార్యం పూర్తి అయిన తరువాత, వేంకటాచలానికి తిరిగి వస్తున్నట్లు చెప్పబడింది. ఇవి ఒకదానితో ఇంకొటి

విరుద్ధాలు కావు. ఇక, అழ்கియమణవాళ జీయర్ ఉరైలో "ఇవ్విడత్తిల్ "మామలైక్కే" ఎన్గిఅవిడమ్ ఆழ்వార్క్కు అణిత్తాన త్తెఱ్కు త్తిరుమలై యాకవుమామ్" (ఇక్కడ "మామలైక్కే" అనేచోట ఆழ்వార్లకు సమీపంలో ఉండే దక్షిణంలో గల తిరుమలై- వనగిరి) అనే సూక్తి గమనించదగినది. దీనివల్ల ఇక్కడ తిరుమాలిరుఞ్జోలై చెప్పబడింది.

**(తేన్ నవిన్ఱ విణ్ముదల్ నాయకన్ నీణ్ ముడి)-** **"తేన్ నవిన్ఱ ముడి"** అని అన్వయించాలి. భగవానుని కేశపాశం సహజంగా దివ్యపరిమళాన్ని కల్గినదైనందున **"శెణ్బక మల్లికైయోడు శెఙ్గழுనీర్ ఇరువాట్చి"** మొదలైన మంచి పూలను ఎల్లప్పుడు ధరించి ఉన్నందున **"తేన్ నవిన్ఱ నీణ్ముడి"** అని చెప్పబడింది. ఇక, **"తేన్ నవిన్ఱ"** అనే దానిని కిరీటానికి విశేషణం చేయకుండా, నాయకునకు విశేషణం చేసి, మిక్కిలి భోగ్యతవల్ల తేనెగా చెప్పబడే భగవానుడు- అని కూడా చెప్పవచ్చు. **"తిరువరఙ్గత్తే వళరుమ్ తేన్"** (శ్రీరంగంలో వృద్ధి చెందే మకరందం వంటివాడు) అని తిరువరఙ్గక్కలమ్బకంలో ఐయఙ్గార్ అన్నారు. లేక, **"తేన్ నవిన్ఱ మామలైక్కే"** అని అన్వయించి, పర్వతానికి విశేషణంగా చేయవచ్చు.

"తెన్నా తెనా వెన్ఱు వణ్డు మురల్ తిరువేఙ్గడమ్" ("తెన్నా తెన్నా" అని తుమ్మెదలు రొదచేసే వేంకటాచలం), **"కోల్ తేన్ పాయ్న్దు ఒழுఙ్గుమ్ కుళిర్శోలై శూழ் వేఙ్గడమ్"** (పుట్టతేనే స్రవించి ప్రవహించే చల్లని తోటలను చుట్టు కల వేంకటాద్రి) అనే ఆழ்వార్ల సూక్తులు గమనించదగినవి. **"తేన్"-** మధువు, తుమ్మెదలు- అని అర్థం.

**(విణ్ముదల్ నాయకన్)-** పరమపదానికి ప్రధాననాయకుడు- అని పరమపదం మొదలైన లోకాలకు అన్నిటికి నాయకుడు- అని వివరించవచ్చు.

**(వాశికై)-** మాలిక. నల్లని వర్ణాన్ని కల్గిన భగవానుని తిరుమేనినుండి శ్రీపాదపర్యంతం వేలాడే ముత్యాల మాలిక- నల్లని పర్వతశిఖరం మొదలు పాదపర్యంతం నిరంతరం ప్రవహించే తెల్లనినీటి ప్రవాహానికి ఉపమానం. **"మామ లైక్కు నణ్ణుదల్ వేణ్డుమ్"** అని అన్నందున, నాయకి **"కుఱిఞ్జి"** (పర్వత ప్రాంత సీమకు) చెందినదని స్ఫుటమవుతున్నది. **"కూడు మిడమ్ కుఱిఞ్జి"** అనే ద్రావిడాలంకారిక వచనం ఇక్కడ స్మరణీయం.

ఈ పాశురానికి ధ్వన్యర్థమేమంటే- ప్రాప్యాన్ని పొందలేనందున క్లేశపడే ఆళ్వార్ల ఆర్తిని తెలిసి, వారిపట్ల ప్రేమను కల భక్తులు దేశాంతరం నుండి వేగంగా రావడమే. భగవానుని, భగవద్భక్తులను విశ్లేషించడంవల్ల కల్గిన దుఃఖాన్ని తీర్చి ఆళ్వార్లను ఊరడించాలనే కోరికను కల్గిన భాగవతులు అ మనోరథం తీర్చడంలో సమర్థమైన మనస్సును వేగంగా ప్రేరేపించిన రీతి ఇది.

**(ఒణ్ణుదల్ మామై ఒళ్ళి పయవామై)**- దివ్యమైన ఊర్ధ్వపుండ్రంతో వెలిగే ఫాలభాగాన్ని కల ఆళ్వార్ల సహజమైన వర్ణం పాడుకాకుండా ఉండేటట్లుగా- అని భావం. "మలై" అనేది ఆళ్వార్లు వేంచేసి ఉండే ఉన్నతస్థానం. దాని ఔన్నత్యం తోచేటట్లు 'మామలై" అని విశేషించి పలుకబడింది.

**సముద్రఘోషను విని తాళలేని నాయకి క్లేశపడడం**

**51. మలై కొణ్డు మత్తావరవాల్ శుళ్ళత్తియ మాయప్పిరాన్,**
**అలైకణ్డు కొణ్డవముదమ్‌కొళ్ళాదుకడల్-, పరదర్**
**విలైకొణ్డు తన్ద శఙ్గమివై వేరిత్తుళ్ళాయ్ తుళైయా**
**త్తులైకొణ్డు తాయమ్ కిళర్న్దు, కొళ్వానొత్తళైక్కిన్ఱదే**

కడల్ = సముద్రం, మలై= మందరపర్వతాన్ని, మత్తు ఆ కొణ్డు = కవ్వంగా చేసికొని, అరవాల్ = వాసుకి సర్పమనే చిలికే దారంతో, శుళ్ఱ్ఱియ = తనను చిలుకడంకోసం పరిభ్రమించేటట్లు చేసిన, పిరాన్ = స్వామి, అలై కొణ్డు = (తనను) క్షోభిల్లజేసి, కొణ్ద = తననుండి గ్రహించిన, అముదత్తై = అమృతాన్ని, కొళ్ళాదు = తిరిగి తీసికోకుండా, వేరి తుళ్ళాయ్ తుళై ఆ = పరిమళాన్ని కల (భగవానుని) తులసిని తనకు సహాయంగా చేసికొని, తులై కొణ్డు = సమానమైన భావాన్ని కల్గి, ఎదురుగా వచ్చి, దాయమ్ కిళర్న్దు = దాయాదిత్వాన్ని పొందినట్లుగా విజృంభించి, పరతర్ విలై కొణ్డు తన్ద శఙ్గమ్ ఇవై కొళ్వాన్ ఒత్తు = జలప్రాంత వాసులైన జాలరులు (నావద్దనుండి) వెల తీసికొని, నాకు ఇచ్చి ఈ శంఖవలయాలను తిరిగి తీసికొనేటట్లుగా, అళైక్కిన్ఱదు = నన్ను తగవుకు పిలుస్తున్నది.

**భావదీపిక :** సముద్రఘోషను విని తాళలేని నాయకి దుఃఖిస్తూ పలికే పాశురం ఇది. వియోగినులకు సముద్రఘోష చాలా కామోద్దీపకమై ఉంటుంది. ఆ సముద్ర ఘోష వల్ల తన శరీరం కృశించినందున చేతి గాజులు జారిపోవడం గమనించిన

పరాంకుశ నాయకి "పరిపూర్ణశక్తిని కల్గిన భగవానుడు మందరపర్వతాన్ని కవ్వంగా నాటి, వాసుకిని చిలికే దారంగా చుట్టి, దేవాసురుల ద్వారా, తన బాహువులతో కుడిఎడమలకు పర్వతాన్ని తిప్పి చిలికి, ఆ సముద్రం నుండి అమృతాన్ని బలాత్కారంగా గ్రహించి తీసికొని పోయాడు. ఆ అమృతాన్ని భగవానుని బలిమి కారణంగా, అతని దగ్గరనుండి తిరిగి తీసికోలేని ఈ సముద్రం (బలవంతుని దగ్గర తన బలాన్ని చూపలేని బలహీనుడు, తనకంటే బలహీనుని బాధిస్తాడు- అనే రీతిలో) బలహీనురాలనైన నాపట్ల తనబలాన్ని ప్రదర్శించదలచాడు. నేను, ఓడవ్యాపారుల దగ్గర వెల ఇచ్చికొన్న నా శంఖపు గాజులను తాను బలాత్కారంగా గ్రహించి తీసికొనిపోవాలని తలచి, దానికి తన బలం చాలదని, తులసిని సహాయంగా చేసికొని, జ్ఞాతులు దాయాద ధనాన్ని బలంగా తీసికొనిపోవడం కోసం పైకివచ్చి యుద్ధానికి పిలిచినట్లుగా, తానుకూడా తన గొప్ప బలిమితో నన్ను పోరుకు పిలుస్తున్నాడు- అని అంటూ నాయకి తన విరహార్తిని వ్యక్తం చేస్తున్నది.

**"వేరిత్తుழாయ్ తుణైయా"** అనే సూక్తిలోని తాత్పర్యం ఏమంటే - భగవానుని తులసీమాలిక పట్ల ఆశపడి అది లభించనందున నేను క్లేశపడే సమయం చూచి, సముద్రం తాను కూడా నన్ను బాధించడం ఆరంభించింది- అని. అతని తులసీప్రసాదం నాచేతికి లభించకుండా నన్ను ఏవిధంగా బాధిస్తున్నదో, ఆ విధంగానే ఈ సముద్రం కూడా బాధిస్తున్నదని అంటున్నది, నాయకి- అనిభావం.

**(తులై కొణ్డు)** - తులసిని తనకు సహాయంగా చేసికోనపుడు నాకు ఎదురు కాలేనిది, దానిని సహాయం చేసికొన్న తరువాత శత్రువై ఎదిర్చింది- అని భావం. సహజంగా వాలికంటె తక్కువ బలాన్ని కల్గిన సుగ్రీవుడు శ్రీరాముని సహాయంగా చేసికొన్న తరువాత, ఆ సహాయంవల్ల కల్గిన ఎక్కువ బలంచేత వాలికి తగిన శత్రువై, ఎదిరించి, దాయాదిస్వభావం స్ఫురించేటట్లుగా బలమైన యుద్ధానికి పిలచినట్లు- అని భావం. లేక, **"తులై కొణ్డు"** అనే దానికి (నన్ను) వధించాలనే అభిప్రాయాన్ని కల్గి- అని కూడా వివరించవచ్చు. **"తులైత్తల్"** అన్నా, **"తొలైత్తల్"** అన్నా ఒకటే. **"తొలైత్తల్, తొడర్దల్, తొడఙ్గల్, తొళై, తొడై"** అనే ఈ పదాలు వ్రాతప్రతులలో ప్రచురంగా తుకారాన్ని మొదట కల్గినవిగా లిఖింపబడడం గమనించదగిన అంశం.

**(తుழாయ్ తుణైయా త్తులై క్కొణ్డు)** - (సముద్రం) తనను బాధించినవానిని తాను ఏ రీతిలోను ఎదిరించలేక, అతని సంబంధాన్ని కల్గిన తులసిపట్ల నేను

అభిలాషను కల్గి ఉన్నాననే ఇంతమాత్రం కారణంచేత నాపట్ల శత్రుత్వాన్ని కల్గి, నన్ను బాధించడం ఆరంభించింది- అని కూడా వివరిస్తారు.

**(దాయమ్ కిళర్న్దు కొళ్వానొత్తు)** - నాలుగైదు మార్లు క్రయం చేసి సంపాదించిన వస్తువులను కూడా దాయాదులు ''ఇది మాది'' అని పల్కి, విడువకుండా తగవులాడి చేజిక్కించుకోవాలని చూచినట్లే, దీని చేష్టకూడా ఉన్నదని భావం.

**(అழ்றైక్కిన్దదే)** - ఈ విధంగా నన్ను బాధిస్తున్నట్లే, విశ్లేషించిపోయిన అతనిని కూడా బాధించవద్దా? కడలి అతని తిరుమేని వర్ణంతో, దాని ఘోష అతని గంభీరమైన కంఠధ్వనితో పోలి నన్ను బాధిస్తున్నవి.

**"అలైకొణ్డు - అలైయక్కొణ్డు"** - క్షోభను కలుగజేసి- అని అర్థం. **"కొళ్వాదు"** అనే దానిని సమాపకక్రియగా **("వినైముற்று")** కాకుండా కృదంతరూపంగా కూడా గ్రహించవచ్చు. సమాపకక్రియగా గ్రహిస్తే, **"కడల్"** అనే కర్త మధ్యమ దీపన్యాయం లో **"కొళ్వాదు"** అనే దానితో, **"అழ்றైక్కిన్దదు"** అనే దానితో అన్వయిస్తుంది.

భగవానుని దరి చేరలేక క్లేశపడుతున్న ఆழ்వార్లు ఈ లోకంలో సంసార కోలాహలాన్ని చూచి తల్లడిల్లడం ఈ పాశురానికి స్వాపదేశార్థం. **"కడల్"** అంటే సంసారమనే సముద్రం. సంసారసాగరంలో చలనం లేని మనఃస్థైర్యమనే మందర పర్వతాన్ని నాటి, భక్తి అనే దారాన్ని చుట్టి, చిలికి, భగవానుడు తానే ఒక క్షోభను కలుగజేసి, భోగ్యమైన ఒక ఆత్మను ఈడేర్చి ఉద్ధరించి తీసికొనిపోయి, అనుభవించడం ఆరంభిస్తే, దానిని తిరిగి గ్రహించగల శక్తి ఈ సంసారానికి లేదు. ఇటువంటి స్వభావాన్ని కల ఈ సంసారంయొక్క ఆడంబరం, భగవానుని భోగ్యతపట్ల నాకు కల్గిన మిక్కిలి ఆశచేత నేను **"కణ్డాற்றేన్ ఉలకియల్కై కడల్వణ్ణా! అడియేన్ పణ్డేపోల్ కరుదాదు ఉన్నడిక్కే కూయ్ ప్పణికొళ్ళే"** (ఓ సముద్రావర్ణా! లోకస్వభావాన్ని చూసి నేను సహించలేను. నీ దాసుడనైన నన్ను పూర్వంవలె భావించకుండా, నీ పాదాల చెంత చేర్చుకొని నానుండి దాస్యాన్ని గ్రహించు) అని ఆలస్యాన్ని సహించలేక త్వరపడేటట్లుగా నావిషయంలో పగను చూపి, నన్ను మిక్కిలి క్లేశపెడుతున్నది- అని తాత్పర్యం.

**(పరతర్ విలైకొణ్డు తన్ద శఙ్గ మిவై కొళ్వానొత్తు)** - సంసారాన్ని దాట గల ఆచార్యునిచే నా శుశ్రూషలకు తగినట్లు అనుగ్రహింపబడినది, నా హస్తగతమైనది

అయిన శుద్ధస్వభావాన్ని తిరిగి గ్రహించాలని ఈ సంసారసాగరం యత్నిస్తున్నది- అని ఈ భావం.

**"పరతర్"**- జలమయప్రాంతంలోని పురుషులకు **"పరతర్, వలైయర్, నుళైయర్"** అని, అక్కడి స్త్రీలకు **"పరత్తియర్, వలైచ్చియర్, నుళైచ్చియర్"** అని పేర్లు.

పదునాల్గు సంవత్సరాలు వనవాసం చేసిన శ్రీరాముడు అయోధ్యకు తాను తిరిగివస్తున్న సంగతిని హనుమంతునిద్వారా భరతునకు సందేశం పంపించినట్లుగా, ప్రకృతంలో నాయకుని రాకనుగూర్చి నాయకికి తెలియజేసే వారెవ్వరూ లేనందున ఆమె నాయకుని రాకను తెలియక బాధపడుతున్నది- అని పెరియవాచ్చాన్‌పిళ్ళై పల్కుతూ, ఈ సందర్భంలో హనుమంతుని ద్వారా భరతునకు పంపిన వార్తను వివరించారు. "నేను అయోధ్యకు తిరిగి వచ్చిన తరువాత యువరాజపట్టాభిషేకాన్ని చేస్తే దానిని భరతుడు అంగీకరిస్తాడా? అంగీకరించడా ?'' అని తెలిసికొని రమ్మని హనుమంతుని శ్రీరాముడు పంపించాడు. ఎందుకంటే, వనవాసానికి వెళ్ళడానికి ముందుకూడా భరతునకు యువరాజ పదవిని ఇవ్వాలనే కోరికను శ్రీరాముడు కల్గి ఉన్నాడు- అనే విషయాన్ని వివరించిన వ్యాఖ్యాత దీనికి ప్రమాణంగా భట్టర్ పల్కిన నిర్వాహాన్ని ప్రస్తావించారు.

శ్రీరామునకు పట్టాభిషేకం చేయడం కోసం అన్ని ఏర్పాట్లను చేసినపుడు కైకేయి, రాముని వనవాసాన్ని, భరతుని పట్టాభిషేకాన్ని కోరుతూ రెండు వరాలను అడిగింది. ఈ వరాలనుగూర్చి శ్రీరామునకు తెలిసినపుడు, శ్రీరాముడు ఏవిధమైన వికారాన్ని లేనివాడై వాటిని తాను యథాతథంగా అంగీకరించినట్లుగా కైకేయితో పల్కి, వనవాసానికి బయలుదేరాడు. ఆ విధంగా అతడు వనవాసానికి బయలు దేరినపుడు **"అభిషేచనికం భాండం దృష్ట్వా రామః ప్రదక్షిణమ్, శనై ర్జగామ సాపేక్షః దృష్టిం తత్రావిచాలయన్"** (పట్టాభిషేకం కోసం సిద్ధంచేసిన వస్తువులకు ప్రదక్షిణం చేసి వాటిని ఆశతో చూస్తూ, చెదఱని మనస్సుతో మెల్లగా వెళ్ళాడు) అని చెప్పబడింది.

శ్రీరామునకు పట్టాభిషేకం జరుగకపోయినప్పటికీ కొంచెంకూడా బాధపడకుండా వనవాసానికి అతడు సిద్ధపడ్డాడు- అని చెప్పేటపుడు **"శనైర్జగామ సాపేక్షః"** (పట్టాభిషేకం కోసం సిద్ధం చేసిన వస్తువులను ఆశతో చూస్తూ వెళ్ళాడు) అని అంటే, అదియుక్తంగా లేదు- అని తలచిన కొందఱు **"సాపేక్షః"** అనే పదాన్ని

"సావేక్షః" అని మార్చారు. (అధోముఖదృష్టితో చూస్తూ వెళ్ళాడు) అని దీని భావం. భట్టర్ దీనిని విని, ఆ విధంగా పాఠాన్ని మార్చవలసిన అవసరంలేదు, యథాశ్రుత పాఠానికే యుక్తమైన అర్థాన్ని చెప్పవచ్చు. పట్టాభిషేక సంభరాలతో భరతునకు యువరాజపట్టాభిషేకాన్ని చేయడం చూడకుండానే వనానికి వెళ్ళిపోతున్నానే!- అని, ఆశతో ఆ వస్తువులను చూస్తూ వెళ్ళాడు- అనేది **"సాపేక్షః"** అనే పదంతో తెలుపబడింది- అని భట్టర్ వివరించారు.

ఈ పాశురవ్యాఖ్యలోనే **"అలైకణ్డు కొణ్డు"** అనే పదసందర్భాన్ని వివరిస్తూ నమ్బిళ్ళై ఒక సంవాదాన్ని ప్రస్తావించారు. ఎవరికీ పరిచ్ఛేదించడానికి సాధ్యం కాని సముద్రాన్ని శ్రీరాముడు కలత పొందేటట్లు చేశాడు- అని తెల్పుతూ దీనిని ప్రస్తావించారు. శ్రీరాముడు తాను కోరిన రీతిలో దారిని ఇవ్వని సముద్రునిపై కోపించి, బాణాన్ని సంధించినపుడు, అతడు భీతిల్లి పరుగెత్తికొని వచ్చిన సందర్భాన్ని పల్కుతూ భట్టర్ ఒక సంవాదాన్ని ఉట్టంకించారు.

తనపై బాణాన్ని సంధించిన శ్రీరామునిచూచి మిక్కిలి భయపడి పరుగెత్తి వచ్చిన సముద్రుని వాల్మీకి- **"రక్తమాల్యాంబరధరః పద్మపత్రనిభేక్షణః, సర్వపుష్పమయీం దివ్యాం శిరసా ధారయన్ స్రజమ్, జాతరూపమయై శ్చైవ తపనీయవిభూషితైః ఆత్మజానాం చ రత్నానాం భూషితో భూషణోత్తమైః"** (శ్రీరామా-యుద్ధ-21-19,20) (ఎఱ్ఱని మాలికలను, వస్త్రాలను ధరించినవాడై, తామరపూల రేకులవంటి కన్నులను కలవాడై, అన్నిపూలతో కూర్చిన మాలికను శిరస్సున దాల్చినవాడై, తనలో పుట్టిన రత్నాలతో పొదగబడిన, బంగారంతో చేయబడిన గొప్ప ఆభరణాలను అలంకరించుకొన్నవాడై వచ్చాడు) అని వర్ణించాడు.

"భయపడి వచ్చిన సముద్రుడు ఈ విధంగా గొప్ప మాలికలను, ఆభరణాలను ధరించి వచ్చాడు'' -అనే ఈసూక్తిని విన్న కొందఱు "పులి కోపించినట్లుగా శ్రీరాముడు తీవ్రంగా కోపించిన సమయంలో సముద్రుడీ విధంగా అలంకరించుకొని రావడం ఏమి?'' అని భట్టర్‌ను అడిగారు. అపుడు భట్టర్ "బావిలోని నీరు ఎపుడైన సలసల కాగి బావిని తపింపజేస్తుందా? చల్లగా ఉండడమే కదా బావిలోని నీటి స్వభావం. అదే విధంగా, శ్రీరాముడు మనలను భయపెట్టి, కార్యాన్ని సఫలం చేయడం కోసం వింటిని వంచాడేతప్ప, మనలను వధించే పర్యంతంలో దండించడంకోసం కాదు'' అని శ్రీరాముని యథార్థ స్వరూపాన్ని సముద్రుడు

గ్రహించినందువల్లనే ఇంతగా అలంకరించుకొని ధైర్యంగా వచ్చాడు'' అని బదులిచ్చారు.

**కాలవిభ్రమం (కాలాన్ని గూర్చి నాయకికి సఖి భ్రమ కల్గించడం)**

52. అழைక్కుమ్ కరుజ్గడల్ వెణ్‌తిరైక్కై క్కొణ్డుపోయ్, అలర్వాయ్
మழைక్కణ్ మడన్దై యరవవణై యేఱ-, మణ్‌మాదర్‌విణ్‌వాయ్
అழைత్తు పులమ్బి ములైమలైమేల్ నిన్ఱుమ్ ఆఱుగళాయ్
మழைక్కణ్ణనీర్, తిరుమాల్ కొడియానెన్ఱు వార్‌గిన్ఱదే

అழைక్కుమ్ = (ప్రేమతో) పిలిచే, కరు కడల్ = (తనలో శయనించి ఉండే భగవానుని తిరుమేని నీడ సంక్రమించినందున) నల్లగా ఉండే పాలకడలి, వెళ్ తిరై కై = (తన) తెల్లని అలలు అనే చేతులతో, కొణ్డు పోయ్ = గ్రహించి తీసికొని పోగా, అలర్ వాయ్ మழை కణ్ మడన్దై = తామరపూవులో నివసించేది, వర్షంవలె చల్లని నేత్రాలను కల్గినదైన లక్ష్మీదేవి, అరవు అణై ఏఱ = (ఆ పాలకడలిలో శయనించి ఉండే భగవానుని) ఆదిశేషుడనే పడుకపై అధిరోహించగా, (దానిని చూచి), మణ్ మాతర్ = భూదేవి, విణ్ వాయ్ = ఆకాశంలో, పులమ్బి అழைత్తు = (మేఘగర్జనల రూపంలో) రోదించి, ఆక్రందించి, ములై మలై మేల్ నిన్ఱుమ్ =(తన) స్తనాలనే పర్వతాల పైనుండి, ఆఱుకళ్ ఆయ్ = ప్రవాహాలుగా (ప్రవహించగా), మழை కణ్ణ నీర్ = వర్షమనే కన్నీరు, తిరు మాల్ కొడియాన్ ఎన్ఱు= శ్రియఃపతి కఠినుడు- అని వ్యక్తం చేసి, వార్‌కిన్ఱదు = ప్రవహిస్తున్నది.

భావదీపిక : ఈ పాశురం **"కాలమయక్కు"** అనే ద్రావిడాలంకారిక (శృంగార) ప్రక్రియలో రచింపబడింది. పూర్వం **"ఞాలమ్ పనిప్ప"** అనే ఏడవ పాశురంలో, **"కడల్ కొణ్డెழுన్దదు వానమ్"** అనే పద్దెనిమిదవ పాశురంలో వలె ఇక్కడ కూడా **"కాలమయక్కు"** ప్రక్రియే భావ్యం. తరువాత **"మలర్‌న్దే యொழிన్దిల"** అనే అఱువై ఎనిమిదవ పాశురానికికూడా ప్రక్రియ ఇదే. ఈ ప్రబంధంలో **"కాలమయక్కు"** మాటిమాటికి రావడానికి కారణం- నాయకి విరహకాలం దీర్ఘంగా తోచడమని, **"ఇన్నిన్ఱనీర్మై యిని యాముఱామై"** అని తమ వేడికోలును విన్నపం చేసినపుడే భగవానుని దరికిచేరవలసి ఉండగా, ఆ ప్రాప్యం లభించనందువల్ల ఆழ்వార్లకు కల్గిన విరహార్తిలోని అతిశయమని పెద్దలు తెలిపారు. వర్షాకాలంలో తిరిగి వస్తాను- అని పల్కి పోయిన నాయకుడు రాకుండా ఆలస్యం చేశాడు. ఆ వర్షాకాలం రాగానే

నాయకి కలతను పొందింది, "ఇది అతడు నిర్దేశించి పోయిన కాలం కాదు'' అని సఖి కాలాన్ని గూర్చి భ్రమ (అన్యథాజ్ఞానం) కలిగేటట్లుగా పల్కి, ఆమె కలతను తీరుస్తున్నది. **"కారెన క్కలజ్గ మేరెళ్లిఱ్కణ్ణిక్కు ఇన్ తుణైత్తోళ్లి అన్టెన్టు మఱుత్తదు"** (ఇది వర్షాకాలమని తలచి కలత చెందే నేత్రసౌందర్యాన్ని కల నాయకితో ప్రియసఖి ఇది వానాకాలం కాదని పల్కి ఊరడించడం) అనే తిరుక్కోవైయార్ ఉరై గమనార్హం. ఇది **"పరువ మన్టెన్టు కూఱల్"** (సమయం కాదని పల్కడం) అని కూడా అనబడుతుంది.

శ్రీదేవి, భూదేవి - అనే దివ్యపత్నులలో, శ్రీదేవికి జన్మభూమి అయిన పాలకడలిలో శ్రియఃపతి శయనించి ఉన్నందున, ఆ సముద్రం తన కుమార్తె అయిన శ్రీదేవిని తన ఘోష అనే భవ్యమైన కంఠంతో ప్రేమగా పిలచి, అలలు అనే చేతులను ముందుకు చాచి, వాటితో ఆమెను ఎత్తుకొనిపోయి భగవానుని దరికి చేర్చాడు, ఆ శ్రీదేవి, ఆ అలలు అనే సోపానాల మీదుగా భగవానుని ఉన్నతమైన ఆదిశేషశయనంపైకి ఎక్కి, ఆ స్వామితో కలసి ఆనందిస్తున్నది. ఇటువంటి భాగ్యాన్ని పొందలేని భూదేవి ఆకాశమనే విశాలమైన ఏకాంతస్థలంలో మేఘగర్జనలనే వ్యాజంతో నోరు తెరచి ఏడ్చి, మిక్కిలిగా కన్నీటిని నిరంతరం స్రవించింది. ఆ కన్నీరు ఆమె స్తనాలనే పర్వతాలపై నదీప్రవాహాలుగా ప్రవహిస్తున్నాయి, చూడు- అని వర్ణించి, సఖి "ఇది నీవు భావించే వర్షాకాలం కాదు సుమా!'' అని అంటూ నాయకిని సమాధానపరుస్తున్నది. క్రమాను సారంగా (పక్షపాతంలేక) సరి సమానంగా ఆదరించదగిన పత్నులు ఇద్దఱిలో, ఒకతెను స్వామి ప్రేమించి, గ్రహించి, ఇంకొకతెను ఉపేక్షించిన కాఠిన్యం, ఆమె కార్చే ఈ కన్నీటితో లోకంలో వ్యక్తమవుతుంది- అనే అర్థం స్ఫురించేటట్లు **"తిరుమాల్ కొడియాన్ ఎన్టు వార్కిన్టదు"** అని అనబడింది. **"మాల్"** అనే పదం ఆశవల్ల కలిగే వ్యామోహాన్ని తెల్పుతున్నందున, ఇక్కడ **"తిరుమాల్"** అనేది శ్రీదేవిని ప్రేమించి, స్వీకరించినవాడనే అర్థం ఇస్తుంది. **"పిత్తర్ పనిమలర్ మేల్ పావైక్కు"** (చల్లని పద్మంలో నివసించే లక్ష్మి విషయంలో ఉన్మత్తుడు) అనే దివ్యప్రబంధ సూక్తికూడా గమనార్హం. నాయకుడు ఉపేక్షించాడని బాధపడే నాయకి యొక్క సఖి దీనిని పల్కినందున "పలు భార్యలకు భర్త అయినవానికి ఇది సహజం సుమా!'' శ్రీదేవిని ఆదరించిన స్థితిలో భూదేవి పడేపాట్లును చూడు- అని ఒక సహజమైన సన్నివేశాన్ని తెలిపి ఊరడించే క్రమం కూడా కావచ్చు. ఈ విధంగా

సఖి పల్కడాన్ని నాయకి విశ్వసించగలదా?- అని అంటే, నమ్మకపోయినా, ఈవిధంగా కూడా ఒకటి లోకంలో ఉంటుందా? అనే విచికిత్స కల్గి, దానినిగూర్చి ఆలోచించి నిశ్చయించే లోగా నాయకుడు రావచ్చు- అని భావించి సఖి దీనిని పల్కి ఉండవచ్చు.

క్షీరాబ్ధిని **"కరుఙ్కడల్"** అనడం ఏవిధంగా అంటే- శ్రేష్ఠమైన జాతికి చెందిన నీలరత్నాన్ని పాలలో పడవేస్తే, ఆ రత్నం కాంతితో ఆ పాలు అంతా తన సహజమైన తెల్లని రంగు మాటి ఆ మణివర్ణమైన నీలవర్ణంలో కన్పిస్తుంది, అదే రీతిలో సహజంగా తెల్లని రంగును కల క్షీరాబ్ధిలో పరుండిన శ్రియఃపతి తిరుమేని కాంతి నల్లనిదైనందున, ఆ కాంతివల్ల ఆ క్షీరాబ్ధికూడా నల్లగా భాసించడాన్నిబట్టి **"కరుఙ్కడల్"** అని అనబడింది. **"అపి ఫణిపతి భావాచ్ఛుభ్రమంతః శయాళోః, మరకతసుకుమారైః రంగభర్తుర్మయూఖైః, సకలజలధిపానశ్యామ జీమూతజైత్రం పులకయతి విమానం పావనం లోచనే నః"** (శ్రీరంగరాజస్తవమ్- పూర్వశతకమ్) (**"శెన్రాల్ కుడైయామ్ ఇరున్దాల్ శిఙ్గాశనమామ్"** - అనే రీతిలో సకలవిధ కైంకర్యాలకు యోగ్యుడైన ఆదిశేషుడే శ్రీరంగవిమానంగా రూపొందినందున, ఆ ఆదిశేషుని వర్ణం తెల్లనిది కనుక, ఆవిమానం కూడా తెల్లని రంగును కల్గినదైనా, దాని లోపల శయనించి ఉండే కాలమేఘవర్ణుడైన శ్రీరంగనాథుని తిరుమేనివర్ణం ప్రతిఫలించినందున నల్లనిదై ప్రకాశిస్తున్నది. ఇటువంటి పావనమైన విమానం మన కళ్ళకు గగుర్పాటును కల్గిస్తున్నది). అనే శ్రీరంగరాజస్తవ శ్రీసూక్తి. **"క్షీరాంభోధేః జఠర మభితో దేహభాసాం ప్రరోహైః కాలోన్మీలత్కువలయదళాద్వైత మాపాద యంతమ్"** అనే భోజ కవికృతచంపూకావ్యశ్లోకం ఇక్కడ అనుసంధేయాలు. ఇక, **"కరుఙ్కడల్"** అనే దానికి పెద్ద సముద్రం - అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"కరుమై"**- గొప్పతనం (పెద్ద)- అని అర్థం.

మొదటి పాదం చివరలోని **"పోయ్"** అంటే **"పోగా"**- అని అర్థం. ఇది **"ఎచ్చత్తిరిపు"** కృదంతప్రత్యయ వ్యత్యయరూపం. సముద్రం తన అలలు అనే చేతులతో తీసికొని వెళ్ళి'' -అనే అర్థాన్ని దీనికి గ్రహించే పక్షంలో ఇది **ఎచ్చత్తిరిపు** కాదు. **"మలైక్కణ్ మడన్దై"** -తన నేత్రసౌందర్యంతో లక్ష్మీదేవి శ్రియఃపతిని అభినివిష్టుని చేయడం దీనివల్ల స్ఫురిస్తుంది. **"అలర్వాయ్, విణ్వాయ్"** అనే ప్రయోగాలలో **"వాయ్"** అనేది సప్తమీవిభక్తి ప్రత్యయం. లేక, **"అలర్వాయ్"** అనే

దానికి ఎఱ్ఱని కలువ పూలవంటి నోటిని కల లక్ష్మీదేవి- అని, **"విణ్వాయ్"** అనేదానికి ఆకాశమనే నోటితో- అని కూడా వివరించవచ్చు.

**"కారార్ వరైక్కొజ్జై"** (శిఱియతిరుమడల్) ఇత్యాదిచోట్ల పర్వతం భూదేవి స్తనంగా రూపింపబడినందున **"మాలెమలై మేల్"** అని అనబడింది.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే- జీవకోటిలో చేరిన శ్రీదేవి, భూదేవి మొదలైన, సమీపంలో ఉండేవారు భగవానుని నిత్యానుభవాన్ని పొంది ఉజ్జీవిస్తూ ఉండగా, నేను ఈవిధంగా అతనిని చేరలేక క్లేశపడుతున్నానే- అనే విరహార్తి అతిశయించిన ఆళ్వార్లకు వారి భక్తులు ఒక దృష్టాంతం ద్వారా భగవానుని స్వాతంత్ర్యాన్ని తెలిపి, ఊరడించడమే. భగవానుని ఒక క్షణకాలం అయినా విడచి ఉండలేని దేవేరులు- అని సమానంగా చెప్పబడే శ్రీదేవి, భూదేవులలో, ఒకతెను విశ్లేషించి, వేఱొకతెను సంశ్లేషించే రీతిలోకూడా - ఒక సమయంలో భగవానుని నిరంకుశ స్వాతంత్ర్యం ఉన్నది. ఆవిధంగా ఉండగా, మీరు అతడు చేసిన కాలవిలంబానికి సహించి ఉండడమే తగినది- అని భక్తులు వారిని ఊరడించారు. ఈ పాశురంలో భూదేవి విషయంగా చేసిన వర్ణన- భగవానుని నిరంకుశ స్వాతంత్ర్యాన్ని తెలుపడంకోసమేనని గ్రహించాలి.

భూదేవి శోకిస్తున్నదని పల్కడానికి గల కారణమేమి? అనే విషయాన్ని గూర్చి పూర్వాచార్యులు చేసిన నిర్వాహాలు మూడు పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానంలో ప్రస్తావింపబడ్డాయి.

పూర్వాచార్యులలో కొందఱు - శ్రీదేవితో స్వామి సంశ్లేషిస్తున్నాడే- అనే అసూయతో భూదేవి శోకించడంలేదు. స్వామి, శ్రీదేవుల కలయికలో నేను పూమాలిక, చందనం వలె ఆనందాన్ని కల్గించే వస్తువును కదా! అటువంటి నన్ను విడచిపెట్టి పోతున్నారే - అని భూదేవి శోకిస్తున్నది- అని అర్థాన్ని నిర్వహించారు.

**"వడివిణై యిల్లా మలర్మకళ్"** అని పలికే రీతిలో మిక్కిలి సాటి లేని సుకుమారి అయిన లక్ష్మీదేవిని దుర్గమమైన ఈ సముద్రంలోకి తీసికొనిపోతున్నాడే! నేను పడుకగా ఉండగా, ఇక్కడే సంశ్లేషించకుండా ఈ విధంగా చేయవచ్చునా?- అని భూదేవి బాధపడుతున్నది- అని ఆళవందార్ నిర్వాహం.

భట్టర్ చేసిన నిర్వాహం మరింత విలక్షణమైనది. "ఇవి ఏవీ కారణాలు కావు, ఇది వర్షాకాలం కాదు'' -అని అనడంకోసం సఖి ఏదో ఒక కారణాన్ని చెప్పింది.

అంతే ఈ విధంగా పొసగని ఏదో ఒక హేతువును సఖి పలికింది. "శ్రీదేవి సంశ్లేషించడానికి భగవానుడు వెళ్ళగా దానిని చూచి భూదేవి శోకిస్తున్నది" అని ఈమె అంటున్నదే! ఈ మాట ఏవిధంగా పొసగుతుంది'' అని నాయకి ఆలోచించడం ఆరంభిస్తుంది. ఆలోచించి నిర్ణయం చేసికొనే లోపల కాలం గడచిపోతుంది. నాయకుడు తిరిగి వస్తాడు- అని తలచి సఖి పొసగని ఒక కారణాన్ని పల్కింది - అని **"కాలమయక్కు"** ప్రక్రియానుగుణంగా భట్టర్ వివరించారు. ఈ ఐతిహ్యం నంబిళ్ళై వ్యాఖ్యానంలో కూడా గోచరిస్తున్నది.

**సోదెకత్తె నాయకి క్లేశం తీరే ఉపాయాన్ని చెప్పడం**

**53. వారాయిన ములైయాళివళ్ వానోర్ తలైమగనామ్,**
**శీరాయిన తెయ్వ నన్నోయిదు-, తెయ్వ త్తణ్ణన్దుழాయ్**
**త్తారాయినుమ్ తழైయాయినుమ్ తణ్కొమ్బుదాయినుమ్ కీழ్**
**వేరాయినుమ్, నిన్ర మణ్ణాయినుమ్ కొణ్డు వీశుమినే**

వార్ ఆయిన ములైయాళ్ = కంచుకానికి (రెవికకు) పొందికగా ఉండే స్తనాలను కల్గినదైన, ఇవళ్ = ఈ పరాంకుశనాయకియొక్క, ఇదు = ఈప్రేమవ్యాధి, వానోర్ తలై మకళ్ ఆమ్ శీర్ ఆయిన దెయ్వమ్ నల్ నోయ్ = దేవాధిదేవుడైన శ్రియఃపతియొక్క తగిన కల్యాణగుణాల విషయంగా కల్గి గొప్ప మంచి వ్యాధి. (దీనికి పరిహారప్రకారం ఏది? అంటే), దెయ్వమ్ = దివ్యమైన, తణ్ = చల్లని, అమ్ =అందమైన, తుழాయ్ తార్ ఆయినుమ్ = (ఆ స్వామి యొక్క) తులసీమాలిక అయినా, తழై ఆయినుమ్ = ఆ తులసియొక్క ఒక ఆకు అయినా, తణ్ కొమ్బు అదు ఆయినుమ్ = చల్లని, దాని కొమ్మ అయినా, కీழ్ వేర్ ఆయినుమ్ = కింద ఉండే దాని వేరు అయినా, నిన్ర మణ్ ఆయినుమ్= దానికి నివాసమై ఉండే మన్ను అయినా, కొణ్డు వీశుమిన్ = మీరు తీసికొనివచ్చి దాని గాలి ఈమెపై సోకేటట్లు వీచండి.

భావదీపిక : ఈ పాశురానికి **"వెఱివిలక్కు"** అనేది **"తుఱై"** (ఆలంకారిక ప్రక్రియ). పూర్వం **"శిన్మొழి నోయో"** అనే ఇరవైయవ పాశురంలోవలె పరాంకుశనాయకి యొక్క మోహానికి నిదానమేదో తెలియలేక, అది క్షుద్రదేవత యొక్క ఆవేశంతో వచ్చినదని భావించి, బంధువులు, దగ్గరవారు కలత చెందారు.

దారికాని దారిలో అయినా ఆ బాధకు పరిహారాన్ని చేయాలని తలచి ప్రయత్నించారు. ఈమె ప్రకృతిని తెలిసిన వృద్ధురాలు ఒకతె "మీరు చేసే ఇది అంతా తగినది కాదు. ఈమెకు కల్గిన ఈ వ్యాధి దేవతాంతరాల ఆవేశంవల్ల కల్గినది కాదు. దేవాధిదేవుడైన భగవానుని పట్ల గల అభినివేశంవల్ల కల్గిన గొప్ప మంచి వ్యాధి ఇది. ఈమె బ్రతకాలంటే నేను చెప్పే రీతిలోనే పరిహారాన్ని చేయాలని చూడండి. భగవానుని దివ్యమైన తులసీమాలికను అయినా, ఆ తులసీ పత్రమైనా, దాని కొమ్మను అయినా, దాని వేరును అయినా, దానికి స్థానమైన చోట ఉండే మన్నును అయినా తీసికొని వచ్చి వాటి గాలి ఈమెపై పడేటట్లు వీచండి. వాని గాలి ఈమెపై పడినంతలోనే ఈమె బ్రతికి బయటపడుతుంది''- అని అన్నది.

ఇక, ఈ పాశురాన్ని కట్టువిచ్చి (సోదెను చెప్పే కోయవనిత) పల్కిన పాశురంగా కూడా చెప్పవచ్చు. **"తలైవియాఱ్ఱామైయాల్ వన్ద నోవుక్కు ప్పరిహారమ్ ఏదో! ఎన్ఱు వినవిన శెవిలి ముదలానార్క్కు కట్టువిచ్చి నోయ్ నాడి ప్పరిహారమ్ శొన్న ప్రకారమ్"** (నాయకికి విరహార్తి కారణంగా కల్గిన వ్యాధికి ఏది పరిహారం? అని ప్రశ్నించిన దాది మొదలైన వారికి సోదెకత్తె విచారించి, పరిహారం పల్కిన రీతి ఇది.) అని అழகియ మణవాళచ్చీయర్ ఉరైలోని సూక్తి. నాయకుడు రహస్యంగా నాయకితో కలసి, ఆమెను విశ్లేషించాడు. ఆ విరహాన్ని సహించలేని నాయకి క్లేశపడుతుండగా, ఆమె బాధను చూచిన శెవిలిత్తాయ్ (దాది) ఈమె బాధకు కారణమేమో ఇదమిత్థంగా తెలియలేక, నిమిత్తాన్ని పరీక్షించి చూచి, వాస్తవాన్ని చెప్పగల కట్టువిచ్చిని పిలిచి అడగాలని భావించింది. ఇంతలో-

కొఱ్ఱుఙ్కుడన్తైయుమ్ కోట్టియూరుమ్ పేరుమ్
ఎఱ్ఱుమ్ తిరిన్దు ఇన్ఱే మీళ్వేనై యారిఙ్గఴైత్తతూ ఉ
కణ్డియూర్ అరఙ్గమ్ మెయ్యమ్ కచ్చి పేర్మల్లై యెన్ఱు
మణ్డియే తిరివేనై యారిఙ్గఴైత్త తూ ఉ
విణ్ణకరమ్ వెஃకా విరితిరై నీర్ వేఙ్గడముమ్
మణ్ణకరమ్ మామాడవేళుక్కై తెన్ కుడన్తై
ఎఱ్ఱుమ్ తిరిన్దు ఇన్ఱే మీళ్వేనై యారిఙ్గఴైత్తతూ ఉ
నాకత్తణై కుడన్తై వెஃకా తిరువెవ్వుళ్
నాకత్తణై యరఙ్గమ్ పేరన్బిల్ నావాయుమ్

ఎఙ్గుమ్ తిరిన్దు ఇన్దే మీళ్వేనై యారిజ్గళ్లైత్తతూ ఉ
వేజ్గడముమ్ విణ్ణకరుమ్ వెఃకావు మఃకాద
పూఙ్గిడఙ్గిన్ నీళ్కోవల్ పొన్నకరుమ్ పూదూరుమ్
ఎఙ్గుమ్ తిరిన్దు ఇన్దేమీళ్వేనై యారిజ్గళ్లైత్తతూ ఉ

అని అంటూ ఒక కట్టువిచ్చి పాడుతూ వచ్చింది. గుణిని లెక్కించి చూచే ప్రకారంగా చిన్నచేటలో కొంత ధాన్యం పోసి చెఱిగి, దానివల్ల యథార్థాన్ని గమనించింది.

ఈ పాశురంలోని మొదటి రెండు పాదాలలో నాయకి క్లేశానికి కారణం, క్లేశం, చివరి రెండు పాదాలలో అది ఉపశమించే ఉపాయం తెలుపబడ్డాయి. భగవానునితో సాక్షాత్తుగానో, పరంపరగానో సంబంధాన్ని పొందిన వస్తువు ఏదయినా ఈ వ్యాధికి తగిన పరిహారం- అని తెలుపబడింది.

క్షుద్ర దేవతాంతరాల ఆవేశంవల్ల రూపు మాసి, క్లేశపడే చెడ్డవ్యాధి కాదు ఇది- అనే విషయాన్ని తెలుపడంకోసం **"వానోర్ తలైమకనామ్ శీరాయిన దెయ్వ నన్నోయిదు"** అని పలుకబడింది. **"దెయ్వ నన్నోయ్"** అనే ప్రయోగంలోని విశేషణస్వారస్యంవల్ల ఇటువంటి వ్యాధిని ఈ లోకంలో పొందడం అరుదు- అని, నోము నోచి పొందవలసిన వ్యాధి, ఇది- అని, ఈవ్యాధి పర్యవసానం మహానందమే నని తెలుపబడింది.

తాము ఆశించిన రీతిలో భగవానునితో కలసి, కైంకర్యం చేసి ఆనందించలేక క్లేశపడే ఆళ్వార్ల బాధను చూచిన జ్ఞానులు దీనికి పరిహారమేమి? అని కలత చెందగా, కారణకార్యభావాన్ని తెలిసిన నిరూపకులు- "భగవద్విషయంలో అభినివేశాతిశయం కారణంగా కల్గిన ఈ ఆర్తికి దానికి సంబంధించిన పరిహారం చేయడమే యుక్తం" అని తెలుపడం ఈ పాశురంలోని స్వాపదేశార్థం. భగవానునికే చెందినది, అతనిని అనుభవించడానికి సాధనమైనది అయిన భక్తియే ఇక్కడ **"ములై"** (స్తనం)గా చెప్పబడినందున **"వారాయిన ములైయాళ్"** అనేది - పరిణతి చెంది, ముదిరిన భక్తిని కల ఆళ్వార్లు- అనే అర్థాన్ని ఇస్తుంది.

**"వారాయిన ములైయాళ్ ఇవళ్"** అని నాయకిని గూర్చి ఈ పాశురంలో పల్కిన సూక్తిని పెరియవాచ్చాన్‌పిళ్ళై, తిరుమంగై ఆళ్వార్ అనుగ్రహించిన పెరియతిరుమడల్‌లోని - **"మూవామై కాప్పదోర్ మన్ను మరున్దఱివీర్ ఇల్లైయే"** అనే సూక్తిని ప్రమాణీకరిస్తూ వ్యాఖ్యానించారు. తన స్తనాలు కంచుకానికి ఇముడని

రీతిలో ఉప్పొంగి వృద్ధి చెందుతున్నాయని, దానికి తగిన మందును తెలిసిన వారెవ్వరూ కనపడడం లేదని నాయకి పల్కుతున్నట్లుగా ఈ తిరుమడల్ సూక్తి ఉన్నది. ఈసందర్భంలో పెరియవాచ్చాన్‌పిళ్ళై ఒక ఐతిహ్యాన్ని ఉదాహరించారు.

లోకంలో ఆంతరాళికులు ఎవరూలేరా?- అని తిరుమంగై ఆళ్వార్ అడుతున్నారు- అని భట్టర్ అంటున్నారు. ఆంతరాళికులు- అనేదానికి నాయకీ నాయకులను ఇద్దఱిని కలిపేవారు, దూతలు- అని అర్థం. నాయకీనాయకులను కలిపేవారెవరూలేరా? అని అడుగుతున్నట్లు పైపైన తోచే అర్థం. భగవానుని, మనలను దగ్గరకు చేర్చే ఆచార్యులనుగూర్చి పల్కుతున్నారని స్వాపదేశార్థం. ఈ రీతిలో ఈ రెండర్థాలను ఇచ్చే ఒకే పదాన్ని ఇక్కడ భట్టర్ పల్కినపుడు పిళ్ళైతిరునఱైయూర్ అరైయర్ మొదలైన పలువురు ఆశ్చర్యంతో నాలుగైదు గడియల కాలంపాటు ఇక వేఱు ఏ విషయాన్ని పలుకకుండా భట్టర్ వాక్చాతురిని కొనియాడి, పొందిన ఆనందం వాచామగోచరమని నంజీయర్ అన్నారట. పెరియతిరుమడల్ వ్యాఖ్యానంలో కూడా ఈ ఐతిహ్యం కన్పిస్తుంది. తిరువిరుత్తం-నమ్బిళ్ళై వ్యాఖ్యానంలో కూడా ఇది ప్రస్తావింపబడింది. కాని, నంజీయర్ పేరుకు బదులుగా **"పిళ్ళై అరుళిచ్చెయ్‌వర్"** అని ఉన్నది.

ఈ ఐతిహ్యంలో పిళ్ళై తిరునఱైయూర్ అరైయర్ భట్టర్‌ను ప్రశంసించినట్లు తెలుపబడింది. ఆచార్య సములైన (ఆచార్యస్థానీయులైన) అరైయర్ భట్టర్‌ను ప్రశంసించవచ్చునా? అనే సందేహానికి సమాధానంగా ఇంకొక ఐతిహ్యం ప్రస్తావింప బడుతున్నది.

**"వళర్‌త్తదనాల్ పయన్ పెఱ్ఱేన్ వరుకవెన్ఱు మడక్కిళియై కైకూప్పి వణజ్గినాళే"** (నిన్ను పెంచినందువల్ల తగిన ప్రయోజనాన్ని పొందాను, దగ్గరకు రా- అని అందమైన పెంపుడు చిలుకను పిలిచి, చేతులను జోడించి పరకాలనాయకి నమస్కరించింది) అనే తిరునెడున్దాణ్డక పాశురాన్ని పరాశరభట్టర్ వివరించేటపుడు పల్కిన కొన్ని సూక్తులను విని, పిళ్ళైతిరునఱైయూర్ అరైయర్, వయస్సులో తమకంటే చాలా చిన్నవారైన భట్టర్‌ను చూచి "ఇంత అందమైన వివరణలను ఇంతకుముందు ఎవరి దగ్గర నేను వినలేదు'' అని ప్రశంసించారట. తమ శిష్యుని స్థితిలో ఉండే భట్టర్‌ను ఆచార్యసములైన తాము ప్రశంసించవచ్చునా? అని కొందఱు సందేహపడవచ్చు- అని భావించిన అరైయర్, ఆ సందేహానికి సమాధానం

పలికే రీతిలో భట్టర్‌ను చూచి "కుమారా! ఇపుడు నేను మిమ్ములను ప్రశంసించినట్లే, తమ శిష్యులను పొగడినవారుకూడా ఉన్నారు సుమా! పరకాల నాయకి, తానే తన చిలుకకు భగవన్నామాలను నేర్పించి, ఆ నామాలను ఆ చిలుక పల్కుతూ ఉండగా విని ఆనందించి, **"తిరుమాలై ప్పాడ క్కేట్టు వళర్త్తదనాల్ పయన్ పెఱ్ఱేన్ ఎన్ఱు మడక్కిళియై కైకూప్పి వణఙ్గినాళే"** అని పల్కిన రీతిలో, ఆ చిలుక కాళ్ళపై పడి నమస్కరించింది కదా! అందువల్ల నేను మిమ్ములను పొగడడంలో ఏ తప్పులేదు.'' అని భట్టర్ వివరించిన పాశురాన్నే ప్రస్తావించారు. అరైయర్ మాటలను విని భట్టర్ - "మీరు ఏ రీతిలో అయినా దాసుడనైన నన్ను కీర్తించండి. కాని, మిమ్ములను నేను అనుభవించే అనుభవాన్ని (మీకు చేసే కైంకర్యాన్ని) మీరు అడ్డుకోకపోవడం మాత్రమే దాసుడు కోరేది''- అని అన్నారు. ఈ ఐతిహ్యం నమ్పిళ్ళై వ్యాఖ్యలోను, నాచ్చియార్ తిరుమొழி (10-6)వ పాశురానికి పెరియ వాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యలో కూడా ప్రస్తావింపబడింది. ఇదేవిధంగా నంజీయర్ తమ శిష్యులైన నమ్పిళ్ళైను ప్రశంసించిన సందర్భాన్ని తిరువాయ్ మొழిలోని (6-7-9)వ పాశురానికి నమ్పిళ్ళై ఈడువ్యాఖ్యలో గమనించవచ్చు.

ఆచార్యసములైనవారు శిష్యస్థానీయులైనవారి జ్ఞానవైభవాన్ని ప్రశంసించడం తగినదే, ఈ విధంగా పొగడడం భగవానుని మనస్సుకు చాలా ఆనందాన్ని కల్గిస్తుంది- అనే దానికి ఇక్కడ పెరియవాచ్చాన్‌పిళ్ళై ఇంకొక ఐతిహ్యాన్ని తెలిపారు.

శ్రీరామానుజులు శ్రీరంగంలో వేంచేసి ఉండే సమయంలో జరిగిన సందర్భం ఇది. ఒకనాడు నమ్పెరుమాళ్ చంద్రపుష్కరిణి తీరంలోని పొన్నచెట్టు కిందకు వేంచేశారు. దానికి కొంచెం దూరంలో శ్రీరామానుజులు వేంచేసి ఉన్నారు. అక్కడకు నమ్పెరుమాళ్‌ను సేవించాలని వచ్చిన శ్రీవైష్ణవులు శ్రీరామానుజులను కూడా నమస్కరించారు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన ఉడైయార్ సుబ్రహ్మణ్య భట్టర్ అనే రాజ్యాధికారి ఒకరు దీనిని చూచారు. శ్రీరామానుజుల దగ్గరకు వచ్చి "జీయర్! మిమ్ములను ఒకమాట అడగాలని అనుకుంటున్నాను'' అని అన్నాడు. శ్రీరామానుజులు "ఏమిటి ఆమాట?'' అని అనగా, ఆ అధికారి- "భగవంతుని ముందే కొందఱు మీ ముందు సాగిలపడి నమస్కరించారు. వారుకూడా విద్వాంసులే. "భగవంతుని ముందు నన్ను మీరు నమస్కరించకండి'' అని మీరు వారిని అడ్డుకోలేదు. దీనికి ఏమి కారణం?'' అని ప్రశ్నించాడు. శ్రీరామానుజులు "ఈ ప్రశ్న తప్పక అడుగదగినదే. అయినా దీనిని అడగడానికి నీవు తగవు'' అని

అన్నారు. "ఎందువల్ల?" అని అతడు అనగా, దానికి శ్రీరామానుజులు ఈక్రింది విధంగా బదులిచ్చారు.

"నీవు ప్రభువు దగ్గర సేవచేస్తున్నావు కదా! ప్రభువువద్దకు కార్యార్థంగా వచ్చేవాడు, ఆ ప్రభువు పాదాలలోని ఆభరణాలను తీసికొని, తన తలపై పెట్టుకోవడం నీవు చూచే ఉంటావు కదా! ఆ రీతిలో అతడు తన తలపై పెట్టుకొనే టపుడు ఆ పాదాల నగలు "నన్ను మీ తలలపై పెట్టుకోకండి" అని అంటాయా! నిజానికి అతడు ఆ పాదాల ఆభరణాలను పొగడుతున్నాడా? ఒకవేళ, అతడు ఆ ఆభరణాలనే పొగడితే, ఆ పాదుకలే కదా అతని కార్యాన్ని సఫలం చేయాలి. కాని, అతడు కోరినవానిని ఇచ్చేవాడు ప్రభువే కదా! ఆ రాజు పాదుకలను ఒకడు తన తలపై పెట్టుకొంటే ఆనందాన్ని పొందేవాడు ఆ ప్రభువే తప్ప, పాదుకలు కాదు కదా! అదే రీతిలో కదా, భగవానుని పాదస్థానీయుడనైన నన్ను వారు నమస్కరిస్తున్నారు"- అని శ్రీరామానుజులు సమాధానమిచ్చారు. ఈ ఐతిహ్యం నమ్పిళ్ళై వ్యాఖ్యలో కూడా ఉన్నది.

**నాయకి తుమ్మెదను నాయకుని వద్దకు దూతగా పంపడం**

**54. వీశుమ్ శిఱగాల్ పఱత్తిర్, విణ్ణాడు నుజ్గట్కెళిదు**
**పేశుమ్బడియన్న పేశియుమ్బోవదు-, నెయ్‌తొాడు వుణ్డు**
**ఏశుమ్బడి యన్న శెయ్యు మెమ్మీశర్ విణ్ణోర్ పిరానార్**
**మాశిల్ మలరడిక్కీ ఴ్, ఎమ్మై చ్చేర్‌విక్కుమ్ వణ్డుగళే!**

నెయ్ =రేపల్లెలోని నేతిని, తొాడు ఉణ్డు = చేతితో స్పృశించి, అపహరించి, ఆరగించి, ఏశుమ్బడి = పలువురు పరిహాసం చేసే రీతిలో, అన్న శెయ్యుమ్ = (ఇంకా అటువంటివి) పలు కార్యాలను చేసే, ఎమ్ ఈశర్ = మా నాయకుడు, విణ్ణోర్ పిరానార్ = పరమపదంలో ఉండే (దేవలోకంలో ఉండే) వారికి నాయకుడైన భగవానుని, మాశు ఇల్ మలర్ అడి కీఴ్ = ఏ దోషం లేని ఎఱ్ఱ తామరలవంటి శ్రీచరణాల క్రింద (చెంత), ఎమ్మై = మమ్ములను, శేర్‌విక్కుమ్ = చేర్పించే, వణ్డుకళే = తుమ్మెదలారా!, (మీరు), వీశుమ్ శిఱకాల్ = వేగంగా వీచే రెక్కలద్వారా, పఱత్తిర్ = ఎగిరి సంచరిస్తారు, విణ్ నాడుమ్ = ఆ స్వామి వేంచేసి ఉండే చోటైన పరమపదంకూడా, నుజ్గట్కు ఎళిదు = మీకు వెళ్ళడానికి సులభం, (నాకోసం

మీరు వారి దగ్గరకు దూతగా వెళ్ళడానికి బయలుదేరేటపుడు), పేశుమ్ పడి అన్న పేశియుమ్ పోవదు = మీరు నా కోసం ఆస్వామివద్ద పలికే ఆ మాటలను నా దగ్గర కూడా పల్కివెళ్ళాలి.

**భావదీపిక :** ఈ పాశురం **"వణ్డువిడు తూదు"** అనే శృంగార ప్రక్రియలో రచింపబడింది. నాయకి తనను విశ్లేషించి పోయిన నాయకుడు తిరిగి వస్తాడు- అని సహించి ఉండలేక, అతని రాకకు త్వరపడి, దూతను పంపే రీతిలో ఆమె విరహార్తి అతిశయించింది. అందువల్ల తుమ్మెదలను దూతలుగా నాయకుడైన సర్వేశ్వరునివద్దకు పంపే నాయకి పలికే మాటగా ప్రస్తుత పాశురం ప్రవర్తిస్తున్నది.

భగవానుని శ్రీచరణాల చెంత మమ్ములను చేర్చించగల్గిన ఓ తుమ్మెదలారా ! మీరయితే, వేగంగా వెళ్ళగల్గిన సాధనాన్ని కలవారై ఉన్నారు కదా ! నేను మాత్రం అటువంటి బలిమిని లేని బలహీనురాలనై **"ఇట్ట కాలిట్టకై కళాల్"** అనే రీతిలోని స్వభావాన్ని కలదానను. నా ప్రియుడు వేంచేసి ఉండే పరమపదంకూడా మీకు అధిరోహించి పట్టుకొనగలిగేటట్లున్నది. నాకు అది చేరడానికి అరుదుగా ఉన్నది. అందువల్ల మీరు నాకోసం పరమపదానికి వెళ్ళి, నాగూర్చి స్వామితో చెప్పాలి. ఆ విధంగా అతని దగ్గరకు మీరు దూతగా వెళ్ళడానికి బయలుదేరేటపుడు, నాకోసం మీరు స్వామి దగ్గర పలుకదలచిన మాటలను నావద్దకూడా పలికి వెళ్ళాలి- అని నాయకి అంటున్నది. అక్కడ చెప్పగోరిన మాటలను ఇక్కడ తన దగ్గర పలికి చూపమని అడిగినందున, మీరు అక్కడ పలికే మాటలను ఇక్కడ నాముందు పల్కితే,ఆ మాటలలో ఏదైనా కొఱత ఉంటే, దానిని నేను సరిదిద్దడమే కాక, మీ మాటల చాతుర్యం వల్ల అతడు వేగంగా తిరిగి వస్తాడు- అనే నిశ్చయాన్ని పొంది, అంతవరకు నేను ఓర్చుకొని ఉంటాననే నాయకి భావం వ్యక్తమవుతున్నది.

**"పఱత్తీర్"** - అనే సమాపకక్రియ భవిష్యత్కాలాన్ని తెలుపగల్గినదైనా, ఇక్కడ భవిష్యత్కాలాన్ని తెలుపదు. స్వభావాన్ని తెల్పుతుంది. (తద్ధర్మార్థక క్రియ) **"పోవదు"**- ఇది ఒక విధమైన **"వియజ్గోళ్"**. దేవాధిదేవుడైన భగవానుని దగ్గరకు చాలా అల్పులమైన మనం వెళ్ళి, దరిచేరడం అరుదు కదా- అని తుమ్మెదలు వెనుకంజ వేయకుండా ఉండడంకోసం **"నెయ్ త్తొడు వుణ్డేశుమ్ పడియన్న శెయ్యుమ్"** అని అంటూ అతని సౌలభ్యగుణాన్ని ముందుగా ప్రస్తావిస్తున్నారు. నేతిని ప్రస్తావించడం ఇంకా మిగిలిన పాలు, పెరుగు, వెన్న మొదలైనవానికి కూడా

ఉపలక్షణం. "ఏశుమ్బడి అన్న శెయ్యుమ్" అనేది "వెణ్ణెయ్ విழுఙ్గి వెఱుమ్ కలత్తై వెత్పిడై యిట్టు అదనోశై కేట్కుమ్" (వెన్నను ఆరగించి, రిక్తభాండాన్ని పగులగొట్టి అప్పుడు వచ్చే చప్పుడును వింటాడు), "ఇల్లమ్ పుకున్దు ఎన్‌మకళై క్కూవి క్కైయిల్ వళైయై కழற్ఱిక్కొణ్డు కొల్లైయిల్ నిన్ఱుమ్ కొణర్‌న్దు అఙ్గొరుత్తిక్కు అవ్వళై కొడుత్తు, నల్లన నావఱ్పழఙ్గళ్ కొణ్డు నానల్లే నెన్ఱు శిరిక్కిన్ఱానే" (ఇంటిలో ప్రవేశించి నాకూతురును పిలిచి, ఆమె చేతిలోని గాజులను తీసుకొని పోయి ఇంకొక గోపికకు ఆ గాజులను ఇచ్చి, మంచి నేరేడు పండ్లను ఆమె నుండి తీసికొని నేనేమి చేయలేదని అంటున్నాడే.) ఇత్యాదులలో చెప్పబడ్డ నిందించడానికి తగిన కార్యాలను దృష్టిలో పెట్టుకొని పలుకబడింది.

"ఎమ్మై చ్చేర్‌విక్కుమ్ వణ్డుకళే !" అనేది- మమ్ములను చేర్చగల శక్తి ఉన్నది మీకే- అని ప్రశంసించి పల్కిన సూక్తి.

ఆழ్వార్లు తమ విరహార్తిని ఆచార్యముఖంగా భగవానునకు తెలిపి, తమ దుఃఖాన్ని ఉపశమింపజేసికొనదలచి, వారిని పురుషకారం చేయడంకోసం ప్రార్థించడం- ఈ పాశురంలోని స్వాపదేశార్థం.

(వీశుమ్ శిఱకాల్ పఱత్తీర్)- "ఉభాభ్యా మేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః, తథైవ జ్ఞానకర్మభ్యామ్"- (రెండు రెక్కల ద్వారా పక్షులకు ఆకాశంలో సంచారము సాధ్యమయ్యేటట్లు, జ్ఞానులకు జ్ఞానకర్మలు రెండు మోక్షసాధనాలు.) అని జ్ఞానానుష్ఠానాలు రెండు ఱెక్కలుగా చెప్పబడ్డాయి. పక్షుల ఉన్నతగతికి వాటి రెక్కలు అత్యావశ్యకాలైనట్లే, ఆచార్యుల ఉన్నతగతికి జ్ఞానానుష్ఠానాలే ముఖ్యసాధనాలు కావడం గమనించాలి. పలు పుష్పాలు చెడని రీతిలో గ్రహించి, భుజించే స్వభావాన్ని కల తుమ్మెదలను, పలు శాస్త్రాలలో, గ్రంథాలలో అవగాహించి, వాటి సారమైన తత్త్వార్థాలను ఆ గ్రంథాలకు కీడు కల్గనట్లుగా గ్రహించి, అనుభవించే స్వభావాన్ని కల ఆచార్యులుగా పల్కడంలో అడ్డులేదు.

పురుషకారభూతులై ఉండి, భగవానుని వద్దకు చేర్పించే శక్తిని కల్గిన ఓ ఆచార్యులారా! మీరు జ్ఞానానుష్ఠానాలలో ఏ కొఱత లేనివారై ఉన్నారు- అని ఈ ప్రయోగభావం.

(విణ్ణాడుమ్ నుఙ్గట్కు ఎళిదు)- "ఞానమనుట్టాన మివై నన్ఱాకవే యుడైయ నాన గురువై అడైన్దక్కాల్, మానిలత్తీర్! తేనార్ కమల త్తిరుమాకమకళ్ కొழுనన్

తానే వైకున్దమ్ తరుమ్" (జ్ఞానం, అనుష్ఠానం - అనే ఈ రెండు చక్కగా గల్గిన ఆచార్యులను ఆశ్రయిస్తే, ఓ జనులారా! లక్ష్మీపతి స్వయంగా వైకుంఠాన్ని ఇస్తాడు.) అనే రీతిలో అటువంటి ఆచార్యుల శ్రీచరణాన్ని సేవించిన శిష్యునకు కూడా పరమపదం సులభమైనపుడు, ఇక ఆచార్యుని గూర్చి చెప్పాలా! ఆ పరమపదం కూడా మీకు కైవసంగా ఉన్నది- అని తాత్పర్యం.

**(పేశువ్బుడి అన్న పేశియుమ్ పోవదు)**- అటువంటి మీరు నాకోసం భగవానునివద్దకు పోయి, విన్నపించే మాటలను ఇపుడు నాకు చెప్పి వెళ్ళాలి- అనే సూక్తికి ఆ మాటలను విని అయినా దాసురాలను ఆశ్వాసాన్ని పొందుతాను- అని తాత్పర్యం. నమ్మాళ్వార్లు **"మత్తుఱు కడై వెణ్ణెయ్ కళవినిల్ ఉరవిడై యాప్పుణ్డు, ఎత్తిఱ మురలినోడు ఇణైన్దిరున్దేజ్గియ ఎళివే"** (నవనీతచౌర్యంలో రోటికి కట్టుబడి, ఏడ్చి, వెక్కిళ్ళు బెట్టిన స్వామిని సౌలభ్య ప్రకారం ఎంతగొప్పది?) అని శ్రీకృష్ణ చౌర్యంలో అభినివిష్టులై ఆఱునెలల కాలం మోహించి పడి ఉన్న స్వభావాన్ని కలవారు కనుక, ఇక్కడ కూడా **"నెయ్ తొడువుణ్డేశువ్బుడి అన్న శెయ్యుమ్ ఎమ్మీశర్"** అని అంటూ ఆ సౌలభ్యగుణాన్నే ప్రశంసిస్తూ పలికారు. దాసుల దోషాలను గమనించకుండా ఉండడమే భగవానుని శ్రీచరణపద్మం యొక్క దోషరాహిత్యం.

## నాయకి కేశసౌందర్యాన్ని నాయకుడు పొగడడం

**55. వణ్డుగళో! వమ్మిన్ నీర్పూ నిలపూ మరత్తిలొణ్ పూ,**
**ఉణ్డు కళిత్తుழల్ వీర్క్కొన్టురైక్కియమ్-, ఏనమొన్ఱాయ్**
**మణ్తుగళాడి వైగున్దమన్నాళ్ కుழల్వాయ్ విరైపోల్**
**విణ్డుకళ్ వారుమ్, మలరుళవో నుమ్ విలయలిడత్తే**

వణ్డుకళో = తుమ్మెదలారా!, వమ్మిన్ = రండి, నీర్ పూ = నీటిలో పూచే పూవు, నిలమ్ పూ = భూమిపై పూచే పూవు, మరత్తిల్ ఒణ్ పూ = వృక్షంపై పూచే గొప్ప పూవు- అనే వీటి అన్నిటిలోను, ఉణ్డు = (తేనెను) భుజించి, కళిత్తు = ఆనందించి, ఉழల్ వీర్క్కు = (అంతటా) సంచరించే మీకు, ఒన్ఱు ఉరైక్కియమ్= (మేమిపుడు) ఒక కొత్త విషయాన్ని చెబుతాము, ఏనమ్ ఒన్ఱు ఆయ్ = సాటి లేని ఒక వరాహమూర్తియై, మణ్ తుకళ్ ఆడి = భూమిలోని ధూళిని పూసికొన్న భగవానుని, వైకున్దమ్ = పరమపదాన్ని, అన్నాళ్ = పోలిన ఈ పరాంకుశనాయకి

యొక్క, కుఴల్ వాయ్ = కేశాలలో సహజంగా ఉండే, విరై పోల్ = పరిమళం వలె, విణ్డు = వికసించి, పరిమళం వీచే, కళ్ వారుమ్ = తేనెను తాగిన, మలర్ = పూలు, నుమ్ వియల్ అడైత్తు = మీ పరిపాలనకు లోబడిన (మీరు అడ్డులేకుండా సంచరించే) విశాలమైన చోట, ఉళవో = ఉన్నాయా?

**భావదీపిక :** ఈ పాశురం **"నలమ్ పారాట్టుదల్"** అనే ఆలంకారిక (శృంగార) ప్రక్రియలో రచింపబడింది. నాయకుడు నాయకిపట్ల తనకు కల్గి ఉండే ప్రేమను ఒక విధంగా వ్యక్తం చేయగోరి, ఆమె వైలక్షణ్యాన్ని అన్యాపదేశంగా ప్రశంసిస్తూ పల్కడమే ఇది. ఒక పూదోటలో ఒక వైపు నిలచి ఉండగా, ఆమె దరిచేరడానికి సంకోచించే నాయకుడు "ఈమెపట్ల నాకు గల ప్రేమను ఒకవిధంగా ఈమెకు నేను తెలియజేస్తాను. తర్వాత ఏమవుతుందో చూస్తాను" అని తలచి, అక్కడ ఉండే పలువిధాలైన పూలలో తేనెను ఆస్వాదించి, ఆనందంతో తిరిగే తుమ్మెదలను సంబోధించి, "మీరు అన్ని చోట్లకు పోయి "నీర్పూ, నిలపూ, కోట్టుపూ" - అనే రీతిలో పలువిధాలైన పూలను చూచి ఆస్వాదిస్తున్నారు కదా! వాటిలో ఏవి అయినా ఈమె కేశపాశంలోని సహజమైన సుగంధంతో సాటివచ్చే పరిమళాన్ని కల్గినవి ఉన్నాయా? చెప్పండి" అని పల్కి నాయకిపట్ల తన ప్రేమను వ్యక్తం చేసి, నాయకిని పొగడి, తన ప్రేమాతిశయాన్ని తెలిపాడు. **"మరుఙ్కుఴ లుమ్ కళివణ్డినఙ్గాళ్! ఉరైయీర్ మడన్దై కరుఙ్కుఴల్ నాఱు మెన్పోదుడై త్తోనుమ్ కడిపొఴిలే"** (నాయకి కేశపాశంలోని మధువును ఆస్వాదించే తుమ్మెదలారా! నాయకి నల్లని కేశపాశానికి గల సుగంధంతో ఉద్యానవనంలోని పూల సుగంధం సాటి వస్తుందా!) అని, **"మరుఙ్కుఴల్వాయ్ నీ యఱిది వణ్డే! శొల్లైనక్కు మజ్జై మరుఙ్కుఴల్ పోలుళవో విరైనాఱు కడిమలరే"** (నాయకి కేశపాశంలో సంచరించే తుమ్మెదలారా! ఈ కన్య కేశ సుగంధంవలె పూల సుగంధం ఉన్నదా!) అని గల అన్యకవుల పాశురాలు ఈ పాశురానికి సంవాదాలు.

పూలలోని వైలక్షణ్యాన్ని, పరిమళంలోని వైలక్షణ్యాన్ని, తేనెలోని వైలక్షణ్యాన్ని తెలిసిన మీరు, బయట ఉండే రసాస్వాదనలోని పరాకును విడిచి, నేను చెప్పే మాటను వినేటట్లుగా దగ్గరగా రండి- అని **"వణ్డుకళో! వమ్మిన్"** అని నాయకి పిలుస్తున్నది. **"కోట్టుపూ, కొడిపూ, నీర్పూ, నిలపూ"**- అనే నాల్గు రీతులలోని పూవులలో **"కొడిపూ"** అనేది 'నిలపూ'లో అంతర్భవిస్తుంది. **"పూదఱ్పూ"** అనేది కూడా ఇందులో చేరుతుంది. మహావరాహమూర్తియై, భూమిని దంతాగ్రంతో గుర్చి

ఎత్తిన వృత్తాంతం **"ఏన మొన్టాయ్ మణ్తుకళాడి"** అని అన్నందున చెప్పబడింది. ఇందులో, ఆ మహావరాహరూపానికి గొప్ప భూమి కూడా అంతా ఒక చిన్న కణంగా కన్పించడం స్ఫురిస్తుంది. **"పన్టియాయ్ ప్పడి ఎడుత్త పాళ్ళియా! యెన్బరదు, వెన్టియారునదెయిగ్గ్రిన్ మెన్తుకళ్ పోన్టిరున్దదాల్"** (వరాహమై భూమిని ఉద్ధరించిన ఓ బలశాలీ! అపుడు భూమి మీదంతాగ్రానికి అంటుకొన్న చిన్న ధూళికణం వలె తోచినది కదా!) అనే పిళ్ళైప్పెరుమాళ్ అయ్యంగార్ పాశురం గమనించదగినది. **"వైకున్ద మన్నాళ్"** అనేదానికి ఇక్కడ నశించని గుణాన్ని కల్గినదని అర్థం. **"కుళ్ళల్ వాయ్విరై"**- పూలుమొదలైన వాటిచే కల్గిన సోపాధికమైన పరిమళం కాకుండా, స్వాభావికమైన కేశపరిమళం- అని అర్థం. ఉత్తమజాతి స్త్రీల కేశాలకు సహజపరిమళం ఉంటుందని అంటారు.

**"వణ్డుకళో!"**- ఇక్కడ ఓకారం అధికంగా సంబోధన విభక్తిగా వచ్చింది. లేక, **"ఓ వణ్డుకళ్"** అనేది మాటిందని అనవచ్చు. **"వమ్మిన్"** - **"వా"** అనే పదం యొక్క అజ్ఞార్థకబహువచనరూపం. **"ఏవల్పన్మై"**. **"తుకళాడి"** -ఇది కృదంతరూపం కాదు. తద్ధితాంతం. **"కుళ్ళల్ వాయ్విరై"**- అనే ప్రయోగానికి కేశాలలో ఉండే పరిమళం- అనే అర్థాన్ని గ్రహిస్తే **"వాయ్"** అనేది సప్తమీవిభక్తి ప్రత్యయం. లేక, **"కుళ్ళలిల్ వాయ్న్ద పరిమళమ్"** (కేశాలలో గొప్ప పరిమళం) అనే అర్థాన్ని గ్రహిస్తే, **"వాయ్"** అనేది వినైత్తొకై (కర్మధారయం) **"విణ్డు"**- (వికసించి, వికసింపజేసి) **"తన్వినై, పిఱవినై"** (స్వార్థప్రేరణక్రియా రూపాలు) అనే రెండిటికి ఈ రూపం సాధారణం. **"పిళన్దు"**- (బ్రద్దలై, బ్రద్దలు చేసి) అనే ప్రయోగంవంటిదే ఇది. **"వియల్"** - ఇది విస్మృతిని తెలిపే సంబంధం వాచకం. **"ఉరిచ్చొల్"** **"వియలెన్ కిళవి అకలపొరుట్టే"** అనేది తొల్కాప్పియ ప్రమాణం.

భగవానునిపట్ల ఆళ్వార్లకు కల్గిన, అవధికి అతిక్రమించిన భక్తిని చూచిన భాగవతులు ప్రశంసిస్తూ పలికే సూక్తి -ఈ పాశురంలోని స్వాపదేశార్థం. పరతత్త్వాన్ని అన్వేషించి తిరిగే వారైన పారగ్రాహులను **"వణ్డుకళో! వమ్మిన్"** అని సంబోధించి పలుకబడింది.

**(నీర్ప్పూ నిలప్పూ మరత్తిలొణ్పూ వణ్డు కళిత్తుళ్ళల్వీర్క్కు ఒన్డురైక్కియమ్)**- **"నీర్ప్పూ"** అని అన్నందున పాలసముద్రంలో శయనించి ఉండే వ్యూహమూర్తి భావింపబడ్డాడు. **"నిలప్పూ"** అని అన్నందున భూమిపై అవతరించిన

రామకృష్ణాది విభవావతారాలు భావింపబడ్డాయి. **"మరత్తిలొణ్పూ"** అని అన్నందున వేదశాఖల శిరస్సులలో గోచరించే తేజోరూపియైన పరమపరనాథుడు భావింప బడ్డాడు. ఈవిధంగా ఇటువంటి భగవన్మూర్తుల ప్రకాశాన్ని దర్శించి ఆనందించి, ఈ లోకంలో అడ్డులేకుండా సంచరించే మీకు ఒక మాట పల్కు తున్నాము. ప్రళయకాలంలో భూమికి కల్గిన ఆపదను తీర్చిన భగవానుని నాశం లేని వైకుంఠనగరంవలె మహానందాన్ని కల్గించే ఈ ఆళ్వార్ల శిరోభూషణమై ఉండే భక్త్యతిశయం యొక్క కీర్తివంటి దానిని మీరెక్కడైనా చూచారా?- అని ప్రశంసిస్తూ భాగవతులు పలికారు- అనేది ఇచటి స్వాపదేశార్థం.

## నాయకుడు తనను రాత్రివేళ కలసిన వృత్తాంతాన్ని ఆమె సఖితో పల్కడం

**56.** **వియలిడముణ్డపిరానార్ విడుత్త తిరువవరుళాల్,**
**ఉయలిడమ్ పెఱ్ఱుయ్న్ద మఞ్జలమ్ తోழி-, ఓర్ తణ్తెన్ఱల్ వన్దు**
**అయలిడైయారు మఱిన్దిలర్ అమ్బూన్దుழாయినిన్ తేన్**
**పుయలుడై నీర్మైయినాల్, తడవిఱ్ఱెన్ పులన్ కలనే**

వియల్ = విశాలమైన, ఇడమ్ = లోకాలను, ఉణ్డ = ఉదరంలో గ్రహించిన, (భుజించిన), పిరానార్ = ప్రభువైన భగవానుడు, విడుత్త = మాపట్ల విడిచిన (చూపిన), తిరు అరుళాల్ = గొప్ప కరుణచేత, ఉయల్ ఇడమ్ పెఱ్ఱు = ఉజ్జీవించడానికి అవకాశాన్ని పొంది, ఉయ్న్దమ్ = ఉజ్జీవించాము, అఞ్జలమ్ = (ఇక ఉత్తరదిశలోని వాయువు మొదలైనవానికి) భయపడబోము, తోழி = సఖీ!, ఓర్ తణ్ తెన్ఱల్ వన్దు = ఒక చల్లని దక్షిణదిశలోని గాలివచ్చి, అయలిడైయారుమ్ అఱిన్దిలర్ = దగ్గరలో ఉండే ఎవ్వరూ తెలియని రీతిలో, అమ్ పూ తుழாయిన్ ఇన్ తేన్ = అందమైన పూలను కల తులసిలోని భోగ్యమైన తేనె బిందువులను, పుయలిడై నీర్ మైయినాల్ = వర్షం నీటి బిందువులను చిందించినట్లుగా చిందించే స్వభావాన్ని కల్గినదై, ఎన్ = నా, పులన్ = అవయవాలలోని, కలన్ = ఆభరణాలను, తడవిఱ్ఱు = స్పృశించింది.

**భావదీపిక :** నాయకుడు రాత్రివేళ వచ్చి కలసిన విషయాన్ని నాయకి తన సఖితో పల్కడం ప్రస్తుత పాశురంలోని అంశం. తన విరహార్తిని చూచి కలత చెంది పల్కిన సఖిని ఉద్దేశించి నాయకి రాత్రివేళ నాయకుడు తనను కలసిన

విషయాన్ని మలయమారుతం పై ఆరోపించి పల్కిన పాశురం **"తన్ ఆర్ర్రామైక్కు క్కలజ్గి యురైత్త తోழியై క్కుఱిత్తు త్తలైవి ఇరవిడత్తు త్తలైమకన్ కలన్దమైయై త్తెన్డల్ మేల్ వైత్తు ఉరైత్త పాశురమ్"** (తన విరహార్తికి కలత చెంది పల్కిన సఖిని ఉద్దేశించి నాయకి రాత్రివేళ తనతో నాయకుడు సంశ్లేషించిన విషయాన్ని చల్లగాలిపై ఆరోపించి పలికే పాశురం) అని అழகియమణవాళ చ్చీయర్ ఉరైలోని సూక్తి గమనించదగినది. మలయమారుతంపై ఆరోపించి పల్కడం ఏమంటే- నాయకుడు ప్రేమతో వచ్చి కలసిన విషయాన్ని వ్యక్తంగా పల్కడానికి సిగ్గుపడి, మలమారుతంపై ఆరోపించి, సూచనగా పల్కడమే.

"నా విరహక్లేశాన్ని అనుసంధించి బాధపడే ఓ నా సఖీ! నాయకుని దయవల్ల నేను ఉజ్జీవించడానికి ఒక అవకాశాన్ని పొంది ఉజ్జీవించాను. ఇక **"వాడై"** (ఉత్తర దిశలోని గాలి) మొదలైన వానికి భయపడనక్కరలేదు. ఎందుకు? అంటే, ఒక చల్లని మలయమారుతం ఇరుగుపొరుగు తెలియకుండా ఏకాంతంగా నాయకుని తులసీమాలికలో ఉండే తేనెకణాలను గ్రహించి, నా అవయవాలలో, ఆభరణాలలో ప్రసరించి తాకి, నా ఆర్తిని ఉపశమింపజేసింది సుమా!''- అని అన్నది, నాయకి. విశ్లేషించిన కాలంలో చాలా వేడిగా ఉండి బాధించిన మలయ మారుతం చల్లగా ఉండేటట్లుగా నాయకుడు వచ్చి, తన తులసీమాలికలోని తేనె నా అంగాలలోను, ఆభరణాలలోను చిందేటట్లు తడవి స్పృశించి, ఆలింగనం చేసికొన్నాడని భావం.

**"విడలిడ ముణ్డ పిరానార్ విడుత్త తిరువరుళాల్"** అనే ప్రయోగంలోని అంతరార్థం ఏమంటే- దుఃఖసాగరంలో మునిగి తపించే నన్ను ఈ విధంగా అతడు కాపాడడం -ప్రళయసాగరంలో మునిగిన లోకాలను తన ఉదరంలో పెట్టుకొని రక్షించినట్లుగా ఉన్నది- అని **"ఉయ్న్దమ్"- "ఉయన్దనమ్"** (ఉజ్జీవించాము) అని అర్థం. **"అన్"** అనే **"శారియై"** (ప్రత్యయం) చేరని ఉత్తమపురుష బహువచనంలోని భూతకాలిక సమాపకక్రియారూపం. **"అఞ్జలమ్"**- ఇది ఉత్తమపురుష బహువచనంలో వ్యతిరేకార్థక సమాపకక్రియా రూపం. **"తన్మైప్పన్మై ఇఱన్దకాలవినైముర్ర్రు"**. **"అఞ్జల్ అమ్తోழி"** అని విడదీసి, అందమైన సఖీ! నా విరహార్తి కోసం నీవు కలత చెందకు- అని కూడా వివరించవచ్చు. అపుడు **"అఞ్జల్"** - వ్యతిరేకార్థక ఏకవచనంలోట్ రూపం. **"ఎదిర్మఱై ఒరుమై ఏవల్"** లోకంలో సాధారణంగా కన్పించే మలయ మారుతం వలె కాకుండా, సాటి లేనిదై, తన రాకతోనే నా ఆర్తి అంతా ఉపశమించే టట్లుగా మిక్కిలి చల్లనిదనాన్ని కల్గినదై, నూతనమైనది ఒకటి వచ్చింది- అని

అంటూ- **"ఒర్ తణ్ తెన్రల్ వన్దు"** అని పల్కింది. ఇంతవరకు మలయమారుతానికి క్లేశపడిన నాయకి ఇపుడు మలయమారుతం రాకకు ఆనందించి పల్కినందున, నాయకుని రాకనుగూర్చి ఆమె పల్కిందని సఖి గ్రహించి, "ఈ రహస్య ప్రకారాన్ని ఇతరులు, ఇరుగు పొరుగువారు తెలిస్తే చాలా పెద్ద అపవాదు వస్తుంది- అని భయపడవచ్చు. ఆ విధంగా భయపడకుండా ఉండడం కోసం **"అయలిడైయారుమ్ అఱిన్దిలర్"** అని నాయకి అంటున్నది. నాయకుని అనుగ్రహప్రకారాన్ని ప్రశంసించడం తెలిసేటట్లుగా **"పుయలిడై నీర్మైయినాల్"** అని అన్నది. **"మలైయిన్ తన్మైయినాల్"** అనేదానికి - వర్షం కురిసేటట్లుగా- అని భావం. **"కలన్"** - **"అణికలమ్"** (ఆభరణాలు) **'పొలన్ కలన్"** అనే పాఠం అయితే, బంగారంతో చేయబడిన ఆభరణాలని అర్థం. **"పొలన్"** - **"పొన్"** అనే పదంయొక్క వికృతి అయిన **"పొలమ్"** అనేదాని **"ఇఱుదిప్పొలి"**, **"తడవిన్ఱు ఎన్పులన్ కలనే"** అనేదానికి పెరియవాచ్చాన్ పిళ్ళైవ్యాఖ్యాన శ్రీసూక్తిని గమనించండి. **"ఇన్ద్రియజ్గళ్ విడాయ్ తీరవుమ్, ఆభరణమ్ కழలాదపడియుమ్ తడవిన్ఱుప్పోలే కాణుమ్"** (ఇంద్రియాల ఆర్తి తీరేటట్లు, ఆభరణాలు కదలని రీతిలో నాయకుడు నన్ను స్పృశించాడు సుమా!) అనేది ఆ సూక్తి. **"తోழీ"** -సమీపసంబోధన, **"విడుత్త"** విడిచిన - కలిగేటట్లు చేసిన - అని భావం. **"అఱిన్దిలర్"**- ఇది వ్యతిరేకార్థక సమాపక క్రియ (**"ఎదిర్మఱై వినైముఱ్ఱు"**).

ఆழ్వార్లు, భగవానుని దరిచేరి దర్శించి ఆనందించలేక క్లేశపడేటపుడు, ఆ క్లేశం తీరడంకోసం భగవానుడు ఒక పర్యాయం వారి దగ్గరకు వచ్చి దర్శనాన్ని ఇచ్చి, వారిని తన దరికి చేర్చుకొనే స్వభావాన్ని వ్యక్తం చేశాడు. అపుడు ఆழ్వార్ల కేశం ఉపశమించగా, పూర్వం తాము పొందిన విరహక్లేశాన్ని చూచి కలతచెందిన భక్తులను ఉద్దేశించి పలికే సూక్తి - ఈ పాశురంలోని స్వాపదేశార్థం. ఆపత్స మయంలో ఉపకారం చేసేవాడైన స్వామియొక్క సాటి లేని, అంతు లేని అనుగ్రహం చేత ఒక అవకాశాన్ని పొంది, ఉజ్జీవనాన్ని పొందాము. ఇకపై లౌకిక పదార్థాలకు భయపడనక్కరలేదు. ఉన్నతోన్నతుడైన ఆ స్వామి ఇతరులకు ఎవ్వరికీ కన్పించకుండా వచ్చి తన భోగ్యతను నాకు వ్యక్తం చేసి, నా క్లేశం అంతా తీరేటట్లు నా అంగాలను, జ్ఞానాదికల్యాణగుణాలనే అలంకారాలను ఆశపడి స్వీకరించాడు- అని పల్కి తమ భక్తులకు ఆశ్వాసాన్ని కల్గించిన క్రమం ఇది.

**"వియలిడ ముణ్ణ పిరానార్"** (విశాలమైన భూమిని ఆరగించిన స్వామి) అని భగవంతుని ఉద్దేశించి పరాంకుశ నాయకి పల్కిన సూక్తిని వివరించే పెరియవాచ్చాన్‌పిళ్ళై- ప్రళయ జలంలో చిక్కుకొన్న భూమిని రక్షకులెవరూ లేనప్పటికీ తానే వచ్చి ఉపకారం చేసినవాడు- అని అంటూ, ఆ సందర్భంలో ఒక సంవాదాన్ని ఉదాహరించారు.

శ్రీరామానుజులు వేంచేసి ఉండే సమయంలో అక్కడకు వారిని సేవించాలని వచ్చిన వారిలో ఒక విచారం ప్రస్తుతమైనది. "మనం ఉజ్జీవించడానికి రక్షకంగా భావించదగినది ఏది?" అనే ప్రశ్నరాగా, దానికి వంగిపురత్తునంబి- అనే ఆచార్యులు ''క్షత్రబంధువు పల్కినమాటయే మనం భావించదగినది'' అని అన్నారు. **"మూఢోయ మల్పమతిః అల్పవిచేష్టితోయమ్, క్లిష్టం, మనోస్యవినయైర్నమయి ప్రసంగి, ఇత్థం కృపాం కురు మయి ప్రణతేఖిలేశ, త్వాం స్తోతుమంబుజ భవోపి హి దేవ! నేశః"** (విష్ణుధర్మమ్ - 98-33) (సర్వేశా! ఇతడు అల్పజ్ఞుడు, అల్పకార్యాలను చేసేవాడు ఈ మనస్సు దుష్కార్యాలలో ఆసక్తమవుతున్నది. నాకు కట్టుబడడం లేదు. నిన్ను నమస్కరించే నాపట్ల నీవు దయ చూపాలి. బ్రహ్మకూడా నిన్ను స్తుతించడానికి సమర్థుడు కాడు) అని పల్కిన క్షత్రబంధువు వచనాలనే మనం కూడా ఎల్లప్పుడు భావించాలి- అని వంగిపురత్తునంబి అన్నారు.

అపుడు శ్రీరామానుజులు - "ఆ వచనాలు చాలవు. తనది- అనేదీ ఏదీ లేనివాడుగా సర్వజ్ఞుడైన భగవాను మనస్సులో ఇతడు పడాలి. క్షత్రబంధువు పల్కిన మాటలో **"ఇత్థం కృపాం మయి కురు ప్రణతే"** (ఈవిధంగా నిన్ను నమస్కరించే నాకు అనుగ్రహించాలి) అని అన్నది కదా! (అందువల్ల భగవానుని కృపను పొందడానికి తాను నమస్కరించడాన్ని హేతువుగా పలికే క్షత్రబంధువు పల్కిన వచనం రక్షకం కాదు) మనం ఏదో ఒక పనిని చేసి, దానివల్ల ఫలాన్ని పొందుతున్నాము - అనే భావం కల్గితే, తర్వాత ఆ పనిని చేయడానికి శ్రమకల్గి, ఆ ప్రయోజనం కూడా కల్గకుండా పోతుంది. మనవద్ద ఏదయినా ఒక యోగ్యత అనేది ఒకటి ఉన్నట్లయితే, అది అతడు ఏకారణం లేకుండా మనకు చేసే కృపను మనం అడ్డుకోకపోవడం- అనే లెక్కలోకి వస్తుందే తప్ప, అతడు కృపజేయడానికి ఆయోగ్యత ఉపాయానికి సహకరించేదిగా కాబోదు. "నీవు ఉపాయంగా కావాలి'' అనే భావన అత్యంతావశ్యకం అయినా, ఆ భావనకూడా అతనివల్లనే కల్గుతుంది-

అని భావించాలి. ఇతని (భక్తుని) వద్ద పరమభక్తి పర్యంతం ఉన్నా, అది ఇతనికి భగవానుని అనుభవించడానికి సహకరించే రుచిలో అంతర్భవిస్తుందే తప్ప, అది తానే స్వయంగా నిలచి ఇతడు ఆశించిన ఫలాన్ని ఇవ్వడానికి ఆ పరమభక్త్యాదులు శక్తిని కల్గినవి కావు. భగవానుడే ఆ శక్తిని కల్గినవాడు కనుక, క్షత్రబంధువు పల్కిన మాట రక్షకంకాదు- అని అన్నారు. "అయినా మఱి ఏది రక్షకం ?" అని ప్రశ్నించగా, "కాళియుడు పల్కిన మాటయే రక్షకంగా భావించడం తగును" అని అన్నారు. ఆ వచనం ఏమంటే- **"సోహం తే దేవదేవేశ! నార్చనాదౌ స్తుతౌ న చ, సామర్థ్యవాన్ కృపామాత్రమనోవృత్తిః ప్రసీద మే"** (ఓ దేవదేవా! దేవరవారిని అర్చించడంలో, స్తుతించడంలో నేను సామర్థ్యాన్ని కలవాడను కాను. అటువంటి నాకు నీవే కృపను కల మనస్సును కలవాడవై అనుగ్రహించాలి) అని పల్కిన కాళియుని వచనమే మనకు రక్షకం- అని శ్రీరామానుజులన్నారు.

దీని భావమేమంటే - భగవానుడు అనుగ్రహించడానికి తాను నమస్కరించడం కారణంగా (సాధనంగా) క్షత్రబంధువు పలికాడు కనుక, ఆ మాటలు మనకు రక్షకంకాదు. అయితే, కాళియుడు, శ్రీకృష్ణుని తిరుమేనికి తన శరీరాన్ని చుట్టి బంధించిన ఆ వైరకృత్యం నుండి విరమించడానికి ముందే, "నీవే మనస్సులో ప్రసన్నుడవై నాకు అనుగ్రహించాలి" అని పల్కడం ద్వారా, ఆ విరోధకృత్యంనుండి నివర్తించే భావాన్ని కూడా అతడే తనకు అనుగ్రహించాలి- అని వేడుతున్నాడు. అందువల్ల, తన ప్రయత్నాన్ని సాధనంగా పల్కి క్షత్రబంధువు వచనంకంటే, భగవానునే సాధనంగా గ్రహించి, అతని నిర్హేతుక కృపను వేడిన కాళియుని మాటయే రక్షకం- మనం నిత్యం భావిచదగినది- అని శ్రీరామానుజుల అభిప్రాయం నమ్బిళ్ళై వ్యాఖ్యానంలో కూడా ఈ ఐతిహ్యం ఉన్నది. తిరుప్పావై 29వ పాశురానికి నాలాయిరప్పడి వ్యాఖ్యలో ఈ ఐతిహ్యం ప్రస్తావింపబడినా, అక్కడ ఆళవందార్ పల్కిన సూక్తిగా తెలుపబడింది.

### నాయకుడు స్నేహితుని వచనాలను నిషేధిస్తూ పల్కడం

57. పులక్కుణ్డల ప్పుణ్డరీగత్త పోర్ క్కేణ్ణై, వల్లియొన్టాల్
విలక్కుణ్డులాగిన్ఱు వేల్ విழிక్కిన్ఱన-, కణ్ణన్ కైయాల్
మలక్కుణ్డముదమ్ శురన్ద మఱికడల్ పోన్ఱవఱ్ఱాల్
కలక్కుణ్డ నాన్ఱు కణ్డార్, ఎమ్మై యారుమ్ కழఱలరే

పులమ్ కుణ్డలమ్ = అందమైన కుండలాలను కల్గిన, పుణ్డరీకత్త = తామరపూవువంటి నాయకిముఖంలో ఉండే, పోర్ కెణ్డై = (తమలో ఒక దానితో ఇంకొకటి ఎదిరించి) యుద్ధం చేసే రెండు బేడిసచేపలవంటి కన్నులు, వల్లి ఒన్రాల్ విలక్కుణ్డు = (నాసిక అనే) ఒక తీగచేత అడ్డగింపబడి, ఉలాకిన్ర = (ఒకదానిపై ఇంకొటి కోపగించుకొని) చలిస్తూ, వేల్ విழిక్కిన్రన = వేలా యుధంతో గుచ్చినట్లుగా బాధిస్తూ చూస్తున్నాయి, కణ్ణన్ = భగవానుని, కైయాల్ = శ్రీహస్తాల చేత, మలక్కుణ్డు = చిలికి, కలత పొందింపబడి, అముదమ్ శురన్ద = (తనలో ఉండే) అమృతాన్ని వ్యక్తం చేసిన, మఱి కడల్ పోన్రు = అలల విజృంభణను కల సముద్రం వలె, అవర్రాల్ కలక్కుణ్ణ నాన్రు = ఆ నేత్రాలచే మేము కలతను పొందింప బడినపుడు, కణ్డార్ = (ఆ నేత్రాల సన్నివేశాన్ని ప్రత్యక్షంగా) దర్శించినవారు, యారుమ్ = ఎవరు, ఎమ్మై = మమ్ములను, కழఱలర్ = (ఒకతె కంటిచూపులో చిక్కుకొని ఈ విధంగా కలత పొందాడు- అని) దోషాన్ని పలుకరు. (నిందించరు).

**భావదీపిక** : ఈ పాశురంలోని ద్రావిడాలంకార రీతి ఏమంటే- **"తలైవన్ పాఙ్గనుక్కు క్కழఱ్ఱైదిర్ మఱుత్తల్"** -అనేది. (నాయకుడు స్నేహితునితో అతని మాటను కాదని నిషేధించి పల్కడం) దీని భావమేమంటే- దైవవశంచేత నాయకిని కలసి, తర్వాత కల్గిన విరహవ్యసనంచేత చాలా కృశించి ఉండే నాయకుని చూచిన అతని స్నేహితుడు "ఈమధ్యలో నీవు ఈవిధంగా కృశించి పోవడానికి కారణమేమి?'' అని ప్రశ్నించాడు. అపుడు, స్నేహితుని దగ్గర నిజాన్ని దాచిపెట్టకూడదు కనుక, "నేను ఒక యువతి వలలో చిక్కుకొన్నాను సుమా!'' అని నాయకుడు యథార్థాన్ని పలుకగా, దానిని విన్న స్నేహితుడు "సముద్రంవలె గంభీరుడవైన నీవు ఒక ఆడదానికోసం ఈ విధంగా అయ్యావు- అనేది నీ గొప్పతనానికి తగదు సుమా'' అని అన్నాడు. దానికి బదులుగా నాయకుడు "నేను చూచిన రూపాన్ని నీవు చూడలేదు. చూచినవారెవరైనా ఈ విధంగా వ్యర్థవచనాలను పలుకరు. అటువంటి పరమవిలక్షణమైన వ్యక్తికదా, ఆమె- అని అంటూ అతని మాటను కాదని బదులుపల్కడం. **"కాణిల్ కழఱలై కణ్డిలై మెన్ తోట్కురుమ్బినైయే"** (మృదువైన బాహువులను కల, చెఱకువలె భోగ్యురాలైన నాయకిని నీవు చూడలేదు. చూస్తే నీవు నన్ను నిందించవు) అనే తిరుక్కోవైయార్ పాశురం స్మరణీయం.

సఖుడా! ఆ నాయకి ముఖం ఎటువంటిదో తెలుసునా? అందమైన కుండ లాలను కల్గినదై, తామరపూవువంటిది. ఆ ముఖంలోని కన్నులు ఎటువంటివో

తెలుసునా ? తమతో పరస్పరం స్పర్ధించే రెండు బేడిస చేపల వంటివి. అటువంటి నేత్రాలు రెండు ఒకదానిపై ఇంకొకటి పడి మర్దించాలి- అనే మాత్సర్యాన్ని కల్గినప్పటికీ, నాసిక - అనే ఒక తీగచేత అడ్డగింపబడినందున, పరస్పరం కోపాన్ని పొంది, ఆకోపంతో ప్రత్యేకప్రత్యేకంగా చలిస్తూ, వేలాయుధంతో గుచ్చినట్లుగా బాధించేవై నన్ను చూస్తున్నవి. అటువంటి నేత్రాలతో నాయకి నన్ను వీక్షించినపుడు వాటివల్ల నేను కలతను పొందిన విధం ఏవిధంగా ఉన్నది? అంటే- శ్రియఃపతి సముద్రాన్ని చిలికిన కాలంలో అలలు ఉవ్వెత్తున లేచిన ఆ సముద్రం కలత పొందిన రీతిలో ఉన్నది. ఆ విధంగా నేను కలత పొందినపుడు ఆ నేత్రాల సన్నివేశాన్ని ప్రత్యక్షంగా చూచినవారు ఎవరైనా ఉంటే, వారు ఏనాడూ ఒక్కసారి కూడా నన్ను ఈ విధంగా గర్హిస్తూ పలుకరు సుమా! నేత్రసౌందర్యాన్ని కల్గిన ఈమె విషయంలో అభినివేశాన్ని పొందిన నీవు ప్రాణాలను పోగొట్టుకోకుండా ప్రాణాలను ధరించి ఉండగల్గడం ఎంతో విశేషం సుమా!- అని పలికేటట్లుగా ఉంటుంది. కావాలంటే ఆ కన్నుల అందాన్ని నీవొకసారి దర్శించి చూడు- అని అన్నట్లయినది.

వాలివధ అనంతరం శ్రీరాముడు వర్షాకాలాన్ని గడపడానికి మాల్యవంత పర్వతంలో నివసించి ఉండేటపుడు సీతాదేవిని స్మరించి, స్మరించి, అతడు పడే పాట్లను చూచిన హనుమంతుడు "అయ్యో! వశిష్ఠమహర్షి శిష్యుడేనా ఇతడు! **"సముద్ర ఇవ గాంభీర్యే"** అని అంటూ సముద్రంవలె గాంభీర్యాన్ని కలవాడని పొగడబడినవాడు ఇతడేనా! ఒక స్త్రీకారణంగా ఇంతగా బాధపడి విలపిస్తున్నాడే!- అని గర్హించాడు. తర్వాత లంకలో ప్రవేశించి, అశోకవనంలో సీతాదేవియొక్క లోకోత్తరమైన దివ్యరూపాన్ని దర్శించిన తరువాత ఆ హనుమంతుడే **"దుష్కరం కృతవాన్ రామో హీనో యదనయా ప్రభుః, ధారయత్యాత్మనో దేహం న శోకేనావసీదతి"** (ఆహా! ఇతడు దుష్కరమైన కార్యాన్ని కదా చేశాడు. ఎందుకంటే, అటువంటి సీతాదేవిని విశ్లేషించి, దూరమయ్యాడే! అతడు ఏనుగులను అశ్వాలను అధిరోహించడం నేర్చినవాడే కాక, కామశాస్త్రంలో కూడా విదగ్ధుడు కాబోలు. ఈమెను విశ్లేషించిన తరువాత కూడా పాడు దేహాన్ని ఎందుకో ఇంకా మోస్తూ బతికి ఉన్నాడు. ఈమె విరహానికి తగినట్లు అతడు పరితాపపడడం కన్పించలేదే!) అని అన్నాడు. ఆ విషయం ఇక్కడ స్మరణీయం. నేను చూచిన నాయకిని నీవు చూడగల్గితే ఆ హనుమంతుడు పడిన పాట్లను పడతావు సుమా !- అని తాత్పర్యం.

**"పులక్కుణ్డలమ్"** - **పులప్పడుదల్** - **కాణప్పడుదల్**- దర్శింపబడడం. అందువల్ల ఆశపడి దర్శింపబడేటట్లుగా ఉండే అందమైన కుండలాలు- అని దీని భావం. **"పులప్పడుదల్"**- **విళఙ్గుదలుమామ్** (ప్రకాశించడం- అని కూడా అర్థం.) **"పొలక్కుణ్డలమ్"** అనే పాఠానికి బంగారంతో చేయబడిన కుండలాలు- అని అర్థం. **"కుణ్డలమ్"** అనే దానిని **"కెణ్డై"** కు విశేషణంగా చేసి కర్ణాభరణాల పర్యంతం పాకి (అలావి) ప్రసరించే దీర్ఘమైన నేత్రాలు- అని వివరించవచ్చు. **"కుణ్డల పుణ్డరీకమ్"**- గుండ్రని రూపంలోని ముఖమండలం- అని కూడా అర్థం. పుండరీకంవంటి ముఖం - అని, **"కెణ్డై"** వంటి కన్నులు అని, తీగవంటి ముక్కు అని చెప్పవలసిన చోట్లలో మూడు ఉపమేయాలను నిర్దేశించకుండా, ఉపమాన పదాలతోనే పల్కడం గమనార్హం. ఈ ఉపమానపదాలద్వారా ఉపమేయాలు లక్షింపబడతాయి. అందువల్ల ఇవి **"ఉవమైయాకుపెయర్"**, (ఉపమేయాన్ని లక్షించేపదాలు) ఎఱ్ఱదనం, అందం, సువాసనను కల్గి ఉండడం మొదలైన గుణాలవల్ల ముఖానికి తామర ఉపమానం.

ఈ పాశురంలోని పూర్వపాదాలను ఇంచుమించుగా దృష్టిలో పెట్టుకొనే భట్టర్ శ్రీరంగరాజస్తవంలో **"శ్రవో నాసారోధాత్ తదివధికడోలాయితగతే, మిథో బద్ధస్పర్ధ స్ఫురిత శఫరద్వంద్వలలితే, ..... క్రియాస్తాం శ్రీరంగప్రణయినయనాబ్జే మయి దయామ్"** (చెవులు, ముక్కు - అనే ఇవి అడ్డగించుటవల్ల వాటివరకు ఊగిసలాడేవి, విశాలమైనవి, పెద్దవి, పొడుగైనవి, పరస్పరం స్పర్థించేవి, అందువల్లనే తుళ్లిపడే చేపలవలె ముచ్చట గొలిపేవి అయిన శ్రీరంగనాథుని పద్మాల వంటి నేత్రాలు నా పట్ల దయ చూపాలి.) అనే శ్లోకాన్ని రచించారని గ్రహించాలి.

**"వల్లియొన్లాల్ విలక్కుణ్ణులాకిన్లు"** అనే ప్రయోగానికి "రెండు మత్తగజాలు తమలో తాము స్ఫురించాలని ప్రయత్నించి, మధ్యలో అడ్డు తగులగా (**"కణైయ మిట్టవాతే"**) తాము తలచిన రీతిలో పోరు సల్పడానికి వీలు లేనందున చాలా కోపంతో సంచరించేటట్లుగా నిలచి'' అనేది పూర్వుల వ్యాఖ్యానం. నాయకి కన్నులు తనను బాధించే రీతిలో పదునైన చూపులను కల్గినవై ఉన్నాయి- అనే విషయం **"వేల్ విழிక్కిన్దన"** అనే ప్రయోగం ద్వారా తెలుపబడింది. ఆ కాఠిన్యం ఇంకా మాఱలేదు- అనే విషయం స్ఫురించేటట్లు **"విழிక్కిన్దన"** అని వర్తమానకాలిక ప్రయోగం చేయబడింది. **"వేల్ విழிక్కిన్దన"** అనేది **"ఉవమైత్తొకై"** రూపకసమాసం. భగవానుడు గంభీరమైన సముద్రాన్ని చిలికి, అందలి సారమైన అమృతాన్ని

ఉద్ధరించి తీసికొనిపోయినట్లుగా నాయకి కన్నులు కూడా గంభీరమైన నా మనస్సును కలత పొందించి (చిలికి), సారమైన అమృతాన్ని తీసికొనిపోయాయి- అనే భావాన్ని పాశురంలోని ఉత్తరార్ధంలో నిశితంగా గమనించి తెలియాలి. నేను విస్తరించి పల్క ఏమి ప్రయోజనం? ఆ నేత్రాల వైలక్షణ్యం అనుభవించినవారికి తప్ప, అన్యులకు తెలియరానిది. - అనే భావం చివరి పాదంలో స్ఫురిస్తుంది. **"యారుమ్"**- గొప్ప వైరాగ్యంతో వివేకాన్ని కలవారుకూడా- అని ప్రకృత భావం. **"మఱికడల్ పోన్దవఱ్ఱాల్"** అనే చోట **"పోన్దు అవఱ్ఱాల్"** అని అభజించకుండా **"పోన్దవఱ్ఱాల్"** అని ఒకే పదంగానే గ్రహించి, శ్రియఃపతిచే మథించబడి, అమృతాన్ని ఇచ్చిన అలలు ఎగసిపడే సముద్రంవంటి కన్నులతో- అని కూడా వ్యాఖ్యానించవచ్చు. తన అందాన్ని చూచి కలత చెంది, వ్యామోహాన్ని పొంది చూచిన నేత్రాలకు- శ్రీకృష్ణుని చేతులతో కలతను పొందిన సముద్రం ఉపమానం- అని కూడా అంటారు. **"కణ్డార్ కళఱలర్"** అని అన్నందున చూచినవారుకూడా తనవలె పిచ్చెక్కిపోతారు- అనేది సూచింపబడింది.

ఇక, ఈ పాశురానికి స్వాపదేశార్థం వివరింపబడుతున్నది. ఆళ్వార్ల జ్ఞాననేత్రప్రకాశాన్ని తెలిసి అభినివేశాన్ని పొందిన భాగవతులు, తమ అభినివేశాన్ని చూచి, దానిని తక్కువ చేయాలని నియమిస్తూ పలికే తమ బంధువులను ఉద్దేశించి వారి మాటలను ప్రతిషేధిస్తూ పలికే మాట--ఈ పాశురం. ముక్తికి కారణమైన భగవానునిగూర్చి తెలియడానికి మూడు ఉపాయాలు ఉన్నాయి. అవి- శ్రవణం, చింతనం, దర్శనం- అనేవి. వాటిలో **"కేళ్వి"** (శ్రవణం) అనేది ఉపదేశ సూక్తులను అనుభవాన్ని కల ఆచార్యుల సన్నిధిలో శ్రవణం చేయడం. చింతనమనేది- ఆ ఉపదేశవచనాల అర్థాలను ప్రమాణాలతో, యుక్తులతో మనస్సులో బహుముఖంగా స్పష్టంగా విచారణ చేయడం. దర్శనమనేది- ఈ చింతనసామర్థ్యం చేత భగవానుని భ్రమ, సందేహాదిరహితంగా తెలిసికోవడం (దర్శించడం) స్వాపదేశంలో- ఆళ్వార్ల నేత్రమనే జ్ఞానం- క్రమంగా ఈ మూడు ఉపాయాలతోను కూడి ఉండడం ఈ పాశురంలోని మొదటి వాక్యంలో స్పష్టమవుతుంది. ముందుగా, **"పులక్కుణ్డలమ్"**అని కర్ణాభరణాన్ని ప్రస్తావించినందున పూర్వోక్తాలైన మూడు ఉపాయాలలో మొదటిది అయిన కర్ణాభరణమైన శ్రవణం సూచింపబడింది. దానికి తరువాత **"పుణ్డరీకమ్"** అనేది హృదయకమలాన్ని సూచిస్తూ శ్రవణానంతరం మనస్సులో భావించడమనే మననం సూచించబడింది. **"పోర్ క్కెణ్డై"** అనేది ఆ రీతిలో భావన

చేసేటపుడు పూర్వపక్ష సిద్ధాంతయుక్తులతో ఒకదానితో ఇంకొకదానికి విరోధాన్ని కల్పించి చేసే విచారణను సూచిస్తుంది. "వల్లియొన్టాల్ విలక్కుణ్ణులాకిన్టు" అనేది మధ్యస్థమైన సిద్ధాంతయుక్తితో ఆ విరోధం ఉపశమింపజేయడం సూచిస్తుంది. "వేల్ వి*ఴ*క్కిన్టన" అని అన్నందున ఈవిధంగా శ్రవణమననాలతో ఏవిధమైన చలనం లేకుండా ఒకే రీతిగా నిలకడగా ఉండే జ్ఞానం నైశిత్యాన్ని, దైర్ఘ్యాన్ని కల్గినదై, భగవానుని సాక్షాత్కరించుకోవడాన్ని సూచిస్తుంది. శ్రీకృష్ణుని శ్రీహస్తాలతో కలతను పొంది అమృతాన్ని స్రవించిన అలలతో నిండిన సముద్రంవలె చపలచిత్తులమైన మేము ఇటువంటి ఆ*ఴ్*వ్వార్ల జ్ఞానవిశేషంచేత పారవశ్యాన్ని పొంది, భోగ్యమైన భక్తి వ్యక్తమై, స్థితి మాఱినందున ఆ ఆ*ఴ్*వ్వార్ల జ్ఞానస్థితిని తెలిసినవారెవరూ మమ్ములను ఈవిధంగా పలుకరు- అనేది అనంతర వాక్యంలోని అంతరార్థం. **"పోన్టవ*ఱ్ఱా*ల్"** అనే దానిని ఒకే పదంగా గ్రహించినపుడు, శ్రీకృష్ణుని హస్తాలచే కలతను పొంది అమృతాన్ని ప్రసవించిన అలలను కల సముద్రంవలె భగవానునకు వశమై, తన వశం కోల్పోయి, భక్తిని స్రవించే (కల్గించే) అతివిశాలమైన వారి జ్ఞానవిశేషం చేత- అనే స్వాపదేశార్థాన్ని గ్రహించాలి. **"కణ్డార్ ఎమ్మై యారుమ్ క*ఴ*ఱలర్"** అని పల్కినందున బయటి వారు కూడా ప్రవేశిస్తే తాముకూడా అభినివేశాన్ని పొందడం తప్ప, వారు ఇతరులను నియమించలేరు- అని తెల్పినట్లయినది. **"మేవినేన్ అవన్‌పొన్నడి మెయ్‌మ్మైయే తేవు మ*ఱ్ఱ*ఱియేన్ కురుకూర్‌నమ్బి పావిన్నిన్నిశై పాడి త్తిరివనే"** (ఆ నమ్మా*ఴ్*వ్వార్ల బంగారువలె ఆశపడదగిన పాదాలను ఆశ్రయించాను. వారిని తప్ప ఇంకొక దైవాన్ని తెలియను. ఆ కురుకూర్ లోని ఆ*ఴ్*వ్వార్లలో తియ్యని రాగాలతో కూడిన పాశురాలతో కీర్తించి సంచరిస్తాను.) అనే మధురకవి ఆ*ఴ్*వ్వార్లవలె నమ్మా*ఴ్*వ్వార్ల విషయంలో అభినివేశాన్ని పొందినవారు భగవానుని సైతం అభిమానించడం అరుదు- అని తాత్పర్యం.

### సఖి, నాయకుని గొప్పతనాన్ని గూర్చి పల్కి నాయకిని ఊరడించడం

58. క*ఴ*ఱలమొన్టే నిలము*ఴ*ుదాయిత్తు, ఒరు క*ఴ*ల్‌పోయ్
ని*ఴ*ల్‌తర ఎల్లా విశుమ్బుమ్ నిఱైన్దదు-, నీణ్డవణ్డత్తు
ఉ*ఴ*ఱలర్ ఞాన చ్చుడర్‌విళక్కాయ్ ఉయర్‌న్దోరైయిల్లా
అ*ఴ*ఱలర్ తామరైక్కణ్ణన్, ఎన్నో విఙ్గళక్కిన్టదే

కழల్ తలమ్ ఒన్టే = శ్రీపాదతలం ఒక్కటే, నిలమ్ ముழుదు ఆయిర్ఱు= భూమి అంతా తానై వ్యాపించి, ఒరు కழల్ = వేఱొక శ్రీచరణం, పోయ్ = (భూమిలో చోటు లేనందున పైకి) పోయి, నిழల్ తర = నీడను ఇచ్చేటట్లుగా, ఎల్లా విశుమ్బుమ్ = ఆకాశావకాశం అంతటిలోను, నిఱైన్దదు = నిండింది, (వ్యాపించింది), మీణ్డ అణ్డత్తు = పరిచ్ఛేదించలేని (పరిమితిని కొలువలేని) పరమపదంలో వేంచేసి ఉండేవాడు, ఉழఱు = అంతటా వెళ్ళగల్గిన, అలర్ = వ్యాపించిన, ఞానమ్ శుడర్ విళక్కు ఆయ్ = జ్ఞానమనే ప్రకాశానికి స్థానమైన దీపంవంటివాడై, ఉయర్న్దోరై ఇల్లా = తనకంటే మించినవారిని లేనివాడై, అழఱు అలర్ తామరై కణ్ణన్ = పంకంలో పుట్టి వికసించిన, వికాసం మాఱని ఎఱ్ఱ తామరపూవువంటి తిరునేత్రాలను కలవాడైన శ్రియఃపతి, ఇఙ్గు అళక్కిన్ఱదు ఎన్నో= ఈ లీలావిభూతిలో కొలువవలసినది ఉన్నదా?

**భావదీపిక :** ఈ పాశురంలో త్రివిక్రమావతార వృత్తాంతానికి చెందిన విషయం ప్రస్తావింపబడడం ద్వారా భగవానుని సర్వశక్తిత్వం తెలుపబడింది. "నాయకుడు నాతో సంశ్లేషించడం కోసం రావడం కన్పించలేదే! ఏమి ప్రతిబంధక మున్నదో తెలియదు. ప్రతిబంధకాలను పరిహరిస్తూ (తొలగిస్తూ) వచ్చి చేరడానికి తగిన సామర్థ్యం అతనికి లేనట్లున్నది'' అని కలతపడిన నాయకిని చూచి ఆమె సఖి- **"నఙ్గాయ్!** (పూర్ణులారా) నీవు ఈవిధంగా భావిస్తున్నావా! ఈ నాథుడైన భగవానునకు చేయలేని కార్యమనేది ఒకటి ఉన్నదా? అన్నిటిని చేయగల్గినవాడు కదా అతడు'' అని అతని సామర్థ్యాలలో గొప్పదైన ఒక సామర్థ్యాన్ని ప్రస్తావించి పల్కడంద్వారా "ఈ రీతిలో సర్వశక్తియుక్తుడైన నాయకుడు మనతో కలువడానికి అడ్డంకులుగా ఉండేవాటిని తొలగించి, వేగంగా వస్తాడు- అని నీవు ఆశ్వాసాన్ని పొందాలే తప్ప, శక్తి లేనివాడని భావించి కలతపడడం తగదు''- అని ఊరడిస్తున్నది. అందువల్ల సఖి నాయకుని గొప్పతనాన్ని వివరించి, నాయకిని ఊరడించడం ఈ పాశురంలోని విషయం.

**"తామరైక్కణ్ణన్ ఎన్నో విఙ్గళక్కిన్ఱదే"** అనే దానికి రెండు రీతులలో అర్థాన్ని చెప్పవచ్చు. ఒక పాదాన్ని భూమిలో అంతటా వ్యాపింపజేసి, ఇంకొక పాదాన్ని పైలోకాన్ని అంతటిని వ్యాపింపజేసి- ఈ విధంగా లోకాలను అన్నిటిని కొలిచాడే! ఇదేమి ఆశ్చర్యం! అని ఆశ్చర్యపడి పల్కడం ఒక అర్థం. భగవానుడు లోకాలను కొలిచాడని అంటున్నారే! ఇది ఏవిధంగా పొసగుతుంది? ఒకడు తాను నిలచిన

చోటకాక ఇంకొకటి చోటకు మాఱి కాలును పెట్టినపుడు కదా కొలిచినట్లు చెప్పవచ్చు. భూమి, ఆకాశం- రెండు శ్రీచరణాలకు చోటుగా సరిపోయినవి- అని చెప్పినందున వీటిని స్వామి కొలిచాడని ఏ విధంగా చెప్పనగును? అనేది ఇంకొక అర్థం. ఇక్కడ పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానాన్ని గమనించండి- **"అళక్కైక్కు ఒరు అవకాశమ్ కాణ్గిఱలోమ్. నిన్ఱ నిలైయిల్ నిన్ఱారై అళన్దారెన్ఱ వొణ్ణాదిఱే. అడిమాఱి యిడిలిఱే అళన్దదావదు. ఇవన్ ఇఙ్గు అళన్దానాక ఒన్ఱుమ్ కాణ్గిఱిలోమీ!"** అనేది వ్యాఖ్యానసూక్తి.

"నీణ్డవణ్డత్తు" అని ఆరంభించి మూడు వాక్యాలు భగవానుని నిర్దేశిస్తాయి. **"నీణ్డ వణ్ణత్తిలుళ్ళవన్, ఉழలర్ ఞానచ్చుడర్విళక్కాయ్, ఉయర్న్దోరై యిల్లాదవన్, అழఱలర్ తామరైక్కణ్ణనాయిరుప్పవన్"** (పరిచ్ఛేదించడానికి సాధ్యం కాని పరమపదంలో ఉండేవాడు, అంతటా ప్రసరించగల్గిన, విస్తృతమైన జ్ఞానమనే కాంతికి స్థానమైన దీపమై, తనకు మించినవాడెవడూ లేనివాడు, పంకంలో పుట్టిన తామరపూవువంటి నేత్రాలను కలవాడు) అనేవి ఆ నిర్దేశాలు.

**(అழఱలర్ తామరైక్కణ్ణన్)**- తామరపూవుకు పంకజమని సంస్కృత గ్రంథకారులు వ్యవహరిస్తారు. బురదలో మొలిచేది- అని అర్థం. ఇక్కడకూడా ఆ రీతిలోనే **"అழఱలర్ తామరై"** అని పలుకబడింది. **"అழఱు"**- బురద. **"అళఱు"** అనేదానివలె **"అழఱు"** అనేది కూడా ప్రత్యేకపదమే అని, ళకారానికి ழకారం సామ్యంగా వచ్చిందని తెలియాలి. తామరపూవు జలస్థితిని విడచి బయటకువస్తే వాడిపోతుంది. కనుక, నీటిలో ఉండే స్థితిలోనే వికసించి, వికాసం తగ్గకుండా ఉండే తామరవంటి తిరునేత్రాలను కలవాడు- అని భావం. **"కழల్+తలమ్ = కழఱలమ్"**. **"ఉళఱుదల్"** అని పల్కినా, **"ఉழలుతల్"** అని పల్కినా పొసగుతుంది.

భగవానుడు తమను దరి చేర్చుకోనందున క్లేశపడే ఆழ్వార్లను వారి భక్తులు అతని అపారశక్తిని ప్రస్తావించి పల్కి, ఊరడించడం ఈ పాశురానికి ధ్వన్యర్థం. త్రివిక్రమావతారవ్యాజంతో అన్ని లోకాలను తనశం చేసికొన్న సర్వేశ్వరుడు ఆ విధంగానే మిమ్ములను కూడా తన శ్రీచరణాల చెంతకు చేర్చుకోవడంలో ఏలోటు లేదు- అని ఆ స్వామి సంబంధాన్ని, శక్తివిశేషాన్ని వివరించి పల్కి, ఆర్తిని ఉపశమింప జేశారనేది ఇచటి స్వాపదేశార్థం.

## రాత్రి సమయం దీర్ఘంకావడం సహించలేని నాయకిని చూచి ధాత్రి బాధపడడం

59. అళప్పరుమ్ తన్మైయ ఊழியమ్ కఙ్గుల్, అన్దణ్ణన్దుழாయ్‌క్కు
ఉళప్పెరుఙ్గాదలిన్ నీళియ వాయుళ-, ఓఙ్గు మున్నీర్
వళప్పెరు నాడన్ మదుశూదన నెన్నుమ్ వల్వినైయేన్
తళప్పెరు నీణ్ ముఋవల్, శెయ్యవాయ తడములైయే

వల్ వినైయేన్ = క్రూరకర్మను చేసిన నా యొక్క, తళ పెరు నీళ్ ముఋవల్ శెయ్య వాయ తడ ములై = మొల్లమొగ్గ పరిమాణంలోని గొప్పతనాన్ని, పొడుగును కల దంతాల వరుసను కల్గినది, ఎఱ్ఱని అధరాన్ని కల్గినది, పెద్దస్తనాలను కల్గినదైన ఈ నాయకి, (ఏమి అంటున్నది? అని అంటే), అళప్ప అరు తన్మైయై = లెక్కించడానికి సాధ్యం కాని స్వభావాన్ని కల్గిన, ఊழி = కల్పాలలో, అమ్ = అందమైన (దీర్ఘమైన), కఙ్గుల్‌క = రాత్రి పొద్దులు, అమ్ తణ్ణమ్ తుழாయ్‌క్కు ఉళమ్ పెరు కాదలిన్ నీళియ ఆయ్ ఉళ = అందమైన, చల్లని తులసి విషయంగా నా మనస్సులో వృద్ధిచెందే మిక్కిలి కోరికవలె దీర్ఘంగా ఉన్నవి, ఓఙ్గు మున్నీర్ వళమ్ పెరు నాడన్ = ఉన్నతమైన సముద్రంచే పరివేష్ఠితమైన, సారవంతమైన గొప్ప దేశాన్ని ఏలేవాడు, మదుశూదన్ = మధు అనే అసురుని సంహరించినవాడు, ఎన్నుమ్ = అని నోరు తెరచి పల్కి, అలమటిస్తున్నది.

**భావదీపిక :** ఇది, రాత్రి సమయాలు చాలా దీర్ఘంగా కొనసాగుతున్నట్లు గమనించి, ఆర్తిని మిక్కిలిగా పొందిన నాయకిని ఉద్దేశించి తల్లి బాధపడుతూ పలికే పాశురం. నా కూతురు ఒక రాత్రిని ఏడు కల్పాలుగా దీర్ఘమయే రీతిలోని, తన నాయకుడైన శ్రియఃపతియొక్క రక్షకత్వాన్ని గూర్చి, విరోధినిరసన సామర్థ్యాన్ని గూర్చి నోరు ఆపకుండా పల్కి, అలమటిస్తున్నది- అని తల్లి అంటున్నది. ఏ రీతిలో నా ప్రేమకు అవధి అనేది లేదో, ఆ విధంగానే ఈ రాత్రికి కూడా అవధి లేదు- అని నా కూతురు అంటున్నది- అనేది మొదటి రెండు పాదాల ద్వారా తెలుపబడింది. "నీళియ వాయుళ ఎన్నుమ్" అని అన్వయించి అర్థాన్ని చెప్పాలి. "ఎన్నుమ్" అనేది ఈ పాశురంలో సమాపకక్రియారూపం (వినైముற்ఱు). "అని అంటున్నది"- అని అర్థం.

"అళప్పరుమ్ తన్మైయ ఊళ్ళియమ్ కజ్గుల్" అనేదానికి "అళక్క అరియదైయుమ్ అళన్దవన్ తిరువడికళాలుమ్ అళక్క ప్పోకిఱదిల్లై. అళక్కవాకిల్ వన్దు తోన్హానో?" (పరిచ్ఛేదించడానికి అరుదైనదానిని కూడా కొలిచినవాడు తన శ్రీచరణాలతో కొలువబోవడం లేదు. కొలువదలిస్తే ప్రత్యక్షమై ఉండడా!) అనే విశేషార్థాన్ని పెరియవాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించారు. **"ఓజ్గు మున్నీర్ వళమ్ పెరునాడన్"** అనేది లోకాలను సముద్రం మింగకుండా రక్షించేవాడు- అనే అర్థాన్ని ఇచ్చి, అతని రక్షకత్వ స్వభావాన్ని తెల్పుతుంది. **"మదుశూదనన్"** అనేది లోకానికి దుర్మార్గులవల్ల కలిగే బాధను తీర్చేవాడు- అనే దుష్టనిగ్రహసామర్థ్యాన్ని తెల్పుతుంది. **"ఊళ్ళియమ్ కజ్గుల్"** - ఇక్కడ రాత్రికి అందం ఏమి? అంటే, కల్పం కంటే దీర్ఘంగా ఉండడం- **(కజ్గులుక్కు అళ్ళకావదు -కల్పత్తినుమ్ నెడిదాయిరుక్కై")** అనేది అళ్ళకియమణవాళ చ్ఛీయర్ ఉరైలోని సూక్తి. **"కళ్ళియజ్గాడు, పుళియజ్గోలై"** అనే ప్రయోగాలలోవలె **"అమ్"** అనేది **"శారియై"** (ఒక సంబంధం వాచకం) దీర్ఘంగా కొనసాగే రాత్రిని కుఱుచగా చేయడం కాని, లేక, భగవానుని పిలువడం కాని- ఈ రెండిటిలో దేనినీ చేయలేక తల్లి **"వల్వినైయేన్"** అని తనను తానే గర్హిస్తూ పల్కుతున్నది.

రెండవ పాదంలో **"కాదలిన్"** అనే పదంలోని పంచమీవిభక్తి సామ్యార్థకం. నా ప్రేయసివలె కన్పిస్తున్నది- అని దీని అర్థం. 'మొల్లమొగ్గ'' అనే అర్థాన్ని కల్గిన **"తళవు"** అనే పదం **"తళ"** అని మాఱింది. **"అన్‌మొళ్ళితొత్తై"**, **"తడములై"**- ఇది పెద్ద స్తనాలను కల్గినది- అనే అర్థాన్ని ఇస్తున్నందున బహువ్రీహిసమాసం. **"వాయ్"** అనేది **(కుఱిప్పుప్పెయరెచ్చమ్)** -తద్ధితాంతరూపం. ఇది **"తడములై"** అనే పదానికి విశేషణం- **"నీళియ"** - భూతకాలిక క్రియాజన్య నామరూపం. **"ఇఱన్ద కాలప్పలవిన్ పాల్ వినైయాల్ అణైయుమ్ పెయర్"**, అని ద్రావిడంలో వ్యవహారం. **"నీళ్"** - అనే పదం **"వినైప్పకుది"**, **"కుఱిప్పువినైయాల్ అణైయుమ్ పెయర్"** కాదు.

తాము భగవానుని దరిచేరడంలో జరిగే ఆలస్యాన్ని సహించలేని ఆళ్వార్ల ఆర్తిని చూచి, జ్ఞానులు బాధపడుతూ పల్కిన సూక్తి దీనికి స్వాపదేశార్థం. లోకం అంతా తన సొత్తుగా కల భగవానుడు వీరి (ఆళ్వార్ల) ఆంతరశత్రువును నిరసించి, వీరిని దరి చేర్చుకొనగల్గినవాడైనా, ఆ విధంగా చేయకుండా ఆలస్యం చేసినందున, వీరికి ఈ అజ్ఞానమయమైన లోకంలో ఉండడం చాలా దీర్ఘమైన కాలంగా తోచడంచేత

కల్గిన ఆర్తి అతిశయించగా, జ్ఞానులు ఆళ్వార్ల ఆ స్వభావాన్ని గూర్చి నోరు తెరచి పల్కడం ఈ పాశురంలో వ్యక్తమవుతుంది. ఆళ్వార్ల తిరుముఖమండల ప్రకాశం, వాక్సామర్థ్యం, భక్తివివృద్ధి- ఇత్యాదులు చివరి పాదాలలో తెలుపబడ్డాయి.

**నాయకి లేతపరువాన్ని చూచి ధాత్రి విచారించడం**

**60. ములైయో ముழு ముற்றுమ్ పోన్దిల, మొయ్ పూఙ్గుழల్ కుఱియ**
**కలైయో వరైయిల్లై నావో కుழఱుమ్-, కడల్ మణ్ణెల్లామ్,**
**విలైయో వెన మిళిరుఙ్గణివళ్ పరమే పెరుమాన్**
**మలైయో, తిరువేఙ్గడ మెన్ఱు కఱ్కిన్ఱ వాశగమే**

ములైయో = స్తనాలను చూస్తే, ముழு ముற்றుమ్ పోన్దిల = మిక్కిలి పూర్తిగా ఆవిర్భవించలేదు (వ్యక్తం కాలేదు), మొయ్ పూ కుழల్ = దట్టమైన, మృదువైన కేశపాశం, కుఱియ = (ముడివేయడానికి చాలనట్లు) చాలా కుఱుచగా ఉన్నది. కలైయో = (ధరించే) వస్త్రం అయితే, అరై ఇల్లై = నడుములో పొందికగా ధరించడానికి వీలులేకుండా ఉన్నది, నావో = జిహ్వ అయితే, కుழఱుమ్ = (స్పష్టంగా మాటలను ఉచ్చరించలేక) అస్పష్టభాషణాలను పల్కుతున్నది, కణ్ = కన్నులయితే, కడల్ మణ్ ఎల్లామ్ విలైయో ఎన = సముద్ర పరివేష్ఠితమైన లోకం అంతా (వీటికి) సాటి వచ్చే మూల్యమా? అనేటట్లుగా, మిళిరుమ్ = (నిలకడగా ఉండకుండా) మిలమిలలాడుతూ చూస్తూ ఉన్నవి, పెరుమాన్ మలైయో తిరువేఙ్గడమ్ ఎన్ఱు కఱ్కిన్ఱ వాశకమ్ = తిరువేంకటాచలం నా నాయకుని నివాసస్థానమా?- అని పలుమార్లు పల్కి పలవరించే మాట, ఇవళ్ పరమే = (ఈ రీతిలోని లేత వయస్సును కల) ఈమె విషయంలో సంభవించడమా? (ఆశ్చర్యం?)

భావదీపిక : నాయకి(ని) ఉద్దేశించి శెవిలిత్తాయ్ (పెంపుడు తల్లి) బాధపడుతూ పలికే పాశురం, ఇది. నాయకునితో రహస్యంగా సంశ్లేషించిన నాయకి అతడు విడచి వెళ్ళిన స్థితిలో విరహాన్ని సహించలేక బాధపడినదై, ప్రలపిస్తూ, కన్నీటిని కారుస్తూ ఉండే దశలో ఆమె శరీరం కృశించి, రూపుమాఱిపోయింది. అపుడు ఆమె రూపంలోని మార్పునుమాత్రం గమనించిన తల్లి దీనికి ఏమి కారణమో! అని బాధపడి, ఆమె ప్రాణసఖిని అడిగింది. ఆమె ఉన్న సంగతిని దాచకుండా తెలిపి నాయకి క్లేశానికి మూలమైన యథార్థమైన కారణాన్ని తెల్పింది. దానిని

విన్న తల్లి, నాయకి చిన్న వయస్సును చూచి బాధపడి పలికే ఆలంకారిక ప్రక్రియ ఇది. నిజానికి నాయకి యౌవనపరువాన్ని పొందినా, ఈమె తల్లికి ఆమెపైగల ప్రేమాతిశయంచేత ఈమె చాలా చిన్న వయస్సులోనే ఉన్నట్లు తోస్తున్నది. **"శెయ్యనూలిన్ శిఱ్ఱాడై శెప్ప నూడుక్కవుమ్ వల్లళల్లళ్", "వాయిఱ్పల్లు మెழுన్దిల మయిరుమ్ ముడి కూడిఱ్ఱిల... మాయన్ మామణివణ్ణన్ మేల్ ఇవళ్ మాలుఱుకిన్ఱాళాలే"** (ఈమె నోటిలో దంతాలు ఇంకా ఉద్భవించలేదు, కేశపాశం ముడిపడలేదు... ఆశ్చర్యచేష్టితుడు, గొప్పనీలమణి వర్ణాన్ని కల స్వామిపై ఈమె వ్యామోహాన్ని పొందుతున్నదే) **"కొఙ్గైయిన్నుమ్ కువిన్దెழுన్దిల"** (స్తనాలు ఇంకా స్పష్టంగా ఉద్భవించలేదు) ఇత్యాది పెరియాழ்వార్ల శ్రీసూక్తులను, **"ముళ్ళై యిఱేయ్న్దిల కూழై ముడి కొడా, తెళ్ళియ నెన్బదోర్ దేశిలళ్"** అనే తిరుమఙ్గై ఆழ்వార్ల శ్రీసూక్తులను స్మరించడం యుక్తం.

**(ములైయో ముழு ముఱ్ఱుమ్ పోన్దిల)**- ఈమె స్తనాలు మగవారికుండే స్తనాలకు, ఆడవారికి ఉండే స్తనాలకు తేడా స్ఫురించేటట్లు పెద్దవిగా వృద్ధి చెందలేదు- అని భావం. యౌవనసూచకమైన స్తనోద్భేదం ముందు చెప్పబడింది.

**(కుழల్ కుఱియ)**- కురులు కూడా కలిపి ముడిగా కట్టేటట్లు కూడలేదు (చాలా కుఱచగా ఉన్నాయి).

**(కలైయో అరై ఇల్లై)**- చిన్న వస్త్రాన్ని ధరించే రీతిని తెలిసి చక్కగా ధరించలేకుండా ఉన్నది.

**(నావో కుழఱుమ్)**- ఏ అడ్డు లేకుండా మాట్లాడడం అలవాటు పడిన పరువం కానందున మాట్లాడడానికి **(కుழరుమ్)** తడబడుతుంది. **(కడల్ మణ్ణెల్లామ్ విలైయో)** అనే దానికి రత్నాకరాలైన సముద్రాలు, భూలోకం, మిగిలిన లోకాలు ఈమెకు మూల్యంగా కాగలవా! అని కూడా కొందఱు వివరిస్తారు.

**(మిళిరుమ్ కణ్)**- ఒక వస్తువుపై విశేషించి దృష్టిపెట్టి చూడకుండా దేనినైనా అరచూపు చూడడం తప్ప, ప్రేమను (అనురాగాన్ని సూచించే) విలక్షణ కటాక్షం ఈమెకు లేదు- అని భావం. నాయకుని నాయకి వశీకరించుకొనడం- స్తన సౌందర్యంతోకాని, వాక్చాతుర్యంతో కాని, అభిప్రాయగర్భాలైన కడగంటిచూపుతో చూచే చూపులతో కాని సాధ్యమై ఉండగా, స్తనప్రాదుర్భావం కాకుండా, కురులను ముడువకుండా, వస్త్రాన్ని సరిగా కట్టుకోవడం తెలియకుండా, మాట కూడా

అస్ఫుటమై, ఓరకంటితో చూడడం తెలియక నేరుగా చూచే రీతిలో ఉండే ఈ ముగ్ధకు ఈ విధంగా నాయకుని పట్ల అనురాగం కల్గిన రీతి ఏమి! ఆహా! అని ఆశ్చర్యపడుతున్నది.

నాయకుని వశం చేసికొనే సాధనాలలో పూర్ణత లేదని పలికే క్రమంలో **"కడల్ మణ్ణెల్లామ్ విలైయో ఎన మిళిరుమ్ కణ్"** అని గొప్పగా పల్కడం ఎందుకు? అని అంటే, ఈ వైలక్షణ్యం సాధారణంగా పల్కినదే. ఇది నాయకుని వశపరచుకోవడంకోసం పర్యాప్తమైనది కాదు. పరువంలోని చాలా లేతదశను సూచిస్తుంది.

ఆఴ్వార్ల ఆర్తిని గమనించిన జ్ఞానులు భగవానుని దరిచేరడానికి ఉపాయమైన భక్తి మొదలైనవి. పూర్ణంగా లేనివై ఉండగా, వీరికి కల్గిన ఈ త్వర ఏమి? అని పలికే సూక్తి- ఈ పాశురంలో ధ్వన్యర్థం (స్వాపదేశం) స్వాపదేశంలో స్తనం భక్తిని నిర్దేశిస్తుంది.

**(ములైయో ముఴు ముఱ్ఱుమ్ పోన్దిల)**- భగవానుని చేరి అనుభవించ డానికి ఉపకరణమైన భక్తి ముదిరి, ప్రాప్యానికి సాధనమైన పరమభక్తిగా ఇంకా పరిణమించలేదు.

**(మొయ్‌పూమ్ కుఴల్ కుఱియ)**- కురులను ముడవడం వీలు కాలేదు. అంటే- తలతో వశీకరించుకొనే ప్రణామం అనేది పరిపూర్ణంగా వ్యక్తం కాలేదు.

**(కలైయో అరై యిల్లై)**- **"మడి తఱ్ఱు త్తాన్ మున్దుఱుమ్"** అనే రీతిలో నడుములో వస్త్రాన్ని గట్టిగా బిగించి కట్టుకొని ముందడుగు వేసి వెళ్ళే ప్రయత్నం లేదు. ఇక్కడ ప్రయత్నం తత్సాధనం ద్వారా సూచింపబడింది.

**(నావో కుఴఱుమ్)**- నిరంతరం భగవన్నామ సంకీర్తనం చేయడం లేదు.

**(కణ్ మిళిరుమ్)**- బాహ్యవస్తువుల స్థితిని తెలిసే తత్త్వజ్ఞానం తప్ప, ఆ జ్ఞానం ఒకచోట లక్ష్యం నిలిపే ధ్యానరూపమైన జ్ఞానం లేదు.

**(కడల్ మణ్ణెల్లామ్ విలైయో ఎన)**- అని అన్నందున ఆఴ్వార్ల జ్ఞాన వైలక్షణ్యం స్ఫురిస్తుంది.

**(ఇవళ్ పరమే)**- కేవలం పరతంత్రంగా ఉండవలసినవారికి సాధనమనేది ఏదీ లేకుండా ఉండగా, త్వరను ఆరోపించుకోవడం తగునా?

(పెరుమాన్ మలైయో తిరువేఙ్గడమెన్ఱు కట్కిన్ఱ వాశకమ్)- "వెరువాదాళ్ వాయ్ వెరువి వేఙ్గడమే! వేఙ్గడమే ! ఎన్గిన్ఱాళాల్" (ఏనాడూ నోరు తెరచి పల్కనది. ఇపుడు నోరు ఆపకుండా వేంకటాచలం, వేంకటాచలం అని పలవరిస్తున్నది. ఆహా!) అనే రీతిలో అతడు వేంచేసి ఉండే తిరుమలై మొదలైన భోగస్థానాలనే నోరుతెరచి పలవరిస్తున్నది.

ఈపాశురంలో, ఆழ్వార్లు అవతరించినప్పటి నుండి భగవానుని విడచి ఉండలేనివారి స్వభావం (విశ్లేషాసహిష్ణుత్వం) సూచింపబడింది.

"ములైయో ముழுముఱ్ఱుమ్... మిళిరుఙ్గణ్" అనే సూక్తి వివరణలో పెరియవాచ్చాన్‌పిళ్ళై ఒక సంవాదాన్ని ప్రస్తావించారు.

ఈ పాశురాన్ని భట్టర్ వివరిచేటపుడు నంజీయర్ "మిగిలిన అవయవాల అపూర్ణతనుగూర్చి పల్కి, కన్నులను మాత్రం, సముద్రపరివేష్ఠితమైన లోకం అంతా వెలకు చాలేటట్లు ప్రకాశిస్తున్నాయి- అనే ఇంతటి గొప్పతనాన్ని కల్గినవిగా పల్కడం అసంగతంగా లేదా?- అనిప్రశ్నించారు. దానికి భట్టర్, "ఇందులో కూడా కన్నుల అపూర్ణతయే చెప్పబడింది. ఈ విధంగా వికసించిన నేత్రాలై ఉండే స్వభావాన్ని బాల్యదశలోనే చెప్పడం సాధ్యం. యౌవనం ప్రాదుర్భవిస్తే, కడగంటి చూడడమే తప్ప, ఈ విధంగా వికసించిన నేత్రాలతో చూడడం ఉండదుకదా ! అందువల్లనే ఈ విధంగా చెప్పబడింది'' అని అన్నారు.

### సఖి నాయకుని సౌలభ్యాన్ని గూర్చి నాయకితో పల్కడం

**61.** **వాశగమ్ శెయ్‌శదు నమ్బురమే, తొల్లై వానవర్‌దమ్**
**నాయగన్ నాయగరెల్లామ్ తొழுమవన్-, ఞాలముఱ్ఱుమ్**
**వేయగమాయినుమ్ శోరా వగై ఇరణ్డే యడియాల్**
**తాయవన్, ఆయ్‌క్కులమాయ్ వన్దు తోన్ఱిఱ్ఱు నమ్మిఱైయే**

తొల్లై= ప్రాచీనులైన, వానవర్ తమ్ నాయకనే = నిత్యసూరులకు నాయకుడు, నాయకర్ ఎల్లామ్ తొழுమవన్ = ఈశ్వరత్వాన్ని అభిమానించే (తాము ఈశ్వరుల మని భావించే) (బ్రహ్మాదులు) అందఱు తమ తమ నాయకత్వాన్ని పొందడంకోసం వారిచే నమస్కరింపబడేవాడు, ఞాలమ్ ముఱ్ఱుమ్ = లోకాన్ని అంతటిని, వేయ్

అకమ్ ఆయినుమ్ శోరా వకై = ఒక వెదురుకఱ్ఱ మొన మోపినంత పరిమితిలోని నేలను కూడా మిగలని రీతిలో (చాలా స్వల్పమైన చోటుకూడా మిగలని రీతిలో), ఇరణ్డే అడియాల్ తాయవన్ = (తన) రెండు పాదాలతో కొలిచి గ్రహించినవాడైన, నమ్ ఇఱై = మన నాయకుడు, ఆయ్ కులమ్ ఆయ్ వన్దు తోన్ఱిఱ్ఱు = గోపాల కులాన్ని కలవాడై, ఆ కులంలోకి వచ్చి వర్ధిల్లిన సౌలభ్యాన్ని, వాశకమ్ శెయ్‌వదు= పొగడి పల్కడం, నమ్ పరమే = మనకు సాధ్యమా?

**భావదీపిక** : నాయకుని సౌలభ్యాన్నిగూర్చి నాయకితో సఖి పలికే పాశురం, ఇది. నాయకుని రహస్య క్రమంలో కలసి, విశ్లేషించి, బాధపడే నాయకి "పరాత్పరుడై ఉండే ఆ నాయకుడు నన్ను (స్వీకరించదగిన) ఒక విషయంగా భావించి, వేగంగా వచ్చి వివాహం చేసికోవడం జరుగుతుందా?'' అని బాధపడగా, దానిని చూచిన సఖి, "ఆవిధంగా అందటికంటే అధికుడైన అతనికి భక్తులపట్ల సులభుడై ఉండే స్వభావం సహజంగా ఉన్నది'' అని అతని సౌలభ్యాన్నిగూర్చి ప్రస్తావించి, నాయకిని ఊరడిస్తున్నది, సఖి. దీనివల్ల, మనకు సులభుడై వచ్చి వివాహం చేసికొంటాడు- అని సూచింపబడింది.

భగవానుని కీర్తించడంకోసమే ఏర్పడిన వేదాలుకూడా అతని స్వభావాన్ని గూర్చి పూర్తిగా పలుకలేకుండా **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** అని వెనుకకు మరలాయి అంటే, దానినిగూర్చి పల్కడం మనకు సాధ్యమా?- అనేది **"వాశకమ్ శెయ్‌వదు నమ్ పరమే"** అనే ప్రయోగ తాత్పర్యం. **"వేయ్ అకయాయినుమ్" - "వేయ్"** - అని వెదురుకు పేరు. ఒక వెదురుకఱ్ఱ నాటబడే చోటు అయినా- అని అర్థం. కొంచెం చోటుకూడా వదలకుండా నేలను అంతటిని- అని భావం.

**(ఇరణ్డే అడియాల్ తాయవన్)- "ఒరు కుఱళాయ్ ఇరు నిలమ్ మూవడి మణ్ వేణ్డి ఉలకనైత్తుమ్ ఈరడియాలొడుక్కి ఒన్ఱుమ్ తరుక వెనా మావలియై చ్చిఱైయిల్ వైత్త తాడాళన్"** (అద్వితీయుడైన వామనుడై, విశాలమైన భూమిలో మూడడుగులు నేలను యాచించి, లోకాన్నంతటిని రెండు పాదాలతో కొలచి ఇంకొక పాదానికి నాకు చోటు చూపించి - అని పల్కి మహాబలిని చెరలో పెట్టిన బలశాలి.) అనే రీతిలో తాను అడిగిన మూడడుగుల నేలకు చోటు చాలనట్లు రెండు పాదాలతోనే కొలిచి పూర్తిచేసినవాడు.

**(ఆయ్ కులమాయ్ వన్దు తోన్ఱిన్ఱు)**- రాజకులంలోని ఒకతెకు (దేవకికి) కుమారుడై పుట్టి, గోకులంలోని ఇంకొకతెకు (యశోదకు) కుమారుడై రహస్యంగా పెరిగిన సౌలభ్యాన్ని గూర్చి, **"వాశకమ్ శెయ్వదు నమ్ పరమే?"** (కీర్తించడం మనకు సాధ్యమా?) అని అన్వయించాలి. మొదటి మూడు పాదాలు పరత్వాన్ని, చివరి పాదం సౌలభ్యాన్ని వ్యక్తంచేస్తున్నాయి.

పరత్వంతో పాటు, సౌలభ్యాన్ని కూడా కల్గినవాడైనందున భగవానుడు మిమ్ములను దరిచేర్చుకొంటాడు; త్వరపడి క్లేశపడవద్దు- అని భక్తులు ఆళ్వార్లను ఊరడించడం ఈ పాశురంలోని స్వాపదేశం. లీలావిభూతి, నిత్యవిభూతి - అనే రెండిటికి నాయకుడైన పరత్వాన్ని కల సర్వేశ్వరుడు, అత్యంత సులభుడై శ్రీకృష్ణుడుగా వచ్చి అవతరించిన సౌలభ్యంలోని తాత్పర్యాన్ని నిశితంగా గమనించి నపుడు "కర్మరహితుడు జన్మను ఎత్తడం, అదికూడా, జ్ఞానరాహిత్యానికి పరమావధి సీమ అయిన తక్కువ కాలంలో జన్మించడం ఎంత ఆశ్చర్యం!'' అని తలచి **"పిఱన్ద వాఱుమ్"** (తిరువాయ్ 5-10-1) అని, **"ఎత్తిఱమ్"** (తిరువాయ్ 1-3-1) అని మోహించి, పడి ఉండడం తప్ప, దానికి మించి పొగడి పల్కడానికి సాధ్యంకాదని తాత్పర్యం.

**"భరః"** అనే సంస్కృతపదం **"పరమ్"** అని మాఱింది. గడచిన పాశురంలోని **"ఇవళ్పరమే!"** అనేచోట కూడా ఇదే. **"పరమే?"** అనే పదంలోని ఏకారం వ్యతిరేకార్థకం. **"ఎదిర్మత్తై"** మనకు సాధ్యం కాదని భావం. **"తాయవన్"** - **"తావియవన్"** - కొలిచినవాడు. **'తోన్ఱిన్ఱు"** భూతకాలికమైన క్రియను తెలిపే నామపదం. **"ఇఱన్దకాలత్తొழిల్ పెయర్"**, ఇరణ్డామ్ వేన్ఱుమై త్తొక్కై.

### నాయకి విరహార్తిని గూర్చి సఖి నాయకునితో పల్కడం

**62. ఇఱైయో విరక్కినుమ్ ఈఙ్గోర్ పెణ్పాల్ ఎనవు మిరఙ్గాదు,**
**అఱైయో? వెన నిన్ఱదిరుమ్ కరుఙ్గడల్-, ఈఙ్గివళ్తన్**
**నిఱైయో వినియున్ తిరువరుళాలన్ఱి క్కాప్పరిదాల్**
**ముఱైయో?, అరవణైమేల్ పళ్ళికొణ్డ ముగిల్వణ్ణనే !**

ఇరక్కిలుమ్ = ఎంతగా ప్రార్థించినా, ఓర్ పెణ్ పాల్ ఎనవు ఉమ్ ఈఙ్గు ఇఱై ఇరఙ్గాదు = ఈమె ఒక కన్య అని భావించి, ఈమె పట్ల కొంచెం కూడా

జాలి చూపకుండా, కరు కడల్ = నల్లని సముద్రం, అత్తైయో ఎన నిన్ఱు అదిరుమ్= (ఈమె ఎదురుగా) జయధ్వానాన్ని చేస్తున్నదా!- అనేటట్లుగా స్థిరంగా నిలచి ఒకేవిధంగా ఘోషిస్తున్నది, ఓ = ఇదేమి కాఠిన్యం? అరవు అణైమేల్ = శేషశయనంపై, పళ్ళి కొణ్డ = శయనించి ఉండే, ముకిల్ వణ్ణనే = కాలమేఘంవంటి రూపాన్ని కలవాడా!, ఈఙ్గు = ఇక్కడ, ఇవళ్‌తన్ = ఈమెయొక్క, నిఱైయో = స్త్రీత్వలక్షణ పూర్తికి అయితే, ఇని = ఇకపై, ఉన్ తిరు అరుళాల్ అన్ఱి = నీ కృపతో తప్ప వేఱొక దానితో, కాప్పు అరిదు = రక్షణ అరుదు, ముఱైయో = ఈమెను నీవు ఈ రీతిలో ఉపేక్షించడం క్రమమా?

నాయకుని చూచి నాయకి పొందే విరహార్తినిగూర్చి ఆమె సఖి పలికే మాట ఈ పాశురం. నాయకి పడే విరహక్లేశాన్ని చూచి బాధపడే సఖి నాయకుని మనస్సులో ఉద్దేశించి సంబోధిస్తూ, నాయకి సముద్రఘోషకు తాళలేక బాధపడే స్థితిని, ఇంతవరకు తాను ఆమెను ఏదో ఒక విధంగా ఊరడించగల్గిన విషయాన్ని ఇకపై తనకు కూడా ఊరడింపజేయడం సాధ్యం కాని రీతిలో నాయకి విరహార్తి అతిశయించిన రీతిని పల్కుతున్నది.

బాధపడేవారిని చూచి తానే స్వయంగా బాధతో జాలి పడడం యుక్తం. ఆ విధంగా చేయకపోవడంతో పాటు, ఈమె స్త్రీత్వాన్ని, సౌకుమార్యాన్ని, లేతవయస్సును చూపి, మేము వేడుకొన్నా, ఈపాడు సముద్రం కరుణించడం లేదు. **"పెణ్ ఎన్ఱాల్ పేయుమ్ ఇరఙ్గుమ్"** (స్త్రీ అంటే పిశాచం కూడా కరుణిస్తుంది) అనే రీతిలో ఎంతటి కాఠిన్యాన్ని కలవారైనా, జాలిపడేటట్లుగా ఉండే స్త్రీత్వానికి కూడా ఇది ఏమాత్రం దయ చూపడం లేదు - అని సఖి అంటున్నది. పైన కన్పించే నల్లని రంగుతో పాటు లోలోపల ఉండే నల్లదనాన్ని (కాఠిన్యం) కూడా చూపడం కోసం **"కరుమ్ కడల్"** అని అనబడింది. నల్లదనం కోపసూచకమైన విషయం కనుక, కోపాన్ని కల్గిన సముద్రమనే అర్థం ఈ ప్రయోగం ద్వారా స్ఫురిస్తుంది.

**(ఇవళ్ తన్)-** తనను రక్షించుకోలేనిది అయిన ఈమెయొక్క - అని దీని భావం. **"నిఱై"** -అణకువ.

**(ఇని)-** సముద్రమనే పెద్ద శత్రువు ఎదురై, తనకు తన **"నిఱై"** (పూర్ణతను) ను కాపాడుకొనే శక్తి లేకపోయిన తరువాత- అని భావం.

**(ఇని ఇవళ్‌తన్ నిఱై ఉన్ తిరువవరుళాలన్ఱి క్కాప్పరిదు)** - నీవు వచ్చి సంశ్లేషిస్తే తప్ప ఈమె అణకువతో నిలచి ఉండలేదు- అని దీని భావం. **"ముఱైయో? అరవణైమేల్ పళ్ళికొణ్డ ముకిల్ వణ్ణనే!"** అని పల్కడం ద్వారా. నీవు శయనసౌభాగ్యాన్ని తెలిసినవాడవై ఉండగా, శయనించని ఈమెకు నీ శయ్యలో చోటు ఇవ్వకుండా పోవడం క్రమం కాదు- అని అంటున్నది- **"అరవణైమేల్ పళ్ళికొణ్డ"**- ఈమె కటికనేలపై శయనించగా, నీవు మెత్తని పడుకను అన్వేషించి శయనించావే ! ఇది మంచి క్రమమేనా !- అనే అర్థం ఈ ప్రయోగంలో స్ఫురిస్తుంది.

**(ముకిల్‌వణ్ణనే!)**- మేఘంవలె ఔదార్యగుణాన్ని కల్గిన నీవు ఈమె క్లేశం తీరేటట్లుగా ఉపకారం చేయకపోవడం కూడా ఒక క్రమమా!

ఇంతకుముందు భగవానుని దరి చేరలేక బాధపడే ఆళ్వార్లు సంసారసాగరం యొక్క కోలాహలాన్ని చూచి అధికంగా క్లేశపడే రీతిని చూచి వారి భక్తులు, తమవల్ల ఆ ఆర్తి ఉపశమింపజేయడం సాధ్యం కాదని తలచి, ఆళ్వార్ల పట్ల తమకు గల ఆర్తి వ్యక్తమయేటట్లుగా భగవానుని ఉద్దేశించి విన్నపించే పాశురం ఇది. మేము ఎంతగా ప్రయత్నంచేసినా, వీరి దాస్యభావాన్ని (శేషత్వాన్ని) భావించి కూడా కొంచెం కూడా వెనుకంజ వేయకుండా కఠినమైన ఈ సంసారసాగరం భయంకరంగా వీరిని క్లేశపెడుతున్నది. ఇక, వీరి స్వరూపాన్ని నీ అనుగ్రహంతో తప్ప కాపాడడం సాధ్యం కాదు. ఆదిశేషుడనే ఒక చేతనుని ఎల్లప్పుడు విడవకుండా, అతని నుండి సర్వవిధకైంకర్యాలను స్వీకరించి దయ చూపేటట్లే, ఈ ఆళ్వార్ల విషయంలో కూడా నీవు అనుగ్రహం చూపాలి. నీ భోగ్యమైన దివ్యమంగళవిగ్రహాన్ని వీరు దర్శించి అనుభవించ (ఆనందించ) గలిగేటట్లు చేయడమే నీకు తగినది- అని తెలిసినట్లయినది.

**"ముకిల్‌వణ్ణనే!"** అనే పదాన్ని వివరించే సందర్భంలో పెరియవాచ్చాన్‌పిళ్ళై ఎమ్బార్ పల్కిన ఒక వార్తను ప్రస్తావించారు.

ఈ పాశురాన్ని ఎమ్బార్ వివరించేటపుడు ఇయల్‌ను సేవించేవారిని చూచి, ఈదశలో కూడా ఈమెకు దర్శనాన్ని ఇవ్వకుండా, ఈమెకు కావిరంగు చీరను కట్టించదలచిన భగవంతుడు- తన పరత్వం స్ఫురించేటట్లుగా వేంచేసి ఉండే ప్రభువు వంటివాడు. అందువల్ల మీ తలపై బెత్తం దెబ్బపడినా ఫరవాలేదు. **"ముకిల్‌వణ్ణనే!"** అని ఏకవచనంలో కాకుండా, **"ముకిల్ వణ్ణరే!"** అని బహువచనంలో

పల్కండి- అని అన్నారట. ఇక్కడ "ముకిల్‌వణ్ణరే!" అనే బహువచనం, పైపైన గమనించినపుడు గౌరవంతో పల్కినట్లుగా స్ఫురించినా, చివరకు అది నిందగానే పర్యవసిస్తుంది- అనేది ఎమ్బార్ అభిప్రాయం. భగవానుడు, పిరాట్టి కలసి ఉండే చేరికలో ఆ ఇద్దఱికి దాస్యాన్ని చేయగోరే ఎమ్బార్, వారిద్దఱు విశ్లేషించినపుడు తల్లి పక్షాన్ని చేరేవారుకదా!

## నాయకుని నిందించిన సఖితో నాయకి ఆమె మాటను నిషేధిస్తూ నాయకుని పొగడడం

63. వణ్ణమ్ శివన్దుళ్ళ వానాడమరుమ్ కుళిర్ వి*ழி*య,
తణ్‌మెన్ కమల త్తడమ్బోల్ పొలిన్దన-, తామివైయో!
కణ్ణన్ తిరుమాల్ తిరుముగన్దన్నొడుమ్ కాదల్ శెయ్‌దేఱ్కు
ఎణ్ణమ్ పుగున్దు, అడియేనొడిక్కాల మిరుక్కిన్ఱదే

వణ్ణమ్ శివన్దుళ = వర్ణంలో ఎఱ్ఱగా ఉన్నవి, వాన్ నాడు అమరుమ్ కుళిర్ వి*ழி*య = పరమపదం ఆనందించేటట్లుగా చల్లని చూపును కల్గినవి, తణ్ మెల్ కమలమ్ తడమ్ పోల్ పొలిన్దన = చల్లని, సుకుమారమైన తామరలతో నిండిన తటాకంవలె ప్రకాశించేవి అయిన, ఇవైయో తామ్ = ఈ తిరునేత్రాలేనా, కణ్ణన్ = శ్రీకృష్ణావతారాన్ని ఎత్తినవాడు, తిరు మాల్ = శ్రియఃపతి అయిన భగవంతుని, తిరు ముకమ్ తన్నొడుమ్ = తిరుముఖమండలంలో, కాదల్ శెయ్‌దేఱ్కు = ఆశను కల్గి ఉండే నా యొక్క, ఎణ్ణమ్ = మనస్సులో, పుకున్దు = ప్రవేశించి, ఇ కాలమ్ = ఈ సమయంలో కూడా, అడియేనొడు ఇరుక్కిన్ఱ = (విడిచి పోకుండా) నాతో ఉన్నాయి.

**భావదీపిక :** నాయకుని స్వభావాన్ని నిందించే సఖితో నాయకి ఆ మాటలను తిరస్కరిస్తూ నాయకుని ప్రశంసిస్తూ పలికే పాశురం ఇది. నాయకునకు దూరమై, నాయకి క్లేశపడే సమయంలో ఆమెను ఆమె సఖి పలు రీతులలో ఆశ్వాసిస్తుంది. నాయకుని మనఃకాఠిన్యాన్ని ప్రస్తావించి, దూషించి, తద్వారా ఆశ్వాసాన్ని కల్గించడం కూడా ఒకవిధంగా ఊరటను కల్గించడమే కనుక, ఆ క్రమంలో కొంచెం ఆశ్వాసాన్ని కల్గించడంకోసం సఖి నాయకుని కాఠిన్యాన్ని గూర్చి పల్కి నిందించింది. కాని, ఆ మాటలను విని సహించలేని నాయకి "ఇపుడు కూడా అతని నేత్రాలు నా మనస్సులో, కళ్ళలో స్థిరంగా భాసించి, తొలగిపోకుండా ఉన్నాయి. ఈ విధంగా

ప్రేమతో సన్నిహితుడై ఉండేవానిని నన్ను అనాదరించి విడచి వెళ్ళాడని నీవు అతని కాఠిన్యాన్ని పల్కడం ఏమి! తగునా!"- అని నాయకి సఖితో పల్కుతున్నది.

ఎఱ్ఱని వర్ణాన్ని కల్గినవై, చల్లని కటాక్షాలను కల్గినవై, తామర కొలనువలె ప్రకాశిస్తున్నవి అయిన ఈ తిరునేత్రాలు ఆ స్వామి తిరుముఖమండలంలో కోరికను కల్గిన నా మనస్సులో ప్రవేశించి, ఏ సమయంలోను విడచిపోకుండా, స్థిరంగా నిలచి నాతో ఉన్నాయి. ఎందుకు నీవు భ్రమించి అతనిని నిందిస్తున్నావు?- అని భావం.

**(వణ్ణమ్ శివన్దుళ)**- నా విషయంలో స్వామికి కల అనురాగంతో నేత్రాలు ఎఱ్ఱగా ఉన్నాయి- అని అంతరార్థం. కోపంవల్ల కూడా నేత్రాలు ఎఱ్ఱగా కావచ్చు కనుక, ఆ విధంగా కోపంవల్ల కాకుండా, అనురాగంతో ఎఱ్ఱనివి అయినది- అని గ్రహించడానికి ఏదయినా కారణం ఉన్నదా?- అని అంటే,

**(వానాడమరుమ్ కుళిర్ విழியి)**- అని అంటున్నది. కోపానికి విరోధి అయిన చల్లదనం కల్గి ఉన్నందున, నేత్రాలు అనురాగంతో ఎఱ్ఱబడ్డాయి అనేది సిద్ధం- అని భావం.

**(తామ్ ఇవైయో!)**- నిరంతరభావనతో ఇతని మనస్సులో మాత్రం స్ఫురించడం కాకుండా, ఆ స్థితియొక్క పరిణామంవల్ల ఈమె సమక్షంలో కూడా సదా ప్రత్యక్షసమానాకారంగా భాసించే రీతిని దీనివల్ల తెలియాలి. **"ఇవై"** అనేది ప్రత్యక్షనిర్దేశం అయినందున, విడిచి వెళ్ళకుండా ఉండడం, దానికి కారణమైన ప్రేమను కలవాడై, నిరంతరంగా నా కన్నులలో, మనస్సులో తొలగిపోకుండా నిలచి ప్రకాశించేవానిని అనురాగం లేక విడచిపోయాడని భావించడం, నిందించడం తగదు- అనేది స్ఫురించేటట్లు **"అడియేనొడు ఇక్కాల మిరుక్కిన్రదే!"** అని అనబడింది. అందువల్ల **"ఇరుక్కిన్రదే!"** అనే ప్రయోగంలోని చివరి ఏకారం నిశ్చయంతో పాటు, ఆర్ద్రతను కూడా సూచిస్తుంది. తనను చిరకాలం విశ్లేషించి బాధించే సమయంలో కూడా నాయకుని ఇతరులు నిందించగా విని భరించలేక, ఆ మాటలను కాదనడం **"కఱ్పు"** (పాతివ్రత్య) యొక్కగుణం.

ఆழ்వార్లకు మిక్కిలి ఆర్తిని కల్గించి, శీఘ్రంగా దర్శనం అనుగ్రహించ కుండా ఉండే భగవానునివద్ద కాఠిన్యం ఉన్నదని శంకించిన భక్తులను ఆழ்వార్లు, అతని పరిపూర్ణ కటాక్షం తమ మనస్సులో స్థిరంగా ఉండేటట్లు అతడు తమకు గొప్ప అనుగ్రహం చేసిన రీతిని తెలిపి, వారిని ఆழ்వార్లు సమాధానపరచిన పాశురం ఇది.

## నాయకుని పేరును పల్కి ప్రాణధారణ చేయడాన్నిగూర్చి నాయకి సఖితో పల్కి బాధపడడం

**64.** ఇరుక్కార్ మొ*ழி*యాల్ నెఱియిழుక్కామై, ఉలగళన్ద
తిరుత్తాళిణై నిలత్తేవర్ వణఙ్గువర్-, యాము మవా
ఒరుక్కా వినై యొడు మెమ్మొడుమ్ నొన్దు కనియిన్మైయిల్
కరుక్కాయ్ కడిప్పవర్పోల్, తిరునామచ్చొల్ క*ற்ற*నమే

నిలమ్ దేవర్ = భూసురులైన బ్రాహ్మణులు, ఇరుక్కు ఆర్ మొ*ழி*యాల్= వేదాలలో ఉండే ఋక్‌రూపాలైన మంత్రాలతో, నెఱి ఇழుక్కామై = క్రమం తప్పకుండా, ఉలకు అళన్ద తిరు తాళ్ ఇణై వణఙ్గువర్ = లోకాలను కొలిచిన (భగవానుని) శ్రీచరణాలకు నమస్కరించి, ఆనందిస్తారు. యాముమ్ = మనం కూడా, అవా ఒరుక్కా = మన ఆశను అణచుకోలేక, వినైయొడుమ్ ఎమ్మొడుమ్ నొన్దు = ఆ విధంగా అనుభవించడానికి విరోధి అయిన (మా) పాపాన్ని, (ఆ పాపానికి స్థానమైన మమ్ము గర్హించుకొంటూ, కని ఇన్మైయిన్ కడుక్కాయ్ కడిప్పవర్‌పోల్ = పళ్ళు దొరకనందున కటుక్కాయను (పిందెను) తినేవారివలె, తిరు నామమ్ శొల్ క*ற்ற*నమ్ = (పూర్ణానుభవం లభించనందున అంతవరకు ప్రాణాలను ధరించి ఉండడంకోసం అతని) తిరునామాలనే పదాలను పల్కడాన్ని చేస్తున్నాము.

**భావదీపిక :** నాయకి, నాయకుని నామాన్ని ఉచ్చరించి ప్రాణధారణను చేయడాన్ని గూర్చి సఖితో పలికే పాశురం, ఇది. నాయకునితో సంశ్లేషించి, విరహాన్ని పొందిన నాయకి తిరిగి సంశ్లేషాన్ని పొందలేనందున, తాను ఒక విధంగా ప్రాణధారణ చేయడంకోసం నాయకుని తిరునామాలను పల్కుతూ కాలక్షేపం చేయడం- అనే క్రమం ఉన్నది. అది ఈ పాశురంలో ప్రస్తావింపబడింది.

పుణ్యశాలురైన బ్రాహ్మణోత్తములు వేదమంత్రాలతో సదా భగవానుని తప్పకుండా స్తుతించి, ఆనందిస్తారు. నేనయితే, అటువంటి సత్కర్మ లేనందున, నా ఆశను అణచుకోలేక, నా దౌర్భాగ్యాన్ని నిందించుకొంటూ, తీయని పండ్లను భుజించి ఆనందించలేని నిర్భాగ్యులు పచ్చి కాయలను కొఱికి, ప్రాణాన్ని నిలుపు కొనేటట్లుగా, అతని పరిపూర్ణానుభవాన్ని పొందలేనందున, నామోచ్చారణాన్ని చేసి

ప్రాణాలను నిలుపుకొంటున్నాను- అని నాయకి అంటున్నది. **"కడుక్కాయ్ కడిప్పవర్‌పోల్"** అనే ఉపమానం ద్వారా ఈ తిరునామాలను పల్కడంలో అతృప్తి స్ఫుటమవుతున్నది. కన్నులతో చూచి, చేతులతో ఆలింగనం చేసికోవాలని ఆశపడేవారికి తిరునామోచ్చారణ మాత్రంతో ఏమి తృప్తి కల్గుతుంది?

**"ఇరుక్కార్‌మొ*ழி*"** అనేది పురుషసూక్తం మొదలైనవానిని తెల్పుతుంది. లేక, **"ఇరుక్కు"**- వేదాలన్నీ, **"ఆర్"** తనలో అంతర్భవించుకొన్న, **'మొ*ழி*'** మూల మంత్రమనే అష్టాక్షరీ మహామంత్రం- అని కూడా వివరిస్తారు. **"ఋచో యజూంషి సామాని తథైవాథర్వణాని చ, సర్వ మష్టాక్షరాంతస్థం యచ్చాన్యదపి వాఙ్మయమ్"** (ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణవేదాలు, ఇంకా మిగిలిన వాఙ్మయం అంతా అష్టాక్షరిలో ఇమిడి ఉంది.) అనే సూక్తి గమనించదగినది.

**(నెఱి ఇ*ழு*క్కామై)**- భగవానుని ఆశ్రయించే క్రమంలో ఒక్కటికూడా తప్పకుండా, లోటు లేకుండా- అని భావం.

**(ఉలకళన్ద తిరుత్తాళిణై)**- సర్వసులభమైన శ్రీచరణాలు- అని భావం. **"నిలత్తేవర్"** - భూసురులని సంస్కృతభాషావ్యవహారం. ఇంద్రాదిదేవతలు స్వర్గలోకంలో ప్రకాశించేటట్లే, ఈ భూలోకంలో వెలిగేవారు బ్రాహ్మణులు.

**(వినైయొడుమ్ ఎమ్మొడుమ్ నొన్దు)**- భగవానునితో కలసి, ఆనందించలేని ప్రతిబంధకం తమకు కల్గింది - అని గర్హించుకొంటూ- అని భావం.

**(కనియిన్నైయిల్ కడుక్కాయ్ కడిప్పవర్ పోల్)**- 'కడుక్కాయ్" -పచ్చికాయ. లేతకాయ. బాగాముదిరి, ఆస్వాదించేవారికి చాలా భోగ్యంగా ఉండే **"కని"** (పండు) భగవదనుభవం వల్ల కలిగే ఆనందానికి ఉపమానం. కాఠిన్యాన్ని కల్గినదై, ఆస్వాదించడానికి వీలుగా ఉండని పచ్చికాయ- అంత పూర్తిగా భోగ్యంగా ఉండని నామోచ్చారణమాత్రానికి ఉపమానం. కాయ ముదిరితే పండు అయినట్లు, నామోచ్చారణఫలం అనుభవరూపమైన ఆనందం అవుతుంది- అనేది ఈ ఉపమానం ద్వారా గ్రహించదగినది.

**"ఉయర్వఱ ఉయర్ నలముడైయవన్"** (నిస్సమాభ్యధిక గుణశాలి) అయిన **"అయర్వఱు అమరర్‌కళ్ అదిపతి"** (నిత్యసూరినాథుని) చేత **"మయర్వఱ మదినలమ్"** (భ్రమ విప్రలంభాది దోషరహిత భక్తిరూపాపన్న జ్ఞానం) అనుగ్రహింప

బడిన ఆళ్వార్లు బ్రాహ్మణోత్తములకంటే గొప్పవారై, సకల వేదవేదాంత రహస్య సారార్థాలను కరతలామలకంగా దర్శించి పల్కి, ఆనందించినా, నైచ్యాను సంధానరూపంగా ఈ పాశురాన్ని పలికారని గ్రహించాలి.

**"ఇరుక్కు"**- ఇది **'ఋక్"** అనే సంస్కృత పదం యొక్కవికృతి. వేదానికి సామాన్యనామంగా, ఒక వేదానికి విశిష్టనామం **(శిఱప్పుప్పెయర్)** గా ఈ పదం వ్యవహరింపబడుతున్నది. **"ఒరుక్కా" (ఒరుక్కామల్)**- చివరలోని **("మల్"** అనే) భాగం లోపించిన వ్యతిరేకార్థక కృదంతరూపం. **"ఎదిర్మఱైవినై యొచ్చమ్", "ఒరుఙ్గు"** అనే ధాతువు యొక్క **"పిఱవినై"** (ణిజంతం) **"ఒరుక్కు"** అనేది ప్రకృతి. **"వినై యొడుమ్, ఎమ్మొడుమ్"**- ఇవి విభక్తి వ్యత్యయప్రయోగాలు; **("ఉరుపుమ యక్కమ్")** ఎందుకంటే **"వినైయుమ్, ఎమ్మైయుమ్"** (కర్మను, మమ్ము) అనే అర్థాన్ని వీటికి చెప్పుకోవలసి ఉన్నందున,

**"యాముమవా"** అనే పదానికి ఇంకొక రీతిలో కూడా అర్థాన్ని చెప్పవచ్చు. **"అవ్వా"** అనేది **"అవా"** అనే సంకోచాన్ని పొందినట్లు భావించి, **"యాముమ్ అవ్వా?"** మేముకూడా ఆ విధంగానా? - భూసురులవలె, ఋక్రూప వేదమంత్రా లతో భగవచ్చరణారవిందాలను నమస్కరించే భాగ్యాన్ని కల్గినవారమా? కాదు- అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"ఒరుక్కా వినైయొడుమ్"** అణచడానికి సాధ్యం కాని (పరిహరించడానికి వీలులేని) కర్మ- అని భావం. **"ఒరుక్కా వినైయొడుమ్ ఎమ్మొడుమ్ నొన్దు"** -అపరిహార్యమై ఉండే ఒక పాపం కల్గినదే !- దీనిని చేయడానికి నేనొకడను ఉన్నానే !- అని బాధపడి- అని భావం.

### నాయకి చూపులలో చిక్కుకొన్న నాయకుడు తన సఖునితో పల్కడం

**65. క*ఱ్ఱు* ప్పిణై మలర్ కణ్ణిన్ కులమ్ వెన్రు, ఓరో కరుమమ్**
**ఉ*ఱ్ఱు* ప్పయిన్రు శెవియొడు శావి-, ఉలగమెల్లామ్**
**ము*ఱ్ఱుమ్* వి*ழு*ఙ్గి యుమి*ழ்*న్దపిరానార్ తిరువడిక్కీ*ழ்***
**ఉ*ఱ్ఱు* ముఱాదుమ్, మిళిర్న్ద కణ్ణా యెమ్మై యుఙ్గిన్రవే**

కన్రు పిణై = లేత వయస్సులోని జింకల, మలర్ కణ్ణిన్ = విశాలమైన నేత్రాల, కులమ్ = జాతిని, వెన్రు = జయించి, ఓరో కరుమమ్ ఉఱ్ఱు = ఒక కార్యంలో అధ్యవసించి, పయిన్రు = ఆ పనిలో నేర్పును పొంది, (అభ్యసించి), శెవి

యొడు ఉశావి = ఆ కార్యాన్ని చెవులతో ప్రశ్నించి, ఆలోచించి, ఉఱ్ఱుమ్ ఉఱాదుమ్ మిళిర్న్ద = (నాకు) అనుకూలంగాను, ప్రతికూలంగాను తడబడే, కణ్ ఆయ్ = కన్నుల (ఇవి), ఉలకమ్ ఎల్లామ్ = లోకాలను అన్నిటిని, ముఱ్ఱుమ్ విழுజ్గి = ఏదీ మిగలని రీతిలో ప్రళయకాలంలో ఉదరంలో పెట్టుకొని, ఉమిழ்న్ద= తరువాత వెలువరించిన, పిరానార్ తిరు అడి కీழ் = స్వామియొక్క శ్రీచరణాల కింద (ఈలోకంలో), ఎమ్మై ఉణ్‌కిన్ఱ = మమ్ములను (తమకు ఉండేటట్లు) అపహరిస్తున్నవి.

**భావదీపిక** : నాయకి చూపులోని వైలక్షణ్యాన్ని చూచి, నాయకుడు దాని అభిప్రాయాన్ని గమనించి పలికే పాశురం ఇది. ఈ పాశురం నాయకుడు తన మనస్సును ఉద్దేశించి స్వగతంగా పల్కినది. "నాయకి చూపులో చిక్కుకొన్న నాయకుడు ఆమె నేత్రాలు (చూపులో) తనకు బాధకంగా ఉండే రీతిని గూర్చి స్నేహితునితో పల్కుతున్నాడు'' అని కూడా కొందరు వివరించారు.

లేత జింకపిల్ల ముగ్ధంగా చూచే చూపుకంటే ఈమె చూపు అందమైనదనే విషయాన్ని తెలుపడంకోసం- **"కన్ఱు ప్పిణై** మలర్ కణ్ణిన్ కులమ్ వెన్ఱు" అని అనబడింది. **"కన్ఱు+పిణై"= "కన్ఱు ప్పిణై", "కన్ఱు"**- లేతవయస్సులో ఉండే జంతువును తెలిపే **"పిణై"** - స్త్రీవాచకం. **"యానైయుమ్ కుదిరైయుమ్ కழுదైయుమ్ కడమైయుమ్ మానోడైన్దుమ్ కన్ఱె నఱ్కురియ", 'పుల్లాయ్‌న నవ్వియులైయే కవరి శౌల్‌వాయ్ నాడిప్పిణై యెన ప్పడుమే"** ఇత్యాది ప్రమాణాల వల్ల ఈ పదం జింకను తెల్పుతున్నదని తెలుస్తున్నది.

**(ఒరో కరుమ ముఱ్ఱు ప్పయిన్ఱు శెవియొడు ఉశావి)**- తాను నాయకిని చూడనపుడు ఆమె తనను మనస్సులో ఉండే కోర్కెను సూచించే రీతిలో నాయకుని ప్రేమతో వీక్షించడం, తాను ఆమెను చూచేటపుడు ఆమె సిగ్గుతో తనను ఎదురు చూడకుండా, చూపును సగం చూపు చూస్తూ వేఱొక వస్తువును దేనినో చూస్తున్నట్లుగా వేఱొక వైపు చూడడం- ఈ విధంగా మాటిమాటికి వేగంగా పలుమార్లు సంభవించి నపుడు, ఆమె కంటిచూపు చెవి వరకు ప్రసరించడం, తాను ఉద్దేశించిన ఒక కార్యాన్నిగూర్చి అవి చెవులను ప్రశ్నించి, దానితో విచారించేటట్లుండడం- అనే ఇవి అన్నీ వ్యక్తమయ్యాయి. ఏవస్తువులోను ఆసక్తి లేనివాడొకడు ఆ స్వభావాన్ని వీడి, ఒక వస్తువులో ఆసక్తి కల్గినవాడైతే, ఆ వస్తువుమీదే దృష్టి నిలిపి, ఆ

విషయాన్నిగూర్చి జ్ఞానులతో ఆలోచించి నిర్ణయం చేయాలని ప్రయత్నించడం పద్ధతి కనుక, ఆ రీతిలోనే ఇంతవరకు, సామాన్య దృష్టిని కల్గిన నాయకి నేత్రాలు, తనపట్ల ప్రేమ పూర్వకంగా చూచి, ఆసక్తిని పొంది, ఆ స్థితినిగూర్చి కర్ణాలతో విచారణను చేస్తున్నాయి- అని అంటూ ప్రకృతంలో నాయకి నేత్రాలపై ఆరోపించి పలుకబడింది.

నాయకి చూచే సాభిప్రాయవీక్షణాన్ని తనకు అనుకూలంగాను, సామాన్య వీక్షణాన్ని తనకు ప్రతికూలంగాను తలచి, **"ఉఱ్ఱుమ్ ఉఱాదుమ్"** అని నాయకుడు అన్నాడు. **"ఉలకమెల్లామ్ ముఱ్ఱుమ్ విழுఙ్గి ఉమిழ్న్ద పిరానార్ తిరువడిక్కీழ் ఎమ్మై ఉణ్కిన్ఱవే"** అని అన్వయించాలి. త్రివిక్రమావతార కాలంలో భూమి అంతా ఆ స్వామి శ్రీచరణాలకింద ఉండే చోటయినందున, తనకు ఈ లోకంలో జరిగిన సంఘటన స్వామి శ్రీచరణాల కింద సంభవించినది అంటే - సర్వేశ్వరుని విభూతిలో నాకు ఈ బాధ కల్గింది- అని పల్కడంలో తాత్పర్యం. **"ఉణ్కిన్ఱ"** - ఇది సమాపకక్రియ. **(వినైముఱ్ఱు)** **"ఉణ్కిన్ఱన"** అని అర్థం. నన్ను వశం చేసికొంటున్నవి; నన్ను బాధిస్తున్నవి- అని కూడా భావం.

ఆழ்వార్ల జ్ఞానంలో భాగవతులు అభినివేశాన్ని పొందినవారై పలికే సూక్తియే ఈ పాశురంలోని స్వాపదేశార్థం.

**(కఱ్ఱు ప్పిణై మలర్ కణ్ణిన్ కులమ్ వెన్ఱు)**- సంసారమనే అరణ్యంలో తిరిగే మౌగ్ధ్యాన్ని కల మృగం (లేడి) వంటివారి పంచేంద్రియాల మార్గంలో వ్యాపించే జ్ఞానసంతతిని మించి, ఉత్కృష్టమై ఉన్నది- ఈ ఆழ்వార్ల జ్ఞానమని భావం.

**(ఒరో కరుమ ముఱ్ఱు ప్పయిన్ఱు)**- ఆ జ్ఞానం ద్వారా తెలియదగిన భగవత్ స్వరూపం మొదలైనవానిలో నిలకడగా నిలచి ఉండి, విచారణ చేసే ఆழ்వార్ల స్వభావం దీని ద్వారా సూచింపబడింది.

**(శెవి యొడు ఉశావి)**- చెవి-అని, శ్రుతి-అని పర్యాయాలు. ఆ జ్ఞానం గొప్ప ప్రమాణమైన శ్రుతులతో సమన్వయాన్ని పొందడం దీనిద్వారా సూచింపబడింది.

**(పిరానార్ తిరువడిక్కీழ் ఉఱ్ఱు ముఱాదుమ్)**- పూర్వం **"ఎణ్ణమ్ పుకున్దు"** అనే రీతిలో మానసానుభవం కల్గిన సంబంధం. **(ఉఱవు)**, **"కడుక్కాయ్ కడిప్పవర్ పోల్"** అనే రీతిలో (బాహ్య సంశ్లేషరూప) పూర్ణానుభవాన్ని పొందనందువల్ల సంబంధరాహిత్యం **(ఉఱామై)** -అనే రెండు ఇక్కడ సూచింపబడ్డాయి.

**(మిళిర్న్ద కణ్ణాయ్)**- అన్ని అవస్థలలోను ఆళ్వార్లజ్ఞానం మసకబారకుండా (ముకుళించకుండా) సదా విచారించే స్వభావం ఇక్కడ సూచింపబడింది.

**(ఎమ్మై ఉణ్కిన్దనవే)** - ఇటువంటి ఆళ్వార్ల జ్ఞానం తమను వశపరచుకొన్న విషయం దీనివల్ల తెలుపబడింది.

**నాయకుడు చెలికానితో అతని మాటలను కాదని నిషేధిస్తూ పల్కడం**

**66. ఉణ్ణాదుఱజ్గాదు ఉణర్వుఱు మెత్తనై యోగియర్క్కుమ్,**
**ఎణ్ణాయ్ మిళిరు మియల్వినవామ్-, ఎరినీర్ వళివాన్**
**మణ్ణాగియ వెమ్బెరుమాన్ తనదు వైగున్ద మన్నాళ్**
**కణ్ణా యరువినైయేన్, ఉయిరాయిన కావిగళే**

ఎరి = అగ్ని, నీర్ = జలం, వళి = వాయువు, వాన్ = ఆకాశం, మణ్= భూమి, ఆకియ = అనే పంచభూతాల రూపమైన, ఎమ్బెరుమాన్ తనదు = భగవానుని, వైకున్దమ్ అన్నాళ్ = శ్రీవైకుంఠంతో సాటి వచ్చే ఎల్లప్పుడు అనుభవించదగినది అయిన నాయకియొక్క, కణ్ ఆయ్ = కన్నులనే పేరుతో, అరు వినైయేన్ ఉయిర్ ఆయిన = తీరని పాపాలను కల నా ప్రాణస్థానమైన, కావికళ్ = ఎఱ్ఱ తామర పూలు, ఉణ్ణాదు = భుజించకుండా, సదా ధ్యానరూపమైన ధ్యానంలో పొందికగా ఉన్నాయి, ఎత్తనై యోగియర్క్కుమ్ = గొప్పయోగ స్థితిని కల మునులందఱికి, ఎణ్ ఆయ్ = ఆ యోగాన్ని విడచి ఎల్లప్పుడు భావించదగినవై, మిళిరుమ్ = మెఱుస్తూ ఉండే, ఇయల్విన ఆమ్ = స్వభావాన్ని కల్గినవి అయినవి.

భావదీపిక : ఇంతకుముందు **"పులక్కుణ్డల పుణ్డరీకత్త"** అనే 57వ పాశురంవలె ఈ పాశురం కూడా నాయకుడు తన స్నేహితునకు అతని మాటలను నిషేధిస్తూ పలికే సూక్తి. **"తలైవన్ పాఙ్గనుక్కు కళ్ఱఱిదిర్ మఱుత్తల్"** అనే ఈ ప్రక్రియకు చెందిన వివరం ఆ పాశురవ్యాఖ్యారంభంలో గమనించవచ్చు. తనచే చూడబడిన నాయకియొక్క నేత్రాల సొబగు ఈ లోక సంబంధాన్ని పోగొట్టి, నిద్రాహారాలు లేకుండా, యోగావస్థను అభ్యసించి, అందులో ఆరితేరిన మహాయోగులను సైతం వశీకరించుకోగల్గినది- అని అన్నందున తాను ఆ నేత్రసౌందర్యంలో అభినివేశాన్ని పొందడాన్ని సూచించి, నీవు నన్ను నిందించే అవకాశం లేదు- అని చెలికానిని చూచి నాయకుడు పలికినట్లయినది. వాదికేసరి అళ్ళకియమణ

వాళచ్చీయర్ వేఱే రీతిలో వివరించారు. **"తలైమకళై ఇయఱ్కైయిల్ కలన్దు పిరిన్ద తలైవన్ తన్ ఉఱావుదల్ కణ్డు వినావిన పాకఙ్గళై క్కుఱిత్తు ఉఱ్ఱదురైత్త పాశురమ్"** (నాయకిని సహజంగా సంశ్లేషించి, తరువాత విశ్లేషించిన నాయకుడు తన విరహాన్ని చూచి ప్రశ్నించిన స్నేహితునితో తాను పొందిన అనుభవాన్ని జరిగిన సంగతిని- తెలిపే పాశురం) అని ఆ వివరణం. నమ్పిళ్ళై మాత్రం **"కழఱ్ఱదిర్ మఱుత్తల్"** అనే పూర్వోక్త ప్రక్రియగానే భావించారు.

**"ఎరినీర్ వళివాన్ మణ్"**- అనే ఈ ప్రయోగంలో పంచభూతాల వరుసక్రమం లేకపోవడం ఛందస్సౌకర్యార్థం.

**(ఎమ్బెరుమాన్ తనదు వైకున్దమన్నాళ్ కణ్ణాయ్)** - పరమపదంవలె బ్రహ్మా నందమే రూపు దాల్చినట్లుగా ఉండే ఆ నాయకి యొక్క నేత్రాలు- అనే పేరును మాత్రం కల్గి, నా ప్రాణస్థానమైన ఎఱ్ఱ కలువ పూలనే అవి- యోగాన్ని అభ్యసించి అందులో ఆరితేరిన పరమయోగులకు కూడా నిరంతరం స్మరించదగినవి. వారు ఈ నేత్రసౌందర్యాన్ని దర్శిస్తే, తాము నిరంతరం చింతన చేసే పరమపురుషుని ఆవలకు గెంటివేసి, ఆ స్థానంలో ఈ నేత్రాలనే నిలుపుకొని చింతన చేస్తారని దీనిభావం.

**"అరువినైయేన్"**- ఆమెతో సదాకూడి ఉండలేక, విశ్లేషించేటట్లుగా ఏర్పడిన మహాపాపాన్ని నేను చేశాను- అని నాయకుడు తనను గర్హిస్తూ పలికే రీతి ఇది. **"ఉయిరాయిన"**- అని అన్నందున ఆ నేత్రాలు ప్రేమాతిశయానికి స్థానాలు అని, వాటిని విడచి ధరించలేనిది- అని స్ఫురిస్తుంది.

ఆழ్వార్ల జ్ఞానవైలక్షణ్యాన్నిగూర్చి భాగవతులు స్నేహితులతో (భక్తులతో) పల్కడం ఈ పాశురంలోని స్వాపదేశం. పంచమహాభూతాలకు కూడా అంతరాత్మ అయిన భగవానుని పరమపదంవలె నాశం లేనివారు, ఎల్లప్పుడు దర్శించి ఆనందించదగినవారైన ఆழ్వార్ల జ్ఞానమనే పేరును కల్గినవై, పొందడానికి సాధ్యం కాని అరుదైన, సత్కర్మను కల, మనకు ప్రాణంవంటి ప్రేమకు స్థానమైన సుకుమారమైన పుష్పాలు మనకే కాకుండా, భుజించడం, నిద్రించడం అనేవి లేకుండా ఎల్లప్పుడు నిరంతరానుభవాన్ని పొందే నిత్యయోగాన్ని కల నిత్యసూరులకు కూడా సదా అనుభవించదగినవిగా ప్రకాశించే స్వభావాన్ని కల్గినవి- అనే భావాన్ని గ్రహించాలి. అందఱు ఆనందించి, శిరస్సుపై ధరించి, ప్రశంసించదగిన స్వభావాన్ని బట్టి ఆழ్వార్ల జ్ఞానప్రకారాలు ఎఱ్ఱ తామరపూలుగా చెప్పబడ్డాయి.

## నాయకుడు స్నేహితునితో తన బలహానినిగూర్చి పల్కడం

67. కావియుమ్ నీలముమ్ వేలుమ్ కయలుమ్ పలపల వెన్ఱు,
ఆవియిన్ తన్మై యళవల్ల పారిప్పు-, అశురై చ్చెగ్ఱ
మావియమ్బుళ్ వల్ల మాదవన్ కోవిన్దన్ వేఙ్గడమ్ శేర్
తూవి యమ్బేడై యన్నాళ్, కణ్గళాయ తుణై మలరే

అశురై = అసురులను, శెగ్ఱ = నశింపజేసిన, మా వియమ్ పుళ్ వల్ల = గొప్ప ఆశ్చర్యకరమైన గరుడపక్షిని అధిరోహించి నడపేవాడు, మాదవన్ = శ్రియః పతి, కోవిన్దన్ = పశువులను కాపాడేవాడైన భగవానుని, వేఙ్గడమ్ = శ్రీవేంకటాద్రిలో, శేర్ = పొందికగా చేరి ఉండి ఉజ్జీవించే, తూవి అమ్ పేడై అన్నాళ్ = రెక్కలను కల ఆడుహంసవంటి నాయకియొక్క, కణ్గళ్ ఆయ = నేత్రాలనే, తుణై మలర్= ఒకదానితో ఇంకొటి పోలిన రెండు తామరపూలు, కావియుమ్ = ఎఱ్ఱ తామర పూలను, నీలమ్ = నల్ల కలువపూలను, వేలుమ్ = వేలాయుధాన్ని, కయలుమ్= సొఱచేపను, పల పల = (ఇంకా కంటికి ఉపమానం అవుతున్న లేడికన్ను మొదలైన) పలు వస్తువులను, వెన్ఱు = (తమకు సాటి రాని రీతిలో) జయించి, పారిప్పు = కాలు దువ్వి చేసే ప్రయత్నం (నన్ను బాధించడానికి చూపే అభినివేశం), ఆవియిన్ తన్మై అళవు అల్ల = నా ప్రాణం యొక్క స్వభావానికి తగిన పరిమితిలో లేదు (అంతకు మించి ఉన్నది).

**భావదీపిక :** గడచిన పాశురంలో నాయకుడు, తాను (స్నేహితుడు) పల్కిన మాటలను కాదంటూ పల్కి క్లేశపడడం గమనించిన స్నేహితుడు (చెలికాడు) "ఏ సమయంలోను క్లేశపడనిది అయిన నీ మనస్సు ఈ విధంగా కలత పొందడానికి ఏమి కారణం?" అని నాయకునితో అనగా, దానికి నాయకుడు తన విరహార్తిని తెలిపే పాశురం, ఇది. "నేను శ్రీవేంకటాద్రిపై చూచిన కన్యక యొక్క నేత్రాలు బాధించే అవధికి చాలేటట్లు నా ప్రాణం లేదు"- అని నాయకుడు తాను బలాన్ని కోల్పోవడంగూర్చి స్నేహితునకు పల్కి బాధపడుతున్నాడు.

అసురులను వధించిన గొప్ప ఆశ్చర్యకరమైన గరుడపక్షిని అధిరోహించి నడపే శ్రియఃపతి వేంచేసి ఉండే దివ్యక్షేత్రమైన శ్రీవేంకటాద్రిపై స్థిరనివాసం ఉండేది, ఆడుహంసవంటి నడకను కల్గినదైన నాయకియొక్క రెండు నేత్రాలు ఉత్తమ లక్షణమైన ఎఱ్ఱని రేఖలను (జీరలను) కల్గి ఉండడంచేత ఎఱ్ఱ తామరపూలు,

నల్లని వర్ణాన్ని కల్గి ఉన్నందున నీలోత్పల పుష్పాలు, నైశిత్యం, కాంతి కల్గి, బాధిస్తున్నందున వేలాయుధం, చల్లదనంలో, ఆకారంలో సొఱచేపతో, ఇంకా మోహింపజేసే స్వభావం మొదలైనవాటిలో ఇంకా కంటికి సాటి వచ్చే లేడి కన్నులు మొదలైన అనేక వస్తువులు తనకు సాటి రానట్లుగా వానిని జయించి, నన్ను బాధించడానికి కాలు దువ్వే ప్రయత్నం - నా ప్రాణంయొక్క స్వభావానికి (స్థితికి) తగిన (భరించే) పరిమితిలో లేదు. నా ప్రాణం పరిమితికి మించి ఉన్నది. నా మృదువైన ప్రాణాన్ని వధించడానికి ఇంత పెద్ద ప్రయత్నం చేయనక్కరలేదు- అని భావం.

ఇందులో స్వాపదేశం- ఆళ్వార్ల జ్ఞానప్రకాశాన్నిగూర్చి భాగవతులు తమ స్నేహితులకు తెలియజేయడం.

**(అశురరై చ్చెఱ్ఱ మావియమ్ పుళ్వల్ల మాదవన్ కోవిన్దన్ వేఙ్గడమ్ శేర్)**- అని అన్నందున దుష్టనిగ్రహశీలుడు, గరుడవాహనారూఢుడు, ఉత్తమ ప్రమాణమైన వేదంచేత ప్రతిపాదింపబడేవాడు, పురుషకారస్వరూపిణి అయిన లక్ష్మీదేవికి వశమైనవాడు, ఆత్మలను పరిపాలించేవాడైన శ్రియఃపతియొక్క భోగస్థానమైన వేంకటాద్రిలో అభినివేశాన్ని కలవారు ఆళ్వార్లు- అనేది దీనివల్ల స్ఫుటమవుతున్నది. **"వేఙ్గడమ్ శేర్"** -అనేదానికి వేంకటాద్రిని నిరంతరం భావన చేసేవారని భావం. **"తూవియమ్ పేడైయన్నాళ్"** అని అన్నందున ఆళ్వార్ల శుద్ధస్వభావం, జ్ఞానానుష్ఠాన రూపమైన, ఉత్తమగతి గమనసాధనాలను రెండిటిని కల్గి ఉండడం, పారతంత్ర్యం సూచింపబడ్డాయి. **"వేఙ్గడమ్ శేర్ తూవియమ్ పేడై"** - అని అలర్‌మేల్‌మఙ్గై తాయార్‌ను నిర్దేశించడం ద్వారా, ఆమెతో వీరి స్వరూపానికి గల సామ్యం చెప్పబడిందని కూడా చెప్పవచ్చు.

**(కణ్‌కళాయ తుణైమలర్)** - తమకు, తమ దాసులకు రక్షకమైన విస్తృతమైన జ్ఞానప్రకారాలని- భావం. ఆ జ్ఞానం, ఎఱ్ఱ తామరలను జయించినట్లు పల్కడం- ఎఱ్ఱని వర్ణాన్ని కల్గిన రజోగుణాన్ని జయించడం తెలుపుతుంది. నల్ల కలువలను జయించినట్లు పల్కడంద్వారా ఎఱ్ఱని రంగును కల తమోగుణాన్ని దాటడం చెప్పబడింది. వేలాయుధాన్ని జయించినట్లు పల్కడం- తెల్లని వర్ణాన్ని కల సత్త్వగుణాన్ని దాటడం తెలుపుతుంది. **"కయల్"**ను (మత్స్యాన్ని) జయించినట్లు పల్కడం- ఈ విధంగా త్రిగుణాలను జయించినందున జడభరతాదులలో తాము చేరని విషయం తెలుపబడింది. లేక, చాంచల్యస్వభావాన్ని కల్గి ఉండకపోవడం

తెలుపబడినదని అనవచ్చు. ఇటువంటి జ్ఞానంయొక్క మహిమకు మమ్ములను వశీకరించుకోవడం ఒక గొప్ప కాదు- అని తెలిపినట్లయినది.

"అశురరై"- అనేది "అశురై" అని సంకోచాన్ని పొందింది. ఇది "తొకుత్తల్ వికారమ్", "వియప్పుళ్" అనేది మొదటి పకారానికి మకారంరాగా "వియమ్పుళ్" అయినది. "మెలిత్తల్ వికారం" ఇది.

## కాలవిభ్రమం

68. మలర్న్దే యొழிన్దిల మాలైయుమ్ మాలైప్పొన్ వాశిగైయుమ్,
పులన్దోయ్ తழைప్పన్దర్ తణ్డుఱ నాற்றி-, పొరుకడల్ శూழ்
నిలమ్ తావియ ఎమ్బెరుమాన్ తనదు వైగున్ద మన్నాయ్
కలన్దార్ వరవెదిర్ కొణ్డు, వన్కొన్ఱైగళ్ కార్త్తనవే

పొరు కడల్ శూழ் = అలలు తాకే సముద్రంచే చుట్టబడి ఉండే, నిలమ్ = భూలోకాన్ని, తావియ = కొలిచిన, ఎమ్బెరుమాన్ తనదు = భగవానుని, వైకున్దమ్= శ్రీవైకుంఠంతో, అన్నాయ్ = సాటి వచ్చేదానా!, కలన్దార్ వరవు ఎదిర్ కొణ్డు = నీతో కలసి, తరువాత విశ్లేషించిపోయినవాని రాకను ఎదురు చూచి, వల్ కొన్ఱైకళ్= బలిష్ఠమైన "కొన్ఱై" (గన్నేరు) వృక్షాలు, కార్త్తన = (ఇపుడే) మొగ్గతొడిగాయి, (అంతేకాక), మాలైయుమ్ = మాలికలుగా, మాలై పొన్ వాశికైయుమ్ = బంగారంతో చేయబడిన గుండ్రని సరాలతో కూడిన తోరణాలుగాను, పులమ్ తోయ్ తழை పన్దర్ = మనోహరమైన రెమ్మలతో కూడిన పందిరిలోని, తణ్డు = స్తంభాలలో, ఉఱ = దట్టంగా, నాற்றி= వేలాడుతూ, మలర్న్దే ఒழிన్దిల = పూర్తిగా పూలను పూయనేలేదు.

ఈ పాశురంలోని ఆలంకారిక ప్రక్రియకు "కాలమయక్కు" అని పేరు. నాయకుడు వచ్చే కాలం లేతవయస్సులో ఉన్నది. (పరిణామం చెందలేదు) అని ఇందులో తెలుపబడుతున్నది. నాయకుడు నాయకిని విశ్లేషించి వెళ్ళేటపుడు వర్షాకాలంలో తిరిగి వస్తాను- అని ఒక కాలనిర్దేశం చేసి వెళ్ళాడు. కాని, ఆ వర్షాకాలం వచ్చినా అతడు రాలేదు. కొన్ఱై (గన్నేరు) వృక్షాలు పూయడం ఆరంభించడాన్ని చూచి, "అయ్యో! వర్షాకాలం వచ్చేసిందే! ఇంకా నాయకుడు రాలేదే!'' అని నాయకి కలత చెందగా, దానిని చూచిన సఖి "పిల్లా ! వర్షాకాలం ఇంకా రాలేదు సుమా !

విడిచి వెళ్ళిన నాయకుని రాకను ముందుగానే ఎదురు చూస్తూ, దానివల్ల తమకు కల్గిన ఆనందంచేత గన్నేరుచెట్లు స్వయంగానే మొగ్గ తొడుగుతున్నాయి. అంతేతప్ప, కాలం వచ్చి అవి పుష్పించలేదు''- అని అంటూ కాలాన్నిగూర్చి నాయకి భ్రమపడేటట్లు పల్కి, ఊరడిస్తున్నది. **"కారెన క్కలబ్జుమ్ ఏరెయ్దిల్ కణ్ణిక్కు ఇన్ తుణై త్తోழி అన్రెన్రు మఋుత్తదు"** (వర్షాకాలం వచ్చిందని కలత చెందే గొప్ప నేత్ర సౌందర్యాన్ని కల నాయకితో- ప్రియసఖీ ! ఆకాలం ఇంకా రాలేదని నిషేధించి పల్కడం) అనే ఈ ప్రక్రియాలక్షణం గమనించ దగినది.

ఇక్కడ నమ్బిళ్ళై ఈడు వ్యాఖ్యాన శ్రీసూక్తి - **"కలన్దు పిరిన్ద తలైమకళ్ కొన్రై పూక్కుమ్ కాలత్తిలే వరుకిఱేన్ ఎన్రు కాలమ్ కుఱిత్తు ప్పోనానాయ్, అక్కాలమ్ వన్దు, అవైయుమ్ పూక్కచ్చెయ్‌దే, అవన్ కాణామైయాలే, తలైమకళ్ తళర, అత్తై క్కణ్డ తోழியానవళ్ అక్కాలమల్ల వెన్న వొణ్ణాదపడి అదు ముడుకి క్కొడునిన్రై యాలే, "ఇవై పూక్క ఉద్యోగిక్కిఱ ఇత్తనై పూత్తు శమైన్ద విల్లై. కాణ్! ఆన పిన్బు, అవనుమ్ వన్దానత్తనై. నీ అఞ్జాదే కొళ్" ఎన్రు అవళై ఆశ్వసిప్పిక్కిఱాళ్. అక్కాల మల్లకాణెన్నుమే తోழி. కెడువాయ్! ఇవై ఇజ్గనే మలరానిఱ్క అల్లకాకాణెన్నుమ్బడి ఎజ్గనే? ఎన్న, మలర ఉపక్రమిత్త, ఇత్తనై కాణ్. మలర్‌న్దు శమైన్ద తిల్లైకాణ్- ఎన్గిఱాళ్"** (కలసి విశ్లేషించిన నాయకుడు "గన్నేరు పూచే కాలంలో తిరిగి వస్తాను''- అని కాలనిర్దేశం చేసిపోయాడు. ఆ కాలం వచ్చి, ఆ గన్నేరులు పూస్తున్నా, అతడు రావడం కన్పించనందున నాయకి తల్లడిల్లగా, దానిని చూచిన చెలికత్తె "ఆ కాలం కాదు.''- అని చెప్పడానికి వీలులేని రీతిలో అది (ఆ కాలం) వేగంగా వస్తున్నందున "ఇవి (గన్నేరులు) పుష్పించడం ఆరంభించాయి, అంతే. ఇంకా పూచి పరిణతిని చెందలేదు సుమా! అందువల్ల అతడుకూడా వస్తున్నాడు. నీవు భయపడకు''- అని నాయకిని ఊరడిస్తున్నది. ఆ కాలం కాదు సుమా! అని అంటుంది కదా సఖి. అయ్యో! ఇవి ఈవిధంగా పూస్తూ ఉండగా, కాదు సుమా! -అని అనడం ఏవిధంగా ? అని నాయకి అనగా, ఇవి పూచడం ఆరంభించాయి అంతేసుమా! పూచి పూర్తిగా విప్పారలేదు- అని అంటున్నది. సఖి) అనేది ఈ సూక్తి. దీనివల్ల నాయకుడు వచ్చే కాలం ఇంకా రాలేదు- అని తెలిపినట్లయింది.

మాలికలుగాను, బంగారంతో చేయబడిన వలయాలవలె గుండ్రంగాను కొన్రై (గన్నేరు) పూలు పూచినందున **"మాలైయుమ్ మాలైప్పొన్ వాశికైయుమ్"** అని అనబడింది. దట్టంగా పెరిగిన వృక్షాలలోని కొమ్మలలో ఆ పూలు దట్టంగా వేలాడు

తున్నందున, అవి పందిరిలోని స్తంభాల మధ్యలో వేలాడదీయ బడినట్లున్నందున, **"తలైప్పన్దర్ తణ్డుఱ నాన్ఱ్రి"** అని అనబడింది. ఈ రెమ్మలను చూచిన నేత్రాలు వేఱు దేనినీ చూడలేనందున **"పులమ్ తోయ్"** అని అనబడింది. **"పులమ్"** అనే పదం సామాన్యంగా ఇంద్రియ వాచకమైనా, పంచేంద్రియాలలో ముఖ్యేంద్రియమైన కంటిని ఇక్కడ తెల్పుతుంది. **"మలర్"** అనే పుష్పసామాన్యవాచకం కొన్నిచోట్ల తామరపూవును నిర్దేశించేటట్లు ఇక్కడ, **"పులమ్"** అనే పదానికి **"నేల"** అనే అర్థాన్ని గ్రహించి, నేలపైకి వచ్చి వాలేటట్లు విస్తరించి, దట్టంగా ఉండే రెమ్మలు- అని కూడా వివరించవచ్చు.

**"వైకున్దమన్నాయ్"**- వైకుంఠం భగవానునకు మాత్రమే చెందిన వస్తువైనట్లు, నాయకునకే స్వంతమైన స్వభావాన్ని కలదానా!- అని దీని భావం. దీనివల్ల నిన్ను విశ్లేషించి అతడు సహించలేడు- అనేది స్ఫురిస్తుంది. విశ్లేషించిన దశలో **"పిఱిన్దార్"** అని నిర్దేశించవలసి ఉండగా, ఆ రీతిలో కాకుండా **"కలన్దార్"** అనే పేరుతో నిర్దేశించడం ఏవిధంగా! అని అంటే, నీతో కలసి, నీ స్వభావాన్ని గూర్చి తెలిసినవాడు నిన్ను విడచి ఉండడు సుమా!- అని నాయకిని ఓదార్చడంకోసం.

**(వరవెదిర్కొణ్డు వన్కొన్దైకళ్ కార్త్తనవే)**- తారతమ్యం తెలియని స్థావరాలు కూడా అతడు రాబోతాడని చూచి పుష్పిస్తూ ఉండగా, నీవు తల్లడిల్లవచ్చునా?- అని భావం. "మేము పుష్పించడం ఆరంభిస్తే ఈమె కలత పొందుతున్నదే"- అనే జాలిలేనివి- అని అనడంకోసం **"వన్"** అనే విశేషణంతో **"వన్కొన్దైకళ్"** అని అన్నది. లేక, "అతడు వస్తే పుష్పించదగినవై, లేకపోతే పుష్పించడం మానివేసేవై, ఈవిధంగా అతని రాకతో తప్పని (అవినాభావ) సంబంధాన్ని కల గన్నేరులు" అని కూడా అర్థాన్ని చెబుతారు. **"కార్త్తన"** -**"కరుక్కొణ్డన"** (గర్భాన్ని ధరించాయి) అని అన్నందున మొగ్గ తొడిగిన దశ తప్ప పూచిన దశను పొందలేదు- అని భావం. కాలం లేత వయస్సులో ఉన్నది- అనే దానికి గుర్తు ఇది. **"కార్త్తన"** అనే పదానికి- వర్షాకాలాన్ని సూచిస్తున్నది- అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు.

**"పన్దర్"**- రకార, లకార సామ్యాన్ని కల రూపం. పందిరి- అని దీని అర్థం. (పందిరి పందిరి- అని తెలుగులో కూడా ప్రయోగం ఉన్నది) **"నాన్ఱ్రి"** -**"నాల్"** అనే ధాతువుయొక్క ణిజంతరూపమైన **"నాన్ఱు"** అనేది దీనికి ప్రకృతి- **"నావల్"** అంటే - క్రిందకు వేలాడడం. ఇక్కడ **"న్ఱు"** అనేది ణిజంతప్రత్యయం.

భగవానుని, భగవద్భక్తులను ఎప్పుడూ సంశ్లేషించి అనుభవించవలసి ఉండగా, తగిన కాలంలో అనుభవించలేక పోయినందున, ఆళ్వార్లకు కల్గిన క్లేశాన్ని వారి భక్తులు ఊరడించి తీర్చడం- దీనికి స్వాపదేశం. భగవానునకే చెందిన వస్తువైన ఓ ఆళ్వార్లా ! మిమ్మలను అతడు పరిగ్రహించకుండా ఉండడు. భగవానుని రాకను ముందుగా సూచించే కాలం ప్రవృత్తమవుతున్నది. (భాసిస్తున్నది) అయితే, అతడు వచ్చే కాలం ఇంకా పూర్తిగా సమీపించలేదు- అని పల్కి వారిని భక్తులు ఊరడించిన రీతి ఇది.

## సాయంసమయాన్ని సహించలేక బాధపడే నాయకిని ఆమె చెలికత్తె ఓదార్చడం

69. కారే*ఱ్ఱి*రుళ్ శెగిలే*ఱ్ఱి*న్ శుడరుక్కుళైన్దు, వెల్వాన్
పోరే*ఱ్ఱె*దిర్న్దదు పున్దలైమాలై-, పువని యెల్లామ్
నీరే*ఱ్ఱు*ళన్ద నెడియ పిరానరుళా విడుమే
వారే*ఱ్ఱి*ళములైయాయ్!, వరున్దేలున్ వళైత్తిఱమే

కార్=నల్లని, ఇరుళ్ = చీకటి అనే, ఏఱు = ఎద్దు, శెకిల్ = ఎఱ్ఱని, శుడర్= సూర్యుడనే, ఏ*ఱ్ఱి*ఱ్కు = ఎద్దుకు ఎదురుగా, ఉళైన్దు = అలసి, వెల్వాన్ = (తిరిగి దానిని) జయించడంకోసం, పోర్ ఏ*ఱ్ఱు* = పోరాడడం స్వీకరించి, ఎదిర్న్దదు = వచ్చి ఎదిరించింది, నీర్ ఏ*ఱ్ఱు*= మహాబలిచే ధారగా పోసి, దానం చేసిన వీటిని (చేతిలో) గ్రహించి, పువని ఎల్లామ్ = అన్ని లోకాలను, అళన్ద = కొలిచిన, నెడియ = దీర్ఘమైన రూపాన్ని కల, పిరాన్ = నాయకుడు, పున్ తలై మాలై = అద్భుతమైన స్వభావాన్ని కల సాయంసమయంలో, అరుళా విడుమే = నిన్ను అనుగ్రహించకుండా విడుస్తాడా? (విడువడు) వార్ ఏ*ఱ్ఱు* ఇళ ములై యాయ్ = కంచుకాన్ని పెంచే (కంచుకానికి లోబడని యౌవనం మాఱని లేత వయస్సులోని) స్తనాలను కల్గినదానా!, ఉన్ వళై తిఱమ్ = నీ గాజుల కారణంగా, వరున్దేల్ = విచారించకు.

**భావదీపిక :** సాయంసమయాన్ని చూచి మోహాన్ని పొందిన నాయకిని సఖి ఓదార్చే పాశురం ఇది. విశ్లేషించి పోయినవారు తిరిగి వచ్చి చేరడానికి తగినది, భోగానికి తగినది అయిన రాత్రికి ఆరంభమైన సాయంసమయం కావడాన్ని గమనించి, "ఇంకా నాయకుడు రాలేదే"- అని నాయకి పరితపించగా, దానిని

చూచిన చెలికత్తె "సఖీ నీవు తలచే సంధ్యాకాలం రాలేదు. చీకటి అనే నల్లని ఎద్దుకు, సూర్యుడనే ఎఱ్ఱని ఎద్దుకు మధ్య పోరాటం జరుగుతున్నది సుమా! నీవు భావించినట్లుగా నిజంగా ఇది సంధ్యాసమయమే అయితే, లోకం అంతటిని రక్షించగల్గిన దయను కల నాయకుడు నిన్ను అనుగ్రహించకుండా ఉంటాడా! అతడు రానందువల్ల కూడా ఇది నిజమైన సాయం సమయం కాదని నీవు తెలిసికో వచ్చు. నీ చేతిగాజులు విరహంవల్ల జారిపోవడాన్ని గూర్చి నీవు విచారించవద్దు. అవి జారిపోకుండా ఉండేటట్లుగా అతడు త్వరగా వస్తాడు సుమా!'' అని పల్కి ఓదారుస్తున్నది.

ఒక నల్లని ఎద్దు, ఒక ఎఱ్ఱని ఎద్దు పరస్పరం ఎదురై, పోరాడేటపుడు, ఎఱ్ఱని ఎద్దుకు ఓడిపోయిన నల్లని ఎద్దు మళ్ళీ దానిని గెలువడంకోసం ఎదిరిస్తున్నది- అనేది మొదటి వాక్యం. రూపకాలంకారాన్ని అంగంగా కల్గిన ఉత్ప్రేక్షాలంకారం ఇది. సాయంసంధ్యాకాలం పూర్తి వెలుతురును కాని, పూర్తి చీకటిని కాని కల్గినది కాకుండా, రెండు కలసి ఉండే కాలమైనందున ఈ విధంగా వర్ణింపబడినది. అందులో, కాలం గడిచే కొద్దీ చీకటి అధికమై, పగటి వెలుతురు తగ్గిపోవడాన్నిబట్టి, ఉదయసమయంలో పగలుకు ఓడిన చీకటి ఇపుడు దానిని జయించడంకోసం వచ్చి ఎదిరిస్తున్నదని అన్నారు.

ఒకడు ఇంకొకని చేతిలో ఓడిపోతే, ఓడిపోయినవాడు మళ్ళీ తగిన సమయం చూచి రెండవ దానిని జయించడానికి యత్నించడం సహజం. రావణుడు యుద్ధభూమిలో శ్రీరాముని బాణాలకు లక్ష్యమై, గాయపడి పోయిన తరువాత, మండోదరి వచ్చి అతనిని చూచి విలపిస్తున్నది చూడండి. **"ఇంద్రియాణి పురా జిత్వా జితం త్రిభువనం త్వయా, స్మరద్భిరివ తద్వైర మద్య తైరేవ నిర్జితః"** అని అన్నది. దీని భావం ఏమంటే- ఓ రావణా! నీవు పూర్వం ఇంద్రియాలను అన్నిటిని జయించి, దానివల్ల ముల్లోకాలను జయించావు (ఇంద్రియాలను నిగ్రహించి తపస్సు చేసి, వరాన్ని పొందినందున, ముల్లోకాలను జయించాడు కనుక ఈవిధంగా చెప్పబడింది) ఆ ఇంద్రియాలు "ఈ పాపి మనలను ఈ విధంగా తల ఎత్త నీయకుండా చేశాడే. కానీ! తగిన సమయం చూచి ఇతని తలను అణుస్తాం''- అని మనస్సులో పగను పొంది ఇపుడు నీకు ప్రతిక్రియను చేశాయి- అని (ఇంద్రియా లను జయించకుండా, వాటిని పరవశుడవై, సీతను అపహరించి వచ్చినందున నీకు ఈ హాని కల్గిందని భావం.) ఆ విధంగా రావణుని వద్ద ఇంద్రియాలు

మొదట ఓడిపోయి, తరువాత అతనిని జయించినట్లుగా, తొండరడిప్పొడి యాళ్వార్లు ముందు తాము ఇంద్రియాలకు ఓడిపోయి, బంగారు పాత్రకారణంగా చెఱలో పెట్టబడినపుడు కల్గిన కోపాన్ని మనస్సులో పెట్టుకొని, సమయం చూచి, ఆ ఇంద్రియాలను తాము చెఱపట్టినట్లుగా **"కావలిల్ పులనై వైత్తు"** (ఇంద్రియాలను కావలిలో పెట్టి) అని (తిరుమాలై ప్రబంధంలోని) మొదటి పాశురంలో అనుగ్రహించారు. ఆ విధంగానే ఇక్కడకూడా ఎఱ్ఱని ఎద్దుకు ముందు ఓడిపోయిన నల్లని ఎద్దు మనస్సులో కోపాన్ని పొంది, ఇపుడు దానిని జయించాలని ఎదిరిస్తున్నది-అని చెప్పబడింది.

చీకటిని, వెలుతురును ఎద్దు అని అనడం- **"మేలెళుచ్చి"**- పైకి లేచే (ఉద్యోగించే) స్వభావాన్ని బట్టి. సంధ్యాసమయం విశ్లేషంతో బాధపడేవారిని ఇంకా బాధిస్తుంది కనుక **"పున్ తలైమాలై"** అని అనబడింది. లేక, పగటికి, రాత్రికి మధ్యలో చాలా చిన్న సమయమై, వేగంగా గడచిపోయే స్వభావాన్ని కల్గినదని కూడా భావం.

**(నీరేఱ్ఱు)**- సత్యలోకంలోకి పోయిన శ్రీచరణాన్ని అభిషేకించడం కోసం బ్రహ్మ పోసిన తీర్థాన్ని ఆ శ్రీచరణాలలో గ్రహించి- అని అర్థాన్ని కొందఱు చెబుతారు. **"తారేఱ్ఱ వెణ్కుఱై వార్క్కవుమ్ తామరైమేల్ శీరేఱ్ఱ తొల్ నాన్ముకత్తోన్ విళక్కవుమ్ శెమ్బొన్ ముడి, క్కారేఱ్ఱ మేని యరఙ్గేశర్ కైయమ్ కళలు మొక్క, నీరేఱ్ఱన వణ్ తిరుక్కుఱళాకి నిమిర్న్ద వన్దే"** (బలాన్ని కల్గిన వామనమూర్తియై, వెంటనే, త్రివిక్రముడై భూమిని స్పృశించిన ఆనాడు, విజయ మాలికను, అధికారాన్ని సూచించే తెల్లని గొడుగును కల్గిన మహాబలి దానజలాన్ని పోసి దానం చేయగ, నాభికమలం నుండి పుట్టిన చతుర్ముఖబ్రహ్మ శ్రీచరణాలను కడుగగా, ఎఱ్ఱని, బంగారువలె వెలిగే కిరీటాన్ని కలవాడు, కాలమేఘంవంటి తిరుమేనిని కలవాడైన శ్రీరంగనాథుని హస్తం, శ్రీచరణం ఒకే సమయంలో ఆ జలాలను స్వీకరించాయి.) (తిరువరఙ్గక్కలమ్బకమ్-33) అనే పిళ్ళైప్పెరుమాళ్ అయ్యంగార్ పాశురం ప్రకృతంలో స్మరణీయం.

**(నెడియ పిరాన్)**- (లోకాలను కొలువడం కోసం) దీర్ఘమైన ఉన్నతమైన రూపాన్ని పొందినవాడని, అందఱికంటే ఉన్నతుడనే అర్థాలను గ్రహించవచ్చు.

**(పువని యెల్లామ్ నీరేత్ఱ్ఱళన్ద నెడియపిరాన్ అరుళా విడుమే)- "తామస ప్రకృతికళానార్ మేలిడప్పుక్కాల్ వన్దు ఉదవుమవన్, తమస్సు త్తాన్ వన్దు విక్కప్పుక్కాల్ విట్టిరుక్కుమో? .... తన్ ఉడైమైయై పిఱర్ ఎనదెన్దు అభిమానిత్తిరున్దాల్ తన్నై అర్థియాక్కి అవర్కళ్ పక్కలిలేయుమ్ వన్దు ఇరన్దు కొళ్ళుమవన్, ఇరక్క వేణ్డాదే తన్ ఉడైమైయేయాన ఉన్నై విట్టిరుక్కుమో?"-** (తామస స్వభావాన్ని కలవారు బాధించేటపుడు వచ్చి సహాయపడేవాడు, తమస్సు స్వయంగా వచ్చి బాధిస్తున్నపుడు విడచిపెడతాడా ? తన సొత్తును ఇతరులు తమదని అభిమానిస్తే, తను అర్థిగా చేసికొని, వారి దగ్గరకు వెళ్ళి అర్థించి పొందేవాడు, (ప్రార్థించనక్కర లేకుండా తన సొత్తు అయిన నిన్ను విడుస్తాడా ?) అనే ఇచటి పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యాన శ్రీసూక్తిని గమనించాలి. **"వారేత్ఱ్ఱిళములైయాళ్"** అనేది- ఇటువంటి అందాన్ని, లేతవయస్సును అతడు విడిచిపెడతాడా ? వేగంగా వస్తాడు సుమా !- అనేదానికి సూచన. **"వారేత్ఱ్ఱ ఇళములైయాయ్"** అని కూడా విడదీయవచ్చు. తద్ధితాంతం (పెయరెచ్చమ్) లోని చివరి ప్రత్యయం లోపిస్తే వచ్చే రూపం ఇది. **"వార్ +ఏత్ఱ్ఱ"=** కంచుకాన్ని అలంకరించుకొన్న - అని అర్థం. **"భువన"**మనే సంస్కృతపదం **"పువని"** అనే వికారాన్ని పొందింది.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే- తగిన కాలంలో భగవానునితో, లేక, భాగవతులతో సంశ్లేషించి ఆనందించలేనందున వ్యాకులపడే ఆళ్వార్లను వారి భక్తులు ఊరడించడం. పూర్వం ఉన్న అజ్ఞాన మనేది భక్తిరూపాపన్నమైన యథార్థజ్ఞానంతో తొలగిపోయిందని, తగిన కాలంలో అనుభవించలేనందున ఉండే వివేకం కూడా నశించేటట్లు మోహాంధకారం ఆవరించిందని మొదటి వాక్యం ద్వారా తెలుపబడింది.

**(వారేత్ఱ్ఱిళములైయాయ్!)-** అణచడానికి, కప్పి పుచ్చడానికి సాధ్యం కాని భక్తియొక్క వివృద్ధిని కల్గిన ఓ ఆళ్వార్లూ!- అని ఆళ్వార్లను సంబోధించే రీతి ఇది.

**(వరున్దేల్ ఉన్ వళైత్తిఱమ్)-** ఇటువంటి భక్తిని కల మీ శేషత్వప్రకారం నశించిపోతుందని విచారపడవద్దు- అని భావం. మిగిలినది స్పష్టం.

## నాయకి రాత్రి దీర్ఘం కావడం గూర్చి విచారించడం

70\. వళైవాయ్ త్తిరుచ్చక్కరత్తు ఎజ్గళ్ వానవనార్ ముడిమేల్,
తళైవాయ్ నఱుజ్గణ్ణి త్తణ్ణన్దుழாయ్క్కు వణ్ణమ్బయలై-,
విళైవాన్ మిగ వన్దు నాళ్‌తిజ్గళాణ్డూழி నిఱ్క ఎమ్మై
ఉళైవాన్ పుగున్దు, ఇదువోర్ కఙ్గులాయిర మూழிగళే

వళై వాయ్ తిరు శక్కరత్తు = గుండ్రని అంచును కల అందమైన చక్రాయుధాన్ని కల్గిన, ఎజ్గళ్ వానవనార్ = మాకు నాయకుడు, పరమపదంలో ఉండేవాడైన భగవానుని, ముడి మేల్ = కిరీటంపై అలంకరించిన, తళై వాయ్ = కట్టును కల్గిన, నఱు = పరిమళాన్ని కల, కణ్ణి = మాలికారూపంలోని, తణ్ అమ్= చల్లని, అందమైన, తుழாయ్క్కు = తులసికోసం ఆశపడి, వణ్ణమ్ పయలై విళైవాన్ = నా లావణ్యం మాఱి, పాలిపోయిన రంగు పెరిగేటట్లు, మిక వన్దు = మిక్కిలిగా వచ్చి, నాళ్ తిజ్గళ్ ఆణ్డు ఊழி నిఱ్క = దినాలు, మాసాలు, సంవత్సరాలు, కల్పాలు గడిచాయి తప్ప, ఎమ్మై ఉళైవాన్ పుకున్దు = మమ్ములను పూర్తిగా నశింపజేయాలి- అని సమీపించి, ఇదు ఓర్ కఙ్గుల్ = ఈ ఒకరాత్రి, ఆయిరమ్ ఊழிకళే = వేయి కల్పాలుగా ఉన్నది.

**భావదీపిక :** రాత్రిసమయంయొక్క దైర్ఘ్యాన్నిగూర్చి నాయకి విలపించి పలికే పాశురం ఇది. నాయకుడు విశ్లేషించగా, ఆ విరహవ్యసనాన్ని తాళలేక పగలుకంటే రాత్రి సమయంలో ఎక్కువగా బాధపడి, అతికష్టంపై కొన్ని రాత్రులను గడపిన నాయకి, ఆ బాధ నానాటికి అధికమైనందున, రాత్రి కూడా నానాటికి చాలా దీర్ఘంగా తోచినందున దానిని గూర్చి, "ఇంతకు ముందు నా వర్ణాన్ని మాఱ్చడం కోసం ఒకదినంగా, ఒక మాసంగా, ఒక వర్షంగా, ఒక కల్పంగా- ఈ రీతిలో మెట్టుమెట్టుగా పెరిగి దీర్ఘంగా తోచి బాధించిన ఈ చీకటి ఈనాడు నన్ను పూర్తిగా లేకుండా జేయడంకోసం చాలా పలు కల్పాలుగా తోచి బాధిస్తున్నది"- అని ఒకనాటి రాత్రి పల్కిన మాట ఇది.

**(వళైవాయ్ తిరుచ్చక్కరత్తు)**- శంఖాన్ని, పదునైన చక్రాన్ని కల- అని కూడా వివరించవచ్చు.

దీనికి స్వాపదేశార్థం - భగవానుని దరి చేరలేని స్థితిలో ఆలస్యాన్ని భరించ లేనందున కాలం చాలా దీర్ఘంగా తోచి, క్లేశపడే ఆ*ழ்*్వార్లు పల్కిన సూక్తి. సర్వేశ్వరత్వానికి అసాధారణ చిహ్నమైన చక్రాన్ని, జీవాత్మలకు శేషంగా కల్గి ఉండడానికి తగిన సంబంధాన్ని, ఉభయవిభూతులను, అలంకారాన్ని కల భగవానుని భోగ్యతను అనుభవించలేనందున మా రూపు మాపేటట్లు మమ్ములను బాధిస్తున్న రీతిలో కాలం అవధి అనేది లేకుండా పెరుగుతున్నది- అని తల్లడిల్లుతూ ఆ*ழ்*్వార్లు పల్కిన మాట ఇది.

**ధాత్రి తనపట్ల కోపించిన విషయాన్ని నాయకి సఖితో పల్కడం**

**71. ఊ*ழி*గళాయ్ ఉలగే*ழு*మున్డా నెన్టిలమ్, ప*ழ*జ్గణ్డు**
**ఆ*ழி*కళామ్ ప*ழ*వణ్ణ మెన్టేఱ్కు-, అంందే కొణ్డన్నై**
**నా*ழி*వళో వెన్నుమ్ ఞాలమున్డాన్ వణ్ణమ్ శొల్లి*ఱ్ఱె*న్నుమ్**
**తో*ழி*గళో ! వురైయీర్, ఎమ్మై యమ్మనై శూ*ழ்*గిన్టవే**

ఊ*ழி*కళ్ ఆయ్ = కాలతత్త్వానికి నిర్వాహకుడై, (మహాకల్పకాలం చివరలో), ఉలకు ఏ*ழு*మ్ ఉణ్డాన్ = లోకాన్ని అంతటిని ఉదరంలో పెట్టుకొని కాపాడినవాడు, ఎన్టు ఇలమ్ = అని (మేము నాయకుని నామం, మహిమ, లీలలు మొదలైనవానిని వ్యక్తంగా) పల్కినవారం కాము, కళా ప*ழ*మ్ కణ్డు = నల్ల కలివిపండును చూచి, ప*ழ*మ్ వణ్ణమ్ ఆ*ழி* ఎన్టేఱ్కు = ఈ పండురంగు సముద్రపు రంగు అని (సాభిప్రాయంగా పల్కడం కాకుండా, ఏదో సహజంగా) పల్కిన నాకు, ఇవళ్ నా*ழ்* ఎన్నుమ్ = ఈ బాలిక (నామాటను వినకుండా తన అభిప్రాయానుసారం) స్వతంత్రంగా వర్తించే గర్వాన్ని కల్గినది- అని కఠినోక్తులను పల్కుతుంది, ఞాలమ్ ఉణ్డాన్ వణ్ణమ్ శొల్లి*ఱ్ఱు* ఎన్నుమ్ = లోకాలను గ్రహించిన ఆ నాయకుని వర్ణాన్ని గూర్చి పల్కిన తీరు ఇది -అని దోషాన్ని పల్కుతుంది. తో*ழி*గళో = చెలికత్తెలారా!, ఎమ్మై అమ్మనై శూ*ழ்*కిన్ట = మా తల్లి మమ్ములను మార్చాలని తలచి ఆరోపించి పలికే పల్కులకు, ఉరైయీర్ = మీరు (సమాధానం) పలకండి.

**భావదీపిక :** తల్లిపడే కోపాన్నిగూర్చి నాయకి తన చెలికత్తెతో పల్కిన పాశురం ఇది. నాయకుని రహస్యంగా (**కళవొ*ழு*క్కు**) సంశ్లేషించి, తరువాత అతనిని విశ్లేషించిన నాయకి బాధపడేటపుడు, ఆ రహస్యసంగమం క్రమంగా బయటకు

పొక్కి, ఊరంతా గుప్పుమని అపవాదు వ్యాపించింది. దానిని తెలిసిన తల్లి "ఇది మన వంశానికి లోటు" అని భావించి, ఈమెను (నాయకిని) నిర్బంధంలో పెట్టింది. ఆమెకు భయపడి నాయకి తన ఆర్తివల్ల నోరు తెరచి ఏమీ పలవరించకుండా, తన ఆర్తిని లోలోపలే అణచుకొన్నది. అపుడు కొందఱు నల్ల కలివిపళ్ళను విక్రయిస్తూ ఉండగా, వానిని చూచి నాయకి "దీని రంగు సముద్రపురంగు వలె ఉన్నది" - అని మెచ్చుకుంటూ పల్కింది. వెంటనే ఈమెపై వ్యతిరేకమైన అభిప్రాయాన్ని కల్గిన తల్లి "ఈమె ఈ విధంగా పల్కడం నాయకుని వర్ణాన్ని కీర్తించడమే" అని భావించి "ఈ రీతిలో కూడా లోపల తమాయించుకోలేని, అణచుకోలేని స్వభావం ఉంటుందా?" అని గర్హించి పల్కింది. దానికి నాయకి బాధపడి, చెలికత్తెలను చూచి, "ఏ విధమైన ఆంతరభావాన్ని మనస్సులో పెట్టుకొని పల్కడం తెలియని నా స్వభావాన్ని మీరు ఆమెకు తెలిపి, ఆమె కోపాన్ని చల్లార్చండి"- అని వేడుకొంటున్నది.

కొన్ని ప్రతిబంధకాలవల్ల నాయకుని పొందలేని నాయకి, అతడు తనను వ్యక్తంగా త్వరలో వివాహం చేసికోవాలని తలచి, నాయకుడు సమీపంలో ఉండేటపుడు తన చెలికత్తెలతో పలికే రీతిలో ఊరిలో అపవాదు మిక్కిలి ప్రబలిన విషయాన్ని, దానిని తల్లి గ్రహించి గర్హించే విషయాన్ని అతనికి తెలిపే క్రమంలో త్వరలో వ్యక్తంగా వివాహం చేసికొమ్మని అతనిని ప్రేరేపించడమే దీని తాత్పర్యం. అపవాదు ప్రబలినందున తల్లి కోపిస్తున్నది; ఇక ఈ రహస్యసంగమం తగదు. త్వరగా వచ్చి వ్యక్తంగా వివాహం చేసికోవాలి- అని తన వివాహరుచిని నాయకి నాయకునకు తెల్పిన విధం ఇది.

**(ఊழிకళాయ్ ఉలకేழுముణ్డానెన్టిలమ్)- "ఊழிకళ్"** అనే బహువచనం కాలంలోని విభాగాలను సూచిస్తుంది. సకలకాలాలకు నిర్వాహకుడై, మహాకల్పకాలం చివరలో తన ఉదరంలో పెట్టుకొని కాపాడినవాడైన భగవానుడు- అని అతని తిరునామాన్ని కాని, లీలను కాని, గొప్పతనాన్ని కాని- వీటిలో దేనినీ నేను వ్యక్తంగా చెప్పలేదు. ఒకసారి ఆ విధంగా పల్కి ఉంటే అపుడు తల్లి దోషాన్ని నాపై పల్కడం సబబు అవుతుంది. అయ్యో! ఏమి ఆధారం లేకుండా దోషాన్ని పల్కుతున్నదే! -అని భావం. **"ఊழிకళాయ్"** అనే దానికి కల్పం, ఆ కాలంలో లయం చేసే సముద్రంలోని అగ్ని మొదలైనవి అనే వీటి రూపమై- అనికూడ వివరిస్తారు. **"ఎన్టిలమ్"** = అని చెప్పినవారం కాము- అని అర్థం.

**"ఊழிకళాయ్ ఉలకేழுముణ్డాన్"** అని చెప్పకపోతే, మఱి, ఇక ఏమని చెప్తావు? -అని అంటే, **"పழம் కణ్డు ఆழி కళామ్ పழవణ్ణ మెన్టేఙ్కు"** అని అంటున్నది. (అమ్మడంకోసంగా వీథిలోకి వచ్చిన) కలివి పండును చూచి, ఈ పండురంగు సముద్రం రంగును పోలి ఉన్నది- అని మనస్సు వేఱే లోపల ఏ అభిప్రాయాన్ని పెట్టుకోకుండా, ఇంతమాత్రమే పలికాను. ధ్వనించే అర్థాన్ని దేనినీ భావించకుండా సహజంగానే పలికాను. ఈ మాటనే పట్టుకొని నా తల్లి "ఈ పిల్ల నా మాటను వినకుండా తన ఇష్టానుసారంగా, స్వతంత్రంగా వర్తించే గర్వాన్ని కల్గినదైనది'' అని కఠినోక్తులను పల్కడం ఆరంభించింది. కలివిపండు రంగు సముద్రం రంగు- అని ఈమె పల్కడం ఊరికేనా! (సాభిప్రాయంగా పల్కింది)- లోకాలను కొలిచి పెద్దనోటిని కలవాని వర్ణాన్నిగూర్చి పల్కిన రీతియేకదా - అని దోషాన్ని పల్కడం ఆరంభించింది. చెలికత్తెలారా! ఈ రీతిలో నా తల్లి నన్ను అన్యధా తలచి, ఆరోపించి పలికే మాటలకు మీరే సమాధానం పల్కి, ఆమెకు (నిజాన్ని) స్పష్టం చేయాలి''- అని అన్నట్లయినది.

**"నాழ్"**- దోషం. **"నామా మికపుడైయోమ్ నాழ్"**, **"నాழాలమర్ ముయన్ఱ"** అనే పెరియతిరువన్దాది పాశురాలలో ఈ అర్థంలో ప్రయోగాన్ని గమనించాలి. పెరియాழ్వార్ తిరుమొழిలోని **"పల పల నాழம் శొల్లి ప్పழித్త శిశుపాలన్"** అనే చోట ఈ పదం **"అమ్"** అనే శారియైచ్చొల్‌తో ప్రయోగింపబడడం కూడా గమనించవచ్చు. ఇక్కడ, **"నాழముడైయాన్"** (దోషాన్ని కల్గినవాడు) అనే అర్థంలో **"నాழ్"** అనే ప్రయోగం ఔపచారికం. **(ఉపచార వழక్కు)**

ఇక, ఈ పాశురానికి స్వాపదేశార్థం వివరింపబడుతున్నది. ఆழ్వార్లు భగవానునిపట్ల తమకు కల్గిన అభినివేశాతిశయంచేత ఆ స్వామియొక్క ప్రాప్యమైన దివ్యరూపంలోని, సముద్రంవలె అపరిచ్ఛేద్యమైన మహిమను కీర్తిస్తూ ఒక మాటను పలుకగా, దానిని విన్న జ్ఞానులు ఆ మాటకు వేఱే అర్థాన్ని శంకించి, సాధనాంతర నిష్ఠను కలవారివలె ఉపాసనకు తగిన దొక కారణరూపాన్ని కీర్తించినట్లుగా భావించి, ఆ విధంగా పల్కడం తగదు- అని ఉపేక్షించారు. వారి ఆ స్వభావాన్ని ఆழ్వార్లు తమ భక్తులకు వ్యక్తం చేసి, వీరు నా మనస్సును గ్రహించకుండా ఆరోపించి పలికే మాటలకు నా మనస్సును తెలిసి అలవాటుపడిన మీరు సమాధానాన్ని పల్కి, వీరికి యథార్థాన్ని స్పష్టం చేయండి - అని అన్నారు.

**(ఊழிకళాయ్ ఉలకేழுముణ్డాన్ ఎన్ఱిలమ్)**- సాధనాంతరనిష్ఠను కలవారివలె ఉపాసనకు తగిన కారణరూపాన్ని గూర్చి మేము పలుకలేదు.

**(పழమ్ కణ్డు ఆழிకళుమ్ పழవణ్ణమెన్ఱేక్కు)**- ప్రాప్యమైన రూపాన్నిగూర్చి ఆ రూపం సముద్రంవంటిది- అని పల్కిన మాకు,

**(అంఃదే కణ్డు)**- ఆ మాటకే వేఱు అర్థాన్ని గ్రహించి,

**(అన్నై)**- జ్ఞానులు,

**(ఇవళో నాழ் ఎన్నుమ్)**- వీరయితే పరతంత్రమైన స్వరూపానికి విరుద్ధమైన స్వాతంత్ర్యాన్ని కలవారు- అని ఉపాసనకు విషయమైన కారణరూపాన్నిగూర్చి మేము పల్కినట్లుగా మాపై దోషాన్ని (ఆరోపించి) పల్కుతున్నారు.

**(అమ్మనై ఎమ్మై శూழ்కిన్ఱ)**- తల్లివలె మాపట్ల ప్రేమను కలవారైన జ్ఞానులు మా స్వరూపానికి ఏమి లోటు వస్తుందో !- అని ఆరోపించి శంకించిన సందేహానికి,

**(తోழிకళో! ఉరైయీర్)**- మీరు పరిహారాన్ని పల్కి వారికి స్పష్టం చేయాలి- అనే ఈ స్వాపదేశార్థాన్ని ఈ పాశురంలో గమనించాలి. ప్రపత్తిమార్గాన్ని అనుష్ఠించేవారు భగవానుని ప్రాప్యమైన రూపాన్నే భావించి కీర్తించాలి- అని, అదే ముక్తిని పొందడానికి గొప్ప మార్గం కాగలదని, ఉపాసనకు తగిన కారణరూపాన్నే కీర్తించి, ఉపాసించడం ముక్తిని పొందేవారికి అంతగా ఉపయోగించదని దీనివల్ల తెలియాలి.

## రాత్రివేళలో సహించలేని నాయకి బాలచంద్రోదయాన్ని చూచి మరింత క్లేశించడం

72. **శూழ்గిన్ఱ కఙ్గుల్ శురుఙ్గా విరుళిన్ కరుమ్ తిణిమ్బై,**
**పోழ்గిన్ఱ తిఙ్గళమ్బిళ్ళైయుమ్ పోழ்గ-, తుழாయ్మలర్క్కే**
**తాழ்గిన్ఱ నెఞ్జత్తొరు తమియాట్టియేన్ మామైక్కిన్ఱు**
**వాழ்గిన్ఱ వాఱిదువో? వన్దు తోన్ఱిற్று వాలియదే**

శూழ்కిన్ఱ = నిరంతరం చుట్టూ వ్యాపించే, కఙ్గుల్ = రాత్రియొక్క, శురుఙ్గా ఇరుళిన్ = తగ్గిపోకుండా పెరుగుతున్న చీకటియొక్క, కరు తిణిమ్బై= నల్లని సాంద్రతను, పేழ்కిన్ఱ = బ్రద్దలు చేస్తున్న, అమ్ పిళ్ళై తిఙ్గళుమ్ = అందమైన

బాలచంద్రుడుకూడా, పేఴ్గిక = (నన్నుకూడా) బ్రద్దలు చేయనీ, తుఴాయ్ మలర్క్కే = (నాయకుని తులసిని పొందడంకోసమే అభినివేశాన్ని పొందుతున్న మనస్సును కల, ఒరు తమియాట్టియేన్ = ఏ సహాయం లేకుండా, మిక్కిలి ఒంటరితనాన్ని కల్గినదాన్నైన నాయొక్క, మామైక్కు = (సహజమైన) మేనిరంగుకు (లావణ్యానికి), ఇన్టు వాఴ్కిన్ట ఆఱు = ఇపుడు ఉజ్జీవనం కలిగేటట్లు, వాలియదు వన్దు తోన్టిర్ఱు = శుద్ధమైన బాలచంద్రుడు వచ్చి ఉదయించడం, ఇదువో = ఈ విధంగానా?

**భావదీపిక :** చీకటిని తాళలేని నాయకి బాలచంద్రుని చూచి తల్లడిల్లుతూ పలికే మాట ఈ పాశురం. నాయకుని విశ్లేషించిన దశలో పగటి కాలంలో కంటే, రాత్రివేళ చీకటిలో మిక్కిలి వేదనపడే నాయకి, అపుడు బాలచంద్రుడు ఉదయించి ఆ చీకటిని పోగొట్టడం చూచి, ఇక నాకు చీకటి వల్ల కలిగే బాధ తగ్గిపోతుంది- అని భావించి, ఒక రీతిలో ఊరడిల్లే సమయంలో, బాలచంద్రుడు కూడా విరహిణు లకు తాపాన్ని కల్గించే వస్తువులలో ఒకటి అయినందున, అతడు ఈమెకు చీకటికంటే అధికంగా వేదనను కల్గించాడు. అపుడు అతనిని చూచి నాయకి మరింత క్లేశపడుతూ పల్కిన మాట ఇది. "నాకు శత్రువై చుట్టుముట్టే చీకటిని బ్రద్దలు చేసే బాలచంద్రుడు ఆ చీకటి అంతర్ధానానికి సంతోషించే నన్ను కూడా బ్రద్దలు చేయనీ. చంద్రవంక ఉదయించి, చీకటిని పోగొట్టడాన్ని చూచి, ఇక నా వ్యథ తగ్గిపోయి, కోల్పోయిన నా మేనివర్ణాన్ని తిరిగి పొంది ఉజ్జీవిస్తాను-అని తలచిన నాకు, అయ్యో! చంద్రవంక ఉదయించడం ఈ రీతిలోనా పర్యవసించింది!"- అని నాయకి అంటున్నది. బాధను తీర్చడంకోసం వచ్చాడని భావింపబడ్డవాడే బాధను అధికం చేస్తున్నాడే! ఏమి చేయను- అని అంటున్నది. **"వాలియదు"** - ఇది **"వాలిమై"** అనే స్వభావ వాచకంనుండి పుట్టిన **(ఒన్టన్‌పాల్ కుఱిప్పు వినైయాల్ అణైయుమ్ పెయర్)**

**"ఇదువో వన్దు తోన్టిర్ఱు వాలియదో"**- దీని స్వభావం చిన్నదిగా ఉన్నది- అని చెప్పవచ్చు. ఈ అర్థంలో విపరీతలక్షణద్వారా గర్హించి పలికే తీరు స్ఫురిస్తుంది. **"పిఴై"** - ఇది బాలుని సూచించే పదం.

తాము తలచిన రీతిలోనే ప్రాప్యసిద్ధి కల్గనందున తమకు కల్గిన మోహాంధకారం, దానిని అణచి వెలిగే తమ తత్త్వజ్ఞాన ప్రకాశం- అనే ఈ రెండు

భగవానుని చేరలేని దశలో బాధపడే తమను ఒక దానికంటె ఇంకొకటి మిక్కిలిగా బాధించి తమ స్వరూపాన్ని, నశింపజేసే స్వభావాన్ని ఆళ్వార్లు వ్యక్తం చేయడం ఈ పాశురంలోని స్వాపదేశం చంద్రోదయమంటే స్వాపదేశార్థంలో వివేకం.

చంద్రోదయం వల్ల నాయకి వేదన తీవ్రతరమైనదని పలికే సందర్భంలో పిళ్ళై అముదనార్ పల్కిన వార్తను పెరియవాచ్చాన్‌పిళ్ళై ఉదాహరించారు.

ఈ సందర్భంలో పిళ్ళై అముదనార్ ఒక కథను పలికేవారు. ఒక సాధుబ్రాహ్మణుడు అరణ్యమార్గంలో ప్రయాణం చేసేటపుడు అతనిని ఒక గోవు తరిమింది. ఆ పశువుబారినుండి నన్ను రక్షించేవారెవరు? అని అతడు తలచినపుడు, అక్కడకు వచ్చిన ఒక పులి ఆ పశువును వధించి, దాని రక్తాన్ని తాగి, బ్రాహ్మణుని ముందుకు వచ్చి తోకను ఆడిస్తూ నిలచింది. అపుడతడు "నన్ను చంపాలని వచ్చిన పశువు చనిపోయిందని సంతోషించనా? ఆ పశువునుండి ప్రాణాలను ఏదో ఒక రీతిలో కాపాడుకోవచ్చు. కాని, ఈ పులిబారినుండి తప్పుకోవడం ఇక జరగని పని అయ్యో!" అని కదా భావించి ఉంటాడు. అదేరీతిలో చీకటినుండి కాపాడేవాడుగా చంద్రుడు ఉదయించినా, ఆ చంద్రుడు కల్గించే వేదననుండి తప్పుకోవడం అనేది అసాధ్యం- అనేది ఈ వృత్తాంతం ద్వారా అముదనార్ చేసిన వివరణం.

## బాలచంద్రుడు ఉదయించిన సాయంకాలంలో విరహాన్ని సహించలేని నాయకి పడే ఆర్తిని గూర్చి సఖి విచారించడం

73. వాల్ వెణ్ణిలవు ఉలగార చ్చురక్కుమ్ వెణ్‌తిజ్గళెన్నుమ్,
పాల్‌విణ్ శురవి శురముదిర్ మాలై-, పరిది వట్టమ్
పోలుమ్ శుడరడలాழிప్పిరాన్ పాழிలేழிక్కుమ్
శాల్బిన్ తగైమైకొలామ్?, తమియాట్టి తళర్న్దదువే

విణ్ = ఆకాశంనుండి, వాల్ వెళ్ నిలవు = చాలా తెల్లని వెన్నెల అనే, పాల్= పాలను, ఉలకు ఆర శురక్కుమ్ = లోకం అంతా నిండేటట్లు స్రవించే, వెళ్ తిజ్గళ్ ఎన్నుమ్ = తెల్లని చంద్రుడనే, శురవి = సురభి (గోవు) యొక్క, ముదిర్= మిక్కిలి ముదిరిన, మాలై = సాయం సమయంలో, శుర = చేప, తమియాట్టి= (నాయకుడు రానందున) ఒంటరితనాన్ని కల ఈమె, తళర్న్దదు = క్లేశాన్ని పొందిన

స్వభావం, పరిది వట్టమ్ పోలుమ్ శుడర్ = ఈ చంద్రుని కాంతిని గ్రహించ గల సూర్యమండలంవంటి కాంతిని కల, అడల్ ఆళ్ళి = బలమైన చక్రాయుధాన్ని కల, పిరాన్ = ఆ నాయకుడు, ఏళ్ళ్ పొళ్ళిల్ = ఏడు విధాలైన లోకాలను, అళిక్కుమ్ శాల్ పిన్ తకైమైకొల్ ఆమ్ = రక్షించే ప్రకారం యొక్క గొప్పతనమా?

**భావదీపిక :** చంద్రవంక ఉదయించిన సాయంకాల సమయంలో తనరకు కల్గిన అతిశయించిన విరహార్తిని భరించలేని నాయకిని చూచి సఖి బాధపడుతూ పలికే పాశురం ఇది. సాయంకాలానికి, బాలచంద్రునకు బాధపడేట్లుగా ఈమెను ఒంటరిగా విడచిపెట్టడం లోకాన్ని అంతటిని రక్షించే గొప్పతనానికి కొంచెం కూడా పొసగదు- అని అంటున్నది. ఆకాశంలో నిలచి, చాలా తెల్లని వెన్నెల అనే పాలను లోకంలో అంతటా నిండేటట్లు స్రవించే చంద్రుడనే కామధేనువు యొక్క చేపును కల్గిన సాయంసమయంలో ఈ నాయకి ఒంటరితనాన్ని అనుభవిస్తూ బాధపడడం సుదర్శనాన్ని చేతిలో ధరించినవాడు లోకాలను అన్నిటిని రక్షించే ప్రకారానికి పొసగుతుందా? (పొసగదు).

వెన్నెలలో పాలస్వభావాన్ని, దానిని వ్యక్తం చేసే అమృతకిరణుడైన చంద్రునిలో పాలను స్రవించే గోవు స్వభావాన్ని ఆరోపించి పల్కడం వల్ల ఇక్కడ రూపకాలంకారం.

**(ఉలకు ఆర చ్చురక్కుమ్)-** లోకమనే చట్టి (బాన) నిండేటట్లు స్రవిస్తుంది- అని భావం.

**(విణ్శురవి)-** దివ్యమైన ధేనువు. **"సురభిః"** అనే సంస్కృతపదం **"శురవి"** అని మారింది. **"శుర"-** శురప్పు (పాలను స్రవించగా) **"పరిది"-** ఇది **"పరిధి"** సంస్కృతపదం.

**(పొళ్ళిలేళ్ళళిక్కుమ్)- "పొళ్ళిల్"-** లోకం. లేక, **"పొళ్ళిల్"-** పూదోట- అని కూడా అర్థం. లోకాలను భగవానుని శృంగారోద్యానాలని అంటారు. **"పిరాన్ పెయ్ద కావు కణ్డీర్ పెరున్దేవుడై మూవులకే"** (ముల్లోకాలు స్వామి పెంచిన ఉద్యానవనమే సుమా!) (6-3-5) అని అన్నారు, తిరువాయ్మొళ్ళిలో కూడా.

ఈ పాశురానికి స్వాపదేశం. ఏమంటే- తగిన కాలంలో ప్రాప్యం కైవసం కానందున జ్ఞానప్రకాశం కూడా బాధకం కాగా, ఆళ్వార్లు పడే మిక్కిలి బాధను చూచిన వారి భక్తులు చాలా నొచ్చుకొని పల్కిన మాట ఇది.

(పిరాన్ పాழிలేழிళిక్కుమ్ శార్పిన్ తకైమైకొలామ్ తమియాట్టి తళర్న్దదువే)- భగవానునకు సహజమైన సర్వరక్షకత్వం, ఈ ఆழ்వార్ల విషయంలో ప్రవర్తించకుండా పోతున్నదే!- అని శంకించిన రీతి ఇది. "శాల్విన్" అనే పాఠాంతర మున్నది. "వాల్, వెళ్" ఒకే అర్థాన్ని ఇచ్చే రెండు పదాలు ఇవి. వీటి ప్రయోగం ఆధిక్యాన్ని సూచించడం కోసం "నిలవులగార" అనేచోట "నిలవు" అని విడదీయకుండా "నిల" అని కూడా విడదీయవచ్చు. "కుఱియదన్కీழ் ఆక్కుఉదలుమ్ అదనొడు ఉకర మేగ్ఱలుమ్ ఇయల్ పుమాన్దాక్కిన్" అనే నన్నూల్సూత్రం స్మరణీయం.

**నాయకుని మాలికాగంధాన్ని గ్రహించి వీచే చల్లగాలిని గూర్చి నాయకి ఆనందిస్తూ పల్కడం**

**74.** తళర్న్దుమ్ ముఱిన్దుమ్ వరుతిరై ప్పాయల్, తిరునెడుఙ్గణ్
వళర్న్దు మఱివుగ్ఱుమ్ వైయమ్ విழுఙ్గియుమ్-, మాల్వరైయై
క్కిళర్న్దు మఱితర క్కీణ్డెడుత్తాన్ ముడిశూడు తుழாయ్
అళైన్దుణ్ శిఱుపశున్దెన్ఱల్, అన్దో! వన్దులాగిన్ఱదే

తళర్న్దుమ్ ముఱిన్దుమ్ వరు తిరై = (పైకి లేచి పడుతూ, విరుగుతూ) సాంద్రతవల్ల కింద పడుతూ, గాలి కారణంగా శిథిలమవుతూ వచ్చే అలల ఉద్ధృతిని కల క్షీరాబ్ధిలో, పాయల్ = ఆదిశేషుడనే శయనంలో, తిరు నెడు కణ్ వళర్న్దుమ్= అందమైన, దీర్ఘమైన తిరునేత్రాలు మూసికొని, అఱివుగ్ఱుమ్ = (ఆ నిద్రలో అన్నిటిని) తెలిసికొని, వైయమ్ విழுఙ్గియుమ్ = ప్రళయకాలంలో లోకాలను ఉదరంలో పెట్టుకొని కాచి, మాల్ వరైయై కిళర్న్దు మఱి తర కీణ్డు ఎడుత్తాన్ = గోవర్ధనగిరిని పైకి ఎత్తి పట్టిన గొడుగువలె విస్తరించేటట్లు పైకి లేవనెత్తి పట్టుకొని- ఈ విధంగా సహాయపడే భగవానుని, మూడి శూడు తుழாయ్ = కిరీటంలో అలంకరించుకొన్న తులసిని, అళైన్దు ఉణ్ = సంగ్రహించి లోపలకు గ్రహించి, పశు శిఱు తెన్ఱల్ = నూతనమైన, లేతది అయిన దక్షిణదిక్కులోని గాలి (మలయ మారుతం) అన్దో వన్దు ఉలాకిన్ఱదు = ఆహా! ఆనందం కలిగేటట్లు (నాపై) వచ్చి వీస్తున్నది.

**భావదీపిక :** నాయకుని తులసీమాలికపై ప్రసరించిన దక్షిణదిశలోని గాలి దాని సువాసనను గ్రహించి తనపై వీచగా, నాయకి ఆనందించి పలికే పాశురం,

ఇది. నాయకుని మేనితో సంబంధాన్ని కల్గిన వస్తువులు తన శరీరానికి తగిలి తన విరహార్తిని కొంచెం ఉపశమింపజేశాయనే సంతోషాన్ని నాయకి తన చెలితో పల్కుతున్నది.

ఉప్పొంగి వీచే అలల విజృంభణను కల క్షీరాబ్ధిలోని శేషశయనంలో **"ఉఱఙ్గువాన్ పోల్ యోగు శెయ్ద"** (నిద్రించేవానివలే లోకరక్షణ చింతను చేసిన) అనే రీతిలో నిద్రించేవానివలె కన్నులు మూసికొని జగద్రక్షణ చింతను చేస్తూ ప్రళయకాలంలో లోకాలను తన ఉదరంలో గ్రహించి, కాపాడి, గోవర్ధనగిరిని గొడుగుగా ఎత్తి పట్టుకొని, పెద్ద వర్షంవల్ల కల్గిన క్లేశాన్ని పోగొట్టి ఉపకరించిన స్వామియొక్క కిరీటంలో అలంకరించుకొన్న తులసిని స్పృశించిన నూతనమైన పిల్ల తెమ్మెఱ సంతోషం కలిగేటట్లుగా నా మేని పైకి వచ్చి వీస్తున్నది- అని భావం.

ఇక, ఈ పాశురాన్ని- దక్షిణ దిశనుండి వీచే మందమారుత గమనాన్ని చూచి దానికి క్లేశపడడం ఆరంభించిన నాయకిని చూచి ఆమె సఖి "ఇది కేవలం మందమారుతమని భావించకు. ఇది అతని శరీరాన్ని తాకి వచ్చే వాయువుసుమా! ఇది అతని రాకకు సూచకం"- అని పల్కి శోకాన్ని ఉపశమింపజేస్తున్నదని కూడా కొందఱు వివరిస్తారు.

**"హంత"** అనే సంస్కృతశబ్దం (అవ్యయ) ఆనందం, జాలి, దుఃఖం మొదలైన అర్థాలలో ప్రయోగింపబడుతుందని సంస్కృతభాషానిఘంటువులలో తెలుపబడినందున, దాని వికారమైన **"అన్దో!"** అనేది ఇక్కడ ఆనందాన్ని తెలిపే పదంగా ప్రయోగింపబడింది (దీనికి బదులుగా **"అన్టో"** అనే పాఠాంతరాన్ని నిశ్చయార్థకంగా కొందఱు గ్రహించారు).

**(తిరునెడుఙ్కణ్ వళర్న్దు మఱివుఱ్ఱుమ్)**- భగవానుని నిద్ర మన నిద్ర వలె తమోగుణకార్యమై, శరీరం తెలియకుండా పొందే నిద్ర కాకుండా, అన్ని వస్తువులను తెలిసికొంటూ, లోకరక్షణచింతను చేసే నిద్ర కనుక **"కణ్ వళర్న్దుమ్ అఱివుఱ్ఱుమ్"** అని అనబడింది. దీనినిబట్టియే ఆ నిద్ర- యోగనిద్ర, ఇది **"అఱితుయిల్, విழிతుయిల్, తుయిలా త్తుయిల్, పాయ్యుఱక్కమ్"**- అనబడుతుంది. 'మాల్వరైయై మఱితర ఎడుత్తాన్" అని అన్నందున- పశువులు ఎక్కి గడ్డి మేసేటట్లుగా గోవర్ధనగిరిని తల్లక్రిందులుగా ఎత్తి పట్టుకొన్న విషయం స్ఫురిస్తుంది. **"శిఱు తెన్ఱల్"**- మందమారుతం.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే- విశ్లేషించిన దశలో ఆళ్వార్లు తాము భగవానుని కారుణ్యం, ఐశ్వర్యం, భోగ్యత- అనే గుణాల అనుభవాన్ని పొంది, ఆశ్వాసాన్ని పొందిన స్థితినిగూర్చి పల్కుతున్నారు- అని. ఇక, మిగిలిన విశేషాలు స్పష్టం. దీనిని సఖీవచనంగా గ్రహించే పక్షంలో- అతడు ఆశ్రితులను రక్షించడం కోసం సముద్రంలో యోగనిద్రను పొందడం, ప్రళయాపదలో లోకాలను తన ఉదరంలో పెట్టుకొని కాపాడడం, గోవర్ధనోద్ధరణం చేయడం- అనే మహాగుణాలను గూర్చి పల్కి భక్తులు ఆళ్వార్లను ఆశ్వాసిస్తున్నట్లుగా స్వాపదేశార్థాన్ని గమనించాలి.

## తన మనోరథాన్ని వ్యక్తం చేయగోరిన నాయకుడు నాయకితో, ఆమె సఖితో వారి ఊరును గూర్చి ప్రశ్నించడం

75. ఉలాగిన్ఱ కెణ్డై యొళియమ్బు, ఎమ్మావియై మూడురువ
కుృలాగిన్ఱ వెఙ్జిలై వాణ్ ముగత్తీర్ !-, కునిశఙ్గిడఱి
పుృలాగిన్ఱ వేలై ప్పుణరియ మ్బళ్ళియమ్మాన్ అడియార్
నిలాగిన్ఱ వైగున్దమో ?, వైయమో ? నుమ్ నిలైయిడమే

ఉలాకిన్ఱ = (చెవివరకు వెళ్ళి తిరిగి వెనుకకు) చలించే, కెణ్డై = బేడిస చేప రూపంలోని, ఒళి అమ్బు = కాంతిని కల (కన్నులనే) బాణాలు, ఎమ్ ఆవియై ఊడు ఉరువ = మా ప్రాణాన్ని లోపల దూరి తొలిచి వేసేటట్లుగా, కులాకిన్ఱ = (ఆ బాణాలను ప్రయోగించడానికి) వంచే, వెమ్ శిలై = (కనుబొమలు అనే) క్రూరమైన వింటిని కల, వాళ్ ముకత్తీర్ = ప్రకాశాన్ని కల్గిన ముఖాలను కలవారలారా!, కుని శఙ్గు ఇడరి = కొంచెం వంగిన రూపాన్ని కల (దక్షిణావర్తాన్ని కల) శంఖాలను గట్టుకు కొట్టుకొనవచ్చి తోసి, పులాకిన్ఱ = చేపల వాసనను వీచే, పుణరి = అలల వృద్ధిని కల సముద్రాన్ని, అమ్ పళ్ళి = అందమైన పడుకగా కల, అమ్మాన్ = సర్వేశ్వరుని, అడియార్ నిలాకిన్ఱ = భక్తులైన నిత్యులు, ముక్తులు వెలిగి నివసించే, వైకున్దమో = శ్రీవైకుంఠలోకమా?, లేక, వైయమో = ఈ భూలోకమా?, నుమ్ నిలై ఇడమ్ = మీ నివాసం?

భావదీపిక : (నాయకితో) ఏకాభిప్రాయాన్ని (మదియుడమ్ పడుత్తల్) పొందిన నాయకుడు ఆమె సఖిని బదులుకోసం ప్రశ్నించే ప్రక్రియ ఇది. నాయకి, ఆమె సఖి కలసి ఉండే సమయం చూచి, నాయకుడు వారి దగ్గరకు వెళ్ళి, తన

అభిప్రాయాన్ని సూచన చేయడంకోసం ఒక నెపంగా వారి ఊరును గూర్చి ప్రశ్నించడమే ఈ ప్రక్రియలోని ప్రకారం.

చెవివరకు దీర్ఘమై, బేడిసచేప రూపంలో ఉండే కన్నులనే బాణాలు మా ప్రాణాలలోపల దూరి తొలిచి వేసేటట్లు ఆ అంబులను ప్రయోగించడానికి వంగి ఉండే కనుబొమలనే క్రూరమైన వింటిని కలవారలారా? అని నాయకిని, ఆమె సఖిని నాయకుడు సంబోధిస్తున్నాడు. కన్నులను బాణాలుగా, కనుబొమలను విల్లుగా వర్ణించడం కవిసమయం. చేతితో పట్టుకొనే విల్లంబులతో బాధించే లోకరీతిలో కాకుండా, ముఖంలో గ్రహించిన విల్లంబులతో బాధించే వైలక్షణ్యం స్ఫురించేటట్లుగా **"వాణ్ ముకత్తీర్ !"** అనే సంబోధన చేయబడింది.

చివరి పాదాలు ప్రశ్నలను తెల్పుతున్నాయి. ఈ లోకంలోనివారికంటే వీరి (నాయకి, సఖుల) రూపసౌందర్యం చాలా విలక్షణమై ఉన్నందున **"నుమ్ నిలైయిడమ్ వైకున్దమో?"** అని అనబడింది. వీరిని చూచినది ఈలోకంలోనే కనుక **"వైయమో!"** అని అనబడింది.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే -ఆళ్వార్ల స్వరూపాన్ని చూచి, అభినివేశాన్ని పొందిన భాగవతులు వారిని (ఆళ్వార్లను), వారితో పోలినవారి భక్తులను చూచి, "మీరుండే చోటు ఆ నిత్యవిభూతియా?"అని ఆశ్చర్యంగా ప్రశ్నించడం.

**(ఉలాకిన్ద వాణ్ముకత్తీర్ !)**- విస్తరించిన, చల్లని, సూక్ష్మమైన ప్రకాశాన్ని కల మీ జ్ఞానాన్ని మా మనస్సులో నిలచేటట్లు ప్రవేశింపజేసే ముఖవికాసాన్ని కలవార లారా!- అని ఈ సంబోధనలోని భావం. భగవానుని నిత్యులు, ముక్తులు నివసించే, నిత్యవిభూతియా! ఈ లీలావిభూతియా!, మీరుండే చోటు?-అని ప్రశ్నిస్తున్నారు. ఆళ్వార్ల జ్ఞానం మొదలైనవాని మహిమవల్ల వారు ముక్తులని చెప్పేటట్లుగా, అక్కడనుండి ఇక్కడకు వచ్చినవారొకరు- అని చెప్పేటట్లుగా ఉండే స్థితి ఈవిధంగా వికల్పించి ప్రశ్నించడానికి కారణం. లేక, పూర్ణానుభవం పొందలేనందున వారు ఈ లోకంలోనివారా?- అని, సంసారసంబంధం లేనందున ఆ లోకంలోని వారా?- అని, శంక కల్గిందని భావం.

**"అడియార్ నిలాకిన్ద... నుమ్ నిలైయిడమో?"** అనే సూక్తి వివరణలో పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానంలో పిళ్ళై తిరునఱైయూర్ అరైయర్ పల్కిన ఒక సూక్తి ఉదాహరింపబడింది.

ప్రకృతసూక్తిలో "అడియార్ నిలాకిన్ల" అనే విశేషణం ప్రయోగింప బడడాన్ని గూర్చి పిళ్ళై తిరునఱైయూర్ అరైయర్- "భక్తుల (నిత్యసూరుల) ఆజ్ఞకు లోబడి ఉండే పరమపదమా? లేక, అతనిది అయిన భూలోకమా? మీరుండే చోటు?" అని ప్రశ్నిస్తున్నట్లుగా వివరించారు. అంటే- అన్ని లోకాలకు భగవానుడే నాయకుడు అయినా, పరమపదం, భగవానుని దాసులు చక్కగా జ్ఞానం వికసించినవారైన నిత్యసూరుల ఆజ్ఞకు లోబడి ఉంటుంది. అయితే, ఈ లోకంలో ఉండేవారు అహంకారమమకార దూషితులైనందున, వారివద్ద ఈ లోకాన్ని అప్పగించకుండా భగవానుడే స్వయంగా పాలిస్తాడు. అందువల్ల పరమపదం అతని భక్తులది, ఈ లోకం అతనిది- అనేది అరైయర్ అభిప్రాయం. ఈ వార్త నమ్బిళ్ళై వ్యాఖ్యలో కూడా ఉన్నది.

## సాయంసమయంలో ఆర్తిని సహించలేని నాయకి చంద్రుని చూచి బాధపడుతూ మనస్సుతో పల్కడం

76. ఇడమ్బోయ్ విరిన్దు ఇవ్వులగళన్దాన్ ఎழிలార్ తణ్డుழాయ్,
వడమ్బోదినైయుమ్ మడ నెఞ్జమే!-, నఙ్గళ్ వెళ్వళైక్కే
విడమ్బోల్ విరిదలిదు వియప్పే వియన్ తామరైయిన్
తడమ్బోదొడుఙ్గ, మెల్లామ్బల్ అలర్విక్కుమ్ వెణ్ తిఙ్గళే

ఇడమ్ పోయ్ విరిన్దు = అన్ని చోట్లకు పోయి పెరిగి, ఇ ఉలకు అళన్దాన్ = ఈ లోకాన్ని కొలిచి గ్రహించినవాని, ఎழிల్ ఆర్ = అందం నిండిన, తణ్ = చల్లని, తుழాయ్ పోదు వడమ్ = తులసీమాలను పొందడంకోసం, ఇనైయుమ్= క్లేశపడే, మడ నెఞ్జమే = ఓ మూఢ మనసా!, వియల్ తామరై యిన్ తడ పోదు = గొప్ప పెద్ద తామరపుష్పం, ఒడుఙ్గ = ముకుళించగా, మెల్ ఆమ్బల్ = సుకుమార మైన కలువపూవును, అలర్విక్కుమ్ = వికసింపజేసే, వెళ్ తిఙ్గళ్ = తెల్లని చంద్రుడు, నఙ్గళ్ వెళ్ వళైక్కే విడమ్ పోల్ విరితల్ ఇదు = మన తెల్లని గాజులను జారిపోయేటట్లు చేయడంకోసమే విషంవలె కాంతిని విస్తరింపజేయడం- అనే ఇది, వియప్పే = ఒక ఆశ్చర్యమా!

**భావదీపిక :** నాయకుని మాలికను (ఆశపడి దానిని) పొందలేక బాధపడే నాయకి చంద్రుని చూచి క్లేశపడుతూ తన మనస్సుతో పలికే మాట ఇది.

అన్నిచోట్లకు పోయి, పెరిగి వ్యాపించి, ఈ లోకాలను కొలిచినవాడైన సర్వేశ్వరుని తులసీమాలికను పొందడంకోసం బాధపడే ఓ మనసా! చంద్రుడు, ఏ వైలక్షణ్యం లేని కలువపూవుపట్ల ప్రేమను కల్గి, దానికి వికాసాన్ని కల్గించి, గొప్ప తామరను బాధించే (ముకుళింపజేసే) అల్పగుణాన్ని కలవాడైనందున, అతడు మన అందమైన చేతిగాజులను జారిపోయేటట్లు చేయడం ఏమీ ఆశ్చర్యం కాదు- అని అంటున్నది. ఇది చంద్రోపాలంభనం. తామరకు నాయకుడైన సూర్యుడు అస్తమించిన చోట ఆ తామరను బాధించే ఇతనికి (చంద్రునకు), నాయకుని విశ్లేషించిన మమ్ములను బాధించడం సహజమే- అని భావం.

**(వడమ్‌పోదినైయుమ్)- "వడమ్ పోదు + ఇనైయుమ్"** అని విడదీయకుండా, **"వడమ్‌పోదిన్ + నైయుమ్"** అని విడదీయవచ్చు. అర్థం మాత్రం ఒకటే.

**(మడనెఞ్జమే!)** దుర్బలమైన (అల్పమైన) వస్తువులో సంబంధాన్ని కల్గి ఉండడంతో పాటు, ఆ సంబంధాన్ని ఎప్పటికీ విడువకుండా వ్యర్థంగా బాధపడే ఓ మనసా!- అని అర్థం. "విడమ్ పోల్ విరిదల్" అనే ప్రయోగానికి విషం వధించేటట్లు మనలను వధించడంకోసమే చంద్రుడు వచ్చి ఉదయించడం- అని అర్థం. అందువల్ల ఈ ఉపమ బాధించే స్వభావాన్నిబట్టి వచ్చినది తప్ప వర్ణాన్ని బట్టి వచ్చినది కాదు. "వియప్పే"- ఇచటి ఏకారం వ్యతిరేకార్థకం. **(ఎదిర్‌మత్తై)** ఆశ్చర్యం కాదు- అని భావం.

దీనికి స్వాపదేశార్థం ఏమంటే- ప్రాప్యసిద్ధిని పొందలేని స్థితిలో తమకు కల్గిన వివేకంకూడా ప్రతికూలమై, బాధించే స్వభావాన్ని కల్గి ఉండడాన్ని ఆళ్వార్లు తమ మనస్సును ఉద్దేశించి పల్కడమే.

**(ఇడమ్ పోయ్ మడ నెఞ్జమే!)** - సర్వసులభుడైన సర్వేశ్వరుని భోగ్యత మొదలైనవానిలో అభినివేశాన్ని పొంది, పూర్ణానుభవాన్ని పొందలేకపోవడం వల్ల బాధపడే ఓ మనసా!

**(వియల్ తామరైయిన్ తడమ్ పోదు ఒడుఙ్గ మెల్ ఆమ్బల్ అలర్ విక్కుమ్ వెణ్ తిఙ్గళ్)**- గొప్ప అర్థాలను వ్యక్తంచేయకుండా, నీచమైన అర్థాలనే వ్యక్తం చేసే వివేకం.

**(నఙ్గళ్ వెళ్‌వెళైక్కే విడమ్ పోల్ విరితల్ ఇదు వియప్పే)**- మన శుద్ధమైన శేషత్వాన్ని నశింపజేయడంకోసం వ్యాపించడం అనేది ఒక ఆశ్చర్యమా!- అని ఆళ్వార్లు మనస్సులో క్లేశంతో పలికారు.

## సాయంసమయానికి తాళలేని నాయకి బాధపడడం

77. తిజ్గళమ్ పిళ్ళై పులమ్బుత్తన్ శెజ్గోలరశు పట్ట,
శెజ్గళమ్ పఱ్ఱి నిన్ఱెళ్గు పున్మాలై-, తెన్ పాలిలజ్ఞై
వెజ్గళమ్ శెయ్ద నమ్ విణ్ణోర్ పిరానార్ తుழாయ్ తుణైయా
నజ్గళై మామైకొళ్వాన్, వన్దు తోన్ఱి నలిగిన్ఱదే

తిజ్గళ్ = బాలచంద్రుడనే, అమ్ పిళ్ళై = అందమైన తన బిడ్డ, పులమ్బ = (తండ్రిని కోల్పోయి) ఒంటరియై బాధపడగా, శెజ్గోల్ తన్ అరశు పట్ట = ఎఱ్ఱని కాంతి అంతట అడ్డు లేకుండా ప్రసరించడమనే స్వామిత్వాన్ని కల తన నాయకుడు సూర్యుడు అస్తమించడానికి చోటయిన, శెమ్ కళమ్ = ఎఱ్ఱని ఆకాశమనే (రక్తంతో) ఎఱ్ఱని యుద్ధరంగాన్ని, పఱ్ఱి = పొంది, నిన్ఱు = అక్కడ నుండి వెళ్ళకుండా నిలచి ఉండి, ఎళ్కు = రోదించే (వెక్కిళ్ళుపెట్టే), పుల్ మాలై = నైచ్యాన్ని పొందిన సాయంకాలమనే కాంత విషయంలో, తెన్ పాల్ ఇలజ్ఞై = దక్షిణదిక్కులో ఉండే లంకాపురిని, వెమ్ కళమ్ శెయ్ద = భయంకరమైన యుద్ధభూమిగా చేసిన, నమ్ విణ్ణోర్ పిరానార్ = మన దేవాధిదేవుడైన నాయకుని, తుழாయ్ =తులసిని, తుణై ఆ = తనకు రక్షకంగా గ్రహించి, నజ్గళై మామై కొళ్వాన్ = మన మేని కాంతిని (లావణ్యాన్ని) అపహరించడంకోసం, వన్దు తోన్ఱి నల్కిన్ఱదు = ఎదురుగా వచ్చి ఉదయించి బాధిస్తున్నది.

**భావదీపిక** : సాయంసమయానికి తాళలేక నాయకి విలపించి, పలికే పాశురం ఇది. పూర్వం **"పాల్ వాయ్ పిఱైప్పిళ్ళై"** అనే ముప్పై అయిదవ పాశురంలోని పూర్వపాదాలను ఈ పాశురంలోని పూర్వపాదాలు స్మరింపజేస్తాయి. ఇందులో సాయంకాలాన్ని ఒక కాంతగా, సూర్యుని ఆమె) భర్తగా, చంద్రుని వారి బిడ్డగా, సూర్యుని ఎఱ్ఱని కిరణాలను అతని రాజ్యాధికారంగాను, ఆ సూర్యుడు అస్తమించడం ఆ భర్త మరణించినట్లుగా, అతడు అస్తమించే దిక్కులోని ఎఱ్ఱని భాగాన్ని అతడు మరణించి పడిపోయిన యుద్ధభూమిగా, సూర్యాస్తమయకాలంలో పడమటి దిక్కులో అతని కిరణసంబంధంతో వెలిగే ఎఱ్ఱని ఆకాశాన్ని అతడు యుద్ధంలో పడిపోయి చనిపోయేటపుడు అతని రక్తం ప్రవించిన చోటుగానును రూపించి పలుకబడింది. భర్తను కోల్పోయిన ఈమె కంటికి కన్పించేవి అన్నీ భర్తను కోల్పోయినవిగా తోచడంచేత ఈ విధమైన కల్పన చేయబడింది. ఈ

విధంగా చూచినవారు జాలి పడదగిన స్థితిని పొందిన సాయంసమయం, నాయకుని జ్ఞాపకం చేస్తూ బాధించే తులసీమాలికను సహాయంగా చేసికొని నాయకిని బాధించడం, తన సంతానం ఒంటరి అయేటట్లు తన భర్తను కోల్పోయి బాధపడే తాటకి, అగస్త్యముని శాపాన్ని సహాయంగా చేసికొని మునులను ఎదిరించి బాధించేటట్లున్నదని భావం.

**"పులమ్బు"** అనేదానికి ఒంటరిగా- అని, వాడి పోగా - అని, రోదించగా, - అని అర్థాలను చెప్పవచ్చు. **"పులమ్బుదల్"** అనే పదానికి ఒంటరిగా ఉండడం- అనే అర్థం ఉన్నట్లు, **"పులమ్బే తనిమై"** అనే **(తొల్‌కాప్పియమ్ - శొల్ అధికారమ్- ఉరిచ్చొల్ ఇయల్-33)** ప్రమాణంద్వారా తెలియవచ్చు. సాయం సమయంలో కన్పించే బాలచంద్రుని స్వల్పప్రకాశాన్ని వాడడంగాను, ఆ కాలంలో పక్షులు మిక్కిలిగా చేసే శబ్దాలను గాని, సముద్రఘోషను గాని ఏడుపుగా భావ్యం.

**(ఇలఙ్గై వెఙ్గళమ్ శెయ్‌ద)** - లంకలో ఉండే రాక్షసులు సమూలంగా నశించేటట్లు యుద్ధం చేసి వధించిన- అని భావం. **"వెఙ్గళమ్ శెయ్‌దల్"**-అనేదానిని శ్మశానంగా చేయడం- అనికూడా వివరిస్తారు. "ఒక పత్నిని విశ్లేషించలేక తాను గొప్ప ప్రయత్నాన్ని చేసి, సముద్రాన్ని దాటి, గొప్ప శత్రువును వధించి, ఆమెను సంశ్లేషించినవాడు, ఇపుడు మమ్ములను ఈ విధంగా ఉపేక్షించడమా!'' అనే జాలి తోచేటట్లుగా **"తెన్ పాలిలఙ్గై వెఙ్గళమ్ శెయ్‌ద నమ్ విణ్ణోర్ పిరానార్"** అని అనబడింది. దేవతల ఆపదను తీర్చినవాడు మాకు కల్గిన హానిని తీర్చలేదే! అని సూచించగోరి **"విణ్ణోర్ పిరానార్"** అని అనబడింది.

**"తుழாయ్ తుణైయా"** -సాయంసమయానికి తులసి సహాయమని పల్కడంలోని తాత్పర్యం ఏమంటే- తులసి మనకు లభించకుండా మనలను ఏవిధంగా బాధిస్తున్నదో, ఆ విధంగానే ఈ సాయంసమయం వచ్చి బాధిస్తున్నది- అని. **"నఙ్గళై"**- మనయొక్క- అని అర్థం. ఇది విభక్తి వ్యత్యయ (షష్ఠ్యర్థంలో ద్వితీయ) ప్రయోగం. **"ఉరుపుమయక్కమ్"**

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే- భగవానుని దరిచేరి అనుభవించ డానికి తగిన కాలం సమీపించి, అతని భోగ్యతను స్మరింపజేసి, తమను బాధించే రీతినిగూర్చి ఆழ்వార్లు పల్కడమే.

(తిజ్గళమ్ పిళ్ళై.... ఎళ్కు పున్మాలై)- తమకు కల్గిన జ్ఞానప్రకాశం అంతా క్లేశాన్ని పొందేటట్లుగా ఋజువైన మహావివేకంకూడా నశించి, భక్తియే వృద్ధిచెంది, ఆర్తిని కల్గించే క్రూరమైన (కఠినమైన) ఈ కాలం,

(తెన్పాల్... తుழాయ్ త్తుఱైయా) - దుష్టనిగ్రహ శిష్టపరిపాలనశీలుడైన భగవానుని భోగ్యతను గుర్తుకు తెచ్చి,

(నజ్గళై మామైకొళ్వాన్ వన్దు తోన్ఱి నల్ కిన్ఱదే)- మన శేషత్వస్వరూపాన్ని మార్చేటట్లు బాధిస్తున్నదే!- అని భావం.

**విరహాన్ని సహించలేని నాయకి, నాయకుని సామర్థ్యాన్ని తలచి మనస్సులో బాధపడుతూ పల్కడం**

**78. నలియుమ్ నరగనై వీట్టిగ్ర్ఱుమ్, వాణన్ తిణ్తోళ్ తుణిత్త**
**వలియుమ్ పెరుమైయుమ్ యాన్ శొల్లుమ్ నీర్త్తల్ల-, మైవరైపోల్**
**పొలియు మురువిల్ పిరానార్ పునై పూన్దుழాయ్ మలర్క్కే**
**మెలియు మడనెఞ్జినార్, తన్దు పోయిన వేదనైయే**

(మా నాయకుడు), నలియుమ్ నరకనై వీట్టిగ్ర్ఱుమ్ = లోకాలను బాధించే నరకాసురుని వధించడం, వాణన్ తిణ్ తోళ్ తుణిత్త వలియుమ్ = బాణాసురుని బలమైన బాహువులను ఖండించిన బలిమి, పెరుమైయుమ్ = ఆ యుద్ధాలలో వ్యక్తం చేసిన గొప్పతనం (వీర్యం)- అనే వీనిని, యామ్ శొల్లుమ్ నీర్త్తు అల్ల = (అల్పులమైన) మేము కీర్తించి పల్కి పూర్తి చేసే శక్తిని కలవారం కాము, మై వరై పోల్ పొలియుమ్ ఉరువిన్ పిరానార్ = అంజనపర్వతం వలె వెలిగే రూపాన్ని కల ఆ నాయకుని, పునై పూ తుழాయ్ మలర్క్కే = అలంకరించుకొన్న అందమైన తులసీమాలికను పొందడం కోసమే, మెలియుమ్ = ఆశపడి క్లేశపడే, తన్దు పోయిన= (తాను మనలను విడచిపెట్టి వెళ్ళేటపుడు మాకు) ఇచ్చి పోయినవి, వేదనై=వేదనలు.

భావదీపిక : విరహాన్ని సైపలేని నాయకి, నాయకుని సామర్థ్యాన్నిగూర్చి భావించి, మనస్సులో క్లేశపడి విలపించే పాశురం, ఇది. నేను, నా నాయకుని అతిమానుష చేష్టితాలను ప్రభుత్వాన్ని చూచి, "నాకు అతడు దుర్లభుడు"- అని భావించి, ఒక విధంగా ప్రేమను అణచుకొని సమాధానపడే స్వభావాన్ని కలదానను. నా మనస్సు అయితే, ఆ రీతిలో సమాధానపడకుండా అతని మాలికను పొందడానికి

ఆశపడి, అది లభించనందున, నాకు ఇటువంటి వేదనను కల్గించి తాను అతని వద్దకు వెళ్ళిపోయింది- అని దుఃఖంతో నాయకి పల్కుతున్నది. నరకాసురుని సంహరించి, పదహాఱువేల ఒక నూఱుమంది కన్యలను వివాహం చేసికొన్నవాడు, బాణాసురుని బాహువులను ఖండించి, అతని కుమార్తె అయిన ఉషను తన పౌత్రుడైన అనిరుద్ధునకిచ్చి, వారు బహిరంగంగా వివాహం చేసికొని, కలసి ఆనందించేటట్లుగా చేసినవాడైన నాయకుడు అతని ప్రేయసిని అయిన నన్ను పొంది, ఆనందింపజేయవద్దా!- అని అంటూ ఆ రెండు వృత్తాంతాలను ఇక్కడ నాయకి ప్రస్తావించింది. తానే దేవాధిదేవుడని తోచే రీతిలో స్వామి వ్యక్తం చేసిన వీర్యశక్తిని **"పెరుమై"** అని అన్నది.

నరకాసురుని వధించిన వృత్తాంతం ఈవిధంగా ఉన్నది. భగవానుడు వరాహావతారాన్ని ఎత్తి భూమిని తన దంతాగ్రంతో గుచ్చి ఉద్ధరించినపుడు భగవానుని స్పర్శవల్ల భూమి కుమారుడై సమయం కాని సమయంలో జన్మించి ఆసురస్వభావాన్ని కలవాడైన నరకుడనేవాడు ప్రాగ్జ్యోతిషమనే పట్టణంలో ఉంటూ ప్రాణులన్నిటిని బాధించి, దేవసిద్ధగంధర్వాదుల కన్యలను పలువురిని బలాత్కారంగా అపహరించి తీసికొని వచ్చి తాను వివాహం చేసికోవాలని తలచి వారిని తన భవనంలో బంధించాడు. వరుణుని ఛత్రాన్ని, మందరగిరి శిఖరమైన రత్నపర్వతాన్ని, దేవతల తల్లి అదితియొక్క కుండలాలను అపహరించడమే కాక, ఇంద్రుని ఐరావతాన్ని కూడా బలాత్కారంగా తీసికొనిపోవాలని సమయంకోసం వేచి ఉన్నాడు. అపుడు అతనికి భయపడి, తనవద్దకు వచ్చి ఆశ్రయించి, మొఱపెట్టిన ఇంద్రుని ప్రార్థనవల్ల శ్రీకృష్ణుడు గరుడుని రప్పించి, భూదేవి అంశతో జన్మించిన సత్యభామతోపాటు గరుడుని అధిరోహించి, ఆ నగరాన్ని చేరి, చక్రాయుధాన్ని ప్రయోగించి అతని మంత్రి, మురుడు మొదలైన పలువురు అసురులను, చివరలో నరకాసురుని వధించాడు. అతడు పలు దిక్కులనుండి తీసికొనివచ్చి, చెఱలో పెట్టిన పదహాఱువేల ఒక నూఱుమంది కన్యలను స్వీకరించి, ఆ నరకునిచే పూర్వం అపహరింపబడిన అదితి కుండలాలను ఆ అదితికి ఇవ్వడంకోసం సత్యభామతో పాటు గరుడునిపై ఎక్కి దేవలోకానికి వెళ్ళగా, అక్కడ ఇంద్రాణి సత్యభామకు సకలోపచారాలను చేసినా, దేవతలకే యోగ్యమైన పారిజాతపుష్పాన్ని మానుషకన్య అయిన ఆమెకు తగదని సమర్పించలేదు. అందువల్ల, దానిని చూచి సత్యభామ ఆ పూవుపట్ల కోరికను కల్గినదై, తన భర్తను చూచి- ప్రాణానాథా ! ఈ పారిజాత తరువును ద్వారకకు తీసికొనిపోవాలి'' అని అన్నది. దీనిని శ్రీకృష్ణుడు విని, వెంటనే

ఆ వృక్షాన్ని సమూలంగా పెకలించి, గరుడుని భుజాలపై పెట్టి తీసికొనిపోబోయాడు. అపుడు ఇంద్రాణి ప్రేరణతో వచ్చి అడ్డగించి పోరాడిన ఇంద్రుని సకలదేవ సైన్యాలతో పాటుగా తన శంఖనాదంతో భంగపరచి, తరువాత పారిజాతవృక్షాన్ని తీసికొనిపోయి సత్యభామ ఇంటి పెరటితోటలో నాటాడు.

బాణుని బలిష్ఠమైన బాహువులను ఖండించిన వృత్తాంతం - బలి చక్రవర్తి సంతతిలో పుట్టిన బాణాసురుడు ఒకానొక సమయంలో శివుడు చేసే నాట్యాన్ని చూచి దానికి తన రెండు చేతులలో మద్దెలను వాయించగా శివుడు అనుగ్రహించి అతనికి వేయి బాహువులను, అగ్నిప్రాకారాన్ని, అంతు లేని బలాన్ని, గొప్ప సంపదను, తాను తన పరివారంతోపాటు అతని భవనం వాకిటిలో కావలికాయడం మొదలైన వరాలను ఇచ్చాడు. ఆ బాణాసురుని కూతురు ఉష ఒకనాడు ఒక పురుషునితో తాను కలసినట్లు కలగని, పూర్వం పార్వతిపల్కిన రీతిలో అతనిపట్ల మిక్కిలి ప్రేమను కల్గినదై, ఆ పురుషుడు శ్రీకృష్ణుని పౌత్రుడు, ప్రద్యుమ్నుని పుత్రుడైన అనిరుద్ధుడని తెలిసికొని, "అతనిని పొందడానికి తగిన ఉపాయాన్ని చేయాలి" అని తన చెలికత్తెను వేడింది. ఆమె తన యోగవిద్యాప్రభావంతో ద్వారకకు వెళ్ళి అనిరుద్ధుని తీసికొనివచ్చి, అంతఃపురంలోకి చేర్చింది. ఉష అతనితో భోగాలను అనుభవించసాగింది. ఈ సంగతి కావలివారి ద్వారా గ్రహించిన బాణాసురుడు తన సేనతో అనిరుద్ధుని ఎదిర్చి మాయాయుద్ధం చేసి, అతనిని నాగాస్త్రంతో బంధించాడు. ద్వారకలో అనిరుద్ధుడు కన్పించనందున యాదవులందఱు కలత చెందగా, నారదమహామునివల్ల జరిగిన సంగతిని తెలిసికొన్న శ్రీకృష్ణభగవానుడు గరుడుని స్మరించాడు. వెంటనే గరుడుడు వచ్చి నిలచాడు. గరుడుని భుజాలపై ఎక్కి బలరామాదులతో కలసి, బాణుని పురమైన శోణితపురానికి వెళ్ళేటపుడే ఆ పట్టణ సమీపంలో కావలి కాస్తూ ఉండే శివుడు ప్రమథగణాలతో పాటుగా శ్రీకృష్ణుని ఎదిరించాడు. అపుడు శ్రీకృష్ణుడు శివుని సేనలను నిర్జించాడు. తరువాత శివునిచే ప్రయోగింపబడ్డ ఒక జ్వరదేవత మూడు కాళ్ళను, మూడు తలలను కల్గినదై వచ్చి, బాణుని కాపాడడంకోసం శ్రీకృష్ణునితో యుద్ధం చేసింది. శ్రీకృష్ణుడు తాను కూడా ఒక జ్వరాన్ని సృష్టించి, దాని శక్తితో శివుడు ప్రయోగించిన జ్వరదేవతను తరిమికొట్టాడు. తరువాత శివుని అనుచరుడైనందున బాణాసురుని కోటను చుట్టూ కాపలా కాసే అగ్నిదేవతలు అయిదుగురు తనతో ఎదిరించి పోరాడగా, వారిని నాశంచేసి, బాణాసురునితో పోరాడడం ఆరంభించాడు. అతనికి సహాయంగా శివుడు, సుబ్రహ్మణ్యుడు మొదలైన పరివారాలతో పాటు వచ్చి ఎదిరించి పోరాడారు.

శ్రీకృష్ణుడు జృంభణాస్త్రాన్ని ప్రయోగించి, శివుని నిశ్చేష్టుని చేసి, గణపతిని హుంకారంతో నిలువరించి, తరువాత అనేకవేల సూర్యులతో సమానమైన సుదర్శనమనే తన చక్రాన్ని ఎత్తి ప్రయోగించి ఆ బాణుని వేయి బాహువులను ధారలు ధారలుగా రక్తం స్రవించగా ఖండించి, అతని ప్రాణాలను కూడా తీయబోయాడు. పరమశివు డపుడు శ్రీకృష్ణునివద్దకు వచ్చి, నమస్కరించి పలుమార్లు ప్రార్థించినందున ఆ బాణుని నాల్గు చేతులతో, ప్రాణాలతో వదలిపెట్టాడు. తరువాత బాణుడు శ్రీకృష్ణునకు నమస్కరించి, అనిరుద్ధునకు ఉషను ఇచ్చి గొప్పగా వివాహం చేయగా, అనంతరం శ్రీకృష్ణుడు తిరిగివచ్చాడు.

**"వీట్టి*న్ఱు*"**- ప్రాణం, ఇంటిని విడచినదైనది (పోయింది)- అని భావం. ఇది **(ఇఱన్దకాలత్తొ*ళ్ళి*ల్‌పెయర్)**- భూతకాలిక క్రియాజన్యనామం **"విడు"** - అనే దాని వికారమైన **"వీడు"** అనేదాని ణిజంతరూపమైన **"వీట్టు"** అనేది దీని ప్రకృతి. **"*న్ఱు*"**- అనేది ప్రత్యయం. ఇక, **"వీ*ళ్*త్తి*న్ఱు*"** అనేది **"వీట్టి*న్ఱు*"** అనే సంకోచరూపాన్ని **(మరుఊ)** పొందిందని కూడా కొందఱంటారు. **"నీర్‌త్తు"**- **"నీర్‌మై"**- అనే స్వభావాచకంనుండి పుట్టిన **"ఒన్ఱన్‌పాల్ కుఱిప్పు ము*న్ఱు*"**, **"మై వరై"**- మేఘం వాలిన పర్వతం- అని కూడా అర్థాన్ని చెప్పవచ్చు. పాశురం చివరలో **"వేదనా"** అనే సంస్కృతపదం **"వేదనై"**గా అయినది.

ఆశ్రితవిరోధులను నిరసించే గుణం భగవానునకు సహజంగా ఉన్నా, తాము అతని అనుగ్రహవల్లం తమ ప్రతిబంధకాలు తీరి, అతని భోగ్యతను అనుభవించ లేనందున కలత చెంది, దానివల్ల క్లేశపడే రీతిని ఆ*ళ్వా*ర్లు పల్కడం దీనికి స్వాపదేశార్థం. భగవానుని విరోధినిరసనశక్తిని, పరత్వమహిమ మనవంటి వారికి పరిచ్ఛేదించి ఇదమిత్థంగా పల్కడానికి సాధ్యమైనవి కావు. వేదాలకు సైతం అందనివి. అటువంటి సర్వేశ్వరుని దరిచేరి అనుభవించలేనపుడు అతని భోగ్యతలో మనస్సు పెట్టడం అనేది విరహాసహనక్లేశాన్నే కల్గిస్తున్నది- అని భావం.

## నాయకుని విశ్లేషించని స్త్రీల అదృష్టాన్నిగూర్చి ప్రస్తావించి నాయకి విచారించడం

79\. వేదనై వెణ్‌పురి నూలనై, విణ్ణోర్ పరవ నిన్ఱ
నాదనై ఞాలమ్ వి*ళ్ళు*ఙ్గు మనాదనై-, ఞాలమ్ తత్తుమ్
పాదనై ప్పాఱ్కడల్ పామ్బణైమేల్ పళ్ళికొణ్డరుళుమ్
శీదనైయే తొ*ళ్ళు*వార్, విణ్ణుళారిలుమ్ శీరియరే

వేదనై = వేదాలలో సమర్థుడు, వెణ్ పురి నూలినై = శుద్ధమైన (తెల్లని) యజ్ఞోపవీతాన్ని కలవాడు, విణ్ణోర్ పరవ నిన్ఱ నాదనై = పైలోకంలోనివారు స్తుతించగా వారికి నాయకుడై ఉండేవాడు, ఞాలమ్ విழுఙ్గుమ్ అనాదనై = ప్రళయకాలంలో లోకాలను ఉదరంలో పెట్టుకొని రక్షించి, ఆ రీతిలో తనను రక్షించే ఏ నాథుని లేనివాడు, ఞాలమ్ తత్తుమ్ పాదనై = లోకాలను కొలిచిన శ్రీచరణాలను కలవాడు, పాల్ కడల్ పామ్బు అణై మేల్ = క్షీరాబ్ధిలో ఆదిశేషుడనే పర్యంకంపై, పళ్ళి కొణ్డు అరుళుమ్ = యోగనిద్రలో శయనించి ఉండే, శీదనైయే = చల్లని స్వభావాన్ని కలవాడైన భగవంతుని, తొழுవార్ = నిరంతరం నమస్కరించి ఆనందించ గలిగేవారు, విణ్ ఉళారిలుమ్ శీరియర్ = పరమపదంలో ఉండేవారికంటే గొప్పవారు.

**భావదీపిక :** నాయకుని విశ్లేషించని భాగ్యాన్ని పొందిన స్త్రీల గొప్పతనాన్ని గూర్చి పల్కి నాయకి క్లేశపడే పాశురం, ఇది. వేదంలో సమర్థుడై, శుద్ధమైన యజ్ఞోపవీతాన్ని అలంకరించుకొన్నవాడై, పైలోకంలోనివారు స్తుతించేటట్లుగా వారికి నాయకునిగా ఉండేవాడై, ప్రళయకాలంలో లోకాలను కడుపులో పెట్టుకొని కాపాడేవాడై, తనకొక నాయకుని లేనివాడై, లోకాలను కొలిచిన శ్రీచరణాలను కలవాడై, పాలసముద్రంలో శేషశాయిగా యోగనిద్రలో ఉండేవాడై, చల్లని స్వభావాన్ని కలవాడైన భగవంతుని నిరంతరం నమస్కరించి, అనుభవించేవారెవరో, వారు పరమపదంలో ఉజ్జీవించే నిత్యముక్తులకంటే గొప్పతనాన్ని కలవారు- అని భావం. నాయకుని వియోగం వల్ల మిక్కిలి బాధపడే నాయకి, తనను ఊరడించే సఖిని చూచి, నాయకుని విశ్లేషించకుండా అతనితో సదా కూడి ఉజ్జీవించేవారు ముక్తిలోకంలో మహానందాన్ని అనుభవించేవారికంటే విలక్షణులు- అని అన్నందున "అటువంటి భాగ్యవిశేషాన్ని నేను పొందలేకపోయానే !" అని తన ఆర్త్యతిశయాన్ని వ్యక్తం చేసినట్లయినది.

శ్రీదేవి, భూదేవి ఏనాడూ విశ్లేషించకుండా భగవానుని పాదసంవాహనం చేసి, ఆనందిస్తూ ఉండగా, వారితో యోగనిద్రాస్థితిలో ఉండే స్వభావాన్ని (స్థితిని) **"పాఱ్కడల్ పామ్బణైమేల్ పళ్ళికొణ్డరుళుమ్ శీదనై"** (క్షీరాబ్ధిలో నాగశయనంపైన శయనించి ఉండే శీతల స్వభావుని) అని అనడంద్వారా సూచించి, అటువంటి విచ్ఛేదం లేని భోగం తనకు లభించలేకపోవడాన్ని గూర్చి క్లేశాన్ని, అసహనాన్ని, నాయకి పొందినది గ్రహించాలి.

"వేదనై"- అనే పదానికి - వేదంలో సమర్థుడు- అని వేదాలలో ప్రతిపాదింప బడేవాడు - అనే అర్థాలను గ్రహించవచ్చు. **"వెణ్పురినూలనై"** మూడు పేటలను (తంతువులను) కల నూలు. వైదికపురుషుడనే దానికి సూచకమైన శుద్ధయజ్ఞోప వీతాన్ని కలవాడు- అని భావం. **"వేదముదల్వన్ విళఙ్గు పురినూలన్"** అని పెరియతిరుమొழிలో **(8-4-2)** లో కూడా గమనించవచ్చు. **"ఞాలమ్ తత్తుమ్ పాదన్"** అనేదానికి లోకాలను కొలిచిన శ్రీపాదాలను కలవాడు- అనే అర్థాన్ని గ్రహించడమే కాక, భూమికి ఉత్పత్తిస్థానమైన శ్రీచరణాన్ని కలవాడు- అనే అర్థాన్ని కూడా గ్రహిస్తారు. శ్రియఃపతి పాదాలనుండి భూమి ఉద్భవించింది- అనే విషయాన్ని వేదం కూడా పల్కుతున్నది. **"పద్భ్యాం భూమిః"** అనేది పురుషసూక్త సూక్తి. **"శీలన్"**- కరుణ కలవాడని కూడా అర్థం.

నిరంతరం భగవదనుభవాన్ని పొందడంకోసమే ఏర్పడిన చోటైన పరమ పదంలో భగవదనుభవానికి ఏవిధమైన ఆటంకాలు ఉండవు కనుక, అక్కడ ఉంటూ భగవానుని అనుభవించడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. తిని తిరిగి ఆనందించే ఈ భూమండలం భగవదనుభవానికి సాక్షాద్విరోధి అయినందున అటువంటి ఈ **"ఇరుళ్ తరు మా ఞాలమ్"** (అజ్ఞానాన్ని కలిగించే భూమి)లో ఉంటూ ఆ విధంగా నిత్యానుభవం పొందడం చాలా అరుదుగా ఉంటుంది కనుక, ఆ దౌర్లభ్యాన్ని లేకుండా చేసి, భగవానుని నిరంతరం దర్శించి అనుభవించేవారిని నిత్యముక్తుల కంటే గొప్పవారుగా పల్కడంలో ఏమి అడ్డు ఉన్నది? ఒక గొప్ప కార్యాన్ని ఏ అడ్డు లేని చోట పూర్తి చేయడం కంటే, ప్రతిబంధకాలు నిండుగా ఉండే చోట నిర్వహించి పూర్తిచేయడం ఆశ్చర్య పడదగినదికదా! భగవానునిపట్ల అభినివేశాన్ని పొందిన ఆழ்వార్లు- వేఱొక విషయాన్నిగూర్చి మనస్సులో చింతన చేయకుండా, ఆ స్వామిని వాఙ్మనఃక్రియలతో పరిపూర్ణానుభవాన్ని పొందినవారు ఈ లోకంలో ఉంటూనే నిత్యసూరులకంటే గొప్పవారు కాగలరు- అని పల్కిన వారయ్యారు. అటువంటి నిరంతరానుభవం తమకు లభించలేదే- అనే ఆழ்వార్లు విచారిస్తున్న విషయం కూడా దీనివల్ల స్ఫురిస్తుంది.

**విశ్లేషాన్ని సహించలేని నాయకి సాయంసమయాన్ని చూచి క్లేశపడడం**

80. శీరరశాణ్డు తన్ శెజ్గోల్ శిలనాళ్ శెలీ ఇ క్కழிన్ద,
పారరశొత్తు మఱైన్దదు నాయిఱు-, పారళన్ద

**పేరరశే ! యెమ్విశుమ్బరశే ! యెమ్మై నీత్తు వఞ్జిత్త**
**ఓరరశే ! యరుళాయ్, ఇరుళాయ్ వన్దుఱుగిన్దదే**

శీర్ అరశు ఆణ్డు = గొప్పగా రాజ్యపరిపాలనాన్ని చేసి, తన్ శెఙ్గోల్ శిల నాళ్ శెలీ ఇ = తన నీతి తప్పని ఆజ్ఞను కొంతకాలం లోకంలో ప్రవర్తింపజేసి, కழిన్ద = తరువాత నశించిన, పార్ అరశు = భూమిలోని సార్వభౌముడైన ఒక చక్రవర్తిని, ఒత్తు = పోలిన, నాయిఱు = సూర్యుడు, మఱైన్దదు = అస్తమించాడు, పార్ అళన్ద = భూమిని కొలిచిన, పేర్ అరశే = గొప్ప నాయకుడా!, ఎమ్ విశుమ్బు అరశే = పరమపదనాయకుడవైన ఓ స్వామీ, ఎమ్మై నీత్తు వఞ్జిత్త = మమ్ములను ఒంటరిగా విడచిపెట్టి విశ్లేషించి వంచన చేసిన, ఓర్ అరశే = సాటిలేని నాయకుడా!, అరుళాయ్ = ఈ విధంగా దూరంగా విడచిపోని రీతిలో మా దగ్గరకు వచ్చి అనుగ్రహించు (ఆ విధంగా అనుగ్రహించనందువల్ల), ఇరుళ్ ఆయ్వన్దు ఉఱుకిన్దదు = చీకటి మిక్కిలిగా పెరుగుతూ అంతటా వ్యాపించి (మమ్ములను) బాధిస్తున్నది.

**భావదీపిక :** విరహాన్ని సహించలేని నాయకి సాయంకాలాన్ని చూచి క్లేశపడుతూ నాయకుని సంబోధిస్తూ పలికే పాశురం ఇది. ఈ పాశురంలో నాయకుని ఉద్దేశించిన సంబోధనలున్నందున, ప్రత్యక్ష సమానాకారదశలో నాయకుడు నాయకి కంటికి ఎదురుగా కన్పించాడని, అటువంటివానిని చూచి ఉద్దేశించి ఈ విధంగా సంబోధన చేయబడిందని భావించాలి. సూర్యుడు లోకాన్ని అంతటిని పగటిలో అంతా ఏ అడ్డు లేకుండా తన ఎఱ్ఱని కిరణాలను ప్రసరింపజేసి, తరువాత అస్తమించిన రీతిని **"శీరరశాణ్డు తన్ శెఙ్గోల్ శిలనాళ్ శెలీ ఇ క్కழిన్ద పారరశొత్తు మఱైన్దదు నాయిఱు"** అని అంటూ తెలిపారు. ఒక ప్రభువు గొప్పగా రాజ్యాన్ని పరిపాలించి, తన నీతి చెడని ఆజ్ఞను కొంతకాలం లోకంలో చెల్లుబాటు చేసి, తర్వాత కాలం చేసినట్లే సూర్యాస్తమయం ఉన్నది. ఓ నాయకుడా! ఇపుడు నీవు నన్ను దరిచేర్చుకోకపోతే ప్రభువులేని రాజ్యంలో భర్తను కోల్పోయిన స్త్రీలు దుర్మార్గుల వల్ల పడే పాట్లను నేను చీకటివల్ల పడతాను- అనే అర్థం స్ఫురించేటట్లు ఇది ప్రయోగింపబడింది. చీకటి చేతిలో చిక్కుకొన్న సూర్యుని, తనను విడిపించ డానికి, మహాబలిచేతిలో చిక్కుకొన్న లోకాన్ని విడిపించినవాడు కావాలి- అనే భావంతో **"పారళన్ద పేరరశే!"** అనే సంబోధనను నాయకి చేసింది. "ఎమ్

విశువ్వురశే!"- పరమపదాన్నివలెనే మమ్ములను కూడా అనన్యార్హశేషంగా గ్రహించదగినవాడా!- అని దీని భావం. మొదట- "నిన్ను విడచి వెళ్ళనే వెళ్ళను" అని పల్కడం, తరువాత "ఈ సమయంలో వస్తాను" అని కాలసంకేతాన్ని చేస్తూ పల్కడం- రెండూ అసత్యమయేటట్లు తనను విశ్లేషించి పోయి, నాయకుడు చిరకాలంపాటు రాకుండా ఆలస్యం చేయడాన్నిబట్టి **"ఎమ్మై నీత్తు వళ్ళిత్త ఓరరశే!"** అని అన్నది. ఇక్కడ **"ఓరరశే!"** అనేది ఈ విధంగా కూడా ఒక నాయకుడు ఉంటాడా! అని దోషాన్ని పల్కడంకోసం పలుకబడింది. **"ఎమ్మై నీత్తు వళ్ళిత్త ఓరరశే"** అనే దానికి "నన్ను ఉపేక్షించి నిన్ను దర్శింపజేయకుండా ఈ స్వభావంతో పట్టాభిషిక్తుడైనవాడా!"- అనే విశేషార్థాన్ని వ్యాఖ్యాతలు తెలిపారు. **"వళ్ళిత్త"** అనే పెయరెచ్చమ్ (తద్ధితాంతరూపం)లోని చివరి భాగం (అకారం) సంకోచాన్ని పొందినందున **"వళ్ళిత్తోరరశే!"** అని అయినది. **"శెలీ ఇ"**- చెల్లించి- ప్రవర్తింపజేసి- అని అర్థం. ఇది **"శొల్లిశై అళపెడై"** (ఒక పదంలోని చివరి వర్ణంయొక్క ఉచ్చారణ కాలం అధికం కావడం.)

భగవానుని దరిచేరి అనుభవించలేనందున తమ వివేకప్రకాశం మాసిపోయి, మోహాంధకారం ఆవరించిన రీతిని ఆళ్వార్లు భగవానుని ఉద్దేశించి, విన్నపిస్తున్నారు. ఇక్కడ నమ్బిళ్ళై ఈడువ్యాఖ్యాన శ్రీసూక్తిని గమనించండి. **"ఇత్తాల్ - సంసారత్తిల్ ఇరుప్పు అజ్ఞానమ్ వన్దు మేల్ విడువ్బడి యిరుక్కైయాలే కడుక అవ్విరుప్పై క్కழித్తు త్తరవేణుమెన్డు అరుళిచ్చెయ్‌కిఱార్"** (దీనివల్ల - సంసారంలోని స్థితి అజ్ఞానం ఆవరించిన స్థితివలే ఉన్నందున, దానిని తీర్చుమని పల్కుతున్నారు) అనేది ఆ సూక్తి.

**"ఎమ్మై నీత్తు వళ్ళిత్త ఓరరశే !"** అని నాయకి తనను విశ్లేషించిన నాయకుని సాటిలేని నాథునిగా నిర్దేశించిన సూక్తిని వివరించేటపుడు పెరియవాచ్చాన్‌పిళ్ళై రెండు అర్థనిర్వాహాలను ప్రస్తావించారు.

అన్ని లోకాలకు సాటిలేని నాయకుడై ప్రకాశించేటట్లే, నన్ను తననుండి విడదీసి నన్ను అంతం చేయడంలో ప్రత్యేకమైన కిరీటాన్ని ధరించిన సాటిలేని నాయకుడా!- అని అంటున్నది- అని పిళ్ళాన్ నిర్వాహం.

నాతో కలిసేటపుడు "ఏనాడూ నిన్ను వీడిపోను" అని పల్కి, నాతో కలిశాడు. తాను లేకపోతే బ్రతుకలేని స్థితిని నాకు కల్గించి, తర్వాత నన్ను విడచిపోయాడు.

"ఇటువంటి స్థితి నాకు తప్ప ఇంకెవరికి కల్గుతుంది? "నేను లేకపోతే ప్రాణాలను ధరించలేనివారిని విడచిపెట్టడానికి నేను తప్ప ఇంకెవరున్నారు?'' అని విలక్షణమైన కిరీటాన్ని ధరించిన సాటిలేని నాయకుడు- అని అంటున్నది- అని భట్టర్ పలికిన వివరణ. నమ్పిళ్ళై వ్యాఖ్యలో కూడా ఈ రెండు వివరణలు ప్రస్తావింపబడ్డాయి.

### సోదెకత్తె చెప్పే సోదిని నిషేధించదలచిన సఖి నాయకి స్థితికి బాధపడుతూ పల్కడం

81. ఉఱుగిన్ఱ కన్మజ్గళ్ మేలన వోర్ప్పిలరాయ్, ఇవళై
ప్పెఱుగిన్ఱ తాయర్ మెయ్‌న్నొన్దు పెఱార్‌కొల్!-, తుళాయ్ కుళల్వాయ్
త్తుఱుగిన్ఱిలర్ తొల్లై వేజ్గడ మాట్టవుమ్ శూళ్గిన్ఱిలర్
ఇఱుగిన్ఱదాల్ ఇవళాగుమ్, మెల్లావి యెరి కొళ్ళవే

ఓర్ప్పు ఇలర్ ఆయ్ = (ఈమెకు సంభవించిన వ్యాధి యొక్క స్వభావాన్ని దాని కారణాన్ని, దానిని తీర్చే ఉపాయాన్ని) ఆలోచించి తెలియనివారై, ఉరుకిన్ఱ= (ఈమె తల్లి విడువకుండా) జరిపించే, కన్మజ్గళ్ = ("వెఱియాట్టు"- మొదలైన) కార్యాలు, మేలన = ఇంకా ఇంకా నిర్వహింపబడుతున్నాయి, ఇవళై పెరుకిన్ఱ తాయర్= ఈమెను కనిపెంచే తల్లి, మెయ్ నొన్దు పెఱార్‌కొల్ = శరీరం శ్రమించి పొంద లేదా? ఏమి!, కుళల్ వాయ్ = (ఈమె) కేశాలలో, తుళాయ్ = (భగవానుని) తులసి, తుఱుకిన్ఱలర్ = అలంకరించడంలేదు, తొల్లై వేజ్గడమ్ = ప్రాచీనమైన శ్రీవేంకటాద్రిలో, ఆట్టవుమ్ = ఈమెను తీసికొనిపోయి, చేర్చడాన్నిగూర్చికూడా, శూళ్కిన్ఱలర్ = ఆలోచించడం లేదు, ఇవళ్ ఆకమ్ = ఈ శరీరం, మేల్ ఆవి ఎరి కొళ్ళ = సుకుమారమైన ప్రాణాన్ని విరహాన్ని అపహరించి గ్రహించేటట్లు, ఇరుకిన్ఱదు= ముగిసిపోయే పర్యంతంగా ఉన్నది.

**భావదీపిక :** దేవతాంతరభజనను నిషేధించే (**"వెఱివిలక్కుదల్"**) సఖి విచారిస్తూ పలికే పాశురం, ఇది. నాయకి శ్రియఃపతి అనే నాయకుని విషయంగా ప్రేమవ్యాధిని పొందింది. ఆమె శరీరం కృశించి, రూపు మాఱిపోయింది. దానిని చూచిన ఆమె తల్లి "ఇది మురుగన్ (కుమారస్వామి) ఆవేశించినందున కల్గిన కల్గింది'' అని విపరీతంగా భావించి, దానికి తగిన పరిహారంగా కుమారస్వామి ఆరాధకుని (వేలన్‌ను) పిలిపించి, ఆ దేవతకు సంబంధించిన ఆటను ("వెఱి

యాడల్"- పూనకంతో ఆడించడం) జరిపించడం, బలి ఇవ్వడం, కల్లుజల్లడం, మాంసాన్ని జల్లడం, నల్లని రంగులోని అన్నాన్ని, ఎఱ్ఱని అన్నాన్ని దిష్టితీయడం మొదలైన కార్యాలు విడువకుండా ఒకదాని తర్వాత ఇంకొకటిని చేయించడం ఆరంభించింది. ఈ విధంగా రోగం ఒకటి, మందు ఇంకొకటి కాగా, తాను ప్రేమించిన నాయకుని యోగ్యతకు తగని ఆ కార్యాలను చూచి నాయకి ఇంకా ఇంకా బాధపడడం ఆరంభించింది. దానిని గమనించి, నాయకి మనస్సును తెలిసి, "వేలన్" చేసే నృత్యాన్ని అడ్డుకోవాలని వచ్చిన సఖి ఆ నాయకి తల్లి చెవికి సోకేటట్లు ఎవరినో ఉద్దేశించి పల్కుతున్నట్లుగా పల్కిన మాటలు ఇవి.

ఇపుడు ఈమెకు కల్గిన వ్యాధియొక్క స్వరూపం ఇది -అని, దానికి కారణం ఇది- అని, దానిని తీర్చే ఉపాయం ఇది- అని విచారించి తెలియ లేని ఈమె తల్లి నిరంతరం జరిపించే "వెఱియాడల్" మొదలైన కార్యాలు ఇంకా ఇంకా జరుపబడుతున్నాయే! అయ్యో! ఈమె తల్లి ఈమెను కనేటపుడు శరీరం శ్రమపడి పొందినదిగాను, పెంచే పెంపుడు తల్లి తాము శ్రమపడి కుమార్తెను పొందినదిగాను అయితే ఈమె బ్రతికే మార్గంలో ప్రయత్నించకుండా, ఈ రీతిలో ఈమెను కోల్పోవడానికి పనికివచ్చే విపరీత మార్గంలో తలదూరుస్తారా! విపరీతకార్యాలనే వీరు చేయడం కన్పిస్తున్నందున వీరు తమ శరీరం శ్రమపడి పొందకుండా ఎక్కడైనా వెలను ఇచ్చికొన్నారు కాబోలు! భగవానుని తులసిని ఈమె కేశపాశంలో చుట్టడం, అతని భోగస్థానమైన శ్రీవేంకటాద్రికి తీసికొనిపోవడమే ఈ వ్యాధికి తగిన పరిహారాలై ఉండగా, వీటిలో దేనినీ చేయడం, ఆలోచించడం కన్పించడం లేదే! సుకుమారమైన ఈమె ప్రాణాన్ని విరహాగ్ని అపహరించికొనిపోయేటట్లు ఈమె క్లేశం ఇంకా ఇంకా పెరిగిపోతున్నదే! ఇదేమి పరితాపం! అయ్యో! - అని సఖి బాధతో పల్కుతున్నది.

"ఓర్ప్పు ఇలరాయ్" అనే దానిని - ఈమె ఇక ఏర్పడదగినవి అయిన అవస్థలను గూర్చి ఆలోచించనివారై- అని వివరించాలి. భగవానుడు ఆదరంతో అభిమానించి వేంచేసి ఉండే దివ్యదేశాన్ని ఈమె విరహతాపాన్ని తీర్చడానికి తగిన ఒక సరస్సుగా భావిస్తున్నది కనుక "వేఙ్గడమ్ ఆట్టవుమ్" అని అనబడింది. లేక, "వేఙ్గడమాట్టవుమ్ శూழ్కిన్ఱలర్" - అనే దానికి శ్రీవేంకటాద్రికి ఈమెను పిలుచుకొని వస్తాను - అని ప్రార్థనను చేసి, దానికి తగిన ఆటను ఆడించే ఆలోచనను చేయలేదు- అనికూడా అర్థం. శ్రీవేంకటాద్రిలో ఈమె సంచరించేటట్లు

చేయడానికి ఈ తల్లి భావించడం లేదు- అని కూడా వివరించవచ్చు. "ఈ కుమార్తెకు ఈ వ్యాధి తీరితే ఈమెను వేంకటాచలానికి పిలుచుకొనిపోయి సేవను చేయిస్తాను" అని ఒక ప్రార్థనను చేసికోవచ్చుకదా! ఆ విధంగా ప్రార్థనను చేయడం చూడలేదు వ్యర్థప్రయత్నాలనే చేసి, ఈమె బాధను పెంచి, కాలక్షేపాన్ని చేస్తున్నారే! అని బాధపడి పల్కిన రీతి ఇది.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే- ఆఴ్వార్లను ఊరడించాలని జ్ఞానులు తమ ప్రీతికారణంగా వేఱు కొన్ని రీతులలో పరిహారాలను చేయబోగా, వీరి స్వభావాన్ని తెలిసిన వీరి భక్తులు వీరి విరహార్తిని తీర్చే మార్గాలలో ప్రయత్నించ కుండా, వేఱు దారులలో ప్రయత్నించి ఏమి ప్రయోజనం? అని గర్హించి, పలికే సూక్తి ఇది. భగవత్ప్రసాదం, దివ్యదేశవాసమే వీరి ఆర్తికి పరిహారం. అవి చేయనందున వీరి బాధ ఇంకా ఇంకా పెరుగుతున్నది- అని తాత్పర్యం.

**నాయకుని ప్రత్యక్ష సమానాకారంగా దర్శించిన నాయకి, నాయకుని నేత్రసౌందర్యాన్ని తలచి బాధపడడం**

82. ఎరికొళ్ శెన్నాయిఱు ఇరణ్డుడనే యుదయమ్ మలైవాయ్,
విరిగిన్ఱ వణ్ణత్త ఎమ్బెరుమాన్ కణ్గళ్-, మీణ్డవఱ్ఱుళ్
ఎరికొళ్ శెన్దీ వీఴ్అశురరైప్పోల ఎమ్బోలియర్క్కుమ్
విరివ శొల్లీరిదువో?, వైయ ముఱ్ఱుమ్ విళరియదే

ఎరి కొళ్ = వేడిమిని కల, శెమ్ నాయిఱు ఇరణ్డు = ఎఱ్ఱని రెండు సూర్య మండలాలు, ఉడనే = రెండు కలసి, ఉదయ మలైవాయ్ = ఉదయపర్వతంపై, విరికిన్ఱ = ఉదయించి ప్రకాశించే, వణ్ణత్త = స్వభావం వంటి స్వభావాన్ని కల్గిన, ఎమ్బెరుమాన్ కణ్గళ్ = భగవానుని నేత్రాలు, అవఱ్ఱుళ్ = ఆ సూర్యుల రూపాలలో, ఎరి కొళ్ = జ్వలిస్తూ కన్పించే, శెమ్ తీ = ఎఱ్ఱని అగ్నిలో, మీణ్డు వీఴ్ = (వేఱు ఆశ్రయరేమీ లేనందున) తిరిగివచ్చి పడిపోయే, అశురరై పోల్ = (శత్రువులైన, క్రూరమందేహాదులనే) అసురులకు వలె, ఎమ్ పోలియర్క్కుమ్ = (అనుకూలురైన) మావంటివారికి కూడా, విరివ = తాపాన్ని కల్గినవై వ్యాపిస్తున్నవి, వైయమ్ ముఱ్ఱుమ్ విళరియదు = (భగవానుని) లోకం అంతటిని ఆశతో నిబిడంగా (దట్టంగా) ఉండేటట్లు చేసే రీతి, ఇదువో = ఇదేనా!, శొల్లీర్ =చెప్పండి.

**భావదీపిక** : నాయకుని మానసికసాక్షాత్కారంగా దర్శించిన నాయకి నాయకుని నేత్రసౌందర్యానికి బాధపడుతూ పలికే పాశురం, ఇది. "ఉరువెళిప్పాడు" (ప్రత్యక్ష సమానాకార దర్శనం) అంటే - విశ్లేషించిపోయిన నాయకుని విషయంలో నిరంతరం భావనను నిల్పిన మనస్సులో, ఆ భావనాప్రకర్షవల్ల అతని రూపం ప్రత్యక్షంగా నేత్రాలకు ఎదురుగా కన్పించడం. ఆ విధంగా నాయకుని రూపంగా కన్పడగా, ఆ రూపంలోని నేత్రసౌందర్యం పట్ల అభినివేశాన్ని పొందిన నాయకి ఆ రూపం చేతికి అందకుండా అదృశ్యమైనందున, ఆ నేత్రసౌందర్యం తన ప్రేమవ్యాధిని మిక్కిలిగా వృద్ధిచేసి, తనను మిక్కిలి బాధించే విషయాన్నిగూర్చి సఖులతో పల్కుతున్నది, ఇందులో.

మిక్కిలి వేడిమిని కల ఉదయపర్వతంపై ఏకకాలంలో ఉదయించి ప్రకాశించే రెండు సూర్యమండలాల స్వభావంవంటి స్వభావాన్ని కల భగవానుని తిరునేత్రాలు మాకు తాపహేతువులు అవుతున్నాయి. ఆ సూర్యుని రూపాలలో జ్వలిస్తూ కన్పించే ఎఱ్ఱని అగ్నిలో వేఱు గతి లేకపడి నశించే మందేహులనే అసురులకు, ఏవిధంగా తాపహేతువు అవుతున్నాయో, ఆవిధంగానే అనుకూలురైన మా వంటివారికికూడా తాపాన్ని కల్గించేవిగా స్వామి నేత్రాలు వ్యాపిస్తున్నాయి. స్వామి లోకాన్ని అంతటిని అభిమానించి, రక్షిస్తాను- అనే కీర్తిని పొందిన స్వభావానికి (స్థితికి) ఇదేనా తగినది!- అని తాత్పర్యం.

తైత్తిరీయారణ్యకమనే వేదభాగంలో రెండవ ప్రశ్న- రెండవ అనువాకంలో అధ్యయనం చేయబడే ఒక వృత్తాంతం ఈ పాశురంలోని మూడవ పాదంలో ప్రస్తావింపబడింది. మందేహారుణమనే ద్వీపంలో నివసించే మందేహులనే అసురులు ఉగ్రమైన తపస్సును చేసి, బ్రహ్మవద్ద వరాలను పొంది, దానివల్ల గర్వించి, ఎల్లప్పుడు సూర్యుని చుట్టి ఎదిరించి, అడ్డుకొని పోరాడతారని, బ్రాహ్మణులు మొదలైనవారు సంధ్యాకాలాలలో మంత్రపూర్వంగా చేతులతో అర్పించే అర్ఘ్యతీర్థాలు వజ్రాయుధంవలె వారిపై పడి, వారిని ఆవలివైపుకు గెంటి, సూర్యుని సంచారానికి అడ్డులేని రీతిలో చేస్తాయని, బ్రాహ్మణాదులు అర్పించే అర్ఘ్యంయొక్క సామర్థ్యంచేత సూర్యమండలంలోనే ఒక ఎఱ్ఱని అగ్ని ఎగసి, జ్వలించగా, అగ్నిలో పడిన మిడతలవలె ఆ అగ్నిలో అసురులు పడినశించిపోతారనే గాథ అధ్యయనం చేయబడుతున్నది.

రెండు సూర్యమండలాలు ఏకకాలంలో ఒక ఉదయపర్వతంపై ఉదయించి పైకి వచ్చి ప్రకాశించినట్లుగా భగవానుని నేత్రాలు, బలిష్ఠులైన ఆ అసురులకువలె, బలహీనులమైన మాకుకూడా తాపాన్ని కల్గిస్తున్నాయే! బలవంతులను నిరసించి, బలహీనులను రక్షించడంకదా, క్రమం. భగవానుడు లోకాలను అన్నిటిని ప్రేమతో వృద్ధిపొందేటట్లు రక్షిస్తాడు- అనేది ఈ రీతిలోనా?- అని పరాంకుశనాయకి క్లేశపడుతూ పల్కుతున్నది.

"ఒకే సమయంలో రెండు సూర్యమండలాలు ఉదయించినట్లుగా'' అనేది అభూతోపమ. రాక్షసులైన మందేహులను అసురులని అనడం - క్రూరతలోని సామ్యాన్నిబట్టి. **"అశురర్రై"**- ఇది విభక్తివ్యత్యయ ప్రయోగం. **(ఉరువు మయక్కమ్),** (అశురర్క్కు- (అసురులకు) అనే అర్థాన్ని ఇవ్వవలసి ఉన్నందున). **"ఉదయమ్మలై"**- ఇది మకారపు ఒత్తు గణానుసారంగా వచ్చిన రూపం **"విరిత్తల్ వికారమ్".**

మందేహులు మండే అగ్నిలో పడి నశించడం ఎల్లప్పుడు సంభవిస్తున్నందున ఆ స్థితి (స్వభావం) **"మీణ్డు"** అని అనడంద్వారా సూచింపబడింది- అని చెప్పవచ్చు. లేక, **"మీణ్డు"**- (సూర్యుని బాధించడమనే తమ కార్యంనుండి) విరమించి - అని కూడా అర్థాన్ని చెప్పవచ్చు. **"విరివ"** అనేది సమాపక్రియ **(విన్రైముఱ్ఱు).** **"విళరియదు"**- అనే దానిని **"విళర్"** అనే పదంపై పుట్టిన **"ఒన్టన్ పాల్ కుఱిప్పు ముఱ్ఱు"** అని మధ్యలోని అకారం, అకారాలు **"శారియైచ్చొల్".** **"విళరి"** అనే పదం- మిక్కిలి ఆశ- అనే అర్థాన్ని ఇస్తున్నదనే విషయం. **"విళరియే యుళమై యొழிలోర్ నరమ్బు యాళ్ నీళ్ వేట్కై"** అనే నిఘంటువచనాన్నిబట్టి తెలుస్తున్నది. **"విళర్"**- అనేది గర్వమనే అర్థాన్ని ఇవ్వడం **"విళరెన్బదిళమై తానే వెళుప్పొడు కొழுప్పు యాకుమ్"** అనే చూడామణి నిఘంటువచనంవల్ల తెలియవచ్చు.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే- భగవానుడు మొదట ఆழ்వార్ల ఆంతరనేత్రానికి లక్ష్యభూతుడైనపుడు, అతడు తమపట్ల ప్రసరింపజేసిన కటాక్షమే, తరువాత పూర్ణానుభవం పొందలేనందున అది తమకు పరితాప హేతువుగా తోచే రీతిని ఆழ்వార్లు తమ భక్తులతో పల్కడమే. "భగవానుని కాటుక కొండవలె వెలిగే తిరుమేనిలో జ్యోతిస్స్వరూపమై కన్పించే నేత్రాల కటాక్షం తమకు ఆనందాన్ని కల్గించనందున, ప్రతికూలురకు అవి బాధను కల్గించినట్లు, దాసులమైన మనకు

కూడా దుఃఖాన్ని కల్గిస్తున్నాయి. ఇటువంటి భగవానుడు లోకానికి రక్షకుడై ఉండే స్వభావం (స్థితి) ఏవిధంగా? - అని ఆర్తితో ఆళ్వార్లు అంటున్నారు. తమను శీఘ్రంగా తన దగ్గరకు తీసికోనందున కల్గిన ఆర్తి అతని రక్షకత్వంలో కూడా శంకను కల్గించే రీతిలో అయినది- అని భావం.

ఇద్దఱు సూర్యులు ఒకే సమయంలో ఉదయించి తపింపజేసినట్లుగా భగవానుని తిరునేత్రాలు తనను బాధిస్తున్నాయని "ఎరికొళ్ శెన్నాయిఱు" అని ప్రారంభమే ఈ పాశురంలో నాయకి పల్కిన సూక్తిని వివరించేటపుడు పెరియవాచ్చాన్‌పిళ్ళై నంజీయర్ పల్కిన ఒక వార్తను ఉదాహరించారు.

ఈ పాశురాన్ని చెప్పడానికి నా మనస్సు అంగీకరించడం లేదు. భగవానుని తిరునేత్రాలు తపింపజేస్తున్నట్లు, బాధిస్తున్నట్లు కదా ఈ పాశురంలో చెప్పబడింది. లోకాన్ని అంతటిని తల్లిగా రక్షించే భగవానుని తామరపూలవంటి నేత్రాలను మనం ఈ రీతిలో పల్కడం తగునా? ఆళ్వార్లకు ఉండే ఆర్తి మనకుకూడా ఉన్నపుడే ఈ పాశురాన్ని చెప్పడం తగును- అని అన్నారట. ఈ ఐతిహ్యం నమ్పిళ్ళై ఈడులో కూడా ఉన్నది.

## క్రౌంచపక్షి చేసే ధ్వనిని విని సహించలేని నాయకి పడే బాధను చూచి సఖి చింతించడం

83. విళరిక్కురలన్డిల్ మెన్‌పెడై మేగిన్డ మున్డిల్ పెణ్ణై,
ముళరి క్కురమ్బై యిదు విదు వాగ-, ముగిల్వణ్ణన్ పేర్
కిళరి క్కిళరి ప్పిద*ఱ్ఱు*మ్ మెల్లావియుమ్ నైవు మెల్లామ్
తళరిణ్ణాలో వఱియేన్, ఉయ్యలా దిత్తైయలుక్కే

విళరి = "విళరి" అనే రాగాన్ని కల, కురల్ = స్వరాన్ని కల, అన్డిల్ = "అన్డిల్" (క్రౌంచ) పక్షి, మెల్ పెడై = సుకుమారమైన తనపెంటి పక్షితో, మేకిన్డ= ఆశ పడి స్పృశించే చోటైన, మున్డిల్ పెణ్ణై ముళరి కురమ్బై = ముంగిటిలో ఉండే తాటిచెట్టుపై గూడును, ఇదు ఇదు ఆక = ఈ విధంగా అంతటా ఎదురుగా సమీపంలో ఉండగా, ఈ క్రౌంచపక్షిని చూచినందువల్ల, దీని స్వరాన్ని విన్నందువల్ల సహించలేని స్థితి అతిశయించి, ముకిల్ వణ్ణన్ పేర్ కిళరి కిళరి పిద*ఱ్ఱు*మ్ = కాలమేఘవర్ణుడైన తమ నాయకుని తిరునామాలను (బలహీనివల్ల క్లేశపడి

మాటిమాటికి) గొంతుఎత్తి ఎత్తి పల్కి పలవరించే రీతిలోని, మెల్ ఆవియుమ్ = (ఈమె) కృశించిన ప్రాణం, నైవుమ్ = (శరీరంలోని) అలసట, ఎల్లామ్ =అనే ఇవి అన్నీ, తళరిన్ కొలో = పూర్తిగా తీరినపుడా, ఇ తైయలుక్కు = ఈ వనితకు, ఉయ్యల్ ఆవదు = (అతడు వచ్చి చేరగా) ఉజ్జీవనం కల్గడం!, అఱియేన్ = నేను తెలియకున్నాను.

**భావదీపిక** : విరహాన్ని సహించలేని నాయకియొక్క క్లేశాన్ని చూచి ఆమె సఖి బాధపడుతూ పలికే పాశురం, ఇది. "కామవిరహంవల్ల కలిగే వేదనలలో- చింత,పాలిపోయిన రంగు (వైవర్ణ్యం), శరీరం కృశించడం, విలాపం, పలు మాటలను పలవరించడం మొదలైనవి పలు (మన్మథావస్థలు) ఈమెకు కలిగాయి. ఇంతవరకు ఈమె నాయకుడు వచ్చి ఈమెను కలిసి, ఈమెను ఉజ్జీవించడం కన్పించలేదు. ఇక మరణవేదన ఒకటే మిగిలి ఉన్నది. అదికూడా ఏర్పడిన తరువాతనే ఈమె వద్దకు అతడు వచ్చి కలవాలని అనుకుంటున్నాడా! ఏమి!" అని సఖి బాధపడుతున్నది. దీనివల్ల, ఇక ఈమెకు జీవించి ఉండడం దుర్లభం- అని భావం.

సంస్కృతగ్రంథకారులు క్రౌంచమని వ్యవహరించే పక్షి ద్రావిడంలో **"అన్రిల్"** అనబడుతున్నది. ఈ జాతిపక్షులు ఎల్లప్పుడు ఆడమగ కలసియే ఉంటాయి. క్షణకాలం అయినా ఒక దానిని విడచి ఇంకొకటి ఉండదు. విశ్లేషం కల్గితే ఆ విరహక్లేశాన్ని సహించలేక ఒకటి రెండు మూడు మార్లు అఱచిన, ఆ తరువాత కూడా తన జంట పక్షితో కలువలేకపోతే వెంటనే చచ్చిపోతాయి. (పగలంతా కలసి ఉండి, రాత్రిలో విశ్లేషించి క్లేశపడే చక్రవాక పక్షులను కూడా **"అన్రిల్"** - అని అనడం ఉన్నది) క్రౌంచం, దాని స్వరం కామోద్దీపకమై, విశ్లేషించినవారికి విరహ వేదనను పెంచుతాయి. ఈ పక్షి తాటిచెట్టుపై నివసిస్తుందని పలువురు పలుచోట్ల తెలిపారు. **"కావార్ మడప్పెణ్ణై యన్రిలరి కురలుమ్", "పెణ్ణైమేల్పెన్ను అవ్వన్రిల్పెడై వాయ్ చ్చిఱుకురల్"** అనే తిరుమజ్గైయాళ్వార్ పాశురాలు స్మరణీయాలు.

సంస్కృతంలో **షడ్జం, ఋషభం, గాంధారం, మధ్యమం, పంచమం, దైవతం, నిషాదం-** అనే పేరును కల సప్తస్వరాలు తమలో క్రమంగా ద్రావిడంలో **కురల్, తుత్తమ్, కైక్కిళై, ఉழై, ఇళి, విళరి, తారమ్-** అనే ఏడు స్వరాలుగా చెప్పబడడంచేత క్రమాన్నిబట్టి "విళరి" అనేది దైవతమనే స్వరమని చెప్పవచ్చు. లేక, సంస్కృత నిఘంటువులో "క్రౌంచః క్వణతి మధ్యమమ్" అని అన్నందున క్రౌంచ (అన్రిల్)

మధ్యమమనే స్వరాన్ని కూస్తున్నదని తెలుస్తున్నందున, **"విళరి"** అనే దానికి మధ్యమ స్వరమనే అర్థాన్ని చెబుతారు. **"విళరి"** అనే ఒక రాగం కూడా ఉన్నది. **"మెన్‌పెడై"** విరహాన్ని సహించలేని సౌకుమార్యాన్ని కల్గిన పెంటి పక్షి- అని అర్థం. **"ముళరి క్కురమ్బై"** అనేదానికి -తామరతూడులను, పూలను తెచ్చి నిర్మించబడిన గూడు- అని కూడా కొందఱు వివరిస్తారు. **"ఇదు విదు"** అనేది కంటికి కన్పించే పెక్కింటిని కలుపుకొని చేయబడిన ప్రయోగం **"మాఅన్ పణిత్త తమి*ౖఝ్* మఱైక్కు ఆఅజ్గమ్ కూఱ"** అవతరించిన తిరుమఙ్గై ఆ*ౖఝ్*వార్, ఇక్కడ **"అన్డిల్ మెన్ పెడై మేకిన్ద మున్డిల్ పెణ్ణై ముళరి క్కురమ్బై యిదు"** అనే ఈ సూక్తిని అనుసరించి, **"మున్డిత్పెణ్ణైమేల్ ముళరి కూట్టకత్తు అన్డిలిన్ కురల్ అడుమెన్నైయే"** (వాకిటిలో ఉండే తాటిచెట్టుపై తామరపూలతో నిర్మింపబడిన గూడులో ఉండే క్రౌంచపక్షి చేసే ధ్వని నన్ను బాధిస్తున్నది.) (పెరియతిరు-11-1-6) అని అనుగ్రహించిన సూక్తి స్మరణీయం.

**"మేకిన్ద"- "మేవుకిన్ద"-** స్పృశించే, సంశ్లేషించే, కురమ్బై = గూడు, **(కుడమ్బై),** మున్డిల్ - **"ఇల్‌మున్"** అనే వెనుక ముందుగా మాఱిన రూపం. **"తైయల్-** అందం, ఇక్కడ ఈపదం అందాన్ని కల (ఆకుపెయర్) స్త్రీని లక్షించే పదం. **"పిద*ర్*ఱుమ్"** అనేదానికి - పలవరించడమనే అర్థాన్ని చెప్పవచ్చు. **"ఆవియుమ్ నైయుమ్", "ఆవియిన్ నైవుమ్"** అనేవి పాఠభేదాలు.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే - భగవదనుభవం పొందలేనందున క్లేశపడే ఆ*ౖఝ్*వార్లను చూచిన వారి భక్తులు. "బాధకాలైన లౌకికపదార్థాలు దగ్గరలో ఉన్నందున వీరు సహించి ఉండడం దుర్లభంగా ఉన్నది"- అని అంటున్నారు- అని. వీరుండే చోటకు దగ్గరలో ఉండే కొందఱు భగవానుని చేరి అనుభవించడం గమనించి, తమకు ఆ స్థితి కలుగనందున విరహార్తి, అతిశయించగా, భగవానుని తిరునామాలను నోరు నిలుపకుండా పల్కి, పలవరించి, మనస్సులో క్లేశపడి, కృశించడమనే ఆ*ౖఝ్*వార్ల స్థితిని చూచి "ఈ విధంగా బాధపడే వీరికి దేహవియోగం కల్గిన తర్వాతయేనా భగవానుడు వచ్చి వీరిని దరి చేర్చుకొంటాడు" అని గర్హించి పలికారని ఇచటి స్వాపదేశం.

ఈ పాశురంలో క్రౌంచపక్షి ధ్వనిని విని విరహిణి అయిన పరాంకుశ నాయకి మోహాన్ని పొందినదని పల్కిన సూక్తికి సమంగా శ్రీరామాయణంలో ఏదైనా సందర్భం ఉన్నదా? అని నంజీయర్ ప్రశ్నించగా భట్టర్, శ్రీరాముని ఆజ్ఞానుసారం

సీతను లక్ష్మణుడు తీసికొని పోయి వనంలో ఒంటరిగా విడచిపెట్టినపుడు ఆమె రోదించి మోహాన్ని పొందింది. దానిని చూచిన వాల్మీకి మునికి కల్గిన స్థితి ఈ పాశురంలో చెప్పబడిన నాయకియొక్క స్థితితో సమానంగా చెప్పవచ్చు- అని అన్నారట. శ్రీరామాయణంలో ఈ వృత్తాంతం ఉత్తరరామాయణంలోని 49వ సర్గలో ఉన్నది. ఈ ఐతిహ్యం నమ్బిళ్ళై వ్యాఖ్యానంలో కూడా ఉన్నది.

ఈ పాశురంలోని **"ముట్టిల్ పెణ్ణై"** అనే సూక్తి వివరిస్తూ పెరియవాచ్చాన్ పిళ్ళై ఇంకొక సంవాదాన్ని ప్రస్తుతించారు.

ముంగిటిలో తాటిచెట్టు ఉండవచ్చునా? అని కొందఱు ప్రశ్నించగా వంగి పురత్తు నమ్బి **"అదువో! ఇవళ్ కార్యమ్ తళిరుమ్ ముఱియుమాయ్ శెల్కిఱదు"** అని బదులిచ్చారు. **"తళిరుమ్ ముఱియుమ్"** అని అంటూ నమ్బి నర్మగర్భంగా బదులిచ్చారు. దీని భావమేమంటే- నాయకుడు మాటిమాటికి రావడం, నాయకితో కలసి ముంగిట్లో శయనించడం జరుగుతున్నదా? లేదు కదా! రాత్రిపగలు నాయకి విశ్లేష దుఃఖంతో బాధపడుతూ ఉండగా, బంధువులు, ఆత్మీయులు దానిని చూచి వారుకూడా క్లేశపడుతున్నపుడు, ముంగిట్లో మొలచి ఉండకూడనివి కదా పెరిగిపోతాయి. వాటిని నఱికివేసేవారెవరూ లేనందున ముంగిటిలో తాటిచెట్టు పెరిగింది- అనేది ఇచటి భావం. దీనికి సంవాదంగా పెరియతిరుమొ*ழி* ప్రబంధం లోని **"ముట్టిన్ తనినిన్ద పెణ్ణై మేల్ కిడన్దీర్కిన్ద అన్ఱిన్ కూట్టై ప్పిరికిన్దవర్ ఆర్కొలో?"** (వాకిటిలో ఒంటరిగా ఉండే తాటిచెట్టుపై ఉంటూ, హింసిస్తున్న క్రౌంచపక్షి గూటిలోనుండి తరిమివేసేవారు ఎవరో? తెలియలేకున్నాను.) (11-2-1) అనే పాశురం స్మరణీయం. ఈ సంవాదం నంబిళ్ళై వ్యాఖ్యలో కూడా ఉన్నది.

## నాయకి, నాయకుని చూడాలని త్వరపడడం

**84.** **తైయల్ నల్లార్గళ్ కు*ழ*ాజ్గళ్ కు*ழி*య కు*ழ*ువినుళ్ళుమ్,**
**ఐయనల్లార్గళ్ కు*ழி*య వి*ழ*వినుమ్-, అజ్గజ్గెల్లామ్**
**కైయ పొన్నా*ழி* వెణ్శజ్గొడుమ్ కాణ్బానవావువన్ నాన్**
**మైయవణ్ణా! మణియే! ముత్తమే ! యెన్దన్ మాణిక్కమే!**

మైయ వణ్ణా! = కాటుకయొక్క రంగువలె నల్లని వర్ణాన్ని కల్గినవాడా!, మణియే ముత్తమే ఎన్ తన్ మాణిక్కమే = నీలమణివలె, ముత్యం వలె,

మాణిక్యంవలె వర్ణాన్ని, అందాన్ని, కాంతిని కలస్వామీ!, తైయల్ నల్లార్‌కళ్ = అందమైన స్త్రీలు, కుழாజ్గళ్ కుழிయ కుழுవి నుళ్ళుమ్ = సమూహంగా కూడిన గుంపులలోను, ఐయ నల్లార్‌కళ్ = గొప్పవారైన, సత్పురుషులు, కుழிయ విழுవినుమ్ = గుమిగూడిన ఉత్సవాలలోను, అజ్గు అజ్గు ఎల్లామ్ = ఇంక ఇటువంటి సమూహాలన్నిటిలోను, వైయ పొన్ ఆழி వెణ్ శజ్గొడుమ్ = చేతిలో ఉండే బంగారువర్ణాన్ని కల చక్రంతో, తెల్లని వర్ణాన్ని కల శంఖంతో, నాన్ కాణ్బాన్ అవావువన్ = నేను (నిన్ను) దర్శించాలని ఆశపడుతున్నాను.

**భావదీపిక** : నాయకి నాయకుని చూడాలని త్వరపడుతూ పలికే పాశురం ఇది. నాయకుని విరహాన్ని భరించలేని నాయకి అతనిని నా ప్రేమకు తగినట్లు ఒంటరిగా ఏకాంతంలో దర్శించి కూడి ఆనందించడం లభించకపోయినా, ఆడవారు, మగవారు పలువురు కూడిన సమూహం మధ్యలో ఎక్కడైనా సరే దర్శించడం జరిగితే, దానితో ఊరడిల్లుతాను- అని భావించి పల్కుతున్నది. **"మైయవణ్ణా! మణియే! ముత్తమే! ఎన్తన్ మాణిక్కమే"** అని ప్రత్యక్షంగా సంబోధించడం ఏవిధంగా సాధ్యం!- అని అంటే, నాయకునే నిరంతరం భావించే భావనయొక్క అతిశయం చేత అతడు ఎదురుగా నిలుచునట్లుగా భావించి, ప్రత్యక్షంగా సంబోధిస్తూ పల్కుతున్నది. రేపల్లెలో ఉండే గోపికలు కూడా ఆడే రాసక్రీడవంటి స్త్రీల సమూహంలోను, ధర్మపుత్రుడు చేసిన రాజసూయయాగం వంటి మహాపురుషుల సమూహంలోను వేంచేసి ఉండడానికి గల యోగ్యతను బట్టి **"తైయనల్లార్‌కళ్ కుழాజ్గళ్ కుழிయ కుழுవినుళ్ళుమ్ ఐయనల్లర్‌కళ్ కుழிయ విழுవిను మజ్గెజ్గెల్లామ్ కాణ్బాన్ అవావువన్ నాన్"** అని అనబడింది. భగవానుడు స్త్రీల సమూహంలోను, మహాపురుషుల గోష్ఠిలోను సేవించదగినవాడనేది **"పల్లాయిరమ్ పెరున్దేవి మారొడు పౌవమోతి తువర, ఎల్లారుమ్ శూழ చ్చిజ్గాశనత్తే యిరున్దానై క్కణ్డార్ ఉళర్"** (పలువేలమంది దేవేరులతో, సముద్రతరంగాలు వీచే ద్వారకలో, అందరూ చుట్టి ఉండగా సింహాసనంలో వేంచేసిఉండేవానిని దర్శించినవారు ఉన్నారు.), **"కాన్దళ్ మదిళ్ విరల్ శీదైక్కాకి క్కడుజ్జిలై శెన్దిఱుక్క వేన్దర్ తలైవన్ శనకరాజన్తన్ వేళ్వియిల్ కణ్డార్ ఉళర్"** (ఎర్రని అందమైన వేళ్ళను కల సీతాదేవి కోసం, రాజులందరికీ ప్రభువైన జనకుని యాగంలో, విశ్వామిత్రముని తనవెంట తీసుకొనిపేగా, దృఢమైన శివధనస్సును విరవగా చూచినవారున్నారు.) అనే పెరియాழ்వార్ల పాశురాల వల్ల తెలియవచ్చు. **"తైయల్ నల్లార్‌కళ్"**- స్త్రీలలో

గొప్పవారని, "ఐయనల్లార్ కళ్"- ఆర్యశ్రేష్ఠులని అర్థం. "తైయల్ నల్లార్‌కళ్" - "నల్‌తైయలార్‌కళ్" అని పదవ్యత్యయరూపంగా గ్రహించవచ్చు. "కు**ழ**ియ"- అంటే - "కు**ழు**వియ" అని అర్థం (గుమిగూడిన). 'త**ழు**వియ" అనేది "త**ழై**య" అని "కె**ழு**వియ" అనేది "కె**ழి**య'' అని మాఱినట్లే ఇదికూడా. "తమి**ழ்** త**ழి**యశాయలవర్", "తనదు మాడే త**ழి**య కావలరై నోక్కి", "కె**ழి**య రాకువుమ్ కేతువుమ్" అనే చోట "త**ழి**య, కె**ழి**య" అనే ప్రయోగాలను చూడవచ్చు.

"కైయ" అనేది, "మైయ" అనేది- ఈ రెండు "కుఱిప్పు ప్పెయర్ ఎచ్చమ్", "మణియే! ముత్తమే ! మాణిక్కమే !" అని ఉపమానాన్ని ఉపమేయంగా పల్కడం ఔపచారికం. "ముత్తినై మణియై మణిమాణిక్కవిత్తినై చ్చెన్ఱువిణ్ణకర్ క్కాణ్డుమే" అనే తిరుమఙ్గైయాழ్వార్ పాశురంలోను ఈమూడు ఉపమానాలు కలిపి ప్రయోగింపబడడం గమనించవచ్చు.

మనస్సు అనే ఆంతరనేత్రంతో భగవానుని సేవించగల్గిన ఆழ్వార్లు ఆ స్వామిని తిరిగి ఎక్కనా దర్శించాలని ఆశపడి, అతని ఉద్దేశిస్తూ తనలో తాను పల్కిన మాట దీనికి స్వాపదేశం.

"తైయల్ నల్లార్‌కళ్ కు**ழా**ఙ్గళ్ కు**ழి**య కు**ழு**"- అనే దానికి స్వాపదేశం- పరతంత్రులై ఉండే స్వభావాన్నే ప్రధానంగా కల్గిన పరతంత్రుల గోష్ఠిలో- అని, "ఐయనల్లార్‌కళ్ కు**ழு**" అనేదానికి స్వాపదేశం-యాగాదికర్మలను నిర్వహించే స్వభావాన్ని కల కైంకర్యప్రవృత్తి శీలురగోష్ఠిలో -అని తెలుపబడింది. ఈపాశురానికి గల ఉరైలో అழకియ మణవాళచ్చీయర్ "నాయకియానవళ్ నాయకనాన సర్వేశ్వరనై ప్పుఱమ్బే తిరళిడైయాకిలుమ్ కాణ ఆశైప్పట్టు ప్పులమ్బిన ప్రకారమ్" (నాయకి, నాయకుడైన సర్వేశ్వరుని బయట జనసమూహంలో అయినా చూడాలని ఆశపడి పలవరించిన రీతి) అని, "కు**ழா**ఙ్గళ్ కు**ழి**య కు**ழு**- ఎన్ఱైయాలే అన్ద సమూహన్దాన్ పలవాయ్ చ్చేర్న్ద సముదాయత్తై చ్చొల్లుకిఱదు" ("కు**ழா**ఙ్గళ్ కు**ழి**య కు**ழு**" అని అన్నందున ఆ సమూహం పలువురు చేరిన సమూహమని తెలుస్తున్నది) అని, "ఇన్ద క్కిళవి- మళ్ళర్‌కు**ழ**ీ ఇయ వి**ழ**ువినాలుమ్ మకళిర్ త**ழ**ీ ఇయ తుణఙ్గైయాలుమ్, యాణ్డుమ్ కాణేన్ మాణ్డక్కోఙ్గై- ఎన్ఱు అకత్తమి**ழి**లుమ్ శొల్లప్పట్టదు" అని పల్కడం గమనించదగినవి. ఇక్కడ ఉట్టంకింపబడిన

ప్రయోగం కుఱున్దొకై (31) అనే గ్రంథం నుండి గ్రహింపబడినది. ఇది, నచ్చినార్క్కినియర్ అనే వ్యాఖ్యాత రచించిన "ఉయరినుమ్ శిఱన్దన్టు" అనే తొల్కాప్పియ సూత్రవ్యాఖ్యలో ప్రమాణీకరింపబడింది.

**సాయం సమయాన్ని చూచి సహించలేని నాయకి బాధపడుతూ పల్కడం**

**85. మాణిక్కఙ్గొణ్డు కురఙ్గెఱివొత్తిరుళోడు ముట్టి,**
**ఆణిప్పొన్నన్న శుడర్పడు మాలై-, ఉలగళన్ద**
**మాణిక్కమే! యెన్ మరదగమే! మత్త్రొప్పారై యిల్లా**
**ఆణిప్పొన్నే!, అడియేనడియావి యడైక్కలమే**

ఉలకు అళన్ద = లోకాలను కొలిచిన, మాణిక్కమే = మాణిక్యంవలె గొప్పవాడా!, ఎన్ మరకతమే = మరకతం (పచ్చ) వలె నాకు భోగ్యమైనవాడా!, మత్త్రు ఒప్పారై ఇల్లా = తనతో సాటి వచ్చేవారు వేఱెవ్వరిని లేని, ఆణి పొన్నే= మేలిమి బంగారంవలె వెలను, కాంతిని కలవాడా!, మాణిక్కమ్ కొణ్డు కురఙ్గు ఎఱివు ఒత్తు = మాణిక్యాన్ని తీసికొని కోతి దాని విలువ తెలియలేక ఎక్కడికో విసరివేసినట్లు, ఆణి పొన్ అన్న శుడర్ ఇరుళోడు ముట్టివడుమ్ = మేలిమి బంగారం వంటి కాంతిని కల సూర్యమండలం చీకటితో చేరి తాను మఱుగుపడి పోయేటట్లు, మాలై = సాయంకాలంలో, అడియేన్ అడి ఆవి అడైక్కలమే = సహజంగా నీకు దాసుడైన నాకు స్వంతమైన ప్రాణం (ఆత్మ) నీచే రక్షింపబడదగినది.

భావదీపిక : సాయంసమయాన్ని చూచి నాయకి బాధపడుతూ పలికే పాశురం, ఇది. "కాలై యరుమ్బి ప్పకలెల్లామ్ పోదాకి మాలై మలరు మిన్నోయ్" (తిరుక్కుఱళ్ - పొழుదు కణ్డిరఙ్గల్ -7) (కామ వ్యాధిని ఉదయకాలంలో మొగ్గతొడిగి, పగలు పూవుగా ఎదిగి సాయంసమయానికి వికసిస్తుంది) అనే విధంగా కామవేదన మిక్కిలి వృద్ధిచెందడానికి తగిన కాలమైన సాయంసమయంలో విరహార్తి అతిశయించినందున తన ప్రాణాన్ని కాపాడడానికి వేఱుగతి ఏదీ లేనిదై,నాయకి నాయకుని స్మరించి "నీకే నా మనస్సు శేషం. అందువల్ల నీవే వచ్చి నన్ను కాపాడాలి" అని మొఱ పెడుతున్నది. ఈ పాశురం తల్లి పలికే వచనమని అనేవారికి "అడియేన్ అడియావి" అనేదానికి నాకు శేషమైన కూతురు- అనే అర్థాన్ని గ్రహించాలి. "ఆవి" - ప్రాణంవలె అపురూపమైన పిల్ల- అని భావం. ఇది లక్షణా

వృత్తిచే బోధింపబడుతున్నందున ఇది లక్షక పదం. (ఆకుపెయర్) "అడియేనుడై యావి" అనేది పాఠాంతరం.

ఎవరో ఒకరు విసరగా కోతిపై పడిన మాణిక్యం, ఆ కోతి చేతిలో చిక్కుకొని, తిరిగి ఎవరికీ దొరకకుండా పాడయిపోయేటట్లే, చీకటిని నశింపజేయడంకోసం దానిపైకి పోయి పడిన సూర్యుడు, ఆ చీకటిలో చిక్కుకొని తిరిగి రాకుండా మఱుగుపడిపోయాడు (అస్తమించాడు) - అనే ఒక ఉత్ప్రేక్ష (కల్పన ఇక్కడ) చేయబడింది. సూర్యమండలానికి మాణిక్యం ఉపమానం. చీకటికి కోతి ఉపమానం. మాణిక్యం తిరిగి దొరకకుండా పోవడానికి సూర్యాస్తమయం ఉపమానం. మాణిక్యం అనేది నవరత్నాలలో ఒకటి. అది ఎఱ్ఱని రంగును కల్గి ఉంటుంది. గ్రంథాలలో **"కరుమాణిక్కమ్"**- అని నల్లగా ఉన్నదని అనడం అభూతోపమ- అని తెలియాలి. ఇక్కడ ఉపమేయమైన చీకటిస్వభావాన్ని బట్టి కోతి నల్లని కోతిగా చెప్పబడింది.

ఇక, చాలా గొప్పదైన మాణిక్యాన్ని, దాని విలువను తెలియని కోతి తీసికొని ఎక్కడో మఱుగుపడియేటట్లు విసరివేసి మాయం చేసినట్లుగా, సూర్యుని చీకటిలో విసరి వేసిన సాయంకాలం- అనికూడా చెప్పవచ్చు. ఈ వివరణలో- సాయం సమయానికి కోతి, సూర్యునకు మాణిక్యం, అతడు అస్తమించడానికి మాణిక్యం విసరివేయబడడం, చీకటికి మాణిక్యం విసరివేయబడిన చోటు ఉపమానాలు. ఇక్కడ అழகియమణవాళజీయర్ ఉక్తిను గమనించాలి. **"అన్తియే, మాణిక్కత్తై క్కొణ్డు కురఙ్గు ఎఱిన్దాప్పోలే- ఎన్ఱుమామ్. కురుఙ్గుదలావదు- వళైదలాయ్, ఉదిత్త ఆదిత్యన్ ఉయర ఎழுన్దు విழுన్దు అస్తమిత్త కడుమైయై చ్చొన్నపడి"** (లేక, తనకు దొరికిన మాణిక్యాన్ని తీసికొని ఎక్కడికో కోతి విసరివేసినట్లుగా - అనికూడా అర్థం. **కురుఙ్గుదల్** - అంటే వంగడం. అని అర్థం. దీని ద్వారా ఉదయించిన సూర్యుడు పైకివచ్చి తర్వాత క్రిందకు జారి అస్తమించిన కాఠిన్యం తెలుపబడింది) అనేది ఆ వివరణం. ఈ వివరణలో **"కురఙ్గ"** అనే **"శెయ్‌వెనెచ్చమ్"** (కర్త్రర్థక ధాతునుండి పుట్టిన రూపం) లోని చివరి భాగం లోపించిందని భావించాలి.

**"ఆణి ప్పొన్"**- పరీక్షకోసం మచ్చుగా (ఉదాహరణగా) గ్రహించే మేలిమి బంగారం. దీనికి మించిన మేలైనది అనే రీతిలోని గొప్ప బంగారం- అని కూడా వివరిస్తారు. **"మఱ్ఱు ఒప్పారైయిల్లా"**- తనకు తానే ఉపమానం అవుతాడు తప్ప, ఏ రీతిలోను వేఱెవ్వరు సాటిగాలేని- అని భావం. **"తనక్కువమై యిల్లా తాన్"**

అనే తిరుక్కుఱళ్ సూక్తి భావ్యం. ఇందువల్ల తనకంటే వేఱయిన వారందఱికంటే తాను ఉన్నతుడనేది వ్యక్తమవుతుంది. **"ఒత్తార్ మిక్కారై యిలయాయ మాయాయా!"** అని తిరువాయ్‌మొ*ழ్*రిలో కూడా ఆ*ழ్*వార్లు అన్నారు.

ఈ పాశురానికి స్వాపదేశార్థం ఏమంటే- భగవానుని అనుభవించడానికి తగిన కాలం రాగా, ఆ అనుభవం కల్గనందువల్ల ఏర్పడిన ఆర్తియొక్క ఆధిక్యం చేత బాధపడిన ఆ*ழ్*వార్లు, ఆ బాధ తీరడం కోసం స్వామి అయిన భగవానుని సొత్తైన తమ ప్రాణాన్ని రక్ష్యవస్తువుగా సమర్థించడమే. "మిక్కిలి ప్రకాశాన్ని కల్గిన వివేకం మోహాంధకారంలో పడిపోయి చిక్కు కొనే రీతిలో ఉండే ఈస్థితిలో నిన్ను శరణు పొందిన ఈ ప్రాణానికి నీవేకదా రక్షకుడవు''- అని అంటున్నారని భావం.

ఈ పాశురంలో ఆ*ழ్*వార్లు ఆత్మను **"ఆవి"** అని నిర్దేశించకుండా **"అడియావి"** పల్కినందున, ఆత్మభగవంతునకు శేషభూతమనే విషయం తెలుపబడింది. దీనిని వివరిస్తూ పెరియవాచ్చాన్‌పిళ్ళై ఒక ఐతిహ్యాన్ని ప్రస్తావించారు.

ఆత్మకు అంతరం నిరూపకం జ్ఞాతృత్వమా? లేక, శేషత్వమా?- అనే విషయాన్ని తెలిసికొని రమ్మని శ్రీరామానుజులు కూరేశులనున తిరుక్కోట్టియూర్ నంబి దగ్గరకు పంపించారు. నంబివద్ద ఆఱునెలలపాటు వేచి ఉన్న కూరేశులు తిరిగి వచ్చేటపుడు తిరుక్కోట్టియూర్‌నంబి వారిని పిలచి **"పిళ్ళైప్పిళ్ళాయ్! ఆ*ழ்*వార్లు ఎన్నుళ్ళాన్"** అని చెప్పవలసినచోట **"అడియేనుళ్ళాన్"** అని అన్నారు. అందువల్ల ఆత్మకు శేషత్వమే అంతరంగనిరూపకం- అని అన్నారు. ఈ ఐతిహ్యం నమ్బిళ్ళైవ్యాఖ్యలో, నాచ్చియార్ తిరుమొ*ழ్*రిలోని **"అఱివొ*ழ్*రిన్దార్"** (12-2) అనే సూక్తి వ్యాఖ్యానంలో, తిరువాయ్‌మొ*ழ్*రి ఈడువ్యాఖ్యలో **"అడియేనుళ్ళాన్"** (8-8-2) అనే సూక్తి వివరణలోను ప్రస్తావింపబడింది.

## నాయకుని ఎడబాసిన నాయకి క్లేశపడడం

86. అడైక్కలత్తోఙ్గు కమలత్తలరయన్ శెన్ని యెన్నుమ్,
ముడైక్కలత్తూణ్ మున్నరనుక్కు నీక్కియై-, **ఆ*ழ్*రి** శఙ్గమ్
పడైక్కల మేన్దియై వెణ్ణెయ్ క్కన్దాయ్ చ్చివన్ తామ్బుగళాల్
పుడైక్కలన్దానై యెమ్మానై, ఎన్ శొల్లి ప్పులమ్బువనే

అడై = పత్రమనే, కలత్తు = స్థానంలో, ఓఙ్గు = ఉన్నతంగా వృద్ధి చెంది వికసించిన, కమలత్తు = (శ్రియఃపతియొక్క నాభీ) కమలంలో, అలర్ = వ్యక్తమైన,

అయన్ = అజుని (చతుర్ముఖబ్రహ్మయొక్క), శెన్ని ఎన్నుమ్ = శిరస్సు అనే, ముడై కలత్తు = దుర్వాసనను కల భిక్షాపాత్రలో, ఊణ్ = ఆహారాన్ని బిచ్చమెత్తడాన్ని, మున్ = పూర్వం ఒకానొక సమయంలో, అరనుక్కు= శివునకు, నీక్కియై = పోగొట్టిన, ఆழி శఙ్గమ్ పడైక్కలమ్ ఏన్దియ = సుదర్శన పాంచజన్యాలను ఆయుధాలుగా శ్రీహస్తాలలో ఎత్తి ధరించినవాడు, వెణ్ణెయ్‌క్కు= వెన్నకోసం, అన్డు = దొంగతనం చేసిన చేతితో పట్టుబడ్డ ఆ నాడు, ఆయ్‌చ్చి = యశోదాదేవి, వల్ తామ్బుకళాల్ = బలమైన దారాలతో, పుడైక్క = కట్టగా, అలన్దానై = బాధపడినట్లుగా తోచినవాడు, ఎమ్మానై = మాకు స్వామి అయిన శ్రియఃపతిని గూర్చి, ఎన్ శొల్లి పులమ్బువన్ = నేను ఏమని పల్కి విలపించగలను?

**భావదీపిక :** ఇది, నాయకుని విశ్లేషించిన నాయకి విలపిస్తూ పలికే పాశురం. ఆపత్కాలంలో సహాయపడే స్వభావం, భక్తుల విరోధులను నిగ్రహించడానికి తగిన సాధనాలను కలవాడై ఉండే స్వభావం, భక్తులకు సులభుడై ఉండే స్వభావమే భగవానునకు సహజంగా ఉన్నాయి. ఈ స్వభావాలు ఏవీ తన విషయంలో, సహాయపడకపోవడాన్నిగూర్చి పరాంకుశనాయకి బాధపడుతున్నది. **"అడైక్కలత్తోఝ కమలత్తలరయన్ శెన్ని ఎన్నుమ్ ముడైక్కల త్తూణ్ మున్నరనుక్కు నీక్కియ"** అని అన్నందున ఆపదలో సహాయపడే స్వభావం. **'ఆழி శఙ్గమ్ పడైక్కల మేన్దియ"** అని అన్నందున ఆశ్రితవిరోధులను నిగ్రహించడానికి తగిన ఆయుధాలను కల్గి ఉండడం, **"వెణ్ణెయ్‌క్కన్ఱాయ్‌చ్చి వన్‌తామ్బుకళాల్ పుడైక్కలన్దానై"** అని అన్నందున భక్తులకు సులభుడై ఉండడం తెలుపబడ్డాయి.

**(ఎన్ శొల్లి ప్పులమ్బువనే)**- శివునకు ఏర్పడిన ఆపదను తీర్చినవానిని ఉద్దేశించి నాకు కల్గిన ఆపదను తీర్చమని చెప్పనా? భక్తుల దుఃఖాలను తీర్చడం కోసం ఆయుధాలను ధరించినవానిని చూచినా దుఃఖాన్ని తీర్చడం కోసం చేతులలో ఆయుధాలను గ్రహించమని అననా? ఒక గొల్లపడుచు కట్టేటట్లు కొట్టేటట్లుగా సులభుడైనవానిని చూచి నాకు సులభుడవు కావాలి- అని అననా? ఏమి పల్కి మొఱపెట్టను?- అని అంటున్నది నాయకి. అయ్యో! ఈ స్వభావాలు పాపిష్ఠిదాననైన నా విషయంలో సహాయపడడం కన్పించలేదే !- అని విలపిస్తున్న తీరు ఇది.

ఒకానొక సమయంలో పరమశివుడు, తనవలె బ్రహ్మకూడా అయిదు శిరస్సులను కలవాడై ఉండడాన్ని పలువురు చూచి భ్రమపడడానికి అది

కారణమవుతున్నదని తలచి, అతని శిరస్సులలో ఒక శిరస్సును ఖండించి వేశాడు. అపుడు, ఆ కపాలం శివుని చేతికి అంటుకొని పోయింది. "దీనిని పోగొట్టుకోవడానికి ఏమి చేయాలి?'' అని శివుడు బాధపడగా, దేవతలు, మునులు "ఈ పాపం తీరడానికి బిచ్చమెత్తాలి. ఎప్పటికి కపాలం నిండుతుందో, ఆనాటికి ఇదు చేతి నుండి విడిపోతుంది'' అని అన్నారు. శివుడు పలు మార్లు పలు చోట్లకు పోయి బిచ్చమెత్తుతూ క్లేశపడుతూ తిరిగినా ఆ కపాలం వీడిపోలేదు. ఒకనాడు బదరీకాశ్రమాన్ని చేరి, అక్కడ వేంచేసి ఉండే నారాయణ మూర్తికి నమస్కరించి, స్తుతించగా, ఆ స్వామి అక్షయమని అంటూ భిక్షను పెట్టాడు. వెంటనే ఆ కపాలం నిండి శివుని చేతినుండి విడిపోయింది- అనేది **"అయన్ శెన్నిక్కలత్తు ఊణ్ అరనుక్కు నీక్కియ"** (బ్రహ్మకపాలంలో శివుడు బిచ్చమెత్తడాన్ని తీర్చిన) వృత్తాంతం.

తామరపూవు పచ్చని ఆకులపై ఉన్నతంగా వికసించేటట్లు తిరునాభీకమలం భగవానుని పచ్చని తిరుమేనిపై పైకి ఉద్భవించి పూచడం **"అడైక్కలత్తోఱ్ఱ కమలమ్"** అని అన్నందున వ్యక్తమవుతున్నది. ఇక, **"అడైక్కలమ్"** అనే దానిని శివునకు విశేషణంగా చేసి, **"అడైక్కలమ్"** (కాపాడబడదగినవాడు)గా ఆశ్రయించిన శివునకు- అని, **"నీక్కి"** అనేదానిని విశేషణంగా చేసి, రక్షకుడై ఉండి, పోగొట్టినవాడు- అని అర్థాలను గ్రహించవచ్చు. లేక, **"అడైక్కలత్తోఱ్ఱ అయన్"** అని అన్వయించి (తనవద్ద) **"అడైక్కలమాక వళర్కిన్ఱ"**- బ్రహ్మ రక్ష్యభూతునిగా పెరుగుతున్న -అనే అర్థాన్ని చెప్పే వారున్నారు. **"అడైక్కలమ్"** అనే పదం రక్షించడానికి తగిన వస్తువును, రక్షకునికూడా తెల్పుతుంది. **"కమలత్తు అలర్"** - అనే దానికి తామరపూవు - అనే అర్థాన్ని గ్రహిస్తే, **"తోన్ఱిన"** అని అన్వయించాలి- **"ముడై"**- దుర్గంధం.

**"పడైక్కలమ్"**- యుద్ధసాధనం. భగవానునకు శంఖచక్రాలు ఆభరణకోటి లోను, ఆయుధకోటిలోను అన్వయిస్తాయి. అందువల్ల **"పడై కలమ్ ఏన్ది"- "పడైయుమ్, కలముమాక"** (ఆయుధాలుగా, ఆభరణాలుగా) ధరించినవాడని అనడం కూడా పొసగుతుంది. శ్రీసుదర్శనం ఆయుధం కావచ్చు. కాని, శ్రీపాంచ జన్యం ఏవిధంగా ఆయుధం అవుతుంది? అని అంటే, శ్రీపాంచజన్యం తన గొప్ప ఘోషతో శత్రువులను భయపెట్టి, నశింపజేస్తున్నందున ఆయుధవర్గంలో కూడా చేరుతుంది.

"అన్దు ఆయ్చ్చి వన్ తాम్బుకళాల్ పుడైక్క అలన్దానై"- వెన్నను దొంగిలించిన దోషానికి యశోదాదేవి రోటితో కలిపి తాడుతో కట్టి కొట్టగా బాధపడినవాడు- అని భావం. క్లేశపడడం- యశోద దెబ్బలు కొట్టినపుడు కల్గిన బాధను సహించలేనందువల్ల కాదు. రేపల్లెలో అంతటా గబగబా తిరిగి కన్యలను, తైరు, పాలు, నేయి, వెన్న మొదలైనవానిని కొల్లగొట్టడానికి వీలులేనట్లుగా ఈ విధంగా ఆమె నన్ను కట్టి పడవేసిందే- అనే కారణంచేత బాధపడ్డాడు. మహోత్సవాలలో దొంగపిల్లలను రాజభటులు చెఱలో పెడితే, యథేచ్ఛగా సంచరించి దొంగతనం మొదలైనవానిని చేయనీయకుండా మనలను ఈ విధంగా చెఱలో పెట్టారే?'' అని ఆ చోరులు బాధపడినట్లుగా స్వామి బాధపడ్డాడు.

భట్టర్ తిరుక్కోట్టియూర్‌కు వేంచేసినపుడు ఒకస్వామి వారి దగ్గరకు వచ్చి- "దాసునకు ఒక పర్యాయం తిరువిరుత్తంలోని అర్థాన్ని అనుగ్రహించాలి'' అని ప్రార్థించారు. "నమ్బెరుమాళ్‌కు దూరమైన వ్యసనంవల్ల ఇపుడు నాకు ఏమి చెప్పడం సాధ్యం కాదు. నంజీయర్ సన్నిధిలో వినండి''అని పల్కి, నంజీయర్‌ను ఆజ్ఞాపించారు. జీయర్‌కూడా తిరువిరుత్తానికి అర్థాన్ని చెప్పేటపుడు ఈ పాశురం వరకు రాగానే **"పుడైక్క అలన్దానై"** అనే పాఠం కంటే **"అలర్న్దానై"** అనే పాఠం ఆழ్వార్ల మనస్సుకు మిక్కిలిగా పొసగేటట్లు నా మనస్సుకు తోస్తుంది- అని అన్నారట. గోపవనిత కొట్టగా కొట్టగా శ్రీకృష్ణుని ముఖం వికసించిందట. దీనిని కొంచెం వివరిస్తాము.

శ్రీకృష్ణుడు, వెన్నను దొంగిలించే తనను యశోదాదేవి మాటిమాటికి దారంతో కట్టి బాధపెడుతున్నది - అని ఇంటిలో ఉండే దారాలను అన్నిటిని ముక్కలు ముక్కలుగా తెంపివేసేవాడు. వాటిని ఆమె ఒకదానితో ఇంకొకటిని ముడి వేసి, ఒక దారంగా చేసి, దానితో శ్రీకృష్ణుని కట్టేది. ఆ విధంగా కట్టేటప్పుడు తన శరీరానికి నిడివి చాలని రీతిలోని ఆ ముడులను కల్గిన చిన్న దారంతో కట్టడానికి వీలులేనట్లుగా సులభంగా తనను తప్పించుకోగల్గినవాడైనా, తన సౌశీల్యం, సౌలభ్యం, ఆశ్రితపారతంత్ర్యం మొదలైన స్వభావాలను వ్యక్తం చేయడం కోసమే పరత్వదశను వీడి మనుష్యజాతీయుడై అవతరించిన తాను రోటితో కట్టబడి, దెబ్బలు తినడం మొదలైన ఈ ప్రకారాల ద్వారానే ఆ గుణాలు ప్రకాశింపజేయాలని భావించి, ఒక చుట్టుకు కూడా చాలని దారం రెండు, మూడు చుట్లకు సరిపోయే టట్లు శరీరాన్ని సంకోచింపజేసి, సరిపోయేటట్లు చేసికొని **"కణ్ణినుణ్ శిఱుత్తామ్బినాల్**

కట్టుణ్ణప్పణ్ణియ పెరుమాయన్" - అనే రీతిలో అయినాడు. "ఈవిధంగా నా సౌశీల్యగుణాలు ప్రకాశించాయి కదా! అవతార ప్రయోజనం నాకు నెఱవేరింది కదా!- అని ముఖవికాసాన్ని పొందాడని దీని తాత్పర్యం.

భగవానునిపట్ల అభినివేశాన్నిపొంది, విరహాన్ని సహించలేక ఆర్తిని పొందిన ఆళ్వార్లు ఆ స్వామి కల్యాణగుణాలను, తిరునామాలను పల్కి మొఱపెట్టడం ఈ పాశురానికి స్వాపదేశార్థం.

(ఎన్ శొల్లి ప్పులమ్బువనే)- అతని గుణచేష్టితాలలో ఏ కొఱత కన్పించ నందున నా లోపాన్నే నేను కారణంగా చెప్పగలను? - అని తాత్పర్యం.

**క్రౌంచపక్షిధ్వనికి, సముద్రఘోషకు తాళలేని నాయకిని చూచి ఆమె సఖి బాధపడడం**

**87. పులమ్బుమ్ కనకురల్ పోళ్వాయ వన్టిలుమ్, పూఙ్గళి పాయ్న్దు
అలమ్బుమ్ కనకురల్ శూళ్తిరై యాళియుమ్-, ఆఙ్గవై నిన్
వలమ్బుళ్ళదు నలమ్బాడు మిదు కుఱ్ఱమాగ వైయమ్
శిలమ్బుమ్పడి శెయ్వదే? తిరుమాలిత్తిరువినైయే**

తిరు మాల్ = లక్ష్మీదేవిపట్ల వ్యామోహాన్ని కలవాడా!, పులమ్బుమ్ = (విరహవేదనవల్ల) అరచే, కన కురల్ = గొప్ప గొంతుకను కల, పోళ్ వాయ అన్టిలుమ్ = బ్రద్దలైన నోటిని కల క్రౌంచపక్షి, పూ కళి పాయ్న్దు అలమ్బుమ్ = అందమైన ఉప్పు కాలువ లోపల ప్రవహించి వ్యాపించి ధ్వనించే (ప్రవహించే), కన కురల్ = గంభీరమైన ధ్వనిని కల, శూళ్ తిరై ఆళియుమ్ = చుట్టముట్టిన కెరటాలను కల్గిన సముద్రం- అనే, ఆఙ్గు అవై = ఆచోట ఆయా వస్తువులు, నిన్ వలమ్ పుళ్ళదు నలమ్ పాడుమ్ ఇదు కుఱ్ఱమ్ ఆక = నీ, బలాన్ని కల గరుడపక్షి యొక్క సద్గుణాలను (ఈమె) ప్రస్తావించి పాడడమనేది దోషంగా గ్రహించి, వైయమ్ శిలమ్బుమ్ పడి = లోకంలోని వారు మొఱపెట్టేటట్లు, ఇ తిరువినై = లక్ష్మీదేవితో సమానురాలైన ఈ పిల్లను, శెయ్వదే = క్లేశపెడుతున్నాయే? (ఇది తగునా?).

**భావదీపిక :** క్రౌంచపక్షి ధ్వనికి, సముద్రఘోషకు తాళలేని నాయకియొక్క అవస్థను చూచి ఆమె సఖి విచారించి పలికే పాశురం ఇది. అది ఏమంటే- నాయకి

బాధను చూచిన ఆమె సఖి తాను కూడా బాధను పొంది, భావనాప్రకర్షవల్ల నాయకుని మానసికంగా ఎదురుగా చూచి సంబోధిస్తూ, తనలో పల్కిన పాశురం. లేక, సఖి, నాయకునకు ఎదురుపడి, నాయకి విరహార్తిని గూర్చి అతనికి పల్కి తెలుపుతున్నదని కూడా చెప్పవచ్చు. నీపట్ల ప్రేమను కల్గిన నాయకి, నిన్ను విశ్లేషించిన దశలో, ఆ ఆర్తి ఒక రీతిలో ఉపశమించడం కోసం, నీకు వాహనమైన, నీతో నిత్యసంబంధాన్ని పొందిన గరుడుని గొప్పతనాన్ని ప్రశంసించి పలుకగా, దానిని చూచి, దానివల్ల ఈమె విరహార్తిని సహించలేని సుకుమారి- అని తెలిసికొని, క్రౌంచపక్షి ధ్వని, సముద్రఘోష - అనేవి ఆ వ్యసనాన్ని పెంచి మఱింతగా తాము కూడా హింసిస్తున్నాయి - అని అంటున్నది. మగ, ఆడ పక్షులుగా కలిసి జంటగా క్రౌంచపక్షులు జీవిస్తాయి. జంట విడిపోకుండా ఒకదానితో ఇంకొకటి నోటి ముక్కులను కలిపి, అవి నిద్రించేటపుడు, ఆ నిద్రలో వాటి ముక్కులు ఒకదానితో ఇంకొకటి విడిపోతే, నిద్రనుండి లేచి, ఆ విశ్లేషాన్ని సంహించలేక, బాధపడి గొప్పగా బాధతో అఱుస్తాయి. జాలిపడదగిన వాటి కంఠధ్వని నాయకి విరహవేదనను మఱింతగా ఎక్కువ చేస్తున్నందున **"పులమ్బుమ్ కనకురల్ పోౖళ్వాయ అన్టిలుమ్"** అని అనబడింది- **"పెణ్ణెమేల్, పిన్ను మవ్వన్టిఱ్ఱైడై వాయ్చ్చిఱు కురలుమ్, ఎన్నుడైయ నెఞ్జుక్కు ఓర్ ఈర్ వాళామ్, ఎన్ శెయ్వేన్?"** అనే తిరుమంగై ఆఴ్వార్లు కూడా పెరియ తిరుమడల్లో పలికారు.

**(పూఙ్గఴి పాయ్న్దు అలమ్బు కనకురల్ శూౖళ్తిరై యాౖళియుమ్)-** నదులకు పతి అయిన సముద్రం అందమైన ఉప్పుకాలువలలో ప్రవేశించి ప్రవహించి, అలలు ఎగసి పడగా పెద్దఘోషను చేయడాన్ని చూస్తే, అది తన భార్యలను చేతులతో తడవి ఆనందంతో పెద్దగా ధ్వనిచేస్తున్నట్లున్నందున, దానివల్ల నాయకి విరహవేదన అధికమవుతున్నది. అల్ప వస్తువులతోను, చైతన్యాన్ని కల్గిన చిన్న (క్రౌంచ) పక్షులతోను, అచేతనమైన మహాసముద్రంతోను తేడా లేకుండా విరహానికి వేదనను పడడం, సంశ్లేషానికి ఆనందించడం కంటికి ఎదురుగా కన్పించడం కలతకు కారణమవుతాయి.

**(పుళ్ళుదు నలమ్)-** భక్తులను రక్షించడంకోసం, భగవానుని తాను మోస్తూ తీసికొనివచ్చి, సహాయపడడం గరుడుని సద్గుణం. **"వైయమ్ శిలమ్బుదల్"-** అంటే ఈమె పడే క్లేశం కోసం తల్లి, సఖులు, బంధువులు, దగ్గరివారు, స్నేహితులు, ఊరిలోనివారు అందఱు మొఱపెట్టడం. **"తిరుమాల్!"** అని సంబోధించడం - ఒకతెకు

(లక్ష్మీదేవికి) మంచివాడవై ఉండే నీవు, ఈమె ఈ రీతిలో బాధపడుతూ ఉండగా చూడడం పక్షపాతం కదా!- అని భావం. **"ఇత్తిరువినై"**- అని ఈమెను కూడా లక్ష్మీదేవిగానే పల్కడం, ఈమె ఆమెకు నీడవలె ఉన్నది- అని అయినా ఈమెను చూడవద్దా!- అని గర్హిస్తూ పల్కడమే. **"తిరు"**- స్త్రీలలో విలక్షణమైనది- అని అర్థం.

**"కనకురల్"** - ఇది విశేషణసమాసం. **(పణ్బుత్తొకై)** **"కనైకురల్"** అనే పాఠంలో **"కనైక్కిఱ కురల్"** (ధ్వనించే గొంతు) అనే అర్థాన్ని గ్రహించాలి. ఇది **"వినైత్తొకై"**, **"పోழ్వాయ అన్టిలుమ్"**- తన గొంతుతో విరహంతో ఉండేవారిని రెండు ఖండాలుగా చీల్చే నోటిని కల క్రౌంచం- అని చెప్పవచ్చు. **"పోழ్"**- అనే ధాతువు బ్రద్దలవుతున్న, బ్రద్దలు చేస్తున్న సకర్మకం, అకర్మకం కూడా. అని **"పూఙ్కழి"**- పూవులను కల కాలువ- అనికూడా చెప్పవచ్చు. **"వలమ్"**- జయమని కూడా అర్థం.

**(ఆఱ్ఱైప్పై)- "పిరిన్దిరుప్పార్క్కు మற్ఱుమ్ బాధకమాన శేక్కళ్ కழుత్తిలే మణియోశై యెన్న, శన్దిరోదయమెన్న, తెన్ఱలెన్న - ఇప్పడిప్పట్ట బాధకఙ్గళై చ్చొల్లిற్ఱా తల్"** (ఆఱ్ఱైప్పై- విశ్లేషించినవారికి ఇంకా బాధకమైన ఎద్దు మెడలో గంటల చప్పుడు, చంద్రోదయం, పిల్ల తెమ్మెర- ఇటువంటి బాధకాలను ఈ ప్రయోగం తెల్పుతుంది) - అనే నమ్బిళ్ళైఈడు ఇక్కడ స్మరణీయం.

**(నిన్ వలమ్బుళ్ళదు నలమ్ పాడు మిదు కుற్ఱమాక వైయమ్ శిలమ్బు మ్బడి శెయ్వదే)**- గరుడుడు తనకు కైంకర్యం చేసి, దాని చిహ్నంగా కిణాలను (కాయలను) కల్గి ఉండేటట్లుగా మేముకూడా సంశ్లేషచిహ్నాలను ధరించాలని ఆశపడి, ఆ గరుడుని కీర్తించడం అనేది దోషం కాగా, క్రౌంచపక్షిధ్వని, సముద్రఘోష మొదలైనవి ఈమెను బాధించగా, అందువల్ల ఈమె క్లేశపడుతున్నది- అని, లోకులు నిందలు పలికేటట్లుగా నీవు ఈమెను విడచిపెట్టడమా! నీ మహిషి బాధపడుతూ ఉండగా చూస్తూ ఉండడం నీకు లోటుకదా!- అని భావం. (**"తిరుమాల్!"** ఇది సమీపసంబోధన, **(అణ్మైవిழి)**. **"తిరుమాల్! నాన్ముకన్" (8-3-9)** అనే తిరువాయ్మొழி సూక్తిలోవలె).

భగవానుని దరి చేరలేనందున కల్గిన వేదనను, చేరినందున కలిగే ఆనందాన్ని లోకంలోని వస్తువుల ప్రవృత్తులు తమకు స్మరింపజేస్తున్నందున వానిని చూచి బాధపడే ఆழ్వార్ల స్వభావాన్ని చూచి వారి భక్తులు, భగవానుని ఉద్దేశించి "ఈవిధంగా లోకం మొఱ పెట్టేటట్లుగా ఇవి వీరిని బాధిస్తున్నావే!'' అని గర్హిస్తూ

పల్కడం ఇందులోని స్వాపదేశం. క్రౌంచధ్వని విరహక్లేశానికి స్మారకం. సముద్ర ఘోష సంశ్లేషానందానికి స్మారకం.

**(నిన్వలమ్ వుళ్ళదు నలమ్ పాడుమిదు కుగ్రామాక)**- భగవానుడు మన దగ్గరకు వేగంగా వచ్చి చేరడానికి తగిన వేగాన్ని కల వాహనం అతనికి స్వంతమై ఉండగా మనం కోల్పోవలసినది ఏదీ లేదుకదా!- అని ఆనందాన్ని వ్యక్తం చేయడమే దోషంగా- అని భావం. దాస్యసంపదను కల్గి ఉన్నందున ఆళ్వార్లను **"తిరు"** అని అన్నారు. భగవానునితో నిత్యానుభవాన్ని పొందదగినవారని భావం.

**భగవానుని రూపసామ్యాన్ని చూచి తాళలేని నాయకి బాధపడడం**

**88. తిరుమాలురువొక్కుమ్ మేరు, అమ్మేరువిల్ శెఞ్జుడరోన్**
**తిరుమాల్ తిరుక్కై త్తిరుచ్చక్కర మొక్కుమ్-, అన్న కణ్డుమ్**
**తిరుమాలురువోడవన్ శిన్నమే పిదత్తా నిఙ్పదోర్**
**తిరుమాల్ తలైక్కొణ్డ నజ్గట్కు, ఎజ్గే వరుమ్ తీవినైయే**

మేరు = మహామేరుపర్వతం, తిరు మాల్ ఉరు ఒక్కుమ్ = శ్రియఃపతి అయిన నాయకుని తిరుమేనితో పోలి ఉన్నది, అ మేరువిల్ శెమ్ శుడరోన్ = ఆ మహామేరువు యొక్క సమీపంలో వెలిగే ఎఱ్ఱని కాంతిని కల సూర్యుడు, తిరు మాల్ తిరు కై శక్కరమ్ ఒక్కుమ్ = ఆ నాయకుని అందమైన శ్రీహస్తంలో ఉండే శ్రీసుదర్శనంతో పోలి ఉంటాడు. అన్న కణ్డుమ్ = (అతని రూపాన్ని, చక్రాన్ని సాక్షాత్తుగా దర్శించలేక) వాటితో పోలి ఉండేవానినే చూచి, తిరు మాల్ ఉరువొడు అవన్ శిన్నమే పిదగ్రా నిఙ్పదు = అతని రూపాన్ని, అతని చిహ్నాలనే (నేరుగా దర్శించినట్లుగా ప్రేమాతిశయంచేత పారవశ్యాన్ని పొంది) నామనిర్దేశపూర్వకంగా ఉచ్చరించే రీతిలో, ఓర్ తిరు మాల్ = సాటి లేని సంపద అయిన ఆశను, తలై క్కొణ్డ = వహించి ఉండే, నజ్గట్కు = మనకు, తీ వినై = (విశ్లేషానికి కారణమైన) పాపం, ఎజ్గే వరుమ్ = ఎక్కడనుండి వస్తుంది?

**భావదీపిక :** నాయకుని రూపంతో పోలికను కల వస్తువులను చూచి క్లేశపడే నాయకి విరహవేదనతో బాధతో పలికే పాశురం, ఇది. భగవానుని సాక్షాత్తుగా దర్శించగల్గినపుడు మాత్రమే కాకుండా, అతని పోలికను కల వస్తువులను చూచినపుడుకూడా వానిని అతనివిగానే భావించి, నిరంతరం నామోచ్చారణాన్ని

చేసే మనకు ఈ విధంగా విరహవేదనకు కారణమైన దుష్కర్మ ఎక్కడనుండి వచ్చింది? అని నాయకి బాధపడుతూ పల్కుతున్నది.

**(తిరుమాలురువొక్కుమ్ మేరు)** - శ్రీమహాలక్ష్మియొక్క బంగారు వర్ణాన్ని కల తిరుమేని కాంతి కలసినందున తానుకూడా బంగారురంగుతో వెలిగి పోయే భగవానుని గొప్ప తిరుమేని బంగారుమయమైన మహామేరుపర్వతంవలె ఉన్నదని భావం.

**(అమ్మేరువిల్ శెఞ్జుడరోన్ తిరుమాల్ తిరుక్కై తిరుచ్చక్కర మొక్కుమ్)**- ఆమహామేరుపర్వతసమీపంలో వెలుగుతూ ఉండే ఎఱ్ఱని కాంతిని కల సూర్యుడు ఆ భగవానుని, అందమైన చేతిలో ఉండే శ్రీసుదర్శనంవలె ఉన్నాడు.

**(అన్నకణ్డమ్ ఇత్యాది)**- ఆ భగవానుని దివ్యరూపాన్ని, దివ్యాయుధాలను, సాక్షాత్తుగా దర్శించలేక, వాటిని పోలి ఉండేవానినే దర్శించినప్పటికీ, అతని రూపాన్ని, అతని చిహ్నాలను నేరుగా దర్శించినట్లుగా భక్త్యతిశయంచేత పారవశ్యాన్ని పొంది, ఇన్ని నామాలను పెట్టి పిలిచే రీతిలోని వ్యామోహం పొందిన మనకు విశ్లేషానికి కారణమైన పాపం ఏవిధంగా కల్గిందో, తెలియలేదే!- అని నాయకి అంటున్నది.

**(తలైక్కొణ్డ)**- ఆశయొక్క పరమావధిలో ఉండే - అని చెప్పవచ్చు. నాయకుని విశ్లేషించిన నాయకి నాయకుని పోలికలను కల వస్తువులకు అతనినిగానే భావించి, నోటితో (అతని నామాలను) పలవరించడం **"నిన్ఱ కున్ఱత్తినై నోక్కి నెడుమాలే! వా! ఎన్ఱు కూవుమ్"** (స్థిరంగా నిలచియుండే పర్వతాన్ని చూచి, ఓ భక్తవ్యామోహాన్ని కలవాడా! అని పిలుస్తున్నది), **"శెయ్యదోర్ ఞాయిఱ్ఱై క్కాట్టి శిరీదరన్ మూర్త్తి యీదెన్ఱుమ్"** (ఎఱ్ఱని సూర్యుని రూపాన్ని చూసి, ఇది శ్రీధరుని మూర్తి - అని అంటున్నది) (తిరువాయ్మొழி-4-4-4, 4-4-2) ఇత్యాది సూక్తులలో గమనించ వచ్చు.

**"జన్మాంతర సహస్రేషు తపోధ్యాన సమాధిభిః, నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే"**- (పలు వేల జన్మలలో చేసిన తపస్సు, ధ్యానం, సమాధుల వల్ల పాపంతీరినవారికి భగవానుని పట్ల భక్తి కల్గుతుంది.) పాపం తీరినవారికే భగవద్భక్తి కల్గుతుందని, భగవద్భక్తిని కలవారిని పాపం సమీపించదని శాస్త్రవచనం ఉండగా, ఆ భక్తియొక్క పరమావధిలో ఉండే మనకు ప్రాప్యం పొందలేకపోవడానికి కారణమైన

దుష్కర్మ రావడానికి దారి ఉన్నదా?- అని ఆళ్వార్ బాధతో పల్కుతున్నారు. భగవానుని రూపాన్ని పోలిన వస్తువులలోను అభినివేశాతిశయాన్ని పొందడమే భక్తియొక్క పరమావధి.

మూడవ పాదంలో- "చిహ్నమ్" అనే సంస్కృతపదం "శిన్నమ్" అనే వికారాన్ని పొందింది.

## నాయకునితో కలవాలని త్వరపడే నాయకి బాధపడడం

**89. తీవినైక్కారునఞ్జైన్నల్వినై క్కిన్నముదత్తినై,**
**పూవినై మేవియ తేవిమణాళనై-, పున్మై యెళ్గాదు**
**ఆవినై మేయ్క్కుమ్ వల్లాయనై యన్ఱులగీరడియాల్**
**తావిన వేఱ్ఱై యెమ్మానై, ఎఞ్ఞాన్ఱు తలైప్పెయ్‌వనే?**

తీ వినైక్కు ఆరు నఞ్జై = (భక్తుల) పాపాలకు ప్రబలమైన విషంవంటివాడు, నల్ వినైక్కు ఇన్ అముదత్తినై = (వారి కైంకర్యమనే) సత్కర్మలకు తీయని అమృతంవలె భోగ్యభూతుడై ఉండేవాడు, పూ వినై మేవియ తేవి మణాళనై = తామరపూవును తనకు నివాసస్థానంగా కల్గి ఉండే లక్ష్మీదేవికి వల్లభుడు, పున్మై ఎళ్కాదు ఆ వినై మేయ్క్కుమ్ వల్ ఆయనై = చిన్నతనంగా ఎంచి నిందించకుండా పశువులను మేపే బలిమిని కల గోపాలుడు, అన్ఱు = పూర్వం ఒకానొక సమయంలో, ఉలకు = లోకాలను, ఈర్ అడియాల్ = రెండు పాదాలలో, తావిన ఏఱ్ఱై = కొలిచిన పరత్వాన్ని (గొప్పతనాన్ని) కలవాడైన, ఎమ్మానై = భగవానుని, ఎఞ్ఞాన్ఱు తలైప్పెయ్‌వనే = ఎప్పుడు చేరగలను?

**భావదీపిక :** ఇది నాయకుని సంశ్లేషంకోసం తహతహలాడుతున్న నాయకి బాధపడుతూ పలికే పాశురం. కఠినమైన (సహించరాని) బాధను కల్గించే దుష్కర్మలను సులభంగా తీర్చేవాడు, తనకు కైంకర్యాన్ని చేసేవారికి సాటి లేని ఆనందరూపియై ఉండేవాడు, తామరపూవును తన వైలక్షణ్యానికి, సౌకుమార్యానికి, అందానికి తగిన చోటుగా భావించి, అందులో వేంచేసి ఉండేదై, పురుషకార స్వరూపిణి అయిన లక్ష్మీదేవికి నాయకుడు, మనస్సులో కొంచెంకూడా వ్యతిరేకత (వెగటు) లేకుండా, ప్రీతితో పశువులను మేపడం కోసం జన్మించి, వేషాన్ని ధరించే వానివలె కాకుండా, (గోపాలుర) జాతిగుణకర్మలలో మిక్కిలిగా పోలి ఉండే

గోపాలుడు, రెండు పాదాలతో సకలలోకాలను కొలిచిన పరత్వాన్ని కలవాడైన మన నాయకుని దరికి ఎపుడు చేరగలను?- అని నాయకి అంటున్నది.

భక్తుల శత్రువులను నిరసించేవాడు, కైంకర్యానికి భోగ్యుడు, పురుషకార స్వరూపిణి అయిన లక్ష్మీదేవికి వల్లభుడు, భక్తులకు సులభుడు, అన్ని లోకాలను అధఃకరించినవాడైన భగవానుని ఎపుడు చేరి అనుభవించగలను?- అని ఆళ్వార్లు ప్రాప్యసిద్ధికోసం త్వరపడి పల్కిన రీతి ఇది.

ఈ పాశురంలోని మొదటి పాదం "తీవినై క్కరునక్షై నల్వినైక్కిన్న ముదత్తినై" అనే పాఠం దేశం అంతా వ్యవహరింపబడుతూ ఉన్నప్పటికీ, గణభంగం కాకుండా ఉండడంకోసం "తీవినై క్కారునక్షైన్నల్ వినైక్కిన్న ముదత్తినై" అనే పాఠం గ్రహింపబడింది. ఇది వ్యాఖ్యాన వైఖరికి విరుద్ధమైనది కాదు. పొందికను కల్గినదే. "అరు" అనేది "ఆరు" అనే "నీట్టల్ వికారమ్" (వర్ణవ్యాకోచం) ను పొందింది అని కాని, "అరుమై" అనే గుణవాచకంలోని చివరి వర్ణంపోయి, ప్రారంభవర్ణం దీర్ఘమై "ఆరు" అనే రూపాన్ని పొందిందని కాని గ్రహించాలి. లేక, తొల్కాప్పియంలో గుణవాచక వికారాలు "మరూఉ" అనే వికారంలోకి చేరతాయని చెప్పబడినందున, ఆ వికారానికి ఒక అవధి లేదని గ్రహించాలి. అందువల్ల "ఆరు" అనే పదాన్ని "అరు" అనే పదంయొక్క "మరూఉ" వికారంగా గ్రహించవచ్చు. "తీవినైక్కు ఆరుమ్ నఙ్జు" అని విడదీసి, దుష్కర్మలను తీర్చే పూర్ణమైన విషం- అనే అర్థాన్ని గ్రహించే అవకాశం ఉన్నప్పటికీ, అది పూర్వాచార్యవ్యాఖ్యానాలలో "ఆఱ్ఱ వొణ్ణాద", "ఆఱ్ఱ అరియ" అని కన్పించే వివరణలకు పొసగదు. "నక్షై న్నల్ వినై" అనేచోట నకారం అమ్రేడితం కావడం "విరిత్తల్ వికారం". ఇక, "తీవినై క్కరునెక్షై" అనే పాఠాన్నే గ్రహించి, కొన్ని వైదిక ప్రయోగాలు వ్యాకరణసిద్ధ ప్రయోగాలకు విరుద్ధంగా ఉంటాయని కాని, "ఆర్షత్వాత్ సాధుః" అనే న్యాయంతోకాని, మహాకవి ప్రయోగమనే కారణంతో కాని, ప్రాచీనుల పాఠానికే సమాధానాన్ని పల్కి, యథాపూర్వంగా పఠించడం అంగీకరించదగినదే. లక్షణ నియమాలకు లొంగకుండా వచ్చే ఆర్షప్రయోగాలు కన్పించడం దండి అలంకార గ్రంథంలో కూడా కన్పిస్తాయి.

"తీవినైక్కు అరునక్షై"- అనే దానికి- దుస్సహమైన బాధను కల్గించే దుష్కర్మలను భగవానుడు సులభంగా తీర్చేవాడని భావం. "నల్వినైక్కు ఇన్నముదమ్" అంటే- తన విషయంలో కైంకర్యం చేసేవారికి ఆనందమయుడై ఉండేవాడు, భగవానుడు- అని భావం. వారి భక్తి నశించకుండా మఱింతగా

నిత్యం అభివృద్ధి అయేటట్లు చేసేవాడని సారం. ముక్తికి కారణమైన ప్రపత్తి ఇక్కడ "నల్‌వినై" అనబడింది.

**(పున్మై ఎళ్‌కాదు ఆవినై మేయ్‌క్కుమ్)-** "మిక్కిలి నీచజాతి అయిన పశువులనా, నేను మేపడం !" అనే జుగుప్సను పొందకుండా, **"తివత్తిలుమ్ పశునిరై మెయ్‌ప్పువత్తి శెఙ్జనివాయ్ ఎజ్ఞళాయర్‌తేవే!"** (ఎఱ్ఱని అదరాన్ని కల ఓ మా గోపాలదేవా! పరమపదం కంటే గోవులను పరిపాలించడమే ఆదరిస్తావు కదా!) (తిరువాయ్-10-3-10) అనే రీతిలో "పశువులను మేపే అదృష్టాన్ని పొందానే!" అని ఆనందించి మేపేవాడని భావం.

**"తావిన వే*ర్‌ఱై*"** అనేచోట **"ఏఱు"** అనేది పరత్వాన్ని సూచించడం కోసం చేయబడిన ఔపచారిక ప్రయోగం. వృషభం, సింహం, శార్దూలాదిపదాలు మగవారి విషయంలో ప్రయోగించినపుడు శ్రేష్ఠతావాచకాలు. ఇది సంస్కృతభాషా మర్యాద. **"పురుషర్షభః నరవ్యాఘ్రః, రాజసింహః"** ఇత్యాదులను గమనించాలి.

### నాయకుని విశ్లేషించిన నాయకి కాలం దీర్ఘంగా తోచడంచేత క్లేశపడుతూ పల్కడం

**90.** **తలైప్పెయ్‌దు యాన్ ఉన్‌తిరువడిచ్చూడుమ్ తగైమైయినాల్,**
**నిలైప్పెయ్‌ద వాక్కైక్కు నో*ర్‌ఱ* విమ్మాయముమ్-, మాయమ్ శెవ్వే**
**నిలైప్పెయ్‌దిలాద నిలైమైయుఙ్గాణ్డోరశురర్ కు*ழா*మ్ శెవ్వే**
**తొలై ప్పెయ్‌ద నేమి యెన్దాయ్!, తొల్లైయూ*ழி* శురుఙ్గలదే**

అశురర్ కు*ழా*మ్ = అసురుల గుంపుకు, తొలై పెయ్‌ద = నాశనాన్ని చేసిన, నేమి = చక్రాయుధాన్ని కల్గిన, ఎన్దాయ్ = స్వామీ!, యాన్ =నేను, ఉన్ తిరు అడి = నీ శ్రీచరణ పద్మాలను, శూడుమ్ = నా శిరస్సుపై గ్రహించే రీతిలోని, తకైమైయినాల్ = శేషత్వగుణమనే యోగ్యతతో, తలై ప్పెయ్‌దు = (నేను నిన్ను) చేరి, నిలైప్పు ఎయ్‌ద = ఉజ్జీవనాన్ని పొందేటట్లుగా, ఆక్కైక్కు = ఈ శరీరాన్ని పొందడానికి, నో*ర్‌ఱ* = నోము (తపస్సు) చేసిన, ఇ మాయముమ్ = ఈ ఆశ్చర్యాన్ని, మాయమ్ శెవ్వే నిలైప్పు ఎయ్‌దిలాద నిలైమైయుమ్ = ఈ ఆశ్చర్యం ఒక విధంగా నిలచి ఉండి అంతం పొందని స్థితిని, కాణ్ తోఱు = చూచినపుడంతా, తొల్లై ఊ*ழி* శురుఙ్గలదు = ప్రాచీనమైన కాలం సంకోచించడం లేదు.

భావదీపిక : నాయకుని విశ్లేషించి నాయకి ఆ విశ్లేషాన్ని సహించలేక పలికే పాశురం, ఇది. నేను నిన్ను సమీపించి దరిచేరి, నీ శ్రీచరణాలను తలపై పెట్టుకొని సేవించే రీతిలో ఈ శరీరాన్ని పొందడానికి గొప్ప తపస్సు చేసినప్పటికీ, ఆ ఫలం పూర్తిగా చేజిక్కకుండా మధ్యలో కోల్పోవడాన్నిగూర్చి ఆలోచించినపుడు, విరహాసహిష్ణుతవల్ల, ఆర్తివల్ల కాలం చాలా దీర్ఘంగా తోస్తున్నది - అనేది ఈ పాశురంలో తేరిన భావం. **"శురుజ్గలదు"** అనేదానికి సంకోచించడం లేదు- అనే వ్యతిరేకార్థాన్ని గ్రహించకుండా, సంకోచం కల్గినది- అని అనుకూలంగా అర్థాన్ని గ్రహిస్తే, ఈవిధంగానే నా కాలం గడిచిపోతున్నదే!- అని విచారపడిన రీతిని తెల్పుతున్నది. పూర్వజన్మలలో చాలా గొప్ప తపస్సును చేస్తే తప్ప, ఇటువంటి అరుదైన, గొప్ప నాయకుని పొందడం సాధ్యం కాదు కనుక, **'నోత్ఱ్ఱ ఇమ్మాయమ్"** అని అనబడింది. **"ఉన్ తిరువడికళిల్ అడిమైయాయల్లదు శెల్లాదపడియాన శరీరత్తై ప్పెత్ఱ్ఱపడియైయుమ్, అప్పడి యిరుక్కచ్చెయ్‌దే, అవ్వడిమైయై ఇழన్దిరుక్కిఱ ఇరుప్పైయుమ్ అనుసంధిక్క క్కాలమ్ పోరుకిఱదిల్లై - ఎన్గిఱార్"** (నీ చరణ కైంకర్యంతో తప్ప గడవని శరీరాన్ని పొందిన రీతిని, ఆవిధంగా ఉన్నా, ఆ కైంకర్యాన్ని కోల్పోయిన రీతిని అనుసంధించడానికి కాలం చాలడం లేదు - అని అంటున్నారు.) అనేది అప్పిళ్ళైవ్యాఖ్య.

సర్వేశ్వరుని శరణు పొంది, అతని శ్రీచరణాలనే నమస్కరించి, ఆ శ్రీచరణాలనే ప్రాప్యానికి ఉపాయమని అధ్యవసానాన్ని (గట్టి నమ్మకాన్ని) పొందడానికి సాధనమైన ఈ విలక్షణశరీరాన్ని పొందడాన్ని, ఆ విధంగా పొందినా, పూర్ణానుభవం లభించకుండా ఉండడాన్ని చూచినపుడు కాలవిలంబాన్ని సహించడం సాధ్యం కాలేదు- అని ఆழ్వార్లు కలత పొంది ఇందులో పల్కుతున్నారు.

**"మాయమ్ శెవ్వే నినైప్పెయ్‌దిలాద నిలైమై"** అనే దానిని - ఈ శరీరం యొక్క నిలకడ లేని స్వభావం- అని, ప్రకృతిసంబంధంతో ఉండేటపుడు కలిగే శేషత్వగుణం రజోగుణ, తమోగుణ సంబంధంతో నిలకడగా నిలువకుండా, చంచలంగా ఉండే స్వభావాన్ని- అని వివరిస్తారు.

**"తిరువడి"** అనే దానికి **"శ్రీచరణపద్మం"** అనే అర్థాన్ని పల్కడం- **"శూడుమ్"** అనే దానికి తగినట్లుగా ఉండడంకోసం. **"కోలమామెన్ శెన్నిక్కు ఉన్ కమలమన్న కుఱైకழలే"** (పద్మం వంటి, ధ్వనించే నీ పాదం నా శిరస్సుకు ఆభరణం.) అనే

తిరువాయ్‌మొழி శ్రీసూక్తి ఇక్కడ స్మరణీయం. వేయి జన్మలలో చేసిన నోముల పంటగా ఒక శ్రీవైష్ణవ జన్మ లభిస్తుందని శాస్త్రాల అభిప్రాయం కనుక, **"ఆక్కైకుక్క నోற்ற ఇమ్మాయమ్"** అనబడింది. నా ప్రాప్తి, ప్రతిబంధకాలను పోగొట్టడం నీకొక పెద్ద కార్యమా!- అని అనడంకోసం **"అశురర్ కుழாమ్ తొలైప్పెయ్‌ద నేమి ఎన్దాయ్!"** అని అనబడింది.

**"తలైప్పెయ్‌దు+యాన్"-"తలైప్పెయ్‌దియాన్"** ఇక్కడ,**"యవ్వరిన్ ఇయ్యామ్"** అనేది తొల్‌కాప్పియసూత్రం స్మరణీయం. **"తలైప్పెయ్‌దు"** అనేది ఒకటే పదం.

## సఖితో నాయకి తన పాతివ్రత్యాన్నిగూర్చి పల్కి, నాయకుని తప్ప వేఱొకనిని పరియమాడనని తెలుపడం

**91. శురుఙ్గుఱి వెణ్ణెయ్ తొడువుణ్డ కళ్వనై, వైయ ముற்றుమ్**
**ఒరుఙ్గుఅ వుణ్డ పెరువయిற்றాళనై-, మావలి మాట్టు**
**ఇరుఙ్గుఅళాగి యిశైయ వోర్ మూవడి వేణ్డిచ్చెన్ఱ**
**పెరుఙ్గిఱియానై యల్లాల్, అడియేన్ నెఞ్జమ్ పేణలదే**

శురుఙ్గు ఉఱి = బిగువుగా (చిక్కగా) కట్టబడిన ఉట్టిలో చేర్చి పెట్టబడిన వెన్నను, తొడు ఉణ్డ = వంచనతో ఎత్తి తీసికొని ఆరగించిన, కళ్వనై = దొంగతనాన్ని కలవాడు, వైయమ్ ముற்றుమ్ = లోకాన్ని అంతటిని, ఒరుఙ్గు ఉఅ ఉణ్డ = ఏ ఒక్కటినీ విడువకుండా పూర్తిగా ఆరగించిన (గ్రహించిన), పెరు వయిற்றాళనై= పెద్ద బొజ్జను కలవాడు, మావలి మాట్టు = మహాబలిచక్రవర్తి దగ్గర, ఇరు కుఅళ్ ఆకి = మిక్కిలి పొట్టిగా ఉండే రూపాన్ని కలవాడై, ఇశైయ = (అతడే దానం చేయడానికి) అంగీకరించేటట్లు, ఓర్ మూ అడి వేణ్డి = ఒక మూడు పాదాల పరిమితిని కల నేలను యాచించి పొంది, శెన్ఱ = వెడలిన, పెరు కిఱియానై అల్లాల్ = మిక్కిలి చాతుర్యాన్ని కలవాడైన శ్రియఃపతిని తప్ప (వేఱొకనిని), అడియేన్ నెఞ్జమ్ పేణలదు = అతనికి శేషమైన నా మనస్సు ఆశపడదు.

**భావదీపిక :** సఖితో నాయకి తన పాతివ్రత్యాన్ని, **(కఱ్పు)** గూర్చి పల్కి, నాయకునితో ప్రవృత్తమైన రహస్యసంగమాన్నిగూర్చి తెలుపడమే ఈ పాశురంలోని భావం. పరాంకుశ నాయకి రహస్యంగా సర్వేశ్వరుడనే నాయకుని సంశ్లేషించింది. ఆ స్థితిని తెలియని ఆమె కన్నవారు ఆమెను అన్యులకిచ్చి వివాహం చేయాలని ప్రయత్నం చేశారు. దానిని గ్రహించిన నాయకి తన రహస్య సంగమాన్నిగూర్చి

సఖిద్వారా పెంపుడుతల్లికి, తన్మూలంగా తండ్రికి, ఇంకా మిగిలిన పెద్దలకు తెలియజేసి, తనను శ్రియఃపతికే ఇచ్చి వివాహం జరిపించేటట్లు చేయాలని ఆశపడి, ఆమె తన అభిప్రాయాన్ని తన సఖితో పల్కడమే ఇది. ఈ విధంగా గతంలో సంభవించిన రహస్యసంగమాన్ని వ్యక్తం చేయడానికి **"అఱత్తొడు నిఱ్ఱల్"**- అనబడుతుంది ఇది ఒక ద్రావిడకావ్యాలలోని శృంగార ప్రక్రియ.

**"శురుజ్గుఱి వెణ్ణెయ్ తొడువుణ్ణ కళ్వన్"** అని అనడంవల్ల సౌలభ్యగుణం, **"వైయమ్ ముఱ్ఱుమ్ ఒరుఙ్గుఅవుణ్ణ పెరువయిఱ్ఱాళన్"** అని అన్నందున పరత్వగుణం, **"మావలి మాట్టిరుఙ్కుఅళాకి యిశైయ ఓర్ మూవడి మణ్ వేణ్డి చ్చెన్ఱ పెరుఙ్కిఱియాన్"** అని అన్నందున పరత్వసౌలభ్యగుణాలు రెండిటి కలయిక సూచింపబడ్డాయి.

**"శురుజ్గుఱి"**- నులకదారాన్ని పేని, దానిలో వేలు లోపలకు పెట్టడానికి వీలులేనట్లు దట్టంగా, చిక్కగా నేయబడిన ఉఱి. (ఉట్టి) **"ఇరుఙ్కుఅళ్"**- మిక్కిలి పొట్టిగా ఉండే రూపం. గొప్ప రూపాన్ని లోపల కల్గిన చిన్న రూపమని భావం. మహిమను కల్గిన రూపమని, నల్లని వామనరూపమని కూడా భావం. రూపసౌందర్యంతో, మాటలోని తీయదనంతో మహాబలిని సమ్మోహితునిగా చేసి, శుక్రాచార్యులవంటివారు అడ్డుపెట్టినా, ఒప్పుకోకుండా, మూడడుగుల నేలను ఇచ్చిన అతడు అంగీకరించడం వామనుని సామర్థ్యంవల్లనే కనుక, **"ఇశైయ ఓర్ మూవడి వేణ్డిచ్చెన్ఱ పెరుఙ్కిఱియాన్"** అని అనబడింది.

**"శురుజ్గుఱి వెణ్ణెయ్ తొడువుణ్ణ కళ్వన్"** అని అన్నందున ఈ శరీరమనే చిక్కంలో (ఉట్టిలో) కట్టబడిఉండే నవనీతస్వభావాన్ని కల ముముక్షువనే ఆత్మకు ఎవరూ తెలియనిరీతిలో ఆశపడి, గ్రహించి, అనుభవించేవాడు, భగవానుడు- అనేది స్ఫురిస్తుంది. "మావలిమాడు" - (మావలి వద్దకు- అని అర్థం.) "మాడు పొన్ పక్కమ్ శెల్వమ్" అని నిఘంటువచనం.

**ఇరుగుపొరుగు ప్రభువుకు సహాయపడడంకోసం తనను విడచి నాయకుడు పోయినందున,ఆ విరహాన్ని తాళలేక నాయకి క్లేశపడడం**

**92.** పేణలమిల్లా వరక్కర్ మున్నీర పెరుమ్బదివాయ్,
నీణగర్ నీళెరివైత్తరుళా యెన్ఱు-, నిన్నై విణ్ణోర్

**తాళ్ నిలన్దోయ్న్దు తొ*ழ*ువర్ నిన్ మూర్త్తి పల్ కూ*ర్ఱి*లొన్టు**
**కాణలుమాజ్గొలెన్టే, వైగల్ మాలైయుమ్ కాలైయుమే**

పేణ్ నలమ్ ఇల్లా = నిన్ను ఆశపడి భక్తిని కల్గి ఉండడమనే మంచి గుణాన్ని లేని, అరక్కర్ = రాక్షసుల, మున్నీర పెరు పతి వాయ్ =సముద్రమనే పెద్ద జలదుర్గాన్ని కల గొప్ప పర్వతంపై ఉండే, నీళ్ నకర్ = గొప్ప లంకానగరంలో, నీళ్ ఎరివైత్తరుళాయ్ = గొప్ప అగ్నిని పెట్టి నశింపజేయాలి, ఎన్టు = అని పల్కి ప్రార్థించి, నిన్నై = నిన్ను, విణ్ణోర్ = దేవతలు, వైకల్ = ప్రతిదినం, మాలైయుమ్ కాలైయుమ్= రెండు సంధ్యాసమయాలలో, తాళ్ నిలమ్ తోయ్న్దు తొ*ழ*ువర్ = తమ కాళ్ళను నేలపై తాకేటట్లుగా వచ్చినమస్కరిస్తారు. (వారు ఆ రీతిలో నమస్కరించడం తమ శత్రువును పోగొట్టడం కోసమే తప్ప), నిన్ మూర్త్తి = నీ దివ్యరూపంలోని, పల్ కూ*ర్ఱి*ల్ = పలు అంశాలలో, ఒన్టు = ఒక్కటిని అయినా, కాణుమ్ ఆమ్ కొల్ ఎన్టే = దర్శించాలనా? (కాదు)

భావదీపిక : ఈ పాశురం "వేన్దఱ్కు*ర్ఱ*ి*ழ*ి ప్పిరివు" అనే ఆలంకారిక ప్రక్రియలో రచింపబడింది. దీని వివరం ఏమంటే- ఒకరాజు వేఱొక రాజు చేతిలో ఓడిపోయి, సార్వభౌమునిదగ్గరకు వచ్చి శరణు వేడితే, అతనికి సహాయం చేయడంకోసం నాయకిని విడచి విశ్లేషించిపోవడం. పరాంకుశనాయకి సర్వేశ్వరుడనే నాయకుడు తనను విడచిపోవడానికి కారణం- రాక్షసులకు ఓడిపోయి వచ్చి, శరణు పొంది అర్థించిన దేవతల ప్రార్థనయే- అని భావించి వారిని నిందిస్తున్నది. **"తోళ్కణ్డార్ తోళే కణ్డార్ తొడుకు*ழ*ల్కమలమన్న తాళ్ కణ్డార్ తాళే కణ్డార్ తడక్కై కణ్డారు మంగిదే"** అనే రీతిలో నీ అందమైన రూపంలో ఒక అంశను కళ్ళు చల్లబడేటట్లుగా దర్శించి, అనుభవించడంకూడా అధికానందకరమై ఉండగా, దేవతలు దానిని ఆశపడి వేడకుండా, నీ కాలిపై పడి, ఎల్లప్పుడు తమ శత్రువును నశింపజేయాలని ప్రార్థించారే!- అని వారిని నిందిస్తూ బాధపడుతున్నది. అనన్య ప్రయోజనులమైన మా కోసం ఏవిధమైన ప్రయాసపడకుండా, దర్శనాన్ని అనుగ్రహించడం మాత్రమే చేస్తే సరిపోతూ ఉండగా, మమ్ములను ఉపేక్షించి, ప్రయోజనాంతరపరులకోసం శరీరం శ్రమపడేటట్లు కార్యాన్ని చేయడమా !- అని భగవానుని స్వభావానికి నొచ్చుకొని పల్కిన రీతి ఇది. **"నిన్నై విణ్ణోర్ కాణలు మాజ్గొలన్టే తాళ్ నిలమ్ తోయ్న్దు తొ*ழ*ువర్!"** అలని అన్నందున తాను నాయకుని

రూపంలోని పలు భాగాలను (దివ్యాంగాలను) దర్శించాలని తాను ఆశపడుతూ ఉండడాన్ని వ్యక్తం చేసింది, నాయకి.

**(పేణ్ నలమిల్లాద వరక్కర్)-** తన ప్రాణాన్నివలెనే ఇతరుల ప్రాణాన్ని కూడా భావించి, ప్రాణులందఱు సుఖంగా జీవించాలనే భావన లేని రాక్షసులు (ఇతరులను హింసించడమే వృత్తిగా కల్గినవారు- అని కూడా అర్థం.) **"పది"**- అనేది లంకాపురికి స్థానమైన ద్వీపాన్ని తెల్పుతుంది. "పెరుమ్ పది" అని, "నీణకర్"- అని పల్కినందున లంక పరబలంతో ఎవరిచేత నశింపజేయ సాధ్యం కానిది- అని స్ఫురిస్తుంది.

**(నీళెరివైత్తరుళాయ్)** -రావణునకు భయపడి దూరంగా వెళ్ళిపోయే స్వభావాన్ని కలవాడైన అగ్నిని, ఆ భయాన్ని ఉపశమింపజేసి, అక్కడే దానిని (అగ్నిని) ఆరకుండా వృద్ధిచేయాలి- అని ప్రార్థిస్తున్నారు, దేవతలు. లంకను భస్మం చేయాలి- దీని భావం. లంకలో ఉండే రాక్షసులను సమూలంగా ఖండించి నశింపజేయాలని ప్రార్థించిన రీతి ఇది.

**(తాళ్ నిలమ్ తోయ్న్దు తొ*ழு*వర్)-** భూలోకంలోకి వచ్చి, క్షీరాబ్ధిని చేరి, భగవానుని సేవించి ప్రార్థిస్తారు. భూమిలో మానవుల దుర్గంధం సోకుతుందని ముక్కును మూసికొని, పైన చాలా దూరంలో నిలచి, హవిర్భాగాలను స్వీకరించి పోయే స్వభావాన్ని కల దేవతలు, తమ లోకంలో నివాసం దుర్లభమైనందున, వారి దైవస్వభావం పోయి, భూమిపై కాలు నిలిపేటట్లుగా వచ్చి నిలచి నమస్కరిస్తారు- అని భావం. **"నిలమ్ తోయ్న్దు తాళ్ తొ*ழு*వర్"** అని అన్వయాన్ని మార్చి, నేలపై సాష్టాంగంగా నమస్కరించి, నీ శ్రీచరణాలను సేవిస్తారు- అని కూడా చెప్పవచ్చు.

ఈవిధంగా వారు ఉదయంలో, సాయంకాలంలో నమస్కరించడం- నీ రూపంలో గల పలు దివ్యాంగాలలో ఒకటిని అయినా దర్శించడంకోసమా! నీ తిరుమేనిని శ్రమపెట్టి, కార్యాన్ని పూర్తిచేసికొని తిరిగివెళ్ళిపోవాలని చూస్తున్నారే తప్ప, **"ఇలఙ్గై ప్పా*ழ*ాళాక ప్పడై పొరుదానుక్కు ప్పల్లాణ్డు కూఱుదుమే"** (లంకను పాడు అయేటట్లు సేనను నడపిన వానికి మంగళం పాడదాం) అని, **"శెన్ఱఙ్గు త్తెన్నిలఙ్గై శెఱ్ఱాయ్ తిఱల్ పోఱ్ఱి"** (దక్షిణంలోని లంకను పాడుచేసినవాడా! నీ సామర్థ్యానికి మంగళం) అని నోటితో అయినా పల్కుతారా, ఆ పాపిష్ఠివారు.

అమృతాన్ని ఉద్ధరించి ఇవ్వాలని సముద్రాన్ని చిలికిన కాలంలో "అమృతం ఎపుడు పైకి వస్తుందో!" అని కింది దిశలోనే చూస్తూ ఉన్నారే తప్ప, "మన్దరమ్ నాట్టి అన్రు మదురక్కొళుమ్ శాఱుకొణ్డ శున్దరత్తోళుడైయాన్" (మందరపర్వతాన్ని నాటి ఆనాడు అమృతాన్ని గ్రహించిన సుందరబాహువులను కలవాడు) అనబడే ఆస్వామియొక్క బాహువులను, ఆ బాహువులలో మాలిక అలంకరింపబడినపుడు ఆ అందాన్ని క్షణకాలమైనా కన్నెత్తి చూచినవారు కారుకదా, ఆపాపిష్ఠివారు. అటువంటివారి కోసమా, నీవు కార్యాన్ని పూర్తిచేయడం!

"నిన్ పలమూర్త్తియిల్ ఒరు కూఱుమ్" అని అన్వయాన్ని మార్చి వివరించవచ్చు. "మున్నీర" -ఇది- "కుఱిప్పు ప్పెయరెచ్చమ్", "ఎన్రే" అనే చోట గల ఏకారం ప్రశ్నార్థకమై వ్యతిరేకార్థంలో పర్యవసిస్తుంది. "కాదుకదా!" అని అర్థం.

## చీకటిని చూచి భయపడే నాయకి, సఖితో, ధాత్రితో నిష్ఠూరంగా పల్కడం

93. కాలై వెయ్యోఱ్కు మున్నోట్టు క్కొడుత్త కఙ్గుల్‌కుఱుమ్బర్,
మాలై వెయ్యోన్ పడ వైయగమ్ పావువర్-, అన్న కణ్డుమ్
కాలైనన్ ఞానత్తుఱై పడిన్దాడి క్కణ్‌పోదు శెయ్‌దు
మాలై నన్నావిల్ కొళ్ళార్, నినైయార్ అవన్‌మైప్పడియే

కాలై = ఉదయకాలంలో, వెయ్యోఱ్కు మున్ = సూర్యుడనే చక్రవర్తికి ఎదురుగా, ఓట్టు కొడుత్త = (నిలువలేక) వెన్ను చూపి పారిపోయిన, కఙ్గుల్ కుఱుమ్బర్ = చీకటి అనే అల్పప్రభువులు, కఙ్గుల్ = సాయంసమయంలో, వెయ్యోన్= ఆ సూర్యుడనే చక్రవర్తి, పడ = మరణించగా, వైయకమ్ పావువర్ = తాము లోకం అంతా వ్యాపిస్తారు, అన్న కణ్డుమ్ = అటువంటి స్వభావాన్ని చూచినా, (పలువురు), కాలై = కాలానికి తగినట్లు, నల్ ఞానమ్ తుఱై పడిన్దు ఆడి = గొప్ప జ్ఞానమనే రేవులోదిగి మునిగి, (భగవద్భక్తి అనే ప్రవాహంలో అవగాహించి, అభినివేశాన్ని పొంది) కణ్ పోదు శెయ్‌దు = భక్తిపారవశ్యంతో కన్నులను మూసికొని, మాలై = భగవానుని, నల్ నావిల్ కొళ్ళార్ = (తమ) మంచి జిహ్వతో నామాలను పల్కి, స్తుతించరు, అవన్ మై పడి = అతని నల్లని తిరుమేనిని, నినైయార్ = భావించరు.

భావదీపిక : లోకంలో అనేకులు "వైకలుమ్ వైకల్ వరక్కణ్డుమ్ అంఱిదుణరార్" (నిత్యం సంధ్యాకాలం వచ్చినా దానిని గమనించరు) అనే రీతిలో ఉదయ సంధ్యాకాలం, సాయం సంధ్యాకాలం మాటిమాటి వస్తూ కాలం గడుస్తూ ఉండే రీతిని ప్రత్యక్షంగా చూస్తూ ఉన్నప్పటికీ, తమ యౌవనం త్వరగా గడచిపోవడాన్ని ఏమాత్రం భావించకుండా, భగవానునిపట్ల అభినివేశాన్ని పొందకుండా వ్యర్థంగా కాలాన్ని గడుపుతూ, కాలక్షేపం చేస్తున్నారే! - అని ఆళ్వార్లు గర్హిస్తూ పల్కుతున్నారు. లోకంలోని వారు ప్రతిదినం సూర్యుడు ఉదయించేటపుడు వారు కోరినట్లుగా ధనాన్ని సంపాదించాలని ఆశపడతారు. తరువాత, సూర్యుడు అస్తమించినపుడు కోరిన రీతిలో విషయసుఖాలను పొందాలనే కుతూహలాన్ని పొందుతారు. ఈ విధంగా సూర్యుని ఉదయకాలంలో, అస్తమయంతో తేడా లేకుండా సంసారులు ఆనందిస్తున్నారే! ఈ విధంగా వ్యర్థంగా దినాలు గడచిపోతున్నాయే ! "**వాళ్కళాకి నాళ్కళ్ శెల్ల**" (వ్యర్థంగా దినాలు గడచిపోగా) అని, "**పళ్ళుతే పల పకలుమ్ పోయిన**" (వ్యర్థంగా పలుదినాలు గడచిపోయాయి) అని, "**ఊమనార్ కణ్ద కనవిలుమ్ పళ్ళుదాయ్ ఒళ్ళిన్దన నాళ్కళ్**" (మూగవాడు కన్నకల కంటే వ్యర్థంగా దినాలు గడచిపోయాయి.) అని బాధపడేవారు లేరే! ఒక క్షణకాలం అయినా భగవదనుసంధానంలో కాలం గడిపేవారు లేరే!- అని సంసారులకోసం ఆళ్వార్లు తాము బాధపడుతున్నారు.

ఈ ఆళ్వార్లు లోకులను సంస్కరించి ఉజ్జీవింపచేయడంకోసం అవతరించిన వారైనందున, మిక్కిలి జీవకారుణ్యాన్ని కలవారైనందున, ఇతరుల నష్టానికి మిక్కిలి బాధపడతారు.

మొదటి రెండు పాదాలతో పగలు, రాత్రిగా మాటి మాటి వచ్చి, ఆయుష్కాలం గడచిపోవడం ప్రస్తావించబడింది. ఇది సంపద నిలకడ నిలువకపోవడానికి కూడా ఒక దృష్టాంతం. "నందత్యుదిత ఆదిత్యే నందంత్యస్తమితే రవౌ" అనే శ్రీరామాయణ సూక్తి ఇక్కడ స్మరణీయం.

తరువాత రెండు పాదాలు లోకులను నిందిస్తున్నాయి. "**కాలై**"- సత్త్వగుణ ప్రధానమైసన ఉదయకాలంలో, "**నల్ఞాన త్తుఱై పడిన్దు**" గొప్ప ఆత్మజ్ఞానం కోసం ప్రవేశించే రేవు తీర్థం- అయిన ఆచార్యుని నమస్కరించి, "ఆడి"- ఆ ఆచార్యుని ఉపదేశంలో అవగాహించి, '**కణ్పోదు శెయ్దు**' విషయాంతరాలలో జ్ఞానం

ప్రసరించని రీతిలో దానిని లోపల నియంత్రించి, **"మాలై నల్‌నావిల్ కొళ్ళార్"** - తమపట్ల ప్రీతిని కల సర్వేశ్వరుని మంచి జిహ్వాతో స్తుతించరు, **"అవన్ మైప్పడి నినైయార్"**- అతని నల్లని తిరుమేనిని ధ్యానించడంకూడా చేయరు- అని లోకులను నిందిస్తున్నారు. **"నల్‌ఞానమ్"** భగవానుని లక్ష్యంగా కల్గిన జ్ఞానమే మంచి జ్ఞానం. అన్యవిషయక జ్ఞానం అంతా అజ్ఞానం, విపరీతజ్ఞానం. **"ఒణ్‌తామరైయాళ్ కేళ్వన్ ఒరువనైయే నోక్కుముణర్వు"** (లక్ష్మీనాథుని మాత్రమే లక్ష్యంగా కల్గినదై యధార్థ జ్ఞానం ఉంటుంది) అనే పొయ్‌కై ఆళ్వార్ల పాశురాన్ని ఇక్కడ గ్రహించాలి.

స్నానానికి తగిన కాలం వేకువజాము కనుక **"తుఱై పడిన్దాడి"**- అనేదానికి తగినట్లుగా **'కాలై"** అని అనబడింది. **"కణ్‌పోదు శెయ్‌దు"** -అనే దానిని రెండర్థాలను ఇచ్చే ప్రయోగంగా గ్రహించి, "భగవానుని విషయంలో జ్ఞానమనే ఆంతరనేత్రం వికసించి'' అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. ఇక్కడ నమ్బిళ్ళై ఈడు గమనించాలి- **"పోదు శెయ్‌దు- ఎన్ఱు మొట్టిక్కైక్కుమ్ పేర్, అలరుకైక్కుమ్ పేర్. పుఱమ్బుళ్ళ విషయఙ్గళిల్ కణ్ శెమ్బళిత్తు- ఎన్నుదల్; భగవద్విషయత్తిలే విழిత్తు- ఎన్నుదల్"** (**"పోదుశెయ్‌దు"**- అనేది వికసించడానికి, ముకుళించడానికి పేరు. బాహ్యవిషయాల పట్ల దృష్టిపడకుండా కన్నులను మూసికొని- అని అర్థం. లేక, భగవద్విషయంలో దర్శనాన్ని కల్గి ఉండి- అని కూడా అర్థం.) అనేది ఆ వ్యాఖ్య. **"పెయరినైయే పున్దియాల్ శిన్దియాదు ఓది యురు వెణ్ణుమ్ అన్దియాలామ్ పయన్ అఙ్గెన్"** (భగవన్నామాలను మనస్సుతో చింతించకుండా కేవలం వాక్కుతో మంత్రాన్ని జపించి చేసే సంధ్యావందనం వల్ల ఏమి ఫలం?) అనే రీతిలో మనః పూర్వకంగా ధ్యానించడం కాకుండా వాఙ్మాత్రంతో పల్కి జపించడం ఏమీ గొప్పకాదు కనుక **"మాలై నన్నావిఱ్కొళ్ళార్"** అనే మాత్రంతో నిలువకుండా **"నినైయార్ అవన్ మైప్పడియే"** అనికూడా చెప్పబడింది.

**"పోదు"**- వికసించే పరువంలోని మొగ్గ, పెద్ద మొగ్గ, **"నల్ నా"** - భగవానుని స్తుతించడంకోసమే ఉండే జిహ్వ. **"నారాయణా వెన్నా నా ఎన్న నావే"** అని అన్నారు ఇతరులుకూడా.

ఈ పాశురానికి ఆలంకారిక ప్రక్రియను అన్వయించి చెప్పాలనే నిర్బంధం లేదు. ఒకవేళ ఆవిధంగా నిర్బంధమే ఉంటే, **"ఇరుళ్ కణ్డు అఞ్జుకిఱ తలైవి, తోழியైయుమ్, తాయైయుమ్ వెఱుత్తల్"** (చీకటిని చూచి భయపడే నాయకి

సఖిని, తల్లిని గర్హిస్తూ పల్కడం) అనే ప్రక్రియలో అంతర్భవిస్తుందని అనవచ్చు. నాయకి, భగవానుడనే నాయకుని విశ్లేషించి, ఆ విరహాన్ని సహించలేకుండా ఉండే స్థితిలో సూర్యుడు అస్తమించి, కామోద్దీపకమైన రాత్రిపొద్దు వచ్చి, అంతటా చీకటి వ్యాపించింది. ఆ చీకటి భగవానుని నల్లని తిరుమేనిని జ్ఞాపకం చేసి బాధించగా, దానివల్ల సహించలేని ఆ నాయకి **"ఉలకేృుముణ్డాన్ శౌన్మొృ మాలై అన్దణ్ణన్తుృాయ్ కొణ్డు శూట్టుమిన్"** అని పలికే రీతిలో తన బాధకు భగవన్నామోచ్చారణమనే మంత్రపరిహారాన్ని కల్గినది కనుక, వేదనాస్థితిని, దానికి పరిహారాన్ని గమనించి గ్రహించి వర్తించని సఖి, పెంపుడు తల్లి- అనే వారిని ఉద్దేశించి గర్హిస్తూ పల్కడం ఈ పాశురంలోని స్వాపదేశం. పాశురంలోని పూర్వవాక్యంతో చీకటియొక్క కాఠిన్యాన్ని వ్యక్తం చేసింది. తరువాతి వాక్యంతో, ఆ చీకటి అతని తిరుమేనికి స్మారకమై తనను బాధించే రీతినిగూర్చి సఖి మొదలైనవారు ఆలోచించకపోవడాన్ని, చింతించి ఆ బాధను ఉపశమింపజేసే ఉపాయాన్ని చేయకపోవడాన్ని నిందించింది.

"వెయ్యోన్"- వేడి అయిన కిరణాలను కలవాడు. శత్రువులను తపింపజేసే పరాక్రమాన్ని కలవాడు. "కుఱుమ్బర్"- వక్రగతిని కలవారు. "అన్నకణ్ణుమ్"- నశించకుండా రక్షించే నీతిని, న్యాయాన్ని కలవాడైన చక్రవర్తి మరణించడాన్ని, సమయంచూచి బలహీనులను బాధించే అనీతిని కల క్రూరశాసనాన్ని కల ప్రభువుకు అంతటా వ్యాపించడాన్ని ప్రత్యక్షంగా చూచినా- అని భావం. **"ఒట్టు"**- పరుగెత్తడం. **"ముదనిలైత్తిరివ్దతొృత్పెయర్"**.

### నాయకిని చూచిన నాయకుని సఖుడు నాయకుని స్థైర్యాన్ని ప్రశంసిస్తూ పల్కడం

**94.** మైప్పడి మేనియుమ్ శెన్దామరై క్కణ్ణుమ్ వైదికరే,
మెయ్ప్పడియాలున్ తిరువడి చ్చూడుమ్-, తకైమైయినార్
ఎప్పడి యూరా మిలైక్క క్కురుట్టా మిలైక్కు మెన్నుమ్
అప్పడి యానుమ్ శొన్నేన్, అడియేన్ మత్రు యాదెన్బనే

మై పడి మేనియుమ్ = నల్లని వర్ణం దట్టంగా ఉండే తిరుమేని, శెమ్ తామరై కణ్ణుమ్ = ఎఱ్ఱ తామరపూవువంటి తిరునేత్రాలను కల, ఉన్ = నీ, తిరు అడి =

శ్రీచరణపద్మాలను, వైదికరే = వైదికులే, మెయ్ పడియాల్ = యథార్థమైన క్రమంలో, శూడుమ్ = తమ శిస్సులపై పెట్టుకొని, నమస్కరించేటట్లు, తక్కైమైయినార్ కురుడు ఆ మిలైక్కుమ్ ఎన్నుమ్ అప్పడి = ఏవిధంగా (బయట మేసి తిరిగి) ఊరికి వచ్చి చేరిన (కళ్ళు కన్పించే) పశువులు, తమ చోటును తెలిసి ఆనందంతో ధ్వనించగా గుడ్డి పశువులు కూడా వాటివెంట వచ్చి ధ్వనిస్తాయి- అని లోకం పల్కుతుందో, ఆవిధంగానే, యానుమ్ శొన్నేన్ = నేను నిన్ను స్తుతించాను, అడియేన్ మఱ్ఱు యాదు ఎన్బన్ = దాసుడనైన నేను మఱి ఇక ఏమి పల్కగలను?

**భావదీపిక :** గడచిన పాశురంలో **"మాలై నన్నావిఱ్కొళ్ళార్ నినైయార్ అవన్ మైప్పడియే"**- అని లోకంలోని వారిని నిందించిన ఆళ్వార్లను చూచి భగవానుడు "మీరు నన్ను యథాతథంగా తెలిసి పలుకగల్గినవారా!" అని భావించినట్లు ఆళ్వార్లు తలచి, "స్వామీ! విలక్షణులైన వైదికులే నిన్ను యథాతథంగా తెలిసి పలుకగల్గినవారు. నేను, వారిపోయిన దారిలో పోవడానికి మాత్రమే యోగ్యుడను''- అని ఈ పాశురంద్వారా విన్నపిస్తున్నారు.

చూచిన వారి కన్నులను చల్లబఱచే తిరుమేనిని, ఎఱ్ఱని తామరపూలవలె ఉండే తిరునేత్రాలను కలవాడవైన నీ శ్రీచరణపద్మాలను, విన్నవారినుండి వినడం కాకుండా, సాక్షాత్తుగా దర్శించి, శిరసా వహించి అనుభవించే స్వభావం కలవారెవరు? అంటే, వేదవేదాంత జ్ఞానంలో మహానుభావులైనవారే. జ్ఞానహీనుడనైన నేను కూడావారివలె ఏదో కొన్ని మాటలను పల్కుతున్నాను. ఇది ఎటువంటిది ? అంటే- చక్కగా దృష్టిని కల్గిన పశువులు ఊరిలోకి పోయి, చేరగానే, తమ నివాసాన్ని చూచి ఆనందించి, ఆ ఆనందానికి పరీవాహరూపంగా ఘోషను చేయగా, కంటి చూపు లేని గుడ్డి పశువులు కూడా దానిని విని, దానిని ఇదమిత్థంగా తెలియకుండానే వాటితో కలసి ధ్వనిస్తాయి- అని లోకం పలికే రీతిలోనే, వేదవైదిక పురుషులు పల్కిన పాశురాన్ని విని నేనుకూడా పలికాను; అంతే. పల్కడానికి మూలమైన సంబంధాన్ని కలవాడను, భక్తి పారవశ్యాన్ని కలవాడనైన నేను ఆ విధంగా కాకుండా, నా జ్ఞానంతో దర్శించి, నా శక్తితో పలికాను- అని చెప్పగలనా ? అని అంటున్నారు. ఈ పాశురాన్ని ఒక విధంగా మనస్సులో పెట్టుకొని శ్రీగుణరత్నకోశంలో భట్టర్ పల్కిన **"ఇత్యుక్తి కైతవశతేన విడంబయామి తానంబ! సత్యవచసః పురుషాన్**

పురాణాన్, యద్వా న మే భుజబలం తవ పాదపద్మలాభే" (తల్లీ! ఈవిధంగా వందలాది మోసపు మాటలతో నిజాన్ని పలికే పురాణ పురుషులను అనుకరిస్తున్నాను. లేకపోతే నీ పాదాలను ఆశ్రయించే శక్తి నాకు లేదు.) అనే శ్లోకం ఇక్కడ స్మరణీయం.

ఈ పాశురానికి తగిన ఆలంకారిక ప్రక్రియను అన్వయించి చెప్పాలంటే- **"తలైవియై క్కణ్డ పాఙ్గన్ మీణ్డు తలైవనై యడుత్తు వియన్దుకూఱల్"** అనే ప్రక్రియగా ఈ పాశురాన్ని భావించాలి. దీని వివరమేమంటే- నాయకితో సహజమైన సంగమాన్ని పొంది, తరువాత వియోగాన్ని పొందిన నాయకుడు తాను ఆ నాయకిని తిరిగి చేరగోరి, ఆమె అందం మొదలైన వానిని తన ప్రాణసఖునితో వద్ద ప్రశంసిస్తూ పలుకగా, అది విని "ఒక స్త్రీ కారణంగా నీవు ఇంతగా క్లేశపడడం తగదు'' అని అతనిని మందలిస్తూ పలికాడు, ఆ స్నేహితుడు, ఆ నాయకుడు మళ్ళీ తిరిగి ఆ నాయకి రూపవైలక్షణ్యాన్ని మఱింత ప్రశంసిస్తూ పల్కగా, దానిని తిరిగి నిషేధించి పల్కిన తరువాత, స్నేహితుడు అతనిని సమాధాన పఱచాడు. నాయకుడు తెల్పిన గుర్తులనుబట్టి స్నేహితుడు నాయకి ఉండే చోటుకు వెళ్ళి, పూలదోటలో ఆమెను చూచాడు. ఆమె రూపలావణ్య సౌందర్యాదులను నేరుగా చూచి తరువాత కామవేదనతో మిక్కిలి క్లేశపడకుండా కొంచెంకూడా సమాశ్వాసాన్ని పొందడం ఎంతటి గొప్పవారికైనా సాధ్యం కాదు. ఇటువంటి నాయకిని చూచి, విశ్లేషించినా, ఒక విధంగా సమాశ్వాసాన్ని పొందే నాయకుని నేను పూర్వం విచారణ లేకుండా నిందిస్తూ నిషేధిస్తూ పలికానే! - అని నొచ్చుకొని, నిందించినందుకు బాధపడి, వేగంగా తిరిగి వచ్చి నాయకునితో పల్కిన మాట, ఇది.

**"మైప్పడి మేనియుమ్, శెన్దామరై క్కణ్ణుమ్"** అనే విశేషణాలవల్ల ఆ అందగత్తెతో కూడడానికి తగిన రూపసౌందర్యాన్ని కల్గినవాడవు నీవు- అని, **"వైదికరే మైప్పడియాలున్ తిరువడి చ్చూడుమ్ తకైమైయినాల్"** అని అన్నందున ఆ అందగత్తెను చూచినా, ఒక విధంగా సమాశ్వాసాన్ని పొందిన నీవు, జ్ఞానానుష్ఠానాలను కల వైదికులచే కూడా శిరసా వహించి, మిక్కిలిగా గౌరవించదగినవాడవని, **"ఎప్పడి యూరా మిలైక్క క్కురుట్టా మిలైక్కు మెన్ను మప్పడి యానుమ్ శొన్నేన్"** అని పల్కినందున- ఆ రూపంయొక్క గొప్పతనాన్ని, నీ మనస్సుయొక్క సామర్థ్యాన్ని చూడకుండా లోకంలో సాధారణంగా ఒక దుష్టప్రవర్తనను కలవారిని వారి స్నేహితులు వర్ణించి, వారి చెడ్డతనాన్ని మఱుగుపరచేటట్లే, నేను నిన్ను పూర్వం

నిందిస్తూ పల్కడం - కంటి చూపును కల పశువులు అఱవగానే, గుడ్డిపశువులు కూడా వాటితో అఱచినట్లుగా, తెలియని రీతిలో, అజ్ఞానక్రమంలో చేసినది- అని, **"అడియేన్"** అని అన్నందున- ఆ దోషాన్ని నీవు క్షమించడానికి తగిన స్థితిని నేను కల్గినవాడనని, **"మఱ్ఱు యాదెన్బనే"** అని అన్నందున - ఆ రూపసౌందర్యాన్ని చూచినా పూర్తి కలతను పొందకుండా, కొంచెం తెలివిని, ధైర్యాన్ని కల్గి ఉండే నీ సామర్థ్యాన్ని ఈ విధంగా ప్రశంసిస్తూ పలికే రీతిలో తప్ప, నాయకి యొక్క ఆ రూపంలోని వైలక్షణ్యాన్ని నేను ఏవిధంగా వర్ణించి పలుకగలను?- అని పల్కినట్లయినది.

భగవంతుని తిరుమేనిని వర్ణిస్తూ ఆళ్వార్లు **"మైప్పడి మేని"** అని పల్కిన సూక్తిని వ్యాఖ్యానించే సందర్భంలో పెరియవాచ్చాన్ పిళ్ళై ఒక పూర్వాచార్యుల ఐతిహ్యాన్ని ప్రస్తావించారు.

భట్టర్ ఒకనాడు **"మైప్పడిమేనియుమ్"** అనే ఈ పాశురాన్ని వివరించేటపుడు అక్కడ పిళ్ళై విழుప్పరైయర్, ఆప్పాన్ తిరువழున్దూర్ అరైయర్ ఉన్నారు. **"మైప్పడిమేనియుమ్"** అనే పదానికి భట్టరు "దర్శించినవారి మనస్సులో చీకటి వ్యాపించేటట్లున్న తిరుమేని (చూచినవారి మనస్సులో వ్యామోహాన్ని కల్గించే రీతిలోని తిరుమేని) అని అర్థం చెప్పారు. అపుడక్కడ ఉండే నంజీయర్ "మనస్సుకు చీకటి కల్గించడం అంటే- **"ఇన్నార్ ఎన్ఱఱియేన్"** అనేటట్లుగా చేయడమే కదా !" అని అన్నారట. దీని భావమేమంటే- శంఖచక్రాలతో కూడిన స్వామిని దర్శించి నపుడుకూడా అతనికి "ఇతడు'' అని గుర్తించలేని అవధికి వ్యామోహం కలిగేటట్లు ఉన్నందున తిరుమంగై ఆళ్వార్ **"ఆழியొడుమ్ పొన్నార్ శార్ఙ్గముడైయ అడికళై ఇన్నార్ ఎన్ఱఱియేన్"** (సుదర్శనంతో పాటు, బంగారు వలె వెలిగే శార్ఙ్గంగా మనే ధనస్సును ధరించిన స్వామిని - ఇటువంటివాడు - అని తెలియలేను) (పెరియతిరు-10-10-9) అని అన్నారు. మనస్సుకు పిచ్చి కలిగేటట్లుగా ఉండే తిరుమేని- అని భట్టర్ పల్కిన వివరణానికి చక్కగా పొసగే ప్రమాణంగా ఈ పాశురాన్ని నంజీయర్ ఉదాహరించగానే, భట్టర్- ''ఈ పాశురాన్ని ఉదాహరించినవారెవరు?' అని అడిగారు. అరైయర్లు ఇద్దఱు **"నంజీయర్"** అని అన్నారు. దానిని విన్న భట్టర్ "నంజీయర్, నూర్లయోజనాల ఆవల ఉండేవారైనా, ఇంతదూరం శ్రీరంగానికి వచ్చి, మనకు ఈ పాశురాన్ని ఉదాహరించారే!'' అని నంజీయర్‌ను చాలా పొగిడారు. ఈ ఐతిహ్యం నమ్బిళ్ళై వ్యాఖ్యానంలో కూడా ఉన్నది.

## నాయకి, నాయకుని తప్ప అన్యుని పరిణయమాడననే పాతివ్రత్యాన్ని తెలుపడం

95. యాదాను మోరాక్కైయిల్ పుక్కు, అజ్గాప్పుణ్డు మాప్పవిౘ్ఱన్దుమ్
మూదావియిల్ తడుమాఱు ముయిర్ మున్నమే-, అదనాల్
యాదానుమ్ పఱ్ఱి నీజ్గుమ్ విరదత్తై నల్ వీడు శెయ్యుమ్
మాదావినై ప్పిదువై, తిరుమాలై వణఙ్గువనే

ఉయిర్ =ప్రాణమనేది, మున్నమే = చిరకాలంగానే, మూదు ఆవియిల్ = ప్రాచీనమైన (పలు విధాలైన) జన్మలలో, యాదు ఆనుమ్ ఓర్ ఆక్కైయిల్ = ఏదైనా ఒక శరీరంలో, పుక్కు = ప్రవేశించి, అజ్గు = ఆ శరీరంలో, ఆప్పుణ్డు = బంధింపబడి ఉండి, ఆప్పు అవిౘ్ఱన్దుమ్ = (అక్కడనుండి) సంబంధాన్ని తీరినా, తడు మాఱుమ్ = అవస్థ మాటి క్లేశపడే స్వభావాన్ని కల్గినది, అదనాల్ = అందువల్ల, యాదు ఆనుమ్ పఱ్ఱి = ఏవిధంగా అయినా, నీజ్గు విరతత్తై నల్ వీడు శెయ్యుమ్ = (భగవానుని వీడి) తొలగిపోయే రీతిలోని నడతను (వ్రతాన్ని) పూర్తిగా విడిపించగల్గినవాడైన, మాతావినై = తల్లివంటివాడు, పితువై = తండ్రివంటివాడైన, తిరు మాలై = శ్రీమన్నారాయణుని, వణఙ్గువన్ = శరణు పొందుతాను.

**భావదీపిక :** "ఒకదానివెంట ఒకటిగా అనాదిగా సంభవించే సంబంధాల కారణంగా గెంటివేయకుండా నన్ను అంగీకరించాలి" అని, "దాసుడనైన నేను సకలవిధ బంధువు, ఆప్తబంధువు, ఆపద్బంధువు అయిన భగవానుని శరణు పొందుతాను"- అని తమ ప్రపత్తిమార్గానుష్ఠానంలోని నిష్ఠను ఆళ్వార్లు ఈ పాశురం ద్వారా తెలియజేస్తున్నారు.

ఆత్మ, అనాదికాలంగా ప్రాక్తనకర్మానుగుణంగా ఏదైనా ఒక శరీరంలో ప్రవేశించి, అందులో కర్మబంధాలతో బంధింపబడి, కొంతకాలానికి ఆ శరీరంయొక్క సంబంధం తీరినా, సూక్ష్మశరీరంతో ఉండి, స్వర్గలోక నరకలోకాలను ప్రవేశించి, తిరిగి క్లేశపడుతూ ఉంటుంది. ఈ విధంగా ఆత్మకు శరీరసంబంధం అనాదిగా ఉన్నందున, ప్రాచీనకర్మవాసనావశంచేత ఏదైనా ఒక వస్తువుపట్ల సంబంధాన్ని (ఆశను) పొంది, భగవానుని విడచి తొలగిపోయే రీతిలోని వ్రతాన్ని

పూర్తిగా సమూలంగా తీరేటట్లు చక్కగా విడిపించి, తననే ఆశ్రయించి ఉండేటట్లు చేయగల్గినవాడై, ప్రియాలను నిర్వహించడంలో తల్లివంటివాడై, హితాలను నిర్వహించడంలో తండ్రివంటివాడై, లక్ష్మీవల్లభుడైన శ్రీమన్నారాయణుని శరణు పొందుతాను- అని అంటున్నారు. అనాదిగా సంభవించే సంసారంలో సంబంధం లేని రీతిలో- శరణు పొందినవారి కర్మలను పోగొట్ట గల్గిన స్వామిని నేను నమస్కరిస్తాను- అని అంటున్నారు.

ఆత్మకు దేహసంబంధమనేది కర్మవశంచేత ఏర్పడే ఔపాధికమైనది (కృతకమైనది) తప్ప, సహజమైనది కాదు- అనే అర్థం స్ఫురించేటట్లుగా- **"యాదాను మోరాక్కైయిల్ పుక్కు"** అని అనబడింది. **"అజ్గ ఆప్పుణ్డమ్"** అంటే- ఒక్కొక్కజన్మలోను అహంకార- మమకారాలనే అభిమానాలను విడవకుండా ఉండడమే.

**(మూదావియిల్ తడుమాఱు ముయిర్ మున్నమే)**- ఆత్మకు సంసారం సంబంధం అనాది, భగవానునితో ఉండే సంబంధం కూడా అనాది- అనేది శాస్త్రవచనం. అయినా, ఆత్మకు అచిత్సంబంధం కంటే, నారాయణసంబంధమే మిక్కిలి ప్రాచీనమైనదనే విషయం ఆళ్వార్ల శ్రీసూక్తిలో స్పష్టంగా తెలుస్తున్నది. ఇక్కడ **"మూదావియిల్ తడుమాఱు ముయిర్ మున్నమే"** అని పల్కిన ఆళ్వార్లే తిరువాయ్మొళిలో **"శోర్న్దే పుకల్ కొడాచ్చుడరై అరక్కియై మూక్కేర్న్దాయె, అడియేన్ అడైన్దేన్ ముదల్ మున్నమే"** అని అన్నారు. అచిత్సంబంధంయొక్క అనాదిత్వాన్ని తెలిపే ఈ పాశురంలో **"ముదల్ మున్నమే"** అనే దానిని గుర్తించాలి. **"ఏతన్నిమిత్తమ్ మున్నమే- ముదల్ మున్నమేయాన అచిద్యనాది సంబంధజ్గళ్"** అనే ఆచార్యహృదయ శ్రీసూక్తికూడా స్మరణీయం.

**"యాక్కై, యాప్పు"** అనే పదాలు **"ఆక్కై, ఆప్పు"** అని మారి వచ్చాయి. **"యాక్కై"** అనేదానికి ఆత్మను బంధించేది- అనేది వ్యుత్పత్త్యర్థం. **"ముదమై+ఆవి"**- **"మూదావి"**. **"ఆవి"** అనేది **"తానియాకుపెయర్"**- శరీరాన్ని లక్షిస్తుంది. ఆత్మ ఒక స్థూలశరీరాన్ని విడచిపెట్టి, ఇంకొక స్థూలశరీరాన్ని చేరేటపుడు, స్వర్గనరకాలకు వెళ్ళేటపుడు సూక్ష్మశరీరంతోనే వెడుతుంది- అనే శాస్త్రవచనం గమనించదగినది. ఈ సూక్ష్మశరీరం ముక్తిదశలో జీవుని విడచిపోతుంది. ఆత్మయొక్కస్థానంలో బియ్యాన్ని, స్థూలశరీరస్థానంలో పొల్లును, సూక్ష్మశరీరస్థానంలో తవుడును

గ్రహించాలి. బియ్యపుగింజను విడచిపెట్టి పొల్లు తొలగిపోవడం రెండు రోకళ్ళతో దంచబడినందున సంభవిస్తుంది. అదే రీతిలో, జ్ఞానానుష్ఠానాలతో స్థూలశరీరం తొలగిపోతుంది. తవుడు పోవడం నీటిలో బియ్యం తడుపబడినపుడు, అదే విధంగా విరజానదీస్నానంతో సూక్ష్మశరీరం ఆత్మను విడచి తొలగిపోతుంది- అని వివేకించి తెలియాలి.

ఈ పాశురానికి తగిన శృంగార ప్రక్రియ (తుఱై)ను చెప్పాలంటే- **"తలైవి అఱత్తొడు నిఱ్క త్తుణిత్తల్"** - అనేది దీనిలోని ప్రక్రియ (తుఱై)గా చెప్పవచ్చు. శ్రియఃపతి అనే నాయకుని రహస్యంగా కలసి, తరువాత విశ్లేషించి బాధపడే పరాంకుశనాయకి "ఇక నా ప్రాణాన్ని ధరించి నిలువదు కనుక, నేను శీఘ్రంగా మరణిస్తాను. ఆవిధంగా నేను మరణించినప్పటికీ మఱు జన్మలో ఈ నాయకునే కలవాలని ఆశపడతాను. అయినా, ఒక్కొక్క ఆత్మకు కర్మానుసారంగా సంభవించదగిన నాల్గు రీతులలోని జన్మలకు **84** వేల నూఱు యోని భేదాలు ఉన్నాయి కనుక, వాటిలో నేను మానవస్త్రీగానే తిరిగి జన్మిస్తాను. అనేది ఏమి నిశ్చయం? అందువల్ల ఈ జన్మలోనే ఈ నాయకుని విశ్లేషించకుండా కలిసేటట్లు నా ప్రాణం ఈ శరీరాన్ని విడచి పోవడానికి ముందే నేను వేగంగా ప్రయత్నిస్తాను. అంటే- నేను బిడియాన్ని విడచి పెట్టి వెంటనే నా అభిప్రాయాన్ని సఖితో వ్యక్తంగా పల్కి, ఆమూలంగా తల్లికి, ఆమె మూలంగా తండ్రికి, దానిని వ్యక్తం చేసి, వారు ఏవిధంగా అయినా అతనికే నన్ను ఇచ్చి వివాహం జరిపించేటట్లు చేస్తాను. అంతేకాక, సఖిద్వారా నాయకునకు నా క్లేశాతిశయాన్ని పల్కి, అతడు త్వరగా నన్ను పరిగ్రహించేటట్లు చేస్తాను- అని పలుమార్లు క్లేశపడుతూ, సఖితో తాను తన పాతివ్రత్యధర్మంలో నిష్ఠను కల్గి ఉండాలనే నిశ్చయాన్ని పొందడమే ఈ శృంగార ప్రక్రియా స్వరూపం.

ఆత్మ అనేది ప్రాచీనమైన పలు విధాలైన జన్మలలో ఏదైనా ఒక శరీరంలో ప్రవేశించి, ఆ శరీరంలో బంధింపబడి ఉండి, ఆ శరీరంతో సంబంధం తీరినా, అవస్థ మాఱి క్లేశపడే స్వభావాన్ని కల్గినది. అందువల్ల నా ఆత్మ ఈ శరీరాన్ని వీడిపోవడానికి ముందే ఏదో ఒక వ్రతంతో అయినా నాయకుడు నన్ను విశ్లేషించడమనే తగని వర్తనను తీర్చడానికి (నాయకుడు నాతో కలువడానికి) తగిన తల్లి, తండ్రి కూడా అయిన శ్రియఃపతి అనే ఆ నాయకునకు నమస్కరించి, వేడుకొంటాను- అనే పాశురంలోని పదార్థాన్ని గ్రహించాలి.

**(నీఙ్గుమ్ విరతత్తై నల్ వీడు శెయ్దు)** అంటే- విశ్లేషం లేకుండా వ్యక్తంగా కూడి ఉండేటట్లు వివాహం చేసికోవడం. రహస్యప్రకారంలోని సంగమంలో **"ఇయఱ్కై పుణర్చ్చి, పాఙ్గఱ్కూట్టమ్, ఇడన్దలైప్పాడు, పాఙ్గియఱ్కూట్టమ్, పగఱ్కుఱి, ఇరవుక్కుఱి, ఒరువழி త్తణత్తల్, వరైపొరుట్పిరిదల్"** అనే ఒక్కొక్క శృంగారప్రక్రియా భేదంలోను తప్పకుండా విశ్లేషం సంభవిస్తుంది కనుక, అది **"విరతమ్"** అని అనబడింది. **"వ్రత"** మనబడే సంస్కృతపదం **"విరత"**మని అయినది. లోపం లేకుండా శ్రద్ధగా స్వీకరించి ఆచరించే కార్యానికి వ్రతమని పేరు.

**"యాదానుమ్ పఱ్ఱి నీఙ్గుమ్ విరతత్తై నల్ వీడు శెయ్యుమ్"**- అనేదానిలో **"యాదానుమ్ పఱ్ఱి'** అనేది **"వీడు శెయ్యుమ్"**- అనే దానిలో అన్వయిస్తుంది. ఏదైనా ఒక కారణాన్ని పురస్కరించుకొని నన్ను నాయకునితో వివాహం జరిపించ గల్గిన తల్లిని, తండ్రిని- అని భావం. ఒకనికి తమ కుమార్తెతో వివాహం జరిపించ డానికి అతని విద్య, సంపద, కులం, శీలం, ప్రేమ, వేడికోలు (ప్రార్థన), (కన్యకు) ఆభరణాలను ఇవ్వడం మొదలైన పలు కారణాలున్నాయి. కనుక, వాటిలో తగినది ఏదైనా ఒక కారణాన్ని చూచి వివాహాన్ని జరిపించాలని ఆశించిన రీతి ఇది.

ఇక, **"యాదానుమ్ పఱ్ఱి"** అనే దానిని **"నీఙ్గుమ్"** అనే దానిలో కూడా అన్వయించవచ్చు. నాయకుడు నాయకుని విడచిపెట్టిపోవడానికి పలు కారణా లున్నాయి. ఇతరులు తమను గూర్చి తెలిసికొంటారే- అనే భయం, ఊరిలోనివారు నిందించడం, వివాహానికి ఆవశ్యకమైన ధనాన్ని సంపాదించి రావడం- మొదలైన విశ్లేషహేతువులు పెక్కింటిలో ఏదైనా ఒక కారణాన్ని పురస్కరించుకొని విడచి పెట్టిపోయే- అని భావం. **"పితృ"**- అనే సంస్కృతపదం **"పితు"** అని మాఱింది.

ఒక దానివెంట ఇంకొకటి నిరంతరం కలిగే ఈ శరీరసంబంధం కారణంగా నన్ను విడచిపెట్టకుండా స్వీకరించాలి- అని దాసుడనైన నేను భగవానుని శరణు వేడుతున్నాను- అని ఈ పాశురంలో ఆழ்వార్లు పలికారు. **"యాదాను మోరాక్కైయిల్ పుక్కు"** అని ప్రారంభమయే ఈ పాశురవివరణలో పెరియవాచ్చాన్ పిళ్ళై ఒక ఐతిహ్యాన్ని ఉదాహరించారు.

ఈ సందర్భంలో నంజీయర్ పలికే సూక్తి ఒకటి ఉన్నది. ఒకసారి భట్టర్ తిరుక్కోట్టియూర్‌లో వేంచేసి ఉండేటపుడు రామానుజదాసులనే శ్రీవైష్ణవులొకరు

భట్టర్ వద్దకు వచ్చి "దాసునకు తిరువిరుత్తానికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించాలి"- అని ప్రార్థించారు. భట్టర్ "నమ్బెరుమాళ్‌ను విడచిన విశ్లేషంతో బాధపడేనేను ఇపుడు ఏమీ చెప్పలేను. అందువల్ల, ఓ నంజీయర్! మీరు తిరువిరుత్తానికి వ్యాఖ్యానాన్ని ఇతనికి చెప్పండి" అని అన్నారు. నంజీయర్ ఆరీతిలోనే తిరువిరుత్త వ్యాఖ్యానాన్ని పల్కుతూ ఉన్నారు. తిరుక్కోట్టియూర్ నంబిని ఆశ్రయించిన వళవన్ వల్లవతరైయన్ అనే భక్తులు, రామానుజదాసులతో కలసి, నంజీయర్ దగ్గర తిరువిరుత్త వివరణను ఆలకించడం ఆరంభించారు. ఈ పాశురాన్ని నంజీయర్ వివరించేటపుడు వళవన్ వల్లవతరైయన్ కన్నీరు మున్నీరుగా ద్రవించి, పులకితగాత్రులవడం గమనించి నంజీయర్" ఈ పాశురానికి అర్థాన్ని ఇకపై కదా చెప్పబోతున్నాను. ఇంతలోనే మీరు ఇంతటి అభినివేశాన్ని పొందుతున్నారేమి! అని అడిగారు. దానికి వారు "తిరుక్కోట్టియూర్‌నంబి నాకు సదుపదేశాలను అనుగ్రహించిన తరువాత "భగవంతుని ముందు ప్రతిదినం ఈ పాశురాన్ని విన్నవించు" అని నన్ను నియమించారు. దానిని ఇపుడు స్మరించాను". అని అన్నారు నంజీయర్ "తిరుక్కోట్టియూర్ నంబి ఈ పాశురానికి విశేషంగా పల్కిన అర్థం ఏదయినా మీకు జ్ఞప్తి ఉన్నదా? అని అడిగినపుడు వల్లవత్తరైయన్ "అవి ఏవీ నాకు తెలియదు. నమ్బి నాకు పల్కిన రీతిలో ఈ పాశురాన్ని మాత్రం గుర్తుపెట్టుకొన్నాను" అని అన్నారట. ఈ విషయాన్ని గుర్తుగా పల్కిన నంజీయర్ "తిరుక్కోట్టియూర్ నంబిమిక్కిలి ఆదరించిన పాశురంకదా, ఇది" అని ఈ పాశురాన్నే అయిదాఱు నిముషాలపాటు పొగడారు. ఈ ఐతిహ్యం నమ్బిళ్ళై వ్యాఖ్యానంలో కూడా ఉన్నది.

### సోదెను చెప్పించే తల్లి ప్రయత్నాన్ని నిషేధించాలని నాయకి భావించడం

**96. వణఙ్గుమ్ తుఱైగళ్ పల పల వాక్కి, మదివికఱ్పాల్**
**పిణఙ్గుమ్ శమయమ్ పలపల వాక్కి-, అవై యవై దోఱు**
**అణఙ్గుమ్ పలపల వాక్కి నిన్‌మూర్‌త్తి పరప్పివైత్తాయ్**
**ఇణఙ్గు నిన్నోరై యిల్లాయ్!, నిన్‌కణ్ వేట్కై యెழுవిప్పనే**

వణఙ్గుమ్ = (దైవాన్ని) నమస్కరించే, తుఱై కళ్ పల పల = రీతులను పెక్కింటిని, ఆక్కి = సృష్టించి, మది వికఱ్పాల్ = జ్ఞానంలోని వికల్పంచేత, పిణఙ్గుమ్ = (ఒక దానితో ఇంకొకటి) మాఱుగా ఉండే (వ్యతిరేకించే), శమయమ్

పల పల = మతాలను పెక్కింటిని, ఆక్కి = సృష్టించి, అవై అవై తోఱు = ఆ యా మతాలన్నిటిలో, అణఙ్గుమ్ పల పల = దైవాలను పెక్కింటిని, ఆక్కి = సృష్టించి, నిన్ మూర్త్తి పరప్పివైత్తాయ్ = (ఈవిధంగా) నీ రూపాన్ని వ్యాపింపజేశావు, ఇణఙ్గుమ్ నిన్నోరై ఇల్లాయ్ = నీతో సమానంగా పల్కదగిన నీతో పోలినవారెవ్వరూ లేనివాడా!, నిన్ కణ్ = నీవిషయంలో, వేట్కై = భక్తిని, ఎழுవిప్పన్ = వృద్ధి అయేటట్లు చేస్తాను.

**భావదీపిక :** ఆழ்వార్లు భగవానుని చూచి "సాటి లేని స్వామీ! సర్వేశ్వరుడవైన నీవు రజోగుణతమోగుణాలతో ప్రాచుర్యాన్ని కల్గినవారు కర్మగతి కారణంగా నీదగ్గరకు రాకుండా ఉండేటట్లుగా పలు దైవాలను, పలుపలు మతాల సిద్ధాంతాలను, పలు పలు ఉపాసనల విధానాలను సృష్టించి ఏర్పాటు చేశావు. నిన్ను నేరుగా ఆశ్రయించి, ఉజ్జీవించడానికి అడ్డుగా ఉండే ఆ బాహ్యామార్గాలలో నేను ప్రవేశించి, నీనుండి తొలగిపోకుండా ఉండేటట్లు, వాటికన్నిటికి మూలమైన నీ స్వరూపాన్ని తెలిసికొని నీపట్ల భక్తిని మిక్కిలిగా కల్గి ఉండడంతోపాటు, ఇతరులను కూడా ఆ విధంగా చేసేటట్లు ప్రోత్సహిస్తాను- అని అంటూ ఈ పాశురంలో పల్కుతున్నారు. ఆழ்వార్లు భగవానుని చిత్తానుసారంగా లోకాన్ని సంస్కరించి, సన్మార్గంలో వర్తించేటట్లు చేయడంకోసం అవతరించినవారు కనుక, ఈ విధంగా తమ కార్యాన్ని గూర్చి పల్కడం తగును.

**(వణఙ్గుమ్ తుఱైకళ్ పల పల వాక్కి)**- కర్మయోగమని, జ్ఞానయోగమని, భక్తియోగమని- ఈ విధంగా పలురీతులలోని ఉపాయాలను చూపించి- అని భావం.

**(మది వికఱ్పాల్ పిణఙ్గుమ్ శమయమ్ పల పల వాక్కి)- "ఒన్ఱే పొరుళిన్ వేఱెన్బు వేఱెనిన్ అన్ఱెన్బ ఆఱుశమయత్తార్"** (ఒకే వస్తువును వేరు వేరు అనడం, వేరు అంటే కాదని అనడం - అని ఈరీతిలోని షణ్మతవాదులు) అనే రీతిలో "అవునన్నది కాదనడం, కాదన్నది అవుననడం'' అనే వివాదాలు అభిప్రాయభేదాల కారణంగా స్పర్థిస్తాయి. ఈవిధంగా స్పర్థించే అనేక మతాలను సృష్టించినవాడు భగవానుడే కదా!

**(అవైయవై తోఱు అణఙ్గుమ్ పల పల వాక్కి)**- ఒక్కొక్క మతంలోను **"అమ్మన్"** అని, **"పిడారి"** అని, **"శాత్తన్"**- అని **"కూఱ్ఱన్"** అని పలు రీతులలోని దైవాలను ఆరాధనకు తగినవిగా నిలిపి- అని భావం.

**(నిన్‌మూర్‌త్తి పరప్పివైత్తాయ్)**- ఈ విధంగా జగత్తులను నిర్వహించడం నీవల్ల తప్ప ఇంకొకరికి సాధ్యమా? శక్తిలో సాటి లేనివాడవు కదా, నీవు- అని భావం.

**(నిన్‌కణ్‌వేట్కై ఎழுవిప్పనే)**- ఆశ్రయించే (కొలిచే) మార్గాలు అనేకం, సృష్టించినా, ప్రపత్తిమార్గం ఒక్కటినే వ్యాపింపజేస్తాను. సిద్ధాంతాలలోని వికల్పాలవల్ల స్పర్ధించే మతాలు పలుపలు సృష్టించినా, శ్రీవైష్ణవసిద్ధాంతాన్ని ఒక్కటినే వ్యాపింపజేస్తాను. దైవాలను పెక్కింటిని సృష్టించినా శ్రీమన్నారాయణ రూపివైన నీరూపంలోనే భక్తిని కల్గి ఉంటాను- అని భావం.

ఈ పాశురానికి శృంగార ప్రక్రియాభేదాన్ని అన్వయించి చెప్పవలసివస్తే - **"తలైవి వెఱివిలక్కువిక్క నినైత్తల్"** అనేది దీనికి తగిన ప్రక్రియ **("కిళవిత్తుఱై")** భగవానుడనే నాయకునితో రహస్యంగా సంశ్లేషించి, తరువాత కల్గిన అతని విరహంవల్ల క్లేశపడి కృశించిన పరాంకుశనాయకి, తన క్లేశాన్ని చూచి బాధపడిన పెంపుడు తల్లి కట్టువిచ్చితో పల్కి, ఆమె ద్వారా ఆమె సంప్రదాయం ప్రకారం సోదె చెప్పించి, క్లేశనివారణోపాయానికై ప్రయత్నించిగా, మురుగన్ దేవత ప్రత్యక్షం అయ్యాడు. అపుడు పరిహారంగా **"వేలన్"**ను (మురుగన్ ఆరాధకుడు) పిలిపించి, పూనకపు ఆటను ఆడించగా, దీనిని గ్రహించి, నాయకి గొప్ప దైవమైన శ్రీమన్నారాయణమూర్తి కారణంగా కల్గిన తన కామవ్యాధి చిల్లర దైవాలను ఆరాధించడమనే ఈ **"వెఱియాట్టమ్"** (దయ్యపు ఆట) తో తీరినట్లయితే, తన ఒద్దికకు (పాతివ్రత్యానికి) లోటువస్తుందని, తీరికలేకపోతే ఊరిలోని వారు నిందిస్తారని తలచి, తాను సిగ్గుపడే మార్గమైనా, తన రహస్యాన్ని వ్యక్తం చేసి, వేలన్ ఆడే ఆటను నిరోధించ దలచి, భావనాప్రకర్షవల్ల నాయకుని ప్రత్యక్షంగా దర్శించి, తనలో తాను పల్కుతున్నది. నాయకునే పరదైవంగా కల్గినది కనుక, అన్యదైవాలను అన్నిటిని ఆ పరదైవం యొక్క రూపాలుగానే (ప్రకారాలుగా) భావించి పల్కుతున్నది.

ఆరాధించే మార్గాలను పెక్కింటిని సృష్టించడం- అంటే **"వెఱియాట్టమ్"** (పూనకంతో ఆడే ఆట) ఆడడం, మేకను బలి ఇవ్వడం **(ఆడు పలియిడుదల్)** కల్లును, మాంసాన్ని చల్లడం మొదలైనవి. ఇరుగు పొరుగువారికి ఈ రహస్యసంగమం తెలియని రీతిలో కట్టువిచ్చి ధాన్యాన్ని చెఱిగి విసరి చెప్పే సోదిలో

"మురుగన్" దైవాన్ని కారణంగా చూపినవాడు, "వేలన్" చేసే ఆరాధనకు పరంపరయా సంబంధాన్ని కలవాడవు- జగత్కారణభూతుడవు, పరం దైవం అయిన నీవే అయినా, ఆ దేవతాంతరాలద్వారా నా వ్యాధి తీర్చబడడం జగత్కారణ భూతుడవై, పరదైవమై, సాటిలేని నిన్ను సాక్షాత్తుగా నాయకునిగా కల్గిన నా పాతివ్రత్యానికి కొఱత కనుక, నేను దానిని అంగీకరించను- అని భావం.

## నాయకుని విశ్లేషంవల్ల నిద్రించలేని నాయకి క్లేశపడడం

97. ఎழువదుమ్ మీణ్డే పడువదుమ్ పట్టు, ఎనై యూழிగళ్ పోయ్
కழிవదుమ్ కణ్డు కణ్డెళ్గలల్లాల్-, ఇమైయోర్గళ్ కుழாమ్
తొழுవదుమ్ శూழ்వదుమ్ శెయ్ తొల్లైమాలై క్కణ్ణార క్కణ్డు
కழிవదోర్ కాదలుற్றార్క్కుమ్, ఉణ్డో కణ్గళ్ తుఞ్జుదలే?

ఎழுవదుమ్ = సూర్యుడు ఉదయించడం, మీణ్డే పడువదుమ్ = తిరిగి అస్తమించడం, పట్టు = ఈ విధంగా జరిగి, ఎనై ఊழிకళ్ = ఎన్ని కల్పాలో, పోయ్ కழிవదుమ్ = కాలం గడచిపోవడం, కణ్డు కణ్డు = చూచి చూచి, ఎళ్కల్ అల్లాల్ = క్లేశపడడమనేదే లేకుండా, ఇమైయోర్కళ్ కుழாమ్ = దేవతాసంఘం, తొழுవదుమ్ = నమస్కరించడాన్ని, శెయ్ = చేయబడిన, తొల్లై మాలై = ఆద్యంతరహితుడైన శ్రియఃపతిని, కణ్ ఆర కణ్డు = కన్నులకు తృప్తి కలిగేటట్లుసేవించి, కழிవదు ఓర్ కాదల్ ఉற்றార్క్కు = (అతనిపట్ల) మిక్కిలి భక్తిని కల్గినవారికి, కణ్గళ్ తుఞ్జదల్ = కన్నులు మూసికోవడం అనేది, ఉణ్డో = ఉన్నదా! (లేదు).

భావదీపిక : భగవత్స్వరూపాన్ని పూర్తిగా సాక్షాత్కరింపజేసికోవాలని కోరి ప్రయత్నించినవారికి కాలం గడచి ముగిసిపోతుందే తప్ప, ఆ అనుభవం పూర్తి అయి, కన్నులను మరల్చే స్థితి లేదు- అని ఆழ்వార్లు భక్తులతో పల్కుతున్నారు. సూర్యుడు ఉదయించడం, తిరిగి అస్తమించడం- అనే ఈ రీతిలో దినాలు, మాసాలు, సంవత్సరాలు, కల్పాలుగా చాలా కాలం గడచిపోవడాన్ని చూచి, కాలం చాలనందుకు బాధపడడమే కాదు, నిత్యసూరులు ఎల్లప్పుడూ చేతులను జోడించి నమస్కరిస్తూ కైంకర్యం చేయడం కోసం గుంపులుగా పరివేష్టించే, అనాది అయిన భగవానుని కన్నులు చల్లబడేటట్లు దర్శించి, ఆ అనుభవాన్ని పూర్ణంగా పొందాలనే

సాటి లేని గొప్ప భక్తిని కల్గినవారికి, అతనిపట్ల ప్రసరింపజేసిన తమ చూపును మరల్చి, రెప్పవేసే అవకాశం ఉన్నదా ? అని అంటున్నారు.

ఈ పాశురానికి ఇంకొక రీతిలోకూడా అర్థాన్ని తెలిపారు. **"ఎழுవదుమ్"**- పుట్టడం, **"మీణ్డే పడువదుమ్"**- పుట్టినపుడే మరణించడం, **"పట్టు"**- జన్మించి, **"ఎనై ఊழிకళ్ పోయ్ క్కழிవదుమ్"**- చిరకాలం గడచి మరణించడం- అనే స్వభావాన్ని కల లోకంలోని వస్తువులను, **"కణ్డు కణ్డు"**- చూచి చూచి **"ఎళ్కల్ అల్లాల్"**- వాటిని నిరసించకుండా, భగవానుని సేవించి కాలం గడిపే రీతిలో సాటి లేని ఆశతో ఉండేవారికి అతనిని ఉపేక్షించే కారణం అనేది లేదు- అనేది ఇంకొక అర్థం. భగవానుని పూర్ణానుభవం పొందాలని ఆశపడి, అవగాహించినవారికి జ్ఞానం ముకుళించదు- అనేది దీనివల్ల స్ఫురిస్తుంది.

**"వాళ్కిళాకి నాళ్కళ్ శెల్ల"** (వ్యర్థంగా కాలం గడచిపోగా) అనే రీతిలో కాలం గడచిపోయే రీతిని చూచి "అయ్యో! కాలం అంతా వ్యర్థంగా గడచిపోతున్నదే! భగవత్ సాక్షాత్కారం మనకు లభించలేదే! అని మనస్సులో నొచ్చుకొంటూ ఉండాలే తప్ప "భగవానుని కన్నులారా దర్శించి పూర్తి అయినది, మన భక్తి తీరిపోయింది'' అని తమను కృతకృత్యులుగా భావించే దినం ఏనాడూ సంభవించదు- అని అన్నట్లయినది.

**"కణ్ ఆర"**- కన్నులున్నందుకు తగిన ఫలాన్ని పొందేటట్లు-అని భావం. **"కరియవనై క్కాణాద కణ్ణెన్న కణ్ణే కణ్ణిమైన్దు క్కాణ్బార్తమ్ కణ్ణెన్న కణ్ణే"**- (నల్లని వానిని దర్శించని వారి కన్నులు కన్నులా?) అని శిలప్పదికారమ్ (ఆయ్చ్చి కురవై)లో చెప్పబడింది కదా! **"కాదలున్ఱార్క్కు ఎళ్కళ్ అల్లాల్ కణ్ తుఞ్జుదల్ ఉణ్డో !"** అని అన్వయించాలి. భగవద్విషయంలో ఆశను కల్గి ఉంటే, ఉన్నంతవరకు దర్శించి మనస్సులో ద్రవిస్తూ ఉండాలి అంతే తప్ప, ఆ అనుభవం పూర్తి అయి కన్నులు మూసికొని నిద్రించడం అనేది లేదు కదా! ఇక్కడ నమ్పిళ్ళై ఈడువ్యాఖ్యను గమనించండి''. "స్వతంత్రరాన పెరుమాళ్ ఉఱఙ్గినారెన్ఱు కేట్కు మిత్తనైపోక్కి, **అవరై అనుసరిత్తు ప్పోన ఇళైయపెరుమాళుక్కు కణ్ణుఱఙ్గిన్ఱో? భగవద్విషయత్తిలే కైవైత్తాల్ ఇదుక్కుమున్ కణ్ణుఱఙ్గినారుణ్డెన్ఱు కేట్టఱివారుణ్డో!"** (స్వతంత్రుడైన శ్రీరాముడు నిద్రిస్తున్నాడు- అని వింటున్నాము. అంతేతప్ప, అతనిని అనుసరించి పోయిన లక్ష్మణునకు కన్నులు మూసికొని నిద్ర వచ్చిందా? భగవద్విషయంలో

ప్రవేశించినవారిలో దీనికి ముందు కన్నులు మూసి నిద్రించినవారున్నారు- అని వినినవారున్నారా?)

శృంగారరసప్రక్రియలో ఈ పాశురాన్ని అన్వయించినపుడు, నాయకుని విశ్లేషించి, నిద్రను పొందలేని నాయకి బాధపడుతూ పలికిన సూక్తిగా చెప్పవచ్చు. శ్రియఃపతి అనే నాయకుని దర్శించి, అతనితో కలసి, విశ్లేషించి, ఆ విరహకాలంలో **"కజ్గులుమ్ పకలుమ్ కణ్తుయిల్ అఱియాళ్"** (రాత్రిపగలు నిద్రపోయి ఎఱుగదు) అనే రీతిలో రాత్రింబగళ్ళు కొంచెం సేపు అయినా నిద్రపోకుండా, బాధపడే పరాంకుశనాయకి, తనను ఊరడించాలని ప్రయత్నించే సఖితో పల్కిన పాశురమిది- అని చెప్పవచ్చు. సఖి ఊరడించే రీతి ఏమంటే- నాయకుని విశ్లేషించిన స్థితిలో ఈవిధంగా అతనికోసం తహతహలాడి క్లేశపడే వారుంటారా? పలు రీతులలోని లౌకిక పదార్థాలను చూచి, పొద్దు పుచ్చి, ఒకవిధంగా ఊరడిల్లి నిద్రను పొందే నాయికలు లోకంలో లేరా! వారివలె నీవు కూడా నిద్రించవచ్చు కదా! అని అంటూ లోక స్వభావాన్ని ప్రస్తావించి పల్కి, సఖి ఊరడించింది. అటువంటివానిని చూచి, ఈ దేవాధిదేవుడైన పురుషోత్తముని పట్ల భక్తిని కల్గి ఉండేవారికి కూడా నిద్రను పొందడం సాధ్యమా? అని పల్కి నాయకి సఖి వచనాలను నిషేధించింది. ఆనందానుభవానికి తగిన కాలం వ్యర్థంగా గడచి పోవడాన్ని తలచి, తలచి మనస్సులో క్లేశపడడం కాకుండా, నిద్రను పొందే అవకాశం ఉన్నదా ? అని భావం. **"ఇమైయోర్కళ్కు*ప్పూ*మ్ తొ*ప్పు*వదుమ్ శూ*ప్పు*వదుమ్ శెయ్"**- అనే విశేషణం ద్వారా -తనచే ప్రేమించబడిన నాయకుని వైలక్షణ్యం వ్యక్తం చేయబడింది. **"తొల్లైమాలై"**- అని అన్నందున తనకు, ఆ నాయకునకు జరిగిన పరిచయం (సంబంధం) చిరకాలం నాటిది- అని సూచింపబడింది. **"తొల్లైమాలై"** -అనే దానికి- జీవాత్మలన్నిటిపట్ల అనాదిగా ఉండే వ్యామోహాన్ని కలవాడని, అన్నిటికంటే ప్రాచీనమైన గొప్పవాడని అర్థాన్ని తెల్పుతారు.

## నాయకుని గొప్పతనాన్ని భావించి క్లేశపడే నాయకి సఖిని ఊరడిస్తూ పల్కడం

**98.** తుణ్ణా మునివరుమ్ అల్లాదవరుమ్ తొడరనిన్ఱ,
ఎణ్ణా ప్పిఱవి యిడర్ కడివాన్-, ఇమైయోర్తమక్కుమ్

తన్‌శార్‌విలాద తనిప్పెరు మూర్‌త్తి తన్ మాయమ్ శెవ్వే
నెఞ్జాల్ నినైప్పరిదాల్, వెణ్ణెయూణెన్ను మీనచ్చొల్లే

తుఞ్జా మునివరుమ్ = నిద్రించడం లేని ఋషులు, అల్లాదవరుమ్ = దేవతలు మొదలన మిగిలినవారిచే, తొడర నిన్ఱ = వెంటనంటి ఆరాధింపబడేవాడు, ఎఞ్జా పిఱవి ఇడర్ కడివాన్ = (భక్తుల) లోటు లేని- లెక్కలేనన్ని జన్మక్లేశాలను పోగొట్టేవాడు, తన్ శార్‌వు ఇల్లాద =తనతో సాటి చెప్పి పలికే రీతిలో ఏ ఉపమానం లేనివాడు, తని పెరు మూర్‌త్తి తన్ = సాటి లేని, గొప్ప స్వరూపాన్ని కలవాడైన భగవానునకు, వెణ్ణెయ్ ఊణ్ ఎన్నుమ్ ఈనమ్ శొల్ = వెన్న ఆహారమైనది- అని చెప్పే నీచ వాక్కుకు చోటయిన, మాయమ్ = ఆశ్చర్యం, ఇమైయోర్ తమక్కుమ్= పైలోకంలో ఉండేవారికి కూడా, శెవ్వే నెఞ్జాల్ నినైప్పు అరిదు = చక్కగా మనస్సుతో భావించడానికి కూడా సాధ్యం కానిది.

**భావదీపిక** : సర్వేశ్వరుని పరత్వంలో, సౌలభ్యంలో ఉండే భోగ్యత ఎవరికీ పరిచ్ఛేదించి భావించడానికి సాధ్యం కాదు- అని ఇందులో అంటున్నారు. "వెణ్ణెయ్ ఊణెన్నుమ్ ఈనచ్చొల్లే" అని అన్నందున సౌలభ్యగుణం, మిగిలినవాని ద్వారా పరత్వగుణం సూచింపబడ్డాయి. పరత్వంలోని ఎల్లను ఒక విధంగా దర్శించినా దర్శించవచ్చునేమో!, కాని, సౌలభ్యం ఎవరికీ పరిచ్ఛేదించి దర్శించడం సాధ్యం కానిది- అనే అర్థం స్ఫురించేటట్లు "**నెఞ్జాల్ నినైప్పు అరిదాల్ వెణ్ణెయ్ ఊణెన్ను మీనచ్చొల్లే**" అని నవనీతచౌర్యవృత్తాంతం ప్రధానవిశేష్యంగా నిశ్చయించి పలుకబడింది.

"వెణ్ణె యూణెన్ను మీనచ్చొల్ - నెఞ్జాల్ నినైప్పరిదాల్" అనే చోట నమ్బిళ్ళై ఈడువ్యాఖ్యను గమనించండి- "**సర్వేశ్వరనాయ్, బ్రహ్మాదికళుక్కుమ్ కూడా ఆశ్రయణీయనాయ్, అవాప్తసమస్త కామనాయిరుక్కిఱవన్, ఆశ్రితస్పర్శ ముళ్ళ ద్రవ్యమే తనక్కు ధారకమాయ్, అదుదాన్ నేర్‌కొడునేర్ కిట్టప్పెఱాదే ఇప్పడి కళవుకణ్డాకిలుమ్ భుజిక్కవేణ్డి, అదుదాన్ తలైక్కట్టప్పెఱాదే, వాయదు కైయదాక అకప్పట్టు క్కట్టుణ్డు అడియుణ్డు ప్రతిక్రియై య*ఱ్ఱ్ఱు* ఉడమ్బు వెళుత్తు ప్పేకణిన్ఱు నిన్ఱనిలై శిలర్‌క్కు నిలమో?**" (సర్వేశ్వరుడై, బ్రహ్మాదులకు కూడా ఆశ్రయించ దగినవాడై, తీరిన అన్ని కోరికలను కలవాడై ఉండేవాడు, భక్తుల స్పర్శను కల ద్రవ్యాన్నే తనకు ధారకంగా తలచి, దానిని నేరుగా పొందలేక, దొంగతనంతో

అయినా అనుభవించగోరి, ఆ దొంగతనాన్ని కూడా సాక్షాత్తుగా చేయలేక, వారికి ప్రత్యక్షంగా చిక్కుపడి, కట్టపడి, కొట్టబడి, ప్రతిక్రియను చేయలేక, ఒడలు పాలిపోయి, భయపడుతూ నిల్చిన సన్నివేశాన్ని గూర్చి పల్కడం ఎవరికి సాధ్యం!) అనేది ఆ వ్యాఖ్యానసూక్తి

**"ఇమైయోర్ తమక్కుమ్ శెవ్వే నెఞ్జాల్ నినైప్పరిదాల్"** అని అన్నందున, ఎల్లప్పుడు అతనితో కలసి ఉండేవారు, అవధి లేని జ్ఞానం కలవారు, నిరంతర భగవదనుభవశీలురైన నిత్యసూరులకే ఈ గుణం అవధి లేనిది భావించడానికి సాధ్యం కానిది- అని పల్కడం ద్వారా, మిగిలినవారికూడా అందని స్వభావాన్ని కల్గినది- అనేది కైముతికన్యాయసిద్ధం.

**"తుఞ్జా మునివరుమ్ అల్లాదవరుమ్ ఎఞ్జా ప్పిఱవి యిడర్ కడివాన్ తొడర నిన్ఱ తన్ శార్విలాద తనిప్పెరు మూర్త్తి తన్"** అని ఈవిధంగా అన్వయించి, వివరించవచ్చు. **"తుఞ్జా మునివరుమ్"**- ఆత్మవిషయంలోని, ఈశ్వరవిషయంలోని జ్ఞానం ఏనాడూ నశించని సనకసనందనాదియోగులు-అని, **"అల్లాదవరుమ్"** వారివలెకాకుండా, బ్రహ్మభావనతో పాటు కర్మభావనను కూడా కల బ్రహ్మాది దేవతలు- అని, **"ఎఞ్జాప్పిఱవి ఇడర్ కడివాన్"**- తమ తమ నశించని జన్మక్లేశాన్ని పోగొట్టుకోవడంకోసం, **"తొడర్"**- అనుసరించి కొలిచేటట్లు, **"నిన్ఱ"**- నాయకుడై ఉండేవాడు-అని, **తన్ శార్వు ఇలాద** = అందటికి తాను శరణ్యుడై ఉండేటట్లే, తాను వేఱొక శరణ్యుని అన్వేషించనక్కర లేనివాడైన జగత్కారణభూతుడైన పరదైవం- అని అర్థాన్ని కూడా కొంచెం మార్పుతో చెప్పవచ్చు.

ఈ పాశురానికి శృంగారరసప్రక్రియావిశేషం చెప్పినపుడు- నాయకుని దుర్లభత్వాన్ని చూచి, క్లేశపడే నాయకితో సఖి పల్కుతున్న పాశురమని చెప్పవచ్చు. నాయకుని గొప్ప పరత్వగుణాన్నే ప్రధానంగా ఉద్దేశించి పల్కి, **"నల్ల వెన్ తోழி! నాకణై మిశై నమ్ పరర్, శెల్వర్ పెరియర్ శిఱుమానిడవర్ నామ్ శెయ్వదెన్?"** (నా ప్రియసఖీ! శేషశయనుడైన మన పరమాత్మ గొప్పవాడు మనం అల్పమానవులం- మనం ఏమి చేయగలం?) అని (గోదాదేవి) పల్కినట్లు, "అంతటి పరత్వాన్ని కల్గినవాడు చాలానీచుడనైన నన్ను చేతబట్టి గ్రహిస్తాడా?'' అని మిక్కిలి కళవళపడిన నాయకిని చూచి సఖి- "ఆ విధంగా పరత్వాన్ని కలవాడై ఉండేవానికి భక్తులపట్ల సులభుడై ఉండే స్వభావం అనేది ఒకటి సహజంగానే ఉన్నందున అతడు నిన్ను

తనకు శేషంగా సొత్తుగా చేసికొని స్వీకరించకుండా ఉండడు'' అనేది- సఖి తాను ఆలంబనంగా పల్కిన సౌలభ్యగుణానికి ఒక దృష్టాంతాన్ని ప్రస్తావించి పల్కిన రీతి. **"తుళ్లా మునివరుమ్ అల్లాదవరుమ్ తొడర నిన్ర ఎళ్లా ప్పొఱివి యిడర్ కడివాన్ తన్ శార్విలాద తనిప్పెరు మూర్త్తి"** అనే పర్యంతం నాయకి తన భయానికి తగినట్లుగా అనుసంధించిన (స్మరించిన) పరత్వగుణాన్ని సఖి అనువదించిన క్రమం.

**"ఊన్"**- **"ఉణ్ణప్పడుమ్ పొరుళ్"**- భుజింపబడే వస్తువు- అనే అర్థంలో కర్మణివ్యుత్పత్తిలో ప్రత్యయం చేరి లోపించిన నామపదం. హీనమనే సంస్కృతపదం ఊనమనే వికృతిని పొందింది.

**"నెళ్లాల్ నినైప్పరిదాల్... ఊనచ్చొల్లే"** అనే సూక్తి వివరణలో పెరియవాచ్చాన్ పిళ్ళై ప్రస్తావించిన ఐతిహ్యం ఒకటి ఉన్నది. ప్రభువునకు తీసికొనిపోయే పాలను ఒక గొల్లవాడు దొంగిలించగా, ఆ కారణంగా అతనిని ఒక చోట బంధించి, కొట్టారు. అపుడు అక్కడకు వచ్చిన పిళ్ళై ఉఱజ్గావిల్లి దాసర్ గొల్లవాడు కట్టుబడి దెబ్బలు తినడం గమనించి, శ్రీకృష్ణుడు వెన్నను దొంగలించి కట్టబడి, కొట్టబడిన వృత్తాంతం స్మరించి, దానివల్ల ఒళ్ళుమఱచి ఆ గొల్లవానిని శ్రీకృష్ణునిగానే తలచి "ఈ గొల్లవాడు చేసిన తప్పుకు నన్ను బాధ్యునిగా చేసికొంటున్నాను. నన్ను దండించండి'' అని పల్కి ఆ గొల్లవానిని విడిపించారట.

## నాయకి తనకు నాయకునిపట్ల ఉండే అనురాగాతిశయాన్ని సఖితో పల్కడం

**99.** **ఊన చ్చొల్లాయినుమాగ, ఎఱితిరై వైయుమ్ ము*గ్*గుమ్**
**ఏనత్తురువా యిడన్ద పిరాన్-, ఇరుమ్ కఱ్పగమ్ శేర్**
**వానత్తవర్క్కు మల్లాదవర్క్కుమ్ మ*ఱ్*ఱెల్లా యవర్క్కుమ్**
**ఞానప్పిరానై యల్లాలిల్లై, నాన్ కణ్డ నల్లదువే**

ఊనమ్ శొల్ ఆయినుమ్ ఆక = (నా సిద్ధాంతం) కొందఱికి నీచ వాక్కులు కానివ్వండి, ఎఱి తిరై వైయమ్ ము*గ్*గుమ్ = వీచే అలలను కల ప్రళయ సముద్రంలో మునిగిపోయిన భూమిని అంతటిని, ఏనత్తు ఉరు ఆయ్ ఇడన్ద = వరాహమూర్తియై, దంతాగ్రంతో గుచ్చి ఉద్ధరించిన, పిరాన్ = స్వామి (నాయకుడు), ఇరు కఱ్పకమ్ శేర్ వానత్తవర్క్కుమ్ = గొప్ప (పెద్ద) కల్పవృక్షాలు ఉండే

స్వర్గలోకంలోని దేవతలకు, అల్లాదవర్క్కుమ్ = దేవతలు కాని మానవులకు, మ*ణ్ర్రు* ఎల్లా యవర్క్కుమ్ = ఇంకా ఉండే నరకంలోని వారు మొదలైన వారందటికి, ఞానమ్ = జ్ఞానాన్ని ఇచ్చే, పిరానై అల్లాల్ = నాయకుడు (స్వామి) అయిన భగవానుని తప్ప, నాన్ కణ్డ నల్లదు ఇల్లై = నేను తెలిసిన సద్విషయం వేఱు ఏమీ లేదు.

**భావదీపిక :** పూర్వం ప్రళయసముద్రంలో మునిగిపోయిన భూమిని ఉద్ధరణం చేసి, నిలిపిన మహోపకారకునే నేను సంసారమహాసముద్రంనుండి నన్ను ఈడేఱ్చడానికి శరణంగా భావిస్తాను- అని ఆ*ళ్వా*ర్లు తమ మనో నిశ్చయంలోని దార్ఢ్యాన్ని భక్తులకు వ్యక్తం చేస్తున్నారు.

ఇపుడు నేను వ్యక్తంచేసే నా సిద్ధాంతం ధర్మార్థకామాలనే రక్షకంగా తలచి, దేహాత్మాభిమానాన్ని కల్గి, భగవద్విషయం పట్ల విముఖులై ఉండే సంసారులు అంగీకరించకుండా నిరసించేటట్లుగా ఉన్నా, నీచవాక్కు అయినా కానీ. నా నిశ్చయాన్ని మాత్రం వ్యక్తం చేసి తీరుతాను- అని అంటున్నారు మునుముందుగా **"ఈన చ్చొల్లాయినుమాక"** అని అనడంద్వారా- బిడ్డబావిలో పడిపోయినపుడు, ఆ బిడ్డను రక్షించడంకోసం తాను కూడా ఆ బిడ్డతో పాటు బావిలోకి దూకి, దానిని పైకి ఎత్తే తల్లివలె భూమిని ప్రళయసముద్రం ముంచివేయగానే, దానిలో మునిగి భూమిని ఎత్తిన మహోపకారకుని తప్ప వేఱెవ్వరిని రక్షకంగా ఆశ్రయించను- అని అన్నారు.

ఒకానొక సమయంలో భూమిని చాపగా చుట్టి గ్రహించి, సముద్రంలో ముంచిన హిరణ్యాక్షుని భగవానుడు మహావరాహరూపిగా అవతరించి వధించి, భూమిని కోరతో గుచ్చి ఎత్తి, పైకి తీసికొని వచ్చి, యథాపూర్వం విస్తరింపజేసిన వాడు- అనేది **"ఏనత్తురువాన్"** వృత్తాంతం. ఇపుడు నడచే శ్వేత వరహాకల్పానికి ముందున్న పాద్మకల్పానికి చెందిన ప్రళయం మహాసముద్రంలో మునిగి ఎత్తిన భూమిని శ్రియఃపతి ఉద్ధరించాలని భావించి, శ్రీవరాహరూపాన్ని ధరించి, తన దంతాగ్రంతో భూమిని ఉద్ధరించాడని, అందువల్లనే ఈ ఈ కల్పానికి శ్వేతవరాహ కల్పమనే పేరు వచ్చిందనే పురాణకథనం ఉన్నది.

**"ఎల్లాయవర్క్కుమ్"**- అనేదానికి పశుపక్ష్యాది పలు రీతులలోని జన్మలను కూడా అంతర్భవింపజేసి- అని కొందఱు అర్థం చెప్పారు. అంతేకాక **"అల్లాదవర్

క్కుమ్" అనేదానికి- భగవానుని విడచి ఉండి, ప్రాణధారణ చేయలేని రీతిలో నిత్యసూరులకు- అని, "మఱ్ఱు ఎల్లాయవర్క్కుమ్"- అనే దానికి- నిహీనులైన మనుష్యులు అందఱికి- అని కూడా వివరింపబడింది.

"కిళవిత్తుఱై" (శృంగార ప్రక్రియా) ప్రకారంలో ఈ పాశురాన్ని అన్వయించి నపుడు- నాయకుని పట్ల తనకు ఉండే స్థిరమైన, అచంచలమైన ప్రేమను గూర్చి నాయకి తన సఖితో పల్కుతున్న ప్రక్రియగా చెప్పవచ్చు. సర్వేశ్వరుడైన నాయకునితో కలసి, విశ్లేషించిన పరాంకుశనాయకి, తాను అతని విషయంలో కల్గి ఉండే ప్రేమలోని నిశ్చయాన్ని సిగ్గువిడచి సఖితో ప్రస్తావించి పల్కినది. ఇదికూడా నాయకి సఖితో తన పాతివ్రత్య నిష్ఠను తెలుపడంలోకి ("అఱత్తొడు నిఱ్ఱల్") చేరుతుంది. తన రహస్య సంగమాన్ని నాయకి వ్యక్తం చేసినందున ఏర్పడే అపనిందకు ఆమె ఏమీ భయపడకుండా ఉండడం స్ఫురించేటట్లుగా "ఈన చ్చొల్లా యినుమాక" అని అన్నదని గ్రహించాలి.

"ఎల్లాయవర్"- అనేదానిలో "ఎల్లామ్"-అనేది ప్రకృతి. మకారమ్ లోపించింది. "య్"- అనేది "ఎழுత్తుప్పేఱు". "అ"- శారియైచ్చొల్లు (నామపదాల, క్రియాపదాల సంధిలో కలిసే ప్రత్యయం) "వ్"- అనేది సంధివల్ల వచ్చింది. "అర్"- బహువచన ప్రత్యయం. శ్రీవైష్ణవసంప్రదాయంలో వరాహస్వామికి "ఞానప్పిరాన్" అని తిరునామం.

ఈ పాశుర వ్యాఖ్యానాలలో పూర్వాచార్యులు పలు ఐతిహ్యాలను ప్రస్తావించారు.

"నెఞ్జాల్ నినైప్పరిదాల్ వెణ్ణై యూణెన్నుమ్ ఈనచ్చొల్లే" అని అంటూ ఈ పాశురానికి ముందు పాశురంలో శ్రీకృష్ణుడు వెన్నను దొంగలించిన వృత్తాంతాన్ని స్మరించినంతలోనే ఆழ్వార్లు మోహాన్ని పొందుతారని తలచి, వారిదగ్గర ఉండే మధురకవి ఆழ్వార్లు "మాకు రక్షకంగా ఒక విషయాన్ని అనుగ్రహించాలి" అని ప్రార్థించగా, "ఞానప్పిరానై యల్లాలిల్లై నాన్ కణ్డ నల్లదువే" అని ఆழ్వార్లు పలికారని నమ్బిళ్ళై ఈడులో వ్యాఖ్యానిస్తూ, ఈవిధంగా భగవానుని చరిత్రలను స్మరించి నంతమాత్రంలోనే మోహాన్ని పొందిన వారున్నారు- అనే విషయాన్ని తెలుపడంకోసం ఈ క్రింది ఐతిహ్యాన్ని ఉదాహరించారు.

కూరేశులు తిరువాయ్మొழிపాశురాలకు వివరణాన్ని అనుగ్రహించేటపుడు పిళ్ళై ఉఱఙ్గావిల్లిదాసర్ ఆ పాశురాలలో చాలా అభినివేశాన్ని కల్గి, భగవానుని

పరత్వాన్ని, సౌలభ్యాన్ని గూర్చి పలు వచనాలను పల్కి ఆనందబాష్పాలు కారుస్తూ మనస్సులోపల ద్రవించేవారు. వారి, ఆ స్థితిని చూచి కూరేశులు "మహాభాష్యాదిశాస్త్ర గ్రంథాలను పఠించి, చాలా సమర్థవంతంగా వివరించడానికి తగిన కఠినమైన మనస్సును ధరించగల్గిన మనవలెకాకుండా, భగవానుని కల్యాణగుణాలను గూర్చి చెప్పగానే మనస్సు లోపల ద్రవించే మీ జన్మ ఎంత గొప్ప జన్మ! అని ప్రశంసించే వారట.

ఇటువంటి కూరేశులు వీరనారాయణపురమనే కాట్టుమన్నార్‌కోయిల్‌కు వేంచేసినపుడు, తమ ఒడిలో ఒక ఆడపిల్లను పెట్టుకొని, కొంతమంది దివ్యప్రబంధం సంత చెబుతూ ఉన్నారు. అపుడు కూరేశులు **"కళ్వన్ కొల్ యానఱియేన్ కరియాన్ ఒరు కాళై వన్దు"** అనే తిరుమంగైయాళ్వార్ పల్కిన పాశురాన్ని సంత నేర్పిస్తూ ఉన్నారు. (పరకాలనాయకిని భగవానుడు పిలుచుకొని పోయిన విషయాన్ని తెలిసిన ఆమె తల్లి విలపించే రీతిలో ఈ దశకం ఉన్నది) ఈ పాశురాన్ని కూరేశులు పలికేటపుడు వారి ఒడిలో ఉండే ఆడపిల్లను ఆమె భర్త పిలుచుకొని వెళ్ళిపోయాడు. అపుడు వారికి **"కళ్వన్‌పోల్"** దశకంలోని అర్థం మనస్సులో స్మరణకు వచ్చినందున, పరకాలనాయకిని భగవానుడు పిలుచుకొని వెడుతున్నట్లు భావించి, మోహించి, ఇక సంతను చెప్పలేక నేలపై పడ్డారు. ఈ రీతిలో ఆళ్వార్ల పాశురాలలో అభినివేశాన్ని పొందే కూరేశులు కదా తమను కఠిన హృదయాన్ని కల్గినవారుగా పల్కుతూ, పిళ్ళై ఉఅజ్గావిల్లిదాసర్‌ను గొప్ప మనస్సును కలవారని పొగడారు. (పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానంలో ఈ ఐతిహ్యప్రస్తావన కన్పిస్తుంది.)

శ్రీరామానుజులు పగటికాలం అంతా శ్రీభాష్యంలోనే అభినివేశాన్ని పొంది ఉండేవారు. రాత్రి పాలను ఆరగించిన తరువాత, శయ్యపై వేంచేసి "సంతను చెప్పుకోవడానికి రమ్మ''ని శిష్యులను పిలిచేవారు. మొదటిసారి సంతను చెప్పే టపుడు పాశురంలో నిమగ్నులై పులకాంకురాన్ని పొందేవారు. రెండవసారి చెప్పే టపుడు మనస్సులో శైథిల్యాన్ని పొందేవారు. ఏదైనా ఒక పాశురం యొక్క అర్థంలో అభినివేశాన్ని పొందినట్లయితే పలు ఉత్తరీయాలతో కన్నీరుతుడిచే అవధిలో శ్రీరామానుజులు కన్నీరు కార్చేవారు. ఈ ఐతిహ్యం నమ్బిళ్ళైవ్యాఖ్యానంలో కూడా ఉన్నది.

ఈ సందర్భంలోనే ఇంకొక ఐతిహ్యం చెప్పబడింది. నంజీయర్ మేల్‌నాడులో వేదాంతి అనే పేరుతో అద్వైతిగా ఉండే కాలంలో భట్టర్ వైభవాన్ని వారికి తెలిపి,

వారి వైభవాన్ని భట్టర్‌కు తెలిపి, వారిద్దరు కలువడానికి కారణమైన వారు తిరుమళ్లిశైదాసర్ అనేవారు. ఒకానొక సమయంలో నంజీయర్, తిరుమళ్లిశైదాసర్ ఏకాంతంగా ఉండేటపుడు వారిద్దఱు తిరువాయ్‌మొళ్లిని అనుసంధిస్తున్నారు. అపుడు ఆ దారిలో వచ్చిన ఆణ్డాన్, వారిద్దఱు తిరువాయ్‌మొళ్లి ద్వారా భగవద్గుణానుసంధానాన్ని చేస్తున్న దశకు భంగం కల్గించకూడదని వారి వెనుక మెల్లిగా కూర్చుని ఉన్నారు. అయితే ఆ విషయాన్ని గమనించిన నంజీయర్ ఆణ్డాన్ పట్ల ఉండే గౌరవం కారణంగా లేవడానికి ప్రయత్నించగా, లేవవద్దని తన చేతితో అడ్డుకొన్న ఆణ్డాన్ "మీరు కోవెలలో రహస్యంగా చేసే పని ఇదేనా!'' అని అడిగారు. అపుడు నంజీయర్ "తిరువాయ్ మొళ్లిని నేర్చుకొన్నది భట్టర్ సన్నిధిలో కదా! అందువవల్లనే కదా తిరువాయ్‌మొళ్లి పట్ల మాకు ఇంతటి అభినివేశం కల్గింది.'' అని అన్నారట. ఈ ఐతిహ్యం నమ్బిళ్ళై వ్యాఖ్యలో కూడా ఉన్నది. (ఈ ఐతిహ్యంలో ప్రస్తావింపబడిన ఆణ్డాన్ ముదలియాణ్డాన్ కుమారులైన కన్దాడై ఆణ్డాన్ కావచ్చు.)

శ్రీరంగంలో శ్రీరంగనాథుడు ఆరగించడంకోసం సిద్ధం చేసిన ప్రసాదాలను శ్రీరామానుజులు **"ఇంత కరియముదు, ఇంత నెయ్యి"** అని పరిమితిని నిర్ణయించి పంపించేవారు, ఆ ప్రసాదాలను శ్రీరంగనాథుడు ఆరగించడంకోసం తీసికొని వెళ్ళేటపుడు "పెరుమాళ్ళు ఆరగించడానికి ముందు, ఆరగించిన తరువాత నాకు ఒక పర్యాయం చూపించండి'' అని కోవెలలోని పరిచారకులను ఆదేశించారు. వారు కూడా శ్రీరామానుజులు ఇందులో అభిప్రాయమేమో తెలియకుండానే ప్రతిదినం వారు చెప్పినట్లు చేశారు. ఒకనాడు పెరుమాళ్ళకు ఆరగింపు చేసిన తరువాత తన వద్దకు తీసికొని వచ్చి చూపించిన ప్రసాదాన్ని చూచి, శ్రీరామానుజులు "స్వామీ! కనీసం ఒక నాడు అయినా ఈ ప్రసాదాన్ని ఆరగించిన గుర్తు ఇందులో తెలిసేటట్లు ఆరగించరాదా?'' అని అన్నారట. ఈ ఐతిహ్యం నమ్బిళ్ళై వ్యాఖ్యలో కూడా ఉన్నది.

కిడాంబి ఆచ్చాన్ కూరేశుల దగ్గర తిరువాయ్‌మొళ్లి కాలక్షేపం ఆలకించే సమయంలో ఒకనాడు చాలా ఆలస్యం చేసి తిరిగి వచ్చారు. అపుడు శ్రీరామానుజులు ఈనాడు ఎందుకు ఇంత ఆలస్యమైనది?'' అని అడిగారు. అపుడు ఆచ్చాన్ "కూరేశులవద్ద తిరువాయ్‌మొళ్లి అర్థాన్ని విన్నందువల్ల ఆలస్యమైనది- అని బదులిచ్చారు. "ఈనాడు కూరేశులు ఏ తిరువాయ్‌మొళ్లిని (దశకాన్ని) వివరించారు? అని శ్రీరామానుజులు అడిగారు. **"పిఱన్ద వాఱుమ్"** (5-10) అనే

దశకాన్ని కూరేశులు వివరించారని ఆచ్చాన్ అన్నారు. "అందులో కూరేశులు ఏమి చెప్పారు?" అనే శ్రీరామానుజుల ప్రశ్నకు "ఏమీ చెప్పలేదు" అని ఆచ్చాన్ బదులిచ్చారు. "అయితే కూరేశులు చెప్పినది ఏమి? నీవు విన్నది ఏమి?" అని శ్రీరామానుజులనగా, "ఈ దశకాన్ని వివరించారని ఆరంభించిన ఆళ్వాన్ మొదట ఒకసారి పాశురాన్ని అనుసంధించారు. వెంటనే దాని అర్థం మనస్సులో మెదలగా మనస్సు కరగి, ఆళ్వార్ల ఈడు పాడును తలుస్తూ, చిరకాలం కన్నీరు మున్నీరయ్యారు. "ఆహా! ఈ ఆళ్వార్లు ఎటువంటివారు? వీరికి ఉండే అభినివేశం, అటువంటి అభినివేశం లేని నేను ఏ రీతిలో వివరించగలను?" అని పల్కి "ఈనాటికి నేను చెప్పగల్గినది ఇంతే విడచిపెట్టండి - అని ఆనాటి కాలక్షేపాన్ని పూర్తి చేశారు - అని ఆచ్చాన్ అన్నారు. దీనిని విన్న శ్రీరామానుజులు "కూరేశుల అభినివేశం ఎంత గొప్పది!" అని వారిని ప్రశంసించారు. ఈ ఐతిహ్యం నమ్పిళ్ళై వ్యాఖ్యలో కూడా ప్రస్తుతమైనది.

ఏ శబ్దమైనా భగవద్వాచకమనే దానికి శ్రీరామానుజుల శ్రీభాష్యంలో పల్కిన ఒక సూక్తినమ్పిళ్ళై వ్యాఖ్యలో ఉదాహరింపబడింది. **"తత్తు సమన్వయాత్"** అనే సూత్రంలో- ప్రవృత్తిని వృత్తులకు ఉపయోగపడని వేదాంతవాక్యాలు పురుషార్థపర్యవసానాన్ని కల్గినవి కానందున ప్రమాణం కాదనే పూర్వపక్షం రాగా, అవి నిరతిశయానందరూప పరబ్రహ్మ ప్రతిపాదకాలైనందున వాటికి పరబ్రహ్మ విషయంలో ప్రమాణాలు అవుతున్నాయి- అని శ్రీరామానుజులు తెలిపారు. ఆ రీతిలోనే **"ఞానప్పిరానై ఆల్లాలిల్లై నాన్ కణ్డనల్లదు"** అనే వాక్యంలోని వరాహస్వామి అనే పరబ్రహ్మం నిరతిశయ ఆనందస్వరూపుడైనందున దానిని తెలిపే ఈ వాక్యం ప్రమాణమే అవుతుంది. అంటే, ఇది ఇతరులు అనుసంధించదగిన నమ్మికను కల్గించే వాక్యమే. ఒకవేళ నేను పల్కిన ఈ వాక్యం నమ్మికను కల్గించేది కాకుండా హీనోక్తే అయినా, ప్రయోజనాన్ని కల్గించని అసత్యవచనమే అయినా, దానిని పల్కడం మానను- అని ఆళ్వార్లు అంటున్నారని భావం.

**"జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత"** ఇత్యాది ప్రవృత్తి బోధక వాక్యాలు, **"న హింస్యాత్ సర్వాభూతాని"** ఇత్యాదినివృత్తి బోధక వాక్యాలు ప్రమాణమైనట్లే, **"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"** ఇత్యాది సిద్ధపరవాక్యాలు కూడా ప్రమాణాలే అని శ్రీరామానుజులు శ్రీభాష్యంలో సుస్థాపించారు. ఆవిధంగానే నేను పలికే **"ఞానప్పి

రానై యల్లాలిల్లై" అనే వాక్యం సిద్ధపరవాక్యమైనందున అది ప్రమాణమే; అందువల్ల నేను దానిని పలుకకమానను- అని ఇక్కడి తాత్పర్యం.

**"శానప్పిరానై యల్లాలిల్లై"** అని అంటూ భగవానుడే ఉపాయం, ఉపేయం, మఱి ఏదీకాదు'' అని ఆ*ళ్వా*ర్లు పల్కిన ఈ సూక్తిని వివరించేటపుడు పెరియ వాచ్చాన్‌పిళ్ళై ఈక్రింది ఐతిహ్యాన్ని ఉదాహరించారు.

ఒక పర్యాయం తిరుక్కోట్టియూర్‌నంబి శ్రీరంగంలో తిరునాళ్ళను సేవించడం కోసం వచ్చారు. అపుడు "భగవానుడు తప్ప వేఱేదీ రక్షకం కాదు'' అనే అర్థాన్ని వివరంగా శ్రీరామానుజులు తెలియజేయాలని భావించి, అది రహస్యంగా ఉపదేశింపవలసిన గొప్ప అర్థం కనుక, ఎవరూ లేని ఒక ఏకాంతమైన చోటకు శ్రీరామానుజులను పిలుచుకొని పోయి చుట్టూ చూచారు. అక్కడ కోవెలలో కైంకర్యం చేసేవాడొకడు గురకను పెట్టి నిద్రించడం చూచారు. "నేను రహస్యంగా ఉపదేశించే విషయం ఇతని చెవులలో పడితే అది దోషం అవుతుంది'' అని తలచి, అపుడు ఉపదేశించకుండానే తిరుక్కోట్టియూర్‌కు వెళ్ళిపోయారు. ఇంకొకసారి శ్రీరంగానికి వచ్చినపుడు చాలా రహస్యంగా ఆ అర్థాన్ని శ్రీరామానుజులకు ఉపదేశించారు. ఆ ఉపదేశాన్ని ఆలకించిన శ్రీరామానుజులు ఎండలో, కాళ్ళు కాలే మధ్యాహ్నసమయంలో ఆ వేడిమిని లెక్కించకుండా కూరేశుల ఇంటికి వెళ్ళారు. అపుడు భుజిస్తున్న కూరేశులను పిలిచి "తిరుక్కోట్టియూర్ నంబి ఎవరికీ చెప్పవద్దని పల్కి నాకు ఈ సూక్తిని చెప్పారు. అయితే, నేను మీకు చెప్పకుండా ఉండలేను'' అని అంటూ తిరుక్కోట్టియూర్ నంబి "భగవానుడే ఏ సహకారిని ఆశించని ఉపాయ''మనే విషయాన్ని తెలిపారు. ఈ ఐతిహ్యం నమ్పిళ్ళై వ్యాఖ్యలో కూడా ఉన్నది.

## ఫలశ్రుతి

**100.** నల్లార్ నవిల్ కురుగూర్‌నగరాన్, తిరుమాల్ తిరుప్పేర్
వల్లారడిక్కణ్ణి శూడియ మాఱన్ విణ్ణప్పమ్ శెయ్‌ద-,
శొల్లార్ తొడైయలిన్నూఱుమ్ వల్లార*ళు*న్దార్ పిఱప్పామ్
పొల్లా వరువినై, మాయవన్ శే*ఱ్ఱ్*ళ్ళల్ పొయ్‌న్నిలత్తే

నల్లార్ = సద్గుణాలను, సత్కార్యాలను కలవారైన మహానుభావులు, నవిల్= ప్రశంసిస్తూ పలికే, కురుకూర్ నకరాన్ = తిరుక్కురుకూర్ అనే తిరుపతిలో అవతరించినవారు, తిరు మాల్ = లక్ష్మీపతి అయిన భగవానుని, తిరు ప్పేర్ = తిరునామాలను, వల్లార్ = అభ్యసించినవారైన భక్తుల, అడి = శ్రీచరణాలనే, కణ్ణి= పూమాలికను, శూడియ = తమ శిరస్సుకు అలంకారంగా పెట్టుకొన్నవారైన, మాఱన్ = నమ్మాళ్వార్లు, విణ్ణప్పమ్ శెయ్ద = (భగవత్సన్నిధానంలో) విన్నపించిన, శొల్ ఆర్ తొడైయల్ = పల్కులతో కూర్చబడిన మాలికారూపంలోని, ఇ నూఱుమ్= ఈ నూఱు పాశురాలను, వల్లార్ = అభ్యసించగల్గినవారు, పిఱప్పు ఆర్ = సంసారానికి కారణం, కార్యం అయిన, పొల్లా అరు విసై = చెడ్డవి, పోగొట్టుకోవడానికి సాధ్యం కానివి అయిన ప్రాక్తన కర్మలనే, మాయమ్ = ఆశ్చర్యకరమైన, వల్ శేఱు అళ్ళల్ = క్రూరమైన (భయంకరమైన) చిక్కని దట్టమైన బుదరను కల, పాయ్ నిలత్తు = అసత్యమైన ప్రకృతిమండలంలో, అళున్దార్ = మునిగిపోరు. (ముక్తులు కాగలరు- అని భావం)

**భావదీపిక** : ఈ పాశురం, దీనికి ముందున్న పాశురం -అనే రెండు ఈ దివ్యప్రబంధానికి సమాపన (**శాఱ్ఱుముఱై**) పాశురాలు. ఈ దివ్యప్రబంధాన్ని అభ్యసించినవారు పొందే ఫలాన్నిగూర్చి పల్కి ఈ ప్రబంధాన్ని నిగమిస్తున్నది, ఈ పాశురం. అందువల్ల ఇది ఫలశ్రుతి పాశురం. (**"నూఱ్పయన్"**). **"ఞాన మనుట్టాన మివై నన్గాకవే యుడైయరాన"** (జ్ఞానానుష్ఠానాలను చక్కగా కల్గిన) ఆచార్యులను శరణంగా ఆశ్రయించి, వారి సంబంధమూలంగా భగవానుని దర్శించి అనుభవించే మధురకవులవంటివారైన మహనీయులచే ప్రశంసిస్తూ పలుకబడిన తిరుక్కురుకూర్- అనే ప్రసిద్ధమైన తిరునగరిలో అవతరించినవారు, భగవద్భాగవత విషయంలో భక్తి మిక్కిలిగా ఉన్నవారైన ఆళ్వార్లచే విన్నపం చేయబడినదై, భగవానుడు, ఇతరులు శిరసా వహించి ఆదరించదగిన భోగ్యమైన పూమాలిక అయిన ఈ దివ్యప్రబంధాన్ని అభ్యసించగల్గినవారు కర్మల తీరగా, జన్మలు నశించి, ముక్తిని పొందుతారు- అని ప్రబంధాధ్యయన ఫలం తెలుపబడింది.

కురుకూర్‌కు "నల్లార్ నవిల్" - అనే విశేషణాన్ని ప్రయోగించినందున అటువంటి దివ్యదేశంలో జన్మించినందుననే తమకు అటువంటి భక్తిరూపమైన గొప్ప ప్రేమ కల్గినది- అని ధ్వనిస్తుంది. ఈ విధంగా లోకవిలక్షణులైన ఆళ్వార్లు

అవతరించిన తిరునగరిని మహనీయులు స్తుతిస్తారని వేఱుగా చెప్పాలా! "కురుకూర్" అనేది సంస్కృత వ్యవహారనామం.

తిరువాయ్‌మొ*ழ్రి*లోని "పయిలుమ్ శుడరొళి", "నెడుమాఱ్కడిమై" మొదలైన దశకాలలో ఆ*ழ్వ్రా*ర్ల భాగవతభక్తి నిష్ఠ మిక్కిలిగా ప్రకాశిస్తున్నందున "తిరుమాల్ తిరుప్పేర్ వల్లారడిక్కణ్ణి శూడియ" అని తమకు ప్రయోగించుకొన్న విశేషణాలు చాలా పొసగుతాయి. మొదటి పాశురంలో "అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమే" అని ప్రారంభించినందుకు తగినట్లుగా ఇక్కడ "మాఱన్ విణ్ణప్పమ్ శెయ్‌ద" అని ఉపసంహారం చేయబడడం గమనార్హం.

"ఇన్నూఱుమ్" - అనేచోట నమ్బిళ్ళై ఈడు వ్యాఖ్యానసూక్తిని చూడండి. "మహాభారతమ్ పోలే పరన్దిరుత్తల్, ప్రణవమ్ పోలే శురుఙ్గి యిరుత్తల్ శెయ్యాదే, నూఱు పాట్టాయ్, జ్ఞాతవ్యాంశ మడఙ్గియ ఉణ్డాయిరుక్కై"- (మహాభారతంవలె విస్తృతంగా ఉండడం, ప్రణవం వలె సంగ్రహంగా ఉండడం కాకుండా, నూఱు పాశురాలను కల్గినదై, తెలియదగిన విషయాలను అన్నిటిని కల్గి ఉండడం.) అనేది ఆ సూక్తి. మహావివేకులు సైతం లోపలకు దిగితే, కాలు కదపలేని రీతిలో ముంచి వేసే స్వభావాన్ని కల సంసారాన్ని "మాయవన్ శే*ற్రు*ళ్ళల్ పొయ్‌న్నిలమ్" అని అనడం పొసగుతుంది. పరాత్పరుడైన భగవానుడు సైతం ఇందులోకి వచ్చి జన్మిస్తే అతనిని కూడా వ్యామోహమఱచి లోపలకు లాగి వేసే బలమైన పంకం కదా!

"పొయ్‌న్నిన్ఱ ఞానముమ్ పొల్లా వొ*ழ్ము*క్కుమ్ అ*ழ్ము*క్కుడమ్బుమ్ ఇన్నిన్ఱ నీర్మై ఇనియాముఱామై అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్" అని ఆరంభించి, "విణ్ణప్పమ్ శెయ్‌ద ఇన్నూఱుమ్ వల్లార్ అ*ழ్ము*న్దార్ పొయ్‌న్నిలత్తే" అని ముగించి నందున ఈ ప్రబంధం అంతా విరోధినిరసనం చేసి అనుగ్రహించాలని ఆ*ழ్వ్రా*ర్లు తమ అభిప్రాయాన్ని (సంసారనివృత్తిలోని అపేక్షను) విన్నపించిన వారయ్యారు.

నమ్బిళ్ళై, పెరియవాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యానాలలో "నల్లార్ నవిల్" అనే దానికి "లోకత్తిల్ సత్తుక్కళ్ అడఙ్గియ ఆ*ழ్వా*ర్ ఆ*ழ్వా*ర్- ఎన్నుమత్తనై" (లోకంలోని సత్పురుషులందఱు ఆ*ழ్వ్రా*ర్లు! ఆ*ழ్వ్రా*ర్లు అని స్మరిస్తారు.) అని వ్యాఖ్యానించిన కారణంచేత "నల్లార్ నవిల్" అనేది తిరుక్కురుకూర్‌కు విశేషణంగా కాకుండా, తిరుక్కురుకూర్‌లోని ఆ*ழ్వ్రా*ర్లకు విశేషణంగా గ్రహింపబడినట్లు

తెలుస్తున్నది. మహనీయులచే పొగడబడిన నమ్మాళ్వార్- అని భావం. **"తిరుమాల్ తిరుప్పేర్ వల్లారడిక్కణ్ణి శూడియ మాఱన్"** అని నైచ్యం స్ఫురించేటట్లు పలికే ఆళ్వార్లు తమను గూర్చి **"నల్లార్ నవిల్"** అనే గొప్ప విశేషణాన్ని ప్రయోగించి ఉంటారా?- అని శంకించే అవకాశం ఉన్నా, ఆళ్వార్ల నిస్సమాభ్యధికమైన ప్రభావాన్ని (సత్పురుషులచే అనవతరం పొగడబడే స్వభావాన్ని) సాక్షాత్తు చూచి గ్రహించి ఆచార్యులు ఈ విధంగా వ్యాఖ్యానించడం పొసగుతుంది. **"ఏఱుక్కుమ్ పెరుమ్ పుకళ్ వణ్కురుకూర్ శడకోపన్"** (తగిన గొప్ప కీర్తిని కల, గొప్ప కురుకురు కాపురికి నాథులైన శఠకోపులు) అని ఆళ్వార్ తాముకూడా ఒడలు మఱచి అనుగ్రహించే రీతిలోకదా వారి ప్రభావమున్నది.

**"మాఱన్"** -తిని, తిరిగి సంతోషించే (**"ఉణ్డియే ఉడైయే ఉకన్దు ఓడుమ్)** లోకుల స్వభావానికి విరుద్ధంగా, **"ఉణ్ణుమ్ శోఱు పరుకు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్"** (భుజించే అన్నం, తాగే నీరు, అనుభవించే తాంబూలం అన్నీ శ్రీకృష్ణుడే) అని తలచి ఉన్నందున ఆళ్వార్ **"మాఱన్"** అనే తిరునామాన్ని పొందారు.

శ్రీమదణ్ణంగరార్యోక్తాం రమ్యాం దివ్యార్థదీపికామ్ ।
శ్రీవృత్తాఖ్యప్రబంధస్య ద్రావిడీం వివృతిం స్మరన్ ॥

భావప్రకాశికావ్యాఖ్యా మాంధ్రవాణ్యా వ్యలీలిఖత్ ।
దాసః శ్రీశింగరాచార్యః మిత్రవాక్యప్రచోదితః ॥

మమాజ్ఞానాత్ ప్రమాదాద్వా దోషా యే విహితా ఇహ ।
తాన్ సర్వాన్ క్షంతుమర్హంతి వత్సలాః సదసద్విదః ॥

జయతు జయతు నిత్యం సూరిముఖ్యః శఠారిః
జయతు జయతు తస్య వృత్తాఖ్య స్తదీయప్రబంధః ।
జయతు జయతు తత్రార్యోక్త రస్యార్థ రాశిః
జయతు జయతు తస్యాం సక్తచిత్తో మహాత్మా ॥



## అనుబంధం-1

# తిరువిరుత్తప్రబంధంలో శృంగారరస (అకప్పొరుళ్) ప్రక్రియాప్రకారాలు

1. నమ్మాళ్వార్లు అనుగ్రహించిన నాల్గు ప్రబంధాలలో తిరువిరుత్తమ్ కట్టళైక్క లిత్తుఱై అనే ఛ్చందస్సులో రచింపబడినదై, మండల అన్దాది ప్రక్రియను అనుసరిస్తున్న 100పాశురాలను కల్గిన ప్రబంధం. ఇది మొదటి ప్రబంధం. ఇందులో శాబ్దికమైన అన్దాది ప్రక్రియయే కాక, ఆర్థికమైన అన్దాది క్రమం కూడా ఉన్నది. ఇందులో తలైవన్ (నాయకుడు), తలైవి (నాయకి), తోழி (సఖి, చెలికత్తె), శెవిలి (పెంపుడు తల్లి), నற்றாయ్ (కన్నతల్లి), కట్టువిచ్చి (సోదెను చెప్పే కోయవనిత), పాఙ్గన్ (స్నేహితుడు)- మొదలైనవారి భావనారూపంగా, వారు పలికే వచనాల రూపంగా ఈ పాశురాలున్నాయి.
2. అకప్పొరుళ్ (గార్హస్థ్య జీవన) ప్రణయప్రకారాలలోని వృత్తాంతాలను- నాయకుడు నాయకిని మొదటగా చూడడంనుండి మొదలుకొని, రహస్యంగా వారిద్దరు కలసికొన్న తర్వాత, నాయకిని గ్రామం (నాడు) అంతా తెలిసే విధంగా వివాహం చేసికొని, వివాహజీవితంలో సంభవించే వియోగాలను అనుభవించి, సుఖజీవనాన్ని సాగించేవరకు ఉండే వృత్తాంతాలను క్రమాను సారంగా నిబద్ధం చేసి వరుసగా గ్రంథనం చేసిన ప్రకారం **"ఇఱైయ నార్ కలవియల్"** అనే గ్రంథంయొక్క వ్యాఖ్యానంనుండే ఆరంభ మైనది. తరువాత మాణిక్కవాచకర్ రచించిన **"తిరుక్కో వైయార్"**అనే గ్రంథం గార్హస్థ్యజీవన వృత్తాంతాలను **(అకప్పొరుళ్ శెయ్దికళ్)** క్రమబద్ధంగా అమర్చబడిన రీతిలో తెలుపుతున్నది. **"నాఱ్కవిరాశనమ్బి"** రచించిన **"అకప్పొరుళ్ విళక్కమ్"** అనే గ్రంథాన్ని, దానికి ఉదాహరణగ్రంథమైన **"తఞ్జవాణన్ కోవై"**ను అనుసరించే అనంతర కాలంలోని కోవైగ్రంథాలు అన్నీ ఆవిర్భవించాయి.
3. **"కోవై"** వర్గానికి చెందిన కావ్యాలలో నాయకులు - **"పాట్టుడై త్తలైమకన్"** (కావ్యనాయకుడు), **"కిళవి త్తలైమకన్"** (శృంగార నాయకుడు) అని రెండు రీతులలో ఉంటారు. **"పాట్టుడైత్తలై మకన్"**కు చెందిన వృత్తాంతాలు నేరుగా చెప్పబడతాయి తప్ప, అతనితో అన్వయించి శృంగారవృత్తాంతాలు చెప్పబడవు. **"అకప్పొరుళ్ శెయ్దికళ్"** (ప్రణయవృత్తాంతాల)కు సంబధించిన నాయకుడు

**"కిళవిత్తలైమకనే"**. అతని నిజనామం కావ్యంలో చెప్పబడదు. అతని నిజ నామం చెప్పబడితే ఆ పాశురం **"అకప్పాడల్"** (ప్రణయాత్మకమైన పాశురం) కాబోదు. అది **"అకపుఱప్పాడల్"** అనబడుతుంది. **"పాట్టుడై త్తలైమకన్"**కు ఏమాత్రం చోటు లేకుండా కేవలం కిళవిత్తలైమకన్‌తోనే రచింపబడిన **"అమ్బికాపతికోవై"** వంటి కోవై గ్రంథాలు కూడా ఉన్నాయి.

4.1) తిరువిరుత్తప్రబంధంలో భగవానుని నామోట్టకంనపూర్వకంగా అతనిని **"కిళవిత్తలైమకన్"**గా కల్గిన పాశురాలు 74 ఉన్నాయి. అవి అన్నీ అకప్పాడల్ కావు. అకప్పుఱప్పాడల్ మాత్రమే.

2) తిరువిరుత్తంలో నాయకి పలికే మాటగా కన్పించే పాశురాలు- 56 అవి-3, 4, 7, 8, 12, 13, 16, 17, 25, 27-32, 35, 38, 39-46, 48, 49, 51, 52, 54, 56, 63, 64, 70, 71, 72, 74, 76, 77, 78, 79, 80, 82, 84, 85, 86, 88-93, 95, 96, 97, 99- అనే క్రమసంఖ్యలను కల్గినవి.

3) సఖీవచనంగా గోచరించే పాశురాలు - 21. అవి - 2, 5, 15, 18, 19, 20, 21, 22, 33, 34, 36, 58, 61, 62, 68, 69, 73, 81, 83, 87, 88- అనే క్రమసంఖ్యలను కల్గినవి.

4) నాయకుని వచనంగా కనబడే పాశురాలు- 14. అవి- 6, 9, 10, 11, 14, 23, 26, 50, 55, 57, 65, 66, 67, 75-అనే క్రమసంఖ్యలను కల్గినవి.

5) పెంపుడు తల్లి **(శెవిలిత్తాయ్)** వచనంగా కన్పించే పాశురాలు5. అవి-19, 24, 47, 59, 60- అనే క్రమసంఖ్యలను కల్గినవి.

6) కన్నతల్లి **(నర్ఱాయ్)** వచనంగా కన్పించే పాశురం 37 వ పాశురం.

7) కట్టువిచ్చివచనం- 53వ పాశురం

8) నాయకుని సఖుని **(పాఙ్గన్)** వచనం - 94వ పాశురం

9) నాయకి బాధపడుతూ పలికే పాశురాలు - 37. అవి- 3, 4, 7, 8, 12, 13, 17, 25, 28, 29, 30, 31, 35, 40, 41, 46, 49, 51, 52, 64, 70, 71, 76, 77, 78, 79, 80, 82, 85, 86, 88, 89, 90, 92, 93, 97-అనే వరుస క్రమసంఖ్యను కల పాశురాలు.

10) నాయకి ఆనందంగా పలికే పాశురాలు-17. అవి 16, 27, 32, 38, 39, 42, 43, 44, 45, 47, 48, 54, 56, 63, 74, 84, 99-అనే క్రమసంఖ్యలను కల్గినది.

11) సఖి విచారిస్తూ పలికే వచనాలు-8. అవి 5, 18, 19, 62, 68, 73, 83, 87- అనే క్రమసంఖ్యలను కల్గినవి.

12) పెంపుడు తల్లి విచారిస్తూ పలికే పాశురాలు-5. అవి-19,24,47,59,60- అనే క్రమసంఖ్యలను కల్గినవి.

13) సఖి నాయకుని ఉద్దేశించి పలికే పాశురాలు- 9. అవి- 15,22, 33, 34, 36, 58, 61, 62, 98- అనే క్రమసంఖ్యలను కల్గినవి.

14) తిరువిరుత్తంలో **"కిళవిత్తలైవన్"** కు చెందిన 26. పాశురాలే **"అకప్పొరుళ్"** పాశురాలు. అవి **"కోవై"** ప్రబంధాలతో అన్వయించి, పరిశీలించదగినవి. అవి- 6, 7, 8, 9, 10, 11, 14, 15, 16, 17, 18, 22, 23, 26, 29, 37, 49, 50, 51, 55, 57, 65, 66, 67, 68, 75- అనే క్రమసంఖ్యలను కల్గినవి.

15) వీటిలో **"కళవు"** (రహస్యసంగమకాలానికి) కు చెందినవి 17. పాశురాలు **"కఱ్పు"**కు (గృహస్థ-పాతివ్రత్య ధర్మానికి) కాలానికి చెందినవి. 8 పాశురాలు. రెండిటికి సంబంధించిన పాశురం-1.

**"కళవు"**కు చెందిన పాశురాల వివరం.

ఎ) నాయకి సౌందర్యాన్ని చూచి నాయకుడు ఆశ్చర్యంగా పలికే పాశురం-6వ పాశురం.

బి) నాయకుడు నాయకి సౌందర్యాన్ని శ్లాఘించడం 14, 55వ పాశురాలలో కన్పిస్తుంది.

సి) నాయకి చూపులో అభినివేశాన్ని పొందిన నాయకుడు తన సఖునితో పల్కడం-65వ పాశురంలో కన్పిస్తుంది.

డి) నాయకుని చెలికానితో తన బలహానిని గూర్చి (విరహాసహిష్ణుతను) పల్కడం-67వ పాశురంలో ఉన్నది.

ఇ) నాయకుడు తన చెలికాడు పల్కిన మాటలను తిరస్కరిస్తూ అతనికి బదులివ్వడం- 57,66వ పాశురాలలో ఉన్నది.

ఎఫ్) నాయకుడు నాయకి చెలికత్తెతో తన ప్రేమను తెల్పి, ఆమెను అంగీకరింప జేయడం- 10,23వ పాశురాలలో కన్పిస్తుంది.

జి) నాయకుడు నాయకిని, ఆమె సఖిని బదులు కోసం ప్రశ్నించడం -75వ పాశురంలో ఉన్నది.

హెచ్) సఖి నాయకుని చూచి పరిహసించడం - 22వ పాశురంలో ఉన్నది.

ఐ) సఖి నాయకుని అభిప్రాయాన్ని గ్రహించి పల్కడం-15వ పాశురంలో ఉన్నది.

జె) నాయకి సముద్రాన్ని చూచి నాయకుని రథచక్రపు చిహ్నాలను చెరిపి వేయవద్దని అనడం - 17వ పాశురంలో ఉన్నది.

కె) సముద్రఘోషను విని తాళలేని నాయకి బాధపడడం-51వ పాశురంలో ఉన్నది.

ఎల్) నాయకి హంసలను గర్హిస్తూ పల్కడం-29వ పాశురంలో ఉన్నది.

ఎమ్) తనతోపాటుగా కలసివచ్చిన నాయకికి నాయకుడు నగరాన్ని చూపడం-26వ పాశురంలో ఉన్నది.

ఎన్) కన్నతల్లి తన కూతురు ప్రయాణం చేసే నగరం యొక్క దుర్గమత్వాన్ని పల్కి బాధపడడం - 37వ పాశురంలో ఉన్నది.

### "కఱ్పు" (పతివ్రతాధర్మ) కాలానికి చెందిన పాశురాలు

1. నాయకుడు ధనసంపాదనార్థం తనను విడచివెళ్ళిన సంగతిని గ్రహించి, దానిని తన చెలికత్తెతో పల్కడం- 8వ పాశురంలో
2. నాయకుడు నాయకిని విడచి వెళ్ళడంలోని దుష్కరత్వాన్ని పల్కడం - 9వ పాశురంలో
3. వియోగాన్ని సహించలేని నాయకియొక్క మార్పును చూచి నాయకుడు పల్కడం 11వ పాశురంలో
4. చీకటికి తాళలేని నాయకి సఖితో పల్కడం- 49వ పాశురంలో
5. వర్షాకాలాన్ని చూచి బాధపడే నాయకి అసహిష్ణుతను చూచి సఖి విచారించడం-18వ పాశురంలో
6. కాలభ్రాంతి - 7వ పాశురం, 68వ పాశురంలో
7. నాయకుడు తన పునరాగమనాన్ని ఉద్దేశించి చెలికానితో పల్కడం- 50వ పాశురంలో

**"కళవు, కఱ్పు" కాలానికి చెందిన పాశురం ఒకటి**

నాయకుని విశ్లేషించిన నాయకి సఖిని చూచి విరహంతో రాత్రి సమయాన్ని గడుపలేనని అనడం - 12వ పాశురంలో



## అనుబంధం-2

# ప్రథమ - చరమ ప్రబంధ సంగతి

నమ్మాళ్వార్లు అనుగ్రహించిన నాల్గు దివ్యప్రబంధాలలో ప్రథమ ప్రబంధమైన తిరువిరుత్తంలోని నూఱు పాశురాలలో, చరమప్రబంధమైన తిరువాయ్ మొళిలోని నూఱు దశకాలకు (పదికాలకు) మధ్యగల పరస్పరం ఆర్థికంగా ఉండే సామ్యాన్ని తెలిపే రీతిలో పెద్దలు చూపిన వివరం ఈక్రింది తెలుపబడుతున్నది. దీనికి **"తిరువిరుత్త-తిరువాయ్మొళి ఐకకంఠ్యమ్"** అని పేరు. ఇక్కడ చూపబడిన అర్థసామ్యాన్ని, ఈ రెండు దివ్యప్రబంధాల పాశురాలద్వారా, వాటికి పూర్వాచార్యులు అనుగ్రహించిన వ్యాఖ్యానాల ద్వారా సంప్రదాయార్థ నిపుణుల పెద్దల సన్నిధిలో గ్రహించాలి. **"ఋక్కు, సామత్తాలే** సరసమాయ్, **స్తోభత్తాలే** పరమ్బుమాపోలే, **శొల్లార్ తొడైయల్, ఇశైక్కూట్టి, అమర్శువై యాయిరమాయ్త్తు"** అనే ఆచార్యహృదయ చూర్ణికవల్ల, దాని వ్యాఖ్యానంవల్ల, ఋగ్వేదం సామవేదరూపంగా విస్తరించినట్లుగా, ఋగ్వేద స్థానమైన తిరువిరుత్తం నూఱు పాశురాలే సామవేదస్థానమైన తిరువాయ్ మొళిలోని వేయి పాశురాలుగా విస్తరించిందని తెలుస్తున్నందున, ఆ స్వభావాన్ని వివరించే ఈ ప్రథమ చరమప్రబంధసంగతి, సంప్రదాయ గ్రంథకాలక్షేప పరులకు మిక్కిలి ఉపయోగకరం.

1. పొయ్న్నిన్ఱ - ఒళివిల్ కాలమ్ (3-3)
2. శెళునీర్ - కోవై వాయాళ్ (4-3)
3. కుళల్కోవలర్ - వెళ్ళెచ్చురి
4. తని నెఞ్జమ్ - ఓడుమ్ పుళ్ళేఱి (1-8)
5. పనిప్పియల్వాక - మాయా వామననే
6. తడావియ వమ్బుమ్ - ఉణ్ణుమ్ శోఱు (6-7)
7. ఞాలమ్ పనిప్ప - ఇన్నుయిర్ చ్చేవలుమ్ (9-5)
8. కాణ్కిన్ఱనకళుమ్ - కైయార్ శక్కరమ్ (5-1)
9. తిణ్ పూఞ్జుడర్ - పొలిక పొలిక (5-2)
10. మాయోన్ వడ - నెడుమాల్కడిమై (8-10)
11. అరియనయామిన్ఱు - మాలుక్కు (6-6)
12. పేర్కిన్ఱదు మణిమామై - మాశఱు శోది (5-3)
13. తనివళర్ శెఙ్గోల్ - మల్లికై కమళ్ (9-9)

14. ఈర్వన వేలుమ్ - తువళిల్ మామణిమాడమ్ (6-5)
15. కయలో నుమ కణ్కళ్ - కణ్ణన్ కళ్ళలిణై (10-5)
16. పలపల వూళ్ళికళాయిడుమ్ - పయిలుమ్ శుడరొళి (3-7)
17. ఇరుళ్ విరిన్దాలన్న - అణైవదరవణైమేల్ (2-8)
18. కడల్ కొణ్డెళ్ళున్దదు - శూళ్ళ్ విశుమ్బు (10-9)
19. కారికైయార్ నిఱై - పాలనాయ్ (4-2)
20. శిన్మొళ్ళి నోయో - తీర్ప్పారై యామిని (4-6)
21. శూట్టు నన్మాలైకళ్ - వీఱ్ఱిరున్దేళ్ళులకుమ్ (4-5)
22. కొమ్బార్ తళ్ళై - నల్కురవుమ్ (6-3)
23. పునమో పునత్తయలే - కడల్ ఞానమ్ (5-6)
24. ఇయల్వాయిన - కరుమాణిక్క మలై (8-9)
25. ఎజ్గోల్ వళైముదలా - మాయక్కూత్తా (8-5)
26. నానిలమ్ వాయ్కొణ్డు - మాలైనణ్ణి (9-10)
27. శేమమ్ శెజ్గోన్ - ఎల్లైయుమ్ కాలైయుమ్ (8-6)
28. తణ్ణన్తుళ్ళాయ్ - కజ్గులుమ్ పకలుమ్ (7-2)
29. ఇన్నన్న తూదు - పొన్నులకాళీరో (6-8)
30. అన్నమ్ శెల్వీరుమ్ - అఞ్జిఱైయ మడనారాయ్ (1-4)
31. ఇశైమిన్ - ఎజ్గానలకజ్గళ్ళివాయ్ (9-7)
32. మేకజ్గళో వురైయీర్ - వైకల్ పూజ్గళ్ళివాయ్ (6-1)
33. అరుళార్ తిరు - ఏఱాళుమ్ (4-8)
34. శిదైక్కిన్ఱదాళ్ళి - మిన్నిడై మడవార్ (6-2)
35. పాల్వాయ్ ప్పిఱై - వాయుమ్ తిరైయుకళుమ్ (2-1)
36. తుళ్ళా నెడుమ్ - ఆడియాడి (2-4)
37. కొడుజ్గాల్చిలైయర్ - మణ్ణైయిరున్దుళ్ళావి (4-4)
38. కడమాయినకళ్ - శొన్నాల్ విరోదమ్ (3-9)
39. నీలత్తడవరై - ఏళ్ళైయరావి (7-7)
40. కోలప్పకల్ కళిఱు - మానేయ్ నోక్కు (5-9)
41. ఎన్ఱుమ్ పున్వాడై - నీరాయ్ నిలనాయ్ (6-9)
42. వన్కాఱ్ఱఱైయ - పెరుమా నీళ్పడై (1-10)
43. కణ్ణుమ్ శెన్దామరై - ఉయర్వఱ (1-1)

44. నిఱముయర్ కోలముమ్ - పత్తుడై యడియవర్ (1-3)
45. పెరుమ్ కే*ళ*లార్ - ఊనిల్ వా*ళ్* (2-3)
46. మడ నెఞ్జమెన్ఱుమ్ - అరుళ్ పెరువార్ (10-6)
47. తిరిక్కిన్ఱదు వడమారుతమ్ - నఙ్గళ్ వరివళై (8-2)
48. మెల్లియలాక్కై - ఎన్ఱైక్కు మెన్ఱై (7-9)
49. పణ్డుమ్ పలపల - ఊరెల్లామ్ తుఞ్జి (5-4)
50. ఒణ్ణుదల్మామై - కిళరొళియిళమై (2-10)
51. మలైకొణ్డు మత్తా - నణ్ణాదార్ (4-9)
52. అ*ళై*క్కుమ్ కరుఙ్కడల్ - అన్దామత్తన్బు (2-5)
53. వారాయిన ములైయాళ్ - వైకున్దా మణివణ్ణనే (2-6)
54. వీశుమ్ శిఱకాల్ - కేశవన్తమర్ (2-7)
55. వణ్డుకళో వమ్మిన్ - శార్వే తవనెఱి (10-4)
56. వియలిడముణ్డ పిరానార్ - కణ్గళ్ శివన్దు (8-8)
57. పులక్కుణ్డలమ్ - ముడియానే (3-8)
58. క*ళ*ఱలమొన్ఱే - తిణ్ణన్ వీడు (2-2)
59. అళప్పరున్దన్మైయై - మున్నీర్ ఞాలమ్ (3-2)
60. ములైయో ము*ళు* - అఱుక్కుమ్ వినై (9-8)
61. వాశకమ్ శెయ్వదు - పిఱన్ద వాఱుమ్ (5-10)
62. ఇఱైయో విరక్కినుమ్ - తేవిమారావార్ (8-1)
63. వణ్ణమ్ శివన్దుళ - ఇవైయు మవైయుమ్ (1-9)
64. ఇరుక్కార్ మొ*ళి* - పామరు మూవులకుమ్ (7-6)
65. క*ఱ్ఱు* ప్పిణైమలర్ - నో*ఱ్ఱ* నోన్బు (5-7)
66. ఉణ్ణాదుఱఙ్గాదు - ఆరావముదే (5-8)
67. కావియుమ్ నీలముమ్ - ఉలకుముణ్డ పెరువాయా (6-10)
68. మలర్న్దేయొ*ళి*న్దిల - కొణ్డపెణ్డిర్ (9-1)
69. కారే*ఱ్ఱి*రుళ్ - కఱ్పారిరామపిరానై (7-5)
70. వళైవాయ్ త్తిరు - పిఱవి త్తుయరఱ (1-7)
71. ఊ*ళి*కళాయ్ - ఎఙ్గనేయో (5-5)
72. శూ*ళ్*కిన్ఱ కఙ్గుల్ - శీలమిల్లా (4-7)
73. వాల్ వెణ్ణిలవు - వేమరు తోళిణై (10-3)

74. తళర్న్దుమ్ ముఱిన్దుమ్ - శెయ్యతామరై క్కణ్ణన్ (3-6)
75. ఉలాకిన్ఱ కణ్డై - శన్మమ్ పలపల (3-10)
76. ఇడమ్ పోయ్ విరిన్ద - ఓరాయిరమాయ్ (9-3)
77. తిఙ్గళమ్ పిళ్ళై - తాళతామరై (10-1)
78. నలియు నరకనై - ఇన్బమ్ పయక్క (7-10)
79. వేదనై వెణ్పురి - మొయ్మ్మామ్ పూమ్బొ*ழி*ల్ (3-5)
80. శీరరశాణ్డు - ముడిచ్చోదియాయ్ (3-1)
81. ఉరుకిన్ఱ కన్మఙ్గళ్ - వీడుమిన్ ము*ఱ్ఱ*వుమ్ (1-2)
82. ఎరికొళ్ శెఙ్ఞాయిఱు - ఉరుకు మాల్నెఞ్జమ్ (9-6)
83. విళరి కురలన్ఱిల్ - ఉణ్ణిలా వైయవరాల్ (7-1)
84. తైయనల్లార్కళ్ - మైయార్ కరుఙ్కణ్ణి (9-4)
85. మాణిక్కమ్ కొణ్డు - ఎమ్మావీట్టు (2-4)
86. అడైక్కలత్తోఙ్గ - వళవే*ழு*లకు (4-5)
87. పులమ్బుమ్ కనకురల్ - పణ్డై నాళాలే (9-2)
88. తిరుమాలురు - పుక*ழ్* నల్లొరువన్ (3-4)
89. తీవినై క్కారు - అఙ్గుమిఙ్గుమ్ (8-3)
90. తలైప్పెయ్ది యాన్ - కురవై ఆయ్చ్చియరోడు (6-4)
91. శురుఙ్గుఱి వెణ్ణెయ్ - వార్కడావరువి (8-4)
92. పేణలమిల్లా - ఆ*ழி*యెழ (7-4)
93. కాలై వెయ్యోఱ్కు - ఒరునాయకమాయ్ (4-1)
94. మైప్పడి మేనియుమ్ - ఇరుత్తుమ్ వియన్దెన్నై (8-7)
95. యాదానుమోర్ - తిరుమాలిరుమ్శోలైమలై (10-8)
96. వణఙ్గుమ్ తుఱైకళ్ - ఒన్ఱుమ్ తేవుమ్ (4-10)
97. ఎ*ழு*వదు మీణ్డే - పరివదిలీశనై (1-6)
98. తుఞ్జా మునివరుమ్ - కెడుమిడరాయ (10-2)
99. ఈన చ్చొల్లాయినుమ్ - శెఞ్జొఱ్కవికాళ్ (10-7)
100. నల్లార్ నవిల్ - మునియే నాన్ముకనే (10-10)



# అనుబంధం-3

## పాశురాల అకారాది అనుక్రమణిక

# అనుబంధం-4

(ఈ గ్రంథంలో అక్కడక్కడ చోటుచేసుకున్న ద్రావిడ వ్యాకరణానికి సంబంధించిన పారిభాషిక సంకేత పదాల వివరణం పాఠకసౌకర్యార్థం ఇవ్వబడు తున్నది.)

1. కారియఆకుపెయర్ - Noun literally signifying effect used figuratively to denote the cause.
2. కరువిఆకుపెయర్ - Metonymy in which cause is put for the effect.
3. శారియై - Augment used in combination of nouns and case endings.
4. ఎదిర్‌మఱై వినైయెచ్చమ్ - Negative verbal participle.
5. అశైచ్చొల్ - Expletive particle.
6. ఇడైచ్చొల్ - Particle which cannot be used by itself in any sense, but which, when occuring in combination with nouns and verbs, functions as inflectional, conjugation suffix, adverb, preposition etc. నామ క్రియాపదాలతో చేరివచ్చే పదం.
7. వియఙ్గోళ్ - Optative mood of verbs. విధ్యర్థక, ఆజ్ఞార్థక క్రియలు.
8. మొழిమాఱ్ఱు - Mode of constructing a verse in which the words have to be transposed for the ascertainment of its proper meaning.
9. వழువమైది - Sanctioned deviation from grammatical rule as in tense, person, gender.
10. కిళవిత్తలైమకన్ - Hero, Chief male character in a love poem.
11. ఆకుపెయర్ - లక్షణా వృత్తి ద్వారా అర్థాన్ని బోధించే పదం.
12. ఉవమై త్తొకై - Elliptical compound in which sign of comparison is understood.
13. తొழిల్ ఆకుపెయర్ - Metonymy in which action is put for the agent.
14. ముఱ్ఱువమై - Simile in which comparison holds good in all respects.

15. పణ్బుత్తొకై - An appositional compound in which first member stands an adjectival relation to the second -
16. విరిత్తల్‌వికారమ్ - A poetic license which consists in augmentation of a letter in the middle of a word.
17. వాయ్‌ప్పాడు - Idiom.
18. వినైయాల్ అణైయుమ్‌పెయర్ - Personal noun in the form of a finite verb.
19. ఈఱు - End, termination.
20. ఉరిచ్చొల్ - One of the few indeclinables which always have the force of adjective, or adverb.
21. ఉరుపుమయక్కమ్-Use of the ending of one case for that of another.
22. తిరిపు - Change in sandhi.
23. పణ్బుప్పెయర్ - Adjective word.
24. తొకుత్తల్‌వికారమ్ - Elision of a syllable or syllables in words for the sake of metre.
25. ఇఱుది - End.
26. కుఱిప్పు - That which is implied, or understood.
27. మెలిత్తల్ వికారమ్ - పరుషాక్షరం సరళంగా, లేక, అనునాసికంగా మారడం.
28. మరూఉ - Word or phrase in a corrupt or contracted form, sanctioned by usage.
29. అళపెడై - Lengthening of a sound in poetry.
30. శెయ్‌వెనెచ్చమ్ - Participlf of a verb in active voice.
30. కుఱిప్పుపెయరెచ్చమ్ - Relative participle of an appellative verb.
31. తానియాకుపెయర్ - Figure of speech in which an objective put for the place it occupies.
32. అణ్మైవిళి - Vocative used to address a person or thy near.

